# పరమగురువులు - వారినిచేరుమార్గము

## [THE MASTERS AND THE PATH]

BY

C. W. Leadbeater

అనువాదము

మద్దాలి వేంకటాచలం, బి. యే., బి. యల్.

రాజమండ్రి.

ప్రకాశకులు

వసంతా ఇన్‌స్టిట్యూట్, రాజమండ్రి.

1958

## ప్రకాశకుల తొలిపలుకు

"The Masters and the Path" అను ఉద్గ్రంథమును ఆంగ్లమున యోగి సి. డబ్ల్యు. లెడ్బీటరుగారు రచించిరి. అందలి విషయములు వారికి స్వానుభవములు. శిష్యార్హులగు సాధకులకుమాత్రమే అంతివరకు ఈవిషయములను వారు రహస్యముగా బోధించుచుండిరి. వాటిని ప్రపంచమునకు వెల్లడిచేయవలసిన సమయము వచ్చెనని తలచి వాటిని యెర్నెస్టువుడ్ గారి సహాయముతో 1925 సంవత్సరములో గ్రంథరూపమున లోకమునకు ప్రసాదించిరి. గ్రంథకర్త ప్రత్యక్షముగా జూచిన విషయములు నిష్కపటసంపుటియని ఆగ్రంధమునకు పీఠికలో ఆన్నీబిసెంటుగారు వ్రాసిరి. థియసాఫికల్ పబ్లిషింగు హౌస్‌వారి అనుమతినిబొంది తెలుగులో ప్రకటించవలెనని వసంతా ఇన్స్టిట్యూట్‌వారు 1952 సంవత్సరములోనే తీర్మానించిరి. సోదరుడు శ్రీ గుంటూరు వెంకట సుబ్బారావుగారు ఈగ్రంథమును తెలుగులోని కనువదించవలసినదని శ్రీ మద్దాలి వేంకటాచలంగారిని ప్రోత్సహించిరి. వెంటనే వారు పనిప్రారంభించి రాత్రింబవళ్ళు శ్రమపడి పనిచేసిరి. వారు ఉభయులు సహకరించి అనేక సవరణలను గావించుచు తరచితరచి భాషారమ్యతను చేకూర్చిరి. వారుభయుల కృషిఫలితముగా తెలుగున ఈగ్రంథము మనకులభించినది. మూలములోని లెడ్బీటరుగారి రమ్యమగు శైలినిగాని, భావగంభీరతనుగాని, మాధుర్యమునుగాని అనువాదములోనికి తెచ్చుట కేవలమసాధ్యమగుట నిజము. అనువాదకుని యత్నమెంతవరకు సఫలమయ్యెనో చదువరులే నిర్ణయించవలెను. ఈకార్యము నింతవరకు సాధించినందుకు వారుభయులకు మా వందనములు.

ఈ అనువాదము పూర్తి అయి 1954 సంవత్సరములో మాకులభించినది. ప్రచురణకు కావలసిన ద్రవ్యమొసంగుటకు సిద్ధముగనున్నామని సోదరులు జూపూడి సుబ్బన్న, బోడా వెంకటరత్నముగార్లు 1956 సంవత్సరములో మాకు వాగ్దానము చేసిరి. కాని కాగితము లభ్యముకాకపోవుటచే వెంటనే పనిప్రారంభించలేకపోతిమి. మేమడిగిన వెంటనే ద్రవ్యసహాయము చేసినందుకు శ్రీజూపూడి సుబ్బన్న, శ్రీబోడా వెంకటరత్నముగార్లకు మా కృతజ్ఞతను దెలుపుచున్నాము. ఈగ్రంథమును ప్రకటించుటకు అనుమతినొసంగిన థియసాఫికల్ పబ్లిషింగు హౌస్‌వారికి మేము కృతజ్ఞులము.

రమగురువులనుచేరుమార్గమును వర్ణించు విషయములను మననము చేసిన కొలది, సూచించిన విషయములను ఆచరించినకొలది, వాటియథార్థము సాధకులకు అనుభవమువలననే ఋజువుకాగలదని అన్నీబిసెంటు గారనిరి. పరమగురువులలో నొకరగు మోర్యమహర్షి గారీవిధముగ చెప్పిరి: "దైనందిన జీవితములో స్వల్ప విషయములలో నాచరించు సేవనుగూడ మహోత్కృష్టముగా గనబడు గొప్పసేవాకార్యములతో సమానముగా మేము లెక్కచేయుదుము. లోకకళ్యాణార్థము చేయబడు స్వార్థరహితమగు సేవయే శ్వేత సోదరబృందమువారి ప్రతిష్ఠ— వారి హృదయావేదన కూడ". సేవా మార్గమే పరమగురువులను జేరుమార్గమని అన్నీబిసెంటు గారుద్ఘాటించిరి. సేవాధర్మమును గుర్తించి యోగపథము ననుసరించు ఏకొలదిమందికైనను, ఒకింతయైనను ఈగ్రంథము తోడ్పడగలిగినచో వసంతా ఇన్‌స్టిట్యూట్ వారు ధన్యత గాంచినట్లే.

25—12—1958
రాజమండ్రి

తాడినాడ వెంకటశివరామ కృష్ణారావు
సెక్రటరీ, వసంతా ఇన్‌స్టిట్యూట్

# అనువాదకుని మనవి

దివ్యజ్ఞానసమాజ సభ్యుడుగా నేను చేయుచుండెడికార్యములను శ్రద్ధతో కనిపెట్టి చూచుచుండిన సోదరుడు గుంటూరు వెంకటసుబ్బారావుగారు ఒకసారి యెలమంచిలినుంచి "Masters and the Path" అను గ్రంథమును మీరేల తెలుగులోనికి అనువదించకూడదు ?" అని నాకొక జాబు వ్రాసిరి. అప్పటికి తెలుగుభాష యందు నాకేమియు జ్ఞానములేదు, తెలుగు వ్యాకరణముతో పరిచయ మసలే లేదు. ఒక వ్యాసమయినను తెలుగులో వ్రాసియుండ లేదు. అట్టి నేను ఇటువంటి పవిత్ర ఉద్గ్రంథమును అనువదింప బూనుట సాహసము, హాస్యాస్పదము అని స్పష్టముగా తెలుసుకొంటిని. నావల్ల కాదని జవాబు వ్రాయనెంచితిని. కాని, " నన్నేల ఈకార్యమును నెరవేర్చవలయునదని సుబ్బారావుగారు ఆదేశించిరి ?" అని తీవ్రముగా యోచనచేసితిని. తరువాత " మీరు సహాయపడేయెడల ప్రయత్నించెదను " అని వారికి జవాబువ్రాసి, వెంటనే పని ప్రారంభించితిని. ప్రతియొక నిమిషము నాలోపములను నా అసమర్థతను గుర్తించి సిగ్గుపడుచుంటిని. ఎప్పటికప్పుడు ప్రతి అధ్యాయమును నేను యెలమంచిలి పంపుచుండుటయు, సోదరుడు సుబ్బారావుగారు అపారమగు ఓర్పుతో, ప్రేమతో, నాతప్పులనన్నిటిని దిద్ది, అనేకమార్పులను చేయుచు, చక్కని సూచనలను జేయుచు తిరిగి నాకు పంపుచుండుటయు జరుగుచుండెను. ఈప్రకారము చిత్తు పూర్తిఅయినతరువాత సుబ్బారావుగారి సవరణలతోను, నాస్వంత సవరణలతోను సాపు వ్రాసి తిరిగి వెనుకటి ప్రకారమే ఆయనకు పంపుచుంటిని. ఆయన తిరిగి ప్రతి వాక్యమును ప్రతిశబ్దమును శ్రద్ధతో జదివి, లెక్కలేని సవరణలనుజేసి నాకు పంపుచుండిరి. పరమగురువుల కార్యముగాదలచి పనిచేయగలిగినవారే, సుబ్బారావుగారివలె పనిచేయగలరు గాని ఇతరులెవ్వరును అంతఓర్పు, అంతశాంతము, అంతప్రేమ జూపుటయు, అంతశ్రద్ధతో నాతప్పులను విసుగులేకుండ సవరణచేయుటయు జరిగించియుండ నేరరు.

రెండుసార్లు సవరణలు కాబడినతరువాత మూడవసారి తిరిగి సాపువ్రాసి ఇప్పటికి నాలుగు సంవత్సరముల క్రిందట, ఆంధ్ర సర్కారు ఫెడరేషను అధ్యక్షులగు శ్రీ గుంటూరు వెంకటసుబ్బారావుగారికి నావ్రాత ప్రతిని భక్తితో సమర్పించి

తిని. అనువాదకులు సుబ్బారావుగారే యనియు, నేను లేఖరిని మాత్రమే యనియు చెప్పినచో వాస్తవమును చెప్పినట్లగును. నేను కొంత శ్రమపడిన సంగతి నిజమే. కాని, ఈగ్రంథములో ప్రాశస్త్యమేమయిన నున్నచో అదంతయు సో. సుబ్బారావు గారిదేయని కృతజ్ఞతతో మనవిచేయుచున్నాను. ఈజన్మలో ఇట్టికార్యము నాకు సాధ్యమగునని కలలోనైన ఊహించలేదు. సాధ్యమయినంత సరళమగు శైలిలో వ్రాయుటకు ప్రయత్నించితిని. ఇంగ్లీషుభాషలోనున్న పద్యములను తెలుగులోనికి అనువదించి సహాయపడిన సో. పోపూరి వెంకట కామేశ్వరరావుగారికి నావందనములు. దివ్యజ్ఞానగ్రంథావళిలో ముఖ్యమయిన గ్రంథములలో నొకటయిన దీనిని అచ్చువేయించి ప్రకటించుచున్న వసంతా ఇన్స్టిట్యూట్ వారికి నామనఃపూర్వక వందనములు. ఆంధ్రసోదరీసోదరులకు ఈగ్రంథము కొంతవరకైన ప్రయోజనకారిగ గన్పడినచో ధన్యుడనని తలంచెదను.

మద్దాలి వేంకటాచలం

ఏ పరమగురువులఁ జేరు మార్గమును
బోధించుచున్నదో, పూజ్యులగు
ఆమహాత్ముల చరణారవిందములకు
ఈగ్రంధము నంకితమొనర్చుచున్నాను.

మ. వేం.

# అన్నీబిసెంటుగారి పీఠిక

గౌరవనీయుడగు నా సహచరుడు వ్రాసినగ్రంథమునకు నేనీపీఠికను వ్రాయుట కొక్కటేకారణముగలదు. దివ్యజ్ఞానసాహిత్యమును బాగుగ అధ్యయనము చేసిన కొంతమంది విద్యార్థులు ఇదివరలో అనేక విషయములను జదివి విమర్శనచేసియున్నారు; తమంతటతాము ప్రస్తుతము చేరలేనట్టి లోకములకు సంబంధించిన విషయములను జదివి తెలుసుకొనుటకును, మున్ముందు ఆలోకములను చేరుటకు వారికిశక్తి కలిగినప్పుడు పెద్దలచే చెప్పబడిన విషయముల సత్యమును తమకుతాము ఋజువుచేసుకొనుటకును వారు సంసిద్ధులైయున్నారు. అట్టి అనేకవిషయములగురించి యీ గ్రంథములో వ్రాయబడినది. త్వరలో జగద్గురువు రానైయున్నందున భావనాప్రపంచములో త్వరితముగ గలుగుచున్నమార్పుల కారణముచే, ఆయన వసించునట్టి లోకమునందొక భాగమునకు సంబంధించిన కొన్ని వివరములు, ఆయనచేయు ప్రబోధములను గ్రహించుటకు ప్రజలమనస్సులను తయారుచేయుటలో కొంతవరకు బహుశః ఉపయోగపడవచ్చును.

అది యెట్లున్నను, ఈగ్రంథములో వ్రాయబడిన విషయములలో చాలవరకన్నియు సరియైనవని నేను స్వయముగా ధృవపరచగోరుచున్నాను. మరియు, ఆవిషయములన్నియు అతిజాగ్రతగా పరిశోధనచేయబడి అతిజాగ్రతగా వివరించబడినవనియు, అం[illegible]మించి ఆధికారికముగాగాని, అంగీకరించి తీరవలెననిగాని చెప్పుటలేదనియు, నాసహచరుని తరపునకూడ నేను చెప్పుచున్నాను. ఈపుస్తకములోని విషయములు గ్రంథకర్త స్వయముగాజూచి యథార్థముగా వ్రాసినవేగాని యే విధమయిన ప్రేరేపణము చేతను వ్రాసినవికావు

అన్నీబిసెంటు.

— ♦ —

# వి ష య సూ చి క


| అధ్యాయము. | విషయము. | పుట |
|---|---|---|
| 1. | పరమగురువులయునికి | 1 |

సామాన్య విషయములు- మతముల నిదర్శనము- ఆధునిక నిదర్శనములు- స్వానుభవము- జీవపరిణామము- అతిమానవజీవితము- పరమపురుషుల సోదరబృందము- పరమపురుషుల శక్తులు.

| | | |
|---|---|---|
| 2. | పరమగురువుల స్థూలశరీరములు | 19 |

వానిరూపము- టిబెటు దేశములో నొకలోయ- కూట్ హూమి మహర్షిగారి గృహము- పరమగురువుల కార్యకలాపములు- ఇతరగృహములు- ప్రథమ రేఖకు చెందిన సిద్ధపురుషులు- రెండవ రేఖకు చెందిన పరమపురుషులు- ఇతర రేఖలు- పరిపూర్ణ స్థూలశరీరములు- ఎరవుశరీరములు.

| | | |
|---|---|---|
| 3. | పరమగురు సన్నిధిమార్గము | 45 |

మార్గప్రవేశము-కార్యపరిమాణము- కార్యముయొక్క-ప్రాధాన్యము-ప్రాచీన నియమములు- పరమగురు చరణసన్నిధి- మూడుద్వారములు-శిష్యుని చిత్తవృత్తి-పరమగురువులకార్యము- సంబంధమును కలుపుకొనుట-ఎవ్వరిని ఉపేక్షించరు- పరమగురువుయొక్క- బాధ్యత- ధ్యానముయొక్క- ఫలితము- సామాన్యమగు ఆటంకములు- భక్తిసంపూర్ణముగా నుండవలెను.

| | | |
|---|---|---|
| 4. | పరీక్షమాణకాలము | 84 |

సజీవప్రతిమ- పిన్నలగు దీక్షితులు_ క్రూరత్వమునలన బిడ్డలకుగలిగెడుహాని_ బిడ్డలకు పరమగురువు_ పరీక్షితులుగా ప్రవేశించుట_ పరమగురువుసలహా_ చిన్నబిడ్డలవలె నుండుము_ శీఘ్రకోపిత్వము (చిరాకు) యొక్క_ ఫలితము_ స్వార్థపరత్వము_ వ్యథ_ నవ్వు- వ్యర్థప్రసంగము_ మాటలవలన నేర్పడురూపములు_ గడబిడ_ సాంగత్యముయొక్క_ యుపయోగము.

| అధ్యాయము | విషయము | పుట |
|---|---|---|
| 5. | స్వీకరణము | 116 |
| | ఒక స్వీకరణవృత్తాంతము- పరమగురువుతో నైక్యమొందుట- శిష్యుని వర్తనము- శక్తిప్రసరణము- సందేశములను పంపుట- సూక్ష్మసంవిత్తి- మృతసందేశహారణశక్తి- యోగశక్తులు- పరమపురుషుల సందేశములు- వ్యక్తిగతమగు స్వాతంత్ర్యక్షణముల ఫలితము- యోజనను పరీక్షించుకొనుట- విశ్రాంతి- నెమ్మది, సమత్వము- అసురశక్తులు- విజయమునిశ్చయము. | |
| 6. | ఇతరదర్శనములు | 156 |
| | పరమగురువుల సోదరత్వము- సాధనచతుష్టయము- బాహ్యముల విభజనము- మంత్రములు- సమ్యకమువలన కలుగు ఫలితము- భావసంయోగము- దేవతల సహకారము- ప్రసన్నకరణముయొక్క ఫలితము- ఆశీర్వాదములు- శబ్దము, లేక, ధ్వనియొక్క ప్రభావము- కాలమునకు యోగ్యతలుమాత్రమె యెన్నటికి మారవు. | |
| 7. | ప్రథమయోగదీక్ష | 188 |
| | ఏకోపదేష్ట- సోదరబృందము- భంగపాటు- ఒక ప్రథమయోగదీక్షయొక్క వివరణము- సంస్కారములకు స్థూలాకారము- కుమారస్వామి- దీక్షయొక్క అంతరార్థము- ప్రస్తుతావకాశము- యువకులగు దీక్షితులు- దీక్షితుడు అందరకు సోదరుడే. | |
| 8. | జీవాత్మ | 218 |
| | జీవాత్మప్రసృష్టిక- తురీయాత్మ- జీవాత్మ- దేహాత్మతో సంబంధము- తనలోకములోనే- జీవాత్మకు దేహాత్మయెడల ఆదరము- దేహాత్మయొక్క వైఖరి- ఐక్యానుభవము. | |
| 9. | రెండు, మూడు యోగదీక్షలు | 234 |
| | మొదటి మూడుశృంఖలములు- మార్గమందలి అవస్థలలోని అంతర్భాగములు- రెండవదీక్ష- మానసికవికాసము- అపాయకరమగు అవస్థ- మూడవదీక్ష- నాల్గవ, అయిదవ బంధములు. | |

| అధ్యాయము | విషయము | పుట |
|---|---|---|
| 10. | ఉత్తమదీక్షలు | 254 |
| | అర్హత్, లేక, పరమహంస- నిర్వాణము- అర్హాత్ చేయవలసిన కార్యము- అయిదవదీక్ష- సిద్ధపురుషత్వమున కావల- సప్తపథములు. | |
| 11. | పరమగురువుల కార్యము | 280 |
| | సంగ్రహము- ప్రాంతములు- శక్తిప్రసరణము- భక్తియొక్క ఉపయోగము- శిష్యులు చేయుకార్యము- ప్రతిశతాబ్దాంతమందు జరుగుచున్న కృషి- జాతులు- ఆగమనము- ఆరవయుపజాతి- ఆరవమూలజాతి. | |
| 12. | చోహానులు, రేఖలు | 302 |
| | చోహానులు- పరమగురువు జ్వాల్‌కుల్ గారిపట్టీ- సప్తీకరణము- సప్తచేతనములు- ఏడువిధములగుజీవులు- సంస్కారోపేతమగు గుప్తవిద్య- మేజిక్, చికిత్సలు- రేఖాధిపతులగు చోహానులు- కావలసినగుణసంపత్తు- కాలచక్రపరిభ్రమణము ననుసరించి గలిగెడు మార్పులు- భక్తిపాలనము- సంస్కారాభ్యుదయము. | |
| 13. | త్రిమూర్తులు- త్రికోణములు | 330 |
| | ఈశ్వరత్రయము- జగదంబ- ప్రతినిధిత్రయము- రేఖలకు హద్దులు- రేఖను మార్చుకొనుట- పరిపూర్ణ ఏకత్వము. | |
| 14. | మూర్తిత్రయముల జ్ఞానము | 345 |
| | బుద్ధుడు- పరిశిష్టక్రియలు- వైశాఖోత్సవము- లోయ- ఉత్సవము- మహామంగళము- బుద్ధునిపూర్వులు- బోధిసత్త్వ మైత్రేయులు- ఆషాఢోత్సవము- చతురార్యసత్యములు- ఆర్యాష్టాంగమార్గము. | |
| 15. | మూర్తిత్రయములశక్తి | 386 |
| | లోకప్రభువు- ఉత్తమదీక్షలు- సర్వులకు పరమావధి. | |

# ఒకటవ అధ్యాయము

# పరమగురువుల యునికి

## సామాన్య విషయములు

దివ్యజ్ఞానము మనకు ప్రసాదించిన అనేక క్రొత్తవిషయములలో ముఖ్యతమ మయిన వానిలో నొకటి పరిపాకము నొందిన పరమపురుషులయునికి. ఈ సత్యము దివ్యజ్ఞానము బోధించు కర్మసిద్ధాంతమునుబట్టియు, పునర్జన్మద్వారా జీవపరిణామము జరుగునను సిద్ధాంతమునుబట్టియు న్యాయముగా నూహించదగును. మనచుట్టును చూచినయెడల మనకంటె చాలతక్కువ స్థితిలోనున్న వారిని, ఏదో యొక విధముగ మన కంటె నెక్కువ యభివృద్ధి బొందినవారిని స్పష్టముగా వేర్వేరు పరిణామావస్థల యందున్న పురుషులను పెక్కుమందిని జూచెదము. అందుచేత అంతకంటె నెక్కువ విశేషముగా పరిణామము నొందిన మనుష్యులు ఇతరులు కొందరుండవచ్చునుగదా! మానవులు దీర్ఘమగు జన్మపరంపరా ఫలితముగ నొక నిశ్చితమగునవధికి తీసికొని పోవుమార్గమున నిలుకడగా ఉత్తరోత్తరోన్నతిని జెందుచున్నచో, ఇదివరకే ఆ గమ్యస్థానమును జేరినవారు కొందరుండి తీరవలెను. ప్రతిమానవునిలోను అంతర్గతముగా నున్నట్టియు, భవిష్యత్తున సమస్తమానవజాతికి జన్మతః సంక్రమించునట్టియు పరశక్తులను కొన్నిటిని వికసింపజేసికొనుటలో ఆపరిణామమార్గమున పరిశ్రమచేయుచున్న మాలో కొందరము కృతార్థులమైతిమి. ఆశక్తులవలన పరిణామనిశ్రేణిక మనకు పైననూ క్రిందనూ చాల దూరము వ్యాపించియున్నదని చూడగలిగితిమి. అంతే గాక ఆనిచ్చెనయొక్క ప్రతిమెట్టుమీదను మానవులు నిలువబడియుండుటగూడ చూడగలిగితిమి.

పరమగురువులని చెప్పెడు పరిపాకము నొందినసిద్ధ పురుషుల యునికిని గురించి ప్రత్యక్షసాక్ష్యము చాల గలదు. కాని అట్టి పురుషులుండితీరవలెనని రూఢిపరుచుకొనుట మనమెక్కవలసిన మొదటి మెట్టు అని నే ననుకొందును. మేము దర్శించిన పురుషులా వర్గమునకు చెందినవారే యను సంగతి ఆతరువాత మెట్టు కాగలదు.

మానవ వ్యాపారములలోని వివిధశాఖలన్నిటిలోను ప్రతిభాశాలురు, అనగా, వారివారి ప్రత్యేకవృత్తులలోను, ప్రజ్ఞలోను ఇతరుల కంటె నధికులు — నిజముగా వారల మహాదాదర్శము లప్పుడప్పుడు సామాన్యమానవులబుద్ధికతీతమగుటచే, వారు

చేసినపనులు మానవులకు నష్టమైపోవుటయేగాక, వారల నామములుకూడ పూర్తిగా మాసిపోవుట సంభవించినంతటి యధికులు—అయినవారుచేసిన మహత్కార్యములతో ప్రతిజాతిచరిత్రయు నిండియున్నది. సాధారణముగా, ప్రతిజాతియొక్క చరిత్రను ఆజాతికి చెందిన కొద్దిమంది వ్యక్తుల జీవితచరిత్రలలో నిమిడ్చి వ్రాయవచ్చునని యును, ఎల్లప్పుడును చిత్రకళ, గానము, సాహిత్యము, విజ్ఞానశాస్త్రము, తత్త్వశాస్త్రము, పరోపకారత్వము, రాజ్యాంగపరిపాలనము, మతము, లోనగు వానిలో నందరికంటె ఉన్నతులగు బహుకొద్దిమంది మాత్రమే ముందంజవేసి పురోవృద్ధికి మార్గదర్శకులయ్యెదరనియును చెప్పెదరు. వానిలో కొందరు భగవద్భక్తియందును, భూతదయయందును మిన్నలైన మునులు, లోకోపకారులునగుదురు. కొందరు ప్రకృతిని, మానవుని లెస్సగా నెరింగిన తత్త్వవేత్తలు, పండితులు, భౌతికశాస్త్రజ్ఞులునై యుందురు. మరికొందరు మానవసేవచేయుచు బంధవిమోచకులుగను, సంఘసంస్కర్తలుగను ప్రకాశించుచుందురు. ఇట్టి మహాపురుషులనుజూచి, వారు మానవజాతిలో నెంతయున్నతస్థానమున నున్నారో గ్రహించిన యెడల మానవాభ్యుదయమునకు హద్దులు గానరావనుట సబబుకాదా ? అట్టి వారి కంటెను చాలా అభివృద్ధి నొందిన వారు, యోగవిద్యలోనేగాక, జ్ఞానములోను, కళాకౌశల్యములోను గూడవిశేషముగా నభివృద్ధినొందినవారు, మానవత్వమున సంపూర్ణపరిపాకము నొందినవారు, ఏ పరమ పురుషులను (సిద్ధపురుషులను) సందర్శించు మహాభాగ్యము మాలోకొందరకు ప్రాప్తించెనో, సరిగవారివలెనే సంపూర్ణపరిపాకమునొందిన మానవులు, ఇదివరలోనుండి యుండవచ్చుననియు, ఇప్పుడు కూడనుండవచ్చుననియు చెప్పినసబబుగా నుండదా?

చరిత్రపుటలను మెరుగుబెట్టి రమ్యముగ నొనరించు ఈప్రతిభాశాలుర మహామండలి మానవజాతికంతకు వైభవమును చేకూర్చుటయేగాక, ఆశాజ్యోతియగుచున్నది. ఏలయన, ఈపరమపురుషులు ఇతర జనులకు పురోగాములనియును, త్వరలో నావిష్కరణముచేయబడు మహావైభవమును జూడగోరినయెడల మన మనుసరించవలసిన మార్గమును జూపుటకై కేవలము దీపవాహకులు, దీపస్తంభములుగా నున్నారనియు నేమెరుగుదుము. ఈశ్వరచైతన్యమున కుపాధులయిన రూపముల పరిణామ సిద్ధాంతమును చాలకాలము క్రిందటనే మనమంగీకరించియుంటిమి. ఆసిద్ధాంతమునకు అనుబంధమై, అంతకంటె నెక్కువ యుత్కృష్టమైనదగు "ఆజీవనే" పరిణామము నొందుచున్నదనుభావము మనకిచట గోచరించుచున్నది. రూపములంతకంతకెక్కువ

సంకీర్ణమగుచు అద్భుతముగా నభివృద్ధిబొందుటకు నిత్యము నుబుకుచుండెడు 'జీవము' యొక్క ఆవిష్కరణమునకు రూపములు కావలసియుండుటయే కారణమని ఈజీవ పరిణామసిద్ధాంతము తెలుపుచున్నది. రూపములు పుట్టును, చచ్చును, అవి పెరుగును, క్షీణించును, విచ్ఛిన్నమగును. కాని 'జీవము' లేక, 'ఆత్మ' నిత్యము పెరుగుచునే యుండును; రూపములలో వసించుచు, ఆరూపములలోను వాని ద్వారాను సంపాదించిన అనుభవములచే వికసించుచు, నిత్యము వృద్ధియగుచుండును. ఒక రూపము యొక్క కార్యము పూర్తియై ఆరూపము నిరుపయోగమైనపుడు దానిని విసర్జించి మరియొక శ్రేష్ఠతరరూపమును ధరించును. పరిణామము నొందురూపముల ద్వారా నిత్యమైనజీవము, అనగా ఈశ్వరచైతన్యము, ఎల్లప్పుడును చిగుర్చుచు పెరుగుచునేయుండును. ఈశ్వరుడు ధరించిన చిత్రవర్ణముల అంగీఅయిన ప్రకృతి యంతలో ఆయీశ్వరచేతనము వ్యాపించియున్నది. పుష్పముయొక్క సౌందర్యములోను, వృక్షముయొక్క బలములోను, జంతువుయొక్క అంగసౌష్ఠవములోను, వేగములోను, మానవుని హృదయములోను, ఆత్మలోను వసించునది ఆయీశ్వరుడే. పరిణామమనే ఈశ్వరేచ్ఛగనుక జీవమంతయు సర్వత్రి ముందుకు, పైకి, కూడ చొరుచుకొని పోవుచున్నది. అందుచేతనే నిరంతరము వికసించుచుండు ఈశక్తి, జ్ఞాన, ప్రేమల దీర్ఘశ్రేణి చివర పరిపాకము నొందిన పరమపురుషులుండుట ఈ ప్రపంచములో మిక్కిలి సహజమగు విషయము. వారికి పైనగూడ—మనదృష్టికి బుద్ధికిగూడ నతీతముగా—ఇంకను స్వైభవోపేతమగు దృశ్యము వ్యాపించియున్నది. అందు విషయమై మున్ముందు కొంచెము సూచించుటకు ప్రయత్నించెదము.

దానినిగురించి యిచట చెప్పుట నిరుపయోగము. దీనికంతకు పర్యవసానమేమని చూచినయెడల, పరిపాకము నొందిన పరమపురుషులుండితీరవలెనని తేలుచున్నది. దివ్యలోకములలోను, అతిమానుష రాజ్యసీమలలోను వారివారి జీవితములు గడుపుకొనుటకై ఈ ప్రపంచమును పూర్తిగా విడిచిపోవుటకు బదులు మానవజాతియందు వారికిగల ప్రేమచే దానితో సంబంధ మొకింత నిలుపుకొని, మానవులు సౌందర్యములోను ప్రేమలోను సత్యములోను పరిణామము నొందుటలో సహాయపడుచు, పరిపూర్ణమానవుని తయారుచేయుటకు — వృక్షములయందు ప్రత్యేకాభిమానముగల వృక్షశాస్త్రజ్ఞుడు ఒక పరిపూర్ణమైన నారింజపండునుగాని, ఒక పరిపూర్ణమయిన గులాబిపువ్వునుగాని సృష్టించి యానందించునట్లే—సంతోషముతో పాటుపడుచుండు

పరమపురుషు లన్ని కాలములలోను నుండిరని ఋజువుపరచుటకు నిదర్శనములకు కొఱత లేదు.

## మతముల నిదర్శనము.

ఏగొప్ప మతముయొక్క గ్రంథములను జూచినను అట్టి మానవాతీతుల చరిత్రలు కనబడును. వారు దివ్యమగు ఈశ్వర చేతనముతో నిండియుండుటచే తరుచు వారిని కేవలము భగవంతుని దూతలుగా గ్రహించుచుండిరి. ప్రతిమతమునను, ముఖ్యముగా దాని స్థాపనసమయమున, అట్టి పరమ పురుషులొకరు ఉదయించుచుండెను. అనేకసందర్భములలో ఒకరికంటె నెక్కువమంది పరమపురుషులు ఉదయించుటకూడ గలదు. హిందూమత సంప్రదాయములో శ్రీకృష్ణుడు, శ్రీ శంకరాచార్యులు ప్రాచ్య దేశ మంతటను వ్యాపించిన బౌద్ధమతస్థాపకుడగు గౌతమబుద్ధుడు మొదలగు గొప్ప అవతార పురుషులు గలరు. వీరుగాక గొప్పఋషులు, యోగులు, ఆచార్యులు, పెక్కుమందిగలరు. ఈ మహాపురుషులందరును మానవుల ఆధ్యాత్మిక స్వభావములను మేల్కొల్పుటయేగాక, వారల కైహికాభ్యుదయము చేకూర్చువిషయములన్నిటిలోగూడ సహాయపడుచుందురు. క్రైస్తవమతమునకు చెందినవారందరును తమ తమ సిద్ధాంతములు బోధించునట్లు ప్రవక్తలయొక్కయు, బోధకులయొక్కయు, మునులయొక్కయు గొప్ప పరంపరయున్నదని యెరుగుదురు, అథవా యెరిగియుండవలెను. మరియును, బహుశః వారికి స్పష్టముగా తెలియని యొకానొక విధముగా వారి పరమగురువు, క్రైస్తు ప్రభువు, మానవుడు దేవుడుకూడ అయియుండెననియు, అయియున్నాడనియుకూడ నెరుగుదురు. ప్రాచీనమతములన్నిటిలోను, (జాతులతోపాటు కొన్ని మతములుకూడ క్షీణించిపోయినను) తుదకు ఆదిమ, అనాగరిక జాతులవారి మతములలో గూడ, ఆకాలపు అమాయకపు ప్రజల కన్ని విధముల సహాయపడుచు, వారల మధ్య నివసించిన మానవాతీతుల యునికి ప్రధానలక్షణముగా కనిపించును. వారలనందరను ఇచట పేర్కొనుట, యెంత హృదయానురంజకముగను, ఉపయోగకరముగను నున్నను, దానిచే ప్రస్తుతాంశమునకు దూరమగుదుము, గావున చదువరులు డబ్లియు. విలియమ్‌సన్ గారి "మహాధర్మము"– The Great Law – అను ప్రశస్తమగు గ్రంథమును చదువవలెనని హెచ్చరించెదను.

## ఆధునిక నిదర్శనములు.

ఈపరమపురుషుల యునికి గురించి ప్రత్యక్షమయినట్టియు ఆధునికమయినట్టియు సాక్ష్యము చాలగలదు. నా క్రొత్తలో నేను చేసిన గ్రంథపఠనమువలన అట్టివారు ఉండితీరవలెనను సంపూర్ణవిశ్వాసము నాకు గలుగుటచే, నాకట్టి సాక్ష్యమనవసరమని యెన్నడును తోచలేదు; అట్టి మహాపురుషులున్నట్లు నమ్ముట కేవలము సహజముగా గన్పడెను; వారిని ప్రత్యక్షముగా సందర్శింపవలెననియే నాకోరిక. అయినను దివ్యజ్ఞానసమాజ సభ్యులలో పరమగురువుల యునికికి నిదర్శనము తెలిసికొనగోరెడు క్రొత్తసభ్యులు చాలమందికలరు. ప్రత్యక్షసాక్ష్యము చాలగలదు. దివ్యజ్ఞానసమాజస్థాపకులగు మేడమ్. బ్లవట్స్కీ, కల్నల్ ఆల్కాటు గార్లు, మన ప్రస్తుతాధ్యక్షులగు డాక్టరు ఆనీబిసెంటు, నేను, మేమందరము ఈ పరమపురుషులలో కొందరిని జూచితిమి. అంతేగాక, దివ్యజ్ఞానసమాజములోని ఇతర సభ్యులు చాలమందికూడ నొకరిద్దరు పరమపురుషులను జూచెడి యదృష్టమునుబొందియుండిరి. వీరందరు వ్రాసిన రచనలలో తృప్తికరమగు సాక్ష్యముకలదు.

వారలను జూచినవారును, చూచితిమని తలచెడివారును కలగాంచుటయో, లేక, కేవలము భ్రమపడుటయో, జరిగియుండవచ్చునని అప్పుడప్పు డాక్షేపణ చేయుటకలదు. మేమున్ను పరమ పురుషులున్నుకూడ స్థూలశరీరములలోనుండగా మేము వారిని జూచుట మిక్కిలి యరుదగుటయే అట్టి ఆక్షేపణకు ముఖ్యకారణమని నేను తలచెదను. సమాజముయొక్క ఆరంభదినములలో మేడమ్. బ్లవట్స్కీగారు ఒక్కరే యోగసిద్ధులను సంపాదించి యుండినపుడు పరమపురుషులు అందరకు కనిపించునట్లు స్థూలశరీరములలో అనేకసార్లు ప్రత్యక్షమైరి. అట్టిసంఘటనములు మనసమాజముయొక్క ఆకాలపుచరిత్రలో అనేకము కనిపించగలవు. కాని పరమ పురుషులట్లు ప్రత్యక్షమయినప్పుడు వారి సహజమగు స్థూలశరీరములలోగాక తాత్కాలికముగా నిర్మాణముచేసికొనిన రూపములలోనుండిరి.

మాలో చాలమంది రాత్రులందు నిద్రలోవారలను నిత్యముచూచుచుండుట కలవాటుపడితిమి. మేము మాకామమయ శరీరములలో (బాగుగ నభివృద్ధి నొందినవారు మానసికశరీరములలోను) పోయివారలను వారిసహజ స్థూలశరీరములలో నుండగా దర్శింతుము. కాని అప్పుడు మేము స్థూల శరీరములలోనుండము. అందుచేతనే జనులు భువర్లోకానుభవములను అనుమానించుటకు కారణమగుచున్నది. "మీరు

చూచితిమని చెప్పెడు సందర్భములలో మీరు స్థూలశరీరములలో లేక, కలగాంచి యైనను భ్రాంతిపడియైనను ఉండవచ్చును; లేక మీకు కనిపించినవారు యేదో అద్భుతమగు రీతిని కనిపించి వెంటనే మాయమైయుండవచ్చును. కావున మీరను కొనినట్లువారు పరమపురుషులేయనియెట్లు చెప్పగలరు?" అని జనులాక్షేపణచేయుదురు.

పరమపురుషులు, వారిని సందర్శించినవారు ఉభయులుకూడ స్థూలదేహము లలోనున్న సందర్భములుకొన్నిగలవు. మేడమ్ బ్లవట్‌స్కీ-గారికి ఆయనుభవముకలదు. నేపాలు దేశములో నొక సన్న్యాసుల మఠములో ఆమె కొంతకాలము నివసించి నట్లును, అప్పటిలో ముగ్గురు పరమగురువులను వారలస్థూలశరీరములలో నిత్యము ఆమెచూచుచుండినట్లును ఆమె చెప్పగా నేను వింటిని. పరమగురువులు కొందరు వారిస్థూలశరీరములలో వారి పర్వతనివాసములనుండి ఇండియాలోనికి కొన్నిపర్యా యములువచ్చిరి. కల్నల్ ఆల్కాటుగారట్టి సందర్భములలో రెండుసార్లువారలను చూచినట్లును, మోర్యమహర్షిని, కూటీహూమిమహర్షిని యిద్దరను జూచినట్లును చెప్పిరి. 1884 సంవత్సరములో, నాకు పరిచయము కలిగిన దామోదరు. కే. మావ లంకరు కూటీహూమిమహర్షిగారిని వారి స్థూలశరీరములోనున్నప్పుడు కలిసికొనిరి. ఆరోజులలో నేను బాగుగ నెరిగిన యస్. రామస్వామి అయ్యరు గారను పెద్దమనిషి మోర్యమహర్షిగారిని స్థూలశరీరములోనున్నప్పుడు చూచుట సంభవించెను. అందును గురించి వ్రాసినవిషయమును నేను తరువాత తెలియపరచెదను. అప్పటి పరిస్థితుల లోనే భాగ్యవశమున పరమపురుషులలో నొకరిని లండనులాడ్జి సభ్యులగు డబ్లియు. టి. బ్రౌనుగారు సందర్శించుటకూడ సంభవించెను. అంతేగాక హిందూదేశస్థుల సాక్ష్యమపారముగాగలదు. కాని వారి సాక్ష్యమును వ్రాతమూలముగా, జాగ్రతగా సమకూర్చుటగాని, పరిశీలించుటగాని జరుగలేదు. ఎందుచేతననగా, ఈయనుభవములు గలిగినవారందరు మానవాతీతు లున్నారనియు, వారలను కలిసికొనుట సాధ్యమే యనియు పరిపూర్ణ విశ్వాసము గలిగినవారగుటచేత ప్రతియొకసమావేశమును లిఖిత పూర్వకముగా జాగ్రతపరచవలసినంత మహద్విషయముగా నెంచరైరి.

## స్వానుభవము

నేనును, పరమగురువులును ఉభయులము స్థూలశరీరములలోనుండగా సమా వేశమైన రెండు సందర్భములను నేను స్పష్టముగా చెప్పగలను. వానిలో నొకటి:

ఆల్కి-యోన్ జీవితములను గ్రంథములో 'జ్యూపిటరు' అను సాంకేతిక నామముతో వ్యవహరింపబడినటువంటిన్ని, మేడమ్ బ్లవట్స్కీ-గారు ఫిలడెల్ఫియా, న్యూయార్కు-నగరములలో 'ఐసిసు అన్వీల్డు _ Isis Unveiled _ అను సుప్రసిద్ధగ్రంథమును వ్రాసినపుడు కొన్ని భాగములను వ్రాయుటలో ఆమెకు సహాయపడినటువంటిన్ని పరమ పురుషుని _ అగస్త్యమహర్షి _ తో గలిగిన సమావేశము. నేను అడయారులో నివసించుచున్న కాలములోనన్ను తమవద్దకు తీసికొని రావలసినదని నాకు పూజ్యుడును, ఆచార్యుడును అగు స్వామి టి. సుబ్బారావుగారిని ఆయన దయతో కోరిరి. ఆయన ఆజ్ఞానుసారముగ నేముభయులము వారి గృహమునకేగితిమి. వారు మమ్ములను పరమకృపతో నాదరించిరి. చాలసేపు గాఢాభిమానముతో ముచ్చటించిన తరువాత వారు బ్రాహ్మణులయినను మాతోకలిసి భోజనముచేసి మమ్ములను గౌరవించిరి. తరువాత మేమారాత్రియంతయును, మరుచటిదినము పగలు కొంతవరకును, వారి గృహమునందే గడిపితిమి. ఆసందర్భములో భ్రమయనునది యుండనేరదని యొప్పుకొనవలసియుండును. నేను స్థూలదేహముతోనే సందర్శించు భాగ్యము కలిగిన రెండవ పరమపురుషుడు "ప్రిన్సురకాక్జి" అని అప్పుడప్పుడు పిలువబడు కౌంటు. డి. సెంటు జెర్మేన్‌గారు. నేను వారిని చాలా సామాన్య సందర్భములో (ముందుగా యేర్పాటు లేమియు లేకుండ, కేవలము కాకతాళీయముగా) వారు సామాన్య ఇటాలియను దేశస్థునివలె దుస్తులు ధరించి రోమ్ నగరములో కోర్సుమీదుగాపచారు చేయుచుండగా కలిసికొంటిని. పిన్సియన్ కొండమీద తోటలలోనికి వారునన్ను తీసికొనిపోయిరి. దివ్యజ్ఞానసమాజముగూర్చియు దాని కార్యకలాపములగురించియు నొకగంటకుపైగా ముచ్చటించుచు గూర్చుంటిమి. వారు మాట్లాడగా నేను వింటిననియు, వారడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పితిననియు చెప్పినచో ఎక్కు-వ భావ్యముగా నుండునని తలచెదను.

ఆసోదరబృందములోని యితర సభ్యులను నేను వేర్వేరు సందర్భములలో జూచితిని. వారిలో నొకరితో నాకు ప్రథమ సమావేశము కెయిరోనగరములో నొక హోటలులో జరిగినది. మేడమ్‌బ్లవట్స్కీ- గారితోను, మరికొందరితోనుగలసి హిందూదేశమునకు నేను పయనమయి వచ్చుచుంటిని. అందరము ఆనగరమున కొంత కాల మాగితిమి. పనిచేసికొనుటకు అందరము బ్లవట్స్కీ-గారి గదిలో కలిసికొనుచుంటిమి. ఒకసారి నేను నేలమీదకూర్చుండి ఆమెకు కావలసిన వ్యాసభాగములను

వార్తా పత్రికలలోనుంచి కత్తిరించి అమర్చుచుంటిని. నిజముగా ఆమె దగ్గర నేనొక బల్ల చెంతకూర్చునియుండెను. నా వామహస్తము ఆమె దుస్తులను తాకుచుండెను. గది తలుపు నాకు పూర్తిగ గనబడుచుండెను. తలుపులు తెరచియుండలేదనుట నిశ్చయము. కాని, అత్యాకస్మికముగా, ఏవిధమగు నేర్పాటులేకుండ నాకును బ్లవట్స్కీగారికిని మధ్యగా మా యుభయులను తాకుచు నొక పురుషుడు నిలువబడెను. నేను నులికిపడి యొకగంతువేసితిని. నాగందరగోళమునుజూచి బ్లవట్స్కీగారికి నవ్వువచ్చి ఆమె "ఇంత స్వల్పవిషయమునకు ఉలికిపడకుండ నుండగలిగిన జ్ఞానము నీకు లేని యెడల, యోగాభ్యాసములో నీవు ముందుకు పోజాలవు" అని పలికెను. అప్పటికి పరమగురువుల శ్రేణికిచెందక, దిగువశ్రేణియగు అర్హత్ శ్రేణికిచెందిన ఆయాగంతుకునకు బ్లవట్స్కీగారు నన్నుపరిచయముచేసిరి. ఆ తరువాత ఆయన జీవన్ముక్తుడై, పరమగురువై, జ్వాల్‌కుల్ మహర్షి యను పేరను బరగుచున్నారు.

దాని తరువాత కొన్ని నెలలకు మోర్యమహర్షిగారొక రోజున మాయొద్దకు వచ్చిరి. అప్పుడాయన కేవలము స్థూలశరీరములో నున్నట్లు కనబడిరి. ఆయన నేనున్న గదిలోనుండి లోపల పడకగదిలోనున్న బ్లవట్స్కీ గారితో సంప్రతించుటకై నడచివెళ్లిరి. ఆయనను ప్రత్యేకముగను స్పష్టముగను సందర్శించుటకదియే మొదటిసారి. అప్పటికి నాసూక్ష్మశరీరములో జూచిన వానిని జ్ఞప్తిదెచ్చుకొనుటకు తగినంతగానాసూక్ష్మేంద్రియములు వికసించియుండలేదు. అటువంటి పరిస్థితులలోనే ప్రధానకార్యాలయముయొక్క డాబాపైన కూటీహూమిమహర్షిగారిని సందర్శించితిని. డాబాపిట్టగోడ కవతలవైపున అప్పుడే ఆయనగాలిలోనుండి స్థూలరూపము ధరించినట్లుగా ఆపిట్టగోడను దాటుచుండిరి. అదేవిధముగా జ్వాల్‌కూల్ మహర్షిగారిని పెక్కుసార్లు ఆ డాబామీదనే జూచితిని.

పరమపురుషులు భూతములువలె నకస్మాత్తుగావచ్చుటచే ఈసాక్ష్యమంత రూఢిమైనది కాదందురని యూహించెదను. కాని నాసూక్ష్మశరీరములను నేను స్వేచ్ఛగా నుపయోగించుట నేర్చుకొని మహాపురుషులను సందర్శించుట కలవాటు పడినందున, దివ్యజ్ఞాన సమాజప్రారంభదశలో ప్రత్యక్షమై మాకుదర్శనమిచ్చిన వారును, వారలస్వగృహములనుండగా నేననేకసార్లుచూచిన పరమపురుషులును ఒక్కరేయని నేను యథార్థముగ చెప్పగలను. మేము వారిని వారి గృహములలో దర్శించినప్పుడు స్థూలదేహము నిద్రలోనుండుటచేత, నేనును నావలెనే అనుభవములు

గల ఇతరులునుగూడ స్వప్నములుగాంచి యుండవచ్చునని జనులనుచుండిరి. నలు బది సంవత్సరములుపై కాలము ఒకేవిధమగు కలనుగనుట చాల ఆశ్చర్యకరమనియు, ఏకకాలమునందే పెక్కుజనులు ఆకలనేగనిరనియుమాత్రమే నేనువారికి జవాబు చెప్పగలను.

ఈ విషయములగురించి సాక్ష్యమును ప్రోగుచేయదలచినవారు (అట్లు వారు చేయగోరుట తప్పక సమంజసమే) సమాజముయొక్క పూర్వపు రచనలను పరిశీలన చేయవలెను. వారు మన అధ్యక్షులనడిగినచో, ఆమె యెన్నిసార్లు ఎందరు పరమపురుషు లను సందర్శించిరో తెలిసికొనగలరు. మన సభ్యులలో చాలమంది తమ పరమ గురువును చూచితిమని నిస్సంశయముగ ఋజువు పలకగలరు. ధ్యానములోనుండగా పరమగురువు ముఖమును వారు చూచి యుండవచ్చును. ఆతరువాత ఆయన నిజమగు వ్యక్తియేయని రూఢియగు నిదర్శనమును బొంది యుండవచ్చును. కల్నల్ ఆల్కాటుగారి "ఓల్డుడయిరీలీవ్సు" లో చాలా సాక్ష్యము దొరుకును. పూర్వము ఉపాధ్యక్షుడుగా నుండిన ఏ. పి. సిన్నెటుగారితో కలిసి చాల పనిచేసినట్టియు, హిందూదేశమున ఐ. సి. యస్. శ్రేణిలో ఉన్నతోద్యోగము నలంకరించినట్టియు ఏ. ఓ. హ్యూమ్ గారు వ్రాసిన 'పరమసోదరులున్నారా' — **Do the Brothers exist** — అను చక్కని వ్యాసమొకటి కలదు. అది "గుప్త దివ్యజ్ఞానముగూర్చి సూచనలు" — **Hints on Esoteric Philosophy** — అను పుస్తకములో ప్రచురింపబడినది. హ్యూమ్ దొర గారు సంశయాత్ముడగు ఆంగ్లేయుడై, న్యాయశాస్త్రచోదితమైన మనస్సుకలిగినవాడై "సోదరులు (మానవజాతికంతకు జ్యేష్ఠసోదరులై వారొక గొప్పసోదరబృందమునకు చెందినవారగుటచే పరమగురువులను సోదరులనుటగూడ గలదు) ఉన్నారా"? అను విషయమును సుష్ఠుగా విమర్శచేసి 'ఉన్నారని' చెప్పుటకపారమగు రూఢి సాక్ష్యము కలదని ఆనాడే నిర్ణయముచేసెను. ఆగ్రంథము ప్రచురింపబడిన తరువాత నింకను ఎక్కువ సాక్ష్యము సమకూరినది.

మనలో అంతర్గతముగానున్న శక్తులు వికసించుటచే గలిగిన దివ్యదృష్టి మొద లగు సిద్ధులవల్ల మానవగణమేగాక, ఇతరగణములకుచెందిన జీవులుకలరన్న సంగ తియు, వారిలో కొందరు మన అంతరువుకన్న ఉన్నతమగు స్థితికిచెంది, పరమపురుషు లతో సమానమగు శ్రేణికిచెందినవారన్న సంగతియు, మాకు ప్రతి నిత్యము అను

భవమునకువచ్చుచున్నది. 'దేవతలు' అనబడువారలను, ప్రతివిషయములోను మన కంటె ఉన్నతస్థితిలోనున్నట్లు కనిపించు నితరులను మేము కలిసికొనుచుందుము.

## జీవపరిణామము

మేము పురోవృద్ధినొందుటలో పరమపురుషులను సందర్శించి వారలతో సంభాషింపగల శక్తిని సంపాదించియుండుటచే, వారాస్థితి నెట్లు పొందగలిగిరని వారిని మేము కడుభక్తితో నడిగితిమి. అచిరకాలము క్రిందట వారుకూడ మన మిప్పుడున్న స్థితిలోనే ఉంటిమని వారు ఏకగ్రీవముగా చెప్పిరి. సామాన్యమానవ శ్రేణులలోనుండియే వారు పైకివచ్చిరి. భవిష్యత్తున క్రమముగా మనమందరముగూడ వారివలెనే అగుదుమనియు, సృష్టి క్రమమంతయు పైకి వ్యాపించుచు, మన బుద్ధి కతీతమై, తుదకు దైవత్వమునుగూడ చేరగల క్రమానుసరణమైన జీవపరిణామమే యనియు వారు మాకు చెప్పిరి.

ఖనిజవర్గముపైన వృక్షవర్గము, వృక్షవర్గముపైన జంతువర్గము, జంతువర్గముపైన మానవవర్గము—ఈవిధముగా పరిణామములో నెట్లు నిర్దిష్టమగు మెట్లుకలవో, అట్లే మనుష్యవర్గపరిణామమునకు కూడ నిర్దిష్టమగు అంతముగలదనియు ఆహద్దుదాటినచో మానవవర్గముకంటె శ్రేష్ఠతరమైనదని విస్పష్టముగాగనిపించు వర్గముకలదనియు, మానవులపైన మానవాతీతులు, పరమపురుషులు గలరనియు విశదమగును.

ఈపరిణామ విధానమును పరిశీలనచేయుటలో ప్రతిమానవునిలోను శరీరము- జీవాత్మ - పరమాత్మ (లేక, తురీయాత్మ, లేక, ప్రజ్ఞానాంశువు) — అను మూడుగొప్ప విభాగములు కలవని నేర్చుకొంటిమి. వీనిలో ప్రతి భాగము తిరిగి అంతర్భాగములుగా విభజింపబడగలదు. ఇది రెండువేల సంవత్సరములక్రిందట సెంటుపాల్ చేసిన నిర్వచనము ; మోనాడ్ అనునది ఈశ్వరుని ఊపిరి; ఆంగ్లేయ భాషలోని Spirit - స్పిరిట్ - అను మాట లాటిను భాషలోని 'స్పైరో' - Spiro - అను శబ్దమునుండి యుత్పన్నమైనది, దానికి ఊపిరి యని అర్థము. ఇదియే పురుషునిలోనుండి పుట్టిన విస్ఫులింగము, నిజమైన మానవుడు. అయితే యథార్థముగా వర్ణింపవలెననిన, అది మనము మానవుడనుకొను వానిపై తేలియాడుచు తిరుగాడుచుండునని చెప్పవలెను. ఆతురీయాత్మ ప్రకృతిలోనికిదిగి, అట్లు దిగుటద్వారా నిర్దిష్టమై, సూక్ష్మమగు వివరములతోగూడిన స్థూలరూపమును సంపాదించుటయే దానిపరిణామ పద్ధతియైయున్నది.

మేము కనిపెట్టగలిగినంతవరకు దివ్యానలములోని యొక మిణుగురగు ఈ తురీయాత్మ మన ప్రస్తుతపు అవస్థకు దిగజాలదు. దాని స్పందవేగమునకును,పార్థివద్రవ్యము యొక్క స్పందవేగమునకును విస్తారముగా భేదముండుటచేత కాబోలు, తురీయాత్మ మన ప్రస్తుత స్థితికి, అనగా, మనము ఆలోచనలు, పనులు చేయు స్థూలలోకములోనికి సరాసరిగ చేరజాలదు. కాబట్టి దానిలోకమునకు, మనలోకమునకు మధ్య భిన్నమగు పరిస్థితులుగల ఇతరలోకము లుండవలెను. ప్రకృతిలో నేలోకములో ఆ యీశ్వ రాంశ ప్రథమతః ఉనికి గలిగియుండెనో మనకు తెలియదు. అది మన అందుబాటుకు చాలమించియున్నది. 'దివ్యజ్ఞానప్రబోధిని' (Text Book of Theosophy) లో చెప్పిన ప్రకారము దాని ప్రతిబింబము అనదగిన నీచతమ ఆవిష్కరణము బ్రహ్మాండము లోని స్థూలతమ లోకమునకు దిగును.

మనము సామాన్యముగా సప్తలోకములగురించి మాట్లాడుచుందుము. బ్రహ్మాండమందలి లోకములలో స్థూలతమమగు లోకమును మనగ్రంథములలో ప్రాకృతికలోకమందురు. ఇది బ్రహ్మాండములో పృథ్వీతత్త్వనిర్మితమైన లోకము. ఆలోకముయొక్క అంతర్భాగములు, లేక, ఉపలోకములే మనము వ్యవహరించు చుండు సప్తలోకములు. మోనాడ్ - తురీయాత్మ - ఈ ఉపలోకములలో రెండవ దానిలోనికి దిగగలదు, (కనుకనే మనమాలోకమును మొనాడిక్, లేక, అనుపాదక లోకమని వ్యవహరించుచున్నాము). కాని అంతకంటె దిగువకు ఆతురీయాత్మ చొచ్చుకొని దిగజాలదు. ఇంకను స్థూలతరమగు ద్రవ్యములో దాని కావశ్యకమగు సంపర్కమును బొందుటకుగాను, దానిలోని యొక అంశమును పూర్తిగా రెండు లోకములద్వారా దిగువకు పంపును. తురీయాత్మయొక్క ఆ యంశమునే మనము జీవాత్మ యనుచుంటిమి.

మనకు చాలపైనున్న ఈశ్వరాంశయగు తురీయాత్మ మనపైన తిరుగాడుచు న్నట్లు మాత్రముండును. దానిమిక్కిలి అల్పభాగమైనట్టియు, కేవల మసంపూర్ణమగు ప్రతిరూపమైనట్టియు జీవాత్మ (మోనాడ్ ఒక అగ్ని కిరణమును క్రిందకు పంపినట్లును ఆకిరణముయొక్క కొనయే జీవాత్మయైనట్లును ఊహింపవచ్చును,) మానసికలోకము లోని ఊర్ధ్వభాగముకంటె దిగువకు దిగజాలదు (పైనుండి క్రిందకు లెక్కింపగా మానసికలోకము అయిదవలోకము, భూలోకము ఏడవదగు స్థూలతమలోకమును

అగును). ఆజీవాత్మ ఇంకను దిగువకు దిగవలెననిన తిరిగి తానుగూడ తనలోని యొక అంశను దిగువకు పంపవలెను. ఈఅంశనే మనము దేహాత్మయందుము. కాబట్టి ప్రతిమానవుడును సామాన్యముగ తానే యనుకొనెడు ఈదేహాత్మ నిజముగ అంశాంశము — అంశములోని అంశము - మాత్రమే అయి యున్నది.

క్రిందివర్గములలో జరిగిన పరిణామమంతయు ఈ మానవశరీర నిర్మాణమునకు సజ్జీకరణమే. ప్రతిజంతువునకు భూలోక జీవితకాలములో (తరువాత కొద్దికాలము భువర్లోకములోగూడ) మానవునకువలెనే ప్రత్యేకవ్యక్తిత్వముగల ఆత్మఉండును. కాని, భువర్లోక జీవితానంతమందు దాని ఆత్మ తిరిగి యొక ప్రత్యేకశరీరములో జన్మించక మనగ్రంథములలో సమూహాత్మయని చెప్పబడిన ఆత్మపదార్థ తటాకములోనికిపోయి చేరును. ఈ సమూహాత్మ సజాతీయమగు పెక్కు జంతువులకు, (ఉదాహరణమునకు- ఇరువదిగుఱ్ఱములకు) నీరు పెట్టుటకై ఉపయోగించు నీటి తొట్టివంటిది. ఒక గుఱ్ఱ మా సమూహాత్మలోనుండి పుట్టవలసియున్నచో నొకచిన్న చెంబు నాతొట్టిలో ముంచి చెంబునిండా నీటినిపైకి తీసికొనివచ్చినట్లు ఊహింపదగును. ఈచెంబులోని నీరు క్రొత్తగా జన్మించెడు గుఱ్ఱమునకు ఆత్మయగును. ఆగుఱ్ఱము తన జీవితములో అన్నివిధములగు అనుభవములను బొందును. దాని ఆత్మ వాని వలన పాఠములను నేర్చుకొనుచు, మార్పులనొందుచుండును. ఈ పాఠములవలన గలిగెడు మార్పులను నీటితొట్టిలో వేయబడు పెక్కువిధములగు రంగుపదార్థములతో బోల్చవచ్చును. గుఱ్ఱము చనిపోయినప్పుడు చెంబులోని నీరు, అది సంపాదించిన రంగు పదార్థములు (అనగా అనుభవములు) సహా తొట్టిలోనికి తిరిగి పోయబడును. ఈరంగు పదార్థములతోగూడిన క్రొత్తనీరు తొట్టి అంతటిలోను వ్యాపించి దానిలోని నీటి రంగునంతను కొంతవరకు మార్చునని స్పష్టమగుచున్నది. ఈసమూహాత్మనుండియే మరియొక గుఱ్ఱము ఇప్పుడు పుట్టినచో ఆతొట్టిలోనుండి మరియొక చెంబునిండా నీరు తీయబడును. కాని, ఇదివరకు చనిపోయిన గుఱ్ఱమునకు ఆత్మగానుండిన నీటిబిందువులనే యిప్పుడు తిరిగి తీయుట అసాధ్యమని స్పష్టముగా గనిపించుచున్నది. *

ఒక జంతువు మానవత్వము బొందుటకు తగినంత పరిణామము నొందినయెడల, ఆజంతువు జీవితానంతరము దాని ఆత్మ పదార్థముతిరిగి సమూహాత్మలో చేరక

* ఈ విషయమై వివరములకు సి. డబ్లియు. యల్. గారి దివ్యజ్ఞానప్రబోధిని యను పుస్తకమును జూడుడు.

ప్రత్యేక వ్యక్తిగానుండిపోవును. ఇప్పుడు మిక్కిలి విచిత్రమైనట్టియు రమ్యమైనట్టియు గతి దానికి సంభవించును. ఇంతవరకు గుత్తిమున కాత్మయై యుండిన పదార్థము — చెంబులోనినీరు — మిక్కిలి యుత్కృష్టమగు నొకదానికి ఉపాధియగుచున్నది. దీనికి భూలోకములో సరియగు నుపమానము కనిపించదు. నీటిని గొప్ప యొత్తిడికి లోబరచి దానిలోనికి వాయువును ప్రవేశపెట్టి, వాయుపూరితమయిన జలముగా (సోడా నీటివలె) చేయుటవంటిదని యూహింపవచ్చును.

ఈ యుపమానమునంగీకరించినచో, జంతువుయొక్క ఆత్మతో పోల్చిన నీరు మానవుని కారణశరీరమగుచున్నది. నీటిలోనికి ప్రవేశించిన వాయువు నేనిదివరలో చెప్పిన జీవాత్మ—ఈశ్వరాంశయగు తురీయాత్మయొక్క అసంపూర్ణమగు ఆవిర్భావము— అగుచున్నది. ఈ ఆత్మావరోహణము పూర్వపుపాశ్చాత్యపురాణగాథలలో గ్రీసు దేశపు 'క్రేటరు' లేక, గిన్నె యను భావములోను, మధ్యకాలముల 'హోలీగ్రేయిల్' —పవిత్రమగు గిన్నె—యను గాథలోను సాంకేతికముగనున్నది. గ్రేయిల్ లేక, గిన్నె క్రింది వర్గములలోని యావత్పరిణామముయొక్క పరిపాకఫలితము. మానవుని ఆత్మ ఆవిర్భవించుటకు ఆగిన్నెలోనికి ఈశ్వరజీవమనెడు ద్రాక్షారసము పోయబడుచున్నది. కాబట్టి ఇదివరలో చెప్పినట్లుగా, ఇంతవరకు జంతువుయొక్క ఆత్మగానున్నది యిప్పుడు మానవునికి కారణశరీరమై, మనోలోకముయొక్క ఊర్ధ్వభాగములో మానవజీవాత్మయొక్క శాశ్వతోపాధియగుచున్నది. ఇది తన పరిణామ మంతటిలోను నేర్చుకొన్నదంతయు ఈ నూతన జీవకేంద్రమున కొప్పగించుచున్నది.

ఈయవరోహణమునల్ల సంపాదించిన అనుభవములను గుణములను తనతో పైకి గొనిపోవుచు అనుపాదక, లేక, మొనాడిక్ లోకమునకు దిగువనున్న ఆత్మలోకము యొక్క ఊర్ధ్వభాగమువరకుక్రమేణా తిరోగమనముచేయుటయే ఈ ఆత్మయొక్క పరిణామము. మానవుని స్థూలశరీరము పూర్తిగా వికసించినది. అందుచేత మనము దానిని జయించితిమనుకొనవచ్చును; కాని, అది పూర్తిగా ఆత్మయొక్క స్వాధీనములోనుండవలెను. ప్రస్తుతమా శరీరము, అప్పు డప్పుడో కింతకాలము స్వాధీనముతప్పి వెఱ్ఱిగా పరుగెత్తినను, ఉత్తమమానవజాతులలో సాధారణముగ స్వాధీనములోనేయున్నది. కామమయశరీరము కూడ పూర్తిగా వికసించినది. కాని సంపూర్ణముగా స్వాధీనములోనున్నదని చెప్పుట కెంతమాత్రము అవకాశములేదు. మనము చెందియున్న జాతులలోగూడ, రాగములకు బానిసలయియున్న మానవులెందరో

గలరు. వారు వారిరాగములను పరిపూర్ణముగ లొంగుబాటులోనికి తెచ్చుకొనుటకు బదులు అతి తరుచుగా వారే వానికి లొంగిపోవుదురు. లొంగుబాటులో లేనిగుఱ్ఱము వెఱ్ఱిగాపరుగులెత్తి రౌతు నపాయముపాలుచేయురీతిని వారిరాగోద్రేకములు గూడ ప్రకోపముచే పరువులెత్తుచు వారు పోవనొల్లని యనేకచోట్లకు వారిని మోసికొని పోవుచుండును.

కనుక, ప్రస్తుతకాలమున ఎక్కువ నాగరికతగలజాతులలోని ఉత్తమ పురుషు లందరిలోను స్థూలశరీరము పూర్తిగా పరిణామమునొంది చాలవరకు స్వాధీనములో నున్నదనియు, కామమయ శరీరము కూడ పూర్తిగా వికాసముబొందినను పూర్తిగా స్వాధీనములోనున్నదనుట కవకాశములేదనియు, మానసికశరీరమింకను వికసించు చున్నదనియు, దాని వృద్ధి చాల అసంపూర్ణముగనున్నదనియు మన మంగీకరించ వచ్చును. స్థూల, కామ, మానసిక శరీరములు మూడును సంపూర్ణముగా ఆత్మకు లొంగుబాటునకువచ్చుసరికి మానవులింకను పరిణామములో చాలదూరముపోవలసి యుండును. అదిసంభవించినపుడు నీచాత్మయగు దేహాత్మ ఉత్తమాత్మయగు జీవా త్మలో నైక్యమయిపోవును; అప్పుడు జీవాత్మ మానవుని పాలించును. మానవుడప్ప టికి పరిపూర్ణుడు కాకపోయినను వాని వేర్వేరు ఉపాధులు ఏక లక్ష్యముతో సామ రస్యము గలిగి పనిచేయును.

ఇంతవరకు జీవాత్మ తన దేహాత్మకు చెందిన ఉపాధులను నెమ్మదిగా తనతో తాదాత్మ్యమునొందువరకు స్వాధీనముచేసికొనుచున్నది. కాని యిప్పుడు తురీ యాత్మ జీవాత్మనుపాలింపనారంభించును. దేహాత్మయు, జీవాత్మయు నైక్యమొంది నట్లుగానే, తురీయాత్మయు జీవాత్మయుకూడ నైక్యమొందుసమయము అనతి కాల ములో రాగలదు. ఇదియే జీవాత్మ తురీయాత్మల సమవాయము. ఇది సమకూరి నప్పుడే మానవుడు ప్రకృతిలోనికి దిగిన ఉద్దేశము నెరవేరును; మానవుడు మానవా తీతుడు, లేక, పరమపురుషుడు అగును.

## అతిమానవజీవితము

ఇప్పుడే అతడు తొలిసారి నిజమగు తనజీవితములో ప్రవేశించుచున్నాడు. ఏలయన, ఇంతవరకు యుగములకొలది క్రింది వర్గములలోను, తరువాతమానవవర్గము ద్వారా పరమపురుషత్వమువరకును జరిగిన అపారమగు పరిణామానుభవమంతయు

మానవుడతిమానవుడయిన పిమ్మట ప్రారంభమగు తురీయాత్మయొక్క నిజజీవితము నకు సజ్జీకరణము మాత్రమే. ప్రపంచమనుపాఠశాలలో మానవవర్గము ఆఖరు తరగతి. మనుజుడా తరగతిలో శిక్షితుడయినతరువాత నిజమగు జీవితములో ప్రకాశవంతమగు ఆతురీయాత్మజీవితములో, క్రైస్తుయొక్క జీవితములో ప్రవేశించును. ఆజీవితములో పాల్గొనుచున్నవారిని కొందరను మేముచూచుచున్నను, ఇప్పటికిని దాని స్వభావ మత్యల్పముగ మాత్రమే మాకు తెలియును. దాని వైభవప్రభావములు సాటిలేనివి, మనబుద్ధి కతీతమైనవి. అయినను, అది యొక విస్పష్టము, సజీవమునగు సత్యము. మనలో ప్రతివారును దానిని తప్పకపొందితీరుదురు. మనమువద్దన్నను దానినుండి తప్పించుకొనజాలము. మనముస్వార్థపరులమైనను, పరిణామ ప్రవాహమున కెదురుగ నీదబోయినను, మనపురోవృద్ధిని ఆలసింపగలమేగాని కడకు దాని నెన్నటికి అడ్డగింపలేము.

మానవజీవితమును పూర్తిచేసినపిదప, పరిపాకము నొందిన పురుషుడు సామాన్యముగా తన వివిధప్రకృతికోపాధులను విసర్జించును. కాని, తమ కార్య నిర్వాహణములో నెప్పుడయిన నవశ్యకమయినయెడల కావలసిన శరీరమును నిర్మించు కొనుశక్తినిగలిగియుండును. సాధారణముగా ఆస్థితిచేరువారికెవరికిని స్థూలశరీరమావ శ్యకముకాదు. వారు కామమయమానసిక శరీరములను, కారణశరీరమునుగూడ నుంచుకొనక అత్యున్నత స్థితిలోనే శాశ్వతముగ వసింతురు. ఎప్పుడయిన నేకార్య మునకయినను, వారొక దిగువలోకములో వ్యవహరింపవలసియున్నచో ఆలోకము నకు సంబంధించిన ద్రవ్యముతో తాత్కాలికముగా నొక ఉపాధినిగైకొనవలెను. ఏలయన, ఒకలోకములో నివసించుజీవులతో సమావేశముకావలెనన్న, ఆలోక ద్రవ్యముతో నిర్మితమైన శరీరములోనే సమావేశముకాగలదు. మనుష్యులతో వారి లోకములో ప్రత్యక్షముగా మాట్లాడవలెనన్న, వారు స్థూలశరీరమును ధరించవలెను. అధమము అసంపూర్ణముగా రూపమునొందిన స్థూలశరీరము (**Partial materiali-sation**) నైన నిర్మించుకొనవలెను. లేనిచోవారు మాట్లాడలేరు. అదేప్రకారము మన మనస్సులలో నేవిషయమునైన వారు ప్రవేశపెట్టదలచినయెడల వారిచుట్టును నొక మానసికశరీరమును ప్రోగుచేసికొనవలెను. వారి కార్యమునకై ఎన్నడైన నొక స్థూలతరమగు ఉపాధిని గ్రహించవలసియున్నయెడల అట్లుచేయుటకువారికిశక్తిగలదు. కాని, వారు తాత్కాలికముగ మాత్రమే దానిలో నుందురు. పరిపాకము నొందిన

పురుషుడు ఇంకను పురోవృద్ధినిబొందగలమార్గములు ఏడుగలవు. ఇంకొక అధ్యాయ ములో వానిని తెలిపెదను.

## పరమపురుషుల సోదరబృందము

మన పరమగురువులు చెందినయొక పరమపురుషుల సోదర బృందము ప్రపంచ మును చాలవరకు నడుపుచు పాలించుచున్నది. వారల గురించి దివ్యజ్ఞానోపాసకులు అన్నిరకములయిన పొరపాట్లను చేయుదురు. పరమపురుషులందరును ఏదో యొక రహస్య ప్రదేశములో వసించుచున్నారనియు, వారొకమతమునకు చెందిన సంఘ మనియు, తరుచుతలచెదరు. ఒక్కొక్కప్పుడు వారు దేవదూతలని యెంచెదరు; వారందరు హిందూదేశస్థులనియో లేక, అందరు హిమవత్పర్వతములలో వసించు చున్నారనియో చాలమంది తలంచిరి. ఈయూహాలేమియు నిజముకావు. ఒకగొప్ప సోదరకూటముగలదు. అందలి సభ్యులు నిత్యమొకరితో నొకరు సంప్రతించుకొను చుందురు. కాని వారి సంప్రతింపులు ఉత్తమలోకములలోనే జరుగును. వారందరు తప్పక నొకచోటనే నివసింపనవసరములేదు. పరమగురువులనెడు ఈబృందములోని కొందరు సోదరులు వారిపనిలో నొక భాగముగ శిక్షణార్థమై శిష్యులను స్వీకరించి వారికి బోధచేయుదురు. కాని ప్రబలమగు ఆపరమపురుషుల కూటములో బహు తక్కువ మంది ఆపనిని గైకొందురు.

ఈగ్రంథాంతమందు తెలియజేసినట్లు మానవులు ఏడు రేఖలకు చెంది యున్నారు. పరిణామమునొందుమహాజీవతరంగము ఏడురేఖలుగా విభజింపబడినది. ఆయేడురేఖలలో నేదోయొకరేఖకు ప్రతిమానవుడు చెందియుండును. ప్రతిరేఖకు నొక సిద్ధపురుషుడు ప్రారంభకుల శిక్షణార్థమై నియమింపబడియున్నట్లు అగుపించు చున్నది. ఆయనరేఖ ననుసరించి పరిణామము నొందు జీవులందరును ఆయనద్వారా అభివృద్ధినొందుదురు.

సిద్ధపురుషుని కంటె తక్కువ అర్హతగల వారెవరికిని కేవలము ప్రారంభ దశలోనున్న ముముక్షువును గురించి సంపూర్ణభాధ్యతను వహించుటకు అనుమతి నియ్యరు. అయినను, కొన్ని సంవత్సరముల అనుభవముగల స్వీకృత శిష్యులు పరమ గురువుల ప్రతినిధులుగా నియోగింపబడి వృద్ధిలోనికిరాదగిన పిన్నముముక్షువులకు సలహానిచ్చుచు సహాయపడు గౌరవమునుపొందుచున్నారు. ఈపెద్దశిష్యులు సిద్ధ

పురుషులయినపుడు చేయవలసిన భవిష్యత్కార్యము చేయుటకై క్రమేణా శిక్షణము నొందుచుందురు. (కాలానుసరణముగ వారును పరమపురుషులయ్యెదరు.) పరమగురువులు మాత్రమే నిర్వహింపదగిన ఉత్తమకార్యములను నెరవేర్చుటకు వారికి తగినంత తీరుబడి కలుగుటకై, వారిచేతులలోనుండి దైనందిన వ్యవహారముల నంత కంతకెక్కువగా ఈశిష్యులు తీసికొని తామే నిర్వహింపనేర్చుకొనుచున్నారు. శిక్షణార్థమై అభ్యర్థులను ముందుగా నెంచు బాధ్యత ఇప్పుడు చాలవరకీ పెద్దశిష్యులపైబడినది. అభ్యర్థులకు పరమపురుషులతో సూటిగా సంబంధముండుటకు బదులు వారల ప్రతినిధులగు ఈపెద్ద శిష్యులతోనే తాత్కాలికముగా సంబంధముండును. కాని గురు శిష్యులు అద్భుతరీతి నేకమైయుందురు గనుక ఈసంబంధములలో భేదమేమియు లేదు.

## పరమపురుషుల శక్తులు

సిద్ధపురుషుని శక్తులనేకములు, అద్భుతములునై యున్నవి. అయినను, అవన్నియు మనకున్న శక్తులనుండియే సహజక్రమమున ననుసరించివచ్చును. వారలలో నాశక్తులెక్కువ ప్రబలముగా కనిపించుటయే విశేషము. మనతో పోల్చిచూచినపుడు సిద్ధపురుషునియందు మిక్కిలి విశేషముగా గనిపించులక్షణమేమన, ప్రతివిషయమును వారు కేవలము వేరు దృష్టితో చూచెదరు. ఏలయన, సామాన్యముగ ఎక్కువ మంది మానవులలో సుస్పష్టముగా గానవచ్చెడు స్వార్థభావము ఆయనలో నెంత మాత్రములేదు. సిద్ధపురుషుడు నీచాత్మను పూర్తిగా శూన్యముచేసి తమకైగాక సర్వులకొరకు జీవించుచున్నారు. అయినను ఆయనకు మాత్రమే బోధపడురీతిని యీసర్వులు నిజముగా ఆయనే యైయున్నారు. ఆయన శీలములో నేవిధమగు లోపముగాని, స్వార్థపరమగు తలంపుగాని, భావముగాని, లేనట్టి స్థితినిబొందిరి. పరిణామవికాసములో సహాయపడుచు పరిణామక్రమమును నడిపెడు ఈశ్వరునితో సామరస్యముతో పనిచేయుటయే వారి యేకోద్దేశము.

బహుశః వారిలోని రెండవవిశిష్టలక్షణము సర్వతోముఖమగు వికాసము. మన మందరము అసంపూర్ణులమే. మనలో నెవరును, ఏమార్గమునను అత్యున్నతస్థితిని బొందలేదు. గొప్ప భౌతికశాస్త్రజ్ఞుడుగాని, గొప్పయోగిగాని సాధారణముగా ఏదో యొకవిషయములోనే ప్రశస్తినిబొందియుండునుగాని వారి స్వభావములలోని యితర భాగములు అవికసితములైయుండును. మన మందరము బీజరూపమున అన్ని లక్షణము

లను గలిగియున్నాము, కాని యొకటి యెక్కువగాను మరియొకటి తక్కువగాను మొత్తమన్నియును అసంపూర్ణముగా వికసించియున్నవి. సిద్ధపురుషుడు సర్వగుణసంపన్నుడు. వారిభక్తి, ప్రేమ, అనుకంప, కరుణ, పరిపూర్ణములు. వారి ప్రజ్ఞ మనబుద్ధి కతీతమై కడువైభవముగా నుండును. వారియోగసిద్ధి అత్యద్భుతము, దివ్యమునై యుండును. వారు పరిపూర్ణముగ వికాసమునొందిన కారణము చేతనే వారు మనకు తెలిసిన మానవులందరికంటె పైన అతీతులైయుందురు.



# రెండవ అధ్యాయము

# పరమగురువుల స్థూలశరీరములు

## వారి రూపము

పరమగురువులగురించి దివ్యజ్ఞానోపాసకులలో విశేషమగు అస్పష్టతయు, సందేహామునుగలవు, కావున పరమగురువుల జీవితములెంతసహజముగనుండునో, ఎంతవరకు సామాన్య లౌకికజీవితములను బోలియుండునో తెలిసికొనుటకై వారి దైనందిన జీవితము గురించియు, కొందరు పరమ గురువుల రూపముల గురించియు సంగ్రహముగ చెప్పినచో నుపయోగకరముగనుండవచ్చును. ఇతరమానవులనుండి యొక పరమపురుషుని నిస్సంశయముగా గుర్తింపగలుగుటకు ప్రత్యేకమగు నొక లక్షణమేదియులేదు. కాని, ఆయన ఎల్లప్పుడును ఆకర్షణీయముగను, ఉదారముగను, గౌరవముగను, పవిత్రముగను, ప్రశాంతముగను గనబడుదురు; వారిని చూచువారు ఒక మహాపురుషుని సమక్షముననున్నట్లు గుర్తింపకపోవుట అసంభవము. ఆయన ప్రోత్సహించుటకో, సహాయపడుటకో, హెచ్చరికనిచ్చుటకో, ఏదో యొక నిర్దిష్టమయిన ఉద్దేశమున్నప్పుడుమాత్రమే మాటలాడునట్టి బలశాలి, మితభాషి : అయినను, ఆయన అద్భుతమగు పరోపకారశీలతయు, బహుసుకుమారము, సరసమునగు హాస్యరసమును—ఇతరుల నెవ్వరిని నొప్పించుటకు గాక, వారిజీవితమునందలి కష్టములను తేలికచేయుట కుపయోగించు ప్రియమగుహాస్యభావమును—గలవారు. హాస్యభావములేనియెడలయోగమార్గమున అభివృద్ధి నొందుట యసాధ్యమని మోర్యమహర్షిగారొకసారిచెప్పిరి. నేను జూచిన సిద్ధపురుషులందరు నిస్సంశయముగా ఆగుణమును గలిగియున్నవారే.

వారిలో పెక్కుమందికడురూపసులు. ఏలయన, వారు ఆరోగ్యనియమములను సంపూర్ణముగ పాటించువారగుటచే, వారి స్థూలశరీరములు పరిపూర్ణసౌష్ఠవముగలిగి యున్నవనవచ్చును. మరియును, అన్నిటినిమించి వారేవిషయమైకూడ నెన్నడును చీకాకునొందరు. వారిచెడు కర్మయంతయు చిరకాలము క్రిందటనే హరించిపోయెను. అందుచేవారి స్థూలశరీరము భూలోకపరిస్థితులలో సాధ్యమైనంతవరకు వారిజీవాత్మయొక్క దివ్యకోశవైభవమును పరిపూర్ణముగా వ్యక్తముచేయుచుండును. కావున

పరమపురుషుని ప్రస్తుతపు శరీరము సామాన్యముగ అద్భుతసౌందర్యముతో మెఱయు చుండుటయేగాక, దానిలోమార్పు చేయవలసినదేమియు లేనందున, ఆయన తరువాత నెప్పుడైన జన్మించవలసివచ్చినప్పుడు ధరించుశరీరము, ఆయన జాతియొక్కయు వంశముయొక్కయు విశిష్టలక్షణములనుగలిగియుండుటతప్ప తక్కిన విషయములలో ప్రస్తుతశరీరమునకు సరాసరిగప్రతిబింబమైయుండును. వారు కర్మరహితులగుటచే, ఏకారణముచేనైన క్రొత్తశరీరములను ధరింపకోరినయెడల వారికార్యనిర్వాహణము నకు అనుగుణ్యమైన దేశములోగాని, జాతిలోగాని జన్మించుటకు సంపూర్ణ స్వతంత్రులైయుందురు. అందుచేత, వారేసమయమునైన ధరించుట తటస్థించు శరీరముల జాతివిలక్షణములు అంతగా ముఖ్యమైనవికావు.

ఒకరు సిద్ధపురుషుడని తెలిసికొనవలెననిన, వారి కారణ శరీరమును జూచు టావశ్యకము. ఏలయన, వారి పరిణామస్థితి ఆశరీరముయొక్క విస్తృతమగు పరిమాణమువలనను, "దృశ్యాదృశ్య మానవుడు" అను పుస్తకములో 26 వ చిత్రపటము లోని 'అర్హత్' యొక్క కారణశరీరములో కొంతవరకు సూచింపబడిన ప్రకారము, ఏక కేంద్ర గోళములుగా చక్కగా నమర్చబడినరంగులువలనను స్పష్టపడగలదు.

## టిబెటుదేశములోనొకలోయ

ఈ పరమ పురుషులలో మోర్యమహర్షి, కూట్‌హూమిమహర్షి, జ్వాల్‌కుల్ మహర్షియను ముగ్గురు మహర్షులు ప్రస్తుతము టిబెటుదేశములో నొక లోయలో నివసించుచున్నారు.

మేడమ్ బ్లవట్స్కీగారి కోరికపైన జ్వాల్‌కుల్‌మహర్షిగారు ఒకసారి ఆమె కొరకు ఆలోయ ముఖద్వారముయొక్క చిత్రమును యోగశక్తిచే చిత్రించిరి. ఆచిత్రముయొక్క ఛాయాపటమును ఈగ్రంథము (ఇంగ్లీషుప్రతి) లో పునర్ముద్రితముగావింపబడినది. పట్టుగుడ్డపై చిత్రింపబడిన అసలు చిత్రము అడయారులో దివ్యజ్ఞానసమాజముయొక్క ప్రధానకార్యాలయములోని ధ్యానమందిరములో భద్రపరుపబడియున్నది. ఆచిత్రములో ఎడమవైపున వారిగృహద్వారమునకు సమీపమున అశ్వారూఢులైయున్న మోర్యమహర్షిగారిని చూడగలరు. కూట్‌హూమిమహర్షిగారి గృహము కుడివైపున, వంపుతిరిగిన తరువాత లోయకెగువగానుండుటచే ఆచిత్రములో గనబడదు. ఆచిత్రములో జ్వాల్‌కుల్‌గారినిగూడ కనబరచమని బ్లవట్స్కీగారు



బెట్టులోని లోయ

ఆయనను ప్రార్థించెను. ఆయన మొదట నిరాకరించెనుగాని తుదకొక కర్రపట్టుకొని చదువరులవైపు వీపుత్రిప్పి నీటిలో నిలబడినట్లు తనబొమ్మను ఆ చిత్రములోచేర్చిరి. ఈ అసలు చిత్రములో నీలము, ఆకుపచ్చ, నలుపురంగులు లేతగా వేయబడినవి, ఆచిత్రకారుడు జీవన్ముక్తత్వము బొందకపూర్వము చాలకాలముక్రిందట, అనగా దివ్యజ్ఞానసమాజ ప్రారంభదినములలో చనవుగా పిలువబడుచుండెడు " గై — బెన్‌జమిన్ " అను పేరుతోనే ఆయన ఆచిత్రముపై సంతకమునుగూడ చేసిరి. ఉదయకాలమున కొండప్రక్కలను ఇంకను మంచు ఆవరించియున్న సమయములో ఈచిత్ర మురచింపబడినట్లు స్పష్టముగా తెలియుచున్నది. సన్నని యీ లోయ కిరుపార్శ్వములను మోర్యమహర్షి గారియొక్కయు, కూట్‌హూమి మహర్షి గారియొక్కయు ఆశ్రమములు ఒకదానికొకటి యెదురుగాగలవు. ఈలోయయొక్క కొండచరియలు దేవదారు వృక్షములతోనిండియున్నవి. ఈలోయలో పరమగురువుల ఆశ్రమములవారనుండి బాటలు దిగువకుబోయి దిగువనున్న యొక చిన్న వంతెనయొద్ద కలియును. వంతెనకు దగ్గరనే చిత్రములో దిగువను వామభాగమున గనబడు సన్నని ద్వారమొకటి గలదు. ఆ ద్వారముగుండాపోయినయెడల మహాశ్వేతబృందము తరపున రక్షకుడగు కూట్‌హూమి మహర్షి పాలనలోనున్న గుప్తచిత్రవస్తు ప్రదర్శనశాలగల బహువిశాలమైన నేలమాళిగలు గనబడును.

ఈప్రదర్శనశాలలోని వస్తువులు బహువిధములైనవి. వీనిని జూచిన యెడల యావత్పరిణామవిధానమునకు నిదర్శనములుగా వానిని ప్రదర్శింపనుద్దేశించినట్లు గనబడును. ఇందుకు నిదర్శనముగ, కీళ్లు వదులుగా వ్రేలాడు రాక్షసులవంటి లెమోరియాఖండవాసులు మొదలు, అంతకంటె తక్కువ మానవత్వముబొందిన జాతులలో మిగిలియుండి మరుగుజ్జులైయున్న జనులవరకు, ఈ భూగోళముపై బుట్టిన ప్రతి మానవజాతియొక్క రూపమును యథాతథముగ తెలుపు విగ్రహము లచటగలవు. భూమియొక్క యుపరిభాగమున గలిగిన మార్పులన్నియు — దానిలో పెక్కు మార్పులుగలిగించిన మహాప్రళయములకు పూర్వమును తరువాతనుగూడ నుండిన స్థితులన్నియు — ఎత్తు పల్లములను గనబరచు నమూనాలపై చక్కగా జూపబడినవి. ప్రపంచములోని వివిధమానవజాతుల వలసలు బ్రహ్మాండమైనపటములో గనబరచబడినవి. వారివారి జన్మస్థానములనుండియే యేయేజాతియెంతదూరము వ్యాపించెనో నిర్దుష్టముగా ఆపటములో గనబడును. అటులనే ప్రపంచములోని వేర్వేరు మతము

లన్నియు నెచటెచట స్థాపింపబడినవో, ఎచట పరిశుద్ధముగ నాచరణలో నుండెనో, ఎచటకు వ్యాపించెనో, ఇతర మతవిశేషములవలన ఎచట యెట్లు సంకరములై వికలము లయ్యెనో, ఇతరపటములవలన తెలియగలదు. చిరకాలముక్రిందటనే విస్మృతములైన జాతులకుచెందిన కొందరు గొప్పనాయకులయొక్కయు, మతగురువులయొక్కయు స్థూలరూపములను, అద్భుతమగు సహజత్వముగల విగ్రహములు శాశ్వతముగా జ్ఞప్తికి తెచ్చుచుండును. మానవనాగరికతలో ముఖ్యమైనట్టియు, ఎవరిచేతను గమనింపబడకుండ నుండిపోయినట్టియు అభివృద్ధులకు సంబంధించిన చిత్రమైన అనేక వస్తువులు భావితరములవారి పరిశీలన కొరకు భద్రపరచబడినవి. నమ్మరానంత ప్రాచీనమైనట్టియు, అమూల్యములైనట్టియు లిఖితగ్రంథములకు మూలములగు వ్రాత ప్రతులిచట గనబడును. ఉదాహరణమునకు: సిద్ధార్థుడను రాజపుత్రునిగా కడపటి సారి జన్మించిన బుద్ధదేవుడు స్వహస్తమున వ్రాసిన వ్రాతప్రతియు, పాలస్తీనాలో జననమొందిన క్రైస్తుప్రభువు వ్రాసిన ప్రతియొకటియుగ గలవు. 'గుప్తవిద్య'— **Secret Doctrine** ప్రథమభాగములో మేడమ్ బ్లవటీస్కీగారిచే వర్ణింపబడిన "ధ్యాన గ్రంథము" — **Book of Dzyan** — యొక్క అత్యద్భుతమగువ్రాత ప్రతికూడ నిచటనేయున్నది. మనలోకముకంటె అన్యములగు లోకములకు చెందిన విచిత్రపు లిపులుకూడ గలవు. జంతు, వృక్షవర్గముల రూపములన్నియును ఇచట చిత్రితములై యున్నవి. వానిలో కొన్నిటిని 'ఫాసిల్సు' — **Fossils** * గా నెరుగుదుము, కాని వానిలో చాలభాగముయొక్క యునికిని ఆధునిక శాస్త్రజ్ఞు లూహింపనైనలేదు. మానవజాతి పూర్తిగా మరచిపోయిన అతి ప్రాచీనకాలమునాటి కొన్ని గొప్ప నగరములయొక్క సరియగు నమూనాలు శిష్యుల విమర్శనార్థమై యిచట నున్నవి.

విగ్రహములు, నమూనాలు, అన్నియు అసలు మాతృకలవలె నుండునట్లు అతిరమ్యముగా రంగులు వేయబడినవి. మనము గమనించవలసినవిషయమేమనగ: ఈవస్తువులు ఏకాలములో పరిణామము, లేక, నాగరికత, ఏ యవస్థలోనుండెనో, రాబోవు తరములవారికి విశదపరచుటకుగాను ఆయాకాలములలో నుద్దేశపూర్వకముగా సమకూర్చబడినవి. అందుచేత మనవస్తుప్రదర్శన శాలలోవలె అసంపూర్ణముగాను, ఖండఖండములుగానుగాక, సమస్తవిషయములలోను సంపూర్ణమైనట్టియు,

* భూగర్భములోబడి శిలారూపమైన, జంతుసంబంధమైనగాని, వృక్షసంబంధమైనగాని, మనుష్యసంబంధమైనగాని భాగములు.

క్రిమానుసారమగు జ్ఞానమునిచ్చునట్టియు వస్తువులు ప్రదర్శింపబడినవి. వివిధములగు నాగరికజాతులు నిర్మించిన అన్నిరకముల యంత్రముల నమూనాలు కూడ అచట గలవు; అంతేగాక చరిత్రలోని మంత్రతంత్రవిద్యలు ఏకాలమునందెట్లు ప్రబలినవో తెలియుటకు వివరములతోగూడిన పెక్కు చిత్రపటములున్నవి.

విశాలమగు ఈ చావిళ్ళకు కొనిపోవు నడవలో మోర్య, కూట్‌హూమి మహర్షులవద్ద అప్పటికి పరీక్షమాణావస్థలోనున్న శిష్యుల సజీవప్రతిమలుంచబడినవి. వీనిని గుఱించి మున్ముందు విశదపరచెదను. ఈప్రతిమలన్నియు శిలావిగ్రహములవలెనే గోడలచుట్టును వరుసగా నమర్చబడినవి. అవి ఆశిష్యులరూపమును సంపూర్ణముగ బోలిన ప్రతిరూపములు. ఈప్రతిమలను నిర్మించుట కుపయోగించబడిన అతి స్థూల పదార్థము ఆకాశపదార్థము — ఈథరు — అగుటచేత, అవి స్థూలనేత్రములకు కనబడకపోవచ్చును.

వంతెనవద్ద బర్మాదేశపు కళను స్ఫురింపజేయు గోపురముగల యొక చిన్న దేవాలయముకూడ గలదు. అచట పుష్పములను ఫలములను సమర్పించి, కర్పూరమును వెలిగించి, పంచశీలములను పారాయణజేయుటకై కొందరు గ్రామస్థులు పోవుచుందురు. ఏటిప్రక్కనుండి మెరకపల్లములతోనిండి కర్కశమగు నొకబాట లోయ దిగువరకు తీసికొనిపోవును. మహర్షుల గృహములలో నొకదానియొద్దనుండి రెండవ దానిని జూడవచ్చును; రెండును వంతెనకెగువనే యున్నవి, కాని లోయమలపు తిరిగి యుండుటచే వంతెనవద్దనుండిచూచిన, రెండు గృహములు కనబడవు. బాట వెంటనే లోయపైకి కూట్‌హూమిమహర్షి గారి గృహమును దాటిపోయినచో నొక పెద్ద రాతి స్తంభమువద్దకు పోవుదుము. దాని యావలకింకను పోయినయెడల లోయ తిరిగి వంపుగా మరలుటచే నాస్తంభమదృశ్యమగును. ఆలోయలో మరికొంతదూరము పోయినయెడల నొక పీఠభూమి కనబడును. దానిమీద నొక సరస్సుకలదు. ఆసరస్సులో మేడమ్ బ్లవట్‌స్కీగారు స్నానము చేయుచుండిరనియు, ఆజల మతిశీతలముగా నుండెనని ఆమె యన్నట్లును చెప్పుకొనుటగలదు. ఆలోయ చక్కగా మఱుగుగలిగి దక్షిణముఖముగా నున్నది. శీతకాలములో పరిసరప్రాంతము మంచుతోనిండి యున్నను,మహర్షుల గృహములవద్ద మంచునుజూచినట్లు నాకు జ్ఞప్తిలేదు. ఈ గృహములు చాలదృఢముగను బలముగను గట్టిబడినవి.

## కూట్ హూమి మహర్షి గారి గృహము

కూట్‌హూమిమహర్షి గారి గృహములో నడుమధ్యను ఇంటి పొడవున నడవ యొకటి యుండుటచే గృహము రెండు భాగములుగా విభాగమయినది. ఆంగ్లేయ ప్రతిలోని చిత్రమును జూచినయెడల ఇంటి యొక్క దక్షిణము నైపున సగము భాగముయొక్క నమూనాకనబడును. ఆనడవలోనికి ప్రవేశింపగనే కుడిచేతినైపు మొదటి ద్వారము మన పరమగురువు సాధారణముగా కూర్చుండెడు గదిలోనికి తెరచును. అదియే ఆయింటిలో ముఖ్యమైనగది. ఆగది యాబది యడుగుల పొడవు ముప్పది యడుగుల వెడల్పుగలిగి చాల విశాలముగను, ఎత్తుగను నుండును. అది యొక పెద్దహాలువలెనుండునుగాని గదివలెనుండదు. నడవకు కుడినైపున ఇంటిముందు భాగమంతటను అది వ్యాపించియున్నది. ఆ పెద్దగదికి వెనుకనైపున రమారమి చతుర స్రముగా నుండు రెండుగదులు కలవు. వానిలో నొకటి పడకగది, రెండవది పఠన మందిరము. ఇంటిలో ఆభాగమంతయు పరమగురువు స్వంత యుపయోగము నకై ప్రత్యేకింపబడినది; దానిచుట్టును విశాలమగు వసారాకలదు. నడవకు ఎడమ నైపుననున్న యింటి రెండవ భాగము చిన్నగదులుగాను, వివిధములగు కచ్చేరీ గదులుగాను విభజింపబడినట్లగపడును. ఆభాగమును బాగుగపరీక్షించుటకు మాకవ కాశము కలుగలేదు; కాని పడకగదిలోని ద్వారమున కెదురుగా నడవభాగములో మంచి యేర్పాట్లు గల స్నానముల గది యున్నట్లు చూచితిమి.

కుడినైపుననున్న పెద్దగదికి ముందునైపునను, చివరను మంచి వెలుతురు నిచ్చెడు అనేక కిటికీలుండుటచే గదిలో ప్రవేశించినతోడనే అడ్డంకు లేమియులేని యొకే దృశ్యమును వానిలోనుంచి జూచుచున్నట్టి భావముకలుగును; ఆ కిటికీలన్నిటి క్రిందను పొడుగుగా నొక అరుగుగలదు. ఆదేశములో అసాధారణమగు విశేషము గూడ నొకటి యచటగలదు. ముందు నైపు కిటికీల కెదురుగా నున్న గోడలో మధ్య నొక పెద్దపొయ్యికలదు. మూడు గదులకు గూడ వేడి తగులునట్లు ఈ యేర్పాటు చేయబడినది. ఆపొయ్యిపైన కప్పువలె యొకచిత్రమగు ఇనుపరేకుగలదు. ఇటువంటి యేర్పాటు టిబెటు దేశమున మరెక్కడనులేదనీవింటిమి. ఈపొయ్యి సమీపముననే మహర్షి గారి పడక కుర్చీకలదు. మిక్కిలి పురాతనమగు కర్రలో దొలిచి, చక్కగా చెక్కి, కూర్చుండువారికి సరిపోవునట్లుగా తయారుచేసియుండుటచే దానిలో ప్రత్యే కముగా దిండ్లు అవసరములేదు. ఆగదిలో అచ్చటచ్చట మేజాబల్లలు, చాలవరకు

పీఁపులులేనిపొడుగుబల్లలు, సోఫాలుగలవు. ఒకమూల మహర్షిగారి సంగీతపుపెట్టి యొక్క మెట్లుగల పైభాగమున్నది. గదియొక్క సరంబి యిరువది యడుగుల ఎత్తుండ వచ్చును; చక్కని నకిషీతో చెక్కబడిన దూలములతో సరంబీయంతయు దీర్ఘ చతురస్రములుగా విభజింపబడి, దూలములు కలిసిన ప్రతిచోటున అలంకృత మగు బొగడలు వ్రేలాడుచుండుటచే అతిమనోహరముగా గన్పించును. కొంతవరకు గోథిక్ పద్ధతిని బోలియుండి, మధ్య నొక స్తంభము గలిగి, అద్దములేమియులేని యొక కిటికీ పడకగదిలోనికిని, మరి యొకటి పఠనమందిరములోనికిని తెరచుకొనును. పడకగది అతి సామాన్యముగానుండును. ఒకటి సింహతలాటముగను, రెండవది గజతలాటముగను చెక్కబడి చక్కగ నకిషీ చేయబడిన రెండు కర్రదిమ్మలు గోడలో బిగింపబడియుండ, ఆరెండింటి మధ్యను ఉయ్యాలవలె నూగెడు సామాన్యపు పానుపు




చిత్రము 1

యొకటి యమర్చబడియున్నది. ఉపయోగించనప్పుడు పానుపును గోడకు ముడిచి వేయవచ్చును.

పఠన మందిరము వేలాది గ్రంథములను గలిగి బహురమ్యముగా నుండును. గోడలలో రెండు ఎత్తయిన బీరువాలు గలవు. వానినిండ అనేక భాషలలో రచిత మయిన పెక్కు గ్రంథములున్నవి; ఆధునిక యూరోపియను గ్రంథములు కూడ కొన్ని గలవు. వార్తపత్రికలనుంచుటకై తలుపులు లేని యఱలుగలవు. పరమగురువు బహుభాషాజ్ఞాని; ఆంగ్లేయభాషలో గొప్ప విద్వాంసుడగుటయేగాక, ఫ్రెంచి, జర్మన్ భాషలయందు సంపూర్ణ జ్ఞానముగలవారు. మహర్షిగారికి శిష్యులలో నొకరు బహూకరించిన టైపు - రైటరు యంత్రమొకటి గ్రంథాలయములో గలదు.

పరమగురువుల కుటుంబముగురించి నాకు తెలిసినది బహుస్వల్పము. ఒక స్త్రీ గలదు; ఆమె శిష్యురాలగుట స్పష్టమే; ఆమెను 'సోదరి' యని ఆయన పిలుతురు. నిజముగా ఆమె వారికి సోదరియగునో కాదో నాకు తెలియదు. దాయాది కాని, మేనగోడలుగాని అయినను గావచ్చును. వయస్సులో ఆయనకంటె చాల పెద్దదిగా గన్పించును. అంతమాత్రమున అట్టి బాంధవ్యమసంభవముకాదు, ఏలయన చాలకాలమునుండియు నొకే వయస్సుగలవానివలె ఆయన కనబడుచున్నారు. కొంత వరకామె ఆయనను బోలియుండును. మాసమావేశముల సమయములలో నొకటి రెండుసార్లు ఆమె కూడ వచ్చి మాతో కలిసి కూర్చుండెను; కాని ఆమె ప్రధాన కార్యము గృహనిర్వహణమును, నౌఖరులచే పనిచేయించుటయును అయియున్నది. నౌఖరులలో పరమగురువును చాల కాలమునుంచి సేవించుచున్న ఒక వృద్ధుడును, అతని భార్యయుగలరు. వారు తమ యజమానియొక్క నిజప్రభావము నేమియు నెరుగరు. వారాయనను చాల శాంతము, దయ, ఔదార్యము గల పోషకుడని మాత్రము తలచెదరు. వారాయన యొద్ద సేవ జేయుచుండుటవలన చాల లాభమును బొందుచున్నారు.

## పరమగురువుల కార్యకలాపములు

పరమగురువున కొక పెద్ద స్వంతతోటగలదు; ఆయనకు కొంత స్వంతభూమి గూడ కలదు. నౌఖర్లచే దానిని సాగుచేయించెదరు. ఇంటిదగ్గర పుష్పములుపూయు పొదలుగలవు. లెక్కలేనిపుష్పములు స్వేచ్ఛగ బూయుచుండును. ఆతోటగుండా యొక సెలయేరు ప్రవహించి తుదకొక చిన్న జలపాతమగును. దానిపై నొక చిన్న వంతెన కట్టబడినది. పరమగురువు తరుచు ఇచ్చట కూర్చుండి భావతరంగములను,

ఆశీర్వాదములను తమ ప్రజలపై ప్రసరింపజేయుచుందురు. ఆకస్మికముగా జూచు వానికి ఆయన ప్రకృతిని జూచుచు, విహంగములగానమును, సెలయేటి జలముల చిందులను దొర్లింతలను అలక్ష్యముగా వినుచు నిర్వ్యాపకముగా కూర్చుండిరని తోచవచ్చును. అప్పుడప్పుడాయన తమ పెద్ద పడకకుర్చీలో గూడ విశ్రమింతురు. ఆయననట్లుజూచినప్పుడలికిడి చేయకూడదని అందరకు తెలియును; అప్పుడు ఆయన ఏమిచేయుచున్నది తెలియకపోయినను సమాధిలో నుందురని అనుకొందురు. ప్రాచ్య దేశములలోని జనులు ఈమాదిరి ధ్యానమును తెలిసికొని గౌరవింతురన్న విష యమే పరమపురుషులు పాశ్చాత్య దేశములలోకంటె ప్రాచ్య దేశములలోనే నివసిం చుట కిష్టపడుటకొక ముఖ్యకారణమై యుండవచ్చును.

ఈరీతిగ పరమగురువు ప్రతిదినము చాలసేపు ప్రశాంతముగ కూర్చుండి ధ్యానము చేయుచుండ మనము దాని ఫలితమును బొందుచున్నాము. కాని ఆయన అంత నెమ్మదిగా విశ్రమించుచున్నట్లు పైకి కనిపించినను వాస్తవముగా కాలమం తయు ఊర్ధ్వలోకములలో వివిధములగు ప్రకృతిశక్తులను నడుపుచు, ఏకకాలమందు వేలకొలది ఆత్మలపై మిక్కిలి భిన్నములగు శక్తులను వర్షింపజేయుచు, అత్యంత శ్రమ కరమగు కార్యనిర్వహణములో గడుపుచుందురు. ఏలయన, ప్రపంచములో నిత్యము శ్రమపడి పనిచేయువారలలో పరమపురుషులగ్రగణ్యులు. పరమగురువు భూలోకము నకు చెందిన కార్యమును గూడ చాల జేయును. ఆయన కొంత సంగీతమునుకూర్చిరి. అనేకవిషయములపై వ్యాఖ్యలను, వ్యాసములను వ్రాసిరి. భౌతికశాస్త్రపురోవృద్ధి పరమగురువులలో మరియొకరి ప్రత్యేకశాఖయైనను, దానియందు కూట్‌హూమి మహర్షి గారికి చాల యభిమానముగలదు.

ఆయన తరుచు గౌరవర్ణముగల పెద్దగుఱ్ఱముపై స్వారిచేయుచుందురు; అప్పు డప్పుడు మోర్యమహర్షి గారితో కలిసిపనిచేయవలసిన సమయములలో ఇరువురును కలిసిపోవుచుందురు. మోర్యమహర్షి గారెల్లప్పుడు దివ్యమైన శ్వేతాశ్వముపై స్వారి చేయుదురు. కూట్‌హూమిగారు కొన్ని మఠములను తప్పక దర్శించుచుందురు. అప్పు డప్పుడు కొండలలో నేకాంతముగానున్న యొకమఠమును దర్శించుటకై యొక సన్నని కొండబాటద్వారాపైకిపోవుదురు. వారి నిత్యకార్యనిర్వహణములో స్వారి చేయుటయే వారి ప్రధాన వ్యాయామమైనట్లుకనిపించును, కాని అప్పుడప్పుడు జ్వాల్‌కుల్ మహర్షి గారితో కలిసి కాలినడకను కూడ బోయెదరు. జ్వాల్‌కుల్ మహర్షి

పీఠభూమికిపోయెడుమార్గములోనున్న పెద్దరాతి శిఖరమునకు చాల దగ్గరనే స్వహస్తములతో నిర్మించుకొన్న చిన్న కుటీరములో నివసింతురు.

తరుచు మన మహర్షి గారు తమ గృహములోని పెద్దగదిలోనున్న సంగీతపు పెట్టెను వాయింతురు. ఆయన ప్రత్యేకముగా దానిని టిబెటు దేశములో పురమాయించి చేయించిరి. దానిని పియానోగాను, ఆర్గనుగానుగూడ నుపయోగించవచ్చును. దాని మెట్లు పాశ్చాత్యసాంప్రదాయకముగనుండును; దానిపైన మన పాశ్చాత్య సంగీతమునంతను కూట్‌హూమిమహర్షి గారు వాయింపగలరు. అది నాకు తెలిసిన జంత్రములన్నిటికంటెను వేరుగానున్నది. అది ద్విముఖముగా నున్నది; దానిని పెద్ద గదిలోనుండియు పఠనమందిరములో నుండియు రెండు వైపుల నుండియు గూడ వాయించవచ్చును. ప్రధానమగు మెట్లు పెద్దగదిలోనున్నవి; పియానో యొక్క మెట్లుగలబల్ల పఠనమందిరములోనున్నది. ఈ మెట్లుగలబల్లలన్నియు కలిపిగాని, వేర్వేరుగాగాని ఉపయోగింపవచ్చును. పెద్దగదిలో కూర్చుండి పాదములతో మీటలను త్రొక్కుచు మామూలుగా ఆర్గను మీద వాయించవచ్చును; కాని బొంగడ వంటి యొకపిడిని త్రిప్పిన యెడల పియానో జంత్రమును ఆర్గనుకు లంకెవేయవచ్చును. అప్పుడు రెండు జంత్రములు కలిసిమ్రోగును. ఆరీతిగజూచిన ఆర్గనుకు పియానో యొక అదనపు మెట్టువలెనుండును.

గ్రంథాలయములోనున్న మెట్లపైన వాయించినచో ఆర్గనుతో సంబంధము లేకుండ ప్రత్యేకముగా పియానో మాత్రమే వాయించవచ్చును. కాని యేదో విచిత్రమగు యంత్రానుబంధముచేత పియానో మెట్ల బల్లకు కోయిర్ — ఆర్గనుకు కూడ లంకెవేయబడినది. అందుచేత పియానోను మామూలు పియానోవలెనే ప్రత్యేకముగా వాయించవచ్చును. కావున, ఇరువురుగాయకులు చెరియొక గదిలోను కూర్చుండి చెరియొక మెట్లబల్లమీదను వాయించుచు పియానో - ఆర్గనుల జంట వాయిద్యమును వాయించవచ్చును. ఈ విచిత్రపు జంత్రముయొక్క యంత్రములున్ను గొట్టములున్ను ఆయింటిభాగముయొక్క పై అంతస్తంతయును వ్యాపించియుండును. పరమగురువు తన యోగశక్తిచే జంత్రమునకు ఆకర్షణశక్తిని గలుగచేసి గంధర్వులతో సంబంధమును కల్పించిరి. అందుచే ఆజంత్రము నెప్పుడువాయించినను గంధర్వులు కూడ సహకరింతురు; కనుక భూలోకములో నెన్నడు వినియెరుగని స్వరసమ్మేళనము

లను వినవచ్చును. అంతేగాక ఆర్గను వాయించినప్పుడు తీగెజంత్రము, వాయు జంత్రము రెండునుగూడ జంటగా వాయించునట్లనిపించును.

గంధర్వు లెల్లప్పుడును గానముచేయుచు నేయున్నారు; అది మానవులకెల్లప్పుడును ధ్వనించుచు నేయున్నది. కాని మానవులు దానిని విని దానిమాధుర్యమును గ్రోలి యానందించరు. సముద్రుని గంభీరమగు పల్లవి గలదు. చెట్ల యాకులసందున పవనుని నిట్టూర్పులుగలవు. మహాగిరి ప్రవాహముయొక్క గర్జనయుగలదు. సెలయేటి యొక్కయు, నదియొక్కయు, జలపాతముయొక్కయు గానముగలదు. ఇవియును ఇట్టి యనేక నితరస్వరములును కలిసి ప్రకృతి యున్నంతకాలము దానియొక్క మహాగానమై విలసిల్లుచుండును. భూలోకములో వినబడెడు యీధ్వని ఆ దేవగణముయొక్క మిక్కిలి ఘనతరమగు గానముయొక్క ప్రతిధ్వనిమాత్రమే అయియున్నది. మోక్ష మార్గప్రదీపికలో చెప్పినట్లు

"నీవు మానవమాత్రుడుగానుండునంతవరకు ఆమహాగీతములో కొంతభాగము మాత్రమే నీచెవికందును. కాని నీవు వినియున్నచో, శ్రద్ధగా దానిని జ్ఞాపకముంచుకొనుము; నీచెవినిబడినదానిలో నేమాత్రమును మరువకుము; దానివలన నిన్నావరించియుండు మర్మమును తెలిసికొన ప్రయత్నింపుము. కాలముగడచినపిమ్మట నీకు గురువుయొక్క అవసరముండదు. ఏలయన, వ్యక్తికి వాణి యున్నట్లుగానే, యేదైతే వ్యక్తికి నిలయమగుచున్నదో దానికిగూడ వాణిగలదు. చైతన్యమునకే వాణిగలదు; అది యెన్నడును నిశ్శబ్దముగా నుండునదికాదు. బధిరుడవైన నీవు దానినాదమును రోదనమని తలచెదవేమో, అట్లుకాదు. అది గీతము. నీ వా సామరస్యములోని అంశమేయని తెలిసికొనుము. సామరస్యధర్మముల ననుసరించవలెననికూడ దానినుండి నేర్చుకొనుము."

ప్రతిరోజునను ఉదయమున కొందరుమనుష్యులు — వీరు అనుచరులుగాని, శిష్యులనదగినవారుకారు— మహర్షి గారి గృహమునకువచ్చి వసారామీదను, దానికి బైటను కూర్చుందురు. ఒక్కొక్కప్పుడు ఆయన చిన్న ఉపన్యాసమువలె కొద్దిగ మాట్లాడెదరు; కాని తరుచుగా సుహృదునివలె మందహాసమును గనబరచుటతప్ప వారలవైపు చూడక తనపనిమీదనే యుందురు. వారలామందస్మితముతోనే సంతుష్టి జెందెదరు. వారందరు పరమగురువుల తేజోమండలములో కూర్చుండి భక్తితో పూజించుటకే వచ్చెదరని తెలియగలదు. సాధారణముగా ఆయనయొక్కరే తన

గదిలో బల్లవద్ద భోజనముచేయుదురు, కాని, అప్పుడప్పుడు వసారామీదకూర్చుండి అచటకూడిన టిబెటుదేశపు అనుచరులును ఇతరులును నేలమీదచుట్టును కూర్చుని యుండ, అందరిసమక్షమున భుజించుటకూడ కలదు. బౌద్ధభిక్షువుల నియమము ననుసరించి అపరాహ్ణముతరువాత ఆయన ఆహారమును తీసికొనరని తలంతును. ఏలయన సాయంత్రముభుజించుట ఎన్నడును జూచినట్లు నాకు జ్ఞాపకములేదు. ప్రతిదినము ఆయనకాహారముదీసికొనుట అవసరము లేకపోవచ్చును. బహుశః నియతమగువేళల యందు భుజింపక, ఆయనకుతోచినప్పుడు కావలసినపదార్థములను తెప్పించుకొని భుజించుచుండవచ్చును. గోధుమ, పంచదార, వెన్నతో అయనసోదరి స్వయముగా తయారుచేసిన సామాన్యమగు గౌరవర్ణముగల తియ్యని, చిన్న, గుండ్రని అపూపములను భుజించుచుండ నేను జూచితిని. అన్నము, కూరలుగూడ ఆయన తినెదరు; కూర, పప్పుపులుసువలె కొద్దిగ పలుచగానుండును. భోజనసమయమందు ఆయన చిత్రమగు చక్కని బంగరుగరిటెను వాడుదురు. దాని కాడచివర నతిరమ్యమగు ఏనుగు విగ్రహముకలదు. ఆగరిటెకుడుక కాడకు విచిత్రమగు వంపుతో నమర్చబడినది. అది వంశపరంపర వచ్చుచున్న కుటుంబాస్తులలో నొకటి; మిక్కిలి పురాతనమైనది, అమూల్యమైనది కావచ్చును. సాధారణముగా ఆయన తెల్లనిదుస్తులను ధరింతురు, గెలుగ్పా తెగవారి కాషాయిదుస్తులను ధరించు అరుదగు సందర్భములలో ఆయన రోమనుల కుళాయినిబోలిన పడగవంటి తలపాగాను ధరింతురు. మరెప్పుడును ఆయన ఎట్టి శిరోధారణమును చేసినట్లు నాకు జ్ఞప్తిలేదు. మూర్యమహర్షిగారు సామాన్యముగా తలపాగాను ధరింతురు.

## ఇతరగృహములు.

లోయకెదురుగా, చాల దిగువను, గృహద్వారమునకు చిన్న దేవళమునకు బహుదగ్గరగా మోర్యమహర్షిగారి గృహముకలదు. దానికట్టడముపద్ధతి కేవలము వేరుగానున్నది. దానికి అధమము రెండంతస్తులుగలవు. వీధివైపున ప్రతి అంతస్తులోను, అద్దములతోగప్పబడిన వసారాలుగలవు. మోర్యమహర్షిగారి జీవితపద్ధతి, ఏర్పాట్లు చాలవరకు కూట్‌హూమిమహర్షిగారిపద్ధతినే బోలియుండును.

ఏటికి యెడమవైపుననున్న రోడ్డుమీదుగాలోయవారనే యెగువకు పోయిన యెడలకూట్‌హూమిగారిగృహమున్ను, స్థలమున్ను గనబడును. ఇంకను కొంచెముకొండ పైకిపోయిన యెడల రోడ్డుకు ఆవైపుననే జ్వాల్‌కుల్ మహర్షిగారు తమ శిష్యత్వ

కాలములో తమ పరమగురువునకు దగ్గరగా స్థిరనివాసమేర్పరచుకొనుటకై స్వహస్తములతో నిర్మించుకొన్న చిన్నకుటీరము కనబడును. ఆకుటీరములో ఒక విధమగు ఫలకము వ్రేలాడుచుండును. ఆఫలకముపైన కూట్‌హూమిగారి ఆంగ్లేయ శిష్యులలో నొకరు జ్వాల్‌కుల్‌గారి కోరికపైన చాల సంవత్సరముల క్రిందట యోగశక్తిచే ముద్రించేసిన కూట్‌హూమిగారి గృహములోని పెద్దగదిలోపలి దృశ్యముయొక్క చిత్రముగలదు. ఆచిత్రములో అనేకమంది పరమగురువులయొక్కయు, శిష్యుల యొక్కయు బొమ్మలుగలవు. అది కూట్‌హూమిమహర్షిగారి యింటియొద్ద మిక్కిలి ఆనందకరముగను, ఫలదాయకముగను, గడిపిన ఒక సాయంత్రముయొక్క స్మారక చిహ్నముగా తయారుచేయబడినది.

## ప్రథమరేఖకు చెందిన సిద్ధపురుషులు

ఈమహాపురుషుల శరీరాకారములను బరిశీలించిన యెడల వారు చెందిన రేఖనుబట్టి కొన్ని భేదములుండునని తెలియగలదు. ప్రథమరేఖకు చెందినవారిలో మిక్కిలి ప్రధానమైనలక్షణముశక్తి. ఆంతరంగిక ఆధ్యాత్మికలోకములోను, భూలోకములోను, రాజులు, పరిపాలకులు, దేశాధిపతులుగానున్న వారందరు ప్రథమ రేఖలో జన్మించినవారే. ఎవనిలోనయిన మానవులను లోబరచుకొని వారిని తన యిచ్ఛవచ్చిన మార్గమున నెమ్మదిగా నడుపుటకువలయు లక్షణములు మిక్కిలి అసాధారణముగా బ్రకాశించుచున్నయెడల, అతడు ప్రథమరేఖకుచెందినవాడుగాని, ఆరేఖలక్షణములను వికసింపచేసికొనుచున్నవాడుగాని అయియుండును.

అయినవ మూలజాతికధిపతియు, మనువును అగు వైవస్వతప్రభువు పరమ పురుషులందరిలోను మిక్కిలి పొడుగైనవారు. ఆయన దేహము ఆరడగుల యెనిమిదంగుళముల పొడుగుగలిగి,పరిపూర్ణమగు అంగసౌష్ఠవముగలిగి రాజఠీవితోనుండును. ఆయన మన ఆర్యజాతికంతకు రూపమున ప్రధానపురుషుడు, ఆదర్శమగు రూపము గలవారు. మనజాతిలోని ప్రతివ్యక్తియు సరాసరిగ ఆయనసంతతిలో బుట్టినవారే. ఆమనువునకు గొప్పప్రభావము దెలియజేయు ఆకర్షణీయమగు వదనము, గ్రద్ద ముక్కువంటిముక్కు, పింగళవర్ణముగల నేత్రములు, దట్టముగను పొడవుగనుపెరిగి క్రిందకు వ్రేలాడు కపిలవర్ణముగల గెడ్డమును, మృగరాజు శిరమువలె అద్భుతమగు ఠీవిగల శిరస్సును గలవు. "ఆయన పొడుగరి, రాజోత్తమునివలె ఠీవిగలవారు, బంగారు జ్యోతులవలె ప్రకాశించుచు డేగ కండ్లవంటి హృద్భేద్యములగు పింగళ

నేత్రములుగలవారు" అని ఆయనను మన అధ్యక్షులు—డాక్టరు బిసెంటు—వర్ణించిరి. ప్రస్తుతమాయన హిమాలయపర్వతములలో వారిసోదరులు మైత్రేయ ప్రభువు యొక్క గృహమున కనతిదూరముననే నివసించుచున్నారు.

ప్రభువు వైవస్వతమనువున కిప్పుడు కుడిభుజమువలెనుండి, తరువాత నా పదవికిరానున్న వారును, భవిష్యత్తున ఆరవమూలజాతికి మనువుననగు మోర్యమహర్షి గారికికూడ నట్టిరూపముగలదు. జన్మచే ఆయన రాజపుత్ర ప్రభువు; ఆయనకు నల్లని పెద్ద గడ్డము గలదు; అది రెండు భాగములుగా చీలియుండును; శిరోజములు కడునల్లనై భుజముల మీాదికి వ్రేలాడుచుండును; ఆయన నేత్రములు నల్లనై, శక్తి పూరితములై హృద్భేద్యములుగా నుండును. ఆయన ఆరడుగుల ఆరంగుళముల ఎత్తు గలిగి యోధునివలెగన్పట్టుచుండును. తన ఆజ్ఞలు తత్క్షణమే మన్నింపబడుట కలవాటుపడినవానివలె సంక్షిప్తములగు చిన్నవాక్యములలో మాట్లాడుదురు. ఆయన సమక్షమందు అపారమగుశక్తి, బలము ఉన్నదనుభావము కలుగును. చూచువారలలో అతి గాఢమగు పూజ్యభావమును నెలకొలుపునట్టి రాచఠీవి ఆయనలోగలదు.

మోర్యమహర్షిగారు చాలమంది హిందూదేశసంస్థానాధిపతులతో ప్రథమ అంతర్జాతీయ ప్రదర్శనమునకు హాజరగుటకై 1851 సంవత్సరములో ఇంగ్లాండు దేశమునకు వెళ్ళినప్పుడు లండను నగరములో హైడ్‌పార్కులో ఆయనతో నామెకు కలిగిన సమావేశము గురించి మేడమ్ బ్లవట్‌స్కీగారు అనేకసార్లు మాకుచెప్పిరి. నాకేమియు తెలియకుండగనే అప్పటికి నాలుగేండ్ల వయస్సుగల నేను గూడ వారిని చూచుట చాల ఆశ్చర్యకరమైన విషయము. విలువగలదుస్తులను ధరించి అశ్వారూఢులైన భారతీయులతోను, అనేక ఇతర వింతలతోను గూడి శోభాయమానముగనుండిన ఆయూరేగింపునుజూచుటకై నన్నుగూడ మాతండ్రిగారు తీసికొనిపోవుట నాకు జ్ఞప్తికలదు. ప్రపంచములో నెటువంటి గుఱ్ఱముల కయినను తీసిపోని చక్కని హయములపై స్వారిచేయుచు శోభిల్లుచుండిన యాశ్వికులపై గొప్ప ఆనందముతో నాబాల్యదృష్టినిలిచిపోయినదన్నను, దేవతాప్రదర్శనమువలె నతివిచిత్రముగనున్న ఆనాటిదృశ్యమంతటిలో వారే నాకతిమనోహరమగు భాగముగా దోచెనన్నను, ఆశ్చర్యమేమున్నది ? నేను నాజనకుని చేయి బట్టుకొని నిలువబడి చూచుచుండగా వారు నెమ్మదిగామమ్ము దాటిపోవుచుండిరి. అప్పుడా వీరులలో మిక్కిలి పొడవైనవారిలో నొకరు ప్రకాశవంతమగు నల్లని నేత్రములతో నావైపు తేఱి

చూచిరి. అప్పుడు నాకుకొంత భయము కలిగినను వర్ణనాతీతమగు ఆనందముతోను, ఉన్నతితోను నాహృదయమునిండిపోయెను. ఇతరులతోపాటు ఆయన గూడ మమ్ము దాటిపోయిరి. నేనాయనను తరువాత జూడలేదు, అయినను ఆమహాపురుషుని మెఱపువలె మెఱసిన నేత్రముల దృశ్యము నాబాల్యస్మృతికి తరుచుగవచ్చుచుండెను.

ఆయనయెవరో అప్పటికి నాకేమియు తెలియకబోవుట నిశ్చయమే. చాల సంవత్సరములతరువాత ఆయనదయతో నాకావిషయమును జెప్పిరి.అట్లావిషయమును ఆయన చెప్పియుండనిచో నేనాయనను ఎన్నటికి గుర్తించియుండకపోవుదును. ఒకసారి ఆయన సమక్షమందు సమాజముయొక్క ప్రారంభదినములనుగురించి ముచ్చటించుచు, అడయారులో మేడమ్బ్లవట్స్కీగారి గదిలోకి ఆమెకుధైర్యముచెప్పి కొన్ని ఆదేశముల నిచ్చుటకు మోర్యమహర్షిగారు దయచేసినప్పుడు నేను ఆయనను స్థూలదేహములోనుండగా మొదటిసారి జూచితినని అంటిని. ఇతర పరమపురుషులతో సంభాషించుచున్న మోర్యమహర్షిగారు నావైపు తీక్షణముగాజూచి "కాదు, అది మొదటిసారి కాదు. స్థూలశరీరములో నన్నంతకుపూర్వ మొకసారి చూచితివి. నీవు పసిబిడ్డగా నుండినపుడు హైడ్‌పార్కులో భారతీయాశ్వికులు స్వారిచేయుచు బోవుచుండగా జూచినసంగతి నీకు జ్ఞాపకములేదా? అప్పుడు నేను నిన్ను ప్రత్యేకించిచూచుట నీవు గమనించి యుండలేదా?" అనిరి. తత్క్షణమే అంతయు జ్ఞాపకమువచ్చెను. "ఓ గురుదేవా! తమరేనా వారు? నేనాసంగతి యిదివరకే తెలిసికొని యుండవలసినది" అని నేను బదులుచెప్పితిని. ఈవిషయమును నేనును మోర్యమహర్షియును గూడ స్థూలశరీరములో నుండగానే, ఆయనను కలిసికొని మాట్లాడినసందర్భములలో నొకటిగా చెప్పుటలేదు. ఏలయన, గుఱ్ఱముపైస్వారిచేసిన ఆమహాపురుషుడు పరమగురువు అని అప్పుడు నాకు తెలియదు. అంతేగాక, అంతచిన్నబిడ్డయొక్క సాక్ష్యమును లోకము శంకించుటయు, నిరాకరించుటయు సహజము.

ప్రథమాధ్యాయములో నుదహరించబడిన యస్. రామస్వామి అయ్యరుగారు తన అనుభవమును ఈక్రిందివిధముగ దెలిపిరి:

"పట్టణమునుండి సులభముగా నాసన్యాసివేషములో టిబెటు దేశమునకుదాటి పోగలనని మార్గస్థులు నాకు ధైర్యముచెప్పియుండుటచేత నేను పట్టణమునకు పోవు మార్గమున పోవుచుంటిని. అంతలో నాకెదురుగ అతివేగముగా స్వారిచేయుచు నొంటరిగావచ్చుచున్న అశ్వారూఢు నొకనిని ఆకస్మికముగా కనుగొంటిని. ఆయన

ఆజానుబాహుత్వము, స్వారిచేయుటలోగల చతురతజూచి సిక్కిమ్‌రాజ్యములోని యొక సైన్యాధికారియని తలచితిని. ఆయన నన్ను చేరగనే గుజ్జమునాపెను. నేను ఆయనవైపు జూచితిని, ఆక్షణమందే గుర్తించితిని ...... దివ్యజ్ఞాన సమాజ ప్రధాన కార్యాలయముయొక్క ముందరిడాబాపైన కామమయ శరీరములోనుండగా ఇదివరలో నే నెవరినిజూచితినో, ఆమహాత్మునియొక్క, పూజ్యులగు నాపరమగురువుయొక్క దివ్య సన్నిధినియుంటిని. గతడిశెంబరు నెలలో చిరస్మృతమగు నారాత్రియందు, అంతకొక గంటకు పూర్వము మేడమ్ బ్లవట్‌స్కీగారికి కవరులోపెట్టి ముద్రవేసి నేనిచ్చిన జాబునకు (బ్లవట్‌స్కీగారు కదలక నాకండ్లయెదుటనే కూర్చుని యుండగా) కృపతో ఆమెద్వారా జవాబుపంపిన హిమగిరి సోదరుడు ఆయనే. ఆక్షణమందే నేను ఆయన పాదారవిందములకు సాష్టాంగప్రణామం బొనరించితిని. ఆయన ఆజ్ఞానుసారము లేచి, కండ్లారవారిదివ్యవదనమును జూచుచు, కల్నల్ ఆల్కాటుగారియొద్దనున్న చిత్రపటమును లెక్కలేనిసార్లు జూచుటచే నాకు బాగుగా పరిచితమైన ఆపరమగురువు విగ్రహమును మనమున దలంచుచు నెమఱచితిని. ఏమనుటకును నాకుతోచలేదు; భక్తి ఆనందము నోరాడకుండ జేసినవి. శక్తియు, ప్రజ్ఞయు మూర్తీభవించినట్లు గనబడిన వారిరూపప్రభావము నన్ను సంభ్రమమున ముంచివేసెను. హిమాలయ పర్వతశ్రేణి లోనివసించు ఆమహాత్ముని తుదకు ముఖాముఖిగ సందర్శించితిని. ఆయన మాయా కల్పితముకాదు, సంశయాళువులు కొందరు సూచించినట్లు భూతావేశములకు అనువైనవారి ఊహాసృష్టికాదు, రాత్రివేళగన్నకలకాదు. పగలు తొమ్మిది - పది గంటల మధ్య సూర్యుడు ప్రకాశించుచుపైనుండి మానముతో జూచుచుండెను. రక్తమాంసములుగల శరీరములో నేను ఆయనను జూచుచుండ, ఆయన కృపతో నెమ్మదిగా నాతో మాటలాడుచుండిరి. ఇంతకుమించి నాకేమి కావలెను? ఆనందాతిశయము నన్ను ముగ్ధునిజేసెను. కొంతకాలము గడచినపిమ్మట, ఆయన మృదుభాషణములచే ధైర్యము గలిగి నోరు తెరచి కొద్దిమాటలు పలుకగలిగితిని. ఆయన శరీరఛాయ కూట్‌హూమిమహర్షిగారి ఛాయ యంత చక్కనిదికాదు; కాని అంత సుందరమైన ముఖాకృతినిగాని, అంత పొడవు అంత రాజఠీవిగల రూపమునుగాని నేనెన్నడును జూచియుండలేదు. చిత్రపటములో నున్నట్లుగానే, ఆయనకు నల్లని కుఱుచగడ్డముండెను; వారి నల్లని శిరోజములు పొడుగుగానుండి రొమ్మువరకు వ్రేలాడుచుండెను. వారి దుస్తులు మాత్రము వేరుగానుండెను. తెల్లని వదులగు అంగీకి బదులువారు

ఉన్నితో అస్తరువేయబడిన పసుపుపచ్చని యుత్తరీయమును కప్పుకొనిరి. తలపాగాకు బదులు కొందరు భూటాన్ దేశీయులు ధరించెడు పసుపుపచ్చని టిబెటు దేశపు బనాతు టోపీని ధరించిరి. ఆశ్చర్యానందములతో గూడిన ప్రథమోద్వేగము తగ్గి సంగతి యంతయు నెమ్మదిగా గ్రహించిన తరువాత ఆయనతో నేను చాల సేపు ముచ్చటించితిని." *

నాల్గవమూలజాతికధిపతియును, చీనాదేశీయులలో ఉత్తమవర్గమునకు చెందిన వారును అగు చక్షుషమను ప్రభువుకూడ అట్టి రాజఠీవి గల రూపముగలవారే. మంగోలియనులకువలె ఆయన దవడ ఎముకలు ఎత్తుగానుండును. సాధారణముగ నిండు జరీతో శోభించెడు దివ్యమగు దుస్తులను ధరింతురు. వారి మూలజాతికిచెందిన శిష్యునితో వ్యవహరించవలసివచ్చినప్పుడుతప్ప మా నిత్యకార్యక్రమములో సామాన్యముగ ఆయనను కలిసికొనము.

## రెండవ రేఖకు చెందిన పరమ పురుషులు

జగద్గురువును, బోధిసత్వులునునగు మైత్రేయ ప్రభువుయొక్కయు, ఆయన ప్రధాన సహోద్యోగియగు కూట్‌హూమిమహర్షి గారి యొక్కయు రూపములను జూచినయెడల సర్వసంశ్లిష్టమగు వారి ప్రేమయొక్క శోభ ప్రత్యేకముగా గన్పట్టును. ప్రస్తుతము మైత్రేయప్రభువు కెల్టిక్ జాతిశరీరమును ధరించియున్నారు. కాని తనప్రజలకు బోధించుటకై భూలోకమున నవతరించునపుడు — కొద్దికాలములో ఆయన రానుద్దేశించి యున్న ప్రకారము ఆయన శిష్యులలో నొకరిచే తయారుచేయబడు శరీరము నుపయోగింతురు. ఆయన వదన మద్భుతమగు సౌందర్యముకలది. బలము గలిగినను కరుణాపూరితమయినది; మేలిమి బంగారువలె చక్కని దట్టమగు కేశములు ఆయన భుజయుగ్మముపై పడుచుండును. వారిగెడ్డము కొన్ని పురాతనచిత్రపటములలోవలె కొనదేలియుండును. ఆయన నేత్రములు అద్భుతమగు నూదారంగుగలిగి, కనల కుసుమములవలె ఉజ్జ్వలతారలవలె, అనంతశాంతి యను జలముతోనిండి, లోతు, పవిత్రమునగు మడుగులవలె ప్రకాశించుచుండును. వారిమందహాసము మాటల కతీతమై భాసిల్లుచుండును. ప్రేమస్వరూపునినుండి సదా

---

*అయిదు సంవత్సరముల దివ్యజ్ఞానము అను గ్రంథముయొక్క 2 వ ముద్రణము— 284 వ పుట.

ప్రకాశితమగు అద్భుతమైన గులాబిరంగుగల వెలుగుతో మిళితమైన కన్నుల మిఱుమిట్లు గొలుపు కాంతి శోభ ఆయన నావరించియుండును.

మైత్రేయులవారిని ఊహించవలెననిన, హిమగిరిపై నెత్తుగనున్న ఒక గృహములో అనేక కిటికీలుగలిగి క్రిందనున్న తోటలను, ఉన్నతప్రదేశములను, వానికి చాల దిగువనున్న భారతదేశ మైదానములను చక్కగా గనిపింపజేయు ముందు పెద్ద గదిలో కూర్చుండియున్నట్లుగాని, వెడల్పగు జరీఅంచులుగలిగి వదులుగా జీరాడు తెల్లనిదుస్తులను ధరించి చల్లని సాయంసమయమున తన పుష్పవనములోని వాతావరణమునంతను మనోహరమగు సౌరభముతో నింపుచు రాజిల్లెడు దివ్యకుసుమచయములమధ్య పచారుచేయుచున్నట్లుగాని మనమూహింపనచ్చును. పూజ్యులగు మన క్రీస్తుప్రభువుయొక్క మహాత్వ్యము ఊహాతీతము, వర్ణనాతీతము అయియున్నది. కోట్లాదిప్రాణులకు సుఖము గలుగజేయు ప్రేమ వారినుండి ప్రవహించును; దేవతలకును మానవులకునుగూడ శాంతి నొనగూర్చుచు, మానవుడెన్నడును పలికి యెరుంగని రీతిని సద్బోధలజేసినది ఆయన వాణియే. బహుకొద్దికాలములో ఆవాణి తిరిగి వినబడును, ఐహికములగు దుష్టమార్గములలో జీవించుచున్నవారు తిరిగి ఆప్రేమను గోరలెదరు; ఆయన యాగమనమును నిరీక్షించుచు, ఆయన వచ్చినప్పుడు తగురీతిని స్వాగతమిచ్చి భక్తివిశ్వాసములతో సేవించుటకు మనమందరము సంసిద్ధులమయ్యెదముగాక !

కూట్‌హూమిమహర్షిగారు కాశ్మీరదేశపు బ్రాహ్మణుని శరీరములోనున్నారు. ఛాయలో సామాన్య ఆంగ్లేయునివలె తెల్లగానుందురు. ఆయనకుగూడ పొడుగగు వ్రేలాడు శిరోజములు గలవు; ఆయన కండ్లు నీలవర్ణముగలిగి సంతోషముతోను ప్రేమతోను నిండియుండును. ఆయనజుట్టు, గెడ్డముకూడ గోధుమవర్ణముగలిగి సూర్యరశ్మి సోకినపుడు బంగరురంగు తళుకులతో మెఱయుచు నెఱ్ఱగానుండును. ఆయన ముఖమును వర్ణించుట కొంచెము కష్టమనిపించును; ఏలయన, ఆయన మందహాసము జేసినపుడెల్ల వర్చస్సు మారుచుండును; ఆయన ముక్కు చక్కగా సన్నముగా మలిచినట్లుండును; నేత్రములు విశాలమై అద్భుతమగు నీలవర్ణముగలిగి యుండును. మైత్రేయప్రభువువలెనే కూట్‌హూమిగారుకూడ ఆచార్యులు, పురోహితులు; పెక్కు శతాబ్దములు గడచినతరువాత ఆయన ఉన్నతపదవిని ఈయన స్వీకరించి జగద్గురువుయొక్క అధికారమునుబూని యారవమూలజాతికి బోధిసత్త్వులగుదురు.

## ఇతర రేఖలు

మహా-చోహానుగారికికూడ, యోధుని లక్షణములనేకములున్నను, ఆయన రాజ్యాంగవేత్తవలెను, గొప్ప కార్యనిర్వాహకునివలెను గనిపింతురు. ఆయన భారతీయుని శరీరములో నున్నారు. పొడుగై, పలుచనైన శరీరము, బహుచక్కని విస్పష్టమగు లక్షణములుగల యాకృతిగలవారై, ముఖముమీద వెంట్రుకలేమియు లేకయుందురు. పలకలుదేరి బలమైన గడ్డముగలిగియుండుటచే ఆయన ముఖమొకింత కఠినముగ గనబడును. ఆయన నేత్రములు లోతుగనుండును, దృష్టి చొరుచుకొని పోవుచున్నట్లుండును. ఆయన యోధునివలె ఒకింత తొందరగా మాట్లాడుదురు. సాధారణముగా భారతీయదుస్తులను, తెల్లని తలపాగాను ధరింతురు.

పరమగురువు కౌంటు. డి. సెంటు జెర్మేన్‌గారు పెక్కువిధముల మహా-చోహానునుబోలియుందురు. ఈయన అంత పొడుగరి కాకపోయినను నిటారుగ యోధునివలె నడచును; పదునెనిమిదవ శతాబ్దమునాటి శ్రీమంతునివలె ప్రశస్తమగు సౌజన్యతను, ఠీవిని గలిగియుందురు. ఆయనను జూడగనే ఒక పురాతనప్రభు కుటుంబమునకు చెందియుండవలెనని అనుకొందుము. ఆయన కండ్లు విశాలములై గోధుమవర్ణము గలిగియుండును; వానిలో శక్తిని సూచించు లక్షణమున్నను, అతికరుణతోను సరసత్వముతోను నిండియుండును. శోభస్కరమగు ఆయన దివ్యసన్నిధిని మనుజులు నమస్కరించి తీరుదురు. ఆయన వదనము 'ఆలివు' రంగుగానుండును. ఆయన తలవెండ్రుకలు కొంచెము యెరుపుగానుండి, దగ్గరగా కత్తిరింపబడి, మధ్యపాపటతో వెనుకకు దువ్వబడియుండును. ఆయనకు చిన్న కోలగెడ్డముకలదు. ఆయన తరుచుగా జరీ చమికీగల నల్లని దుస్తులను ధరింతురు; తరుచు శోభాయమానమగు ఎఱ్ఱని సైనిక అంగీనికూడ వానిపైన ధరింతురు. ఇవన్నియు ఆయన యోధాకృతిని ఎక్కువగా స్ఫుటపరుచును. ఆయన మామూలుగా అనేక శతాబ్దములనుండియు వారి కుటుంబమునకు చెందిన తూర్పు ఐరోపాలోని పురాతనమగు కోటలో నివసింతురు.

పరమగురువు సెరాపిస్‌గారు పొడుగుగానుండి చక్కని దేహచ్ఛాయగలిగియుందురు. ఆయన జన్మచే గ్రీసు దేశీయులు, అయినను ఆయనపని యంతయు ఈజిప్టులోను, ఈజిప్షియను లాడ్జికొరకును చేయుచున్నారు. ఆయన మహాపురుషునివలెను,

తపస్వివలెనునుండి, కీర్తిశేషులయిన కార్డినలున్యూమనుగారిని కొంతవరకు పోలి యుండురు.

సోదరకూటమునందలి సభ్యులందరిలోను మిక్కిలి సుందరమైనవారు వెనీషి యనుచోహాన్‌గారని చెప్పవచ్చును. ఆరడుగుల అయిదంగుళముల ఎత్తుగల పొడు గరియై, మనువుగారివలెనే పెద్ద గెడ్డమును, బంగారురంగుగల జుట్టునుగలిగియుండురు. ఆయనకండ్లు నీలవర్ణముగనుండును. ఆయన వెన్నిసునగరములో పుట్టినను, ఆయన రూపమునుబట్టి స్పష్టముగా గోథిక్ జాతికి చెందినట్లు కనబడుచుండుటచేత ఆయన కుటుంబములో నిస్సంశయముగా గోథిక్ జాతిరక్తము ప్రవహించుచున్నదని చెప్ప వచ్చును.

హైలేరియను మహాత్ముడు గ్రీసు దేశీయులు. ఆయన ముక్కు కొద్దిగ గరుడ ముక్కువలెనుండును గాని, పురాతన గ్రీసు దేశీయుల రూపమునే గలిగియున్నారు. ఆయన నుదురు క్రిందుగను విశాలముగను నుండి ప్రాక్సిటెలీస్ నగరములోని హెర్మిసు విగ్రహమును బోలియుండును. ఆయన గూడ అద్భుతమగు సౌందర్యము గలవారే. ఆయన పరమపురుషులలో చాలమంది కంటె చిన్నగా గన్పింతురు.

పూర్వము జీససు అను శిష్యుడుగానుండినవారు ఇప్పుడు సిరియాదేశపుశరీర ములోనున్నారు. ఆయనకు అరబ్బీదేశీయునివలె నల్లనిచర్మము, నల్లనికండ్లు, నల్లని గెడ్డము కలవు. సాధారణముగా తెల్లని దుస్తులను, తలపాగాను ధరింతురు. ఆయన భక్తి రేఖ కధినాధుడయిన పరమపురుషుడు. గాఢమగు సంశుద్ధియును, అడ్డంకులను సహింపని తీవ్రభక్తియును ఆయన రూపమున గనిపించుముఖ్యలక్షణములు. ఆయన లెబనాన్ పర్వతముమీాద ద్రూజులను నొక తెగ సన్యాసులలో గలిసి నివసించు చున్నారు.

మాకు పరిచయముగల పరమపురుషులలో నిరువురు మాత్రము, సిద్ధపురు షులు సామాన్యముగా ధరింతురని (సగౌరవముగ చెప్పుచున్నాను) మనమనుకొనెడు స్థూలదేహరూపమునకు వేరగు రూపములను గలిగియున్నారు. వీరిలో నొకరు, కల్నల్ ఆల్కాటుగారనేకసార్లు పేర్కొనినట్టియు, "మానవుడు — ఎచటనుండి, ఎట్లు, ఎచటకు" అను గ్రంథములో జ్యూపిటరు అను నామము నొసంగబడినట్టియు, భారత దేశమునకు ఆధ్యాత్మికరాజప్రతినిధి అయినట్టియు, అగస్త్య మహర్షి. సోదర బృంద ములో చాలమంది కంటె ఈయన పొట్టియైనవారు; నాకు తెలిసినంతవరకు వారిలో

తల నెరసినవారు ఈయనయొక్కరే. ఈయన నిట్రముగ నిలువబడి, యోధునివలె చులుకుగా, అడుగు తప్పకుండ నడచెదరు. ఆయన గొప్ప భూస్వామి. స్వామి తల్లాప్రగడ సుబ్బారావుగారితో కలిసి నేనాయనను సందర్శించినప్పుడు, నివేదికల నిచ్చి ఆదేశములను దీసికొనుచుండి పెత్తందార్లవలెనున్న మనుష్యులతో ఈమహర్షి వ్యవహారములను చక్కబెట్టుకొనుచుండుట చాలసార్లు చూచితిని. రెండవవారు జ్వాల్ కుల్ మహర్షి. ఈయన కొద్ది సంవత్సరముల క్రిందట ఏ శరీరములో నుండగా జీవన్ముక్తుడాయెనో ఆశరీరమునే ఇంకను ధరించియున్నారు. ఆకారణముచేతనే కాబోలు, ఆశరీరము జీవాత్మయొక్క పరిపూర్ణ ప్రతిరూపమగునట్లు చేయుటసాధ్యము కాలేదు. ఆయనముఖము నిస్సంశయముగా టిబెటను దేశీయుల ముఖలక్షణములను జూపుచున్నది. ఆయనలో వృద్ధాప్యము యొక్క చిహ్నములు గూడ గనబడుచున్నవి.

అప్పుడప్పు డొక పరమపురుషునకు ప్రపంచపు సందడిలో తాత్కాలికముగ నొక ప్రత్యేకకార్యనిర్వహణార్థమై యొక శరీరము కావలసివచ్చును. జగద్గురువు అవతరించునపుడట్టి సందర్భముకలుగును. అప్పుడు మానవాభ్యుదయమునకై ఆయన క్రింది యధికారులుగానుండి ఆయనకు సహాయపడుటకుగాను, చాలమంది ఇతర పరమపురుషులుగూడ నవతరించవచ్చునని మాకు తెలిసినది. ఈమహాపురుషులలో చాలమంది వారిఅధిపతిననుసరించి వారి శిష్యుల శరీరములను తాత్కాలికముగా ఎరవు తీసికొనవచ్చును. కావున వారల యుపయోగార్థమై కొన్ని శరీరములు సిద్ధముగానుండుటావశ్యకము. పరమపురుషులకిదివరకే స్థూలశరీరములుండగా ఈసందర్భమున అన్యశరీరము లెందుకు కావలసివచ్చునని కొందరు విద్యార్థులు ప్రశ్నింపవచ్చును.

## పరిపూర్ణ స్థూలశరీరములు

జీవన్ముక్తిని బొందిన తరువాతగూడ ఈప్రపంచమునందేయుండి, తమ మానవజాతి పరిణామములో ప్రత్యక్షముగా బనిచేసి సహాయపడుటయే తమ భవిష్యత్కార్యమని నిర్ణయించుకొన్న వారికి తమ కార్యార్థమై తమస్థూలశరీరములనుంచుకొనుట అనుకూలముగా గనిపించును. ఈపనులకు తగియుండవలెననిన, ఈశరీరములు అసాధారణములైయుండవలెను. అవి సంపూర్ణమగు ఆరోగ్యము గలిగియుండుటయే గాక,

భూలోకములో ఎంతవరకు జీవాత్మ పరిపూర్ణ స్వరూపమును బొందుటకు సాధ్యమగునో అంత పరిపూర్ణమగు రూపములుగా నుండవలెను.

అట్టి శరీరమును నిర్మించుట తేలికయగుపనికాదు. సాధారణమానవునిజీవాత్మ తన క్రొత్త శిశుశరీరములో బ్రవేశించునప్పుడు, 'ఆంతరంగికజీవితము' అను గ్రంథములో తెలియచేసిన ప్రకారము, ఆశరీరముయొక దేవత (Artificial Elemental) యొక్క అధీనములో నుండును. ఈలోకములో త్వరలో జన్మించబోవురూపమును దిద్దుటలో ఈ దేవతచాలపాటుపడుచుండును; శిశువు పుట్టిన తరువాతగూడ ఆ దేవత శిశువునకు ఆరు—ఏడు సంవత్సరములు గడచువరకు రూపమును దిద్దుచునేయుండును. ఈకాలములో జీవాత్మతనక్రొత్తస్థూల, కామ, మానసిక శరీరములతో క్రమేణా సంపర్కమును వృద్ధిచేసికొనుచు వానికి అలవాటుపడుచుండును. కాని దేవత తొలగిపోవుకాలమువరకు జీవాత్మ స్వతంత్రముగా తన ఉపాధులపై చేయగలిగినపని సాధారణముగా బహుతక్కువ. ఆకాలములో జీవాత్మశరీరముతో తప్పక సంబంధము గలిగి యుండును, గాని దాని యందు శ్రద్ధవహింపక తన యత్నముల కది జవాబు చెప్పగల స్థితికివచ్చువరకు వేచియుండును.

పరమపురుషుని విషయము దీనికి చాలభిన్నముగానుండును. ఆయన అనుభవించవలసిన చెడుకర్మ ఏమియు లేనందున, దేవత చేయవలసిన పనియుండదు; జీవాత్మయే మొదటినుండియు శరీరమును తన అధీనమందుంచుకొని వంశపారంపర్యముచే మాత్రము కట్టుబడి దాని నభివృద్ధిజేయుచుండును. ఇట్లు జరిగినచో బహు సుకుమారము, కోమలమునగు సాధనము నిర్మించుకొనవచ్చును. కాని, దానివల్ల జీవాత్మకు విశేష శ్రమగలుగుటయేగాక కొన్ని సంవత్సరములపాటు కాలమును శక్తిని విశేషముగా వ్యయపరచవలసియుండును. అందుచేతను, ఇతరకారణముల చేతనుగూడ, పరమపురుషులు తప్పనిసరియైనప్పుడుతప్ప యీపనిని బూనుకొనరు; కావున వారు తమ స్థూలశరీరములు సాధ్యమైనంతకాలము నిలిచియుండునట్లు జూచెదరు. మనశరీరములు ముసలివియై, పారంపర్యముగావచ్చిన దౌర్బల్యము, రోగము, ప్రమాదము, ఇంద్రియలోలత్వము, మనోవ్యథ, అమితశ్రమ, మొదలగు అనేక కారణములచే మృతినొందును. పరమపురుషుని విషయములో ఇట్టి కారణము లేమియు నుండవు, అయినను వారి శరీరములు సామాన్యమానవులశరీరములకంటె

అత్యుత్కృష్టముగా పనిచేయుటకు తగినంతశక్తి, ఓరిమిగలిగి యుండునని జ్ఞప్తి యుంచుకొనవలెను.

పరమపురుషులశరీరము లారీతి వగుటచే సామాన్యమానవులకంటె చాలా ఎక్కువకాలము వానిని వారు నిలుపుకొనగలుగుచున్నారు; వానిఫలితమేమన, వారి శరీరముయొక్క వయస్సు పైకికనబడుదానికంటె చాల ఎక్కువగానుండును. ఉదాహరణముగ, మోర్యమహర్షిగారు పైకి ముప్పదియైదు లేక నలుబదిసంవత్సరములుగల నడివయస్సులోనున్న పురుషునివలె నుందురు; కాని ఆయన శిష్యులు ఆయనగురించి చెప్పుకథలనుబట్టి చూడ దానికి నాలుగైదురెట్లు ఎక్కువ వయస్సుగలవారని తెలియగలదు. మేడమ్ బ్లవట్స్కీగారు తన చిన్నతనములో మొదటిసారి ఆయనను జూచినప్పుడు ఆయన సరిగా ఇప్పుడున్నట్లే యుండిరని ఆమె స్వయముగా మాకు చెప్పిరి. మరియు కూట్‌హూమిమహర్షిగారు తమ నిత్యసఖులగుమోర్యమహర్షిగారితో సమానవయస్కులయినట్లు కనిపింతురు; కాని గత శతాబ్దములో పూర్వార్థములో యూరపులో నొక విశ్వకళాశాలలో పట్టము బొందినట్లు చెప్పుదురు. దానినిబట్టి చూడ ఆయన కొంచె మెచ్చుతగ్గుగా శతవర్షజీవియైయుండవలెను. పరమపురుషులు వారిశరీరముల నెంతకాలమువరకు నిలుపుకొనగలుగుదురో హద్దు తెలిసికొనుట కుపాయములేదు; కాని, శ్రుతికర్త చెప్పెడు సప్తతికి రెట్టింపునకుపైగా కాలము సులభముగా నిలుపుకొనుటకు నిదర్శనముగలదు.

అట్లుత్తమకార్యమునకు తగియుండులాగున చేయబడినశరీరము తప్పక సుకుమారముగానుండవలెను. ఆకారణముచేతనే, శరీరమెల్లప్పుడును ఉత్తమముగ బని చేయగలస్థితిలో నుండవలెననిన, దానికి బహుభద్రముగా నుపచారము చేయుచుండవలెను. బాహ్యప్రపంచముయొక్క అసంఖ్యాకములగు స్వల్పరాపిడులకును, అనుకూలముగు స్పందముల సంతతప్రవాహమునకును దానిని లోబరచినయెడల, మన శరీరము వలెనే అదియును శిథిలమైపోవును. కనుకనే పరమపురుషులు సామాన్యముగా ఏకాంతవాసము చేయుచుందురు; మనము దైనందినజీవితమనెడు తుపానువంటి గందరగోళములో వారు బహుఅరుదుగా మాత్రమే కనబడుదురు. జగద్గురువీలోకము నందవతరించునపుడు కుతూహలముతోను, తీవ్రమగు భావోద్రేకముతోను నిండి ఆయనను చుట్టియుండు సుడిగుండములోనికి తనశరీరములను దీసికొనివచ్చినచో,

ఆశరీరముల ఆయుఃప్రమాణము చాల తగ్గిపోవుటయే గాక, అవి బహుసుకుమార ముగా నుండుటచే అనావశ్యకమగు విశేషబాధకు లోనగుటకూడ నిస్సంశయము.

## ఎరవుశరీరములు

ఒక శిష్యుని శరీరమును తాత్కాలికముగ ధరించుటచే పరమపురుషుడీ చిక్కులనన్నిటిని దప్పించుకొనుటయేగాక శిష్యుని పరిణామమును అపారముగా ప్రోత్సహించిన వారగుదురు. ఆయనకవసరము గలిగినప్పుడే, అనగా, ఒక యుపన్యాస మిచ్చుటకో, ప్రత్యేకముగా ఆశీర్వాదమును వెల్లువగా బ్రవహింపజేయుటకో మాత్రము, అయన అట్లొక శిష్యుని శరీరములో బ్రవేశింతురు. ఆయన చేయదలచిన పని పూర్తియైన వెంటనే ఆశరీరమునుండి తప్పుకొందురు; అంతవరకు సూక్ష్మశరీర ములో దగ్గరనేయున్న శిష్యుడు తిరిగి తనశరీరములో బ్రవేశించును. పరమగురువు తన స్వశరీరములోనికిపోయి లోకకళ్యాణార్థమై తన మామూలుపనిని జేసికొను చుందురు. ఈప్రకారము చేయుటచే పరమపురుషుల నియమితకార్యమున కంత రాయము కలుగకపోవుటయేగాక, భూలోకములో జగద్గురువులవారి తరపున, ముక్తి దాయకమగు కార్యనిర్వహణములో సహకారముచేయుట కవసరమైనపుడు వారి కొకశరీరము ఎల్లప్పుడును సిద్ధముగనుండును.

పరమపురుషునకు తనశరీరమును ఎరువిచ్చు భాగ్యము గలిగెడు శిష్యునకిది ఎట్టివిధముగ పరిణమించునో పూర్తిగా గ్రహించుట మనకు సాధ్యము కాకపోయినను, కొంతవరకు సులభముగా నూహింపవచ్చును. పరమపురుషుని ప్రభావముచే సంస్కరింపబడిన శరీరము శిష్యునకు నిస్సంశయముగా గొప్పసహాయము కాగలదు గాని ప్రతిబంధకము కానేరదు. మరియు, పరమపురుషుని కార్యము ముగిసిన వెంటనే తిరిగి స్వాధీనముచేసికొనుటకు శిష్యుడు సిద్ధముగా దగ్గరనేయుండవలసియుండును గనుక, తనశరీరము పరమపురుషుని యుపయోగములోనుండగా తాను వారి అత్యద్భుతమగు తేజస్సులో స్నాతుడగు భాగ్యము అతని కెల్లప్పుడును గలుగుచుండును.

ప్రపంచములో ప్రస్తుతముగల పరిస్థితులవంటి సందర్భములలో మానవులలో అవతరించుట అవసరమని పరమపురుషులకు తోచినపుడు వారు తగిన శరీరము నెరవుదీసికొనుపద్ధతి నెల్లప్పుడును అవలంబించుచుందురు. బుద్ధత్వమును బొందుటకై అవతరించినపుడు గౌతమప్రభువును, రెండువేల సంవత్సరములక్రిందట పాలస్తీనాలో

నవతరించినపుడు మైత్రేయప్రభువును ఈపద్ధతినే అవలంబించిరి. నాకు తెలిసినంత వరకు దీనికొక్కటే మినహాయింపుగలదు. అది యేమన, పూర్వపు బోధిసత్త్వులు బుద్ధత్వముబొందిన తరువాత క్రొత్తబోధిసత్త్వులు జగద్గురువు పదవిని స్వీకరించి, జగద్గురువుగా ప్రపంచములో మొదటిసారిగా నవతరించునపుడు సామాన్యమగురీతిని శిశువుగనే జననమొందుదురు. మనప్రస్తుతపు బోధిసత్త్వులు సుశోభితమగు భారత దేశమైదానములలో జనులందరు అనుపమానమగు భక్తితో పూజించి ప్రేమించుటకు శ్రీకృష్ణుడుగా జన్మించినపుడు ఆరీతిగనే జేసెరి.

ఈవిధముగ శిష్యుని శరీరమును తాత్కాలికముగా నుపయోగించుటయు, బాగుగా వికాసమునొందిన యొకవ్యక్తి తనకొరకై మరియొకరివలన సిద్ధపరచబడిన శరీరమును నిత్యోపయోగమునకు ఖాయముగా స్వీకరించుటయును, ఒకటేయని భ్రమపడకూడదు. మనసమాజస్థాపకులగు మేడమ్బ్లవట్స్కీగారు మన మెరిగిన తన శరీరమును విసర్జించినవెంటనే, అసలు యజమానిచే సరిగా అప్పుడే విడిచిపెట్టబడిన మరియొక శరీరములో ఆమె ప్రవేశించెనని ఆమె అనుచరులకందరకు సామాన్యముగా తెలిసియున్నది. ఆశరీరమామె కొరకై ప్రత్యేకముగా సిద్ధపరచబడినదో లేదో నాకు తెలియదు; కాని, అట్లు సిద్ధపరచబడిన ఇతర సందర్భములు నిదర్శనములుగా నున్నవి. అట్టి సందర్భములన్నిటిలోను క్రొత్తయజమానియొక్క అవసరములకును వ్యక్తిగతమగు చేష్టలకును శరీరము అనుకూలించునట్లు చేయుటలో కొంత చిక్కుగలదు. అందుచేత వానికది యెన్నటికిని పరిపూర్ణముగా తగిన ఉపాధి కాక పోవచ్చును. అటువంటి సందర్భములలో జీవాత్మ శరీరధారణమునకు రెండు విధానములుగలవు. విశేషకాలహరణమునకు, శ్రమకు నోర్చి క్రొత్తశరీరముయొక్క వృద్ధిని పర్యవేక్షణజేయుచు, భూలోకములో సాధ్యమైనంతవరకు తనకు ప్రశస్తమగు నుపాధిగా ఉండునట్లు పనిచేయ సంకల్పించుట యొకటి; అట్టి శ్రమయేమియు లేకుండ మరియొకని శరీరములో బ్రవేశించుట రెండవది. ఈరెండవ విధానమువలన ప్రతివిషయములోను సంపూర్ణముగా తృప్తికరమగు ఉపాధికాకపోయినను, సామాన్యమగు కార్యములన్నిటికి బాగుగా నుపయోగపడగల సాధనము లభించగలదు. సహజముగా శిష్యుడెల్లప్పుడును తనశరీరమును పరమగురువున కర్పించు గౌరవమును బొందుటకై ఆతురపడుచుండును; కాని నిజముగా అట్టి గౌరవమును బొందదగినంత సంశుద్ధిగలిగిన శరీరములు బహుతక్కువగా నున్నవి.

ఇంచుమించు పరమపురుషులు చేయవలసిన యావత్తుకార్యము ఉత్తమలోకములోనే చేయవలసియున్నట్లగుపించుచుండ, వారికి స్థూలశరీరమెందుకావశ్యకమని తరుచుప్రశ్నించుచుందురు. అది నిజముగా మనము తెలిసికొనవలసినవిషయము కాదు. అట్టి విషయమైై యూహించుట అపచారము కాకపోయినచో, అనేక కారణములు స్ఫురించగలవు. పరమపురుషులు చాలవరకు వారికాలమును ప్రభావ స్రవంతులను ప్రసరింపచేయుటలో గడుపుచుందురు, మేము కనిపెట్టగలిగినంతవరకు ఈ ప్రసారములన్నియు శుద్ధ మానసికలోకములోగాని, దానిపైనున్న బుద్ధిలోకములోగాని సంభవించుచున్నను, ఒక్కొక్కప్పుడు ఆకాశీయ (ఈథరు) ప్రవాహములు గూడ ప్రసరించుచుండవచ్చును. ఈప్రసారములను సమకూర్చుటకు స్థూలశరీరమువలన నిస్సందేహముగా గొప్ప ఉపయోగముకలదు. మరియు, నేను జూచిన పరమపురుషులలో చాలమందికి కొందరు శిష్యులును సహాయులును గలరు, వారందరు భూలోకములో పరమగురువుతోడనో వారికిదగ్గరగనో నివసించుచుందురు. అట్టివారి కొరకు స్థూలశరీర మావశ్యకము కావచ్చును. ఒకసంగతిమాత్రము నిశ్చయము, అది యేమన, పరమపురుషులలో నెవరైనను స్థూలశరీరమును నిలుపుకొను శ్రమను పడనెంచినచో, అందుకు తప్పక మంచికారణ ముండితీరవలెను. ఏలయన, పరమపురుషులు ప్రతికార్యమును ఉత్తమమగు రీతిని, మిక్కిలి తక్కువశక్తిని వ్యయపరచి చేయదగిన పద్ధతిని నవలంబింతురని వారికార్యవిధానముల నెరింగినమాకు పూర్తిగా తెలియును.



## మూడవ అధ్యాయము

# పరమగురుసన్నిధికి మార్గము

### మార్గప్రవేశము

మహీపీఠము, లేక, మహాశ్వేత సోదరబృందము, అను పరమపురుషుల సోదర బృందము సర్వకాలములయందును గలదు. జ్ఞానులు, అనగా, ఆంతరంగికజ్ఞానముగల మహాపురుషులెల్లప్పుడును గలరు; మన పరమగురువు లాజ్ఞానులయొక్కయు, యోగుల యొక్కయు మహాపరంపరకు ప్రస్తుతము ప్రతినిధులుగానున్నవారిలో చేరినవారు. లెక్కలేని యుగములలో వారు సంపాదించియుంచిన జ్ఞానములో కొంతభాగము నేడు భూలోకములో దివ్యజ్ఞానమనుపేర లభించినది. ప్రకటింపబడని జ్ఞానమింకను చాలగలదు. దివ్యజ్ఞానము మనజీవితములలో గావించిన అపరిమితమగు పరివర్తనము గురించియు, పునర్జన్మసిద్ధాంతముయొక్క అద్భుతమగు విస్తృతిగురించియు ఒక సభ్యు డొకసారి ప్రస్తావింపగా, కూట్‌హూమిమహర్షి చిరునవ్వుతో "నిజమే, కాని ఇంత వరకా తెరను ఒకమూల బహుస్వల్పముగా మాత్రము తొలగించితిమి," అనిరి. మనకియ్యబడిన జ్ఞానమునంతను పూర్తిగా జీర్ణముచేసికొని దానిని ఆచరణకు తీసికొనివచ్చి జీవించుచున్నయెడల, ఆసోదరబృందము తెరను మరికొంత తొలగించుటకు సంసిద్ధులగుదురు, కాని వారి నియమములనన్నిటిని పూర్ణముగా అనువర్తించవలెను.

ఎక్కువగా జ్ఞానముసంపాదించి వారిదగ్గరకు చేరవలెనను ఆకాంక్షగలవారందరకు మార్గము తెరచియున్నది. కాని పరమగురువులచేరగా నాకాంక్షించువాడు వారివలె తానుగూడ స్వార్థరహితుడై, దేహాత్మభావమును మరచిపోవుట నేర్చుకొని వారివలెనే పూర్తిగ మానవసేవాతత్పరుడగుటవలననే వారిని జేరగలడు. మేడమ్ బ్లవట్‌స్కీగారు "యోగశాస్త్రములు – యోగవిద్య" (**Occultism versus the Occult Arts.**) అని వ్రాసిన వ్యాసములో దీని ఆవశ్యకతగురించి ఆమెకు సహజమైన ప్రౌఢశైలిలో ఇట్లు వ్రాసిరి :

"నిజమగు యోగవిద్య, లేక, దివ్యజ్ఞానము అనగా, ఆలోచనలోను, కర్మలోను బేమరతుగా కేవలము సంపూర్ణమగు ఆత్మపరిత్యాగముచేయుటయే. అది

పరోపకారత్వము. దాని నాచరించువాడు సజీవులైనవారి శ్రేణుల లెక్కలోనుండి పూర్తిగ నవతలకు త్రోసివేయబడును. పనిచేయుటకై అతడు జీవించును. పరీక్షాకాలములోని మొదటి సంవత్సరములో చాలవరకు పొరపాట్లు క్షమింపబడును. కాని శిష్యునిగా స్వీకరింపబడిన తత్క్షణమే అతని వ్యక్తిత్వము నశించిపోయి, అతడు ప్రకృతిలో కళ్యాణకరమగు నొక శక్తిగా మారిపోవలెను. రాగద్వేషముల ప్రకోపము పూర్తిగా మ్రగ్గిపోయి, అచలమగు నిచ్ఛాశక్తియొక్క తాపముచే అవి నలిగిపోయి, క్షయమైనప్పుడే, శరీరవాంఛలు, కామములు చచ్చుటయేగాక దేహాత్మాభిజ్ఞానము కూడ హతమయి, తత్కారణమున కామశరీరాభిమానముగూడ క్షీణించి శూన్యమై పోయినప్పుడే, పరమాత్మతో సమాగమము సమకూఱును. అప్పుడు, జయింపబడిన మానవుడు — అనగా, జీవించియున్నను కామరహితుడు, స్వార్థరహితుడునైన దేహాత్మ — మాత్రమే భువర్లోకములో ప్రతిబింబితమైనప్పుడు, ప్రకాశవంతము దివ్యమునగు జీవాత్మ, మానవుని రెండుధ్రువములతోను, అనగా, (1) సంశుద్ధి నొందిన స్థూలమానవుడు లేక దేహాత్మ, (2) ఎల్లప్పుడు పవిత్రముగనుండు తురీయాత్మ, అను మానవుని రెండు కొనలతోను సామరస్యముతో స్పందించగలదు; క్రిస్టాస్—Christos— అను పరమాత్మ సాన్నిధ్యమున దానితో మిశ్రమమై, మిళితమై, శాశ్వతముగ సమైక్యమునొంది నిలువగలదు. ముముక్షువు కేవలము ఐహికజీవితమో, లేక, స్వార్థరహితమగు యోగజీవితమో, ఈరెండింటిలో నొకదానిని యెన్నుకొనవలెను. రెండుజీవనములను కలుపుటకు యత్నించుట నిరుపయోగము, వ్యర్థము."

పరమగురువుల దృక్పథమునకున్ను, మనదృక్పథమునకున్నూ సంపూర్ణ వ్యత్యాసము గలదు. వారిని మనము గ్రహించుట మొదట బహు కష్టము. మన వలననే వారలకు కూడ ప్రేమాస్పదులు గలరు, వారు కొందరిని ఇతరులకంటె ఎక్కువగా ప్రేమింతురు; కాని, వారి కార్యనిర్వహణమునందు వారిప్రేమానురాగములు రవ్వంతయినను వారిని చలింపజేయనేరవు. ఎవనియందైనను ముందు గొప్పవారు కాదగు బీజములు కనిపించినయెడల, వానికొరకు వారు వ్యయపరచు కాలమునకు, శక్తికి తగిన ఫలితము వానివలన కలుగగలదని వారు తలచినయెడల, అట్టివాని విషయమై వారెంతైన శ్రమపడుదురు. ఈ మహాపురుషుల మనస్సులలో లేశమైన పక్షపాతమున కవకాశములేదు. తాము నెరవేర్చవలసిన పరిణామకార్యమును, ఏయే మానవుడాకార్యములో ఎంత ఎవరికెట్లు ఉపయోగపడునన్న విషయమును మాత్రమే

వారు యోచింతురు. మనము వారికార్యములో పాల్గొనుట కర్హత సంపాదించిన యెడల మన పురోవృద్ధి అతివేగముగా జరుగును.

## కార్య పరిమాణము

శిష్యులుగా స్వీకరింపబడవలసినదని కోరువారు ఈ యుత్కృష్టకార్యముయొక్క పరిమాణముగాని, వారి కోరికలలోగల గాంభీర్యమునుగాని యెరుగరు. విస్తృతములు, అపారములునగు శక్తితరంగములను ప్రపంచమంతట వ్యాపింపజేయుచు పరమపురుషులు పనిచేయుచుందురు. బుద్ధిలోకములోనున్ను, కోట్లాదిజనుల కారణశరీరములలో నున్ను, పరమపురుషులు తమ ప్రభావము నుపయోగపరచుచుందురు; అంతేగాక, యావన్మందిమానవులయొక్క సూక్ష్మశరీరములను నిలుకడగా పైకేమియు గనబడనంత మెల్లగా నుద్ధరించుచున్నారు. అయినను, అట్టికార్యములలో నిమగ్నులగు పరమ గురువులుకూడ కొన్నిసమయములందు ప్రక్కకుతిరిగి యొకశిష్యునికి సంబంధించిన స్వల్పవిషయములపై స్వయముగా శ్రద్ధవహింతురు.

శిష్యులుగా స్వీకరింపవలసినదని అడుగ సాహసించెడు వారందరు ఎట్టి పురుషులతో సంపర్కము గలుగచేసికొనను ద్దేశించుచున్నారో వారిఘనతను, వారి శక్తుల యొక్కయు, కార్యముయొక్కయు నుత్కృష్టతను గ్రహింపవలసియున్నది. ఈవిషయములన్నిటి ఉత్కృష్టతను స్వల్పముగానైన గ్రహించినయెడల, శిష్యుడు యుక్తకాలములో తనబలమును శక్తిని ప్రబల ప్రవాహముగా లోకోద్ధరణ కొరకు సరిగా వినియోగించగలడనుటకు తగిన నిదర్శనములు లేనియెడల పరమపురుషులు ఆతనిపై తమశక్తిని వ్యర్థముగా వ్యయపరచరని స్పష్టముకాగలదు. ఈశ్వరసంకల్పమును నెరవేర్చుటకై వారు జీవించుచున్నారు. వారికి సన్నిహితులగుటకు ఆశించు మనముకూడ అదేప్రకారముచేయుట నేర్చుకొని వారిపనికై జీవించవలెను. అట్లు చేయువారు తప్పక ఆపరమ పురుషులదృష్టి నాకర్షింతురు, మరియును లోకమునకు సహాయపడి ఆశీర్వదింపగలుగుటకు తగు శిక్షణమును బొందుదురు.

మానవ పురోవృద్ధి మెల్లగా నిలుకడగా జరుగుచున్నది. కావున, పరిపూర్ణత్వమునొందిన పరమపురుషులసంఖ్య పెరుగుచున్నది. వారంతవారగుటకు వలయు మహోత్కృష్టమగు యత్నమునుచేయ సంసిద్ధులయినవారలకందరకు అది ప్రాప్తించుట సాధ్యమే. సామాన్యకాలములలో జీవన్ముక్తత్వప్రాప్తికి ముందు పెక్కు జన్మలెత్తవలసి

యుండును. కాని, ప్రస్తుతము ఆమార్గమున మనపురోవృద్ధిని త్వరపెట్టి మామూలుగా అనేకవేలసంవత్సరములలో జరుగవలసిన పరిణామమును కొద్దిజన్మలలోనికి తగ్గించుటకు సాధ్యమగుచున్నది. దివ్యజ్ఞానసమాజములో చాలమంది సభ్యులచే చేయబడుచున్న ప్రయత్నమదియే; ఏలయన, ఈ యుత్తమకార్యమునకు ఎక్కువ త్వరితముగా తయారగుటకు తగు శిక్షణము నిచ్చెడు ఒక అంతరంగికశాఖ ఈ సమాజములో గలదు. ఆ సాధనకు గొప్ప ఆత్మనిగ్రహముండవలెను. ఏండ్లతరబడి కడుదీక్షతో కృషి జేయవలెను; నిర్దిష్టమగు అభివృద్ధి బాహ్యముగా తరుచు కనబడకపోయినను కృషిసలుపుచుండవలెను; ఏలయన, ఈ సాధనలో స్థూలశరీరముయొక్క శిక్షణము కంటె చాలా ఎక్కువగా సూక్ష్మశరీరములశిక్షణము జరుగుచుండును. ఈ సూక్ష్మ శరీరముల శిక్షణము భూలోకములో ఎల్లప్పుడును బహిర్గతము కానేరదు.

## కార్యముయొక్క ప్రాధాన్యము

పరమగురువులగురించియు, వారి బోధనగురించియు వినినవాడు దాని అర్థము నేమైన గ్రహించినచో, ఆపరమపురుషులగూర్చి పూర్తిగ దెలిసికొని వారిని సేవింపవలెనను తీవ్రకాంక్ష వానికి వెంటనే కలిగితీరవలెను. ఆవిషయములగురించి అతడు తెలిసికొన్నకొలది యీశ్వరసంకల్పములోని అద్భుతము, సౌందర్యము, వైభవము వానిని పరవశుని జేయుచుండును. ఆకార్యములో నతడుకూడ పాల్గొనవలెనను ఆతుర మధికమగుచుండును. పరిణామమే ఈశ్వరసంకల్పమని అతడు గ్రహించిననాడు, ఆ పవిత్రకార్యములో ఈశ్వరునితోపాటు తానుగూడ పాటుపడుచుండవలెనని వాంఛించును, అన్యమగు మరిదేనితోను సంతుష్టినొందడు.

పిదప, "ఇక నేనేమిచేయవలెను?" అని అతడు ప్రశ్నించుకొనును. దానికి జవాబిదిగో: "పనిచేయుము. పరమగురువునలెనే మానవాభ్యుదయమునకు తోడ్పడి నీవు చేయగలిగినదంతయుచేయుము. నీవు చేయగలిగిన దానిని, నీకవకాశము చిక్కిన దానిని చేయుటతో ప్రారంభింపుము; మొదట నీవు చేయగలిగినవి స్వల్పమగు ఐహికకార్యములు కావచ్చును; కాని క్రమేణా నీవు కావలసిన శీల సంపత్తిని సంపాదించుకొన్నయెడల ఉన్నతమగు అంతరంగికవిషయములు నీకు తెలియగలవు; అట్లు ఉత్తమముగ జీవించుటకు, ఉత్తమమగు కార్యములు జేయుటకు కృషి సలుపగా తుదకు ప్రథమయోగదీక్షకును, మహాశ్వేత సోదరబృందములో సభ్యత్వమునకును

వలయు నర్హత నీకు కలుగగలదు.” నాపరమగురువునకు కొంచెము సన్నిహితుడనగు భాగ్యము నాకబ్బినప్పుడు నేనేమిచేయవలసియున్నదని ఆయనకొక జాబు వ్రాసితిని. ఆయన నాకిట్లు జవాబిచ్చిరి; “నీవు చేయవలసిన పనిని నీవేకనుగొనవలెను. మేమేమి చేయుచుందుమో నీకు తెలియునుగదా. నీకు చేతనయినరీతిని మాకార్యములో పాల్గొనుము. నేనేదయిన నిర్దిష్టమగు కార్యమును నీకు నియమించినచో నీవు దానిని చేసెదవు, కాని ఆకార్యమును నేనే నియమించుటచే దాని కర్మ నాకు చెందును. నీకు మనః పూర్వకమగు విధేయతవలనకలిగెడు కర్మ మాత్రము లభించును. అది కూడ మంచిదే. కాని, ఫలదాయకమగుకర్మను స్వతంత్రముగ ప్రారంభించుటచే గలిగెడు ఫలములభించనేరదు. ఒకసత్కర్మయొక్క ఫలితము నీకు చెందవలెననిన, నీకు నీవే ఆచేయవలసిన కార్యమును కనుగొని పనిచేయవలెను.”

వారి సూచనను మన మందరము హృద్గతము చేసికొనుటమంచిదని తలచెదను. ఏదో యొకటి చేయవలెనని ఆదేశింపబడునరకు వేచియుండక, పని ప్రారంభించి చేయుట మనవిధియని గ్రహింపవలసియున్నది. దివ్యజ్ఞానము విషయమై నిరాడంబరముగచేయదగిన పని విశేషముగానున్నది. తరుచుగా మనలో చాల మందికి మిక్కిలి ఆడంబరమగు కార్యమునుజేయనిచ్ఛగలుగును; పెద్ద బహిరంగసభలలో నిల్చి ఉపన్యాసములనీయ కౌతుకము కలుగును. అట్టి పనులను చేయుదుమని ముందుకు వచ్చెడు వారిని సాధారణముగా జూడగలము. కాని మన సమాజకార్యాలయమునకు సంబంధించిన నిరుత్సాహకరమగు దైనందినకార్యములు చాల నున్నవి; వానిని జేయనిష్టపడుసేవకులు తగినంతమంది కనబడరు. పరమగురువుల యెడల సరియైన భక్తి, ప్రేమ, మనకున్నయెడల వారి సేవాకార్యమెంత నిరాడంబరమైన దైనను దానిని జేయుటకు మనము సంసిద్ధులమగుదుము; పరమపురుషులలో నిద్దరిచే స్థాపించబడిన మన సమాజకార్యములో తోడ్పడునపుడు వారిసేవయే చేయుచున్నామని నిస్సంశయముగ మనము నమ్మవచ్చును.

## ప్రాచీన నియమములు

మహాశ్వేతసోదరబృందములో ప్రవేశమున కవసరమైనట్టియు, మోక్షమార్గమున బ్రవేశించిన ప్రారంభదశలోని పనివలననే సంపాదింపవలసియున్నట్టియు

యోగ్యతలు మిక్కిలి నిర్దిష్టమగు లక్షణముగలవైయున్నవి. ఆయోగ్యతలు గత యిరువది అయిదు శతాబ్దములలోను వివిధపరిభాషలలో చెప్పబడినను, తత్త్వతః అవన్నియును ఒకటైయున్నవి. దివ్యజ్ఞానసమాజప్రారంభదినములలో, అందలి అద్భుతమగు బోధయంతయు మాకు క్రొత్తగా గనపడెను. అందుచే ఈయోగ్యతల విషయమై తెలిసికొనుటకు మాలోకొందరము మిక్కిలి ఆతురపడుచుంటిమి: మేడమ్ బ్లవట్స్కీగారు 'అంతర్వాణి – Voice of the Silence– అను అత్యద్భుతమగు పొత్తమును రచించక పూర్వము శిష్యత్వమునకువలయు యోగ్యతలజాబితాలను రెండింటిని మాకిచ్చిరి. ఆ తరువాత వచ్చిన ఆదేశములతో బోల్చుటకై వాని నిక్కడపొందు పరచుట యుచితము. ఆమె ఈక్రిందివిధముగ వ్రాసిరి :

"శిష్యుడనగా ప్రకృతిలో నిగూఢముగనున్న రహస్యములను, మానవునిలో అంతర్గతముగనున్న ఆధ్యాత్మికశక్తులను, అభ్యాసపూర్వకముగ నేర్చుకొనుటకై యొక గురువున కర్పణముచేసికొన్న విద్యార్థి. వానిని స్వీకరించిన అధ్యాపకుని భారతదేశములో గురువందురు. నిజమైన గురువెప్పుడును గుప్త విద్యాప్రవీణుడై యుండును. బాహ్యావిషయముల గురించి, గుప్తవిషయముల గురించి, అతిగాఢమగు జ్ఞానముగలిగి, పరిపూర్ణజితేంద్రియుడై, ప్రకృతి శక్తులను నిగ్రహింపగల సిద్ధులనే గాక, తనలో పూర్వము అంతర్గతముగనుండి ఇప్పుడు స్ఫుటముగనున్న శక్తులసహాయముచే ప్రకృతిమర్మములను దెలిసికొనగలశక్తిని గూడ సంపాదించిన పురుషుడే నిజమగు గురువు. శిష్యత్వమునకై అభ్యర్థినని చెప్పుకొనుట చాల సులభమే, కాని పరమపురుషుడుగా వికసించుట మాత్రము మానవుడు పూనెడు కార్యములన్నిటిలోను మిక్కిలి కఠినమైనది. సహజముగా పుట్టుకచేతనే కవులు, గణితశాస్త్రజ్ఞులు, శిల్పులు, రాజ్యాంగవేత్తలు అయినట్టి వారిని వందలకొలది చూడవచ్చును, కాని పుట్టుకచేతనే సహజముగా సిద్ధపురుషుడగుట సామాన్యముగా సంభవింపదు; గుప్తవిద్యను, శక్తులను సంపాదించగల అసాధారణసహజశక్తిగల పురుషుడొకడు మహాఅరుదుగా ఎప్పుడో యొకప్పుడు పుట్టుట సంభవించినను, అతడు కూడ తనకంటె తక్కువ శక్తులుగల తోడిముముక్షువువలెనే ఒకేరీతిపరీక్షలు, పరీక్షమాణావస్థలు, శిక్షణము, అన్నిటిని అనుభవించి తీరవలెను. ఇష్టులు సులభముగా ప్రయాణము చేయదగిన రాజబాటలేదనుట ఈయోగవిషయములలో పరమసత్యము."

టిబెటు దేశములో గోన్ - పా ఆలయములో పరంపరానుగతముగా శిష్యత్వమున కధికారముగల యొక తెగవారు కలరు. వారిని మినహాయించి, ఇతరులలో నుంచి శిష్యుల నెంచుకోవలసి వచ్చినప్పుడు అనేక శతాబ్దముల నుండియు హిమాలయవాసులగు పరమపురుషులు స్వయముగా సహజభక్తులయినవారిలోనుండి మాత్రము ఎంచుకొనుచున్నారు. ఈసంప్రదాయమునకు పాశ్చాత్యులగు ఫ్లడ్ - **Fludd**-, థామసువాన్ -**Thoms Vaughan**- పరాసిల్సస్ - **Paracelsus** - పికోడీ మిరాండోలో- **Picode Mirandolo** -, కౌంటు సెంటు జెర్మేన్ - **Count St Germain** -, మొదలగువారు మాత్రము మినహాయింపులు. వారికీ దివ్యశాస్త్రముతో విశిష్టమైన సహజానుబంధముండుటచేతనే దూరస్థులయిన సిద్ధపురుషులు తప్పనిసరిగా వారితో ప్రత్యక్షసంబంధముగలిగించుకొనవలసివచ్చెను. తత్ఫలితముగ, వారి సాంఘికపరిస్థితులలో సాధ్యమైనంతవరకు కొంచెముగనో, గొప్పగనో వారు సత్యమును తెలిపికొనగలిగిరి. కియూ - టీ (**Kew - te**) అను పుస్తకములోని నాల్గవ భాగములో "ఉపాసనావిధులు" -**The Law of Upasanas**- అను అధ్యాయమునుండి శిష్యునకు ఈక్రింది యోగ్యతలుండవలెనని తెలియుచున్నది :-

1. పరిపూర్ణ శరీరారోగ్యము.
2. సంపూర్ణ శౌచము, చిత్తసంశుద్ధి.
3. స్వార్థరహితమయిన ఉద్దేశము; సార్వత్రికమగు దాతృత్వము, సర్వప్రాణులయెడల కారుణ్యము.
4. సత్యసంధత; ప్రకృతి యందలి యేశక్తిప్రభావమునకు లోబడనట్టి కర్మనియతియందు అచంచలమగు నమ్మకముగలిగియుండి, యాకర్మనియతి యొక్కగతికి యేరీతిగను ఆటంకము కలుగచేయక, దానిని ప్రార్థనలచే గాని ఉపశాంతి కలుగజేయు వ్రతములు మొదలగు బాహ్యకర్మలచే గాని మరలింపచేయకుండుట;
5. ఎట్టిప్రమాదకరమగు అవస్థలోనైనను, ప్రాణభయము కలిగినప్పుడైనను జంకెరుగని ధైర్యము;
6. తాను ఆవిష్కరించిన అవలోకితేశ్వరుని, అనగా పరమాత్మయొక్క ఉపాధినని అంతర్బుద్ధిచే గ్రహించుట;

7. దృశ్యము, నశ్వరమునైన యీప్రపంచమందలి ప్రతివస్తువునకు అదృశ్య లోకములతోగల సంబంధమును న్యాయముగానిర్ణయించుచు వానియెడల శాంతమగు ఉదాసీనతను గలిగియుండుట;

శిష్యత్వమున కాశించు ముముక్షువునకు అధమ మీయోగ్యతలయినను ఉండి తీరవలెను. అరుదుగా ప్రత్యేకసందర్భములలో ఎప్పుడయిన మొదటి నియమమును కొంచెము సడలించవచ్చును గాని తక్కిన యోగ్యతలన్నియును ఉండితీరవలె నందురు; మరియు, అన్నిగుణములను రమారమి సమానముగా పరీక్షాకాలమునకు ముందే, ఇతరసహాయమేమియు లేకుండ, తన స్వయంకృషిచేతనే శిష్యుడు తనలో పెంపొందించుకొనవలెను.

స్వశక్తిచే ఆత్మవికాసము నొందుచున్న సన్యాసి జనపదములలో నివసించు చున్నను, దూరముగా ఏకాంతవాసముచేయుచున్నను, తన సహజసామర్థ్యము ననుసరించి శరీరమును, ఇంద్రియములను, దోషములను, దుఃఖమును అతిక్రమించి వాని కధిపతియై, మనోబుద్ధిరాత్మలతో నొకటగుటకు సిద్ధమై, తదుపరి విషయానుభవములతోగూడిన ప్రపంచములో ఆత్మయే పరమేశుడనియు, ఇచ్ఛయే పరమక్రియాశక్తి యనియు, గుర్తింపగలిగినప్పుడు ప్రాచీనసాంప్రదాయక నియమముల ప్రకారము వానినొక దీక్షితుడు స్వీకరించును. ఏమార్గాంతమందు నిర్దుష్టమగు కర్మఫలవిచక్షణము ప్రాప్తించునో అట్టి నిగూఢమార్గమును అప్పుడాతనికి కనబరచెదరు. మరియు, జన్మపరివర్తదుఃఖనివృత్తికి, అజ్ఞానులు నిర్ణయించుకొనజాలని ప్రేతాభావము, అను అపవర్గప్రాప్తికి మార్గమునుగూడ జూపెదరు. (**Five Years of Theosophy,**)

ఆమె మనకిచ్చిన నియమముల రెండవ జాపితా 'ఆచరణార్థమైన గుప్తవిద్య' (**Practical Occultism,**) అను ఆమె రచించిన పుస్తకములో గలదు. అందులో పండ్రెండు నియమములుకలవు; కాని ఆపండ్రెండును డెబ్బదిమూడింటిలోనుంచి యెంచబడినవనియును, ప్రాచ్యదేశములలో ప్రతి అధ్యాపకునకు పెద్దజాపితా పూర్తిగా తెలియుననియును, యూరపుదేశములో అవి అర్థశూన్యములుగా గనబడునుగనుక వానినన్నిటిని వివరించుట నిరుపయోగమనియు ఆమె వ్రాసెను. ఈదిగువ నుదహరించిన ఆనియమముల జాపితాలలో కుండలీకరణముచేసిన భాగములు మేడమ్ బ్లవట్స్కీగారి స్వంతవ్యాఖ్యలు. ఆనియమములేవన :—

1. అధ్యాపనకొరకు ఏర్పరచుకొనే స్థలము మనస్సును ఏవిధముగను చలింప జేయుట కవకాశములేని స్థలమైయుండవలెను. ఆకర్షకశక్తులను ప్రభవింపజేయు వస్తువులతో నిండియుండవలెను. ఇతరవస్తువులతోపాటు అచట పవిత్రమగు పంచరంగులు వర్తులముగా సమకూర్చబడియుండవలెను. దుష్టశక్తులేమియు గాలిలో లేకుండ స్థలము పరిశుద్ధముగానుండవలెను. (ఆస్థలమీపనికే ప్రత్యేకింపబడి మరియేపనికి ఉపయోగించకూడదు. పవిత్రమగు పంచరంగులు, అనగా, ఇంద్రధనస్సులో కనబడు ముఖ్యమగు అయిదు రంగులు, ఇవి గొప్ప ప్రభావముగలవి. దుష్టశక్తులనగా పోరాటములు, తగువులు, స్పర్థలు మొదలగునవి. ఇవి వెంటనే భువర్లోకపు వెలుగులో, అనగా, ఆస్థలముయొక్క వాతావరణములో ముద్రితములయి గాలిలో వ్రేలాడు చుండును. ఈ మొదటి నియమమును సాధించుట సులభముగా గనబడునుగాని బాగుగ యోచించిచూచినచో కష్టతమమయినదని తెలియును).

2. శిష్యుడు గురువునొద్ద ముఖాముఖిని విద్య నభ్యసించుట కనుమతి బడయుటకుముందు, బేసిసంఖ్యగల ఇతర క్రొత్తశిష్యులు కొందరితో కలిసి ఆరంభవిద్య కొంత నేర్చుకొనవలెను.

(ఇచట 'ముఖాముఖిని' అనగా, ఇతరులతో నిమిత్తములేకుండా తాను ప్రత్యేకముగా తన అంతరాత్మ యెదుటగాని తనగురువుయెదుటగాని విద్యను స్వీకరించుట అని అర్థము. అప్పుడే ప్రతివాడును తన జ్ఞానమును వినియోగించిన రీతిని బట్టి తన అర్హతకొలది క్రొత్తజ్ఞానమును బొందగలడు. బోధచేయుట సమాప్తియగు కాలముననే ఇది సంభవించగలదు.)

3. (గురువవగు) నీవు లానూకు (శిష్యునకు) 'లామ్రిన్' లోని పవిత్ర వాక్యములను చెప్పుటగాని, 'దూబ్జెడ్' నకు సిద్ధముచేయ ననుజ్ఞ నిచ్చుటకుగాని ముందు వానికి పూర్ణముగా చిత్తసంశుద్ధిగలిగినదనియు, అందరితోను ముఖ్యముగా అతని యితరఆత్మలతో మైత్రిగలిగి ప్రశాంతముగనున్నాడనియు శ్రద్ధతో జూడవలసియున్నది. లేనిచో, జ్ఞానముగురించియు, సద్ధర్మముగురించియు నీవు పలికెడు మాటలు చెదరి గాలికి కొట్టుకొనిపోవును.

(ల్యామ్రిన్ అనునది ట్సాన్ - ఖా - పా గారిచే రెండు భాగములుగా వ్రాయబడిన గ్రంథము. ఒకభాగము మతసంబంధమగు బాహ్య విషయముల నిమిత్తమున్ను, రెండవది రహస్య ఉపయోగము కొరకున్ను వ్రాయబడినది. అది అభ్యాసార్థమైన

ఆదేశములుగల గ్రంధము. దూబ్జైడ్‌కు సిద్ధముచేయుటనగా సూక్ష్మదర్శికత్వమునకు వలయు అద్దములు, స్ఫటికములు, పాత్రలు మొదలగువానిని సిద్ధపరచుట. ఇతర ఆత్మలు అనగా తోడి విద్యార్థులు. విద్యార్థులలో సంపూర్ణసామరస్యము లేనియెడల విజయము సాధ్యముకాదు. విద్యార్థులలో నెట్టి శక్తులుకలవో పరిశీలించి, అనుకూల వ్యతిరేక లక్షణములనన్నటిని తూచి జాగ్రతగా సమన్వయించి విద్యార్థులనెంచు కార్యము గురువునది.)

**4.** శిష్యులు విద్యాభ్యాసము చేయుకాలమందు చేతివ్రేళ్లవలె కలిసి అన్యోన్యముగా నుండుటలో శ్రద్ధవహించవలెను. ఒకరికి హానిచేయునది అందరకు హానికరమనియు, ఒకరి సంతోషము ఇతరుల హృదయములలో ప్రతిధ్వనించని యెడల కావలసిన లక్షణములుండవనియు, అందువలనముందుకుబోవుట వ్యర్థమనియు నీవు (గురువు) శిష్యులకు నొక్కి చెప్పవలెను.

(ఆదిలో, కావలసిన ఆకర్షణశక్తులను గుర్తించి జాగ్రత్తగా శిష్యుల నెంచిన యెడల, ఇట్టిది సంభవింపనేరదు. అన్యథాయోగ్యతగలిగి జ్ఞానసంపాదనకు తగియున్నను, వారిస్వభావములోని లోపముచేతను, తోడిసభ్యులతో సామరస్యము గలిగియుండుట వారికసాధ్యమగుటచేతను, కొందరు శిష్యులు సంవత్సరములపాటు వృద్ధిలేకుండనిలిచిపోవలసివచ్చెనని తెలిసినవిషయమే.)

**5.** వీణతంతులు ఒక దాని కొకటి భిన్నముగా నున్నను, అన్నియును సమశ్రుతిగ ఎట్లుమ్రోగునో, శిష్యులందరును గూడ అట్లే సామరస్యముతో జీవించునట్లు గురువు వారిని తయారుచేయవలెను. గురువరుని కరస్పర్శ లేశమైన తగిలిన తత్క్షణమే శిష్యులందరు సమష్టిగా సమశ్రుతితో చక్కగా సంచరించవలెను. వారల మనస్సునకు విజ్ఞానము యొక్క స్వరములు తాకినవెంటనే ప్రతిశిష్యునిలోను అది జ్ఞానమై స్పందించుచు అధిష్ఠానదేవతలకు సంతోషకరమైనట్టియు, శిష్యునకుపయోగకరమైనట్టియు ఫలితములు కలుగవలెను. ఆప్రకారము విజ్ఞానము శాశ్వతముగవారి హృదయములలో నిలిచియుండి, సద్ధర్మసామరస్యమెన్నటికి విచ్ఛిన్నముగాకుండును.

6. సిద్ధులను, లేక యోగైశ్వర్యములను ఇచ్చెడు జ్ఞానము నాకాంక్షించువారు జీవితముయొక్కయు ప్రపంచముయొక్కయు ఆడంబరముల నన్నిటిని పూర్తిగా త్యజించవలెను. (తరువాత సిద్ధులన్నియు బేర్కొనబడినవి)

7. "అందరిలోను నేను జ్ఞానిని, నాసంఘము దృష్టిలోను, నాగురువు దృష్టిలోను నాసోదరులందరకంటెను నేనెక్కువ పవిత్రుడను,ప్రియుడను" మొదలగు భేదభావములు మనస్సునగలవాడెవ్వడును శిష్యుడుగానుండతగడు. శిష్యుడు తన మనస్సును తనహృదయముమీదనే ముఖ్యముగా లగ్నముచేసికొని, యేజీవియెడలను వ్యతిరేకమగు భావములను దరికిరాకుండ తరిమివేయుచుండవలెను.

8. శిష్యుడు బాహ్యజీవప్రభావములకు (ఇతరజీవులనుండి ప్రసరించు ఆకర్షణ శక్తులకు) మాత్రమే చాలభయపడుచుండవలెను. ఈకారణముచేత, అంతర్యములో అందరి యెడల నైక్యభావముతో నున్నను తనస్థూలశరీరమును మాత్రము అన్య ప్రభావములు సోకకుండ శ్రద్ధతో వేరుచేయుచుండవలెను: తానుతినెడు కంచమును గాని, త్రాగెడు పాత్రనుగాని యితరులను ఉపయోగింపనియ్యరాదు; మనుష్యులతో గాని జంతువులతోగాని శరీరస్పర్శ (తాకుటగాని, తాకబడుటగాని) కలుగకూడదు. (జంతువులను పెంచరాదు; కొన్ని వృక్షములను, మొక్కలను తాకుటకూడ నిషేధింపబడినది. యోగసాధనకు ప్రత్యేకముగా ఉపయోగపడదగిన స్వంతవాతావరణమును నిర్మించుకొని శిష్యుడు జీవించవలెను.)

9. హృదయ ధర్మము (Doctrine of the Heart) కేవలము నేత్రధర్మము (Doctrine of the Eye), అనగా, శూన్యమగు బాహ్యసంస్కార విధానముమాత్రము కాకుండుటకై మనస్సెల్లప్పుడును ప్రకృతిలోని విశ్వవ్యాప్తిగల సత్యముల యెడల తప్ప మిగతా విషయములన్నిటి యెడల మొద్దువోయి విముఖతగలిగియుండవలెను.

10. ఏ విధమగు మాంసాహారమునుగాని, జీవముగల యేపదార్థమునుగాని శిష్యుడు భుజించరాదు. ద్రాక్షారసమునుగాని, సారాయిలను గాని, నల్లమందును గాని స్వీకరింపరాదు; ఇవన్నియు ప్రమత్తులను బట్టుకొని బంధించు దుష్టభూతముల వంటివి; అవి బుద్ధిని నాశముజేయును.

(ద్రాక్షారసము, సారాయిలు మొదలగునవి వానిని తయారుచేయు మానవుల చెడుశక్తులను పరిగ్రహించి తమలో నిలుపుకొనుననియు, ప్రతిజంతువు యొక్క మాంసముకూడ ఆజాతియొక్క ఆత్మలక్షణములను గలిగియుండుననియు చెప్పుదురు.)

11. ధ్యానము, అన్నివిషయములలోను మితము. నైతికబాధ్యతలను నెరవేర్చుట, మృదుభావములు, సత్కర్మలు, ప్రియమగు మాటలు, సర్వభూతహితత్వము,

సంపూర్ణ స్వార్థరాహిత్యము, ఇవిజ్ఞానోపార్జనమునకును, పరాజ్ఞానమునుబొందగల యోగ్యతను సంపాదించుటకును శ్రేష్ఠతమమగు సాధనములు.

12. పై నియమములను తప్పక శ్రద్ధతో పాటించుటవలననే శిష్యుడు సిద్ధ పురుషులకుగల సిద్ధులను శీఘ్రకాలములో బొందనాశించగలడు; కనుకనే విశ్వ మయుడగు సర్వేశ్వరునితో నైక్యమునొందగల పురోవృద్ధిని బడయగలడు."

మొదటిపట్టీలోని నియమములు సర్వత్ర వర్తించునని స్పష్టమే గనుక, వానిపై వాఖ్యానమవసరములేదు. తరువాత వెలువడినపుస్తకములలో వానిని వివరించిన మాటలు మాత్రము కొద్దిగ భేదించును.

రెండవపట్టీలోని నియమములు వేరైన పద్ధతిలోనున్నవని స్పష్టముగా తెలియు చున్నది. అవి ప్రాచ్య దేశవిద్యార్థులకై, అందులో ముఖ్యముగా జీవితము యావత్తు జ్ఞానోపార్జనకై అర్పింపగలిగి, ప్రపంచమునకు దూరముగా ఒక మఠములోనో, యోగుల సంఘములోనో, ఏకాంతముగా జీవింపగలవారికొరకు మాత్రమే నిర్ణ యింపబడినవి. యూరోపియను విద్యార్థుల కర్థశూన్యమగు అరువదియొక్క నియ మములింకనుగలవను సంగతినిబట్టియే, అవి యందరకు ఉద్దేశింపబడలేదనియు, యోగమార్గమున చరించువారి పురోవృద్ధి కావశ్యకములు కావనియు తెలియగలదు. ఏలయన, వానిని యెరుగకయే చాలమంది యోగమార్గమున ముందుకుపోగలిగిరి. కాని, బహుచిత్రములును, ఉపయోగకరములును అగు సలహాలుగా నెంచవచ్చును. నైతికమగునిబంధనలన్నియు మనకు తెలిసినవే; శిష్యులందరు కలిసిపనిచేయుచు నేర్చు కొనుచుండవలెను గనుక, వారందరు సంపూర్ణసామరస్యముతోను, అన్యోన్యమగు సానుభూతితోను జీవించుట అవసరమని నొక్కి చెప్పుట కూడ మనకు పరిచిత విషయమే. పైన ఉదహరించిన నియమములలో చాలభాగము ఈరెండవ ప్రయో జనముకొరకుద్దేశింపబడినవే. కొందరు విద్యార్థులొకజట్టుగా పనిచేయవలసియున్న ప్పుడు దాని ప్రాధాన్యతనుగూర్చి యెంతచెప్పినను అతిశయోక్తికానేరదు. పాశ్చాత్య జీవితములో వ్యక్తిత్వమునకున్ను, ఇతరులను బాధించనంతవరకు ఎవరి యిష్టము వచ్చినరీతినివారుజీవించుటకుగల సంపూర్ణహక్కునకున్ను, మనము విశేషప్రాధాన్యత నిచ్చుటలో వాస్తవమగు సన్నిహితసంబంధములుగలిగి ఐకమత్యముతో జీవింప సాధ్యముకావచ్చునను విషయమును మనము చాలవరకు మరచిపోతిమి. ఒకచేతి వ్రేళ్ళవలెకలిసియుండుటకు బదులు ఒక సంచిలోపోసినబొమ్మతాళ్ళవలె ఎవరికివారు

జీవించుచున్నాము; ఆంతరంగిక దృష్టితో జూచిన అది ఆదర్శమునకు సంబంధము లేకుండ బహుదూరముగానుండును.

ఈనియమములలో అత్యంత సఖ్యతతోనుండవలెనని యుత్కంఠతో జేసిన ప్రోత్సాహము అన్యస్పర్శ వలదని యెనిమిదవ నియమములో ఇచ్చిన ఆదేశమునకు విరుద్ధముగానున్నదని అనుకొనవచ్చును. అది సరియైన అభిప్రాయముకాదు. ఆయా దేశములు కేవలము భిన్నమగు విషయములగురించి యుద్దేశింపబడినవి. పాత్రి, చెంబు, కంచము, కత్తి, చెంచా, మొదలగునవి యెవరివివారికి ప్రత్యేకముగానుండ వలెనసుట మిక్కిలి శ్రేష్ఠమైన విషయము. సరిగా శుభ్రపరచబడని పళ్లెములను, పాత్రిలను, గిన్నెలను, విచక్షణములేకుండ అందరు ఉపయోగించెడు ప్రస్తుతపద్ధతులు నిజమగు నాగరికులకు హేయముగానుండును. ఇతరులతో అనవసరమగు సంపర్కము లేకుండుటవలన లాభములు కలవు. ఏలయన, అందరి తేజస్సులు విచక్షణమేమియు లేకుండ కలిసిపోవుట మిక్కిలి యనుచితము. పూర్వపురోజులలో భారతదేశములో అనుచితమగు సంపర్కములేకుండ సావకాశముగజీవించుట కడుసులభముగానుండెను; కాని యిప్పుడు రైలుబండ్లు, ట్రాములు, బస్సులు మొదలగునవి వచ్చినతరువాత ప్రస్తుతవ్యవహారపు తొందరచే వాని నుపయోగింపక తీరదు, కనుక భారతదేశములో గూడ పూర్వమువలె జీవించుట దుర్లభము; యూరపుదేశములో ఆరీతిగ జీవించుట కేవల మసాధ్యము. అందుచేతనే సామీప్యమనే సమస్యను మరియొకవిధముగా పరిష్కరించు మార్గమును మనకిప్పుడు చూపిరి.

మనశరీరములచుట్టు నొక కవచమును నిర్మించుకొని అయోగ్యమగు శక్తులేమియు మనల నంటకుండ ఎప్పటికప్పుడు భద్రముగా రక్షించుకొనవచ్చును. దుష్టశక్తు లాకవచమునకు వెలుపలనేయుండునుగాని లోనికి చొరనేరవు. కార్యావసరములనుబట్టి ఆకవచమును ఆకాశ (ఈథరు) పదార్థముతోగాని, భువర్లోక, మానసిక లోకపదార్థములతోగాని నిర్మించుకొనవచ్చును. అనేకవిధములగు కవచములను, వానిని నిర్మించువిధానమును **The Hidden side of Things** అను గ్రంథములో వర్ణించియుంటిని.అందులో అలెగ్జాండ్రియా నగరపు యోగులగురించి చక్కనికథకూడ గలదు. ఆకథవలన కవచమును నిర్మించుకొనుటకంటె దుష్టశక్తులనుండి రక్షించుకొనుటకు శ్రేష్ఠతరమగు మరియొక మార్గముకలదని తెలియుచున్నది. అది యేమన, హృదయమును దివ్యమగు ఈశ్వరప్రేమతో నింపి తోడిమానవుల కొరకు ప్రబలమైన

ప్రేమతరంగముల నన్నిదిక్కులకు శాశ్వతముగా ప్రసరింపజేయుచుండవలెను. అట్లు చేసిన యెడల ఆప్రేమ ప్రవాహములే శ్రేష్ఠతమమగు డాలువలెనుండి వెలుపల నుండి అన్యశక్తులేమియులోనికి ప్రవేశించకుండ కాపాడుచుండును.

పెంపుడు జంతువులను చేరదీయకూడదను నియమము మానవసంపర్కము ద్వారానే జంతువులు వ్యక్తిత్వమునొంది మానవత్వముబొందగలవను విషయమును గమనించుటలేదనియు, తన చిన్న సోదరుడగు జంతువుపై మానవుడుద్దేశపూర్వక ముగాజూపగలిగిన శుభప్రభావమును బూర్తిగా విస్మరించి జంతుసంపర్కమువలన మానవుడు దుష్టపరిభావములకులోనగుననెడు విషయమును మాత్రమే గమనించి నట్లును కనిపించుచున్నది. కాని, బహుశః ఈనియమములను నిర్ధారణచేసిన ప్రాచీన కాలములో మానవత్వముబొందదగిన జంతువులు లేకపోయియుండవచ్చును.

మేడమ్ బ్లవట్స్కీ శిష్యుని పురోవృద్ధి గురించి వ్రాయుచు శిష్యుడు యోగ విద్య యెడల, భార్యయెడల గూడ శ్రిద్ధవహించజాలడనిచెప్పి శిష్యుడు వివాహ మాడకూడదనిగట్టిగానిషేధించెను. కాని యోగవిద్యయందతనికిగలశ్రిద్ధ భార్యకు గూడనున్నచో ఈకఠినశాసనము వర్తించనేరదని నాకు తోచుచున్నది. అవివాహి తుడు స్వదేశములో తన వ్యాపారమును విడిచిపెట్టి పరదేశమునకుబోయి పని చేయుట మొదలగు విషయములలో నెక్కువ స్వేచ్ఛగలిగియుండును. అయితే, గృహస్థుడుకూడ ఈశ్వరకార్యమును మరియొకవిధముగా, అనగా, తిరిగి భూలోక ములో జన్మించుటకు సిద్ధముగానున్న అనేక వికసితజీవులకు తగిన ఉపాధులను, అను కూలమగు పరిస్థితులను కల్పించుట రీత్యా, నెరవేర్చుచున్నాడన్న సంగతిని యెన్న డును విస్మరించకూడదు. మనకుమార్గజ్యోతులుగా నియ్యబడిన ఘనమగు మూడు గ్రింథములలోను గృహస్థాశ్రమమెచ్చటను నిషేధింపబడియుండలేదు. శ్రీజిడ్డు కృష్ణ మూర్తిగారు వ్రాసిన పరమగురుచరణసన్నిధియను అద్భుతమగు చిన్నపొత్తము, మూడింటిలోను అతిసులభమయినది అయియున్నది.

## పరమగురుచరణసన్నిధి

కృష్ణమూర్తిగారీ పుస్తకమును లోకమునకు ప్రసాదించినను, దానిలోని వాక్యములు దాదాపు అన్నియు కూట్‌హూమిమహర్షి గారివైయున్నవి. "ఈమాటలు నావికావు, నాకు బోధచేసిన పరమగురువుయొక్క మాటలు" అని గ్రింథకర్త పీఠి

కలో వ్రాసెను. ఆపుస్తకమును వ్రాయుసరికి కృష్ణమూర్తిగారి శరీరమునకు పద మూడేండ్లవయస్సు. పరమగురువుల యేర్పాట్లు ప్రకారము యోగదీక్ష కవసరమగు జ్ఞానము నతిశీఘ్రముగా అతనికిచ్చుటావశ్యకమయ్యెను. అతిసరళమును, సంక్షిప్తమును అయిన రూపమున, అవసరమగు ఉపదేశముయొక్క సారమునంతను అతనికి బోధచేయుటకై పరమగురువు పలికినమాటలే ఆపుస్తకమునందుగలవు. ఈప్రత్యేక సందర్భములో కలిగిన అవశ్యకతచేత గాకపోయినచో, అంతసంక్షిప్తముగనుండియు అంతసంపూర్ణముగానున్నట్టియు, అంతసులభగ్రాహ్యముగనుండియు అంతసర్వసంకలితమైనట్టియు దర్శనము మనకు ప్రాప్తించియుండదు. యోగమార్గము యొక్క ప్రథమావస్థకు సంబంధించిన వివరములను దెలియజేయు గ్రంథము లనేకములు గలవు. సంస్కృతశబ్దములయొక్కయు, పాలీశబ్దములయొక్కయు సరియగు అర్థముల గురించి చాల వ్యాఖ్యానములు, తర్కవితర్కములుగలవు, కాని యీ చిన్న పొత్తములో పరమగురువు సాహసముతో వానినన్నిటిని త్రోసివేసిసాధ్యమైనంతవరకు ఆధునిక పరిభాషలో, ఆధునిక జీవితములోని యుదాహరణములతో ఉపదేశసారమును మాత్రమిచ్చిరి.

ఉదాహరణమునకు:—వివేకము, వైరాగ్యము, షట్సంపత్తి ముముక్షుత్వము అనెడు నాలుగు యోగ్యతలను ఆయన వివేకము, నిష్కామత్వము, సదాచారము, ప్రేమ అని వివరించిరి. ముముక్షుత్వమనగా కేవలము మోక్షమునకై ఆకాంక్ష. కనుక ఈ సంస్కృతశబ్దమునకు ప్రేమ అని అర్థముచెప్పుట కెంతమాత్రము అవకాశములేదు. పరమగురువీపదమును ఉపయోగించుటకు హేతువు ఇదియైనట్లు కనిపించుచున్నది: "ప్రపంచములోనుండియు ప్రాపంచిక విషయములకు బద్ధుడనైయున్నానను భావములేశమైనలేకుండుటకై ఐహికబంధములలోనుండి తప్పించుకొనవలెనను తీవ్రకాంక్షయే ముముక్షుత్వము. సర్వాత్ముడగు పరబ్రహ్మముతో నేకమైనప్పుడే, ఈశ్వరునితో తాదాత్మ్యము నొందినప్పుడే, అట్టి ముక్తి ప్రాప్తించగలదు. ఈశ్వరుడు ప్రేమయే. కాబట్టి మనమీశ్వర ప్రేమతో సంపూర్ణముగా నిండియున్నప్పుడే అట్టి మోక్షము మనకు సాధ్యము కాగలదు."

ఈపుస్తకములో యోగ్యతల విషయమై చెప్పబడిన వివరణకంటె ఎక్కువ మనోహరమైనది, సంతుష్టికరమైనది, మరెక్కడను కనబడదు. దానిలోనున్న ఉపదేశమును సంపూర్ణముగ ఆచరణములో బెట్టినవారు తప్పక యోగదీక్షాద్వారమును

దాటిపోగలరని ధైర్యముగా చెప్పవచ్చును. ఒక వ్యక్తికి బోధించుటకై పరమగురువు అమూల్యమగు తమ కాలమునంతగా వినియోగించుట మిక్కిలి అసాధారణమగు విషయము; కాని కృష్ణమూర్తిగారిద్వారా ఆబోధ అనేక వేలమంది జనులకు లభించి వారి కందరకు అపారమగు వికాసముగలిగించెను.

ఈచిన్నపుస్తకమెట్లు వ్రాయబడినదన్న గాథ సులభమైనదేయని చెప్ప వచ్చును. ప్రతిరాత్రియు బోధనిమిత్తమై ఈపిల్లవానిని కామమయశరీరములో పరమ గురువుగారి ఆశ్రమమునకు నేను తీసికొనిపోవలసియుండెను. ప్రతిరాత్రియందును పదునైదునిమిషముల చొప్పున పరమగురువతనికి బోధజేసి, తుదకు ముఖ్యాంశముల నన్నిటిని యొకటి రెండు వాక్యములలో సంక్షేపించి ఆబాలుడు కంఠస్థము చేసి కొనునట్లుగా పలుమారు చెప్పుచుండిరి. అతడాసంగ్రహవాక్యములను జ్ఞప్తికిదెచ్చు కొని ఉదయముననే వ్రాయుచుండెను. గురువుగారు స్వయముగ వారి మాటలలో నిచ్చిన బోధనయొక్కసారమే ఈపుస్తకములోనివాక్యములు. అప్పటి కాబాలుని ఆంగ్లేయభాషాజ్ఞానమంతగా బాగుండకపోవుటచే, అతడా వాక్యములను కొంతశ్రమ పడి నెమ్మదిగా వ్రాసెను. అతనికీవిషయములన్నియు కంఠస్థముగావచ్చియుండుటచే తాను వ్రాసినచిత్తుకాగితములగురించి శ్రద్ధతీసికొనలేదు. తరువాత కొంతకాలమున కతడు మన అధ్యక్షుల (డాక్టరు బిసెంటు) తో కాశీకివెళ్లెను. అక్కడనుండి పరమ గురువు తనకు చేసిన బోధలను వ్రాసినచిత్తుకాగితములను వెదకి ప్రోగుచేసి పంప మని అడయారులోనున్న నాకొక జాబును వ్రాసెను. నాకు చేతనయినంతవరకు వానిని వరుసగా సమకూర్చి, టైపుచేసితిని.

ఇవన్నియు ముఖ్యముగా పరమగురువుగారిమాటలేగనుక, వాని వ్రాయు టలో తప్పులు లేకుండ నిశ్చయముచేసికొనుట మంచిదని నాకు తోచినది. అందుచే టైపుచేసిన ప్రతిని నేను కూట్‌హూమి మహర్షిగారి యొద్దకు తీసికొనిపోయి దానిని దయతో చదువవలసినదని ఆయనను కోరితిని. ఆయన దానిని చదివిరి. అచ్చటచ్చట నొకటి రెండు మాటలను మార్చిరి. కొన్ని క్రొత్తవాక్యములను, టీకలను చేర్చిరి. ఆక్రొత్తవాక్యములు ఆయన కృష్ణమూర్తికి మొదట చెప్పి నప్పుడు నేను వినిన వాక్యములేయని నాకు జ్ఞాపకమునచ్చెను. పరమగురువప్పుడు "బాగుగనే యున్నట్లున్నది. అది చాలును," అని తిరిగి "మైత్రేయప్రభువునకు కూడ చూపుదము" అని పలికిరి. అందుపైన, టైపు ప్రతిని ఆయనచేత పుచ్చుకొనగా

మేమిరువురము జగద్గురువుగారియొద్ద కేగితిమి. దానిని జగద్గురువు చదివి ఆమోదించిరి. అప్పుడాయన "దీనినొక చక్కని పొత్తముగాజేసి ఆల్కియోనీని ప్రపంచమునకు పరిచయముచేయుడు," అని సెలవిచ్చిరి. అంతవరకు మేమతనిని ప్రపంచమునకు పరిచయముచేయదలచుకొనలేదు. ముందు విద్యాభ్యాసముచేయవలసియున్న పదమూడేండ్ల ప్రాయముగల బాలునిపై ప్రపంచదృష్టిని, భావసమూహమును బరపుట శ్రేయస్కరముకాదని తలచితిమి. కాని గుప్తవిద్యాసంప్రదాయములో ఆజ్ఞానుసారము చేయుదుము; కావున ఈపుస్తకము సాధ్యమైనంతత్వరలో అచ్చువేయించుట కిచ్చితిమి.

అకాలప్రచురణమునలన కలుగునని మేమనుకొన్న యిబ్బందులన్నియు సంభవించెను. కాని మైత్రేయప్రభువుయొక్క అభిప్రాయమే సరియైనది, మాదే పొరపాటు. ఏలయన ఆపుస్తకమువలన లోకమునకు కలిగిన శ్రేయస్సు మాకు కలిగిన యిబ్బందులకంటె నెంతయు గరిష్ఠమైయున్నది. వేలాదిజనులు ఆపుస్తకమును చదివిన తరువాత వారిజీవితము లెట్లు పూర్తిగ మారిపోయినవో, సమస్తవిషయములలోను వారి దృక్పథము లెట్లు మారిపోయినవో కృతజ్ఞతతో దెలుపుచు మాకు లేఖలను వ్రాసిరి. ఇరువదియేడు భాషలలో కదియనువదింపబడినది. నలుబదిపైగా ముద్రణములయినవి; ఒక లక్షకుమించిన ప్రతులు ముద్రింపబడినవి. ఇప్పుడుకూడ పదిలక్షల ప్రతుల నచ్చువేయించుటకు అమెరికాదేశములో ప్రయత్నముజరుగుచున్నది. ఆపుస్తకమువలన నద్భుతమగు పనిజరిగినది. అన్నిటినిమించి, రాబోవు జగద్గురువులవారి విశిష్టమగు అనుజ్ఞ దానికి గలదు; మరియు దాని మిక్కిలి యుత్కృష్టమగు విలువయేమన, ఆజగద్గురువుయొక్క బోధ యెట్లుండునో అది కొంతవరకు మనకు తెలియచేయుచున్నది. మోక్షమార్గమున ప్రవేశించుటకై చేయుకృషిలో శిష్యునకు మిక్కిలి ఉపయోగకరముగానుండు మరికొన్ని పుస్తకములుగూడ గలవు. అంతర్వాణి — **Voice of the Silence**, మోక్షమార్గ ప్రదీపిక — **Light on the Path** —, ఇందు నిమిత్తమే మనకు ప్రసాదింపబడినవి. మన అధ్యక్షులవారి (డాక్టరు బిసెంటు) వెలుపలివాకిలిలో — **In the Outer Court** —, శిష్యపథము — **Path of Discipleship** —, అను గ్రంథములుకూడ అమూల్యములుగా కనబడును. ఈ గ్రంథము ప్రథమ ముద్రణమైనతరువాత అధ్యక్షులును, నేనును కలిసి యోగమార్గప్రబోధ

ములు – **Talks on the Path of Occultism** – అను శీర్షికతో పైనచెప్పిన ప్రధాన గ్రంథత్రయముపై వ్యాఖ్యానములను వ్రాసి ప్రచురించితిమి.

## శిష్యుని చిత్తవృత్తి

ఈపుస్తకములన్నియు ఎదుటనుండగా కర్తవ్యముగురించి శిష్యునకు సందేహ ముండనక్కరలేదు. అతడు నిర్దిష్టములగు రెండు పద్ధతులలో కృషిచేయవలెను. మొదటిది – తనశీలమును సరిగా నభివృద్ధిజేసికొనుట, రెండవది – ఇతరుల కొరకు నిర్దిష్టములగు కార్యములను చేయఁబూనుట. సాధారణముగా, జీవితము యెడల నెను కటికంటె కేవలము భిన్నమైన దృష్టి యలవడవలెనన్న సంగతి యీ బోధలో యిమిడియున్నట్లు అతనికి స్పష్టముగా తెలియవలెను. ఈవిషయమునే ఒక పరమ గురువు "మాతో, మాకొరకై, పనిచేయఁగోరువారు తమలోకమును విడిచి మాలోకమునకురావలెను;" అని పలికిరి. ఆవాక్యమునకు ప్రాచ్యదేశవాఙ్మయమును జదివెడువారు అనుకొనునట్లు శిష్యుడు సామాన్య ప్రపంచజీవనమును, వ్యాపారమును త్యజించి అడవులకో, గుహలకో, కొండలలోనికో, విరమించవలెనని అర్థముకాదు: శిష్యుడు ఐహికదృష్టిని విడిచి పరమగురువుయొక్కదృష్టిని అలవరచుకొనవలెనని దాని అర్థము.

ఐహికదృష్టిగల సామాన్యమానవుడు జీవితములో ప్రతిఅంశమును, ప్రతిసంఘటనను తనకదియెట్లువర్తించునను స్వార్థదృష్టితో జూచుచుండును; పరమగురువు ప్రపంచపరిణామమున కవి యెట్లు సంబంధించునను భావముతో మాత్రమేయోచించును. ఏది మొత్తముమీాద పురోవృద్ధికి సహాయపడుచు మానవపరిణామమునకు సహాయపడునో అది శ్రేయస్కరమై బలపరచదగినదై యుండును; ఏది అందుకు ఏరీతిగానైనను వ్యతిరేకమై ఆటంకమగునో, అది అయోగ్యమును నిరోధించవలసినదియు, లేక రద్దు పరచవలసినదియునై యుండును. పరిణామమును ప్రోత్సహించునది మంచి, దానిని వెనుకకులాగునది చెడుగు. బాహ్యప్రపంచమందుగల ప్రమాణమునకు మిక్కిలి భిన్నమగు ప్రమాణమిచట కనిపించుచున్నది. దేనిని బలపరచవలెనో, దేనిని నిరోధించవలెనో త్వరితముగ నిర్ణయింపగలుగుటకు ఇచ్చట నొక గీటురాయిగానవచ్చుచున్నది. దీనినిబట్టి మనశీలములోని గుణములనేగాక బాహ్యవిషయములను గూడ పరీక్షించి తీర్మానించుటకు మనకు సాధ్యమగును. మనమెంత

అల్పముగానైనను పరమగురువుతో కలిసిపనిచేయగలిగినయెడల ఆయనకు మనము ఉపయోగపడినవారమగుదుము. ఆయనను పోలియుండునట్లు మనలను దిద్దుకొనగలిగినప్పుడే ఆయనతో కలిసి ఉత్తమమగురీతిని మనము పనిచేయగలము. అప్పుడు, ప్రపంచమును ఆయన యేదృష్టితో చూచెదరో మనమును ఆదృష్టితో చూచెదము.

## మూడు ద్వారములు

ఆలయమునకు ద్వారంబు లమరుమూడు
భక్తి, కర్మయు, జ్ఞానంబు వానిపేర్లు
వెలుపలి ద్వారమున్ జేరినిలుచువారు
బోవవచ్చును లోనికే త్రోవనైన.

ఈమూడు మార్గములు ఎల్లప్పుడునుగలవు; గాఢముగా అధ్యయనముచేసినచో మానవుడు జ్ఞానమును సంపాదించి, సత్యమును గ్రహించి పరమగురువు చరణములచేరవచ్చును. గాఢమగుభక్తిని చిరకాలమభ్యసించి నిరంతరము గురువుని మనమున తలంచుచుండుటచే నిస్సంశయముగా ఆయనను చేరవచ్చును. పరమ గురువు కొరకు ఏదోయొక నిర్దిష్టమగుపనినిబూని దానిలో పూర్తిగా నిమగ్నుడగుట గూడ ఆయనను చేరుటకొక మార్గము. కాని ఆపూనిన పని నిర్దిష్టముగా ఆయన కొరకే, "దీనికి కీర్తిగాని మెప్పుగానియున్నచో అది నాకక్కరలేదు. ఇది నేను నాగురువు పేరజేయుచున్నాను. దీనికీర్తి ప్రతిష్ఠలు ఆయనకే వచ్చుగాక, అను తలంపుతో చేయునదియై యుండవలెను. పైన చెప్పిన పద్యములో "భక్తిజూపుట, జ్ఞానసంపాదనంబు, చేతగాకున్న సత్కర్మచేయగలుగు వారలుందురు భూమిపై" అను పదములు కూడగలవు. అది నిజము. ధ్యానమువలన తగినంతలాభము పొందలేనివారు కొందరు కలరు. మఱియును, వారుచదువుటకు ప్రయత్నించిన యెడల వారికి చాలకష్టముగా నుండును. అయినను, మనము శీలమును అన్నివైపులవృద్ధి బొందించుకొనవలయును గనుక వారు ధ్యానమును, అధ్యయనమును చేయుచుండవలెను; కాని, అన్నిటికంటె ముఖ్యము వారు కర్మలో నిమగ్నులై తోడిమానవుల కొరకేదో యొక పనిని చేయుచుండవలెను.

సామాన్యమానవులకంటె పరమగురువులు సంకల్పములచే ఎక్కువ సులభముగా చలించెదరన్న సంగతి మనస్సులో నుంచుకొని, ఆయన పేరునపనిచేసినను, ఆయనను స్మరించుచు నొక సత్కార్యమును జేసినను, అది అన్నిటికంటె ఆయన

కెక్కువ ఆకర్షణీయముగా నుండును. ఒకమనిషి దూరముననున్న స్నేహితుని గురించి తలచినయెడల, ఆతలంపు ఆస్నేహితుని యొద్దకుపోయి అతనిపై పనిచేయును. ఆస్నేహితుని మనస్సు అన్యథా గాఢముగ పనిచేయుచున్నప్పుడు తప్ప అతనినిగూర్చి తలంచిన మనిషిని గురించి అతడు గూడ తలంచును. కాని, పరమగురు వెంత దీక్షగా పనిచేయుచున్నను, ఆయనవైపుకు వెడలిన ప్రతిసంకల్పము ఆయనలో ముద్రిత మగును; ఆక్షణమందే ఆయన వానిని గమనించకపోయినను, దాని స్పర్శ అచట నుండుటచే, దాని నాయన తెలిసికొని దానికి జవాబుగా తమప్రేమను, శక్తిని బంపెదరు.

## పరమగురువులకార్యము

ప్రత్యేకముగా పూనుకొని చేయవలసిన పనియేది అని కొందరు ఒక్కొక్క ప్పుడు ప్రశ్నింతురు. దానికి జవాబేమన, ప్రతిమంచికార్యము పరమగురువుల కార్యమే, ప్రతిమనుజుడు తనుచేయగల సత్కార్యమేదో కనుగొనగలడు. అదిగాక, శిష్యుడుచేయవలసినపనిలో కొంత అతడు భవిష్యత్తున వహింపవలసిన అధిక బాధ్య తలను భరించుటకు శిక్షణము నిచ్చునదియై యుండవలెను. సామాన్యజీవితములోని బాధ్యతలు కొంతవరకీరెండింటినిగూడ తరుచు కలుపుచుండును; ఏలయన, సంసార బాధ్యతలను చక్కగ నిర్వహించువారికి అద్భుతమగు శిక్షణము, జ్ఞానము లభించుట యేగాక, ఇతర మానవుల శీలమును ఆదర్శములను అభివృద్ధిచేయుటలో సహాయ పడుట కనేక అవకాశములు లభించును. ఈరెండవకార్యము నిస్సంశయముగా పరమ గురువులకార్యమే అయియున్నది. సమస్తకార్యములను పరమగురువు పేరను ఆయన కొరకై చేయుట మనము నేర్చుకొన్నయెడల దైనందినజీవితములోని వివిధములగు కార్యకలాపములన్నియు ఆయనను సేవించుటకై చేసెడు కృషిలోని భాగములే యగును. రెవరెండు జాన్ హెర్బర్టు అను కవి వ్రాసిన యొక కావ్యములోని భావ మిట్లున్నది:-

" మనసామాన్యజీవిత విధానము, కష్టపడిచేయు దైనందిన చర్యలు, ఆయాస కరముగా గనిపించు కార్యములు, అన్నియు భగవంతునికొరకు చేయవచ్చును. అన్నియు ఆయన తేజస్సులో పాల్గొనును. ' ఆయనకొరకు ' అను వర్ణమును చేర్చినంతమాత్రమున కాంతివంతము, పరిశుభ్రము కానంత నీచమగు కార్య

మేదియులేదు. ఈబుద్ధితో ఒక సేవకుడు శ్రమపడినచో అది దైవకార్యమగును. ఆయన నియమము ననుసరించుటకు ఒకరు గదిని వూడ్చినచో ఆస్వల్పకార్యమునకు అందమువచ్చును."

పరమగురువుల కార్యమనగా ఏదోచిత్రమైనది, తోడివారలకు సంబంధించనిదికాదు. వారిని సేవింపగల చక్కని సంతానమును గనుటయు, వారిసేవకై యుపయోగించు నిమిత్తము ధనము నార్జించుటయు, వారికి తోడ్పడుటకై అధికారమును చేబట్టుటయు — ఇవన్నియు వారికార్యములే. కాని, యీపనులను చేయుటలో శిష్యుడు ఆత్మవంచనలేకుండ ఎల్లప్పుడును మెలకువగలిగి యుండవలెను; అధికారమును చలాయించుటకు, ధనమును అనుభవించుటకు నిజముగా అంతర్గతమగు స్వార్ధపరమగు కోరికయుండగా, పరమగురువుల పేరను జేయుచున్నానని యొక ముసుగును కప్పుకొని మోసపోకుండ జాగ్రత్తగా చూచుకొనవలెను. పరమగురువుయొక్క శిష్యుడు తానుచేయగలపని యెచట నేమియున్నదని తనచుట్టును చూచుకొనుచుండవలసియున్నది. "ఇది చాల అల్పమైనపని, ఇది కడు నీచమైనది, నేను చేయదగినది కాదు, నాప్రతిష్టకు భంగముకలుగును" అని యెన్నడును తలంచరాదు. ఎంత అల్పమైనపనియైనను నిరసింపరాదు. పరమగురువులపనిలో కొన్నిపనులు కష్టముగా నుండవచ్చును, మరికొన్నిటికి ప్రత్యేక శిక్షణముగాని, ప్రత్యేకశక్తులుగాని, అసాధారణమగు ప్రజ్ఞగాని కావలసియుండవచ్చును. అన్నియు వారి పనులే, గనుక అన్నియు ముఖ్యమైనవే గాని, వానిలో నెక్కువ తక్కువ లుండవు.

అయినను, పరమ గురువులకు ప్రత్యేకాభిమానముగల కొన్ని కార్యముల గురించి వ్యవస్థితమగు యత్నములు చేయబడుచున్నవి. వీనిలో మిక్కిలి ప్రధానమైనది దివ్యజ్ఞానసమాజస్థాపనము. వారికార్యార్థమై, వారి ఆజ్ఞననుసరించి ఈ సమాజము స్థాపింపబడినది. కనుక, ఒక దివ్యజ్ఞానసమాజశాఖ కొరకేవరేమి చేసినను అది అత్యుత్తమమగు కార్యమగుట నిస్సంశయము. అనేక సందర్భములలో అట్టి పనిచేయుట కవకాశము లేకపోవచ్చును. అప్పుడన్యమార్గములలో సేవచేయుటకు ప్రయత్నించవలెను. 'కో-మేసన్రీ', లిబరల్ కేథలిక్ చర్చి సంస్థలలో గూడ పరమ గురువులకు గాఢాభిమానముగలదు. ఈసంస్థలు గుప్త మార్గములలో ఎట్టి గొప్పపనిని చేయుచున్నవో ముందుచెప్పెదను. జగద్గురువు రాకకై పరిస్థితులను చక్కబరచుచున్న ప్రార్థకసంఘము—**Order of the Star in the East** — కూడ

గలదు. యువకుల శ్రేయస్సునకై అనేక యుద్యమములుగలవు. వీనిలో ధీరులసంఘము **(Order of the Round Table)** ముఖ్యపాత్రవహించుచున్నది. విద్యావిధానములో నూతన మార్గములు త్రొక్కబడుచున్నవి. బాల వీరులు, బాలికదర్శకులు—**Girl Guides**—, చేయుచున్న పనియుగలదు. బాలవీరోద్యమమునకు శక్తికొలది అందరును సహాయపడవలసియున్నది. ఏలయన, మున్ముందు పరమగురువుల సేవకు అర్హతకలుగ జేయు గుణములభివృద్ధినొందుటకావశ్యకమైన మర్యాద,పరులకు సహాయపడుచుండుట, సామాన్యముగాచేయుపనులలో కుశలత, మొదలగు గుణములు సాధారణముగ ప్రతి బాలునకు అలవడునట్లు దానిలో శిక్షణమియ్యబడుచున్నది. సామాన్యమగు ఏబడిలో నైనను ఇయ్యబడు విద్యకంటె ఐహికముగను, ఆధ్యాత్మికముగను గూడ బాలునకది చాల ఉపయోగకరముగ నుండును. మన అధ్యక్షులు (డాక్టరు బిసెంటు) భారతదేశ బాలవీరులకు గౌరవ ప్రధాన కమిషనరుగానుండి, ఆ యుద్యమముయొక్క ప్రచారము నకై ఆమెచేసిన సేవయొక్క ప్రాముఖ్యత మాకు బాగుగా తెలియును.

సంస్థలుగాని, నిర్ణీతమగు మార్గములుగాని లేనప్పుడు కూడ విశేషమగు పని చేయవచ్చును. ఉదాహరణమునకు, మానవజీవితములో సౌందర్యము అపారమగు ప్రభావము,ఉద్ధరణశక్తి గలదైయున్నది.ఏలయన, ప్రకృతిలో ఈశ్వరుని ఆవిష్కరణమే సౌందర్యము. కనుక, ఉదాహరణముగ, సౌందర్యోపాసకులు మార్గము ప్రక్కనున్న వారి తోటల నతిశుభ్రముగను, రమ్యముగను నుంచవలెను. చాలమంది ఇట్టి స్వల్ప విషయములలో అశ్రద్ధగను, అపరిశుభ్రమముగను నుందురు. ఎచటనుండి వెళ్లినను అచట చెత్తను విడిచివెళ్ళెదరు. అదంతయును పరమగురువుయొక్క ఆదర్శమునకు మిక్కిలి భిన్నమగు శీలమును తెలియజేయును.

పరమగురువు ఏపద్ధతులలో పనిచేయునో మనము కూడ ఆపద్ధతులలోనే పని చేసినయెడల, అంతకంతకు ఆయన కనుకూలురమగుదుము; మన తలంపులు కూడ అంతకంతకు ఆయన తలంపులవలెనే యుండును. ఇట్లు జరిగినచో, యోచనలోను క్రియాకలాపములలోను మన మాయనకు అంతకంతకు సన్నిహితులమగుటయేగాక, ఆయన దృష్టినికూడ శీఘ్రముగా నాకర్షింతుము; ఏలయన, ఆయన తమ పనిలో నుపయోగపడువారిని కనుగొనుటకై సదా ప్రపంచమునంతను కనిపెట్టి చూచు చుందురు. ఆయన మనలను జూచినవారై, ఎక్కువ శ్రద్ధగాను, ఎక్కువ వివరము గాను, పరీక్షించుటకై శీఘ్రముగా మనల నెక్కువ సన్నిహితులుగా చేర్చుకొందురు.

ఆచేర్చుకొనుట మామూలుగా అదివరకే ఆయన శిష్యుడైన యొకరితో మనకు సంపర్కము గలుగచేయుటరీత్యా జరిగింతురు. కావున, పరమగురువుల దృష్టినాకర్షించుటకై ఎవ్వరైనను ప్రత్యక్షమగు ప్రయత్నమును చేయుట కేవల మనవసరము.

## సంబంధమును కలుపుగొనుట

ఎవ్వరైనను దివ్యజ్ఞాన సమాజములో సభ్యుడుగా చేరినపుడు పరమగురువు వారినైపు చూచుననియు, అంతేగాక, అనేక సందర్భములలో జనులను వారి వెనుకటి జన్మలకారణముచేతనే సమాజములోనికి తీసికొనివచ్చెదరనియు మేడమ్ బ్లవట్స్కీగారు మాకు చెప్పిరి. కనుక పరమగురువుల గురించి మన మేమియు నెరుగకపూర్వమే మనగురించి చాల విషయములు వారెరుగుదురని తెలియుచున్నది. సిద్ధపురుషులెన్నడును దేనిని మరువరు. వారికెప్పుడేమి సంభవించినను, అది యంతయు సంపూర్ణముగా వారి యెఱుకలోనుండును. కనుక, వారు యాదృచ్ఛికముగానైన ఒక మనిషివైపు దృష్టిని బరపిన యెడల తరువాత వారా మనిషినెన్నటికి మరువరు. ఎవ్వరైన అంతరంగికశాఖలో చేరినయెడల వారితో నొకనిర్దిష్టమగు సంబంధమేర్పడును; ఈ సంబంధము ప్రత్యక్షముగా నొక పరమగురువుతోగాక, ముందుగాబాహ్యాధ్యక్షులతోను, తరువాత ఆమె ద్వారా ఆమెగురువగు అంతరంగాధ్యక్షులతోను ఏర్పడును.* అట్లు బాహ్యాధ్యక్షులతో కలిగిన సంబంధము అంతరంగికశాఖలో సాధకుడు ఒక్కొక్క మెట్టు ముందుకుపోయినకొలది వృద్ధియై బలపడును. ప్రారంభదశలలో కొద్ది సంబంధముమాత్రముండును.ఆశాఖలోని ప్రతిజ్ఞను దీసికొన్నతరువాత ఎక్కువ నిర్దిష్టమగు సంబంధము కలుగును; ఉన్నతతరగతుల ప్రతిజ్ఞలను తీసుకొన్నవారింకను కొంచమెక్కువ సన్నిహితులగుదురు. సభ్యుడు ప్రతిదినము ధ్యానములో బాహ్యాధ్యక్షులగురించి ధ్యానించును గనుక ప్రతిసభ్యునకు వారితో మానసికమగు సంబంధమొకటి ఏర్పడును. సభ్యుడు బాహ్యాధ్యక్షులకు సన్నిహితుడయినకొలది ఆసంబంధమును కలుగజేయు బంధము దట్టమగును.నిరంతరము బాహ్యాధ్యక్షులను స్మరించుచుండుటవలన ఆబంధము ప్రకాశవంతముగను, బలముగనునుండును.

---

* గ్రంథకర్త ఈగ్రంథమును రచించిన కాలమునకు డాక్టరు అనిబిసెంటుగారు బాహ్యాధ్యక్షులయి యుండిరి. ఆమె గురువగు మోర్యమహర్షిగారే అంతరంగాధ్యక్షులు. చదువరులు వర్తమాన పరిస్థితులను తెలిసికొని పైవిషయములను బోధపరచుకొనెదరుగాక.

ఆమెకు సంబంధించినంతవరకు, ఆమె తన పరమగురువుతో నొకటయ్యెను. కనుక, ఆమెతో సంబంధము గలిగియున్న యెడల, ఆయనతో సంబంధము గలిగి యున్నట్లే. అంతరంగికశాఖలోని సభ్యులందరు ఆవిధముగా ఆమె గురువగు మోర్య మహర్షి గారితో సంబంధించియున్నారు. కొందరు సభ్యులు మోర్య మహర్షి గారికి సంబంధించని యితరరేఖలలో పనిచేయుచు, పరీక్షమాణకాల మందు ఇతర పరమ గురువులకు శిష్యులు కానున్నను, ప్రస్తుతము మోర్యమహర్షిగారితోనే సంబంధము గలిగియుందురు. అయినను, అట్టి సందర్భములలో వారి భావి పరమగురువుల ప్రభా వమును వారి మార్గములద్వారా బొందుచుందురు. ఏలయన, సిద్ధపురుషులు స్థూల శరీరములలో ఒకరి కొకరు చాలదూరముననున్నను వారందరు వాస్తవముగా మిక్కిలి సన్నిహితముగా నుందురు. అందుచే నొకరితోసంబంధము గలిగియున్న యెడల,అందరి తోను నిజముగా సంబంధము కలియును. ఆసంబంధమంతయు మనకు చుట్టు తిరుగుడుగా కనిపించును; కాని ఉన్నతలోకములయందు ఆమహాపురుషులకు గల అద్భుతమగు నైక మత్యమును గ్రహింపగలిగిన యెడల మనమిచ్చట అనుకొనునంతచుట్టుగా నుండదు.

మన బాహ్యాధ్యక్ష్యుని ద్వారా పరోక్షముగా సంబంధముగలిగియున్న ఈ తొలిదశలోగూడ, పరమగురువు సంకల్పించిన యెడల ఈసభ్యులలో ఎవరి ద్వారా నైన కొంతవరకు పనిచేయగలరు. ప్రత్యేకముగా సిద్ధపరచబడని మార్గము ద్వారా తమశక్తిని పంపుట ఆయన సాధారణముగా చేయనిపని, అందుచేత మామూలుగా ఆయన అట్లు చేయరు. కాని, ఆయన శాఖలోనున్న సభ్యుల గురించి ఆయన కొక విధమగు చేతనముకలదు. ఆయన కొరకై ఎవరైన ముఖ్యమగు నొక కార్యమును చేయుచున్నప్పుడు సహాయకరమగు నొక భావమును వారికి పంపుట ద్వారా ఆచేత నము పైకి వ్యక్తమగును. అంతరంగికశాఖలోని ఒక సభ్యుడొకసారి ఉపన్యాసము నిచ్చుచుండ, ఒకక్రొత్త విషయమును ప్రజలకు చెప్పుటకై ఆయుపన్యాసకునిద్వారా పరమగురువు ఆనూతన విషయమునందజేయుట నే నెరుగుదును. ఆయన నిశ్చయ ముగా తమశిష్యులనట్లు అతితరుచుగా ఉపయోగపరచుచుందురు. కాని, ఇతరులను గూడ ఆయన ఆప్రకారము ఉపయోగించిరనుట నిశ్చయము.

## ఎవ్వరిని ఉపేక్షించరు

దీనినంతయు విద్యార్థిబాగుగా గ్రహించినయెడల, "పరమగురువుదృష్టి నాక ర్షించుటకు నేనేమిచేయగలను ?" అని యెన్నడు నడుగడు. అట్లుచేయుటకు మనము

ప్రియత్నించనవసరము లేదనియు, ఎవరును ఉపేక్షింపబడుదురను భయమిసుమంతైన లేదనియు అతనికి తెలియగలదు.

ఈ విషయమునకు సంబంధించినదియు, పరమపురుషులతో నాకు సంబంధము కలిగిన తొలిదినములలో సంభవించినట్టియునొకసంగతి బాగుగ జ్ఞప్తికలదు. మిక్కిలి పవిత్రమగు శీలముగలిగినట్టియు, కేవలము వారిసేవకై యోగ్యత సంపాదించుటకొరకే జీవితమంతయు సర్పించినట్టియు, ఉత్కృష్టమగు పాండిత్యము గలిగినట్టియు ఒకపురుషుని నేనెరుగుదును. అతడు శిష్యునిగా స్వీకరింపబడుట కన్నివిధముల చాల నర్హుడనిన్ని, నాకంటె చాలవిధముల ఎక్కువయోగ్యు డనిన్ని నాకు తోచెను. అతడదివరకే యెందుకు శిష్యుడుగా స్వీకరింపబడలేదో నాకర్థముకాలేదు. అందుచేత, ఈపనిలో అనుభవము లేనివాడనగుటవలన ఒకదినమున, మంచిఅవకాశము చిక్కినప్పుడు, అతివినయముగా, క్షమాపణపూర్వకముగా, పరమగురువునకు, నాస్నేహితునిపేరు మనవిచేసి, వారికతడు చక్కని ఉపకరణము కావచ్చునని సూచనచేసితిని. దయతోకూడిన వినోదమును సూచించు మందహాస ముతో ఆయన ఇట్లనిరి: “ ఆహా, నీస్నేహితు డుపేక్షింపబడుచున్నాడని నీవు భయ పడనక్కరలేదు. మేమెవ్వరిని ఉపేక్షించము. ఇతడు అనుభవించవలసిన కర్మ కొంతకలదు. కనుక నీసూచనను వెంటనే అంగీకరించుటకు సాధ్యముకాదు. త్వరలో నీస్నేహితుడు భూలోకమును విడిచిపెట్టి, తిరిగి శీఘ్రముగ నిచట జన్మించును, అప్పుడు కర్మపరిహారము పూర్తియగును. అతనికై నీవిపుడు కోరుచున్నది అప్పుడు సాధ్యమగును. ”

తరువాత, ఆయనలో మిక్కిలిముఖ్యమైన లక్షణముగ నెల్లప్పుడును శోభిం చెడు కోమలమగు దయాళుత్వముతో నా చైతన్యమును ఆయనచైతన్యములో ఇతోధి కముగా మిళితముజేసి, అప్పటికి నేను పోగలిగిన లోకముకంటె చాల ఉన్నతమగు లోకమునకు నన్ను తీసికొనిపోయి ఆయున్నతినుంచి పరమపురుషులు ప్రపంచము నెట్లు జూతురో నాకు చూపించిరి. కోట్లకొలది జీవులతోనిండిన భూమండలము మా యెదుటనుండెను. ఆ జీవులలో చాలా ఎక్కువమంది అభివృద్ధి నొందనివారే యగుట చేత పైకి కనిపించరు. ఆ బ్రహ్మాండమైన జనసమూహములో అచ్చటచ్చట ఒకడు నిశాంధకారములో వెలుగు దీపస్తంభమువలె ప్రత్యేకముగ గనబడెను. కారణమేమ నగా అతడు తానేస్థితిలో నిర్దిష్టముగ నుపయోగించునో ఆస్థితికిం కెను దూరముగా

నున్నను దానిని సమీపించుచుండుటచేతనే ఆప్రకారము వెలుగుచుండెను. "పరీక్షమాణశిష్యుడుగా స్వీకరింపబడుట కేమాత్రము అందుబాటులోనున్నను ఎవరైనను ఉపేక్షచేయబడుట కేవల మెంత అసాధ్యమో నీవిప్పుడు చూచితివా?" అని ఆయన పలికిరి.

మన శీలమును నిలుకడగా వృద్ధిచేసికొనుటయు, యోగ్యతగలిగినవెంటనే గుర్తింపబడుట నిశ్చయమని దృఢమగు నమ్మకముగలిగి, దివ్యజ్ఞానగ్రంథములను పఠనముచేయుచు, ఆత్మాభివృద్ధిని చేసికొనుచు, పరహితార్థమై స్వార్థరహితముగా పాటుపడుచు, మనము వాంఛించుగౌరవమునకు పాత్రులమగుటకై సర్వవిధములచేతను కృషిసలుపుటయు తప్ప మనమట్టుకుమనము చేయగలిగినదేమియులేదు. మనము పొదుపుగా నుపయోగింపబడగలిగినప్పుడుగాని, అనగా, పరమపురుషులు తమశక్తిని మనకొరకై వినియోగించినయెడల మనముచేయుపనులవల్ల దానినితరముగానుపయోగించినప్పుడు కలుగునంతఫలితమైనను కలుగునంతవరకు, మనలను పరమగురువులు దగ్గరకు చేర్చుకొన్నయెడల వారు తమవిధిని నెరవేర్చుటలో తప్పిపోయినవారగుదురు.

ఈ నియమమునకు మినహాయింపులు కొన్నిటిని జూచితిమని మనమెప్పుడైన తలచినను, నిజముగా మినహాయింపులెన్నడును ఉండనేరవని నిశ్చయముగా మనము నమ్మవచ్చును. కొన్ని లోపములున్నను ఒకనిని పరీక్ష్యమాణస్థితిలో పెట్టవచ్చును; కాని, అట్టివానివిషయములో పైకికనబడెడు లోపములకంటె పైకికనబడని సుగుణసంపత్తి విస్తారముగాఉండితీరవలెనని మనము నిశ్చయముగా నమ్మవచ్చును. మనము పరమగురువునకు ఉపయోగపడుటలో మనలోపము లెంతవరకు ప్రతిబంధకములగునో ఆయనమాత్రమే నిర్ణయింపగలరు. మనలోపములలో ఏది ఎట్లు వారికార్యమునకు భంగకరమగునో మనము సరిగా చెప్పలేము. కాని, యీసమస్యను ఉన్నతినుండి చూతురుగనుక వారన్ని సందర్భములను విస్పష్టముగా పరిశీలనచేయగలరు. అందుచేత వారితీర్మానమెల్లప్పుడును న్యాయముగను, అందరకు శ్రేయస్కరముగను నుండును. యోగవిద్య అనగా మిక్కిలి యెక్కువమందికి మిక్కిలి యెక్కువశ్రేయస్సుకలుగునట్లు సర్వదా పనిచేయు ప్రపంచజ్ఞానముయొక్క దివ్యరూపము, అని నిర్వచనము చేయబడినది. దానిలో అభిమానభావములకు తావులేదు. దానిలో అనేక క్రొత్తసంగతుల గురించియు, క్రొత్తశక్తులగురించియు నేర్చుకొని, ఈనూతనజ్ఞానమునుబట్టి మన జీవితములను దిద్దుకొందుము.

ఇది మన భూలోకములో ఆచారమునకు (లేక, ఆచారముగా నుండవలసిన దానికి) ఎంతమాత్రము భిన్నము కాదు. భౌతికవిజ్ఞానశాస్త్ర మభివృద్ధి నొందుచున్న కొలది క్రొత్తవిషయములు కనిపెట్టబడుచున్నవి; మనము వానినుపయోగించుచు, వానికనుగుణ్యముగా జీవితములను దిద్దుకొనుచున్నాము. ఆరీతిగనే, అంతరంగికజీవితమునకు సంబంధించిన విషయములగురించి ఉన్నతలోకములలో చేయబడు పరిశోధనలకు అనుగుణ్యముగా మనమెందుకు నడచుకొనగూడదు? ప్రకృతిధర్మములను మనము గ్రహించి వానికనుగుణ్యముగా జీవించుటయే ఆధ్యాత్మికముగను, ఐహికముగను సుఖము, ఆరోగ్యము, పురోభివృద్ధిబడయుటకుమార్గము.

ఈవిషయములలో ఒక్కొక్కప్పుడు కర్మనియతియొక్క ప్రవృత్తి యోచించవలసినదిగా నుండును. మనకువలెనే జ్ఞానమూర్తులగు పరమగురువులకుగూడ దీర్ఘమగు పూర్వజన్మశ్రేణికలదు. ఆజన్మలలో వారుకూడ మనవలెనే కొన్నికర్మబంధములను గలిగించుకొనిరి. కనుక, ఒక్కొక్కప్పుడు ఒకానొకవ్యక్తి చిరకాలముక్రిందటచేసిన సేవచే పరమగురువువలన ప్రత్యుపకారము బొందుటకు అధికారముగలిగియుండును. నేను పరిశోధించిన పూర్వజన్మల చరిత్రలలో అక్కడక్కడ అట్టి కర్మబంధములకు నిదర్శనములను జూచియుంటిమి.

## ప ర మ గు రు వు యొ క్క బా ధ్య త

అయోగ్యుడగు శిష్యునివలన తమ స్వంతకార్యమునకు భంగముకలుగుట కవకాశముండుటయేగాక, అట్టి శిష్యునిపొరపాటులకు నిర్దిష్టమగు కొంతబాధ్యతకూడ తమయందుండుటచేత, శిష్యత్వమునకై అభ్యర్థుల నెన్నుకొనుటలో పరమగురువు చాల జాగ్రత్తగానుండవలెనని స్పష్టముగా తెలియుచున్నది. ఈవిషయమై మేడమ్ బ్లవట్స్కీగారు ఇట్లు వ్రాసియుండిరి :

"శిష్యునికై పరమగురువు వహించెడు అపారము, అంతులేని బాధ్యతగురించి విద్యార్థికి తెలియుట మిక్కిలి ముఖ్యమైయున్నది. బహిరంగముగాగాని, రహస్యముగాగాని బోధచేసెడు ప్రాచ్యదేశపుగురువులు మొదలు, పవిత్రశాస్త్రములోని ప్రాథమికసూత్రములను శిష్యులకు బోధించుటకు పూనుకొను పాశ్చాత్యదేశములలోని కొద్దిమంది కబాలిస్టులు* వరకు (ఆపాశ్చాత్య మతగురువులు తమచర్యలవలన సామాన్యముగా తమకు రానగు ప్రమాదముల నెరుగకపోయినను) ప్రతియొక్కడును

* యూదుల గుప్తవిద్యకు 'కబాలా' అనిపేరు; ఆవిద్య నెరింగినవాడు కబాలిస్టు.

ఒకే అనుల్లంఘనీయమగు ధర్మమునకు లోబడియున్నాడు. నిజముగా బోధచేయుట ప్రారంభించిన క్షణము మొదలు, ఆధ్యాత్మికశక్తిగాని, మానసిక శక్తిగాని, స్థూల శక్తిగాని, దేనినైన శిష్యునకు ప్రసాదించిన క్షణము మొదలు, శిష్యుడు యోగ దీక్షనుబొంది తానుగూడ నొక గురువై యితరులబాధ్యత వహింపగలస్థితికి వచ్చు వరకు, ఈమధ్యకాలములో కర్మాకర్మరూపేణా శిష్యుడాచరించు పాపములన్నిటికి గురువు స్వయముగ బాధ్యత వహింపవలసి యుండును. దీనినిబట్టి గురువు లెందుచేత అంతగా మౌనము నవలంబించి యుందురో, గురుశిష్యు లుభయుల క్షేమమునకు వలయు గుణముల నభివృద్ధిచేసుకొని తమ యర్హత ఋజువుచేసుకొనుటకై సప్తవర్షముల పరీక్ష్యమాణకాలమెందుకు నిర్ణయింపబడినదో విశదముకాగలదు. [1]"

"ఆధ్యాత్మికగురువు శిష్యునిచేతబట్టుకొని, వాడదివరకేమియు నెరుగని నూతన ప్రపంచములోనికి తీసికొనిపోయి దానితో వానికి పరిచయముగలిగించును...... సామాన్యముగ దైనందిన జీవితములోగూడ తల్లిదండ్రులు, దాదులు, ఉపాధ్యాయులు, బోధకులు తమ యధీనములోనుండు బిడ్డల అలవాటులకు నైతిక లక్షణములకు బాధ్యులని యెంచెదము......శిష్యుడు తన దృష్టినిగాని, తన విచక్షణశక్తిని గాని నమ్మలేనంత అజ్ఞానస్థితిలోనున్నంతవరకు వానిని ప్రమాదకరములగు విషయములలో ప్రవేశపెట్టిన గురువును శిష్యునిపాపములన్నిటికి బాధ్యునిగా చేయుట సహజముకాదా [2]?"

తరువాయి అధ్యాయములలో చెప్పబడినట్లు, ఒక డోక పరమగురువునకు సన్నిహితుడయినయెడల వెనుకటికంటె చాలఎక్కువ శక్తిగలవాడగును. కనుక శిష్యుడుగా స్వీకరింపబడినవాడు చాల ఎక్కువ మంచిజేయగలుగుటయేగాక, తన శక్తిని తప్పుదారిని బోనిచ్చినయెడల మిక్కిలి విశేషమగు హానిని జేయగలుగును. బహుసామాన్యముగా, క్రొత్తశిష్యుడు తన సంకల్పశక్తిని దా నెరుగడు. వీధినిబోవు సామాన్యమానవుడు తెలివితక్కువగాగాని, అసత్యముగాగాని యోచనచేయ వచ్చును, కాని అతని యోచనవలన ప్రమాదకరమగు ఫలితమేమియుగలుగదు; అతడు ఇతరు నొకనిగూర్చి చెడ్డగా తలచినను ఆతలంపు ఆయితరునేమియు నంటక పోవచ్చును; కాని గురుప్రభావమును తనలోగలిగియుండి, చిరకాలముచేసిన అభ్యా

1. Practical Occultism, P. 3.
2. Lucifer, vol. ii P. 257.

సనుమువలనను, ధ్యానమువలనను తనలోగలశక్తిని ఉపయోగించుట నేర్చుకొన్న శిష్యుడు మరియొకమనిషిని అపార్థముచేసికొని అతనికి కీడుదలంచినయెడల, ఆశిష్యుని ప్రబలసంకల్పప్రవాహము ఆమనిషికి హానికరముగా పరిణమించి ఆతని భవిష్యజ్జీవితమునకంతకు చాలప్రమాదకరముకావచ్చును.

ఆ దురభాగ్యునకారోపింపబడిన దుర్గుణము నిజముగా అతని కున్నయెడల శిష్యుని ప్రబలసంకల్పము దానిని బలపరచును; ఆదుర్గుణమాతనికి నిజముగలేని యెడల, శిష్యుని సంకల్పరూపము దానిని స్ఫురింపజేయును; అంతర్గతముగనున్న చో దానిని సులభముగా పురికొలిపి బహిర్గతముచేయును, లేక, దాని చిహ్నములు లేనిచో ఆదుర్గుణముయొక్క బీజములను క్రొత్తగా నాటవచ్చును. ఒక్కొక్కప్పుడు మానవుని మనస్సు మంచిమార్గమునకును చెడుమార్గమునకును మధ్య అనిశ్చితమగు స్థితిలోనుండవచ్చును; అట్టి సందర్భములో బాహ్యమునుండివచ్చెడు ప్రబలమగు సంకల్పరూపముయొక్క యొత్తిడి అతని నాస్థితినుండి త్రోసివేసి, మంచికో చెడ్డకో అనేక జన్మలవరకు వ్యాపించు కర్మఫలమును గలిగించుపనిని దుర్బలుడగు ఆసోదరుని చేత చేయించవచ్చును. కనుక, గురుసంబంధముచే తనకు గలిగిన ప్రబలమగు సంకల్పశక్తిని యితరులను బలపరచుటకేగాని దుర్బలులుగా జేయుటకెన్నడును ఉపయోగింపకుండ చూచుకొనుటకై శిష్యుడెంత జాగ్రత్తగనుండవలెనో గదా!

సంకల్పము ఏవిధముగా చేయబడునో దానిమీదనే సర్వము నాధారపడి యుండును. శిష్యునికెప్పుడును సదుద్దేశ మేయుండునని మన మూహించుచున్నాము. కాని, అతడు తన యుద్దేశమును ఆలోచనలో పెట్టుటలో లోపముండవచ్చును. ఒక యుదాహరణము దీసికొనిచూతము. ఒక సోదరుడు త్రాగుటకలవాటుపడియున్నాడు. శిష్యుడతనిని గురించి తలంచుట సంభవించినయెడల అతని యోచన లనేక మార్గముల ననుసరించవచ్చును.దురలవాటునకు లోనైనందుకు అతనిని నిరసించుట,అతనిని జూచి అసహ్యపడుట, చీకాకుతో తప్పుకొనుట మొదలగు ప్రమాదకరమగు పనులను శిష్యుడు చేయుట సంభవింపదని మన మాశింపవచ్చును. కాని, "అతడు త్రాగుటచే ఎంతదారుణమగు నేరమును చేయుచున్నాడు ? అతని భార్యాబిడ్డలెంత ఘోరముగా బాధపడుచున్నారోగదా! అతడంతబుద్ధిహీనముగా, అంత స్వార్థపరముగా, అంత దుర్మార్గముగా ఎట్లుండగలిగెనోగదా!" అని శిష్యుడు తలచవచ్చును. అందులోని ప్రతియొకమాటయు నిజమే, అతని తలంపు చాల సవబైనదే, సందర్భ,

ములనుబట్టిపూర్తిగ సమర్థింపదగినదే, ఏవిధముగను దయాహీనమయినది కానిదే; కాని ఆయభాగ్యునకు సహాయపడునదిమాత్రముకాదు. శిష్యుని మానసికప్రవృత్తి యెంతసరియైనది, నిర్దుష్టమైనదియైనను, దాని ప్రధానలక్షణము నిందారూపకమై యున్నది, కనుక ఆసంకల్పరూపముయొక్క ఫలితముగ ఆపాపి బురదలోని కింకను లోతుగా త్రొక్కివేయబడును. "ఆ సోదరునిలోని యీశ్వరుని నేను ప్రార్థించెదను; ఆజీవాత్మను ధైర్యముతో నిలువబడి నీచమగు దేహాత్మయొక్కలోపమును "నేను జయింపగలను, జయించితీరెదను" అనుచు జయింపపూనుకొనమనెదను" అని శిష్యుడు బలముగా, నిర్దిష్టముగా ఎందుకు సంకల్పించకూడదు? అట్లు చేసినప్పుడు ముఖ్యమగు భావము ప్రోత్సాహమగునుగాని నిందకాదు; దాని ఫలితము బాధితుని కృంగదీయక, నిస్పృహయను రొచ్చులోనుండి బయటబడుటకును "వీర్యము, స్వేచ్ఛ" అను దృఢ భూమిపై నిలువబడుటకును సహాయపడును.

## తప్పు అభిప్రాయములు

ధారాళమైన మనస్సు, మత విషయమై ఏవిధమగు మూఢనమ్మకము లేక పోవుట, ఈ గుణములుకూడ ముముక్షువునకు అత్యావసరము. తప్పునమ్మకములు ఒక్కొక్కప్పుడు గొప్ప అడ్డంకులు కాగలవని మేడమ్ బ్లవట్స్కీగారికి ఆమె పరమ గురువు చెప్పినట్లు ఆమె మాతో నొకసారిచెప్పిరి. అందుకు ఉదాహరణముగ ఆయన ఆమెకు చెప్పినదేమన: మిక్కిలి పరిశుద్ధమగు జీవితముల గడుపుచు శిష్యత్వమునకు పూర్తిగాయోగ్యులైన భారతీయసన్యాసులు లక్షమందికలరు. కాని కొన్ని విషయ ములగురించి వారిలో పాతుకొనియున్న తప్పు అభిప్రాయముల కారణముచే వారల తేజస్సులలో బ్రవేశించుటకు పరమగురువులకు గూడ సాధ్యముకాకుండెను. ఆ అభి ప్రాయములు వారలచుట్టును అవాంఛనీయమగు కామభూతములను, మిక్కిలి అసహ్యాకరమగు ప్రభావములను ప్రోగుచేయును; అవన్నియువారలపై ప్రసరించి వారల దురభిప్రాయములనుబలపరచును. కావున వారు తగినంత జ్ఞానమును, బుద్ధిని సంపాదించుకొని వారి దురభిప్రాయముల నన్నిటిని బూర్తిగపోగొట్టుకొను నంత వరకు, ఎట్టిసూచనలను చేసినను వారి మనస్సులలోనికి చొరనేరవు.

"సత్యశీలుడగు మానవుడు దేవునియొక్క శ్రేష్ఠతమమగు సృష్టి," అను సామెత కలదు. కల్నల్ ఇంగర్సాల్ గారు దానిని తలక్రిందుగజేసి "సత్యశీలుడగు దేవుడు మాన

వుని శ్రేష్ఠతమమగుసృష్టి" అని చమత్కారముగా పలికెను. వారియభిప్రాయ మేమనగా, మానవుడు తనకు శ్రేష్ఠతమముగాదోచిన సద్గుణములనన్నిటిని సమకూర్చి, వానిని తనభావనాశక్తికొలది అత్యుత్తమముగ నతిశయింపజేసి,వానికిచ్చెడు దివ్యమగు రూపమునే దేవునిగా భావించును. కనుక, ఒకమనిషికి దేవునిగురించి ఘనమగుభావన యున్నయెడల, అతడు తన ఆదర్శానుసారము జీవింపలేకపోయినను, అతనిలో చాల ఘనతకలదని తెలియును.

కాని, దేవునివిషయమై తప్పుఅభిప్రాయముగలిగియుండుట మానవునికికలిగెడు ప్రమాదకరమగు నడ్డంకులలో మిక్కిలి అపాయకరమైనదైయున్నది. బైబిలు పాత నిబంధనలో జెహోవాను నెత్తురుగ్రోలువానిగను, అసూయాపరునిగను, నీచునిగను, క్రూరునిగనుచేసిన వర్ణనవలన ప్రపంచమునకు కలిగినహాని ఇంతంతయని సులభముగా చెప్పశక్యముకాదు. దేవునియందులేశమైన భయముగలిగించుభావమేదైన నున్నయెడల, అది కేవలము విపత్కరమును, నిజమగు పురోవృద్ధికి లేశమైన ఆశ లేకుండచేయు ప్రతిబంధకరమును అయియుండును; అది మానవుని సూర్యకాంతిలోనికి ఎత్తుకొనిపోయి దానివైభవమును జూపించుటకు బదులు వానిని నిబిడాంధకారమయమగు గుహలో మూసివేయును; భయములో నోలలాడి ఆనందించుచు సర్వవిధముల ఆభావమును తీవ్రముచేయుస్వభావముగల దేవతాగణమును అతని చుట్టునుచేర్చును. మానవుడట్టి ప్రమాదావస్థలోనుండ అతనికి సహాయపడుట చాల వరకసాధ్యముకావచ్చును. కనుక మానవునకు, అందులో చిన్న బిడ్డలకు, అట్టి పాపభూయిష్టమగు సిద్ధాంతమును నేర్పుటకంటె చేయదగిన మహానేరమింకొకటియుండదు. మొస్సుబాఉనట్లుచేయు ఇట్టి మూఢనమ్మకము లేమియులేకుండ శిష్యుడు స్వేచ్ఛగనుండవలెను.

## ధ్యానము యొక్క ఫలితము

పరమ గురువుని గూర్చి ధ్యానముచేయు ప్రతివాడును ఆయనతో నొక నిర్దిష్టమగు సంబంధము నేర్పరచుకొనునని కూడ మీరు జ్ఞాపకముంచుకొనవలెను. దివ్యదృష్టితో జూచినప్పుడు ఆసంబంధ మొకనెలుతురురేఖవలె కనిపించును. పరమగురువుదృష్టి అటులేకపోయినను ఆరేఖయొక్క తాకుడులు ఆయనకు తెలియుటయు దానికి బదులుగా ఆయన దివ్యశక్తిని ప్రవాహమువలె పంపుచుండుటయు జరుగును.

ఆశక్తియొక్క ప్రభావము ధ్యానము ముగిసిన తరువాత చాలసేపటివరకు కనిపించు చుండును. కనుక, ధ్యానమును, పరాగ్రతను, నియమానుసారముగా నభ్యసించుట ముముక్షువునకు మిక్కిలి ఉపయోగకరము; మరియు ధ్యానమువేళ తప్పక ప్రతి దినము సక్రమముగా జేయుట సరియైన ఫలితము నిచ్చుటలో నొక మిక్కిలి ముఖ్యమైన విషయము. ఫలితము పైకి కనిపించకపోయినను దీక్షతో నిలుకడగా ధ్యానము చేయుచుండవలెను. ఫలితమేమియు కనబడనప్పుడు దిగులుపడకుండునట్లు బహు జాగ్రతగానుండవలెను; ఏలయన, దిగులుపడినచో పరమగురువుయొక్క ప్రభావము మనపైన పనిచేయుటకు ఎక్కువకష్టముగానుండును; మరియు దానివలన ధ్యానములో ఆయనగూర్చి యోచించుటకంటె మనలను గూర్చియే యెక్కువగా తలపోయు చున్నామనుటకది నిదర్శనము.

ధ్యానము నభ్యసించుట ప్రారంభించినపుడు స్థూలశరీరముపై నెట్టి ఫలితములు కలుగునో శ్రద్ధగా కనిపెట్టి చూచుకొనుచుండుట మంచిది. విషయమును బాగుగా నెరింగినవారు నిర్ణయించిన పద్ధతుల ప్రకారము ధ్యానముచేసిన యెడల తలనొప్పిగాని మరి యితర బాధగాని యెన్నటికి కలుగకూడదు; అయినను అప్పుడప్పుడు కొందరకట్టి బాధలు కలుగుచుండును. ఏవ్యక్తికయినను ధ్యానము వలన యోచనలోను, మనస్సునేకాగ్రముచేయుటలోను, మామూలుకంటె కొంచెమెక్కువ ప్రయాసకలుగుటనిజము. అందుచేతనే, అతిజాగ్రతగా ఏవిధమగు అమితత్వము లేకుండ శరీరమున కేవిధమగు బాధలుకలుగకుండ ధ్యానముచేయవలెను. ఒక్కొక్కప్పుడు ఉత్సాహముచే అతిశ్రమపడి ధ్యానము చేయుటయు, చాలకాలముచేయుటయు, శరీరమస్వస్థతగానున్నప్పుడుకూడ చేయుటయు, అందువలనకొంతబాధకలుగుటయు చూచుచుందుము. అపాయముకలుగునంతటివరకు మెదడును శ్రమపెట్టి ఎక్కువగా పనిచేయించుటసులభమేకావచ్చును. కాని అట్టి స్థితిసంభవించినప్పుడు సమత్వమును తిరిగిపొందుట తరుచుకష్టమగును. తిరిగి సరిచేయుటకు కొన్ని సంవత్సరములు పట్టెడు అవస్థ ఒకప్పుడు కొద్దిరోజులలోనేరావచ్చును. కనుక, ఎవరికైనను బాధకరమగు లక్షణములు కొంచెమైన కనిపించిన యెడల, వెంటనే ధ్యానమును కొంతకాలమువరకు నిలుపుచేసి శరీరారోగ్యమును బాగుచేసికొనుట అవసరము; మరియు, తనకంటె విషయమును బాగుగా నెరింగిన మరియొకరిని సలహాచేయుట యుచితము.

## సామాన్యము గు ఆటంకములు

"పరమగురువు నన్నేల నుపయోగించరు? నేనాయనయెడల కడుభక్తి శ్రద్ధలతో నున్నాను. నన్నాయన ఉపయోగించవలెనని నాఅభిలాష. ఆయన నన్ను స్వీకరించి బోధించవలెనని నాకోరిక. ఆయన అట్లెందుకు చేయరు?" అనుచు, మన అధ్యక్షులయొద్దకు, నాదగ్గరకు తరుచుగావచ్చి అడుగుచుందురు, లేక, జాబులు వ్రాయుచుందురు.

ఆయన అట్లు చేయకపోవుట కనేక కారణములుండవచ్చును. ఒక్కొక్కప్పుడు అట్లు ప్రశ్నించినవారికి గొప్పదోష మొకటియుండును; ఆదోషమే తగినంతకారణమై యుండవచ్చును. తరుచుగా, గర్వమే ఆదోషమని చెప్పుటకు విచారించుచున్నాను. తానుబోధింపబడుటకు అర్హుడనని యొకమనిషి తలచినను, అందు కనర్హుడిగాచేయు నంతటి అహంభావము అతనిని బాధించుచుండవచ్చును. మన ప్రస్తుతనాగరికతలో, తరుచుగా గానవచ్చుచున్న దోషము, ముక్కోపితనము. ఎంతమంచివాడు, యోగ్యుడు అయినను ఎల్లప్పుడును కడు చిడిముడిపాటుతో నున్నయెడల, అట్టిమనిషి పరమ గురువునకు సన్నిహితుడగుటకుగాని, ఆయనతో సదాసంపర్కముగలిగియుండుటకు గాని అసాధ్యమగును. ఒక్కొక్కప్పుడు ప్రతివిషయమును తెలిసికొనవలెనను కుతూహలమే ఆటంకముకావచ్చును. అదియొక గొప్ప ఆటంకమని విని కొందరాశ్చర్య పడుదురు; కాని, ఇతరులవిషయములను, అందులో ముఖ్యముగా, యోగమార్గమున నొకరున్న అంతరువును వారి యభివృద్ధిని తెలిసికొనగోరుట నిశ్చయముగ ఆటంకమే. అట్టి లోపముగలవానిని పరమగురువుదగ్గరగా చేర్చుకొనుట కేవల మసంభవ మగును.

అతిత్వరితముగా నొచ్చుకొనుట మరియొక సామాన్యమగు ఆటంకమై యున్నది. మనఃపూర్వకముగా బనిచేయగల మంచి ముముక్షువులు చాలమంది అతి త్వరితముగా నొచ్చుకొని బాధపడుచుందురు. ఇతరులతో కలిసి పనిచేయుట చేతకాక పోవుటచే, వారు పరమగురువుల కార్యమున కెంతమాత్రము ఉపయోగపడరు. అట్టివారు తమశీలమును దిద్దుబాటు జేసికొని ఎట్టివానితోనైనను కలిసి సామరస్యముతో పనిచేయుట నేర్చుకొనువరకు ఆగవలసియుండును.

పైనచెప్పిన ప్రకారము పశ్నించెడు వారిలో చాలమందికి ఈవిధమగు లోపము లుండుటయేగాక, వారిదోషమును జూపించినయెడల వారికి కష్టముగానుండును. లోపమున్నట్లు వారు నమ్మరు, మనమే పొరబడుచున్నామనికూడ తలచెదరు; కాని అక్కడక్కడ కొందరు సలహాను గ్రహించి లబ్ధిని బొందుదురు. ఒకసారి నేను అమెరికా దేశములో, ఒక నగరములోనున్నప్పుడు ఒకస్త్రీ నాయొద్దకువచ్చి "నాసంగతి యేమిటి? నేను పరమగురువులకేల సన్నిహితురాలను కాగూడదు?" అని ప్రశ్నించుట నాకు బాగుగ జ్ఞాపకముకలదు. "నిజముగా నీకు తెలిసికొనవలెననియున్నదా?" అని నేనామెనడిగితిని. అవును, ఆమెకు నిజముగా తెలిసికొనవలెననియున్న సంగతి నిశ్చయము. యోగదృష్టిచేగాని, దివ్యదృష్టిచేగాని, మరియేయితరవిధముగాగాని ఆమె కోశములను, ఆమె పూర్వజన్మములను అన్నిటిని పరిశీలించి నిర్ణయించవలసినదని నన్నామె కోరెను. ఆమె మాటనునమ్మి "మంచిది, నిజముగా నీకు తెలిసికొనవలెననియున్నయెడల వినుము. నీవిశ్వములో విశేషమగు అహంకారమున్నది. సర్వము నీగురించియే తలంచుచుందువుగాని, చేయవలసిన కార్యముగురించి నీవేమియు యోచించుటలేదు," అంటిని.

నిజముగా ఆమెకు దారుణమగు కోపమువచ్చెను. గదిలోనుండి హఠాత్తుగా లేచి, నాయోగదృష్టి యామెకంతగా నచ్చలేదనిచెప్పి వెళ్లిపోయెను; కాని ఆమె రెండుసంవత్సరములపిమ్మట ధైర్యముగా నాయొద్దకువచ్చి "మీరు నాకు చెప్పినది నిజమే. ఆలోపమును దిద్దుకొని సరిగ పనిచేయుటకు పూనుకొందును," అని యొప్పుకొనెను. అట్టిసంగతి చాలసార్లు జరిగినది. కాని తిరిగి నాయొద్దకువచ్చి దోషము నొప్పుకొన్నమనిషి ఆమె యొకతెయే. ఇతరులు తనను జూచునట్లుగా తనను తాను జూచుకొనుటకు సంసిద్ధుడయిన శిష్యుడు తనపురోవృద్ధికి సహాయపడగల జ్ఞానమును నిశ్చయముగా సంపాదించును. గురువేమిచెప్పినను కోపములేకుండ వినుటయే శిష్యుని ప్రథమవిధియని పరమగురువులలో నొకరు చెప్పుట బాగుగా జ్ఞాపకముకలదు. శిష్యుడెల్లప్పుడును దోషములను బోగొట్టుకొని,తనను తాను మార్చుకొనుట కాతురపడుచుండవలెను. మేడమ్‌బ్లవట్‌స్కీగారు శిష్యత్వమనగా మష్టునంతను తినివేసి పరిశుద్ధమగు బంగారమును విడిచివేయు ఆధ్యాత్మిక ద్రావకమని యొక పరమగురువు నిర్వచనముచేసినట్లు చెప్పిరి. *

*Five years of Theosophy. 2nd Edition-Page 36.

స్వార్థపరాయణత్వము, గర్వముయొక్క మరియొక రూపమే. కాని ప్రస్తుత కాలమున అది మిక్కిలి ప్రధానముగానున్నది. అనేక వేలసంవత్సరములనుండి నిర్మాణమగుచున్న దేహాత్మయొక్క వ్యక్తిత్వము ప్రబలమై, తరుచుగా విశేషస్వాభిమానముగలదగుచున్నది; అందుచేత దాని దృక్పథమును త్రిప్పివేసి యేవిషయమునైనను తాను జూచునట్లుగాగాక, పరులు చూచువిధమున జూచుటకలవాటు పడునట్లు చేయుట కష్టతమమగు కార్యములలో నొకటైయున్నది. పరమగురువును చేరదలచినవారు, నేను 'అంతరంగికజీవితము' అను గ్రంథములో విశదపరచినట్లు, తమ వృత్తము యొక్క కేంద్రమును విడిచి నిశ్చయముగా బయటకు రావలెను.

ఒకానొకప్పుడు, అట్లు ప్రశ్నించువారిలో ప్రత్యేకముగా దోషమని చెప్ప దగినదేదియు కనిపించకపోవుట సంభవించును. వారిని జూచువారు "నీవు వెనుక బడుటకు నిర్దిష్టమగు కారణముగాని, దోషముగాని నాకు కనిపించుటలేదు, కాని సర్వతోముఖముగా నీవు కొంచెమభివృద్ధి నొందవలసియున్నది." అని మాత్రము చెప్పగలరు. అట్టిసంగతి యెవరికిచెప్పినను రుచించదు, కాని అది యదార్థము. వారింకను తగినంత పెద్దవారుకాలేదు; అన్నాతకలుగవలెననిన, ఇంకను కొంత పెరుగవలసియున్నది.

పరమగురువులకు దగ్గరగా రాలేకపోవుటకు తరుచుగా జనులకు ఆటంకముగా పరిణమించుచున్నది విశ్వాసము, ఇచ్ఛ, అనునవిలేకపోవుటయే. ఎప్పుడో ఒకప్పుడు విజయుడనై తీరెదనను దీక్షనుబూని, ఆదినము సాధ్యమైనంతత్వరలో రావలెనను పూనికగలిగి, కృతార్థుడనయ్యెదనని సంపూర్ణవిశ్వాసముగలిగి, ఆతురతతో ప్రయత్నించనంతవరకు అతడే జయమును బొందలేకపోవుట నిశ్చయము. మనలో కొందరిలో కొన్నిలోపములున్న సంగతి యెరుగుదుము; కాని అట్టి గాఢమగు పూనికలేకపోవుటచేతనే మనలో అధమము కొందరైనను వెనుకబడియున్నారని నేను గట్టిగా నమ్ముచున్నాను.

కార్యముపట్ల పరమగురువు స్వయముగా ఎట్టి చిత్తవృత్తిగలిగియుందురో అట్టి చిత్తవృత్తి మనకుకూడ అలవడవలెననిన, కొంతబలము, కొంతఘనత కావలయును ఏలయన, మనలోనున్న లోపమునకుతోడు లోకులందరిసంకల్పముల యొత్తిడియావత్తు మనల నెదుర్కొనియుండును. ఈరెండు కష్టములనుగురించి మొదటనే మేడమ్

బ్లవట్స్కీగారు మనకు పరిపూర్ణమగు హెచ్చరిక నిచ్చియుండిరి. ఆమె యిట్లు వ్రాసిరి:

"ఎవ్వరైన నొకరు పరీక్షితుడుగా ప్రమాణముచేసి ప్రతిజ్ఞ దీసికొన్న యెడల, వెంటనే కొన్ని ఆంతరంగికఫలితములు కలుగును. అతనిస్వభావములో అంతర్గతముగ, అవ్యక్తముగనున్న దోషములు, అలవాటులు, గుణములు, నిరోధించబడినకోరికలు— మంచివిగానీ, చెడ్డవిగానీ, మరి యెట్టివిగానీ — సమస్తము పైకి విసరివేయబడి వ్యక్తమగును. ఉదాహరణమునకు, ఒకనికి ఆడంబరముగాని, స్త్రీలోలత్వముగాని, ఆశగాని యున్నయెడల ఈదుర్గుణములన్నియు తప్పక పైకి వ్యక్తమగును. ఇంతవరకు వాని నతడు జాగ్రత్తగా దాచిపెట్టుటగాని, నిరోధించుటగాని జరిగించినను, ఇప్పుడవి బహిర్గతము కాకమానవు. అవి యట్లు వ్యక్తమైనప్పుడు వెనుకటికంటె నూఱురెట్లు ఎక్కువకఠినముగా పోరాడవలసియుండును; తనలో అటువంటి వాసనలనన్నిటిని చంపుకొనువరకు పోరాటము సాగించవలసియుండును.

అట్లుగాక, అతడు సౌజన్యత, దాతృత్వము, పరిశుద్ధమగు శీలము, మితము మొదలగు సుగుణములనుగాని, లేక అవ్యక్తముగా మరియేయితరసుగుణమునుగాని కలిగియున్నయెడల అవన్నియును నిరోధింపనసాధ్యమై తప్పక బహిర్గతమగును... ... యోగశాస్త్రవిషయములలో అదియొక నిత్యమైనట్టియు, ఎన్నటికి మార్పులేనట్టియు ధర్మము." *

"నిద్రపోవుచున్న కుక్కలను పండుకొననిమ్ము" అను పాతసామెత పాఠకునకు జ్ఞప్తియున్నదా? దానిలో బ్రహ్మాండమైన గూఢార్థముకలదు. నిజముగా పరీక్షింపబడువరకు ఏపురుషుడుగాని, స్త్రీగాని, తన నైతికబలము నెఱుగడు. పరీక్షింపబడలేదుగనుకనే వేలకొలది జనులు ప్రపంచములో గౌరవనీయులుగా గణించబడుచున్నారు...... శిష్యత్వమునకై ప్రయత్నించుటకు పూనుకొనిన మనిషి అట్టి ప్రయత్నముచేయుచున్న కారణముచేతనే తన పశుస్వభావములో నిద్రించియున్న ప్రతి కామమును మేల్కొల్పును. శిష్యుడు తనలో నణగియున్న దుర్గుణముల నన్నిటిని నెదుర్కొనవలసియుండుట మాత్రమేగాక, అతని సంఘముయొక్కయు జాతియొక్కయు సంచితమైన దుష్టశక్తుల ధాటినిగూడ అత డెదుర్కొనవలసి యుండును.........తన ఇరుగుపొరుగు వారితో బోవుచు, సరిగ వారివలెగాని, లేక వారికంటె కొంచె

* Secret Doctrine vol V. P. 417.

మెక్కువ మంచిగనో చెడ్డగనోగాని యుండుటతో సంతుష్టిబొందినయెడల, ఎవ్వరును అతనిగురించి తలపెట్టరు. కాని, సాంఘికజీవిత మెంతబోలుగను, హాస్యాస్పదముగను నున్నదో, ఎంతకపటముతోను, స్వార్థపరత్వముతోను విషయాసక్తితోను కామము తోను ఇతరదుర్మార్గములతోను నిండియున్నదో, అతడు కనిపెట్టినాడనియు, వానిలో నుండి పైకి ఉన్నతస్థితికి బోవుటకు నిశ్చయించుకొనెననియు, లోకమునకు తెలిసిన పక్షమున వెంటనేవానిని ద్వేషింతురు. మరియు ప్రతి దుష్టుడును, మూఢనమ్మకము గల ప్రతిమూర్ఖుడును, ద్వేషబుద్ధిగల ప్రతిదుర్మార్గుడును ఒక్కొక్క ప్రతికూలమగు ఇచ్ఛాశక్తి ప్రభావము నతనిపై బరపును. *

పరిణామప్రవాహములో నెమ్మదిగా కొట్టుకొనిపోయెడు వారీస్థితిని యెప్పుడో భవిష్యత్తున చాలకాలమునకు చేరుదురు; అప్పటికి ప్రజాభిప్రాయము ఈయాదర్శ ముల కనుగుణ్యముగా నుండును గనుక వారి కార్యము చాల సులభమైయుండును. కాని, యిప్పుడు మనచుట్టును కోట్లాది జనులు తమస్వంతతలంపులను తలంచు చున్నందున, అవన్నియు ప్రజాభిప్రాయమై మనపై నిలుకడగా నొత్తిడికలుగచేయు చున్నందున దానిని (ఈప్రజాభిప్రాయముయొక్క యొత్తిడినే క్రైస్తవులు ప్రేరేపణ మందురు) మన మెదుర్కొనవలసియున్నది. దీని నెదుర్కొనవలెననిన, వాస్తవమగు కృషి, నిజమగు ధైర్యము, పట్టుదల కావలయును. మనము పట్టు విడువకుండ పని చేయుచుండవలెను; ఎన్నిసార్లు ఓడినను, ధైర్యమును వీడక, లేచి ముందుకు పోవుచుండవలెను.

ముముక్షువుయొక్క కామ మానసిక శరీరములు నిరంతరము ప్రేమ, భక్తి, సానుభూతి, జిజ్ఞాసవంటి నాలుగైదు ప్రజ్వలితములగు గొప్పరాగములను ప్రదర్శించు చుండవలెను. కాని, అట్లు కొన్ని గొప్పరాగములు మనోహరములగు రంగులతో అద్భుతముగను, స్పష్టముగను స్పందించుచుండుటకు బదులు, సాధారణముగా కామ శరీరమంతయు ఎరుపు, గోధుమ, బూడిద, నలుపు రంగులు గలిగి తరుచువందకుపైగా గల సుడులతో చిత్రితమయినట్లు కనిపించును. ఈసుడులు, స్థూలశరీరమునకు సహ జముగా నుండవలసిన స్పర్శజ్ఞానమును లేకుండచేయు మొటిమలు (ఉలిపిరికాయలు) వలె నుండును. అభ్యర్థి యీలోపములను బోగొట్టుకొనవలెను; నీచరాగములతో మామూలుగానల్లుకొనియున్న చిక్కును బాగుగాదువ్వితీసివేయవలెను.

*Five years of Theosophy 2nd Edn. P. 35

## భక్తిసంపూర్ణముగానుండవలెను

ఈమార్గమున సగము, సగము పద్ధతు లుండనేరవు. చాలమంది జనులు ప్రిజలందరిచే విశేషముగా దూషింపబడు 'అనానియస్', "సఫీరా" గార్ల స్థితిలో నున్నారు. నూతన క్రైస్తవోద్యమము గెలుచునో లేదో నిశ్చయములేక, పాపము వారు కొంత ఆస్తినిదాచుకొనుటకై (వారట్లు చేయుట అసహజముగాని, నింద్యము గాని కాకపోయినను) ప్రియత్నించిన సంగతి పాఠకులకు జ్ఞాపక ముండవచ్చును. వారు చాల యుత్సాహముతో నుండిరి. వారియ్యగలిగిన దంతయు నియ్యవలె నను కొనిరి, కాని యుద్యమము భగ్నమయినచో జీవనాధారముగ నుండుటకై కొంత ఆస్తిని భద్రపరచుకొనుట తెలివిగల మార్గమని వారు తలచిరి. దానికి వారినెంత మాత్రిము నిందించ నవసరములేదు; కాని వారుచేసిన మిక్కిలి అనుచితము, హాని కరమునైన పనియేమనగా, కొంత ఆస్తిని దాచుకొని యుండిన్ని ఆసంగతిని యొప్పు కొనక పోవుటయేగాక, తమ యావదాస్తిని యిచ్చి వేసినట్లు నటించిరి. వారి ననుక రించువారిప్పుడు చాలమందికలరు. ఆకధ నిజమైనది కాదని ఆశించెదను, ఏలయన, అపోస్తలుడు నిశ్చయముగా వారినతికఠినముగా ఖండించెను.

మనము మన సర్వస్వమును సమర్పించక మన కొరకై కొంత దాచుకొం దుము. నాఅభిప్రాయము ధనమనికాదు; మనలో మిక్కిలి లోతుగా దాగియున్న స్వార్ధభావమే పరమగురుచరణసన్నిధికి పోకుండ మనలను వెనుకకు లాగుచున్నది. యోగవిద్యాభ్యాసమునందిదిపనికిరాదు. "ఫలానామనిషితో పనిచేయుమని అడుగ నంతవరకు పరమగురువుననుసరించెదను, నేను చేసిన దాని నంతను గుర్తించి పత్రి కలలో ప్రిచురించినంతకాలము నేను ఆయన ననుసరింతును" అని మనస్సులో మినహాయింపులు చేయకుండ పరమగురువును సంపూర్ణముగా ననుసరించవలెను. మన సామాన్యప్రిపంచబాధ్యతలను విసర్జించవలెనని నాఅభిప్రాయముకాదు; మన ఆత్మయంతయు సంపూర్ణముగా పరమగురువున కర్పితము కావలెననియే నాఅభి ప్రాయము. దేనినైన విడిచివేయుటకును, ఎచటికైనబోవుటకును సంసిద్ధులమైయుండ వలెను. మనజీవితములలో సేవాకార్యము మిక్కిలి గొప్పవిషయమై యున్నందున ఈత్యాగముచేయ సిద్ధముగానుండవలెనుగాని, ఒకపరీక్షార్ధమైకాదు.

"నేనీపనుల నన్నిటిని జేసినచో పరీక్షార్థమై పరమగురువు నన్నెంతకాలములో తీసికొందురు ?" అని యొక్కొక్కప్పుడు ప్రశ్నింతురు. ఆలస్యమేమియు నుండదు, కాని రహస్యమంతయు నీప్రశ్నలోని "చేసినచో" అను మాటలలోనున్నది. ఆపనులనన్నిటిని పరిపూర్ణముగా జేయుట అంతసులభమైన పనికాదు. పరిపూర్ణముగా జేయుట ఆవశ్యకమైన యెడల శిష్యత్వమున కాశించుటకైనను నిస్సంశయముగా చాల కాలముపట్టును. కాని, "చేయగలిగిన దంతయు యథాశక్తిగ జేసినవాడు మాకు కావలసిన దంతయు చేసినట్లే" అని యొక పరమగురువు చెప్పెను. సేవకొరకై సేవజేయుటలోనే ఆనందము బొందక, యోగమార్గమున గుర్తింపబడుటకై యాశించువాని యుద్దేశము నిజముగ సదుద్దేశము కాదని చెప్పవలెను. సదుద్దేశముగలవాడే అయిన యెడల, అతడు పరమగురువు ఎప్పుడు, ఎట్లు అనుగ్రహించునో సర్వము ఆయనకు విడిచిపెట్టి, శ్రమయనునది లేకుండ సత్కర్మను జేయుచునే యుండును.

మన భారతీయ సోదరులకు ఈవిషయములో చక్కని సంప్రదాయముకలదు. "ఇరువది, ముప్పది యేండ్లసేవ యొక లెక్కలోనిదికాదు; జీవితమంతయు సేవజేసినను, ఆంతరంగికముగ నొక పరమగురువుచే శిక్షితులగుచున్నను, బాహ్యముగా నేవిధముగను గుర్తింపబడకుండనున్నవారు భారతదేశములో పెక్కుమందిగలరు", అని వారందురు. కొద్దిసంవత్సరముల క్రిందట ఇట్టి విషయమొకటి నాకు తెలిసినది. మన భారతీయసోదరులు కొందరివిషయమై దీనినిగురించి నేనొకనాడు ప్రశ్నించగా పరమగురువు "వీరునలుబదిసంవత్సరములనుండి నాదృష్టిలోనున్నారు. వారు దానితో సంతుష్టిబొందవచ్చును," అని జవాబుచెప్పిరి. వారు నిజముగా సంపూర్ణమగు సంతుష్టితో నుండిరి. అదిజరిగినతరువాత కొంతకాలమునకు వారధికముగా గుర్తింపబడి యోగదీక్షను బడసిరి. భారతీయసోదరుడు తనసేవ పరమగురువునకు తెలియునని తనలో నెరుంగును; కాని ఆయన బాహ్యముగా గుర్తించినను, గుర్తింపకపోయినను శిష్యుడు లక్ష్యము చేయడు. ఆయన తనను గుర్తించియున్నయెడల మిక్కిలి ఆనందించును, కాని గుర్తించకపోయినను తన కార్యమును మామూలుగా సాగించుచుండును.

— ♦ —

# నాలుగవ అధ్యాయము

## పరీక్షమాణకాలము

### సజీవప్రతిమ

నేనిదివరలో వర్ణించినట్టి త్రికరణశుద్ధిగ పనిచేయు సాధకుల యొక్కయు, సేవకులయొక్కయు శ్రేణులలోనుండి పరమగురువనేకపర్యాయములు తమశిష్యుల నెంచుకొనిరి. వారినినిర్దిష్టముగా స్వీకరించుటకుముందు తమతో సన్నిహితమగు సంపర్కమునకు వారికి యోగ్యతకలదని ధృవపరచుకొను నిమిత్తము పరమగురువులు ముందుగా కొన్ని జాగ్రతలను ప్రత్యేకముగా దీసికొందురు. అదియే పరీక్షమాణావస్థ యొక్క ఉద్దేశము. వారొక అభ్యర్థిని శిష్యునిగా దీసికొనుటకు ద్దేశించినప్పుడు వానిని కామశరీరములో తమయొద్దకు తీసికొనిరమ్మని అదివరకే తమతో సన్నిహిత సంబంధ ముగల పాతశిష్యునికోరుటమామూలు. ఇది జరుగునప్పుడు పెద్ద సంస్కారమేమియు నుండదు; పరమగురువు నూతనశిష్యునకు సలహాపూర్వకముగా కొన్ని సంగతులను చెప్పి, అతడేమిచేయవలయునోగూడ చెప్పెదరు. తరువాత తరుచుగా సహజమగు వారిదయతో అభ్యర్థి అంతవరకుచేసిన సత్కార్యములకు అతని నభినందించెదరు.

ఆ తరువాత, సువర్లోక, భువర్లోక, ఆకాశీయ (భూలోకమునకు సంబంధించిన ఆకాశ) పదార్థములతో పరమగురువు అభ్యర్థియొక్క కారణ, మానసిక, కామ మయ, ప్రాణమయ శరీరములకు సరియైన ప్రతిరూపమును నిర్మింతురు. ఆప్రతిమ నప్పుడప్పుడు చూచుటకై ఆయన కందుబాటుగ నుండునట్లుంచెదరు. ప్రతివిగ్రహ మునకు అసలు మనిషితో నొకవిధమగు నాకర్షణశక్తిచే సంబంధము కలుపుదురు; అందువలన అభ్యర్థియొక్క సంకల్పములలోను, రాగములలోను ఎట్టిమార్పుకలిగినను వెంటనే అదియొక విధమగు స్పందముచే సరిగా ఆజీవప్రతిమలో ప్రతిఫలించును. కనుక పరమగురువు దానివైపుతిరిగి యొకసారి చూచినచో, వెంటనే అభ్యర్థి నిజ శరీరములో నెట్టి వికారములు సంభవించెనో, అతడు కుపితుడగుచున్నాడో, అపరి శుద్ధభావములకుగాని, చీకాకునకుగాని, విచారమునకుగాని, మరియే అనుచితమగు భావమునకుగాని లోనగుచున్నాడో సర్వము యథాతథముగ తెలిసికొనగలుగుదురు. అభ్యర్థి శరీరములలో ప్రమాదకరమగు నుద్రేక మేదియు గలుగుట లేదని చాలకాల

మాపరిమితిమను పరీక్షచేసి తెలిసికొన్నతరువాత, ఆయన అభ్యర్థిని శిష్యునిగా స్వీక రించి తమకు సన్నిహితునిగా జేసికొందురు.

అట్లు శిష్యునిగా స్వీకరించినతరువాత, పరమగురువు మనమూహించుటకుగాని, గ్రహించుటకుగాని సాధ్యముకానంత దగ్గరగా అతనిని తీసికొందురు. ఆయన ప్రత్యేక మగు శ్రద్ధచూపించనవసరము లేకుండ ఆయన శక్తులు నిత్యము శిష్యునిపై ప్రభావము గలిగి శిష్యుని సంస్కరించుచుండుటకై శిష్యుని తేజోమండలమును తమతేజోమండల ముతో మిళితముచేయకోరుదురు. కాని అట్టి అన్యోన్యసంబంధమొకనైపునమాత్రమే పనిచేయదు; పరమగురువుయొక్క కామమానసికశరీరములలో వికలత్వముగలిగించెడు స్పందము లేమయిన శిష్యునిలో ఉత్పన్నమగునెడల, ఇరువురకు సంపూర్ణమగు సంయోగము అసంభవమగును. శిష్యుడు కాదలచినవాడు అట్టి స్పందములన్నియు నణగిపోవు వరకు వేచియుండవలెను. పరీక్షమాణావస్థలోనున్న శిష్యుడు అన్యులకంటె గొప్ప వాడైయుండనక్కరలేదు; పరమ గురువు కార్యనిర్వాహణమునకు కొన్ని విధములనెక్కువ యోగ్యుడైయుండును; అందుచే అతనిని కొంతకాలము పరీక్షించుట యుచితము. ఏల యన, చాలమంది జనులు ఉత్సాహవంతులై మొదట చాల ఆతురత జూపించుచు వృద్ధిలోనికి రాదగినవారివలె కనిపింతురు, కాని దురదృష్టవశమున కొంతకాలమునకు అలసిపోయి జారిపోవుదురు. అభ్యర్థి తనలో రాగోద్రేకమువలన గలిగెడులోపములను జయింపవలెను; ప్రశాంతముగా, పరిశుద్ధముగా నుండగలుగునంతవరకు నిలుకడగా శ్రద్ధతో బనిచేయుచుండవలెను. చాలకాలమువరకు ఆసజీవప్రతిమలో నేవిధమగు తీవ్రమయిన తారుమారులు లేనియెడల పరమగురువు శిష్యుని తమకు దగ్గరగా తీసికొనదగిన సమయము వచ్చినదని తలపవచ్చును.

ఆసజీవప్రతిమలో దోషములు, వికలత్వములు మాత్రమే కనిపించునని తలంచగూడదు. శిష్యుని కామలోక, సువర్లోకములలోని చైతన్యావస్థలు సంపూర్ణముగా ఆవిగ్రహములో ప్రతిబింబితమగును, కనుక విశేషముగా పరహితత్వమును సంతోషమును, వ్యక్తముచేయుచు ప్రపంచముపై శాంతిని, మానవుల యెడల సౌహార్దమును ప్రసరింపజేయుచుండవలెను. పురోవృద్ధికావలసిన యెడల దుర్గుణ ములు లేకపోవుటయేగాక నిర్దిష్టమగు కొన్ని సుగుణములు కూడనుండుట యెల్లప్పు డును ముఖ్యముగా ఆవశ్యకమనిమరువరాదు. హానిచేయకపోవుట గొప్పవిషయమే; కాని మన మహాదాదర్శమూర్తి (గౌతమబుద్ధుడు) ఎల్లప్పుడును మంచిపనులు చేయు

చుండెడువారని వ్రాయబడినసంగతిని జ్ఞప్తియందుంచుకొనవలెను. ఆయనచేసిన బోధనంతను సంగ్రహముగా ఒక పద్యములో చెప్పుమని బుద్ధభగవానుని కోరగా, ఆయన "కీడుచేయుట మానుము" అని చెప్పి, వెంటనే "మేలు చేయుట నేర్చుకొనుము" అనెను.

పరీక్షలోనున్న శిష్యుడేదయిన అసాధారణమగుమంచిపనిని చేసినయెడల, పరమగురు వాసమయమునం దతని వైపు కొంచెమెక్కువ శ్రద్ధనుజూపి, అవసరమని తలచినయెడల నొక ప్రోత్సాహతరంగమును బరపును, లేక అతడేరీతిగచేయునో చూచుట కొక కార్యమును శిష్యునకు ప్రాప్తింపచేయును, కాని, అట్లు అవకాశములు గలుగచేయు పనిని సామాన్యముగ ఆయన తమ పెద్ద శిష్యుల కొప్పగింతురు. అభ్యర్థికవకాశములనిచ్చు బాధ్యతమాదే, కాని అది చాల గురుతరమగు బాధ్యత. అతడా యవకాశమును దీసికొని పనిచేసినయెడలమంచిదే, కాని అతడట్లుచేయనియెడల అదియొక కళంకముగా పరిగణింపబడును. జనుల కవకాశముల నియ్యవలెనని మేమనుకొందుము. కాని సందేహింతుము. ఏలయన, మేమిచ్చిన అవకాశములను దీసికొన్నచో వారికి మేలుకలుగును. గాని వారు వెనుక దీసినచో మరియొకసారి యవకాశమునిచ్చుట చాల కష్టమగును.

కనుక, పరీక్షమాణావస్థలో నున్నప్పుడు పరమగురువుతో శిష్యునకుగల సంబంధమెట్టి దనగా, ముఖ్యముగా శిష్యుడు పరీక్షింపబడుచుండుటయు, అప్పుడప్పుడేదయిన నొక కార్యములో వినియోగింపబడుచుండుటయునై యుండును. పరమగురువులు అసాధారణమగు, ఆశ్చర్యకరమగు పరీక్షలను జేయుట ఆచారము కాదు; సామాన్యముగా, కొంతవయస్సు గడచిన మానవుడు పరీక్షయందుంచబడినప్పుడు అతని మామూలుజీవితమును గడుపుకొననిచ్చెదరు. జీవితములో అతనికి కష్టసుఖములు, చిక్కులు, కలిగినప్పుడు అతని మానసిక ప్రవృత్తి యెట్లుండునో అతని సజీవప్రతిమలో ప్రతిబింబితమగును గనుక, అతని శీలము అతని యభివృద్ధి బాగుగ తెలియగలవు. దీనినిబట్టి అతడు శిష్యుడుగా నుండుటకు యోగ్యుడని ధృవపడినయెడల పరమగురు వతనిని దగ్గరకు చేర్చుకొని శిష్యునిగా స్వీకరింతురు. దీనిని నిర్ణయించుట కొకప్పుడు కొన్ని వారములే చాలును, లేక రెండు సంవత్సరములుకూడ పట్టవచ్చును.

## పిన్నలగు పరీక్షితులు

ప్రస్తుతకాలమసాధారణమైనదగుటచేత గతకొద్ది సంవత్సరములలో చాలమంది యువకులు పరీక్షితులుగా దీసికొనబడిరి. వారి తల్లిదండ్రులును, సమాజములో చాల కాలము సభ్యులుగానుండి త్రికరణశుద్ధిగా త్యాగముచేసి విశేషశ్రమపడి, యిరువది మొదలు నలుబది సంవత్సరములవరకు పనిచేసియున్నవారును తమనందరను తప్పించి ఆయువకుల నేల యెంచిరని ఆశ్చర్యపడుటగలదు. అందుకు కారణమును సులభముగా చెప్పవచ్చును.

ఇంతవరకు మీఅభివృద్ధికై కృషిచేయుచు జగద్గురువుయొక్కరాకకు మార్గము నాయితము చేయుచుండుట మీకర్మమైయున్నది; మీరు యోగ్యులైనట్టియు వయస్సు గడచినట్టియు సభ్యులయిన కారణముచేతనే కొన్ని ఆత్మలను,అనగా పూర్వజన్మలలో విశేషముగా నభివృద్ధిబొంది యున్నతస్థితినిబొందిన ఆత్మలను, మీరాకర్షించిరి; అందుచేతనే వారు మీబిడ్డలైజన్మించిరి. స్థూలశరీరములలో మీబిడ్డలై యున్నవారు ఉన్నత లోకములలో మీకంటె చాలనభివృద్ధిబొందిన పెద్దలు అని తెలిసినచో మీరాశ్చర్య పడనవసరము లేదు. పెక్కుసంవత్సరములు మీరు ధ్యానముచేసి, శ్రమపడిపనిచేసినను మీకులభించవలెనని కోరుటకైనను సాహసింపని మహాభాగ్యము — ఒక పరమ గురువుతో సన్నిహితసంబంధము — అకస్మాత్తుగ నొక బాలునికిగాని బాలికకుగాని లభించినచో మీరాశ్చర్యపడవద్దు. మీబిడ్డ మీకంటె చాల పైకెగురగలిగియుండ వచ్చును; అతనికట్టి శక్తికలదుగనుకనే అతని జన్మయు, విద్యాభ్యాసమును దివ్యజ్ఞానసమాజములో చాలకాలమునుండి పరిశ్రమచేయుచున్న మీకొప్పగించబడినది. మీరింతకాలముచేసిన పతనమువలన ఆదర్శప్రాయుడగు జనకునిగా, ఒకయుత్తమమగు జీవాత్మకు ఉపాధినొసంగదగిన జనకునిగా నుండుట నేర్చుకొనియుండవలెను. కలవరపడుటకుగాని, ఆశ్చర్యపడుటకుగాని బదులు ప్రపంచరక్షకులుకాగలవారిలో నొకని భౌతికజీవితమును శిక్షణచేయుభాగ్యము మీకు లభించినందుకు మీరెంతైన సంతోషముతో నానందించుచుండవలెను.

ఆచిన్నబిడ్డలు తమకు సంప్రాప్తమయిన గౌరవమునుగాని, యీసంస్కారము యొక్క అద్భుతమహిమనుగాని, వైభవమునుగాని యేమిగ్రహింపగలరనియు, ఏమి యానందింపగలరనియు బహుశః మీరాశ్చర్యపడవచ్చును. శిష్యునిగా స్వీకరింపబడినది, దీక్షనొసంగబడినది జీవాత్మయని మాత్రము మరచిపోకూడదు. స్థూలోపా

ధులు చాలవరకు జీవాత్మయొక్క లక్షణములను ప్రదర్శించుటకును, అధమము జీవాత్మచేయవలసిన కార్యమున కాయుపాధులు ఆటంకములు కాకుండునట్లును ఆయుపాధులను స్వాధీనముచేసికొనవలసియున్న సంగతి నిజమే; కాని ఆపనిని చేయవలసినది, అభివృద్ధి బొందవలసినది జీవాత్మయే. ఆజీవాత్మ పూర్వజన్మలలో ఆపని నెంతవరకు చేసెనో మీకు తెలియదు. ప్రస్తుతము జన్మలెత్తుచున్న జీవాత్మలలో చాలమంది విశేషపరిణామ వికాసమునొందిన ఆత్మలైయున్నవి; జగద్గురువువచ్చునపుడు ఆయనకు శిష్యులై, ఆయనకండగనుండిపనిచేయవలసిన వారినందరను ఈజీవాత్మలనుండియే ఏరుచవలసియుండును. ఈజన్మలో చిన్నతనములోనే శిష్యులయినవారు గత జన్మలలో చాలకాలము శిష్యులైయుండవచ్చును; ఈశిష్యులతో సాహచర్యములభించుట వృద్ధులగు మనకు మహోత్తమమగు గౌరవమైయున్నది; ఏలయన ఆప్రభువుయొక్క కార్యమును ఎక్కువ పరిపూర్ణముగా చేయగలుగునట్లు ఈయువకులకు శిక్షణనిచ్చుట రీత్యా మన మాప్రభువుకార్యమునకు సహాయపడుచున్నాము. **The Hidden Side of Things** అను గ్రంథములో "బిడ్డలతో మనకు గల సంబంధము" అను అధ్యాయములో ఈవిషయమై, అనగా, బిడ్డలకు సరియైన శిక్షణనిచ్చుటకేమి యవసరమో, బిడ్డలు తమ పూర్వార్జితములోని యుత్తమమయిన దానినంతను భద్రముచేసికొని తమ స్వభావములలోని రమ్యమగు లక్షణముల నన్నిటిని సంపూర్ణవికాసము నొందునట్లభివృద్ధిజేసికొనుటకై యెట్లు మనము సహాయపడగలమో చాల విపులముగ వివరించియుంటిని. పెద్దలైనవారు సరియైనజ్ఞానములేక బిడ్డలలోని సులక్షణములను నిర్దయులైనాశముజేయుచుండుట మిక్కిలి శోచనీయము. బిడ్డల యెదుట మోటుతనమును, క్రూరత్వమును జూపుటచే వారిలో పెరిగెడు భయమువలన ఎట్టి వినాశకరమగు ఫలితములు కలుగునో దెలుపుటకు ఉదాహరణముగ నాకు గలిగిన ఒక యనుభవము నిచట చెప్పవలసియున్నది. బడికిపోయి చదువుకొనవలసిన బిడ్డలుగల తల్లిదండ్రులు ఆబిడ్డల నొక యుపాధ్యాయున కొప్పచెప్పకపూర్వము తీసికొనవలసినశ్రద్ధకు, చేయవలసిన దరియాప్తుకు మితిలేదు; ఏలయన ఆయుపాధ్యాయుడు మూర్ఖుడైనచో బిడ్డలకు తరువాత దిద్దుబాటు చేయుటకు సాధ్యము కానంత గొప్పహాని కలుగవచ్చును.

## క్రూరత్వమువలన బిడ్డలకు కలిగెడు హాని

అట్టి పశుత్వమువలన ఒక్కొక్కప్పుడు ఎటువంటి విపత్తుసంభవించునో తెలుపుటకు ప్రబలమగు నిదర్శనమొకటి కొంతకాలము క్రిందట నాకు తెలియవచ్చెను.

మనసభ్యులలో నొకచిన్నవానికి ప్రథమయోగదీక్ష యొసంగబడినప్పుడు దగ్గరనుండు గల మహాగౌరవము నాకు కలిగెను. ఆసందర్భమున మైత్రేయ ప్రభువు స్వయముగానుపదేష్టగనుండిరి. ఆసంస్కారసందర్భములో మామూలు ప్రకారము అభ్యర్థి చాల ప్రశ్నలకు జవాబుచెప్పవలసియుండెను. ఆ ప్రశ్నలు కొన్ని క్లిష్టసందర్భములలో, అసాధారణమగు స్థితిగతులలో నేవిధముగ నుత్తమమగురీతిని సహాయముచేయ సాధ్యమగునన్న విషయమునకు చెందియుండెను. ఆచిన్నవానిని పసితనములో అతి కఠినముగను క్రూరముగను బాధించిన యొక పురుషుని క్షమించినావా, లేదా యనియు, ఆపురుషునికెట్లుసహాయము చేయుదువనియు అతనిని ప్రత్యేకముగా ప్రశ్నించిరి.

అప్పుడా యుపదేష్ట ఒక తేజోమండలముయొక్క విగ్రహమును జేసిచూపెను. మనోహరమగు రంగులతో సుకుమారమగుఛాయలు తళుకుతళుకుమని మెఱయుచుండ వెలుతురు దానిలోదాగుడుమూతలాడుచుండ, ఆరూపమతి రమ్యముగ శోభిల్లుచుండెను. అప్పుడాయన యిట్లనిరి : "సున్నితమై, సాలెపట్టువలె నతిసుకుమారమై గనబడుచున్న వీనిని చూడుము. ఇవియే మానవజాతియొక్క ప్రశస్త, ఉత్తమగుణములకు బీజములు; భయముగాని, జంకుగాని లేశమైన లేనట్టి అతిగాఢము, పరిశుద్ధమునగు ప్రేమవాయువులోనే అవి వృద్ధిచెందగలవు. ఎవడైన నితరలక్షణములనన్నిటిని పరిపూర్ణముగగలిగియుండి, నీవిపుడు చూచుచున్నవానిని సంపూర్ణముగ వికసింపజేసి బలపరచుకొనగలిగినయెడల నొక్క జన్మలోనే అతడు సిద్ధపురుషుడుకావచ్చును. నీకట్టి భాగ్యమబ్బుననియు, నీవొక గొప్పసిద్ధపురుషుడవై నేను భూలోకమునకు వచ్చినపుడు నా కండగ నా ప్రక్కను నిలుతువనియు మేమాశించితిమి. కాని, నీజననమునకు పూర్వమే నాసేవకై వారు నిన్నర్పణము జేసినకారణముచే నేనెవరికైతే నిన్ను ఒప్పగించితినో వారు నిన్ను కేవలము అయోగ్యుడగు నొకని చేతులలోబెట్టిరి. ఆ మూర్ఖుని దుర్మార్గము నీపైబడక పూర్వము నీ తేజోమండల మిట్లుండెను. అతని దుర్మార్గమెట్లు నిన్ను మార్చివేసినదో చూడుము."

వెంటనే ఆవిగ్రహము చాల వికృతముగా నలిగిచుట్టుకొనిపోయెను. అది తిరిగి స్థిరపడిన తరువాత పూర్వపు చిత్రవర్ణములు మెఱపులు అన్నియుపోయి వాని స్థానములలో లెక్కలేని చిన్నమచ్చలుండెను. జరిగిన ప్రమాదమును ఈజన్మలో దిద్దుబాటుజేయుట సాధ్యముకాదనిచెప్పి ఆయన మరియు నిట్లనిరి: "అయినను, నేనువచ్చు

నపుడు నీవు నాకు సహాయపడవచ్చును; ఈజన్మలో అర్హత్ అగుదునని యాశించె దను; కాని సంపూర్ణసిద్ధికొరకు కొంతకాలమాగవలెను; మాదృష్టిలో నొక ఆత్మ యొక్క పురోవృద్ధిని యిట్లు ఆటంకపరచుటకంటె ఎక్కువ నింద్యమగు నేరమేమియు లేదు."

ఆ తేజోరూపమట్లుచుట్టుకొని, కొయ్యబారిపోవుట జూచుచుండిన ఆపిన్న అభ్యర్థి తన భావ్యభ్యుదయమంతయు ఆదుర్మార్గుని నిర్దయచేనెట్లు నాశము నొం దెనో తలపోయుచుండ, చాలవరకు మరచిపోయిన పూర్వానుభవమంతయు అతని స్మృతికివచ్చెను. ఇంటినుండిపంపబడిన ఆచిన్న బాలుని యమితబాధ, నిత్యము అతనిని ఆవరించియున్న భయము, జంకు, చెప్పరాని భీతి, తప్పించుకొనుటకుగాని తగ్గించు కొనుటకుగాని దారికనిపించ నట్టియు దహించివేయుచున్నట్టియు అవమానము, క్రూరరాక్షసిచేతులలోనుండి తప్పించుకొనుటకు వీలులేకపోవుటచే క్రుంగదీయుచున్న దీనత్వము, క్రూరమగు అన్యాయము జరుగుచున్నదని తీవ్రమగురోషము, ఆశలేక దిక్కులేక నిలుచుటకాశ్రయములేక, మొఱవినెడు దేవుడు లేక, అనుభవించిన దుఃఖమంతయు ఒక్కసారి అతనికి తిరిగి జ్ఞప్తికివచ్చెను. అతని మనస్సులో దీనినంతను గనిపెట్టిచూచుటచే బాల్యమందుగలిగెడు దారుణవిషాదము, దానివలన చిరస్థాయిగ నుండిపోయెడు చెడుఫలితములు కొంతవరకప్పుడు నాకు గోచరమయ్యెను.

బిడ్డలయెడల క్రూరత్వముజూపుటయను హేయమగు ఈపాపము జీవన్ముక్తి బొందెడు స్థితిలోమాత్రమేగాక, సర్వదా పురోవృద్ధిని అరికట్టుచుండును. ఆర్య జాతిలో ఇపుడు వికసింపవలసిన ఉత్తమ క్రొత్తగుణములన్నియు, పైన వర్ణించిన దానికంటె తక్కువపరిమాణములోనైనను, అదేవిధముగా సుకుమారమగు లేత మొగ్గలువలె వ్యక్తమగును. వేలకొలది సందర్భములలో ఇవన్నియు బుద్ధిహీనుడగు తండ్రియొక్కయో, ఉపాధ్యాయునియొక్కయో క్రౌర్యముచేత నలిపివేయబడి నాశమునొందుచున్నవి; లేక పాఠశాలలోని పెద్దపిల్లలు చిన్నపిల్లలను క్రూరముగా బెదిరించి, యులికించి, యేడ్పించుటచే త్రొక్కివేయబడుచున్నవి. అందుచే అనేక మంచిజీవులు అనేకజన్మలెత్తినను ఒకే అంతరువున నిలిచిపోవుచున్నారు. వారిని బాధించిన దుర్మార్గులు పతితులై తక్కువజాతులలో బుట్టుచున్నారు. ఇప్పుడు జన్మ లెత్తుచున్న అనేకజీవాత్మలు, యోగదీక్షను బొందుట కర్హులుకాకపోయినను, త్వరిత ముగా పరిణామ వికాసమును బొందుచున్న సంగతి నిశ్చయము. వారుతమశీలములలో

సుకుమారములగు ఈ నవ్యలక్షణములను జేర్చుకొని యభివృద్ధిబొందవలసియున్నదిః- అట్టివారి అభివృద్ధివిషయములో గూడ క్రౌర్యము బహుప్రమాదకరమై యుండును.

పైనచెప్పిన చిన్నవానిసంగతి తెలియుటకు పూర్వము జీవన్ముక్తి బొందనై యున్న ఆఖరుజన్మలో జీవాత్మకు చిన్నతనములో పూర్తిగా సంతుష్టికరమగు పరిస్థితులుండి తీరవలెనని నేను వినియుండలేదు; కాని అప్పుడావిషయము తెలిసినతరువాత అది యెంతయుక్తమో యెంత ముఖ్యమో స్పష్టమయ్యెను. యూరోపియను శరీరములలోనుండగా బహుతక్కువమందికి మాత్రమే జీవన్ముక్తి ప్రాప్తించుటకది యొక కారణమైయుండవచ్చును; ఏలయన, ఆవిషయములో ప్రపంచములో నితరులందరికంటెను మనము (యూరోపియనులము) వెనుకబడియున్నాము. ఏది యెట్లున్నను క్రూరత్వమనెడు ఈరాక్షసదురాచారమువలన కేవలము కీడుతప్ప మరేమియు సంభవింపదని నిస్సంశయముగా చెప్పవచ్చును. అది యెచట కనిపించినను దానిని తొలగించుటకై మనసభ్యులు తప్పక పనిచేసి తీరవలెను; మరియు వారు బాధ్యత వహించిన బిడ్డల కెన్నడును అట్టి అపాయము కలుగకుండ పరిపూర్ణ శ్రద్ధతీసికొనవలెను.

## బిడ్డలకు పరమగురువు

దేవతలకు మానవులకుకూడ నైతేప్రియప్రభువును గురువని తరుచు చెప్పుచుందురు; ఆవిషయమునే మరియొకవిధముగా, అనగా, ఆధ్యాత్మిక రాజ్యాంగవిధానములో మతమునకు విద్యకు మంత్రియని చెప్పుదురు. సనాతనమగు సత్యము నొక క్రొత్తమార్గమున ప్రకటించుటకై, మన మనుకొనునట్లు ఒకక్రొత్తమతమును స్థాపించుటకై, అనుకూలమగు సమయములయందు ఆయన స్వయముగ నవతరించుటగాని తమ శిష్యులలో నొకరిని పంపుటగాని జరిగించుచుందురు. అంతేగాక, సమస్త మతములు నిరంతరము ఆయన అధీనమందుండును. మతము క్రొత్తదైననుపాతదైనను, ఏమతము ద్వారా ఏచక్కని నూతన ప్రబోధముగావింపబడినను ఎల్లప్పుడును ఆప్రభువువల్లనే ప్రేరేపింపబడినదని మనము తెలిసికొనవలెను. ఈ విశాలప్రపంచములో జ్ఞానమును వెదజల్లుటకై ఆయన అవలంబించెడు పద్ధతులు మనకేమియు తెలియవు; నోటిమాటచేతనేగాక అనేకవిధములుగా ప్రబోధము జరుగుచుండును; కోట్లాదిదేవతల

యొక్కయు మనుష్యులయొక్కయు ప్రజ్ఞాలక్షణముల ఉద్ధరణమునకు ఆయన నిత్యము అహర్నిశములు కృషిసలుపుచుండుట నిశ్చయము.

ప్రభువు వైవస్వతమనువున కిప్పుడు మోర్యమహర్షి గారు సహాయులుగానుండి ముందు ఆయన స్థానమున మనువుగా రానైయున్నారు. అటులనే మైత్రేయ ప్రభువునకు ఆయన అద్భుతమగు కార్యములో కుడిభుజముగనుండి సహాయపడు చున్న కూట్‌హూమిమహర్షి గారు ఆయనస్థానమున బోధిసత్త్వులుగా రానైయున్నారు. ఆయన ఆదర్శప్రాయులయిన ఆచార్యులైయుండుటచేత, చిన్నతనములో పరీక్షమాణావస్థలో నుంచబడుటకుగాని, శిష్యులుగా స్వీకరింపబడుటకుగాని యువకులను ఆయన యొద్దకే మేము తీసికొనిపోవలసియున్నది. తరువాత నితరకార్యములకొరకు ఈయువకు లితర పరమగురువులచే నుపయోగింపబడవచ్చును, కాని, మొదట వారందరు కూట్‌హూమిమహర్షి గారి రక్షణలోనేయుండి శిక్షణ బొందుచుందురు. వృద్ధిలోనికి రాదగిన యువకుడని ఆమహర్షి గారు ఎంచినవారికి సరియైన పద్ధతులలో శిక్షణము నిచ్చుట చాలకాలమునుండి నేను చేయు కార్యములో నొక భాగమైయున్నది. అట్టి యువకుల కీ లోకములో నాతో సంబంధము కలుగచేసి, తరువాత వారిలో నెట్టి లక్షణముల నభివృద్ధిచేయవలెనో, వారికెట్టి ప్రబోధము చేయవలెనో పరమగురువు సంక్షేపముగా ఆదేశముల నిచ్చెదరు. అనంతమగు జ్ఞానము కలిగినవారగుటచే, ఆయన ఈయువకుల శరీరములతోను, మెదడులతోను వ్యవహరించవలసినప్పుడు సరిగా వృద్ధులవిషయములో చేసిన విధముగా చేయరు. పదిసంవత్సరములక్రిందట మనతాలూకు ముగ్గురు పిన్నవయస్కులను పరీక్షమాణావస్థయందు ప్రవేశపెట్టినప్పు డేమిజరిగెనో మీకు తెలిపెదను.

## పరీక్షితులుగా ప్రవేశించుట

మేము వెళ్లుసరికి కూట్‌హూమి మహర్షి ఆయన యింటి వసారా మీద కూర్చునియుండిరి. నేను చిన్న పిల్లలను తీసికొని ఆయన వైపునకేగుచుండ, ఆయన పిల్లలనుజూచి కరములజాపిరి. మొదటి పిల్లవాడు బాగసుగా నొంటికాలుమీద మోకరించి ఆయనకరమును ముద్దుపెట్టుకొనెను, ఆతరువాత మహర్షి గారి మోకాలును తాకుచు తన మోకాళ్ళమీదనే కూర్చుండెను. ఆ పిల్లలు తమ కండ్లను పరమగురువు

నేత్రములపై నిలిపిరి, వారి యాత్మలు పూర్తిగ వారికండ్లలోనుండి ప్రవహించు చున్నట్లుండెను. మహర్షియు అతి మనోహరమగు మందహాసముతో ఇట్లనిరి :

"అసామాన్యమగు ఆనందముతో మీకు స్వాగతమిచ్చుచున్నాను; ఇది వరలో మీరందరు నాతో గలిసిపనిజేసిరి; ఈసారిగూడ అట్లే చేయుదురని ఆశించె దను. ఆప్రభువురాకకు పూర్వమే మీరుమాలో చేరవలెనని నాయాశయము; అం దుచే చాలచిన్నతనములోనే మీకు శిక్షణము నొసంగుపనిని ప్రారంభించుచున్నాను. మీరు పూనదలచిన కార్యము అన్నిటిలోను మిక్కిలి మహిమాన్వితమైన కార్యము గాని సులభమైనదికాదు. ఏలయన మీచిన్నశరీరములపై మీకు సంపూర్ణనిగ్రహ ముగలుగవలెను; మిమ్ములను మీరు పూర్తిగా మరచిపోయి పరులకాశీస్సులనిచ్చుట కును, మనకర్తవ్యమును నెరవేర్చుటకును మాత్రమే మీరు జీవించవలెను."

మోకరించియుండిన మొదటిబాలుని చుబుకముక్రిందచేయిబెట్టి ప్రకాశవంత మగు మందహాసముతో మహర్షి "మీరాపనినిచేయగలరా?" యని యడిగిరి. అంద రును ప్రయత్నించెదమనిబదులుచెప్పిరి. అప్పుడు పరమగురువు ప్రతివానికి వేర్వేరుగ కొంత ముఖ్యమగు సలహానిచ్చి ప్రతివానిని వేర్వేరుగ "ప్రపంచములో నాయాజ మాన్యము క్రిందపనిచేయ ప్రయత్నించెదవా?" యని యడిగిరి. ప్రతివాడును "నేను చేసెదను" అని జవాబు చెప్పెను.

అప్పుడాయన మొదటిపిల్లవానిని తమ కెదురుగ నిలిపి, తమ రెండుహస్తము లను అతనిశిరముపై నుంచిరి; వెంటనే తిరిగి ఆబాలుడు మోకాళ్ళపై వ్రాలెను; ఆయన అప్పుడిట్లనిరి :

"అయినచో నిన్ను పరీక్షితునిగ తీసికొందును, త్వరలో నా కెక్కువ సన్ని హితుడవగుదువని ఆశించెదను; నేను నాయాశీస్సు నీకిచ్చెదను, నీవు దానినితరులకు పంచిపెట్టుము."

ఆయనట్లు పలుకగా, ఆపిల్లవాని తేజస్సు అద్భుతముగ విస్తరించెను. అం దులో భక్తిని, ప్రేమను తెలియజేయురంగులు సజీవమగు తేజస్సుతో ప్రకాశించెను. అప్పుడా బాలుడు, "గురుదేవా! నన్ను నిజమగు మంచివానిగాజేయుము, మీకు సేవజేయుయోగ్యత నాకనుగ్రహింపుము", అని ప్రార్థించెను.

కాని, పరమగురువు నవ్వుచునిట్లనిరి : "నాముద్దులబిడ్డా, ఆపని నీయంతటనీవే చేయవలెను, కాని నాసహాయమును, నాయాశీస్సును ఎల్లప్పుడు నీకిచ్చుచుందును."

ఆతరువాత మిగిలిన బాలురకుకూడ అట్లే సంస్కారము గావించిరి. వారి తేజస్సులుకూడ అట్లే విస్తరించి, అద్భుతముగ ప్రకాశించుచు నెక్కువ దృఢముగను నిలుకడగను గనిపించెను.

తరువాత పరమగురువు లేచి పిల్లలను తమతో తీసికొనివెళ్ళుచు "ఇప్పుడు నాతో రండు, నేనేమిచేసెదనో చూడుడు," అనిరి. మేమందరముకలిసి దిగువను నది మీాదనున్న వంతెనదగ్గరకుదిగిపోతిమి. ఆయన మమ్ముల నొకగుహాలోనికి తీసికొని పోయి పరీక్షమాణావస్థలోనున్న శిష్యులందరి సజీవప్రతిమలను ఆబాలురకు చూపిరి. "ఇప్పుడు మీాప్రతిమలనుగూడ చేసెదను," అనుచు వెంటనే వారికండ్ల యెదుటనే వారివిగ్రహములను ప్రత్యక్షముగావించిరి. ఆబాలురు వానినిజూచిమిక్కిలి యాశ్చర్యపడిరి. వారిలో నొకడు గద్గదస్వరముతో "నేనట్లున్నానా? యనెను.

ఆప్రతిమలలో నొకదానిలో నెఱ్ఱనిమచ్చ యొకటి కనబడెను; పరమ గురువు ఆవిగ్రహముయొక్క మాతృకవైపు చమత్కారముగాచూచి "అదియేమిటి" యని ప్రశ్నించిరి.

"నేనెరుగను" అనిబాలుడు బదులుచెప్పెను; కాని యాబాలుడూహించెనని నాయభిప్రాయము. ఏలయన, అదిగతరాత్రి అతనికి కలిగిన రాగోద్రేకముయొక్క ఫలితము.

పరమగురువప్పుడా తేజోమండలములలోని వివిధములగు రంగులను, వాని యాకృతులను జూపించిరి; మరియు వాని లక్షణములను, ఏ యే విషయములలోనేది మార్పు చెందవలెనో ఆవివరములను వారికి తెలియచేసిరి. దినదినము వారెట్లు ప్రవర్తించుచున్నది తెలిసికొనుటకా విగ్రహములను జూడవలసియుండుననియు, చూచుట కవి రమ్యముగానుండునట్లు వారునడుచుకొందురని యాశించెదమనియు పరమగురువుచెప్పి వారి తుదియాశీర్వాదమునిచ్చి పంపివేసిరి.

వయస్సు గడచినవారు పరీక్షితులుగా తీసికొనబడినప్పుడు వారికి తగినకార్యములను చాలవరకు వారేనిర్ణయించుకొనవలెనని చెప్పుదురు; కాని చిన్నబిడ్డల విషయములో అప్పుడప్పుడా పరమగురువు నిర్దిష్టమగుపనినేదైన చేయుటకవకాశమిచ్చి ఆపనినివారెట్లుచేయుదురో కనిపెట్టిచూచుచుందురు; ఒక్కొక్కప్పుడు ఈచిన్న బాలురలో కొందరకు ప్రోత్సాహము ప్రబోధము కలుగచేయుటకై ప్రత్యేకసందేశముల

నిచ్చుచు ననుగ్రహింతురు. ఆమార్గమునే అనుసరింపగోరెడు ఇతర యువకుల యుప యోగార్థమై ఆసందేశములలోని కొన్ని భాగముల నిచ్చట పొందుపరచెదను :

## పరమగురువులసలహా

"మీజీవితములోని ప్రధానోద్దేశము ఆసోదరబృందమును సేవించుటయని నాకు తెలియును; మీముందు యింకను ఉన్నతమగు సోపానములుగలవని మీరు మరువకూడదు; ఆమార్గమున పురోవృద్ధిని బొందవలెనన్న నిరంతరము మెలకువతో నుండవలెను. సేవజేయుటకు సర్వదాసంసిద్ధులై యుండుటయేగాక, ఎల్లప్పుడును అవకాశములకొరకు కనిపెట్టి చూచుచుండవలెను. అంతేకాదు, స్వల్పకార్యములలో ఇతరులకు సహాయపడుచుఅవకాశములగల్పించుకొనవలెను, లేనిచో గొప్పకార్యము సంప్రాప్తమైనప్పుడు మీరు దానిని గమనింపక పోవచ్చును.

"మీకును మాకును గల గుప్తసంబంధము నొక నిమిష మైనను మరువవద్దు; అది నిరంతరము మీకు ప్రోత్సాహకారణమై యుండవలెను; మరియును ఆసంబంధము మీచుట్టును ఆవరించియుండి వ్యర్థమగు సంకల్పసమూహములనుండి యొకడాలు వలె మిమ్ములను రక్షించుటయేగాక, నిత్యము ఆధ్యాత్మికసాధనకు ప్రోత్సహించుచుండవలెను. సామాన్యజీవితములోని శూన్యమును అల్పత్వమును మనముగ్రహించి జాలిపడవలసియున్నను, అవి మనల నెంతమాత్రము అంటరాదు. జీవన్ముక్తి నిచ్చెడు వర్ణనాతీతమగు ఆనందమిప్పుడు మీకుకలుగనేరదు, కాని ఆయుత్తమజీవితమును జీవించెడు మహాపురుషులతో మీరేకమైయున్నారన్న సంగతి జ్ఞప్తిగలిగియుండవలెను; వారి వెలుగును ఈదిగువలోకములో పంచిపెట్టవలసినవారు మీరే, కనుక మీయంతరువున మీరు గూడ ప్రేమను సంతోషమును ప్రసరింపజేయుచుసూర్యులవలె బ్రకాశించుచుండవలెను. మిమ్ములోకమభినందింపకపోవచ్చును, గ్రహింపక పోవచ్చును, కాని ప్రకాశించుటయే మీవిధి."

"విశ్రమించుటకిది సమయముకాదు; జయింపవలసిన ఉన్నత శిఖరములింకను గలవు. ప్రజ్ఞనభివృద్ధి జేసికొనవలసిన యావశ్యకతనుమరువరాదు. మరియు మనలో కనికరము, అనురాగము, తితిక్ష, బాగుగ వికసింపవలెను. లోకములో భిన్నమైన అభిప్రాయములుండుననియు, అన్నియు గౌరవపాత్రములై మన్నింపదగినవై యుండవచ్చుననియు, ప్రతివాడును గ్రహింపవలసియున్నది. మాటలాడుటలో పొరు

తనముగాని, కీఱకుతనముగాని, అమితముగా వాదించు స్వభావముగాని లేశమైన గనిపింపకూడదు; అట్టి స్వభావముగలవారు నిరంతరము మెలకువతో నుండి పైకి వచ్చినప్పుడెల్ల దాని నణచివేయుచుండవలెను; మితముగ భాషింపవలెను; అదియైనను ఎల్లప్పుడును మృదువుగను, సరసముగను మాటలాడవలెను. పలుకునది దయగా, యోగ్యముగా నున్నదో లేదో బాగుగాముందు యోచనచేయకుండ ఎప్పుడును మాట్లాడవద్దు. తనలో ప్రేమను వృద్ధిజేసికొనుటకు ప్రయత్నించువాడు చాల తప్పులనుండి తప్పించుకొనగలడు. ప్రేమయే పరమోత్తమమగు గుణము, అదిలేనిచో మిగిలిన గుణములన్నియు బూడిదలోపోసిన పన్నీరువంటివే యగును.

"అనుచితములగు సంకల్పములను రాగములను నిశ్శేషముగా తఱిమివేయవలెను; అవి మిమ్ములను నంటుట అసాధ్యమగువరకు మీరాపనినిచేయుచుండవలెను. సోదరబృందముయొక్క చైతన్యము నిస్తరంగమైన సముద్రమువలెనుండగా మీలోని కోపము అలలను లేవదీసి వారి ప్రశాంతమును చెఱుపును. పురోవృద్ధికి గర్వము తీవ్రమైన ఆటంకము గనుక, దానిని పూర్తిగ రూపుమాపవలెను. మీతలపులలోను మాటలలోను మనోహరమగు సౌకుమార్యము, ఎన్నడును ఎవ్వరిని నొప్పింపనేరని పరిపూర్ణమగునేర్పులోగలపరిమళము వెలయుచుండవలెను. దానిని సంపాదించుట కష్టమే, కాని మీరు దీక్షబూనినచో పొందవచ్చును.

"నిర్దిష్టమగుసేవయే మీలక్ష్యమైయుండవలెను గాని కేవలము వినోదముకై కాలక్షేపముచేయుటకాదు; పరులకు సహాయపడుటకై ఏపనినిచేయగలమో దాని గురించి యోచింపవలెనేగాని, మీకుచేయగోరుదానిగురించి యోచింపకూడదు; నిన్నునీవు మరచిపొమ్ము,పరులను గురించియోచింపుము.ఎప్పుడో యొకప్పుడు గాక, ఎల్లప్పుడును అన్నివేళలయందును, శిష్యుడు దయతో, ఉపకారబుద్ధితో, సహాయపడుచుండవలెను. సేవకైగాని, సేవజేయుటకు నీవు యోగ్యతసంపాదించుటకైగాని వినియోగింపనికాలమంతయు మాదృష్టిలో వ్యర్థమైపోయినదేయని జ్ఞాపకముంచుకొనుము."

"మీలోనేమైన దోషములను మీకుకనిపెట్టినయెడల వానిని ధైర్యముతో పురుషునివలె సార్థకముగ చేతబూనుము. పట్టుదలతో పనిచేసినయెడల తప్పక విజయమునొందెదరు. ఇదంతయు ఇచ్ఛాశక్తికి సంబంధించినది. అవకాశములకొరకు, సూచనలకొరకు శ్రద్ధతో కనిపెట్టిచూచుచుందుము; మీరు సమర్థులు కావలెను;

మీపనిని మీతరపున నేనుచేయజాలనుగాని సర్వదా మీకు సహాయముచేయ సిద్ధముగనున్నాను; సర్వతోముఖమగు గంభీరమును సంపాదింపుము, కేవలము సేవాతత్పరులై జీవింపుము."

"నీవు చక్కగా జేసితివి, కాని యింకను శీఘ్రతరముగ జేయవలెనని నా కోరిక. నీవు పరులకెట్లు సహాయపడెదవో పరీక్షించుటకై కొన్ని యవకాశముల నిచ్చితిని, యింతవరకు నీవు వానిని ఘనముగ గైకొంటివి, కనుక, నీకంత కంత కెక్కువ గొప్ప అవకాశములనిచ్చెదను. నీవు వానిని గుర్తించి సరిగ వినియోగించుకొనుట మీదనే నీపురోవృద్ధి యాధారపడియుండును; ఒకకార్యమును జయప్రదముగ జేసినందుకు ఎక్కువ పనిని జేయుట కవకాశములు లభించుటయే బహుమతియనియు, నీకు స్వల్పవిషయములుగా కనిపించువానియందు నీకుగలవిశ్వాసమే గురుతరకార్య నిర్వహణమందు నిన్నుపయోగించుటకు మార్గముకాగలదనియు జ్ఞప్తియందుంచుకొనుము. నీవు త్వరలో నాకెక్కువ సన్నిహితుడవు కాగలవనియు, అందువలన ఆ పరమప్రభువు చరణసన్నిధికికొనిపోగలమార్గమున నడుచుచున్న నీసోదరులకు సహాయపడగలవనియు నేనాశించెదను. నీకు గొప్ప ప్రేమశక్తియున్నందుకును, నీప్రపంచమును జ్ఞానమను సూర్యరశ్మిచే ప్రకాశింపచేయుట తెలిసికొన్నందుకును, రాజలక్షణమగు వితరణముతో విచ్చలవిడిగా నిన్ను నీవుదానముచేసికొనుట, పుడమిఱేనివలె విరాళములను వెదజల్లుట, ఎట్లో తెలుసుకొన్నందుకును నీవు కృతజ్ఞుడవై యుండవలెను. అదివాస్తవముగమంచిదే, కాని యీమహాప్రేమకుసుమముయొక్క హృదయములో గర్వమనెడు యొక చిన్నకళంకము దాగియుండి క్రమముగా పూర్తిగవ్యాపించి కుసుమమునంతను వికలముగావించి నాశముజేయకుండమాత్రము బహుజాగ్రత్తగానుండుము." "నీకు జ్ఞానము కావలెనన్న వినయముగనుండుము, జ్ఞానము నీయధీనమయినప్పుడు ఇంకను ఎక్కువ వినయముతోనుండుము," అని మన మహాసోదరుడు (గౌతమబుద్ధుడు) వ్రాసినసంగతి జ్ఞాపకముంచుకొనుము. వినయమనెడి సుగంధముగల చిన్నమొక్కను నీలోనాటి, దాని మనోహరమగు సౌరభము నీశరీరములోని ప్రతినాళములోను పూర్తిగ ప్రవహించువరకు శ్రద్ధగా పెంచుచుండుము."

"ఐక్యముకొరకు నీవు ప్రయత్నించునపుడు, నీవు పరులను నీలోనికి చేర్చుకొనుటగాని, నీతేజోమండలములో వారిని కప్పివేయుటగాని, 'వారిని' 'నీ' తో

నొకటిగా జేసికొనుటగాని చాలదు. అట్లు చేయుట చాల గొప్పవిషయమే, కాని, నీవు అంతకంటె ఎక్కువగా పురోగమించి 'వారి' లో ప్రతివానితో 'నీవు' ఒకటి యగునట్లుచేసికొనవలెను. నీసోదరుల హృదయ కుహరములలో ప్రవేశించి వారి నర్థముచేసికొనవలెను. కేవలము కుతూహలముకొరకు (అనగా వారిహృదయము లలోని రహస్యములను తెలిసికొనవలెనన్న కోరికతో) అట్లు చేయరాదు; ఏలయన, సోదరుని హృదయ మతిరహస్యము, అతిపవిత్రమునగు స్థలము; దానిలో నేమి గలదో పరీక్షించుటకుగాని, చర్చించుటగాని నీవు ప్రవేశింపరాదు; భక్తితో గ్రహించుటకు, కనికరించుటకు, సహాయపడుటకు మాత్రమే కృషిచేయవలెను."

"అమ్మా, నీచుట్టునున్న మూఢులను సన్మార్గమునబెట్టుటకు నీప్రభావము నుపయోగించి నీకు సాధ్యమైనదంతయు జేయుటలోను, మరియొక పరిశుద్ధజీవి నన్ను చేరుటకు చేయుచున్నకృషిలో నామెకు సహాయపడుటలోను, నీవు చాల మంచిపని చేసితివి. నీకీర్తి మకుటములో అదియొక నుజ్జ్వలమగు తారవలె నెల్లప్పుడును ప్రకాశించుచుండును; ఆమెకు ముందుకూడ సహాయపడుచుండుము; నీమకుటమునకు చేర్చగల యితర తారలేమైన గలవేమో చూడుము. ఈ నీ సత్కర్మ నిన్నతి శీఘ్రముగా నాదగ్గరకు చేర్చుకొనుట కవకాశమిచ్చినది, లేనిచో ఇంత శీఘ్రముగ ఆపని జరిగియుండదు. పరమార్గము ననుసరించుచున్నవారికి భక్తిశ్రద్ధలతో సహాయపడుట కంటె త్వరితముగా పురోవృద్ధిబొందుటకు నిశ్చయమగు పద్ధతి మరియొకటిలేదు. చిరకాలమునాటి పాతసఖుని నీవిప్పుడు తిరిగి కలిసికొనుటలో చాల నదృష్టవంతురాలవు, ఏలయన, ఇరువురుమనుష్యులు వేర్వేరుగ పనిచేయునపుడు గలిగెడు ఫలముకంటె కలిసిపనిచేసినయెడల విశేషముగ నెక్కువ ఫలితము కలుగగలదు.నీవు బాగుగప్రారంభించితివి, ఆమార్గముననే శీఘ్రముగా నిశ్చయమగు నమ్మకము గలిగి సాగిపొమ్ము."

"మహిమాన్వితమగు మాబృందములో క్రొత్తగచేరుచున్న నీకు స్వాగతమిచ్చుచున్నాను. నిన్ను నీవు పూర్తిగ మరచిపోవుటగాని, నిశ్శేషముగా లోకసేవకై యర్పణముచేసికొనుటగాని అంత సులభముకాదు, కాని మనకియ్యబడిన కార్యమును పరిపూర్ణముగ జేయుచు, ఇతరుల కీశ్వరప్రసాదమువలెనుండుటకు మాత్రము జీవించుచుండుటయే మనము చేయగలపని. ఆత్మవికాసమును బొందుటలో బాగుగ ప్రారంభించితివి. కాని, యింకను చేయవలసినది విశేషముగనున్నది. కోపముయొక్క ఆనవాలు లేశమైనను లేకుండ అణచివేయవలెను. సలహాను, ప్రబోధమును బొందుట

కెల్లప్పుడును సంసిద్ధుడవైయుండవలెను. అణకువను, స్వార్థత్యాగమును పెంపొందించుకొనుము. సేవచేయుట కుత్సాహముతో పొంగుచుండుము. అట్లయినచో ఆమహాగురువునకు తగిన ఉపకరణము కాగలవు; ప్రపంచరక్షకసేనలో యోధుడవు కాగలవు. నీవట్లగుటకు సహాయపడుటకే నిన్నిపుడు పరీక్షితునిగా గ్రహించితిని.

"నీవుచేసినదానికి సంతోషించితిని. కాని యింకను ఎక్కువపనిచేయవలెనని నాకోరిక. నాబిడ్డా, శీఘ్రముగ నభివృద్ధిబొందగలశక్తి నీకుగలదు; దీని నెంతకష్టపడియైనను, పొందుటకు నిశ్చయించుకొన్న లక్ష్యముగా నీవు నీయెదుట నుంచుకొనవలసినదని నాకోరిక. నీవు నిగ్రహించవలసిన ఆటంకములని చెప్పబడినవానిలో కొన్ని ముఖ్యమైనవి కానట్లు నీకు కనిపించవచ్చును; కాని, అది వాస్తవముకాదు. ఏలయన అవి నీఅంతరంగస్థితికి బాహ్యచిహ్నములు. మన ప్రభువువచ్చినపుడు నీవు వారికుపయోగకరముగనుండగోరినచో, నీయంతరంగస్థితిని పూర్తిగా మార్చుకొని చక్కజేసికొనవలెను. అట్లు ఆ మూలాగ్రముగా సంస్కరించుకొనుట నీకు సులభముకాదు, అయినను, నీవు చేయదగిన ప్రయత్నమగుటమాత్రము నిశ్చయము. నీకై నీవు నిర్ణయించుకొనవలసిన నియమములని నేనభిప్రాయపడుచున్న వానిని యీక్రింద తెలియచేయుచున్నాను;

(1) నిన్ను, వ్యక్తిగతమగు నీసొంతకోరికలను మరచిపొమ్ము; నీబలము, నీయోచన, నీయుత్సాహము పూర్తిగా వినియోగించి యితరులకు సేవజేయవలెనని జ్ఞాపకముంచుకొనుము.

(2) నిన్ను ప్రత్యక్షముగా అడిగినప్పుడుతప్ప ఏవిషయమైకూడ నీ అభిప్రాయమును ప్రకటింపకుము.

(3) మాట్లాడుటకు ముందు, నీవు పలుకునది యెవరినెట్లు బాధించునో బాగుగ యోచనచేయుము.

(4) ఒక సోదరుని లోపమును బయటపెట్టుటగాని, విమర్శించుటగాని యెన్నడును జేయకుము.

(5) నీవు నేర్చుకొనవలసినది చాలగలదనియు, కనుక నీవు పొరబడియుండవచ్చుననియు, జ్ఞాపకముంచుకొనుము; ఎల్లప్పుడు తగు వినయముతో మాటాడుము.

(8) ఎవరైన నిన్ను పిలిచినప్పుడు నీవు చదువుచున్నదానినో చేయుచున్న దానినో పూర్తిచేయువరకు నాగక, అక్షణమాత్రదే తెచివెళ్లుము; ఏదయిన ముఖ్యమగు కార్యమును నెరవేర్చుచున్నచో అదియేదో మృదువుగా తెలియచేయుము.

నిన్ను నేను చాలదగ్గరగా తీసికొనదలచితిని. పై నియమములను నీవు గమనించినయెడల త్వరలోనే అట్లు చేయగలుగుదును. ఈలోపున నిన్ను నే నాశీర్వదించుచుందును."

## చిన్నబిడ్డలవలెనుండుము

ఈయుపదేశములను చదువువారు వానిపరమసౌలభ్యముజూచి ఆశ్చర్యపడవచ్చును. నవనాగరికతవలన కలిగిన బహుక్లిష్టమగు పరిస్థితులలో జనులకు మార్గదర్శిగానుండుటకుగాని, సహాయపడుటకుగాని ఈయుపదేశము లెంతమాత్రము తగవని వారు నిరసించిన నిరసింపవచ్చును. కాని యిట్లు తలచువారు శిష్యునిజీవితసారము నెరుగరు. సామాన్యప్రపంచజీవనముయొక్క క్లిష్టసమస్యలలో శిష్యునికి నిమిత్తము లేదనియు, పరమగురువు చెప్పినట్లు "మీలోకమును విడిచి మాలోకములోనికి" రావలెననియు, సౌలభ్యముతోను ఏకాగ్రతతోను జీవింపగలభావ ప్రపంచములోనికి శిష్యుడుప్రవేశింపవలెననియు, ఆనవ్యప్రపంచములో తప్పుఒప్పులు పునః స్పష్టముగా నిర్వచనము చేయబడుననియు, సారాంశములు మనయెదుట సరళముగను సుగ్రాహ్యముగను గోచరమగుననియు వారికి తెలియదు. శిష్యుడు నిరాడంబరమగు సులభజీవనమును జీవింపవలయును; అతడలవరచుకొను సౌలభ్యమువలననే ఉన్నతమగు పురోవృద్ధి అతనికి సాధ్యమగును. మన ప్రస్తుతజీవితమును ఒక పెద్ద చిక్కుగా, అనిశ్చయమైనదానిగా, పెద్దగందరగోళముగా, బలహీనులు పతనమై మునిగిపోవునట్టి సుడిగుండములను ప్రభవింపజేయు తుపానుగా చేసికొంటిమి. కాని యొక పరమగురువునకు శిష్యుడయినవాడు బలము, బుద్ధిగలిగి తన జీవితమును తన చేతులలోనుంచుకొని, దివ్యమగు సౌలభ్యముతో సహజముగా జీవించవలెను. అతని మనస్సు మానవకల్పితములగు ఈగందరగోళములను, ఈభ్రమలను అన్నిటిని తుడిచివేసి గుఱినైపునకు శరమువలె సరళముగబోవలెను. "నీవు పూర్తిగ మారిపోయి

చిన్నబిడ్డలవలెనగువరకు స్వర్గరాజ్యములో నేవిధముగను ప్రవేశింపరాదు." ఈస్వర్గ రాజ్యమే పరమపురుషుల మహాశ్వేతసోదరబృందమని జ్ఞాపకముంచుకొనుము. *

పైన తెలియఁపరచిన సందేశభాగములనుబట్టి పరమగురువు తమ శిష్యుల యెదుట ఎట్టి గొప్ప యాదర్శమునుజూపింతురో విశదపడగలదు. అదంతయు కొందరకు సామాన్యముగ మనము శుష్కవేదాంతమని చెప్పెదు, అనగా, మానవులు ప్రస్తుతము పరిపూర్ణముగా నాచరింప నసాధ్యమయినట్టియు, అయినను సాధించు టకై నిరంతరము ప్రయత్నించవలసినట్టియు పరమోత్కృష్టమగు స్థితియని (Counsel of Perfection) తోచవచ్చును. కాని ముముక్షువులందరు బహుఉన్నతాకాంక్ష గలవారు; ఎవ్వరును అందగోరుదానిని ఇంతలో పూర్తిగ నందుకొనలేరు; అట్లు కాక పోయినచో ఈలోకములో జన్మలనెత్తవలసిన యవసరమే యుండదు. మనము పరి పూర్ణత్వమునకు చాలదూరముననున్నాము, కాని, పరమపురుషులకు సన్నిహితులగు టకు యోగ్యతగలయువకులు, సులభముగా సంస్కరింపదగినవారు, యువకులు అయి యున్న కారణముచేతనే, అద్భుతమగు అవకాశమును గలిగియున్నారు, అనుచితమగు లక్షణములను తొలగించుకొనుట వృద్ధులకంటె యువకులకు కడుసులభము. వారి యావజ్జీవము సమ్యగ్లక్ష్యపథము నవలంబించుటయు, సమ్యగ్హేతువులకై పనిచేయుటయు, సమ్యగ్ధోరణి గలిగియుండుటయు నలవాటు చేసికొన్నయెడల వారు నిలుకడగా పరమ గురువుల ఆదర్శమున కెక్కువ సన్నిహితులగుదురు. పరీక్షమాణావస్థయందున్న శిష్యుడు స్థూలశరీరములో మెలకువగానుండగా పరమగురువు నిర్మించిన జీవప్రతిమ లను జూడగలిగినయెడల, స్వల్పవివరములుగా గనబడునట్టి విషయములయొక్క ప్రాముఖ్యతనుఎక్కువ బాగుగ గ్రహింపగలడు.

## శీఘ్రకోపిత్వము [చిరాకు] యొక్క ఫలితము

అతిత్వరగా చిరాకుపడుట సామాన్యమగు దుర్గుణము. ఇదివరలో నేను చెప్పినట్లు ప్రస్తుతనాగరిక పరిస్థితులలో జనుల కెల్లప్పుడును విశేషమగు తొందరలో నుండి అలసట చెందిన మనస్సులతో పనిచేయుచున్నప్పుడు, ఎవరికైనను చిరాకు పడుట సహజమేయగును. బాధకరమగు వికృతధ్వనులతో నిండిన నాగరికతలో మనము చాలభాగము జీవించుచున్నాము. అన్నిటికంటెను, ధ్వని నరములను గీచి

* See The Hidden Side of Christian Festivals p p. 12-446.

నట్లుండి చిరాకును గలిగించును. పట్టణమునకు పోయి తిరిగియింటికి వచ్చునరికి యలసి శిథిలమైపోయినట్లు బాధపడుట సున్నితమగు మనుష్యులందరకు సామాన్యమగు అనుభవమే. ఈ యలసట కనేక ఇతర కారణములుకూడ నుండవచ్చును. కాని నిత్యముండెడు ధ్వనియు, వివిధగతులతో స్పందించెడు అనేక కామశరీరములు ఉద్రేకముగలవై అల్పవిషయములకై తొట్రుపాటుపడుచు యొత్తిడికలుగ చేయుచుండుటయు ముఖ్యకారణమైయున్నది. కుపితుడు గాకుండ తప్పించుకొనుట బహుకష్టము. అందులో సామాన్యమానవునికంటె విశేషముగా సున్నితమైన శరీరములుగల శిష్యునకు కష్టతరమగును.

అయితే, యీచిరాకు కొంతవరకు పైపైననేయుండును గాని లోతుగచొచ్చుకొనిపోదు; కాని. దాని ఫలితములు మనకు తెలిసిన దానికంటె చాల ఎక్కువ కాలముయుండును, గనుకసాధ్యమైనంతవరకు బాహ్యముగా కూడ చిరాకు వ్యక్తము కాకుండ తప్పించుకొనుట శ్రేయస్కరము. ఒక గొప్ప తుపాను చెలరేగినయెడల ముందుగా పవనమే సముద్రములో తరంగములను లేవదీయును, పవనముయొక్క తీవ్రతతగ్గిపోయినను తరువాత చాలకాలమువరకు తరంగములు పొంగుచునే యుండును. బరువైన నీటిమీదనే అంతటి ఫలితము కలుగుచున్నప్పుడు, నీటికంటె చాలసూక్ష్మతరమైన కామశరీరద్రవ్యములో గలిగెడు స్పందములు మిక్కిలి లోతుగా చొచ్చుకొనిపోయి యెక్కువకాలముండెడు ఫలితమును గలిగించుట సహజమైయున్నది. మనస్సులో పదినిమషములపాటుండిపోయెడు తాత్కాలికమైన కొంచెము బాధకరమగు స్వల్పరాగము కామశరీరములో నలుబది యెనిమిది గంటలవరకునిలిచి యుండు ఫలితములను గలుగచేయవచ్చును. కామశరీరములో గలిగెడు స్పందములు బహుదీర్ఘకాలమువరకు అణగిపోనేరవు.

ఇట్టి లోపమున్నసంగతి తెలిసినప్పుడు దాని మీద మనస్సును లగ్నము చేయక, దానికి వ్యతిరేకమగు సుగుణమును వృద్ధిజేయుట రీత్యా మిక్కిలి సార్థకముగ దానిని తొలగించుకొనవచ్చును. దాని నెదుర్కొని పట్టుదలతో జయింప ప్రయత్నించుట యొకపద్ధతి; కాని అది కామభూతమునకుగాని, మానసికభూతమునకుగాని, నిరోధమును ప్రోత్సహించుట నిశ్చయము. కనుక పరులయెడల ప్రేమను, సోదరభావమును పెంపొందించుకొనుట శ్రేష్ఠతరమగు మార్గము. ప్రేమతోను, అనుకంపతోను నిండియున్న మనిషి యితరుల గూర్చి చిరాకుతో మాట్లాడుటగాని తలం

చుటగాని సంభవింపనీయడు. అట్టి భావములతో నిండియున్న మనిషి భూతముల నిరోధములు లేకుండ ఆఫలితమునే బొందును.

## స్వార్థపరత్వము

స్వార్థపరత్వమనేక యితరరూపములను ధరించి శిష్యుని పురోవృద్ధి నతితీవ్రముగా నాలస్యముచేయును. వానిలో నొకటి అలసత, లేక, సోమరితనము. ఇతర కార్యార్థమై సకాలములో హాజరుకావలెనను తలంపులేకుండ పుస్తకమును విడువక చదువుచు నానందించు మనిషిని నేను జూచితిని. మరియొకడు తన దస్తూరీని చదువవలసిన వారికి కండ్లకు బాధకలుగుననిగాని, వారి మనస్సునకు చీకాకు కలుగవచ్చుననిగాని కొంచెమైనను యోచింపక అశ్రద్ధగా, అతిపాడుగా వ్రాయుట చూతుము. ఇట్టి స్వల్పవిషయములలో చూపించెడు అశ్రద్ధలు, అజాగ్రతలు ఉత్తమ ప్రభావములను సోకనియ్యక మోటుతనమును వృద్ధిచేయును; చూచువారికి జీవితము అంద వికారముగను అసహ్యకరముగను కనబడునట్లు జేయును. ఆత్మనిగ్రహమును, సమర్థతను నాశముచేయును. ఏకార్యమునైన తృప్తికరముగ చేయవలెనని సమర్థత, సకాలములోచేయుట అత్యావశ్యకము. చాలమంది అసమర్థులు వారికేదైన వచ్చిన యెడల దానిని సంపూర్ణముగా చేయక అనేక విధములగు మిషలను జెప్పుదురు; వారి న్నేమైన భోగట్టా అడిగిన దానినెట్లు తెలిసికొనవలెనో వారెరుగరు. ఈవిషయములో మనుష్యులలో చాలభేదములుండును. ఒకరి నడిగిన "నాకు తెలియదు" అని వెంటనే జవాబుచెప్పును; మరి యొకడు "అవును, నాకు తెలియదు, కాని నేను పోయి దరియాప్తుచేసి చెప్పెదను," అని చెప్పి తరువాత కొంత సేపటికి కావలసిన సముజాయిషీనిచ్చును. అదేవిధముగ, ఒకడు పనిచేయుటకుపోయి తిరిగివచ్చి నేను చేయలేకపోయితినని చెప్పును, మరియొకడు పనిపూర్తియగు వరకు విడిచిపెట్టకుండ చేయుచుండును.

సత్కర్మను దేనిని చేసినను శిష్యుడెల్లప్పుడును దాని వలన ఇతరులకు గలిగెడు లాభము గూర్చియు, పరమగురువును సేవించుట కొక మంచి యవకాశము లభించెననియు (పరమగురువుకార్యములు భౌతికముగ స్వల్పముగా గనబడినను ఆధ్యాత్మికముగా విశేషమగు విలువగలిగియుండవచ్చును.) యోచనచేయవలెనే గాని తనకు గలిగెడు ఫలితముగూర్చి యోచింపకూడదు. స్వలాభమును గూర్చి

రూచనచేసిన యెడల స్వార్థపరత్వము సూక్ష్మరూపమున నున్నదనియే యెంచవలెను. "ఈ నాసోదరులలో కడు అల్పునకు నీవేమైనచేసినచో, దానిని నాకే చేసినవాడ వగుదువు." అని క్రైస్తు చెప్పినమాటలు జ్ఞాపకముంచుకొనుడు.

స్వార్థపరత్వముయొక్క ఇతరసూక్ష్మఫలితములు అనేక రూపములతో గనిపించును. దిగులు, అసూయ, తన హక్కులకై మూర్ఖతతో పోట్లాడుట, మొదలగు నవన్నియు స్వార్థపరుని లక్షణములే. "నీహక్కులగూర్చి తక్కువగాను, నీబాధ్యతల గూర్చి యెక్కువగాను తలపోయుము," అని యొక సిద్ధపురుషుడు చెప్పెను. బాహ్యప్రపంచముతో వ్యవహరింపవలసివచ్చినప్పుడు కొన్ని సమయములలో శిష్యుడు తన అవసరములను నెమ్మదిగ చెప్ప నావశ్యకముకావచ్చును; కాని, తోడి శిష్యుల మధ్యనున్నప్పుడు అతనికి అవకాశములు తప్ప హక్కులనునవి యేమియు నుండవు. చీకాకుపడుచున్నమనిషి తనలోనుండి వైరహేతువులగు భావములను ప్రసరింపజేయును; ద్వేషించునంతవరకు పోకపోవచ్చును, గాని అతని కామశరీరములో మందమగు వెలుగును కల్పించును, మానసికశరీరములోగూడ అనుచితమగు ప్రవృత్తులను సృష్టించును.

## వ్యధ

అట్టి కలతలు మానసికశరీరములో తరుచు కలుగుచుండుటచే వానివలన అట్టి ప్రమాదకరమగు ఫలితములే కలుగుచుండును. ఏదైన నొకవిషయమై బాధపడుచు, దానిగురించి విశేషముగ తలపోయుచు, పర్యవసానమునకు రాలేక చీకాకు పడుచున్నమనిషియొక్క మానసికశరీరములో నొక పెద్ద తుపాను చెలరేగును. ఆ సువర్లోకములో స్పందము లతిసూక్ష్మముగనుండును గనుక, తుపాను అను శబ్దము వాస్తవస్థితిని సంపూర్ణముగా తెలియచేయదు. రాపిడివలనగలిగెడు పుండువంటిది యొకటి మానసికశరీరములో నేర్పడునని చెప్పిన సత్యమునకు దగ్గరగానుండును. విశేషముగా వాదించు మనుష్యులను, ప్రతివిషయముగురించి వాదించి తీరవలెననుకొనుచు, ఏపక్షమున మాట్లాడుచున్నదికూడ తెలిసికొనక వాదించుటలోనే ఆనందించుచుండు మనుష్యులను మన మప్పుడప్పుడు చూచుచుందుము. అట్టి మనిషియొక్క మానసికశరీరమెల్లప్పుడును రగులుచున్నట్లుండి రవ్వంతకోపము గలిగించునదేమైన సంభవించినచో వెంటనే పెద్దపుండుయొకటి యేర్పడి మండిపోవచ్చును. అట్టివాడు ఈవ్యాధి

గ్రిస్థమగు స్థితినుండి తప్పించుకొనుటకు కొంత సమర్థ్యమును, సౌశీల్యమును, ప్రపంచ జ్ఞానమును అలవరచుకొన్నగాని యోగమార్గమున పురోవృద్ధిబొందుట కవ కాశములేదు.

మనయదృష్టవశమున, శుభకరమగు రాగోద్రేకములు కామమయశరీరము లోని అతిసూక్ష్మ భాగముపైపనిచేయును గనుక దుష్టమైన వానికంటె చాలఎక్కువ కాలము నిలిచియుండును. అందుచే ప్రిబలమగు ప్రేమభావముగాని, భక్తిభావము గాని గలిగినయెడల తరువాత చాలకాలమువరకు, ఏకారణముచేత నాభావము కలిగి నదో ఆకారణమును మరచిపోయినతరువాత చాలకాలమువరకు, కామమయశరీర ములో ఆ భావఫలితము నిలిచియుండును. కామశరీములో ఏకకాలమందు రెండు రకముల స్పందములు — ప్రేమ, కోపము — ప్రిబలముగా ప్రసరించుచుండుట చాల అసాధారణమైనను,సాధ్యముకావచ్చును.ఎవనికైన దారుణమగు కోపమువచ్చి నప్పుడు, ఆకోపము ధర్మపక్షమున ఉద్దీపనమైనప్పుడుతప్ప, ఆసమయమందే గాఢమగు ప్రేమభావముకూడనుండుట సాధారణముగ సంభవించదు; అట్టిది సంభవించినప్పుడు రెండింటి ఫలితములుకూడ కనిపించును; ఒకటి రెండవదానికంటె చాల నున్నతమగు అంతరువుననుండును, అందుచే ఎక్కువకాలము నిలిచియుండును.

## న వ్వు

చిన్నపిల్లలు— బాలురు, బాలికలు—సంతోషముతో నాడుకొనుచు, చదువు కొనుచు, చిత్రమగు విషయములను కని, విని ఆనందించుచు, నవ్వుచు, ఖులాసాగా నుండవలెనని కోరుట చాల సహజము. అది మంచిదే, దానిలో హాని యేమియులేదు. సంతోషముతోను, దయతోను నవ్వినప్పుడు బయలుదేరెడు స్పందములను జూడగలిగినవారు కామశరీరములో కొంత చలనము కలుగునని గ్రిహింపగలరు; ఆచలనము గుజ్జపు స్వారిచేయుటచే పైత్యకోశమునకు గలిగెడు చలనమువంటిదే; దానివలన మంచిలాభమేకలుగును, గాని నష్టమేమియులేదు. కాని దుష్టబుద్ధిగలవారు తరుచు చెప్పుచుండెడు వికృతమగు కథలవలన గలిగెడు ఫలితము లనుజూచినయెడల భయంకరమగు ఖేదమగపడును; అట్టి తలంపులు కేవలము కీడు చేయును; వాని సంకల్పరూపము కామశరీరమును చాలకాలమంటిపెట్టుకొనియుండి, అన్నిరకములైన హేయమగు భూతముల నాకర్షించుచుండును. పరమగురువుల చేర

నాశించువారిలో అట్టి మోటుతనముగాని, వెఱ్ఱిగ నవ్వుటగాని, కర్కశత్వముగాని లేశమాత్రమైన నుండరాదు. అందుచే, యువకులు బాలిశత్వమునకుగాని కుఱ్ఱతనము నకుగాని తావియ్యక నిరంతరము మెలకువతో నుండవలెను.

ఒక్కొక్కప్పుడు వెకలిగ సకిలించుట జూచుచుందుము. అదెన్నటికిపనికిరాదు; దానివలన కామశరీరమునకు చాల హాని కలుగును. అది ఆశరీరముచుట్టును చూచుట కసహ్యాకరమగు (సాలెపట్టువంటి) పట్టును బూడిదరంగుదారములతో అల్లి, సత్ప్రభావములను లోనికి చొరనియ్యకుండ నాటంకము గలుగజేయు నొక పొరను తయారు చేయును. ఇట్టి ప్రమాదము కలుగకుండ యువకులు మిక్కిలి జాగ్రతగా కాపాడుకొనవలెను. మీయిష్టమువచ్చినట్లు ఖులాసాగా, సంతోషముతో నుండవచ్చును; మీరట్లుండుట పరమగురువునకు సంతోషమే; అది మోక్షమార్గమున మీపురోవృద్ధికికూడ శ్రేయస్కరమే. కాని, మోటుతనముగాని, కర్కశత్వముగాని, లేశమైనను మీసంతోషమును మలినముచేయగూడదు; మీనవ్వు గగ్గోలుచేసెడు అట్టహాసము కాకూడదు, కుఱ్ఱతనమనిపించెడు నెకిలి నవ్వుగా క్షీణింపకూడదు.

అన్ని యితర విషయములలోవలెనే దీనికికూడ నొక నిర్దిష్టమగు హద్దుకలదు; ప్రమాదరహితమైన దానికిని, సులభముగా ప్రమాదకరమగుదానికిని యెల్లప్పుడును నిర్దిష్టమగు నొకహద్దుఉండును. దానిని నిర్ణయింపగల నిశ్చయమగు పద్ధతియేమనగా, ఉల్లాసము సౌజన్యతను, సరసతను అతిక్రమించుచున్నదాయని యోచించుట; నవ్వు దీని నతిక్రమించిన క్షణమందు, పరిపూర్ణమగు సౌజన్యతకు లోపము కలిగించుచున్న క్షణమందు, ప్రమాదకరమగుచున్నదని తెలిసికొనవలెను. ఈభేదమును ఆంతర్యము నుండి చూచినయెడల, కామశరీరము జీవాత్మయొక్క స్వాధీనములోనున్నంతకాలము అంతయు బాగుండును; ఆస్వాధీనము తప్పిన వెంటనే నవ్వు శూన్యము, అర్థహీనమునై, రౌతును గుఱ్ఱముమోసికొనిపారిపోవుచున్నట్లుండును. నిగ్రహింపబడని కామ శరీరము యాదృచ్ఛికమగు ప్రతిప్రభావమునకు లోనయి మిక్కిలి దుష్టమగు భావములచేతను, రాగములచేతను బాధింపబడవచ్చును. మీసంతోషమెల్లప్పుడు పరిశుద్ధముగను, స్వచ్ఛముగను ఉండునట్లు చూడవలెను. మరియొకరిని బాధించి, చిన్నపుచ్చి, కృత్రిమసంతోషమును బొందుటకై యెన్నడును ప్రయత్నించకూడదు. ఎవరికైన చిన్నపుచ్చుకొనవలసిన ప్రమాదము సంభవించినప్పుడు ఉల్లాసముతో నవ్వుచు చూచుచుండక వెంటనే అతనియొద్దకుబోయి సహాయముచేసి యోదార్చుము.

ప్రేమతో గూడినదయ, సహాయత ఎల్లప్పుడును నీలో మిక్కిలి ముఖ్యమగు లక్షణములై యుండవలెను.

## వ్యర్థ ప్రసంగము

వివిధములగు దుష్టరాగములవలన సూక్ష్మశరీరములపై గలిగెడు చెడుఫలితములను దివ్యదృష్టిచే చూడగల జ్ఞానికి వానిని నిగ్రహించుట యెంతముఖ్యమో సులభముగ తెలియగలదు. మన మా ఫలితములను జూడలేము గనుక, మరచిపోయి అశ్రద్ధగానుందుము. అనాలోచితముగను, తెలివితక్కువగను పలుకుమాటల విషయమై కూడ పైనచెప్పినవన్నియు వర్తించును. మానవుడు పలికెడు ప్రతివ్యర్థమగు మాటకు తీర్పుదినమున సమాధానము చెప్పవలసియుండునని ఆఖరుసారి భూమిపై నవతరించినపుడు క్రీస్తుప్రభువుచెప్పినట్లుగా చెప్పుదురు. అదిచాల క్రూరముగా గనిపించును. తుది తీర్పు విషయమై క్రైస్తవమతసంప్రదాయములో చెప్పెడు సంగతి నిజమైన యెడల, అది నిశ్చయముగ బహు అన్యాయము, హేయమునై యుండును.మానవు డాడిన వ్యర్థపు మాటకు శాశ్వతమగు నరకబాధననుభవింపవలసి యుండునని క్రీస్తుయొక్క అభిప్రాయ మెంతమాత్రముకాదు; అట్టిదియేమియును లేదు. కాని ప్రతిమాటకు ప్రతియోచనకు కర్మగలదనియు, ఫలితముగలదనియు, చెడు విషయములు తిరిగి తిరిగి పునశ్చరణము చేయబడినయెడల సత్ప్రభావములను చేరనియ్యని వాతావరణము మనుష్యునిచుట్టు నేర్పడుననియుని మేమెరుగుదుము. ఇట్లు జరుగకుండ నిత్యము శ్రద్ధగానుండవలెను. మానవుడొక క్షణమైనను తనను తాను మరచిపోకుండనుండవలెననుట మానవాతీతమగు నాదర్శమగును; కాని శిష్యులు పరమగురువువలెనే మానవాతీతులగుటకు ప్రయత్నించుచున్నారు. శిష్యుడు పరిపూర్ణమగు జీవితమును జీవింపగలిగినయెడల అతడు కూడ ఇదివరకే సిద్ధపురుషుడై యుండెడివాడు. అతడట్టిస్థితికిరాలేదు. కాని అతడా యాదర్శమును నిరంతరముస్మృతిలోనుంచుకొనియున్న యెడల శీఘ్రముగా దగ్గరకుచేరును. అతడు పలికెడు ప్రతివ్యర్థపు మాటయు పరమగురువుతో అతనికిగల సంబంధమునకు నిశ్చయముగ భంగము గలిగించుచుండును; కనుక అతడు తన మాటల నతిజాగ్రతతో కనిపెట్టి చూచుకొనుచుండవలెను.

## మాటలవలననేర్పడు రూపములు

శిష్యుడు తాను మాట్లాడుమాటలనే గాక మాటలాడు విధమును గూడ కనిపెట్టి చూచుకొనుచుండవలెను; అతడు సొగసుగను, అందముగను, నిజముగను, అజాగ్రత్తగాని అతిశయోక్తిగాని లేకుండగను, మాట్లాడవలెను. అతని శబ్దములు చక్కగ నెంచబడి చక్కగ నుచ్ఛారణముచేయబడవలెను. దైనందిన జీవితములో స్పష్టముగ మాట్లాడుటకు శ్రమపడనవసరములేదని చాలమంది యనుకొందురు, కాని వారు తలచుదానికంటె చాలఎక్కువ ఆవశ్యకత గలదు; ఎందుచేతననగా, మనపై తిరిగి పనిచేసెడు పరిసరములను మనము నిత్యము నిర్మించుకొనుచున్నాము. మన యిండ్లను, మనగదులను మనతలంపులతో నింపుదుము. వానిలోనే మనము నివసించవలసియుండును. ఉదాహరణమునకు:— ఎవరైన విచారమునకు లోనైయున్న యెడల, అతనిగదియంతయు ఆగుణముతోనే నిండియుండును; అప్పుడు సున్నితమగు మనిషి యెవరైన ఆగదిలోనికివచ్చిన యెడల తనకు కొంత ప్రాణశక్తి తగ్గినట్లును, కొంతపటుత్వము లోపించినట్లును అతనికితోచును. అందరికంటె నెక్కువగా కాలమంతయు ఆ గదిలోనే గడుపుచుండు మనిషి అందరికంటె ఎక్కువగా నిత్యము దుఃఖమునకులోనై సులభముగా దుఃఖమును విదుల్చుకొనలేడు. అదేవిధముగ, అజాగ్రత్తగను మోటుగను మాటలాడుచు అసహ్యాకరములగు శబ్దరూపములచే చుట్టుకొనబడియుండువాడు నిత్యము బాధించునట్టి యీశబ్దరూపములతో నిండిన వాతావరణమును కల్పించుకొనును. శాశ్వతమగు ఈయొత్తిడివలన ఆమనిషి యీఅసుఖకరములగు రూపములనే పునః సృష్టిచేయుచుండవచ్చును;అతడు బహుజాగ్రత్తగనుండక పోయిన యెడల కటువుగను, మోటుగను మాటలాడుట కలవాటుపడును.

“పిల్లలు మాట్లాడుటలో మేము చేయదగిన దేదియునులేదు. పాఠశాలలో మాదగ్గరనున్నప్పుడు మేము తప్పులు దిద్దుటకు ప్రయత్నింతుము, కాని వారు ఇంటికి పోయిన తరువాత తప్పు ఉచ్ఛారణను వినుచుండుటచే అదిగట్టిగ వారికి వంటబట్టిపోవును; ఆతప్పులను దిద్దుట మాకసాధ్యమగును.” అని పలుమారు ఉపాధ్యాయులు చెప్పుచుండుటవింటిని. బహుశః పిల్లలుబడిలో అయిదుగంటలుండవచ్చును, మిగత కాలమంతయు నింటివద్దనే గడుపుచుందురు. ఆయింటిలో అనుచితమగు శబ్దరూపములతో నిండిన వాతావరణము సదావారిపై నొత్తిడి చేయుచుండును; ఆచిన్న

పిల్లలు దానికి దాసులయిపోవుచుందురు, గనుక వారు పరిశుద్ధమగు శబ్దముల నుచ్చరింపలేరు. ఆస్ట్రేలియాలో కొన్ని ప్రదేశములలో బాలురు సామాన్యమగు చిన్న ఇంగ్లీషుమాటలను గూడ స్వచ్ఛముగ పలుక లేక చాల వికృతముగ దీర్ఘములను దీయుచు పలికెదరు. అట్టిది యెన్నడును జరుగరాదు. మీరుదానిని స్వల్పవిషయముగా తలచవచ్చును; కాని యెంతమాత్రము స్వల్పవిషయముకాదు. చాల స్వల్ప పనులైనను నిత్యము తిరిగి తిరిగి చేసినచో ఘనమగు ఫలితమునియ్యగలవు. ఆకాశ ద్రవ్యము (ఈథరు) తో నిర్మితములైనను, వికృతములగు రూపములకు బదులు సుందరమగు రూపములను మన చుట్టును చేసుకొనుట నిశ్చయముగా చాల శ్రేయస్కరము. నిర్దుష్టముగను, స్పష్టముగను, అందముగను మాట్లాడుట మిక్కిలి ముఖ్యమైన విషయము; ఏలయన అట్టి యలవాటు బాహ్యముగను, అంతరంగికముగను నాగరికతనలవరచును. మోటుగాను, అశ్రద్ధగాను మాటలాడుట కలవాటుపడిన యెడల మన భావనాతలమును భ్రష్టముగావించినవారమగుదుము; మరియు, అట్లు మాట్లాడినచో మనము సహాయముచేయదలచినవారు విముఖులై దూరముగా పోదురు. మనస్సులోని అభిప్రాయములను తెలుపుటకు చక్కని తగుమాటల నెంచి మాట్లాడలేనివారు శుద్ధముగాను విస్పష్టముగాను యోచనగూడ చేయలేరు. నైతికముగ గూడ వారిప్రవర్తన సందేహాస్పదముగనుండును. ఏలయన, ఈవిషయము లన్నియు పరస్పరసంబంధము గలిగి యొక దానిపై నొకటి పనిచేయుచుండును.

ప్రతి యొక తలంపు మానసికలోక ద్రవ్యములో నొకరూపమును నిర్మించినట్లే, పెదవులనుండి వెలువడు ప్రతిశబ్దముకూడ ఆకాశద్రవ్యము (ఈథరు) లో నొక చిన్నరూపమును నిర్మించును; ఈరూపములలో కొన్ని మిక్కిలి అనుచితములై యుండును. ఉదాహరణమునకు:—ద్వేషము లేక అసహ్యము అను అర్థమిచ్చు Hate అను శబ్దము మిక్కిలి భయంకరమగు రూపమునుకలుగచేయును; దానిని జూచిన వాడనగుటచే ఆశబ్దమును నేనెన్నడును వాడుకచేయను. "నాకదియిష్టములేదు", లేక "నేను దానిని లక్ష్యముచేయను," అనవచ్చును, కాని, తప్పనిసరియైనప్పుడుగాక హేయము అనుమాట నెన్నడు నుపయోగింపకూడదు; ఏలయన, ఆశబ్దముయొక్క రూపమును జూచినంతనే మిక్కిలి బాధకరముగనుండును. అటువైపున మిక్కిలి మనోహరమగురూపములను ప్రభవింపజేయుమాటలుకలవు, అట్టిమాటలను బలుకుట చాలమంచిది. ఈవిషయమంతయు, ఎప్పుడో యొకప్పుడు ప్రజలకు తీతిక కలిగిన

తరువాత శాస్త్రానురూపముగ పరిష్కరింపబడునని నేను నిస్సందేహముగా జెప్ప గలను. సామాన్యముగ చెప్పవలసినదేమన, సద్గుణములతో సంబంధించినమాటలు సంతోషకరములగు రూపములను, చెడుగుణములతో సంబంధించినమాటలు వికారములగు రూపములను బుట్టించును.

శబ్దమువనుసరించు తలంపుచే శబ్దరూపములు నిర్ణయింపబడవు; సంకల్పము తనరూపమును సూక్ష్మతరమగు భువర్లోకద్రవ్యముతో నిర్మించుకొనును; శబ్దధ్వనివలన ఏర్పడు రూపములు ఆకాశ ద్రవ్యము(ఈథరు)తో నేర్పడును. ఉదాహరణమునకు:- "అసహ్యించు" అను మాటను నిజమగు ద్వేషమేమియు లేకయే అనాలోచితముగ నేదోయొక భోజనపదార్థమువంటి దానినిగూర్చి తరుచుగా వాడుదురు: ఆమాట నుపయోగించుట కేవల మనవసరము; ఉపయోగించినప్పుడు తీవ్రమగు ద్వేషమేమియు లేదు; కనుక భువర్లోకములో ద్వేషరూపమేర్పడలేదు. కాని వికారమగు శబ్ద రూపము ఆకాశద్రవ్యములో నేర్పడినది; ఉద్దేశింపబడకపోయినను ఆశబ్దరూప నిర్మాణము తప్పదు, కనుక, ఆశబ్దము మంచిదికాదని స్పష్టముగ తెలియగలదు. విద్యాహీనులు, అనాగరికులు తరుచుగ వాడుకచేయు ఒట్టులు, బూతులు చెడ్డమాటలని చెప్పనవసరములేదు. వీనివలన నిర్మాణమగు రూపములను దివ్యదృష్టితో జూచిన యెడల ఎంతవికృతముగను, భయంకరముగను నుండునో విశదపడగలదు. శిష్యుడు కాదలచిన వాడెప్పుడును ఈమాటలచే తన పెదవుల నపవిత్రముగావించుకొనునని యూహింపలేము. అర్థశూన్యములైనట్టియు, సంకరములైనట్టియు అన్నిరకములగు గ్రామ్యపదములను జనులు వాడుట తరుచుగ మనము వినుచుందుము; వీనినన్నిటిని యోగవిద్యాభ్యాసి విసర్జించుట ముఖ్యావసరము.

అతిశయోక్తిగ మాటలాడు నలవాటునకుగూడ పైనచెప్పిన దంతయు వర్తించును. జనులు తరుచు విశేషాతిశయముగ మాట్లాడుదురు. ఒక వస్తువు వందగజముల దూరముననుండ 'మైళ్ళ' దూరముననున్న దందురు. మామూలుకంటె కొంచె మెక్కువ నుష్ణముగానున్నయెడల 'ఉడికి' పోవుచున్న దని, 'మండి' పోవుచున్న దని యందురు. నియతి లేనట్టి నిరర్థకములగు తమాంత శబ్దములతో మునిగిపోకుండ మన భావములను సరిగా తెలియజేయక పోయినయెడల మన భాషాజ్ఞాన మత్యల్పమని చెప్పవలసియుండును.

మిక్కిలి విషాదకరమగు విషయమేమన, ఏదైన నొకటి చాల బాగున్నదని చెప్పదలచినప్పుడు '**Awfully good**' = ఘోరముగా బాగున్నదని చెప్పుదురు; అట్లు చెప్పుటలో శబ్దవైరుధ్యముండుటచే కేవలము అర్థహీనము, అవివేకమునగు మాటయగును. అంతేగాక, ఒక విశిష్టమగు అర్థమును గలిగియున్న శబ్దమును వికృతమగు సందర్భములో నుపయోగించుట హాస్యాస్పదము, అనుచితము నగును. అట్టి అపప్రయోగము ఘోరముగా గనిపించును. యోగము నభ్యసింపదలచినవారు అట్టి హేయములగు వానినన్నిటిని కచ్చితముగా విసర్జింపవలెను.

మాట్లాడుటలో నిగ్రహముండవలెనని నొక్కి చెప్పినప్పుడు, శబ్దములయొక్క అర్థమును బాగుగ తెలిసికొని మాట్లాడవలెనను భావములోనే చెప్పుచున్నాము; అదినిజమే, అంతకంటె అవశ్యమైనది మరియొకటిలేదు. మనమందరము శబ్దోచ్చారణను నిగ్రహించుట నేర్చుకొని, దానినిగూడ ఆత్మ శిక్షణలో నొకభాగముగా నెంచెదమని నాయాశయము. నిర్దుష్టముగను, సౌజన్యముగను మాటలాడుటఎంతముఖ్యమో అతిశయోక్తిగా చెప్పలేము.

మనము మాట్లాడినప్పుడును, నవ్వినప్పుడును శబ్దము, రంగు, రెండునుగూడ సంభవమగును. నవ్వు సరియైనదై హృదయానురంజకముగనుండి దయతోగూడియున్న యెడల చాల సుఖకరమగు ఫలితమును గలిగించును, చుట్టుప్రక్కల హర్షభావమును వ్యాపింపజేయును. కాని ఆనవ్వు హేళనమై, అపహాస్యముగనున్నను, వెట్టినవ్వువలెనోటుగనున్నను, ఘుర్ఘురమువలెను, సకిలింతవలెను నున్నను,ఫలితము చాల భిన్నముగను బాధకరముగనునుండును.సంకల్పములయొక్కయు, రాగములయొక్కయు ఛాయలన్నియు ఎంత వాస్తవముగను, పరిపూర్ణముగను ఇతరలోకములలో ప్రతిబింబితము లగుచున్నవో తెలిసినచో అత్యద్భుతముగ నుండును. ఒకదేశమునుండి మరియొక దేశమునకుపోవునపుడు ఇది స్పష్టముగ విశదమగును; అక్కడ గాలియంతయు భిన్నములగు శబ్దరూపములతో నిండియుండును. ఇంగ్లాండులో బయలుదేరి సముద్రపు పాయను దాటి ఫ్రాన్సుదేశమును చేరుసరికి ఇంగ్లీషు శబ్దరూపములకును ఫ్రెంచి శబ్దరూపములకును గల వ్యత్యాసము వెంటనే తెలియును. అందులో ప్రత్యేకముగ కొన్ని శబ్దములలో ఈభేదము విలక్షణముగ గన్పించును; ఏలయన ప్రతిభాషలోను ప్రత్యేక ధ్వనులుగల కొన్ని శబ్దములుండును, ఆశబ్దముల ధ్వనులే

ఒక భాషకును మరియొకభాషకును గల రూపభేదములను తెలియజేయు ప్రధాన లక్షణములగును.

ఆ రూపముల రంగులు మనమాటల వెనుకనున్న భావములపై నాధారపడి యుండును. ఇరువురు మనుష్యులొకే మాటలను పలుకవచ్చును, కాని ఆరూపముల వెనుక వేర్వేరు భావములుండవచ్చును. ఒకరిని విడిచి వచ్చుచున్నప్పుడు "గుడ్-బై" అనుట యాచారము. ఆ మాటల నుచ్చరించినపుడు నిజమగు స్నేహభావము ప్రవహింపవచ్చును; లేక ప్రత్యేకయోచనగాని, రాగముగాని లేకుండ అనాలోచితముగ ఆమాటలను పలికిన యెడల, ఉన్నతలోకములలో కేవలము భిన్నమగు ఫలితము కలుగును. మొదటి సందర్భములో ఆస్నేహితునికి నిర్దిష్టమగు ప్రసారము నీయొద్ద నుండి బయలుదేరును; రెండవ దానివలన ఒక్క క్షణమాత్రము మెఱపు మెఱసినట్లగును, గాని లాభమేమియు గలుగదు. గుడ్-బై అను మాటల యర్థము భగవంతుడు నీతోనుండుగాక (God be with you) అనియు, కనుక నీవిచ్చునది యొక ఆశీర్వాదమనియు జ్ఞాపకముంచుకొనుట మంచిది. ఫ్రెన్చి దేశములో 'Adieu' అందురు. 'To God I commend you'= భగవంతుడు నిన్ను అనుగ్రహించుగాక, అని దానియర్థము. నీవామాటల నుచ్చరించినపుడు వాని యర్థమును గూడ తలంచినచో నీవు విశేషశుభముగలుగజేయుదువు; ఏలయన, అప్పుడు నీ ఇచ్ఛ, నీ యోచనరెండును ఆమాటలననుసరించును; నీయాశీర్వాదమేదో యొక మిణుగురువలెనుండక నిజమగు సాహాయ్యమగును.

పైన చెప్పిన రీతులుగా శిష్యునిభాషణము సొగసుగాను వికసితముగాను నుండవలెను. ప్రాక్ జ్యోతి — Light of Asia — అను కావ్యములో 'రాజు — ఆత్మ నీలోనున్నాడు; వాని యెదుట నీనోటనేమివచ్చినను, బంగారు తలంపును బంగారు మాటలలో పొదిగినట్లుండవలెను' అని చెప్పిన విషయమును జ్ఞాపకముంచుకొనుము.

రాజు నివసించు కోటద్వారంబునోరు,
భద్రముగదాని గాపాడవలయునుమ్ము
వారిసన్నిధి వెడలెడు వాక్కులెల్ల
శాంతసౌందర్య శుభములై సాగవలయు.

## గడబిడ

ముముక్షువునకు ఆందోళనము, గడబిడలేకపోవుట అత్యావశ్యకము. మంచి సమర్థతతోను, ఉత్సాహముతోను చక్కగ పనిచేయగల యువకులు చాలమంది యీదోషములకు లోనగుటచేత, వారి యత్నములు చెడిపోయి నిష్ఫలములగుచున్నవి; ఏలయన, అట్టి వారు తమచుట్టును నిత్యము వణకుచుండెడు స్పందములతో తేజోమండలమును నిర్మించుకొందురు; అందుచే ఏసంకల్పముగాని, రాగముగాని వికారముబొందకుండలోనికిబోలేదు, వెలుపలకు రాలేదు. వారు పంపెడు కళ్యాణకరమగు ప్రభావములు కూడ వణుకుచు వచ్చుటచే అనుభవమందు నిరుపయోగములగును. పరిపూర్ణమగు విస్పష్టత, కచ్చితము గలిగియుండవలెను, కాని యీ విస్పష్టతను, కచ్చితమును, పరిపూర్ణమగు నెమ్మదివల్లనే బొందవలెనుగాని, తొందరచేతగాని గడబిడచేతగానికాదు.

మన సాధకులకు ముఖ్యముగా నొక్కిచెప్పవలసిన మరియొక విషయము గలదు. యోగాభ్యాసవిషయములలో మేమేదిచెప్పినను పూర్తిగ నుద్దేశించి, చెప్పదలచిన దానిని మాత్రము చెప్పెదము, ఎక్కువగాని తక్కువగాని చెప్పము.

ఒకరిని గురించి నిర్దయగా విమర్శించుచు నేమియు మాట్లాడగూడదని నియమము నేర్పరచినప్పుడు, ఖరాగా అట్టి మాటల నాడరాదనియే ఉద్దేశింపబడినది; అనగా అట్టి పనిని సంపూర్ణముగా మానివేయవలయుననియేగాని, ప్రతిదినము మనము చెప్పెడు దయావిహీనమగు మాటలను, చేసెడు విమర్శలను, కొద్దిగా తగ్గించవలెనని ఉద్దేశముగాదు. అనేకములగు నైతికోపదేశములను వినుట కలవాటు పడితిమిగాని యొక్కటైనను మనఃపూర్వకముగ నాచరణలో పెట్టుటకు యత్నము చేయుచున్నట్లు కనబడదు. మతము ననుసరించుట యనగా నొక యాదర్శమునకు అలక్ష్యముగా నంగీకారమును దెలిపి, అప్పుడప్పుడు ఏదో కొద్దిగ దాని ననుగమించుటకు యత్నముచేసిన చాలునని తలచుటకలవాటుపడితిమి. అట్టి యభిప్రాయములను మన మనములనుండి పూర్తిగతోసివేయవలెను. యోగాభ్యాసవిషయమై పరమగురువుగాని, వారిశిష్యులుగాని యేదయిన ఆదేశమునిచ్చినయెడల దానిలోని ప్రతి యక్షరమును ఖరాగా అనుసరించి తీరవలెనని గ్రహింపవలసియున్నది. *

* ఈవిషయముల గూర్చి యొక్కవ వివరములకై Talks on The Path of Occultism — చూడవలెను.

## సాంగత్యము యొక్క యుపయోగము

పరీక్షితులకు, స్వీకృతశిష్యులకు కూడ పరమగురువుల పెద్దశిష్యులలో నొకరు ఈ విషయములన్నిటిలోను విశేషమగు సహాయమిచ్చుచుందురు. భారతదేశములో ప్రాచీనకాలములో నొక గురువు తన శిష్యుల నెంచుకొన్న తరువాత వారి నందర నొక జట్టుగా చేర్చి తానెక్కడికిబోయిన అక్కడకు తనతో గూడ దీసికొనిపోవు చుండెను. అప్పుడప్పుడు వారికి బోధచేయుచున్నను తరుచుగ ప్రబోధముల నిచ్చుట లేదు; అయినను శిష్యులు త్వరితముగా నభివృద్ధిబొందుచుండిరి. కారణమేమనగా, వారు సామాన్యలౌకిక ప్రభావములచే నావరింపబడక సర్వదా గురుదేవుని తేజో మండలము లోపలనేయుండి దానితో సామరస్యము నొందుచుండిరి. గురువుకూడ శిష్యుల శీలనిర్మాణములో సహాయపడుచు, ఎల్లప్పుడును వారిని శ్రద్ధగా కనిపెట్టి జూచుచుండిరి. మన పరమగురువులావిధానమును స్థూలముగా నీలోకములో నవలం బించుటకు సాధ్యముకాదు. కావున వారి పెద్దశిష్యులలో కొందరు తమచుట్టును చిన్నలగు క్రొత్తశిష్యులను కొందరి నొక జట్టుగాచేర్చుకొని వారిలో ప్రతివానిని శ్రద్ధగాజూచుచుండునట్లు ఏర్పాటుచేసిరి. తోటకాపు ప్రతిమొక్కను శ్రద్ధగా కాపాడునట్లు, ఈపెద్దశిష్యుడు ప్రతిచిన్నశిష్యుని యవసరములను గనిపెట్టి అహర్ని శములు తనప్రభావమును వినియోగపరచుచు, వానిలో పురికొల్పబడవలసిన, బల పరచబడవలసిన గుణములను పురికొల్పుచు, బలపరచుచుండును. ఎప్పుడైన నొక సారి పరమగురువు, పెద్ద శిష్యునకు, ఒక సూచనగాని వ్యాఖ్యానముగాని చేయ వచ్చును; గాని సామాన్యముగ ఈకార్యములో పెద్దశిష్యునకు ప్రత్యక్షముగా నా దేశములనిచ్చుట సంభవించదు.

ఈఛాత్రులందరు జట్టుగా నొకచోటనుండుట వారిపురోవృద్ధికి సహాయ పడును; వారందరు ఒకే విధమగు ఉన్నతాదర్శములచే ప్రేరేపింపబడిన వారగుటచే యోగ్యమగు లక్షణములు శీఘ్రముగా వారిలో వృద్ధినొందును. ఒక ముముక్షువు తనకంటె నెక్కువగా పరిణామముబొందిన మరియొకనితో సంబంధము గలిగియుం డుటయు, వానితో సమరసముతో నుండుటకు తనకుగల సామర్థ్యము ద్వారా విశేషలాభమును బొందుటయు కర్మసూత్రవిధానములో తప్పనిసరికాబోలు. ఒక సామాన్యవిషయమేమన, మార్గదర్శిగనుండి సహాయమునిచ్చెడు పెద్దశిష్యునితో

కొంతకాలము సాంగత్యము గలిగియుండినగాని యెవ్వరిని పరమగురువు పైయంతరువు నకు తీసికొనిపోరు. దీనికి మినహాయింపులుకలవు; ప్రతిపరమగురువు తమ యిచ్ఛాను సారము వ్యవహరింతురు. ఒక్కొక్కసందర్భములో పరమగురువు తమ శిష్యులు పర సహాయమేమియు లేకుండ స్వశక్తులను వృద్ధిజేసికొని విశేషబలమును సంపాదించు కొనుటకుగాను వారిని బహుదూరముగా దేశాంతరమునకు పంపివేయుదురని మన యధ్యక్షులు (డాక్టరు బిశెంటు) చెప్పిరి. ఏవ్యక్తికి యేదియుత్తమముగ నుండునో ఆరీతి శిక్షణ మొసంగబడును.

కర్మవశమున చాల దూరమున నొక పొలముమీదనో, తోటమీదనో పని చేయుచుండునట్టియు, లేక ఏదో యొక స్థలమునకు కట్టుబడిపోయియున్నట్టియు ఛాత్రునకు అదివరలో ఈమార్గమున స్థిరపడియున్న అభిజ్ఞుని సహాయములభింప సాధ్యముకాదు గనుక, నొంటరిగనున్నప్పుడు అతనికి పురోవృద్ధి సాధ్యమగునాయని ప్రశ్నించిరి. నిస్సంశయముగా, అతడు పురోవృద్ధిని బడయవచ్చును; భూలోకములో సాహాయ్యము తక్కువగుటచే అతని కార్యము కఠినతరమైనను, ఆత్మవిశ్వాసమును పెంపొందించుకొని, యొంటరిగానున్న కారణముచేతనే ఎక్కువ ఇచ్ఛాశక్తిని, పట్టు దలను వికసింపజేసికొనవచ్చును. ఒకపెద్దశిష్యునితో ఉత్తర ప్రత్యుత్తరముల జరుపు కొనుచు, తన సంశయముల దీర్చుకొనుచు, జవాబులను తెప్పించుకొనుచు పని చేయుట చాల శ్రేయస్కరము. అట్లుచేసిన యెడల కాలహరణము కాక పోవుటయే గాక అతని మార్గము కూడ చాలసుగమమగును.

— ♦ —

# అయిదవ అధ్యాయము

## స్వీకరణము : ఒక స్వీకరణవృత్తాంతము

పరమగురువు ఒకనిని శిష్యునిగా స్వీకరించినతోడనే అతనిజీవితములో చాల గొప్పమార్పు కలుగుచున్నను, పరీక్షితునిగా తీసికొనబడినప్పుడు జరిగినదానికంటె అతిశయమగు బాహ్యసంస్కారమేమియు జరుగదు. వెనుకటి అధ్యాయములో పరీక్షితునిగా తీసికొనునప్పుడు జరిగెడు సంగతులను చెప్పితిని; వానితో పోల్చిచూచుకొనుటకై మన యువకులు కొందరు స్వీకృతులైన సందర్భములో జరిగిన విషయముల నిచట చెప్పెదను:

మాపరమగురువు కూట్‌హూమిమహర్షిగారి యింటికి మామూలుగా మేము వెళ్లుసరికి మోర్యమహర్షిగారు ఆయనతో గాఢముగా సంభాషించుచుండిరి. సహజముగ మేమొకింతసేపు ప్రక్కను నిలబడితిమి; కాని కూట్‌హూమిమహర్షి స్వాగతమును సూచించు సుశోభితమగు మందహాసముతో ముందుకు రమ్మని పిలిచిరి. మామూలు ప్రకారము మేము సమస్కరించితిమి.

మాశిష్యులలో మొదటివాడు తనగురువుయెడల సంపూర్ణప్రేమగలవాడై ఆయన నొక జ్యేష్ఠసోదరునిగా జూచుకొనుచుండును; ఆయన యెదుట చనవుతోను సంపూర్ణస్వేచ్ఛతోను మెలగుచుండును; కాని యెల్లప్పుడును ఆయన ముందు గాఢమగు భక్తితో మాట్లాడును. వాస్తవముగ వారిరువురును కలిసియుండగా చూచుట కతిరమ్యముగనుండును. ఆయువకునిగూర్చి పరమగురు వొకసారి " నిత్యము వెలుగుచుండెడు ప్రేమతార " యని చెప్పిరి.

ఈసారి మాగురువు అతనినిజూచి దయతో నవ్వుచు " నాక్రింద పనిచేయుటకును, మానవసేవకై జీవితము నర్పణజేయుటకును నీవు తుదినిర్ణయమునకు వచ్చితివా ? " అని యడిగెను. అట్లేచేయుటకు నిర్ణయించితినని ఆపిల్లవాడు మనఃపూర్వకముగ జవాబు చెప్పెను. అప్పుడు మాగురువు " నీవుచేసిన కృషికి చాలసంతసించితిని, నీప్రయత్నములను సడలింపవని యాశించెదను. కొన్ని నెలలక్రిందట నేను నీకు చెప్పినసంగతులను ముందు క్రొత్తపరిస్థితులలో నీవు మరువకూడదు. నీకృషివలనను, నీపట్టుదలవల్లను, నీపరీక్షమాణకాలమును తగ్గించుటకు నాకవకాశము కలిగినది. పురోవృద్ధికిగల మార్గములన్నిటిలోను మిక్కిలి కురుచయైన మార్గమును,

అనగా నీతోపాటు ఇతరులనుగూడ మార్గము వెంబడి తీసుకొనివచ్చు పద్ధతిని, నీ వవలంబించినందుకు నేను సంతసించితిని. కేవలము స్వార్థరహితమగు ప్రేమయే ప్రపంచములో బలవత్తమమగు శక్తి; కాని, ఒక విషయములో నైనను ప్రతిఫలాపేక్ష, అసూయ అనునవి ఆప్రేమ నంటకుండ పరిశుద్ధముగ నుంచగలిగినవారు బహు కొద్ది మందిమాత్రమే యుందురు. అనేకవిషయములకొరకు ఏకకాలమందా ప్రేమజ్యోతిని ప్రకాశవంతముగ వెలుగుచుండునట్లు చేయుటలో నీవు కృతార్థుడవగుటచేతనే నీకట్టి యభివృద్ధి లభించినది. బలమును వృద్ధిజేసికొనుటకై నీవు చాల శ్రమపడితివి, కాని యింకను ఎక్కువబలము కావలసియున్నది. ఏనిమిషమందేమి కావలయునో పది నిమిషముల తరువాత గాక, ఆనిమిషమందే తెలిసికొనగలిగిన వివేకమును మెలకువను నీవు సంపాదించవలెను. మాట్లాడుటకును, కార్యముచేయుటకును ముందుదాని ఫలితమెట్లుండునో జాగ్రతగా యోచింపుము. ఇంతవరకు బహు ప్రశస్తముగా జేసితివి, నేను చాల సంతోషించితిని," అనిరి.

తరువాత పరమగురువు తమ కరమును ప్రతిఅభ్యర్థి శిరముపైనను బెట్టుచు "ప్రాచీన సాంప్రదాయికముగ నిన్ను శిష్యునిగా స్వీకరించుచున్నాను," అని పలికిరి. ప్రతివానిని వరుసగ తమ తేజోమండలములోనికి ఆయన గైకొనగా ప్రతివాడును కొన్ని క్షణములపాటు ఆయనలో నదృశ్యమై, తిరిగి కనిపించుసరికి వర్ణనాతీతమగు ఆనందముతోను వైభవముతోను శోభిల్లుచుండెను. అదివరకెన్నడును ప్రదర్శితపని రీతిని పరమగురువుయొక్క ప్రత్యేకలక్షణములను ప్రతివాడును తనలో కనబరచుచుండెను. ఇదంతయు ముగిసినపిదప ప్రతివానితోను "నా యాశీస్సు నిచ్చుచున్నాను" అని పరమగురువు పలికిరి. అటుపిమ్మట అందరివైపుజూచి "నాతోరండు; ఇప్పుడే క్రొత్తయోగ్యతతో మిమ్ములను అధికారులు గుర్తించి నమోజు చేయుటకు గాను వారికి చూపించవలసియున్నది," అనిరి. వారినప్పుడు మహాచోహాన్‌యొద్దకు తీసికొనివెళ్ళగా ఆయ నాయువకులను బహు శ్రద్ధగా జూచి "మీరు చాల యువకులు, ఇంతత్వరలో ఈస్థితికి రాగలిగినందుకు మిమ్ముల నభినందించుచున్నాను. మీరు చేరిన స్థానమునకు తగినట్లు మీరు జీవింపవలెను," అని చెప్పి అవినాశమగు పుస్తకములో వారి నామములను వ్రాసిరి. ఆపేర్లను, వానికెదురుగ ముందు వ్రాయవలసినవివరములను గూడ జూపించి, ఆవివరములనుగూడ త్వరలోవ్రాసి పూర్తి చేయుదురుగాక యని ఆయువకులతో ననిరి.

మహాచోహాన్‌యొద్దనుండి తిరిగివచ్చుచుండగా పరమగురువు తమ నూతన శిష్యులను తమ గృహామువద్దనున్న గుహాలోనికి తీసికొనిపోయిరి. అచట మహర్షి అదివరలో కొద్దికాలము క్రిందటచేసిన ఆయువకుల సజీవ ప్రతిమలను గాలిలో కలిపి వేయుటయు, అవి అదృశ్యములగుటయు బాలురు చూచిరి. మహర్షి "ఇప్పుడు సర్వదా మీరు నాలోభాగమై యుందురు గనుక ఈ విగ్రహములవసరము లేదు," అని పలికిరి.

## పరమగురువుతో నైక్యమొందుట

ఈసంస్కారమును కారణశరీరదృష్టితో జూచినయెడల, పరమగురువు సజీవ మగు అగ్నిగోళమువలె మహావైభవముగ నుండును. ఆ గోళమనేకవందల గజముల దూరము చుట్టును వ్యాపించి యుండును. ఒకే కేంద్రముగల రంగుల మండలములు ఆగోళములో నగపడును. పరమగురువు స్థూలశరీరమున్ను దానికి సంబంధించిన పైలోకములోని ప్రతిరూపములున్ను ఆప్రకాశించుచున్న గోళము మధ్యనుండును.

గురువుయొక్క స్థూలశరీరమును సమీపించుచున్నప్పుడు శిష్యుడు సూక్ష్మ ద్రవ్యముతో చేయబడిన ఆ వెలిగెడు గోళములోనికి ప్రవేశించును; గురుచరణము లను చేరుసరికి ఆదివ్యమగు గోళగర్భములోనికి పోయియుండును; గురువు శిష్యుని ఆ ప్రకార మాలింగనముచేసి శిష్యుని తేజోమండలము తనలో నిమిడియుండువరకు తననుతాను విస్తరింపజేసికొనును. అప్పుడట్లు విస్తరించినది నిజముగ కేంద్రమం దుండి అగ్నివలె ప్రకాశించుచున్న హృదయమే. ఏలయన ఈ స్వీకార సంస్కారము జరుగుచున్నంతకాలము శిష్యుడు ఆప్రబలమగు తేజోమండలముయొక్కలోపలిభాగము లోనే యుండును. కనుక, కొన్ని నిమిషములపాటు గురుశిష్యులు ఏకముగనుందురు. పైన చెప్పినరీతిని గురువుగారి తేజోమండలము శిష్యుని తేజస్సును మార్పు జేయుటయేగాక, శిష్యుడార్జించిన విశిష్టలక్షణము లేమైన నున్న యెడల అవిగురువుగారి తేజోమండలము లోని కేంద్రములపై బనిచేయును. అందుచే అదికూడ జవాబుగా మెఱయుచుండును.

వర్ణనాతీతమగు గురుశిష్యసంశ్లేషము స్వీకారసంస్కారముతో ప్రారంభమై శాశ్వతముగనుండును. ఆతరువాత భూలోకములో శిష్యుడు గురువునకు చాల దూరముననున్నను అతని సూక్ష్మశరీరములు గురువు శరీరములతో సమరసముగా స్పం దించుచుండును. శిష్యుడు సర్వదా గురువులో సమశ్రుతినుండునట్లు తయారగుచుం డును. అందుచే మొదట పోలిక చాల తక్కువగనున్నను క్రమేణాశిష్యుడు గురువు

వలెనే పెరుగుచుండును. పరమగురువు శక్తి దిగువలోకములలో ప్రవహింపగలుగు టకు శిష్యుడొక బహిరంగమగు కాలువవలె నేర్పడి ప్రపంచమునకు మహోపకారి యగు చున్నాడు. నిరంతరము గురువుపై ధ్యానముచేయుచుండుటచేతను, ఆయన వలెకావలెనని తీవ్రముగా నాకాంక్షించుటచేతను శిష్యుని యుపాధులు చాలవరకు మార్పుచెంది నిత్యమాగురువువైపునకే తెరచుకొనియుండి, ఆయన ప్రభావమును గైకొనుటకు వేచియుండును.అన్ని వేళలయందును అవిఆగురుభావముతోనే నిండియుం డును; గురువేమి పలుకునో వినుటకు వేచియుండును; ఆయన యొద్దనుండి యేమి రాగలదోయని కనిపెట్టిచూచుచుండును; కనుక గురువువద్దనుండివచ్చెడు ప్రభావము లను గ్రహించుటకు శ్రద్ధగను ఆతురముగను తెరచుకొనియున్నను ఇతరుల వైపు నుండి నీచప్రభావము లేమియు సోకుటకు వీలులేకుండ చాల వరకు మూసికొని యుం డును. కాబట్టి కామశరీరము మొదలు శిష్యుని ఉన్నతమగు సూక్ష్మోపాధులన్నియు గళ్ళావలెపైన తెరచుకొనియుండి, క్రింది యంతరువులలో చెడుప్రభావము లేమియు నంటకుండ ప్రక్కలన్నియు మూసికొనియుండును.

శిష్యుని యిట్లు సమశ్రుతిలో బెట్టుచుండుట శిష్యత్వకాలమంతయు జరుగు చుండును. మొదట అతని స్పందములు గురువుగారి స్పందములుకంటె చాల అష్టక ములు క్రిందుగనున్నను సమశ్రుతిలోనుండి క్రమేణాఉద్ధృతములగును. ఈవిధానము చాల నెమ్మదిగా మాత్రమే జరుగగలదు; అచ్చుతో రేకుపై ముద్రించుటవలె సుల భముగాగాని, వీణాతంతులను, పియానో తీగెలను శ్రుతిచేయుటవలె త్వరితముగాగాని జేయదగినపనికాదు. అవి నిర్జీవములగు వస్తువులు; ఇచట సజీవమగు వ్యక్తిని దిద్దు బాటు చేయవలసియున్నది; కనుక ప్రాణమును కాపాడినిలబెట్టవలెనన్న, తోటకాపు చెట్లకొమ్మలను నెమ్మదిగా మరలించునట్లును శస్త్రచికిత్సచేయు వైద్యుడు సరియైన సాధనములతో వంకరపోయిన కాలును క్రమేణాతిన్నగతీర్చునట్లును, అంతరంగము నుండి శిష్యునిలో నెమ్మదిగా కలుగుచుండెడు వికాసము నుపయోగించి గురువు శిష్యుని స్థూలశరీరమును బాహ్యప్రభావముల కనుగుణ్యముగా నుండునట్లు మార్పు చుండవలెను.

ఈకార్యమును నెరవేర్చుటలో మొదటినుండి తుదివరకు పరమగురువు ప్రతి శిష్యునకు ప్రత్యేకముగా తమ శ్రద్ధను సంపూర్ణముగ వినియోగపరచరనియు, వేల కొలది జనులపై ఏకకాలమందు పనిచేయుచుందురనియు, అంతేగాక ఉన్నతలోకము

లలో ఉన్నతమగుకార్యమును గూడ చేయుచుందురనియు, ఈ ప్రపంచములోని శేశ్వేరు జాతులను, వివిధములగు శక్తులను, దేవతలను, మనుష్యులను, అన్నిటిని చదరంగపుటాటలోవలె నడిపించుచు చిత్రమగుపనిచేయుచుందురనియు మనకు తెలియును. అయినను, ఆయన ఒక్క-శిష్యునిగూర్చి మాత్రమే యోచించుచు, అన్యుల గూర్చి యోచించుటలేదనునట్లుగా ప్రతివానికి ఫలితము కనిపించును; ఏలయన మనము సంపూర్ణముగ నొక్క-రి మీాదనే మనస్సు నిలిపిన దానికంటెవారు వందల కొలది జనులలో ప్రతి యొకనిపై చూపించగలిగెడు శ్రద్ధయెక్కు-వ గాఢముగా నుండును. ఆయన తన యుపాధులలోనుండి శిష్యుని యుపాధులలోనికి నిరంతరము శక్తులను ప్రసరింపచేయుచున్నను శిష్యుని స్థూలోపాధులను సమశ్రుతికి తెచ్చుకార్యమును తరుచుగ పెద్దశిష్యులలో నొకరికి యొప్పగింతురు. ఈప్రకారము, శిష్యులకేమియు తెలియకుండగనే, ఆయన వారి కందరకు విశేషమగు సహాయము జేయుచుందురు.

స్వీకృత శిష్యుడు పరమగురువు చైతన్యమునకు దూరముగా పారావలె, ఆయన చైతన్యమంతవరకు వ్యాపించియున్నట్లుగానుండును. ఆపరమపురుషుడు శిష్యునిద్వారా చూచును, వినును, గ్రహించును; కనుక శిష్యుని సమక్షమందేమిజరిగినను అది గురువు సమక్షమందు జరిగినట్లే. కాని, అట్టివిషయముల నన్నిటిని ఆపరమపురుషుడు తెలిసికొనగలిగినను, ఆయన తప్పనిసరిగ ఎల్ల వేళలయందును ఆక్షణమందే యెరుకగలిగియుండునని అర్థముకాదు; ఆయన ఆసమయమున ఇతర కార్యములో నిమగ్నుడై యుండవచ్చును, కాని ఆయనకవన్నియు తరువాత జ్ఞప్తియందుండును. ఒక ప్రత్యేకవిషయమై శిష్యుడెట్టి జ్ఞానమునైనను సంపాదించినయెడల, పరమగురువు ఆవిషయమై తలచినప్పుడు, అది కూడ ఆయన జ్ఞానములో భాగమై ఆయన మనమున నిలిచియుండును.

శిష్యుడొక భక్తిభావమును పరమగురువునెపు పంపినయెడల, అదియొక చిన్న మెఱపువలెనున్నను ఆయనలో నొక పెద్దద్వారమును తెఱచినట్లగును; వెంటనే పరమగురువువద్దనుండి ప్రేమయు, శక్తియు అపారమగు ప్రవాహమువలె దిగువకు ప్రవహించును. సిద్ధపురుషుడుగానట్టి మరియొకరి యెడల అట్టి భక్తిభావమును జూపినచో, అది అతనివైపు అనల ప్రవాహము పారుచున్నట్లు కనబడును; కాని శిష్యుడు తన గురువు యెడలనట్టిభావమును జూపినచో, ఆక్షణమందే తేజరిల్లుచుండు

ప్రేమప్రవాహము గురువు వద్దనుండి బయలుదేరి శిష్యునిముంచివైచును. సిద్ధపురుషునిశక్తి సూర్యకాంతివలె నెల్లప్పుడును అన్ని దిక్కులకు ప్రసరించుచునేయుండును. కాని, శిష్యుని భావనాస్పర్శ తగిలినయెడల ఒకక్షణమాత్రము అపారమగు ప్రవాహమొకటి శిష్యునిపైకి ప్రవహించును. ఆగురుశిష్యుల ఏకత్వము ఎంత సంపూర్ణముగ నుండుననిన శిష్యుని స్థూలోపాధులలోనేమైన తీవ్రమగు వైకల్యము కలిగిన యెడల అది వెంటనే గురువుగారి యుపాధులను గూడ బాధించును; అట్టి సందర్భములు సిద్ధపురుషుని యున్నతలోకకార్యమునకు భంగము గలిగించునుగనుక, ప్రమాదవశమున అట్టిది సంభవించిన యెడల, ఆయన శిష్యునకును తనకును మధ్య నొక తెరను కల్పించవలసియుండును. శిష్యునిలో తుపాను సమసిపోవువరకు వానిని గురువునుండి ఆ తెర వేరుచేయుచుండును. గురువునుండి యిట్లు వేరుచేయబడుట శిష్యునకు నిజముగా విచారకరమగు విషయమే. కాని దానికతడే కారణము, గనుక అతని తలంపులను, రాగములను నిగ్రహించుకొనగలిగినక్షణమందే ఆయెడబాటు నంతమొందించుకొనవచ్చును.

సాధారణముగా అట్టి దౌర్భాగ్యపు సంఘటనము నలువది యెనిమిది గంటల కంటె ఎక్కువ కాలముండదు, కాని అట్టి అరమరిక సంవత్సరములకొలది ఉండిపోవుటయు, ఆజన్మాంతముకూడ నుండుటయు జరిగిన సందర్భములనుగూడ నే నెరుగుదును. అట్టి విషాదకరమగు సంఘటనములు బహు అరుదుగా నుండును; ఏలయన, అంత భ్రంశము నొందగల మనిషిని శిష్యునిగా స్వీకరించుట సామాన్యముగ సంభవించదు.

## శిష్యుని వర్తనము

తనశక్తులను బహిర్ముఖముగావించి, తనశ్రద్ధను తనబలమును పరులపై నేకాగ్రతతో నిలుపుటయు, మన తోడి మానవులకు సర్వదా సహాయకరమగు సుహృద్భావములను బంపుచుండుటయు నలవాటు జేసికొనసంతవరకు శిష్యుడుగా స్వీకరింపబడుట కెవ్వరికిని అవకాశము కలుగదు. మనతో సన్నిహితసంబంధము గలిగియున్నవారికేగాక, వీధిలో పోవుచుండెడు పరులకుగూడ అట్లు సహాయము చేయుటకు నిత్యము అవకాశములు కనిపించుచుండును. విచారకరముగనున్నట్లుగాని, బాధపడుచున్నట్లుగాని ప్రత్యక్షముగా గనిపించెడు మనిషిని మన మప్పుడప్పుడు చూచు

చుందుము; అట్టివాని తేజోమండలములోనికి బలము నిచ్చునట్టియు ఉత్సాహము గలిగించునట్టియు నొక సంకల్పమును మెఱుపువలె పంపవచ్చును. ఇరువదియైదు సంవత్సరములకిందట New Thought —నవ్యభావన — గ్రంథావళిలో నొకపుస్తకములో నేను జూచిన వాక్యము నిచట నుదహరించెదను ;

"నీవు రొట్టెను చేయునపుడు పిండిలో ప్రేమను కలిపి మర్దింపు; డస్సిన వదనముగల స్త్రీకొరకు నీవు మాటను పంపునపుడు, దానిలో బలమును ధైర్యమును పెట్టి కట్టుము; అనుమానముతో జూచుచున్నవానికి నీవియ్యదలచిన నాణెముతో పాటు విశ్వాసమును, నిష్కాపట్యమునుగూడ నందించుము."

ఈ వాక్యములలో నొక రమ్యమగు భావము చిత్రముగా చెప్పబడినది. అయినను, దానిలో నొక పరమసత్యముకలదు. ఒక సంబంధము కలిగినయెడల సేవ జేయుట కవకాశముకలిగినట్లే; ఎంత యాదృచ్ఛికముగ కలిసికొన్న మనిషియైనను అతడు నీ సహాయమును బొందవలసినవాడే. సద్ధర్మము నెఱిగిన సాధకుడు తన జీవితములో తనచుట్టును సర్వదా ఆశీర్వాద ప్రదానము చేయుచు నిరాడంబరముగా ప్రతిచోటునను శుభమును జేయుచుండును. ఆశీర్వాదమును, సహాయమును బొందినవాడు అవి యెచటనుండి వచ్చెనో ఎఱుగకపోవచ్చును, కాని దాత తన విధిని తాను నెరవేర్చుచు బోవుచుండును. అట్లు దానములు చేయుటలో నిరుపేదగానీ, శ్రీమంతుడుగానీ, ప్రతిమనిషియు పాల్గొనవచ్చును; యోచనచేయఁగలిగిన వారందరు దయతో ప్రేమపూర్వకమైన, సహాయకరమైన సంకల్పములను పంపగలరు. అట్టి సంకల్పము లెన్నడును నిరర్థకముకాలేదు, విశ్వధర్మములు సాగుచున్నంతకాలము నిరర్థకముకానేరవు. నీవు ఫలితములను చూడలేకపోవచ్చును. కాని ఫలితముండి తీరును. ప్రశాంతముగ ప్రేమమార్గమున బోవుచు నీవు చల్లెడి ఆ చిన్నవిత్తులనుండి యెన్నటి కేఫలము ఫలించునో నీకు తెలియదు.

ప్రకృతియొక్క సాధనసంపత్తులను సాధకుడు కొంచెమైన నెఱింగియున్న యెడల, పైవిధముగ పనిచేయుటలో నతడు వానివలన చాల సహాయమును బొందగలడు. వనదేవతలు, జలదేవతలు మొదలగు భూతములు ప్రకృతిలో నసంఖ్యాకములుగాగలరు; వారు సంకల్పరూపములను ఆత్మప్రతిష్ఠితము గావించుటకు ప్రత్యేకముగా తగినవారు; అందుచే ఆపనిలో నియోజింపబడుటకు వారెంతైన ఉల్లసిల్లుచుందురు. చేలలోను వనములలోను నడచునప్పుడును, నీటిమీద ప్రయాణము

జేయునపుడును మన సాధకుడు ఆదేవతలను తనతో రమ్మని యాహ్వానింపవచ్చును; వారిని తన తేజోమండలములోనికి తీసికొని తనతోడ గొనిపోవచ్చును; తరువాత నేదైన నగరముచేరినప్పుడు వారు కలిసికొనువారిపై సద్భావములను ప్రసరింప జేయుటలో ప్రతిసంకల్పరూపమును ఈచిన్న దేవతలలో నొక్కొక్కరిచే నాత్మప్రతిష్ఠితము చేయించవచ్చును. అట్లుచేయుటచే ఆస్నేహశీలముగల భూతమునకు ప్రకాశవంతమగు సంతోషమును కొంత పరిణామవికాసమును గలుగచేసినవాడగును; అంతేగాక తన సంకల్పరూపముయొక్క ఆయువును, క్రియాశక్తిని చాల పొడిగించినవాడగును.

## శక్తి ప్రసరణము

సాధారణముగ ప్రపంచములోని సామాన్యజనులందరు తమ శక్తులను తమమీదికే అంతర్ముఖముగ త్రిప్పుకొందురు; వారు స్వార్థపరులగుటచే వారి శక్తులన్నియు కలిసి, లోపల గింగురుమనుచుండును. కాని శిష్యుడు బహిర్ముఖుడై, నిరంతరము ప్రేమను, సేవను నొసంగెడు తీరును స్థాపించుకొనవలెను. కనుక శిష్యుడు ఒక గళ్ళావలెనుండవలెను; అతని సూక్ష్మోపాధులు గళ్ళా మొదటనున్న ముఖపాత్రవలె తెరచియుండి పరమగురువుయొక్క ఉత్తమప్రభావములను గ్రహించుచుండును; అతని స్థూలోపాధులు గొట్టము అడుగుననుండు కన్నమువలె పైనుండి ప్రవహించెడు ప్రభావములను నిరంతరము ఇతరులపై ప్రసరింపజేయుచుండును. అందువలన ఆపరమగురువుశక్తిని బాహ్యలోకములకు ప్రసాదించుటకు శిష్యుడు పరిపూర్ణసాధనమగుచున్నాడు.

టిబెటు దేశములోనున్న సిద్ధపురుషుడు కొంత శక్తిని ఆకాశద్రవ్యమునుండి న్యూయార్కు నగరములో ప్రసరింపజేయవలెనన్న అంతదూరము ఆకాశద్రవ్యము ద్వారా పంపుట పొదుపుకాదు; వారాశక్తిని అంతకంటె చాల ఉన్నతలోకముల నుండి కావలసిన స్థానమునకు పంపి, అచట నొక గళ్ళావంటిదాని ద్వారా క్రిందకు ప్రవహింపజేయవలసియుండును. మరియొక యుపమానమును చెప్పెదను. విద్యుచ్ఛక్తి అపారమగు నొత్తిడి (వోల్టేజి) తో నగరమంతటను బంపబడును, కాని అచ్చటచ్చట చిన్నచిన్న గృహములను (సబు-స్టేషనులను) నిర్మించి, అందులో ఆశక్తియొక్క వోల్టేజిని తగ్గించి, ఎక్కువ ప్రవాహము తక్కువ వోల్టేజిలో ప్రవ

హించునట్లు క్రిందకు పంపెడు ఏర్పాట్లును చేయుదురు. అప్పుడు ఎచటకు కావలయునో అచటకు క్షేమకరముగ తీసికొనిపోయి విద్యుచ్ఛక్తిని వాడుకొనవచ్చును. కాని, యొక గల్లావంటిదాని నేర్పాటుచేయుటకుగాని, న్యూయార్కు నగరములో ఆశక్తిని తగ్గింపుచేసి ప్రసరింపజేయుటకుగాని విశేషముగు శ్రమపడవలసియుండును. అట్టి శ్రమవల్ల సిద్ధపురుషుడాకార్యమునకు వినియోగపరచదగిన బలములో రమారమి సఖమునంతుబలము వ్యయమై పోవలసియుండును. కనుక, ఆస్థలమందు శిష్యుడొకడున్నచో అట్టి శ్రమలేకుండ ఆపనిని జేయుటకు అమూల్యమగు ఉపకరణమగును; శిష్యుడు తగిన ఉపకరణముగా నుపయోగపడుటయే పరమగురువునకు విశేషముగా కావలయును గనుక, ఎల్లప్పుడును శిష్యుడు తన నొక శ్రేష్ఠమగు నెల్లువగా నొనరించుకొనచుండవలెనని జ్ఞాపకముంచుకొనవలెను. ఆవిధముగజూచిన, శిష్యుడు తానున్న స్థలమందు పరమగురువున కొక అదనపు ఉపాధియగునని చెప్పవచ్చును.

వాస్తవముగ ప్రతిమానవశరీరము దానిలోపలనున్న ఆత్మశక్తులను ప్రసరింపజేయు యంత్రమైయున్నది. ఇచ్ఛయొక్క ఆజ్ఞలను మిక్కిలి పొదుపుగా నెరవేర్చుటకనేక యుగములనుండి శరీరమలవాటుపడియున్నది. ఉదాహరణమునకు బల్లమీదనున్న చెంబును కదపవలెననిగాని తలక్రిందుచేయవలెననిగాని కోరిక కలిగినచో, హస్తమునుజాపి ఆపనిని సులభముగ జేయవచ్చును. హస్తముతో తాకకుండ కేవల మాత్మశక్తిచేకూడ చెంబును తలక్రిందుజేయవచ్చును. వాస్తవముగా, దివ్యజ్ఞాన సమాజముయొక్క ప్రారంభదశలోచేరిన తొలిసభ్యులలో నొకరు ఈ ప్రయోగమును సాధించెను. కాని రెండు సంవత్సరముల కాలము ప్రతిదినము, దినమున కొక గంట చొప్పున విశేష శ్రమపడి సాధింపగలిగెను. అట్టి సందర్భములో సామాన్య స్థూలసాధనముల నుపయోగించుట చాల సులభము, ఉచితమునని స్పష్టపడగలదు.

పరమగురువుతో శిష్యునకు సంబంధముకలిగిన మొదటిదశలో, తనద్వారా అపారమగుశక్తి ప్రసరింపజేయబడుచున్నదని శిష్యుడు తరుచు అనుకొనుచుండును; కాని ఆశక్తి యెచటికి బోవుచున్నదో యెరుగడు. తనద్వారా సజీవమగు గొప్ప అగ్ని ప్రవాహము చొచ్చుకొనివచ్చుచు తన పరిసరప్రాంతములయందు వెల్లువలుగా పారుచున్నదని మాత్రమే యెరుగును. కొంచెము జాగ్రతగా పరిశీలనచేసిన యెడల అది యేదిక్కుకు పోవుచున్నదో త్వరలోనే తెలిసికొనగలుగును. మరికొంత కాలముతరువాత ఆపరమగురువు శక్తియొక్క ప్రవాహగతిని తెలివితో అనుసరింప

గలడు, మరియు నది యెవరియొద్దకుపోయి యెట్లు సహాయపడుచున్నదో నిర్దిష్టముగా గ్రహించగలడు. కాని, ఆశక్తి నతడు నడిపింపలేడు; అతడు కేవల మొక కాలువగా నుపయోగింపబడును. అయినను, క్రమేణా ఆశక్తి ప్రసరణములో నతడుకూడ పాల్గొనుట నేర్చుకొనుచుండును. కొంతకాలమయినతరువాత, పరమగురువు దూరమున నున్న మరియొకరి నుద్దేశించి శిష్యునిద్వారా శక్తిని ప్రసరింపజేయుటకు బదులు, ఆమనిషిని కనుగొని వానికి కొంతశక్తి నొసంగవలసినదని గురువు శిష్యునితో చెప్పును. ఇట్లుచేయుటవలన గురువుగారు కొంతశక్తిని వ్యయపరచనవసరము లేకపోవును. ఎప్పుడయితే, ఎచటయితే శిష్యుడు పరమగురువు కార్యము నొకింతయైన చేయగలుగునో అప్పుడు ఆయన తప్పక అతని కాయవకాశముల నిచ్చెదరు. శిష్యుడంతకంతకెక్కువ ఉపయోగకరముగనున్న యెడల, ఎక్కువ కార్యము నతనికొప్పగించెదరు. అందువలన పరమగురువునకు స్వల్పముగానైనను శ్రమ తగ్గగలదు. మనమిచట చేయగలిగినపనిగురించి సహజముగా బహు గొప్పగా యోచింతుము. కాని, మన మూహించి చేయగలపనినంతను ఆయన మనద్వారా చేయుచున్నపనితో పోల్చి చూచినయెడల, ఇదంతయు శూన్యమనిపించును. శిష్యునికేమియు తెలియకపోయినను వానిద్వారా ఎల్లప్పుడును నెమ్మదిగా శక్తిప్రసారము జరుగుచుండును. కాని, యెప్పుడైన అసాధారణమగుశక్తి పంపబడినయెడల, ఆసంగతి శిష్యునకు స్పష్టముగా తెలియును.

ఒకపరమగురువు సాధారణముగా తనశిష్యులద్వారానే తనశక్తిని ప్రసరింపజేయును; కాని శిష్యుడు కాకపోయినను, ఎవరైనను త్రికరణశుద్ధిగా సేవాతత్పరుడై పరిశుద్ధము, సౌమనస్యముగలిగి జీవించుచున్నయెడల వారు గురువుయొక్క శక్తి ప్రసరణమునకు వెల్లువగా నుపయోగపడవచ్చును. మరియును, ఒక ప్రదేశములో నిర్దిష్టమగు నొక శక్తి ప్రసారమునకు పూర్తిగ తగినటువంటి శిష్యుడెవ్వడును లేకపోవుటయు, శిష్యునివలె నభివృద్ధిబొందకపోయినను ఆప్రత్యేకకార్యమున కుపయోగపడదగిన మరియొకవ్యక్తి యుండుటయు సంభవించుచుండును. అట్టి సందర్భములలో పరమగురువు ఆతనిని యుపయోగింప వచ్చును. ఆయన అనేక కార్యముల కొఱకు అనేక విధములగుశక్తులను ప్రసారముజేయుచుందురు; ఒకదానికొకరును, మరియొకదానికి మరియొకరునుసరిపడవచ్చును. ఇరువురు శిష్యులను క్రమముగాపరీక్షించిచూచినచో,

ఒక రొక విధమగుశక్తి ప్రసారమునకును, రెండవవారు మరియొకవిధమగు శక్తి ప్రసారమునకున్ను ఎల్లప్పుడును ఉపయోగింపబడుచుండుట గనబడును.

ఈశక్తిప్రసారము భూలోక, భువర్లోక, సువర్లోక, మనోలోక, బుద్ధిలోకము లన్నిటిలోను జరుగుచుండును; భూలోకములో ముఖ్యముగా కరచరణములద్వారా ప్రసరించుచుండును; అందుచేత, మామూలు కారణము లటుండ, శరీరపరిశుద్ధత విషయమై ప్రత్యేక శ్రద్ధ తీసికొనవలసియున్నది. పరమగురువు నిర్ణయించిన వ్యక్తి ఈముఖ్యవిషయములో కొంచెమైనను తప్పిపోయినయెడల, అతడు తగిన నెల్లువగా నుండలేడు, అందుచేత ఆయన అతని నుపయోగింపలేడు. పరిశుభ్రమగు నీటిని మురికి గొట్టముద్వారా పంపుటచే నీరంతయు మలినమైపోయినట్లగును. కనుక పరమగురువులతో సన్నిహిత సంపర్కముగలవారు పరిపూర్ణశరీరశుభ్రత విషయమై మిక్కిలి శ్రద్ధగలిగియుందురు. కాబట్టి అవసరమువచ్చినప్పుడు యోగ్యతగలిగియుండునట్లు మనము బహుజాగ్రతగ నుండవలెను. మనము ఆయన కుపయోగకరముగనుండ వలెననిన, మనము శ్రద్ధవహింపవలసిన మరియొక విషయముగలదు. అది యేమనగా- అంగవైకల్యము, అందులో ముఖ్యముగా పాదములకు ఏవిధమగు వికలత్వము లేకుండ చూచుకొనవలెను. అచిరకాలముక్రిందట, పాదరక్షలేమియును లేకుండ నడచెడు ఆచారముగల సంఘములో కొన్ని వారములు నేనుంటిని. చాలమంది విద్యార్థుల పాదములు మెలిపెట్టుకొనిపోయి, మొండిగనుండుట జూచి చకితుడనైతిని. ఈవికలత్వము పరమగురువున కుపకరణములగుటలో వారికెంత ప్రతిబంధకమగు చున్నదో తలచి విచారించితిని. సామాన్యపరిస్థితులలో ఆశక్తి శిష్యుని శరీరము నంతను నింపి కొనలు (అనగా చేతులవేళ్లు, కాళ్ళవేళ్లు) ద్వారా బయటకు పోచ్చుకొనిపోవుట సహజము; కాని అనారోగ్యకరమగు కాలిజోళ్ళ నుపయోగించుటచే పాదములకు శాశ్వతమగు వికారము సంభవించినప్పుడు సిద్ధపురుషుడు శరీరములోని పైసగముభాగమునే వినియోగింపగలరు; అందువలన శిష్యుని క్రిందభాగమునకు శక్తి ప్రవహింపకుండ పొత్తికడుపువద్ద ఆనకట్టవలె నొకగట్టును ప్రతిసారియు తాత్కాలికముగ నిర్మించుటకై పరమగురువు ఎక్కువశ్రమ తీసికొనవలసియుండును. కనుక, ఇట్టి వికారములులేనివారు ఎక్కువ తరుచుగా నుపయోగింపబడుదురని నిస్సంశయముగ తేలుచున్నది.

## సందేశములనుపంపుట

ఒక్కొక్కప్పుడు పరమగురువు తమశిష్యునిద్వారా మరియొకనికి నిర్దిష్టమగు సందేశమును పంపుదురు. నేనిదివరకెరుగని యొక గొప్ప ధీమంతునకు ఒక సందేశము నందజేయవలసినదని నన్ను నియమించుట జ్ఞాపకము కలదు. అట్టి విషయమై వాని యొద్దకుపోవుటకు నాకు కొంతతత్తరపాటు కలిగినది; కాని నాకాపని చేయకతప్పినది కాదు. అందుచే నేను వానియొద్దకుపోయి, "నాపరమగురువు ఆజ్ఞప్రకారము నేనీ సందేశమును మీకందజేయుచు నావిధిని నెరవేర్చుచున్నాను. ఈసందేశము వారి యొద్దనుండి వచ్చినదని మీకు నేను ఋజువుచేయలేనని నాకు పూర్తిగా తెలియును. దానికెంత విలువ నివ్వవలెనో మీకే తెలియవలెను. వారి ఆదేశము ననుసరించుటకంటె నేను చేయగలిగినదేమియులేదు," అని చెప్పితిని. ఆసందేశమును నేనే వ్రాసియుండుటచేత దానిలోని యంశములు నాకు తెలియును. దానిని చూచి నచో దానిలో విశేషమేమియు లేదనియు, ఒక మిత్రుడు మరియొకనికి పంపదగిన బహు సామాన్యమగు సువ్యాఖ్యానముతోగూడిన సందేశమనియు నేను ధైర్యముగా చెప్పగలను. కాని బాహ్యరూపములు మోసముచేయునుగదా; నాజాబును అందు కున్న ఆవృద్ధుడగు పెద్దమనిషి చాల నులికిపడి " ఇది నీపరమగురువుగారి యొద్దనుండి వచ్చిన సందేశమని నాకు నమ్మకము కలుగచేయుటకై నీవు శ్రమపడనక్కరలేదు; అందులోని మాటలనుబట్టి నేను తక్షణమే తెలిసికొంటిని; ఆయనవ్రాసిన సంగతుల న్నిటియర్థమును తెలిసికొనుట నీకెంతమాత్రము సాధ్యముకాదు," అనెను. కాని ఆతని అభిప్రాయమేమైయుండునో యింతవరకు నాకు తెలియదు.

అయినను, ఆవిధముగ సందేశము నిచ్చుట బహుఅరుదు. ఈవిషయమై చాల దురభిప్రాయములుకలవు, కనుక ఉన్నతలోకములనుండి దిగువ స్థూలలోకములకు సామాన్యముగా సందేశము లెట్లు పంపబడునో సరిగా తెలియజేయుట యుపయోగ కరముగ నుండును. ఈలోకములకు గల సంబంధమును, వీని మధ్య ఉత్తర ప్రత్యు త్తరములను నడుపుటలో గలకష్టములను, ఈకష్టముల నెట్లు నిగ్రహింపగలుగు చున్నారన్న సంగతియును బాగుగ యోచించిన యెడల మన మా విషయము నెక్కువ సులభముగా గ్రహింపగలము.

## Sensitiveness, Mediumship, and Psychic Powers.

## సూక్ష్మసంవిత్తి, మృతసందేశహరణశక్తి, యోగశక్తులు

ఈవిషయముల గురించి ప్రత్యేక పరిశ్రమ చేయనట్టియు, ఆత్మశక్తులను వికసింపజేసికొనుటకేమియు కృషి జేయనట్టియు సామాన్యమానవునకు భూలోకాది లోకములన్నియు వేర్వేరు ప్రపంచములవలెనుండును, మరియు జాగ్రదవస్థలో అతని కీ లోకముల మధ్య సమాచార పరివర్తనముండదు. జాగ్రదవస్థలో నుండగా అతని చైతన్యము స్థూలశరీరములోని మెదడు ద్వారా పనిచేయును; స్థూల శరీరము నిద్రించుచున్నప్పుడు కామశరీరముద్వారా పనిచేయును. ఒక మృతుడుగాని కామ దేవతగాని ఆమనిషితో సంబంధముకలుగజేసికొనవలెనన్న, రెండు మార్గములు గలవు. భువర్లోకములో ముఖాముఖిని కలిసికొని భూలోకములోవలెనే సంభాషింపవచ్చును; లేక, ఏదో యొక రీతిని భూలోకములో ప్రత్యక్షమై ఏదో యొక విధముగ సంబంధము కల్పించుకొనవచ్చును.

మొదటి మార్గమెక్కువ సులభమైనది, సంతుష్టికరమైనది అయియున్నది; కాని దాని లోపమేమనగా సామాన్యమానవుడు భువర్లోకవిషయములను భూలోకమునకు తిరిగి వచ్చుసరికి నమ్మదగినట్లుగా జ్ఞాపకముంచుకొనలేడు. కనుక అతనికి సలహానిచ్చి ప్రబోధము చేయవలెనని చేయుప్రయత్నము లన్నియు పూర్తిగా ఫలింపనేరవు. ప్రతిమనిషి రాత్రులందు భువర్లోకములో స్నేహితులను కలియుచుండును; సంభాషణలు, సంప్రతింపులు సరిగా స్థూలమగు భూలోకములో పగటివేళయందు జరుగుచున్నట్లుగానే జరుగుచుండును; కాని, నిద్రనుండి మేలుకువగాంచిన తరువాత వానిని జ్ఞప్తికి తెచ్చుకొనలేడు. అయినను, అతని యోచనలు, క్రియలు, తరుచుగా రాత్రి నిద్రలోపొందిన సలహాలచే విశేషముగా ప్రేరేపింపబడును. పగలు వానిగురించి యేమియు అతనికి తెలియదు; ఆ యభిప్రాయములన్నియు సొంతముగ తనకే తోచెననిగూడ తలంచును. కనుక, కామలోకములోని భూతము భూలోకములోని మనిషి కేదైనచెప్పగోరిన యెడల తరుచు రెండవపద్ధతి నవలంబించి భూలోకమునందు కావలసిన ఫలితములను గలిగింపప్రయత్నించును. ఇది కూడ రెండు విధములుగా చేయవచ్చును. మొదటి పద్ధతి యేమన:—ఒక నిర్ణీతమగు సంకేతము ప్రకారము అర్థముచేసికొనదగినట్లుగా కొన్ని శబ్దములనుగాని చేష్టలనుగాని చేయుట,

లేదా, ఒకరు అక్షరములను వరుసగా చదువుచుండ కొన్ని అక్షరములను పలికినప్పుడు శబ్దముచేయుటగాని, బల్లను కదిలించుటగాని, లేదా, 'మోర్సు' తంతి విధానమును ఉభయులు నెఱింగిన యెడల దాని నుపయోగించుట, లేదా, ఒక విధమగు "ఔజా" (Ouija) బల్లమీద గడియారము ముల్లువంటి ముల్లును ఒక అక్షరమునుండి మరి యొక అక్షరమునకు కదుపుచుదానివలన ఒక సందేశము నిచ్చుట, వీనిలో దేని నైన నుపయోగింపవచ్చును.

రెండవ పద్ధతి మొదటి దానికంటె తక్కువమోటుగా, తక్కువ శ్రమకర ముగానుండునుగాని, దానిలో పాల్గొనువారికెక్కువ అపాయకరముకావచ్చును. ఈ పద్ధతిలో భువర్లోకభూతము భూలోకస్నేహితుని కొన్ని యంగములనుపయోగించుట జరుగును. అతని స్వరనాడులను స్వాధీనముచేసికొని అతనిచే మాట్లాడించవచ్చును; లేదా, భూలోకజీవి కేమియు తెలియకుండగనే అతని హస్తమునుబట్టుకొని దానిచే సందేశములను వ్రాయించుటగాని బొమ్మలను గీయించుటగాని చేయవచ్చును. మృతుడు సజీవుని ద్వారా మాట్లాడు నప్పుడు సజీవుడు సాధారణముగా సమాధ్య వస్థలో నున్నట్లుండును; కాని ఆ మనిషి పూర్తిగ స్పృహగలిగియుండి పుస్తకమును చదువుచున్నను, స్నేహితులతో మాట్లాడుచున్నను గూడ, అతని హస్తమును వ్రాయుటకును, బొమ్మలు గీయుటకును మృతుడు ఉపయోగింపవచ్చును.

అయితే, కామభూతములచేనట్లు ప్రతిమనిషియు నుపయోగింపబడ లేడు; అట్టి ప్రభావములకు ప్రత్యేకముగా అనుకూలురయినవారు మాత్రమే యుపయోగ పడగలరు. అట్టి వారిని ఇంగ్లీషు భాషలో "సైకిక్సు, మీడియమ్సు, లేక, సెన్సిటివ్సు' అనుపేర్లతో పిలుతురు. మనమిప్పుడు చర్చించుచున్నవిషయములో కడపటి పేరే అనుకూలించునేమో కాని, యెవడైనను పరలోకప్రభావముల కెంతలోనైయున్నను, అతడొక విస్పష్టముగా నేర్పడిన వ్యక్తిత్వమును గలిగియుండును; అందుచే దానిని పూర్తిగా నిరోధించుటకు సాధ్యముకాదు. ఉన్నతలోకముల ప్రభావములను గ్రహించెడు సూక్ష్మసంవిత్తిలో అనేక యంతరువులుగలవు. కొందరా శక్తిని పుట్టుకతోనే గలిగియుందురు, మరికొందరు యత్నముచేసి సంపాదించెదరు; రెండు తరగతులవారును దాని నభ్యాసముచే వృద్ధిచేసికొనవచ్చును. దానినే భూత ప్రద ర్శకులు "అభివృద్ధికొరకు కూర్చుండుట" (Sitting for development) అందురు. సహజముగా బహుసూక్ష్మసంవిత్తిగల వారిని సాధ్యమైనంత అభావముగా చేసికొని

ప్రతిదినము గంటలకొలది ఆతీసున కూర్చుండవలసినదని సలహానిచ్చెదరు. అట్లు చేయుటవలనవారు అంతకంతకెక్కువ సూక్ష్మమగుచుందురు. ప్రతిదినము కామలోక భూతమొకటివచ్చి వారిమీదపనిచేసిన యెడల వారిరువురకు పరిచయముకలుగును. అందుచే భావపరివర్తనము చాల సులభమగును.

ఈపద్ధతిలో ఒకస్థితియందు స్థూలశరీరము సమాధ్యవస్థలోవలె నుండును; అప్పుడు జీవాత్మ తన యుపాధులను నిగ్రహించలేక కామలోక భూతమునకు తాత్కాలికముగ నొప్పగించును. అయిననుజీవాత్మయొక్క లక్షణము దాని యుపాధులపై గాఢముగా ముద్రితమైయుండుటచే వాని నుపయోగించెడు ప్రేష్ఠ వేరైనదైనను, ఉపాధులు చాలవరకు మామూలుజాడలలోనే నడచును. సందేశము నిచ్చుచుండెడు కామభూతముయొక్క భావములు మిక్కిలి యుత్కృష్టములైనను, సందేశహరుడు విద్యావిహీనుడు లేక వ్యాకరణశూన్యముగను గ్రామ్యముగను మాటలాడువాడు అయినయెడల, ఆయుత్తమ భావములు భూలోకములో ప్రకటితమగుటలో విద్యావిహీనలక్షణములను స్పష్టముగా ప్రదర్శించును. జూలియస్‌సీజరు, షేక్స్పియరు, సెంటుజాన్ అపోస్తలుడు, ఇటువంటివారు భూతావేశప్రదర్శమునందు మాట్లాడుచుండగా వినినయెడల వారి గతజన్మలోకంటె ఏలనో చాల భ్రష్టులైపోయినట్లు కనిపించును; అందుచే ఆపూర్వకాలమునాటి మహాపురుషులు మాట్లాడుటలేదనియు, ఎవరో యొకతులువ మారుపేరుతో మాట్లాడుచున్నాడనియు, అదంతయు కేవలము బూటకమనియు మనము సహజముగా తీర్మానింతుము. నిస్సందేహముగా అది సరియైన తీర్మానమే కావచ్చును; కాని ఆసందేశము యథార్థమైనదైనప్పుడుకూడ నూటికి తొంబదితొమ్మిది సందర్భములలో అట్టి లోపములే యుండుట మనము తరుచు మఱచిపోవుదుము.

సందేశహరునిలో నుండెడు లోపములన్నిటిని సంపూర్ణముగా నిగ్రహింపబడు 'సమాధి — నిగ్రహము' అను అవస్థయొకటికలదు; కాని వాస్తవముగ సంపూర్ణముగా నిగ్రహించుట బహు అరుదు. అట్టిది సంభవమైనప్పుడు మృతుని యొక్క కంఠధ్వని, ఉచ్చారణ, మామూలు పదప్రయోగములు, దస్తూరీ అన్నియును నలుసంతైన భేదము లేకుండ ఆశ్చర్యమును గలుగచేయునంతటి సరియగు ప్రతిరూపములతో గోచరించవచ్చును. కాని అట్టి అసాధారణమగు సందర్భములలోగూడ ఆపేరుగల అసలు మనిషివచ్చి మాట్లాడుచున్నాడని నమ్ముటకు నిశ్చయమగు

హానిహా యేమియును లేదు. ఈ యున్నతలోకములలో భావపతనము, భావపరివర్తనము మొదలగునవన్నియు మిక్కిలి సులభమై యుండుటచే రహస్యమనిగాని, ప్రత్యేకమనిగాని చెప్పదగిన విషయమేమియు లేదు.

పాపము, ఆ మృతసందేశహారునకు ఇదంతయు నిజమగు అభివృద్ధిగాకపోవుటయేగాక మిక్కిలి ప్రమాదకరమైయుండును. ఈరీతిగ సూక్ష్మమైనకొలది, జీవాత్మకు తన యుపాధులపైన పట్టువదలిపోవుచుండును; భువర్లోకప్రభావములకు, మంచివి చెడ్డవి అను విచక్షణ యేమియు లేకుండ అన్నివిధములైన ప్రభావములకు, ఇతోధికముగా లోనగుచుండును. ఏదోయొకభూతము మార్గదర్శిగానుండి రక్షింపగలదని తరుచుగా చేసెడు వాగ్దానము నిరర్థకమగును. ఆభూతములయొక్క శక్తి అత్యల్పమై యుండుటయే దీనికి కారణము. తుదకాతని యవస్థ బంధితుడై, నిస్సహాయుడై, బాటప్రక్కనుపడిపోయి దారినిపోవువారి కరుణపై నాధారపడియుండు దీనుని యవస్థను బోలియుండును; మార్గమునబోవువాడు బంధములను విప్పివేసి యుపచారముచేయు ప్రాణదాతకావచ్చును, లేక దగ్గరనున్న సొత్తు నపహరించెడు ఆతతాయిగావచ్చును. బహుశః ప్రపంచములో ప్రాణదాతలకంటె ఆతతాయిలే ఎక్కువగానుండవచ్చును. నాకు గల విశేషానుభవమునుబట్టి అటువంటి మృతసందేశహారణ వ్యవహారములతో నాసోదరులెవ్వరును సంబంధముగలుగచేసికొనగూడదని నేను గట్టిగా హెచ్చరిక చేయుచున్నాను.

ఎవరి నుపయోగించి భౌతికచిత్రములను ప్రదర్శింపవచ్చునో వారికి, అనగా, స్థూలముగా ప్రత్యక్షమగుటకును వివిధములగు బలువైన వస్తువులను కదిలించుటకునుజీవకణములకు వెలుపలనుండు సూక్ష్మపదార్థమును (Ectoplasm) ఎవరినుండి లాగివేయుటకు సాధ్యమగునో వారికి, "మీడియమ్" అను పదమును వాడుట యుచితమని నా అభిప్రాయము.

మిక్కిలి భిన్నమగు అభివృద్ధి మరియొకటిగలదు. వాస్తవముగా దానిని 'ఆత్మ' వికాసమనవచ్చును. ఏలయన, గ్రీకు భాషలో "సైకి" (Psyche) అను శబ్దమునకు ఆత్మ అని యర్థము. శరీరమునకు వలెనే ఆత్మకుకూడ శక్తులుగలవు, మానవుని శక్తులు వేర్వేరు లోకములలో బహిర్గతమగుచున్నను, మానవునికిగల సమస్త శక్తులను ఆత్మశక్తులనిచెప్పుటయే సమంజసముగానుండును. ఏలయన,నిజముగా చూచునది వినునది, గీయునది, చిత్రించునది శరీరముకాదు; శరీరముద్వారా పనిచేయుచున్న

మానవుడే అన్ని క్రియలను చేయుచున్నాడు, ఒకనికి సిద్ధులు లభించినవని చెప్పిన యెడల, అతడు తనస్థూలశరీరమునేగాక మిగతా యుపాధులను గూడ నుపయోగించుట నేర్చుకొనెననియు, దానిఫలితములను జాగ్రదవస్థలో జ్ఞాపకముంచుకొన గలడనియు మాత్రమే తెలిసికొనవలెను.

ఇప్పుడు ఆఖరున చెప్పిన విషయమే, అనగా, జాగ్రదవస్థలో జ్ఞాపకముంచుకొనుట అను విషయమే, ఇంచుమించు అన్ని సందర్భములలోను చిక్కును గలిగించుచున్నది. సజీవుడు, శరీరము నిద్రించుచుండగా, భువర్లోకములో పనిచేయునప్పుడును, మృతుడు సహజముగా ఆలోకములో పనిచేయునప్పుడును భువర్లోకవిషయములను బాగుగా నెరుగగలరు. కాని మెలకువగలిగిన తరువాత వానిని సజీవుడు జ్ఞాపకముంచుకొనునని చెప్పుటకు వీలులేదు. కాబట్టి భువర్లోకానుభవములను బొందుటలో కష్టమేమియులేదు, వానిని స్థూలశరీరము యొక్క మెదడులో నిలుపుకొనగలుగుటలోనే కష్టమంతయుగలదు; చిరకాలము కృషిసలుపుటవలననే ఆశక్తిని సంపాదించగలరు. అట్టి శక్తులను గలిగియున్నవాడు నైతికముగను, ఆధ్యాత్మికముగను విశేషముగా పురోవృద్ధినిబొందియుండునని సాధారణముగ జనులనుకొందురు, కాని అది తప్పనిసరిగ నిజమైయుండనక్కరలేదు. నైతికముగా శీలమెట్లున్నను, ఎవరైననుగాని పట్టుదలతో చాల కాలము తగినంతకృషి సలిపిన యెడల ఆశక్తులను వికసింపజేసికొనవచ్చును. అయినను, ఆధ్యాత్మికముగా పురోవృద్ధినిబొంది, యొక విశిష్టమగు అంతరువునుచేరిన మనిషిలో సామాన్యముగా ఆశక్తులు సహజవికాసమును బొందుట సత్యము.

పరమగురువులకు శిష్యులయిన వారిలో సాధారణముగా ఆరీతిగనే ఈశక్తులు వ్యక్తమగును. ఈశక్తులవలన గొప్ప అపాయములు గూడ గలుగుట కవకాశమున్నను, మొత్తముమీద అవి యుపయోగకరములై అమూల్యములై యుండుట నిశ్చయము. కాని ఆశక్తులను గలిగినవారు వాని యుత్పత్తి, అవి పనిచేయువిధానము మొదలగు విషయములను సరిగ గ్రహించుటకు ప్రయత్నము జేయవలెను. సామాన్యమగు పురోవృద్ధియొక్క ఫలితముగా ఆశక్తులు ప్రాప్తించినను, ఏసామాన్యధర్మములకు లోబడి అవి పనిచేయునో ఆధర్మములకు లోబడ నక్కరలేకుండ స్వేచ్ఛగా నుండవచ్చునని యెవ్వరును తలంచకూడదు. పైలోకములలోని అనుభవములను జాగ్రదవస్థలో స్పష్టముగా జ్ఞప్తికలిగియుండవలెననిన, అనేక కష్టములుగలవు. భూత

ప్రదర్శన ప్రయోగములలో పాల్గొనెడు మృతసందేశహారునకును మనకును గూడ ఈకష్టములు సమానముగానే యుండును. కాని, చాలకాలమునుండి శ్రద్ధగా పరిశీలన చేయుచుండుటచేత మనము వారికంటె ఈకష్టములను బాగుగా గ్రహించి వానిని నిగ్రహించుటకు తగియుండవలెను.

ఇంతకును, మనకుగూడ దేహాత్మలున్న సంగతి మనము మరువకూడదు. మనము బలమైనట్టియు నిర్దిష్టమైనట్టియు శీలమును పెంపొందించుకొనుటకు ప్రయత్నించుచున్నాము గనుకనే మన దేహాత్మలు మన యిరుగుపొరుగువారి దేహాత్మలు కంటె ఎక్కువబలమైనవై యుండవచ్చును. మరియు అనేకసంవత్సరములనుండి మన జీవాత్మ దేహాత్మను వశపరచుకొనునట్లుగూడ మనము నిశ్చయముగ ప్రయత్నము చేయుచున్నాము. కాని మనము విశిష్టమగు లక్షణములుగలిగి సొంపైన వ్యక్తులమై యుండవచ్చునన్న సంగతియు మనద్వారా ఏమివచ్చినను సరిగా ఆలక్షణములవలననే మార్పుజెందుట కవకాశముగలదన్న సంగతియు ఎన్నటికి మారవు.

నేను చెప్పుచున్న విషయమును నేను స్వయముగ నెరిగిన ఒకటిరెండు ఉదాహరణములచే విశదముచేసెదను. మిక్కిలి ప్రశస్తమగు దివ్యదృష్టిగలిగి, గతము నంతను చక్కగా తెలిసికొనగలిగి, భూతకాలములో జరిగిన చరిత్రాత్మకమగు విషయములను నిర్దుష్టముగా సంపూర్ణమగు వివరములతో చెప్పగలిగిన యొకస్త్రీని నేనెరుగుదును.ఆమెకు క్రైస్తవమందు అపారమగుభక్తి కలదు; క్రైస్తవమతములోవలె మరియే యితరమతములోను సత్యము పరిపూర్ణముగా ప్రదర్శింపబడలేదని యామె తలంచుచుండెనని నా అభిప్రాయము. క్రైస్తవమతమందు ఆమెకు ప్రబలమగు పక్షపాతముగలదని చెప్పవచ్చును. దానివలన ఆమె దివ్యదృష్టికి యెట్టి అద్భుతమగు విచిత్రమగు ప్రవృత్తికలిగినదో చూడుము. ప్రాచీన రోమ్‌నగరములో జరిగిన యొక రంగమును వర్ణించుచున్నదని యనుకొనుడు: మతమునకు సంబంధించిన దేమియు రానంతవరకు ఆమె వర్ణన సరిగా నుండును; కాని ఆవృత్తాంతములోని పాత్రలలో నొకడు క్రైస్తవుడగుట సంభవించినయెడల వెంటనే అతనియందు విశేషమగు అభిమానమును జూపును. అతడేమిచేసినను ఏమిచెప్పినను తప్పుకాదు, అతనికి వ్యతిరేకముగ మరియొకరెవరైన నేమైన చేసినను, చెప్పినను ఆమె కదంతయు ఘోరమగు దుర్మార్గముగా కనిపించును. ఇట్టిది సంభవించినప్పుడు ఆమె దివ్యదృష్టి కేవలము నమ్మరానిది యగుచుండెను. సంగతులు వాస్తవముగ జరుగుచుండుట ఆమె చూచి

యుండవలెనని యనుకొనవచ్చును, కాని ఆమె చేసెడు వర్ణనలు, ఆమె వానికి చెప్పెడు వ్యాఖ్యానములు నిశ్చయముగ కేవల మసత్యములే.

అద్భుతమగు కవితాప్రతిభకలిగిన మరియొక స్త్రీని నేనెరుగుదును. మామూలు ప్రసంగములోగూడ ఆమె యేమిచెప్పినను మిక్కిలి అతిశయముగ చెప్పుట కలవాటు పడెను. బుద్ధిపూర్వకముగా అబద్ధము చెప్పవలెనని ఆమె యుద్దేశముకాదు; అసలు విషయమును అన్నివిధములచేతను ఎక్కువ రమ్యముగను ఘనముగను కనిపించునట్లు అలంకరించి మనోహరముగ జేయవలెననిమాత్రమే ఆమె యుద్దేశము. అట్టి మనో వైఖరి సర్వవిధముల నిశ్చయముగ సంతోషదాయకమైనదే కావచ్చును; కాని శాస్త్రజ్ఞునివలె పరిశోధనచేయుట కది కొంతవరకు హానికరమగును. సమకాలికమైన దైనను, చరిత్రాత్మకమైనదైనను, పరలోకములకుసంబంధించిన ఒక రంగమును జ్ఞప్తికి తెచ్చుకొని ఆమె వర్ణింపవలసివచ్చినయెడల ఆవిధమగు దోషమే కనిపించును. భూలోకములో జరిగిన ఒక సామాన్యమగు చిన్న సంస్కారమునకు మృతులయిన కొద్దిమంది బంధువులును కొద్దిమంది దేవతలును మాత్రము వచ్చియుండ, ఆమె దానిని వర్ణించుటలో మహాపరమపురుషులందరును, చరిత్ర ప్రసిద్ధులగు పురుషు లందరును హాజరైనట్లును, అసంఖ్యాకములగు దేవతాగణములువచ్చి ఆశీర్వదించి నట్లును ఒక బ్రహ్మాండమగు యోగదీక్షా సంస్కారమువలె చిత్రించును.

ఈచిన్న ఉదాహరణమువలన దివ్యదృష్టికొరకై ఆకాంక్షించుచున్న మనిషి యెంతజాగ్రతతో కనిపెట్టి చూచుకొనవలసియుండునో, తన చిన్ననాటి యభిప్రాయ ములలో నెంతభాగమును రద్దుచేసికొనవలెనో, తెలియగలదు. ఈస్థూలప్రపంచ ములో ఏవిధమగు క్రొత్తపనిముట్లులనైన నుపయోగించుటకెట్లు అలవాటుపడవలెనో, ఆరీతిగనే ఈ యున్నతలోకములలో క్రొత్తశక్తుల నుపయోగించుటలోగూడ పరిచి తులుకావలెనన్న విషయము నెన్నటికి మరువకూడదు. చిన్నబిడ్డకు నేత్రములుకలవు, కాని వాని నుపయోగించుట నేర్చుకొనవలెను; దగ్గరకు, దూరమునకు దృష్టిలోగల భేదమును ఆబిడ్డ క్రమేణా నేర్చుకొనవలెను. దురదృష్టవశమున అంధుడైనవాడు బ్రేయల్లీ విధానము ప్రకారము చదువుట నతిసులభముగను, అతివేగముగను నేర్చుకొనగలడు. కాని కండ్లున్నను మనమాప్రకారము చదువుట నేర్చుకొనుట యసాధ్యముగ గనిపించును; చాలకాలము విశేషముగా శ్రమపడకుండ ఆయక్షరము లలోని భేదములనయినను గ్రహింపలేము.

అదేప్రకారము, కామమయశరీరములోని శక్తులు క్రొత్తగ వికసించుచున్న మనిషికి అతడు చూచుచున్న దానిని వినుచున్నదానిని వర్ణించుట మొదట కేవల మసాధ్యముగనుండును; ప్రతివస్తువు చాల భిన్నముగా కనిపించును; అతడెన్నడు నూహించని యనేక దిక్కులలో అతనిదృష్టి పనిచేయుచున్నట్లగుపించును. కొన్ని సంవత్సరముల అనుభవము కలిగినతరువాతగాని అతడు యథార్థమును సరిగా గ్రహింపలేడు; అప్పుడుగాని అతనివర్ణన నమ్మదగినదిగానుండదు; అప్పుడయినను అతడు చూచుచున్నదానియొక్క ప్రతిబింబమును మాత్రమే స్థూలచైతన్యములోనికి తీసికొనిరాగలడు. ప్రతి భువర్లోకసంఘటనములోను భూలోకవుభాషలో వర్ణింప సాధ్యముకానట్టి యొకభాగము ఎల్లప్పుడును ఉండును; మానవుడు ఉన్నతలోకము లకు పోయినకొలది వర్ణింప నసాధ్యమగు ఈ అదనపు భాగములు లేక అంశములు ఇతోధికముగా కనిపించుచుండును. అందుచేత తన అనుభవములను లేశమాత్రమైనను సరిగావర్ణించుటకంత కంతకు శక్తిహీనుడగుచున్నట్లు భావించును; కొద్దిగ నేమైన చెప్పగలిగినను, అదికూడ అతని వ్యక్తిగతమగు స్వభావలక్షణములచే రంగు మారుట నిశ్చయము.

## ప ర మ పు రు షు ల సం దే శ ము లు

మనలో చాలమంది చాలకాలమునుండియు ప్రతిదినము మన పరమగురువుల గూర్చి ధ్యానముచేయుచున్నాము; వారియెడల మనకుగల గాఢమగుభక్తిశ్రద్ధలచే మనము వారికి సన్నిహితులమైతిమి; మనలో కొంతమందికి వారితో స్వయముగ సంబంధముగలిగియుండు భాగ్యము కలుగుటయు, అట్టి అదృష్టము కలుగని యితర సోదరులకు పరమగురువుల సందేశముల నందజేయుటకు అప్పుడప్పుడు నియమింప బడుటయుగూడగలదు. ఎవరికట్టిగౌరవము కలిగినను బహుజాగ్రతగా ఆసందేశమును యథాతథముగ నందజేయుటకు వారు సర్వవిధముల శ్రమపడి ప్రయత్నముచేయుదు రని నమ్మెదను; అట్టివిషయములలోగూడ సాధారణధర్మము వర్తించునని జ్ఞాపక ముంచుకొని తనకియ్యబడిన సందేశమునందజేయుటలో తనస్వంత యిష్టానిష్టములు గాని, పక్షపాతములుగాని దానికి రంగుపూయకుండ మిక్కిలి జాగ్రతగా మెలకువ గలిగియుండవలెను. సందేశముల నందజేయుటలో పొరబాట్లు జరుగుట అసాధ్య మనియు, సందేశమును నిర్దుష్టముగా అందజేయుటకు తగిన యేర్పాటును చేయు

బాధ్యత పరమగురువే వహించుననియు మీరు తలచవచ్చును. కాని, ఆపరమపురుషులుగూడ నొక విశ్వధర్మము ననుసరించి పనిచేయుచున్నారనియు, వారు మన సౌకర్యములకొరకై ఆధర్మసూత్రములను మార్పుచేయజాలరనియు, మీరు జ్ఞాపకముంచుకొనవలెను. నేను పైనచెప్పినట్లు మిక్కిలి ముఖ్యమగు నొకసందేశము నిచ్చుటలో వారు ప్రతిమాటను వరుసగా చెప్పవచ్చును, దానిని ఆసందేశహారుడు భూలోకములో అక్షరాక్షరముగ వ్రాసికొనవచ్చును. కాని అట్టి సందర్భములు బహు అరుదుగానుండును. పరమగురువు తమశిష్యులలో నొకనిద్వారా యొక సందేశమును పంపునప్పుడు సామాన్యముగ నేమి జరుగునో మాటలతో చెప్పగలిగినంతవరకు చెప్పుటకు ప్రయత్నించెదను.

పరమపురుషుడు మామూలుగ తన చైతన్యమును చాలనున్నతలోకములో— సాధారణముగా మనము నిర్వాణలోకమనెడు లోకములో — లగ్నముచేసికొని యుండునని మొట్టమొదట జ్ఞాపకముంచుకొనవలెను. అయితే, యేలోకములో పని చేయవలెనన్న ఆలోకమునకు వారు దానినొక క్షణములో తీసికొని రాగలరు; గాని కారణశరీరముకంటె క్రిందకు రావలెననిన విశేషముగా పరిచ్ఛిన్నత బొందవలసి యుండును; బహుఅరుదుగాగాని అట్లు చేయవలసిన అవసరముండదు. శిష్యుడు స్థూలశరీరమును విడిచినప్పుడు తన పరిణామ వికాసము ననుసరించి వేర్వేరు అంతరువులయందు పనిచేయగలడు. అధమము కారణశరీరమునైన నుపయోగింప గలిగినవారికే సందేశహారణకార్య మొప్పగింపబడును. కాబట్టి యుత్తరప్రత్యుత్తరములన్నియు సామాన్యముగ నుత్తమ మానసికలోకము (మహర్లోకము) లోనే జరుగును. ఈ భావ పరివర్తనమును గ్రహింపగలుగుటకు, ఆలోకమునందు భావప్రసరణ మెట్లు జరుగునో తెలిసికొనవలసియున్నది.

ఈభూలోకములో మనభావము, (సంకల్పము, యోచన, తలంపు) ను గాని రాగమునుగాని మాటలలో ప్రకటింపవచ్చును; ఉన్నతలోక జీవితములో అట్టి మాటల నుపయోగించరనియు, రాగములు, భావములు భువర్లోకములోను సువర్లోకములోను నిర్దిష్టమగు రూపములనుదాల్చి తేలిపోవుచుండుననియు మన మెరుగుదుము. సాధారణముగ ప్రతిభావమునకు ప్రతిరాగమునకు ప్రత్యేకమగు నొక రూపముండును; కాని అవన్నియు కలిసిపోయినప్పుడు ఆరూపములలో రంగులు చిత్రముగా మిళితమైయుండుట చూచుచుందుము. జీవాత్మ తనకారణ శరీరములో

పనిచేసెడు ఉత్తమమానసిక (మహర్లోకము) లోకభాగమునకు పోయినట్లూహించి అచట జీవాత్మయొక్క భావము లెట్లు ప్రదర్శితములగునో చూచెదము. అచట జరిగెడు దానిని వర్ణించుటకు భావనిరర్థకముకాని ముఖ్యమగు భేదమేమన, జీవాత్మ మాటలనుగాని వాక్యములనుగాని యుపయోగించదు; విషయములను భావపరం పరలుగా నయినను తెలియచేయదు. ఏవిషయమైనను మనము మామూలుగ యోచనచేయునట్లు జీవాత్మయోచనచేయదు. ఒక విషయము గూర్చి మనమిచట చేయునట్లు తర్కించి వాదించుటయు, తరువాత నొక పర్యవసానమునకు వచ్చుటయు అచట జరుగదు. అతనికొక విషయము కావలసినపుడు దానివైపు జూచును, చూచిన వెంటనే దానిని గురించి సమస్తమును గ్రహించును. అతడు మరియొకరికి యొక భాగమును పంపదలచిన యెడల అతనివైపు ఒక బంతిని విసరినట్లగును. చిత్రమగు రీతిని ఆబంతిలో భావములు, పర్యవసానములు, అన్నియు నేకమైయుండును. మరియు ఒక్కభావమును మాత్రమే ప్రసరింపజేయుట ఎన్నడును జరుగదు. సిద్ధపురుషుని భావము శిష్యునిపై మనోహరమగు చిన్నగోళములను వడగండ్లవానవలె వర్షింప చేయును. ప్రతిగోళము ఒక భావమైయుండి, యితర గోళములతో దానికిగల సం బంధము బహుస్పష్టముగా నిర్ణయించబడియుండును. శిష్యుడు గనుక దాని నంతను జ్ఞాపకముంచుకొనగలిగిన భాగ్యముగలిగి, అట్టిభావగోళవర్షమును భూలోకభాష లోని కనువదింపగల ప్రజ్ఞావంతుడైన యెడల, ఒకక్షణమాత్రము ముంచివేసిన ఆవర్షమును ఇరువది పుటలపై వర్ణింపవలసియుండునని తెలిసికొనును; అప్పటికయి నను ఆవర్ణన అసంపూర్ణముగా నుండుట నిశ్చయము.

మరియు, పరమగురువు శిష్యునకు భావములేగాని మాటలేమియు నిచ్చుట లేదని ఇచట గుర్తించవలసియున్నది. కాబట్టి అతడు తప్పనిసరిగ ఆభావములను తనభాషలో చెప్పవలసియుండును. అతడు వాని నన్నిటిని సరిగా గ్రహించి అర్థము చేసికొనగల అదృష్టవంతుడైన యెడల తాను తెలియచేయు భావములు పరమ గురువు భావములేయైయుండును. కాని వానికిచ్చెడు రూపము కేవలము అతనిదై యుండును. కనుక దానిలో అతని సహజలక్షణములు నిశ్చయముగ కనబడితీరును. సందేశమును చదివెడువారు సందేశహర్తనుద్దేశించి "కాని, నిశ్చయముగ శైలి ఫలానా ... ... గారిదే" అని చెప్పుదురు. వారు చెప్పునది సత్యమే. కాని, ఆకార

ణముచేత సందేశము యొక్క సారమునుగాని ప్రాముఖ్యతనుగాని నిర్లక్ష్యముతో జూచుట గొప్పపొరబాటు.

చాలకాలము క్రిందట, మేడమ్ బ్లవట్స్కీగారు పరమపురుషులవద్దనుండి 1888 వ సంవత్సరం ఆప్రాంతమందు తరుచుగావచ్చుచుండిన జాబుల గురించి యిట్లు వ్రాసిరి. "పరమగురువుల తరఫున వారి పేరను జాబులుపంపబడినను, నూటికి ఒక్కటియైనను వారి దస్తూరీని వ్రాయబడియుండదు, జాబులను వ్రాయుటకు వారికి తీరికగాని, అవసరముగానియుండదు. పరమగురువు "నేను జాబును వ్రాసితి"నని చెప్పినప్పుడు మాటలన్నియు వారిచే చెప్పబడి ప్రత్యక్షముగా వారిపర్యవేక్షణ క్రిందట ముద్రితములైనవనియే అర్థము. సాధారణముగ, దగ్గరనున్నను, దూరమున నున్నను వారి శిష్యునిచే వ్రాయించుటగాని ప్రెసిపిటేట్ చేయించుట (Precipitate) గాని జరిగింతురు. అట్లు చేయుటకు ముందు వారు చెప్పదలచిన భావములను అతని మనస్సులో ముద్రించెదరు, తరువాత అవసరమైన యెడల ప్రెసిపిటేషనుకు అవసర మగు చిత్రముద్రణ విధానములో సహాయముచేయుదురు. భావము లెంత నిర్దుష్ట ముగా పరివర్తనముచేయబడునది, లేఖనవిధాన మెంత బాగుగా అనుకరింపబడునది కేవలము శిష్యుని వికాసముపై పూర్తిగా నాధారపడియుండును.*

పరమగురువు తరఫున సందేశముల నిచ్చుటకు చాలకాలమలవాటుపడిన శిష్యుడు భాషాంతరీకరణమును బహుసులభముగను, పరిశుద్ధముగను చేయగలుగును. ఎందుచేతననగా, చిరకాల మభ్యాసముగలిగియుండుటచే, తన స్వంత సహజలక్షణ ములను చొరనీయకుండ చాలవరకు అణచివేయగలుగును. అయినను, మామూలుగా వాడుకచేయుపదప్రయోగములు అతనికి శ్రేష్ఠమైనవిగా తోచును గనుక, భాషాంతరీ కరణములో గూడ అవి సంభవింపవచ్చును. కాని అపారమగు వికాసము, అను భవముగల మన అధ్యక్షులు (డాక్టరు బిసెంటు) వంటివారు ఒక సందేశము నిచ్చి నచో దానిభావము సరిగానున్నదనియు, దాని భాష ఈలోకములో చెప్పసాధ్యమై నంతవరకు శ్రేష్ఠతమమైనదనియు నిశ్చయముగ నమ్మవచ్చును.

---

* Lucifer - Volume III Page 93,

## (The Personal Equation)

## వ్యక్తిగతమగు స్వంతలక్షణముల ఫలితము

ఉన్నతమగు ఆయంతరువును చేరని మనబోటివారలకు స్వకీయమగు లక్షణములు నిశ్చయముగ వ్యక్తము కాగలవు. అవి సందేశముయొక్క శైలిలోనేగాక (శైలి అంతవిశేషముగా ముఖ్యముకాదు గనుక సులభముగా కొంతవరకు దాని నుపేక్ష చేయవచ్చును), భావములలోగూడ గానవచ్చుచుండును. ఇది యెందులకు, ఏలాగు ఇట్లు సంభవించుచున్నదో గ్రహించుటకు, ఈసందేశములను తెచ్చు మనుష్యునియొక్క తత్త్వమును ఆత్మవికాసమును మనముకొంతవరకు యోచన చేయవలసియున్నది. Man Visible and Invisible—దృశ్యాదృశ్యమానవుడు—అను గ్రంథములో వేర్వేరుదశల యందు కామమయశరీరములు, మానసికశరీరములు ఎట్లుండునో చూపించుటకు అనేక చిత్రపటముల నిచ్చితిని. చదువరు లాపటములను చూచుకొనవచ్చును. ఆచిత్రపటములు ఆశరీరముల బాహ్యాకారములను మాత్రమే తెలియచేయును; అనగా, మానవునిచుట్టును భువర్లోక మానసికలోకద్రవ్యములతో ఏశరీర మెంతవరకు సంబంధముగలిగియుండి, నిరంతరము చలనముగలిగి చురుకుగనుండునో, అంతవరకు మాత్రమే తెలియజేయును. భువర్లోక మానసికలోకద్రవ్యములతోగూడిన యీ అండాకారముగల శరీరములయొక్క ఉపరిభాగములుమాత్రమే జీవచైతన్యముగలిగి యుండుననియు, సామాన్య మానవునివిషయములో ఆ ఉపరిభాగము ఒక పొరవలె పలుచగా నుండుననియు జ్ఞాపకముంచుకొనవలెను. చాలవరకు లోపలిభాగమంతయు చైతన్యములేక బరువుగానుండును; ఆ బరువైనభాగము ఉపాధియొక్క బాహ్యక్రియలలో నేమియు పాల్గొనదు. వానివలన నిజముగ నేమియు చలింపదు. కాని లోపలనున్న చైతన్యరహితమగు బరువగు ఈ జడపదార్థమంతయు చైతన్యముగల ఉపరిభాగముచే చలింపబడకపోయినను, అదిమాత్రము చైతన్యముగల ఉపరిపైభాగముపై కొన్నివిధములుగా పనిచేయగలదు.

దేహాత్మ, జీవాత్మలోని యొక చిన్న అంశమనియు, మానసిక, కామమయ, స్థూలశరీరములద్వారా పని చేయుచుండుననియు చెప్పితిమి. ఈపని యేవిధముగ జరుగునో సంపూర్ణమగు వివరములనన్నిటిని యిచ్చుచు ఈగ్రంథముయొక్క యెనిమిదవ అధ్యాయములోను, Inner Life అంతరంగిక జీవితము— అను గ్రంథములో సప్త

జీవులు (Lost Souls) అను శీర్షిక క్రింద పదవఅధ్యాయములోను, "యోగమార్గ ప్రసంగములు" (Talks on the Path of Occultism) 257, 261 పుటలలోను చెప్పి యుంటిని. ఇప్పటివరకు జీవాత్మ సంపూర్ణమగు చురుకుతనము గలిగియుండలేదనియు, అనేకమంది జనులవిషయములో దానిలో చాలభాగము (భాగమనిచెప్పుట పైకిఅసంబద్ధముగా గనిపించునుగాని వాస్తవమై యున్నది) పనిచేయుట లేదనియు, ఆ గ్రంథములలో విశదపరచియుంటిని. జీవాత్మను మేల్కొల్పునది తురీయాత్మ లేక ప్రజ్ఞానాంశువు Monad. కాని మనలో జీవాత్మ అసంపూర్ణముగామాత్రమే మేల్కొని యున్నది. అదేవిధముగా దేహాత్మను జీవాత్మ మేల్కొల్పును, కాని అట్లు మేల్కొల్పుటగూడ పరిపూర్ణముగా జరిగియుండలేదు. ఈకారణముచేత కొన్ని పరిస్థితులేర్పడును. వానిని బహుజాగ్రతగా గమనించుట అవసరము. ఏదైన నొక ఉత్కృష్టమగు సమయమందు జీవాత్మనుండి యొకగొప్పశక్తి దేహాత్మలోనికి తీవ్రముగా ప్రవహించి దాని స్థితిని తాత్కాలికముగా నుద్ధరింపవచ్చును; అట్లుగాక, వాని భువర్లోక మానసికలోకశరీరములలో నుపయోగపడకుండ మిగిలిపోయిన ద్రవ్యమువలన నిలుకడగా కలిగెడు యొత్తిడి తాత్కాలికముగా దేహాత్మ యొక్క స్థితిని చాల క్రిందికిదింపివేయవచ్చును.

ఉద్దీపితముకాని యీ జడపదార్థమునకుగూడ ఒకవిధమగు జీవము, స్వీయ వాసనలుగలవు. దేహాత్మలోని ఉద్దీపితమైన భాగము పనిచేయనప్పుడు అది తల యెత్తును. ముఖ్యముగా మానవుడు ఆశరీరములను చులుకుగా నుపయోగించనప్పుడు ఇది సంభవించును. మనుష్యులనుబట్టి ఈలక్షణములుగూడ భేదించుచుండును. కాని, గాఢమగు నహంకారము దాదాపుగా నెల్లప్పుడును ప్రముఖముగానుండును. సోమరిగానున్న ఈజడపదార్థమువలన ప్రభవించుసంకల్పములు, వాసనలు తరుచుగా అహంకారముతోను, స్వోత్కర్షముతోను, ఏదైన అపాయము రానున్నప్పుడుగాని వచ్చునని ఊహించినప్పుడుగాని స్వరక్షణార్థమై ప్రయత్నించెడు సహజస్వభావముతోను సంబంధించియుండును. పరిపూర్ణవికాసమునొందిన మానవునిలో (దృశ్యాదృశ్యమానవుడు, 21 వ చిత్రమును జూడుము) మెఱయుచు ప్రకాశించు వైభవములు సామాన్యముగ అందరిజనులలోను ప్రకాశించవలెనన్న చాలకాలము గడచిపోవలసియుండును. ఈలోపున, బరువైన అంతర్భాగమునకు క్రమేణా వెలుతురు సోకుచుండ, అది వెచ్చబడి, కరగిపోయి, ప్రకాశవంతముగా స్పందించుచు నెమ్మ

దిగా విశ్వాసము బొందుచుండును. దేహాత్మయొక్క అతిసూక్ష్మమగు నిరంకుశత్వము నుండి తప్పించుకొనుట బహుమెల్లగా జరుగవలసిన పనియైయున్నది. మానవుడు తన స్వభావమునంతను పూర్తిగా వశముచేసుకొన్నకొలది క్రమేణా ఆనిరంకుశత్వము హరించిపోవును; కాని యీలోపున దేహాత్మను దివ్యమైనదానిగా శ్లాఘించెడు సందేశములుగాని, మానవులందరిలోను తానేదో మహదుత్కృష్టమైన విషయమును గ్రహించి ప్రపంచమునంతను తారు మారుచేయుట కెంచబడెనని సూచనచేయు సందేశములుగాని యేమైనను అందినయెడల వెంటనే నమ్మక, వానిని బహు తీవ్రముగా శంకించుటయే బుద్ధిమంతుని లక్షణము.

రహస్యముగా జరిగెడు అనేక భూతప్రదర్శనములలో సందేశము నిచ్చెడు భూతము పైవిధమగు విశేషమేదో జరుగునని వాగ్దానముచేయుట పరిపాటియైనది. కాని, అంతమాత్రమున ఆభూతము బుద్ధిపూర్వకముగా మోసముచేయ నెంచినదని మన మూహించరాదు. భువర్లోకజీవితములో నేవో కొన్ని గొప్పవిషయములు అతనికి మహత్తరముగా గనిపించుటచే వానివలన ప్రబలముగా ఆవేశింపబడినవాడై ఆవిషయములను తగురీతిని ప్రపంచమునకు ప్రదర్శించినయెడల ప్రపంచవైఖరియావత్తు పూర్తిగా మారిపోవునని యూహించును; కాని యీవిషయములే అనేకసార్లు ప్రపంచములో ప్రచారముచేయబడినవనియు, తాను జీవించియుండగా వానినెన్నడును ఇసుమంతైన గమనించియుండలేదనియు మాత్రము మరచిపోవును. పూర్వము డైవ్సు అను నతడు అబ్రహామునకు చెప్పినమాటలు ఈసందర్భములో జ్ఞప్తికి రాగలవు: "మృతులలోనుండి యొకరులేచి ప్రజలయొద్దకుపోయినచో, వారుపశ్చాత్తాపము నొందెదరు," అని డైవ్సు పలికెను; అందుకు "మోసెసు, ప్రవక్తలుచెప్పిన దానిని వారు వినిపించుకొననిచో, మృతులలోనుండి యొకరుద్భవించి ప్రబోధముచేసినను ప్రయోజనములేదు," అని అబ్రహాము జవాబు చెప్పెను. ఆజవాబులోని సత్యము అబ్రహాముయొక్క కుశలతను తెలియచేయగలదు. సామాన్యమగు ప్రపంచజ్ఞానముగల మనిషికూడ అసామాన్యమగు ఆత్మవంచనకు లోనగుటకు నిశ్చయమగు కారణము, అవ్యక్తముగానున్న ఈదేహాత్మ నిరంతరము కృత్రిమముగా పైకి తెలియకుండ గలిగించెడు యొత్తిడియే అయియున్నది. అందుచేతనే, నిరసనమేమియు లేకుండ ఎట్టి స్తోత్రముననైన గోరుచుండును, లేనిచో, ఆస్తోత్రము హాస్యాస్పదముగానున్నదని వెంటనే తెలిసికొనగలుగును.

ఆశ్చర్యకరము, అవికసితమునగు ఈ అవ్యక్తమగు చైతన్యమునే యమ్. కొ. చాల సార్థకముగ పురికొల్పుచుండెను. దానిలో ఒక చిత్రమగు విషయ మేమనగా, దేహాత్మలోని ఉద్దీపితమైన భాగము ఇచ్ఛాశక్తిచే పైనచెప్పిన అవికసితమగు అంతర్భాగముపైన ముద్రించుటకు చేసెడు ప్రయత్నమును అది యెల్లప్పుడును నిరసించుచుండును. సోమరియు, దురభిమానియునగుటచేత, మార్పున కెల్లప్పుడును విముఖత గలదై యుండును; దానిని మేల్కొల్పి పనిచేయించుటకు చేయు ప్రయత్నము నెదిరించును. ఇచ్ఛాశక్తినుపయోగించినయెడల నిరోధము గలుగును గనుక దాని నుపయోగింపవద్దనియు, అవ్యక్తముగానున్న ఆత్మ జీర్ణముచేసికొనువరకు ఒక సూచనను లేక ఒక భావమును నెమ్మదిగా పునశ్చరణముచేయుచుండవలసినదనియు యమ్. కొ. తన రోగులకు సలహానిచ్చుచుండెను. ఒకని మనస్సులో దేనినైన ముద్రితముచేయవలెననిన అతని శరీరము నిద్రించుచున్నప్పు డాపనినిచేయుట యొక పద్ధతియని మనము జ్ఞాపకముంచుకొనవలెను; స్వీయప్రేరణము – **Autosuggestion** – కూడ సాధ్యమైనంతవరకు ఆవిధముగనే చేయవలసియుండును; " ప్రతిదినము సర్వవిధముల నేను అంతకంతకు వృద్ధిబొందుచున్నాను" అనుకొనుచు నిద్రపోవలెనని రోగినిశాసించి వానిచే ప్రమాణముచేయించెదరు. నిరంతర మొక భావమును పునశ్చరణము చేయుటలో ఎంతైన మహిమగలదు. ఏలయన, ఈ భావము అవ్యక్తముగానున్న ఆత్మయొక్క అణచిపెట్టరాని అహంకారమున కనుకూలముగానుండును గనుక దానిని (అవ్యక్తముగానున్న ఆత్మను) శీఘ్రముగానే సంపూర్ణముగా నావహించును; అప్పుడా ఆత్మ ఆభావమును నిర్దిష్టమగు ఫలితములు కలుగువరకు, ఉద్దీపితమై చురుకుగానున్న ఆత్మోపరిభాగముపై నిలుకడగా ప్రసరింపజేయుచుండును. కావున అజ్ఞానులకు మిక్కిలి అపాయకరమై దౌర్బల్యకారణము కాగల అవికసితమగు ఆపదార్థము జ్ఞానుల కూర్ధ్వగమనములో సహాయకారియగు సాధనము కావచ్చును.

దీనివలన, అజ్ఞాన మెల్లప్పుడును ప్రమాదకరమనియు, శాస్త్రజ్ఞానలేమిచే కలిగెడు చెడుఫలితములను ఉత్తమోద్దేశములుసహితము పరిహరించనేరవనియు, నీతిని నేర్చుకొనవలసియున్నది. ప్రకృతి యొక్క నిగూఢమగు ధర్మములనన్నిటిని బాగుగా తెలిసికొన్నవాడు ప్రమాదములనన్నిటిని తప్పించుకొనగలడు. అట్టి జ్ఞానములేనివాని నేదైన కొంటెభూతముగాని, కుట్రచేయుభూతముగాని సులభముగా తప్పుమార్గమునకు తీసికొనిపోవచ్చును. జ్ఞానియైనను తనకు తెలిసెనని నిర్లక్ష్యముగా నుండరాదు;

ఎడతెగని శ్రద్ధయే యాథార్థ్యతకు చెల్లింపవలసిన మూల్యము. దీనినిగురించి విశేష ముగా సలహా నిచ్చియుండిరి; దానిని మనము శ్రద్ధతో గమనించవలసియున్నది. స్వాభిమానమును, గర్వమును పూర్తిగా విసర్జింపవలెను; స్వోత్కర్ష ము నెల్లప్పు డును తీవ్రమగు అపనమ్మకముతో చూడవలెను. ఏలయన, "అత్యాశయే ప్రథమ దుఃఖ కారణము," "తనను మానవులదృష్టిలో శూన్యముగాకనుపించున ట్లేశక్తిచేయ గలదో, ఆశక్తినే శిష్యు డాశింపవలెను." "నీకు జ్ఞానము ప్రాప్తించవలెననిన, వినయ ముగా నుండుము; నీకు జ్ఞానము ప్రాప్తించినతరువాత వెనుకటికంటె నెక్కువ విన యముగా నుండుము." తనను దాను సంపూర్ణముగ మరచిపోయి పరులసేవకై జీవిత మును సమర్పించువాడు అనేక అపాయములనుండి రక్షింపబడును; అతనిహృదయము స్ఫటికమువలె నిష్కళంకమై పరిశుద్ధముగా నుండును; దానిగుండా ఈశ్వరునివెలుగు నిర్మలముగ ప్రకాశించును; అతని స్వభావము యావత్తు పరమగురువుయొక్క స్పంద ములకు అనుకూలముగ ప్రతిస్పందించుచుండును; అందుచే ఉన్నతలోకములనుండి వచ్చెడు భావములుగాని, సందేశములుగాని అతనిలో నెట్టివైకల్యమును బొంద కుండ, స్థూలద్రవ్యముయొక్క స్పర్శచే నేవిధముగను మలినము నొందకుండ, స్వచ్ఛ ముగా ప్రవహించును. మన పరమగురువులను సేవించుటకును, వారు ప్రేమించెడు మానవజాతిని సేవించుటకును అదియే యుత్తమమైన మార్గము.

## యోచనను పరీక్షించుకొనుట

ఏ విషయముగురించియైనను తన యోచనను పరమగురువుయోచనతో బోల్చి చూచుకొనగలుగుట స్వీకృతశిష్యుడు అనుభవించు మరియొక అమూల్యమగుహక్కు. ఈశక్తిని తరుచుగా నుపయోగించుచుండుటవలన శిష్యునియోచన దివ్యము, ఉదార మునగు మార్గముల ననుసరించుననియు, పొరపాట్లుగాని పక్షపాతలక్షణములుగాని ఇతరుల నర్థముచేసికొనలేకపోవుటగాని సంభవించినయెడల వెంటనే సవరించుకొన గలుగుననియు, సులభముగా తెలియగలదు. అత డీశక్తిని అనేకవిధములుగా నుపయో గింపవచ్చును; నామట్టుకునేను ఎల్లప్పుడును అనుసరించినపద్ధతి యేమనగా, ధ్యానము చేయుచు పరుండి, సాధ్యమైనంతవరకు పరమగురువు చైతన్యములోనికి చేరుటకు ప్రయత్నించుచుండెడువాడను. అప్పటికి నేను చేరగలిగిన అత్యున్నతమగు తలము నుండి యొక్కసారి అకస్మాత్తుగ వెనుకకుదిరిగి విషయమునంతను సమీక్షణముచేయగా పరమగురువున కావిషయ మెట్లు గనబడెనో ఆభావము నాకు తట్టుచుండెను. నాకు

లట్టినది పరిపూర్ణముగా సరియైనభావము కాకపోవచ్చును, కాని వారిభావనలో నేను ప్రవేశింపగలిగినంతవరకు వారిభావన యెట్లుండెనో నాకుకనబడుచుండెను.

ఈ యద్భుతమగు హక్కును దుర్వినియోగము చేయకుండ చాల జాగ్రత్తగా నుండవలెను. బహుక్లిష్టమగు సమస్యలు వచ్చునప్పుడును, మనము స్వతంత్రముగా తీర్మానమునకు వచ్చుటకు తగినంత ఆధారము లేకపోయినప్పటికి తీర్మానింపవలసిన అగత్యము కలిగినప్పుడును మాత్రమే మనమాశక్తి నుపయోగింపవలెను. మనము చేయవలసినయోచన చేయకుండ తప్పించుకొనరాదు, దైనందినజీవితములో సామాన్యముగా కలుగునట్టియు యెవరికివారు పరిష్కరించుకొనవలసినట్టియు స్వల్పవిషయములనుగూర్చి ఆశక్తి నెన్నడును వినియోగపరచరాదు.

అంతరంగికశాఖలోని సభ్యులు చేయునట్లుగా, ఒక పరమగురువునిగూర్చి యెవ్వరైన చాలకాలము ధ్యానముచేసి యొకబలమగు సంకల్పరూపమును నిర్మించుకొన్నయెడల కొలదికాలములోనే ఆపరమగురువా రూపమునకు ప్రాణముపోసి బలపరచినట్లు అతడు తెలిసికొనును; అందుచేత ఆరూపముద్వారా అతడాధ్యాత్మికశక్తి ప్రసారమును బొందుచుండును. ఇట్లుజరుగుట సమంజసమే; నిజముగా ధ్యానముయొక్క ఉద్దేశముకూడ నిదియే; దానిద్వారా శిష్యుడు తనులోనైయున్న ప్రభావమును యెల్లప్పుడును గుర్తింపగలుగునంత బాగుగా తెలిసికొనును. ఏదో యొక దుష్టభూతము పరమగురువువలె నటించి శిష్యుని మోసముచేసిన సందర్భములుగూడ కొన్నిగలవు, కాని అవి బహు అరుదుగానుండుట మన అదృష్టము. శిష్యునిలో నేదో సూక్ష్మముగా నొకదోషము – గర్వమో, అత్యాశయో, అసూయయో, స్వార్థపరత్వమో — ఉన్నప్పుడే అట్టిమోసముజరుగుటకు సాధ్యమగును; దుష్టభూత మాదోషమును పురికొల్పి, వృద్ధిజేసి తుదకాధ్యాత్మిక పురోవృద్ధి కది పూర్తిగా వినాశకరమగు ప్రతిబంధకమగునట్లు జేయును. అట్టిగుణములను కఠినముగా, సంపూర్ణముగా, సమూలముగా నాశముచేయనియెడల ముముక్షువు ఎప్పుడైన మోసము చేయబడుట కవకాశముండవచ్చును. అతడు వాస్తవముగ సవినయుడై, స్వార్థరహితుడైయున్నయెడల నెన్నడును భయపడనవసరములేదు.

స్వీకారమునకై ఆశించు అభ్యర్థి తప్పనిసరిగ బహుశ్రద్ధగా తనను తాను కనిపెట్టి చూచుకొనుచుండవలయును. తన పరమగురువువద్దనుండిగాని యొక పాత శిష్యునియొద్దనుండిగాని తానుపోగొట్టుకొనవలసిన ప్రత్యేకలోపములనుగురించి నిర్ది

ష్టమగు సూచన యేమియు రాకపోయినయెడల తనకుతానే పరిశీలించి తెలిసికొనుటకు తన శక్తికొలది ప్రయత్నించవలెను; ఒకసారి ఆలోపములను తెలిసికొన్నయెడల, వానిని నిర్మూలించుటకు ఎడతెగని శ్రద్ధను బూనియుండవలెను. అయితే, యీఆత్మ విమర్శనమును అమితముగాజేసి ఎన్నడును మనోవ్యధను గలిగించుకొనగూడదు. పరులకు సహాయముచేయుటయందు ఏకాగ్రతగలిగియుండుటయే అతనికి శ్రేష్టతమమగు మార్గము; ఎల్లప్పుడును మనస్సును ఆయోచనతోనే నింపియుంచినయెడల, సహజావబోధచేతనే అతడు సరియైన మార్గమును త్రొక్కగలడు. ఆకార్యమునకు సంపూర్ణముగా తగియుండవలెనని ఆకాంక్షయున్నయెడల మార్గమందలి ఆటంకములన్నిటిని త్రోసివేయుట కదియే ప్రోత్సాహించును; కనుక, తనపురోవృద్ధిని గూర్చి యేమియు నుద్దేశింపకపోయినను అభివృద్ధి కలుగుచున్నట్లు స్పష్టముగా కనిపించుచుండును.

## విశ్రాంతి

శిష్యుడు నిరంతరము పరమగురువుగూర్చి తప్ప మరియేయితరవిషయమై యోచనచేయగూడదని యెన్నడును తలంచరాదు; కాని, పరమగురువు రూపమెల్లప్పుడును మనస్సులో అందుబాటుగా నుండవలెను. జీవితములోని కష్టసుఖములలో అవసరమైనప్పుడెల్ల అదివెలుగును జూపించుచుండవలెను. మనస్సులు ధనస్సుయొక్క నారివలె నెల్లప్పుడును బిగువుగా నుండనేరవు. కొంతవిశ్రాంతి, ఆలోచనలోమార్పు మానసిక ఆరోగ్యమునకు ముఖ్యావసరము. కాని శిష్యుడు కడుజాగ్రతతీసికొనవలసిన విషయమేమనగా, తన విశ్రాంతిలో లేశమైన అపరిశుద్ధతగాని, నిర్దయగాని యుండరాదు. తన పరమగురువుజూచినయెడలతాను సిగ్గుపడవలసిన సంకల్పము నొకక్షణమాత్రమైన తన మదిలోనికి రానియ్యరాదు.

కాలహరణమునకై యేదైన నొక మంచి నవలను చదువుటలో నపాయమేమియులేదు; దానిని చదువుటవలన కలిగెడు సంకల్పరూపములు పరమగురువుయొక్క సంకల్పప్రవాహమున కేవిధముగాను అడ్డు రానేరవు. కాని దుష్టభావముతోనిండి అపరిశుద్ధమగు సంకల్పరూపములను మనస్సున నిలుపునట్టియు, నేరమును మహాత్కార్యములుగా ప్రదర్శించునట్టియు, పాఠకుల మనస్సులను సంసారములోని అసహ్యామగు సమస్యలపై నేకాగ్రతచేయునట్టియు, ద్వేషమును క్రౌర్యమును ప్రదర్శించెడు రంగములను వివరముగా వర్ణించునట్టియు, నవలలుకూడ చాల గలవు; వాని నన్ని

టిని తప్పనిసరిగ విసర్జించవలెను. అదేవిధముగ సరసముగా నాడబడు మామూలు ఆటలలో పాల్గొనుటలోగాని, వానిని జూచుటలోగాని అపాయమేమియును లేదు; కాని మోటుఅయినట్టియు, గగ్గోలుగా నుండునట్టియు, మనిషికిగాని పశువునకు గాని యేవిధముగానైనను హానికలుగుట కవకాశమున్నట్టియు, క్రూరత్వముతో గూడియున్నట్టియు సమస్తవిధములగు ఆటలు పూర్తిగా నిషేధింపబడినవి.

## నెమ్మది, సమత్వము

శిష్యుడు చేయవలసిన యావత్కార్యములలోను నెమ్మది, సమత్వము వెలయునట్లు జాగ్రతగా నుండవలెను. మరియు ఈజాగ్రత రెండువిధములుగా నుండవలెను. యువకులు ఉత్సాహముచే అమితముగా పనిచేయుట తరుచు చూచుచుందుము. ఇది చాల తెలివితక్కువ. మనలో ప్రతివారును వారిశక్తికొలది చేయగలిగినదంతయు చేయవలెను. కాని దానికొకహద్దు ఉండవలెను; ఆహద్దు దాటినయెడల తెలివితక్కువయగును. ఘనులగు మన అధ్యక్షులు "నేను చేయుటకు తీరికలేనికార్యమున్నయెడల, అది నాకార్యము కాదు," అనుట నేను వింటిని. అయినను, ఆమెకంటె నడతెగకుండ శ్రమపడి పనిచేయువారెవ్వరును ఉండజాలరు. ఈనాటి కార్యమునకు మనశక్తులను న్యాయముగా నుపయోగించినయెడల, రేపటికార్యములను జేయుటకెక్కువ సమర్థతగలిగి తీరవలెను; ఈరోజున అమితముగా శ్రమపడి పనిజేసి రేపటికి అలసిపోయి నిరర్థకమైపోవుట నిజముగా ఉపయోగకరమగు సేవకాదు; ఈనాటి అమితోత్సాహమును తృప్తిపరచుకొని రేపటికార్యమును చేయలేకుండ శక్తిహీనుడగుట తెలివిగలవానికి లక్షణముకాదు. ఎప్పుడైన నేదైన అత్యవసరమగు కార్యమును నియమితకాలములో పూర్తిచేయుటకై వివేకమును విడిచిపెట్టి అమితముగా శ్రమపడవలసినసందర్భము రావచ్చును. కాని, మంచి తెలివితేటలతో పనిచేయువాడు రాబోవు పరిస్థితులను తెలిసికొనుటకు ప్రయత్నించి అట్టి క్లిష్టమగుసందర్భములు రాకుండ జాగ్రతపడును.

నెమ్మది, సమత్వము చెడకుండ వానిని నిలుపుకొనుటకు శిష్యుడు కృషిచేయవలసిన రెండవపద్ధతి తన అంతరంగికవైఖరికి సంబంధించినదై యున్నది. అతని రాగములలో కొంతచాంచల్యము కనిపించుటతప్పదు, కాని యతడు వానిని సాధ్యమైనంతవరకు తగ్గించుకొనవలెను. అన్నిరకములగు ప్రభావములు, కొన్ని భువర్లోకసంబంధ

మైనవి, కొన్ని మానసికలోకమునకు చెందినవి, కొన్ని కేవలము భూలోకమునకు సంబంధించినవి సదా మనపైన యొత్తుచుండును; వానిగురించి సాధారణముగా మన కేమియు తెలియకపోయినను కొద్దిగనో, గొప్పగనో మనపైన నవి పనిచేయుచునే యుండును. భూలోకములో ఉష్ణోగ్రత, వాతావరణస్థితి, గాలిలోని నీటిపరిమాణము, అమితమగు అలసట, జీర్ణకోశములస్థితి, ఇవన్నియుగాక మరెన్నియో యితరవిషయములు మన సామాన్య ఆరోగ్యభావమును నిర్ణయించును. ఆ మనోభావముపై మన సుఖమేగాక, మనము పనిచేయగలశక్తి కూడ ఆధారపడియుండును.

భూలోకములో శీతోష్ణస్థితి, ఉష్ణోగ్రత, స్థూలపరిసరములు మారుచున్నట్లు గనే ప్రపంచములో వేర్వేఱు భాగములలో భువర్లోకపరిస్థితులుకూడ మారుచుండును, గనుక మన కేమియు తెలియకపోయినను అవి మనలను బాధించుచుండును. భూలోకజీవితములో నొక్కొక్కప్పుడు ఒక అయోగ్యుడగు స్నేహితుడు మనకు సంప్రాప్తమగును; వానిని వదల్చుకొనుట మనకు కష్టమగును; భువర్లోకములో పట్టుకొని విడిచిపెట్టని యొక భ్రష్టుడుగాని, నిస్పృహాగాధములలో మునిగిపోయి మృతుడైన అభాగ్యుడుగాని సంప్రాప్తమైనయెడల అట్టివానిని వదల్చుకొనుట అంతకంటె ఎక్కువకష్టమగును. అటువంటి దౌర్భాగ్యుడు వణకుచు ఒక మనిషిని గట్టిగా పట్టుకొని వ్రేలాడినయెడల అతని ప్రాణశక్తి చాలవరకు హరించిపోవుటయేగాక అతడు విచారములోను వ్యాకులములోను మునిగిపోవును గాని, ఆభ్రష్టునకు మాత్రము కించిత్సహాయమైనను గలుగదు. అట్టి భూతముసంగతి మన కేమియు తెలియకపోవచ్చును, తెలిసినను వాని దుస్థితిని తొలగించుట సులభసాధ్యమగు పనికాదు; అంతేగాక, వాని సాన్నిధ్యమువలన గలుగుచున్న ప్రాణసంకటమును దొలగించుకొనుటకూడ నసాధ్యమగును. భూలోకములోవలెనే భువర్లోకములోగూడ తమకు తెలియకుండగనే రక్తమునుపీల్చు దయ్యములు గలవు; ఎచటనున్నను వానికి సాహాయ్యముచేయుట మాత్రము మిక్కిలికష్టము.

శిష్యుడు సాధారణముగా కొంతపరిణామవికాసమును బొందియున్న కారణమున, తనకు తెలిసినను తెలియకపోయినను, ఈ ప్రభావములకన్నిటికి అతడు సులభముగా లోనగును. అందుచే, ఒక్కొక్కప్పుడు అకారణముగా విశేషమగు ఆనందమును బొందుటయో లేక విచారముతో క్రుంగిపోవుటయో జరుగుచుండును. రాగములలో తరుచు తీవ్రమగు మార్పులు కలుగుచుండుటజూచి భువర్లోకభూతము సంతో

షముతో నుప్పొంగును, కనుక అట్టి మార్పులు కలుగుటకు తనశక్తికొలది ప్రోత్స హించుచుండును. కాని, శిష్యుడు ఇట్లు మారుచుండెడు రాగోద్రేకములకు ఆటస్థలముకాకూడదు. వచ్చుచు పోవుచుండెడు కలవరములచే నెంతమాత్రము చలింపకుండ శిష్యుడు సర్వదా సంతోషముతోను, శాంతముతోను, నిలుకడగా నుండుటకు ప్రయత్నించుచుండవలెను.

ఒక్కొక్కప్పుడు ఏదోయొక గొప్ప యుత్సాహమును, తన పురోవృద్ధిని పురికొల్పునట్టి నిర్దిష్టమగు నొక ప్రోత్సాహమును బొందగల సత్కర్మ అతనికి సంప్రాప్తముకావచ్చును. అడయారులో జరిగిన స్వర్ణోత్సవకన్వెన్షను (వార్షికసభ) కు హాజరుకాగలిగిన అవకాశమును దానికి ఉదాహరణముగ చెప్పవచ్చును. ఆసందర్భమున, అచటి ప్రభావమునకు హృదయద్వారములను దెరచినవారందరుకు అసాధారణమగు ప్రోత్సాహము, అపారమగు సహాయము కలుగుటచేత అది నిశ్చయముగ జ్ఞాపకముంచుకొనదగిన సందర్భము. అట్టి సంఘటనము ముముక్షువుయొక్క ఊర్ధ్వగమన మార్గములో నిర్దిష్టమగు మైలురాయి కావచ్చును; ఆనాటినుండి తన కదనముగా శక్తికలిగినదనియు, సోదరత్వమనగా వాస్తవముగ నెట్టిదో యెక్కువగా గ్రహింపగలశక్తి ప్రాప్తించినదనియు అతడు జ్ఞాపకముంచుకొనును.

అద్భుతమగు అట్టిశక్తి ప్రసారముజరిగి, అసాధారణమగు అట్టి యుద్ధరణము కలిగినతరువాత కొంత ప్రతిక్రియ — ఒకవిధముగా వ్యతిరేకమైనది — జరుగక తప్పదని జ్ఞాపకముంచుకొనుట మంచిది. అట్లు సంభవించుటలో భయపడవలసినదిగాని అసహజమైనదిగాని యేమియులేదు. అది ప్రకృతిధర్మమే, అట్లు సంభవించుట నిత్యజీవితములో తరుచుగా చూచుచుందుము. మనలో చాలమంది విశేషముగా చదువుచు, వ్రాయుచు ఇండ్లవద్దనే కూర్చుండి స్థిరజీవనములను గడుపుదుము; స్థూలశరీరములకు నిజముగ కావలసిన వ్యాయామమును మనమియ్యము; అకస్మాత్తుగా ఆవిషయము జ్ఞాపకమువచ్చి యొక్కసారి ఝురీలుమని పెద్ద యత్నమును జేయుదుము; తీవ్రముగా నాటలాడుటయో, చాలదూరము నడచుటయో చేయుదుము. మితిమీరకుండ చేసినంతవరకు అదిమంచిదే. కాని కొంచెము అమితముగా ఆడుటయో, నడచుటయో చేసినయెడల నొకవిధమగు బడలిక కలుగును, కూర్చుండి విశ్రాంతి తీసికొనవలెననియుండును. అదంతయు సహజమే, సరియైనదే. దేహకండరములను మామూలుకంటె నెక్కువగా శ్రమపెట్టుటచే అలసట కలుగును, తరువాత విశ్రాంతి

కావలసివచ్చును. కావున ఒకింతసేపు బద్ధకముచే విశ్రమింతుము, తిరిగియొకగంటయో అరగంటయో పోయినతరువాత మామూలుగా పనిచేయగలుగుదుము.

కాని యిచట మనము జ్ఞాపకముంచుకొనవలసినవిషయ మేమనగా, మనము విశ్రాంతి తీసికొన్నగంట, లేక, అరగంటకాలములో నొకవిధమగు మాంద్యస్థితిలో నుందుము. కనుక, గాలిలోనుండు రోగాంకురములు (సాధారణముగా అవి గాలిలో నెల్లప్పుడు నుండును) ఇతర సమయములయందుకంటె ఆసమయమందు మనపై నెక్కువగా పనిచేయుట కవకాశముండును. సూక్ష్మశరీరములలోగూడ ఈవిధముగనే జరుగును. మనకొక గొప్ప ప్రోత్సాహముగాని ఉద్ధరణముగాని గలిగినప్పుడు మన సూక్ష్మోపాధులు మామూలుకంటె ఎక్కువగా బడలిక చెందును. అది చెడ్డ విషయ మని నేను చెప్పుటలేదు; కాని మామూలుకంటె మన ఉపాధులన్నియు ఎక్కువగా పనిచేసినందున వానికి విశ్రాంతి కావలసినసమయమువచ్చునని మనము తెలిసికొన వలసియున్నది.

ఆవిశ్రాంతికాలమందు అనేకవిధములుగా చిన్నచిన్న ప్రమాదములు కలుగ వచ్చును. ఉన్నతతలమున కొంతకాలముండి విశ్రాంతిరూపమున క్రిందికి జారుటలో మరికొంచెమెక్కువగా క్రిందికిపడిపోవచ్చుననునది యొక ప్రమాదము. ఉత్కృష్ట మగు ఆధ్యాత్మికస్థితిలోనుండి మామూలు జీవితములోకంటె ఎక్కువ గాఢమగు నైహికలోలత్వములోనికి దిగజారుట సంభవింపవచ్చును. అందుచే సామాన్యముగా మనలను బాధింపజాలని యేచిన్న ప్రేరేపణమైనను అట్టిసమయమందు మనకు తెలి యకుండగనే మనలను గట్టిగా పట్టుకొనవచ్చును. అట్టి ప్రమాదము జరుగగలదని మన మెరుగక ఏమఱుపాటుగనుందుము. ఆబడలికసమయమందు మామూలుకంటె ఎక్కువ భోగాసక్తులము కావచ్చును, మామూలుగా మనము చేయని పొరపాటును తెలివితక్కువగా చేయవచ్చును.

పైనచెప్పిన రోగాంకురమునుబోలిన ప్రమాద మిచటకూడ గలదు. మనము విశ్రాంతి తీసికొనుచున్నప్పుడు మనచుట్టును అన్నివిధములగు సంకల్పరూపములు ఎగురుచుండును, అవి కొన్ని సుఖకరములైనవి, మరికొన్ని స్పష్టముగా దుఃఖకరము లైనవి, మొత్తముమీద చాలవరకు మన భావన సాధారణముగా పనిచేయు అంతరు వునకు దిగువ అంతరువులయందుండును. ఆసమయమందు ఈభావరూపములు మన లను బాధింపవచ్చును.

## అసురశక్తులు

కొన్ని ఇతరవిషయములుగలవు. వానినిగూర్చి కొంచెము తెలిసికొనుట మంచిది. పైనచెప్పిన ఉద్ధరణసమయమందు పైనుండి, అనగా, మహాశ్వేత సోదర బృందమువద్దనుండిగాని, మన స్వీయపరమగురువులవద్దనుండిగాని అసాధారణమగు గొప్ప ఆధ్యాత్మికశక్తి ప్రసారమును బొందుదుము. ప్రకృతిలో మనకు తెలియకుండ మఱుగుగానున్న ధర్మమొకటి కలదు; దానివలన నొక చిత్రమగు ఫలితము కలుగును. అదియేమన, ఎప్పుడు అద్భుతమగు నుత్తమశక్తులు ప్రసరించునో ఆకాలమందే సమానముగ అసురశక్తికూడ ప్రసరించును. ఇది మన కాశ్చర్యముగా కనిపించవచ్చును, గాని అది నిస్సంశయమగు విషయము. పరమపురుషులు పరిణామ విధానమందు పనిచేయుచు ఎప్పుడైనను అసాధారణమగు ఆశీర్వాదము నిచ్చిన యెడల, అవతలప్రక్క అదేవిధముగ తమశ్శక్తిప్రసారము జరుగును. త్రాసుయొక్క సమత్వము చెడకుండ ఇట్లు చిత్రముగా జరుగుచున్నదాయన్నట్లు జరుగుచుండును, ఇది పరమపురుషులకు తెలిసినవిషయమే. అసురశక్తులు, వామాచార తాంత్రికులు, ఛాయాసోదరులు, వీరినిగురించి మనము చాలా వినియుంటిమి. జ్ఞానమూర్తులగు పరమగురువులతోను, సూర్యకుటుంబమును ఈప్రపంచమును పాలించు మహీపీఠముతోను సంఘర్షణ గొనితెచ్చునట్టియు, మన మార్గమునకు కేవలము భిన్నమైనట్టియు మార్గమును వీరనుసరింతురు. సహజముగా, వారి వైరుధ్యము ఆపరమపురుషులనే గాక వారల అనుచరులగు మనలనుగూడ బాధించును.

వీరినిగురించి విశేషముగ ఈపుస్తకములో వ్రాయదలచుకొనలేదు. యోగ మార్గప్రసంగములు — **Talks on the Path of Occultism** — 632–635 పుటలలో సవివరముగా వ్రాసియుంటిని. అందులో వ్రాసినదానికంటె నధికముగా వ్రాయదగిన దేమియులేదు, కాని యొక విషయముమాత్రము చెప్పవలసియున్నది. ఈ ఛాయాసోదరులు తమ విరుద్ధమగుచర్యలను సమర్థించుకొనుటకై యొకవిచిత్రమగు సిద్ధాంతమును జెప్పుదురు. ఐక్యమునొందుట నిజముగా ఈశ్వరుని ఉద్దేశము కాదనియు, ప్రతివ్యక్తియు పరిణామముద్వారా సాధ్యమైనంత యున్నతస్థితికి చేరుటయే ఈశ్వరేచ్ఛయనియు వారివాదము. (వారు ఒప్పుకొనకపోయినప్పటికి, వాస్తవముగా వారు చెప్పెడు స్థితి అంతఉన్నతమైనదికాదు; ఎందుచేతననగా వారి విధానమంతయు జీవాత్మను బలపరచుటయందే లగ్నమైయుండునుగాని, బుద్ధిలోకమునకుగాని, నిర్వాణ

లోకమునకుగాని కొనిపోనేరదు; ఆలోకములోనే ఐక్యము చేకూరును). "ఐక్యమునకు కొనిపోగల పరిణామచిహ్నములు కనిపించుచున్నవనియు, అదియే యీశ్వరేచ్ఛయనియు మీరు తలంచుచున్నారు. అది నిజముకాదు సరిగదా మీరు తప్పుమార్గమున బోవుటకు ఈశ్వరుడు మీకట్టి ప్రేరణమును కల్పించుచున్నాడు. ఐక్యమొందుటకు ఈశ్వరుడు మీకట్టి ప్రేరేపణమును కల్పించుచున్నాడు. ఐక్యమొందుటకు బదులుగా, మీవ్యక్తిత్వమును బలపరచుకొనవలెననియు, అభేదమును నైక్యములో ముంచుటకై ప్రేరేపించు ప్రేరేపణములనన్నిటిని మీరు గ్రహించి యొంటరిగా నిలబడవలెననియు, ఈశ్వరుని సంకల్పమైయున్నది," అని వారు వాదించెదరు.

నిజముగా ఆవాదము నంగీకరించువారు మన పరమగురువులతోను మనతోను తుదివరకు ప్రతివిషయములోను వైరమున నుందురు. పరమగురువులు పృథక్త్వవాదులకు సాధ్యముకాని ఐక్యమును బొందగలరు, గనుక ఈశ్వరేచ్ఛనుగురించి ఆతప్పుమార్గము ననుసరించువారెన్నటికైనను తెలిసికొనగలదానికంటె చాల యెక్కువగా నెఱుగుదురు. అందుచేత మనము పరమగురువులనే అనుసరింతము.

కనుకనే వీరు మనలను నిరోధించుట సంభవించుచున్నది; వీరు తమపక్షమునకు జనులను చేరదీయ యత్నింతురు; ఇతరులను తమ పక్షమునకు త్రిప్పుకొనుటకు ప్రయత్నింతురు; సామాన్యమానవునికంటె కొన్ని విధముల మన మభివృద్ధిబొంది వికసించుచున్నచో, తప్పక మనలనే పట్టుకొనుటకు వారు ప్రయత్నింతురు. వారిలో మిక్కిలి ప్రజ్ఞావంతులైనవారు గొప్ప సన్న్యాసులవలెనే ఐహికమునకు దూరులైయుందురు. మానవుడు నీచవస్తువులను విసర్జించి యుత్తమమగు వానిని ఆశింపవలెనని వారుకూడ తప్పక అంగీకరింతురు; కాని అతి గాఢమగు ప్రత్యేకవ్యక్తిత్వమును ఆదర్శముగా పెట్టుకొని పనిచేయుటచే తుదకు దుఃఖముపాలగుదురు. మనలో వ్యక్తిత్వమును బలపరచుటకును, సూక్ష్మమగు అహంకారమును మనలో పురికొల్పుటకును వారిప్రభావమును మనపై ప్రయోగింపవచ్చును. లేశమైనను జంకులేక ఎట్టిపనినైనను చేయుటయే వారితత్త్వమని జ్ఞాపకముంచుకొనవలెను; వారి మతమున, జంకుట యనునది శుద్ధతెలివిహీనము, హేయమునగు దోషము. కావున వారు నీచతమమగు మోసములను చేసెదరు.

మనకదియొక ప్రధానమైన అపాయము. మనము పురోవృద్ధిని బొందినకొలది ఆఛాయాసోదరులదృష్టి మనపై బడుచుండును, మనలను వారు పట్టుకొనగలిగినచో

తప్పక నాశముచేయ ప్రయత్నింతురు. కాని మనము మనపరమగురువులతో నిత్యము భావనద్వారా సంపూర్ణమగు ఐక్యము గలిగియున్నంతకాలము, స్వార్థరహితులమై నిలుకడగా సేవజేయుచున్నంతకాలము, నిరంతరము ప్రేమను ప్రసరింపజేయుచున్నంతకాలము వారు మనలను పట్టుకొనలేరు, మనలను అంటనైన అంటలేరు.

ఈఅసురశక్తులకు వ్యతిరేకముగా మనకుగూడ కొంతబలముగలదు. పరమగురువులతో నైక్యము, వారిమైఖరి నవలంబింపగల సామర్థ్యము, ఎల్లప్పుడును వారి యొద్దనుండి వచ్చెడు ప్రభావములను గ్రోలుటకు సంసిద్ధత, మనలను బాధింపప్రయత్నించు విచ్ఛిన్నకారణములన్నిటియెడల తీవ్రమగు విముఖత — ఇవియే మనకుగల గొప్పబలము. పృథక్త్వమును బలపరచువట్టి పనినేమైన చేసినయెడల శత్రువుల చేతులలోనికి పరుగెత్తినట్లే; స్వల్పవిషయములలో ఇది యెంతనిజమో మనము గొప్ప వనుకొను విషయములలోగూడ అంత సత్యమే యగును. కనుక మనము బాలిశమగు, నీచమగు అనుమానములను వైరములను అన్నిటిని పూర్తిగా విసర్జింపవలయును; వీనికి లొంగిపోయిన ప్రతిసారియు దివ్యజ్ఞానసమాజము అను కోటలో మనము దుర్బలమగు భాగముల మగుదుము, దానిగోడలలో గండ్లు కొట్టినవారమగుదుము; మనము మన నీచప్రకృతికిలోనై గర్వము, మాత్సర్యము, స్వల్పవిషయములలోగూడ కోపము, చిరాకు మొదలగు లక్షణముల నెప్పుడు ప్రదర్శించినను మన సరమగురువులయెడల ద్రోహముచేసినవారమగుదుము. "మనగురువులు మనకట్టి పతనమురాకుండ తప్పకరక్షించెదరు," అని మనము తలంపవచ్చును. వారట్లు చేయరు, మన స్వేచ్ఛకు వారు అడ్డు తగలరు, మన స్వశక్తిచే నిలబడుట మనము నేర్చుకొనవలెను. అది యట్లుండ, నడకరాని చిన్నబిడ్డను కనిపెట్టిచూచుచుండెడు దాదివలె మనలను పరమగురు వెల్లప్పుడును కనిపెట్టిచూచుచు శ్రమపడవలెనని మనము కోరరాదు. పరమపురుషులవలె పనిచేయువారు ప్రపంచములోలేరు; వారు జీవాత్మలను గుంపులుగుంపులుగాచేర్చి వ్యవహరింతురు. ఒక్కొక్క దేహాత్మతో వేర్వేరుగా గాక, కోట్లాది ఆత్మలతో నొకేసారి వ్యవహరింతురు. అయినను ఎవరైన నిజముగా కష్టములోనుండి పరమగురువును ప్రార్థించినయెడల తప్పక జవాబు రాగలదు. పరమగురువులకు శ్రమనియ్యకుండ తప్పించుకొనుటకు సాధ్యమైనయెడల వారి కొక్షణ మాత్ర శ్రమనైన కలిగించినందుకు మనము తప్పక చాల విచారించవలసినదే; కాని యథార్థముగ సహాయము ఆవశ్యకమయినచోవచ్చితీరును.

మనసమాజముయొక్క ప్రారంభదినములలో, మేడమ్ బ్లవట్స్కీగారు జీవించి యున్నప్పుడు, ఉత్కృష్టమగు శక్తులుగలిగిన సభ్యుడొకడుండెను. అతడు వామాచార తాంత్రికుడు కావలెనని కోరియున్నచో మిక్కిలి సార్థకమగు మచ్చుగానుండ గల తాంత్రికునిగా తయారై యుండును. అప్పుడప్పుడు జంకులేకుండ ఏపనినైన చేయుచుండును. అతనికి జ్ఞానముకై తీవ్రమగు ఆకాంక్షగలదు. దేనినైన తెలిసికొనవలెనన్న ఎట్టిపనినైనను, కొంచెము నీతి బాహ్యమైనపనినైనను, సంశయములేక చేయ సాహసించును. అతడు వైద్యశాస్త్రవేత్త. ఒకసారి యొక సభ్యురాలునకు వైద్యముచేయుచు ఆమెకు కొన్నివిధములచే అసాధారణమగు దివ్యదృష్టి (లేక యోగశక్తులు) గలదని కనిపెట్టెను. అందుచే ఆమెకు జబ్బు కుదిరి స్వస్థత కలుగుచున్న కాలములో కొన్ని ప్రయోగములలో తనకు సాయపడవలసినదని అతడామె నడిగెను. "నీకు మిక్కిలి అద్భుతమగు శక్తిగలదు; నిన్ను యోగనిద్రలో ప్రవేశపెట్టి సమాధ్యవస్థలో నుంచుటకు నాకు అనుజ్ఞనిచ్చినయెడల నేను స్వయముగా పొందలేనట్టి ఉన్నతమగు అవస్థలను నీవు నిశ్చయముగ చేరగలవు; ఆవిధముగ మనకు ప్రస్తుత మందుబాటులోలేని విశేషజ్ఞానమును మనము సంపాదింపగలము" అని యతడు ప్రత్యక్షముగా నామెతో చెప్పెను. ఆమె అందుకు నిరాకరించెను. ఆమె చేసిన పనిసరియైనదని నా అభిప్రాయము. అట్లధికారమును వినియోగపరచుట మిక్కిలి అపాయకరమగు విషయము; తప్పనిసరియైన పరిస్థితులలో సమస్తమగు రక్షణలను సిద్ధపరచుకొన్నప్పుడు తప్ప ఎన్నడును అట్టి పనిచేయరాదు.

అది యెట్లున్నను, ఆమె పూర్తిగా నిరాకరించెను. ఆడాక్టరుగారికి అసంతుష్టి కలిగెను. ఆయన అప్పటికి వెళ్లిపోయెను. గాని వారిపట్టుదలను విడిచిపెట్టదలచుకొనలేదు. ఆరోజుననే రాత్రిసమయమందు ఆమె పడకగదిలో అతడు (తాత్కాలికముగా నిర్మించుకొన్న కృత్రిమ స్థూలశరీరములో) ప్రత్యక్షమై ఆమెను యోగనిద్రలో పెట్టు ప్రయత్నములో చేతుల నాడించుచుండెను. సహజముగా నామెకు తీవ్రమగు కోపమువచ్చెను; రాత్రివేళ తనగదిలో ప్రవేశింప సాహసించినందుకును, బాగుగా యోచించి స్పష్టముగా నిరాకరించినతరువాత తనపై నతడు ప్రయోగముచేయ ప్రయత్నించుచున్నందుకును ఆమె క్రోధాగ్నితో మండిపోయెను; తనశక్తి కొలది అతని ప్రభావము నెదుర్కొని పోరాడెను. కాని అతని శక్తితో పోల్చిచూడ తన మానసికశక్తి శూన్యమని వెంటనే గ్రహించెను. తన ఇచ్ఛాశక్తి క్రమేణా నిశ్చయ

ముగా తగ్గిపోవుచున్నదనికూడ కనిపెట్టెను. కనుక తాను ఆపోరాటములో గెలువ లేనని నిశ్చయించుకొని తన పరమగురువు కూట్‌హూమిమహర్షి గారిని సహాయము కొరకై వేడుకొనెను.

దాని ఫలితమాక్షణమందు కనబడుటయేగాక, అత్యద్భుతముగా నుండెను. ఆమె ఆశ్చర్యము వర్ణనాతీతము. ఆమె దారుణమగు క్రోధాగ్నితో నిండియున్నదని చెప్పినసంగతి జ్ఞాపకముంచుకొనుడు. ఆమె పరమగురువును వేడిన క్షణమందే మెఱపు మెఱసినంతలో డాక్టరు రూపము దూరముగా పోయి మాయము కాజొచ్చెను. అదంత యద్భుతము కాకపోవచ్చును; ఆమె కత్యాశ్చర్యకరముగ కనిపించినది, ఆమె యెన్నటికి మరచిపోనిది యేమన, ఒక్కక్షణములో నామె క్రోధమంతయు పూర్తిగా మారిపోయెను; కోపము పోయెను; మాయమగుచున్న డాక్టరు యెడల నామెకు గొప్ప జాలికలిగెను. అట్టి అద్భుతమగు శక్తుల నతడట్లు దుర్వినియోగము చేసెనే యను గాఢమగు విచారము ఆమెను బాధించెను. కనుక, నిజమగు కష్టకాల ములో సహాయము వెంటనే రాగలదని మీకు విశదము కాగలదు. కాని కేవలము తప్పనిసరియైనప్పుడుగాక, ఇతరసమయములయందు వారిసహాయముకొరకై ప్రార్థించు టకు ఎవ్వరము తలపెట్టమని తలచెదను. మీగురించిగాక ఎల్లప్పుడును పరులగురించి తలపోయుడు. మీపరమగురువుయెడల భక్తి ప్రేమలను జూపుచు, మీసోదరులలో వారి ప్రభావమును వ్యాప్తిచేయగల యుత్తమమార్గములగూర్చి యోచనచేయు చుండుడు; అట్లుచేసినచో, మీకు ఏదైన నద్భుతమగు అంతరంగిక ప్రబోధము కలిగి నయెడల దానివల్ల మీకు లాభము కలుగకుండ నష్టము కలుగునేమో యని భయ పడ నక్కరలేదు.

## విజయము నిశ్చయము

శిష్యుడు తనకెన్ని అపజయములు కలిగినను, అధైర్యము జెందననిన్ని, నిరు త్సాహపడననిన్ని, తన ఆత్మాభివృద్ధికై తన యత్నములను మాననని న్ని తన మన స్సును దిట్టముచేసికొనవలెను. ప్రథమ పతనము తరువాత తిరిగిలేచి ప్రయత్నించుట కెంతసబబు కలదో, సహస్రపతనముల తరువాత తిరిగిలేచి యత్నము చేయుట కంత సబబేకలదు. భూలోకములో నసాధ్యమగు విషయములు చాలకలవు; కాని ఉత్తమ లోకములలో నటులగాదు. యంత్రసాధనము లేకుండ నొక టన్ను బరువు నెత్తలేము,

కాని ఊర్ధ్వలోకములో పట్టుదలతో పరిశ్రమజేసినయెడల మనలోపముల బరువు నంతను ఎత్తివేయవచ్చును. యోచనచేసినయెడల దీనికి కారణము స్పష్టముగా విశదముకాగలదు. మానవకండరములు ఒకటన్ను బరువు నెత్తుటకు తగినట్లుగా నిర్మాణముకాలేదు; మానవునికిగలశక్తి నియమితమైయుండుటచేత, ఎంత శిక్షణమును బొందినను ఆపని సాధ్యముకానేరదు. ఆధ్యాత్మిక విషయములలో ఈశ్వరశక్తి యావత్తు అతని యధీనమైయున్నది; అతని యిచ్ఛానుసారము దాని నుపయోగించుకొనవచ్చును; కనుక కొద్దికొద్దిగా నిరంతరము ప్రయత్నములుచేసినచో ఎట్టియాటంకమునైనను నిగ్రహింపగలశక్తిని సంపాదింపగలడు. తరుచు జనులు "నేను భూలోకములోనే పనులనైన చేయగలను, భువర్లోక సువర్లోకములలో నే నేమియు చేయలేను, అది చాలకష్టము," అనుచుందురు. అది సత్యమునకు కేవలము విరుద్ధము. ఆసూక్ష్మలోకములో యోచించుటకు, పనిచేయుటకు అలవాటుపడి యుండకపోవుటచే వారేమియు చేయలేమనుకొందురు. కాని తగురీతిని వారి యిచ్ఛాశక్తి నుపయోగించిన యెడల, భూలోకములో నసాధ్యమగు రీతిని ఆలోకములలో సర్వవిషయములు వారి యిచ్ఛానుసారముగా పోవుచుండుట గానవచ్చును.

ఈకార్యములో నొక తాయెత్తు నుపయోగించుటవలన కొందరు శిష్యులకు విశేషమగు సహాయము కలిగెను. తాయెత్తు నిజముగా మంచిసహాయకారికావచ్చును; ఏలయన, శరీరస్వభావమును, మనస్సును, రాగములను అన్నిటిని నిగ్రహించి స్వాధీనముచేసికొనవలసియున్నది; అందులో శరీరమును స్వాధీనముచేసికొనుట నిస్సంశయముగ మిక్కిలి కష్టమైన కార్యము; విషయమును పూర్తిగా తెలిసినవానిచే ప్రబలమగునాకర్షణతో పూరింపబడిన తాయెత్తు అమూల్యమగు సుపకారము చేయవచ్చును. ఆవిషయమును నేను సవివరముగా "The Hidden Side of Things" అను గ్రంథములో వ్రాసియుంటిని. అట్టి సహాయము తమ కవసరము లేదని చాల మంది అనుచుందురు; కాని నామట్టుకు నాకార్య మతిశ్రమకరముగా కనిపించుటచే నాకెవరైన నట్టి సహాయము చేసెదననిన సంతోషముతో స్వీకరించెదను.

— ♦ —

## ఆరవ అధ్యాయము

# ఇతరదర్శనములు

## పరమగురువులు – సోదరత్వము

ఇంతవరకు పరమగురువు తన శిష్యునికి పనినేర్పుచుండుటయేగాక, అవసరమగు శిక్షణ నిచ్చుచు మహాశ్వేతసోదరబృందము యెదుట యోగదీక్షకై పంపుట కాయితము చేయుచుండును. పరిణామకార్యమును నెరవేర్చుటయే ఆబృందముయొక్క యావదుద్దేశమైయున్నది; ఆబృందములో సభ్యుడుగా తీసికొనబడు మహాగౌరవమునకు తగియున్నప్పుడు శిష్యుడు ప్రపంచమునకు వెనుకటికంటె విశేషముగా నుపయోగకరముగ నుండునని తెలియును. కనుక సాధ్యమైనంతత్వరలో శిష్యుని ఆయంతరవున నుద్ధరణము జేయుటకై ప్రయత్నము చేయుచుండును. యోగమార్గవిషయమై వేలకొలది సంవత్సరములక్రిందట వ్రాయబడిన ప్రాచ్యగ్రంథములలో, ప్రబోధము జరుగు ఈసజ్జీకరణ కాలమునుగూర్చి అనేకవృత్తాంతములు కలవు; దివ్యజ్ఞాన సమాజమువారు ప్రచురించిన తొలిగ్రంథములలో ఆకాలము నుదహరించినప్పుడు “పరీక్షమాణావస్థ’ యనిరి. దానివలన ప్రత్యేకముగా ఒక పరమగురువు శిష్యుని పరీక్షమాణావస్థయందు యుంచెదరని వారి అభిప్రాయముకాదు. యోగదీక్షనిచ్చుటకు ముందు అందు కర్హతగలుగచేయు సామాన్యశిక్షణమని వారి యుద్దేశము. “అదృశ్య సహాయులు” అను గ్రంథములో నేనాశబ్దమునువాడియుంటిని; కాని ఆశబ్దమును రెండు వేర్వేరు భావములలో వాడుకచేయుటవలన గాబరా కలుగుచున్నందున ఈమధ్యను దానిని వాడుకచేయుట మానివేసితిని.

పరమగురువుల బోధనావిధానమును సులభముగా గ్రహింపవచ్చును. అది వాస్తవముగ చాలవరకు మన పూర్వపు విశ్వవిద్యాలయములలోని పద్ధతిని బోలియుండును. ఒక విశ్వవిద్యాలయములో నొక విద్యార్థి యొక పట్టమును దీసికొనదలచినయెడల ముందుగా ఆవిద్యాలయమువారు నిర్ణయించిన ప్రవేశ పరీక్షలో నుత్తీర్ణుడై, తరువాత నొక కళాశాలలో చేరవలెను. ఆవిద్యార్థి అభివృద్ధికి ఆకళాశాలాధ్యక్షుడు బాధ్యుడగునని చెప్పవచ్చును; మరియు ఆయనను ప్రధానశిక్షకుడుగా నెంచవచ్చును. కాని ఆవిద్యార్థి చాలవరకు తనంతటతానే కృషిచేయవలెను; కాని పట్ట

పరీక్షకు పంపుటకుపూర్వము ఆవిద్యార్థి యుక్తముగా తయారుచేయబడునట్లు చూడ వలసిన బాధ్యత కళాశాలాధికారిపైనుండును. కళాశాలాధ్యక్షుడు పట్టము నియ్యడు; విశ్వవిద్యాలయము పేరట దాని యుపాధ్యక్షుడు సాధారణముగ నిచ్చును. పరీక్షల నేర్పాటుచేయుటయు, పట్టముల నిచ్చుటయు, విశ్వవిద్యాలయము వారి పనిగాని, కళాశాలాధికారి పనికాదు; విద్యార్థిని యుక్తముగా తయారుచేయుటయు, సాధారణ ముగా కొంతవరకు వాని బాధ్యత వహించుటయు వారి విధి. అట్లుతయారుచేయుటలో అందరివలెనే వారుకూడా విద్యార్థితో వారి యిచ్ఛానుసారము మెలగవచ్చును, దానితో విశ్వవిద్యాలయమున కేమియు సంబంధము లేదు.

సరిగా అదేవిధముగ, పరమగురువునకు శిష్యునకుగల సంబంధములతో మహా శ్వేత సోదరబృందమున కేమియు నిమిత్తము లేదు; అది కేవలము పరమగురువు స్వయముగా యోచించి నిర్ణయించుకొనవలసిన విషయమైయుండును. జగదేకోప దేష్ట పేరట, నియమితమైన నొక మహీపీఠసభ్యునిచే దీక్ష ప్రసాదింపబడును; దీక్షను బడయగల మార్గమదియొక్కటే. పరమగురువు ఎప్పుడైన తమశిష్యులలో నొకడు ప్రథమయోగదీక్ష కర్హుడని యెంచినయెడల ఆయన ఆవిషయమును మహీపీఠమునకు తెలియపరచి వానిని చూపింతురు. మహీపీఠమువారు యోగదీక్ష కామనిషి యోగ్యు డేనాయని యడుగుదురుగాని, గురుశిష్యులకు మధ్యగల సంబంధములగూర్చి యెన్నడు నడుగరు. శిష్యుడు పరీక్షితుడా, లేక, స్వీకృతుడా, లేక కుమారావస్థ యందున్నాడా, అను వివరములతో వారికేమియు నిమిత్తము లేదు. అయినను, యోగదీక్షకు కొనిపోబడు అభ్యర్థి, మహీపీఠములో పరమగురువుపదవిని, అనగా, జీవన్ముక్తపదవిని బొందిన యిరువురిచే ప్రతిపాదింపబడుటయు బలపరచబడుటయు జరుగవలెనన్న సంగతి నిజము; మరియు, అతని చైతన్యముతో అత్యంత సన్నిహిత మగు పరిచయము గలుగుటవలన గలిగెడు నిశ్చయము లేనిదే అతడు యోగదీక్ష కర్హుడని ఏపరమగురువును ఎవ్వరిని దీక్షాపరీక్షలకై పంపరనుట నిశ్చయము.

కనుక, పరీక్షమాణావస్థ ప్రథమయోగదీక్షతో ప్రారంభమయ్యెడు నిజమార్గ మునకు తీసికొనిపోగల ఒకయవస్థ. ప్రాచ్యగ్రంథములలో వేర్వేరే గురువుతెవ్వరు లేన ట్లుగా వ్యక్తులతో నిమిత్తములేకుండా ఈరెండు మార్గములును వర్ణింపబడినవి. "సామాన్య ప్రపంచములో జీవించెడు మానవుడీపరీక్షమాణావస్థకెట్లు తీసికొనిరా

బడును, అట్టి యవస్థగలదని యెట్లు తెలిసికొనగలడు ?" అను ప్రశ్నలకు మొదట సమాధానము చెప్పవలసియున్నది.

## మార్గమును చేరగల నాలుగు సాధనములు

### (సాధన చతుష్టయము)

నాలుగుదార్లు కలవనియు, ఏదారివెంబడిపోయినను అభివృద్ధి నియ్యగల మార్గద్వారమునకు తీసికొనిపోవుననియు గ్రంథములలో చెప్పబడినది. ఆమార్గము ననుసరించుచున్న వారి సమక్షమందుండి వారిని పూర్తిగ తెలిసికొనుట మొదటిదారి. మధ్యయుగములో* మనలో కొందరుపుట్టి సన్యాసులో, సన్యాసినులో అయియుండ వచ్చును. ఆజన్మలో అంతరంగిక ప్రపంచము గురించి గాఢానుభూతిగల సెయింటు థెరిస్సావంటి మఠాధిపతి సంపర్కముగలిగి యుండవచ్చును. అటువంటి నాయకుని జూచినప్పుడు వారికి గలిగిన అనుభవము మనకుగూడ గలుగవలెనని యాశించియుండ వచ్చును; అట్టికోరిక కేవలము స్వార్థరహితము కావచ్చును. దానివలన మనకు ఘనత వచ్చుచున్నసంగతి గురించిగాని, కోరిక సఫలమగుటవలన గలిగెడు సంతుష్టి గురించిగాని మనము యోచనచేసి యుండకపోవచ్చును; ఆమఠాధిపతి తనకుగల గాఢ మగు జ్ఞానదృష్టిచే ఇతరులకు సహాయము చేయుచుండుట జూచి అటులనే మనము కూడ పరులకు సహాయముచేయుటలోగల ఆనందముగూర్చి మాత్రమే యోచిం చియుండవచ్చును. ఆజన్మలో అట్టిభావము కలిగియుండినయెడలతరువాతజన్మలో ఆవిషయమునకు సంబంధించిన ప్రబోధము మనకు నిశ్చయముగా సంప్రాప్తము కాగలదు. యురోపియను సంస్కృతిగల దేశములలో అంతరంగికవిషయములగురించి జ్ఞానము కావలెనన్న, వారికి దివ్యజ్ఞాన సమాజములో చేరి దివ్యజ్ఞాన సాహిత్యమును పఠనము చేయుటయొక్కటే మార్గముగలదు. ఆత్మానుభవముల గురించియు, భూతా వేశములగురించియు వ్రాయబడిన గ్రంథములలో ఈవిషయమైన భోగట్టాకొంతవరకు దొరుకును. కాని, నేనెరిగినంతవరకు దివ్యజ్ఞానసాహిత్యమువలె సరళముగా శాస్త్రాను సారముగా సంపూర్ణముగా వివరణముచేసిన గ్రంథము లెచ్చటను గానరావు. "గుప్తశాస్త్రము" The Secret Doctrine వంటి జ్ఞానగనిని నేనెచ్చటనుజూడలేదు.

* క్రీ॥ శ॥ 7 వ శతాబ్దము మొదలు 15 వ శతాబ్దము వరకు గల కాలము మధ్యయుగమని యూరపులో చెప్పుదురు.

భారతదేశీయులయొక్కయు, ఇతరజాతులయొక్కయు పవిత్రగ్రంథములుండుట నిశ్చయమే. ఆగ్రంథములలో ఈవిషయములగురించి విశేషమగు జ్ఞానముకలదు; కాని మనకుగల శిక్షణతో మనము సులభముగా గ్రహింపగలుగునట్లుగాని జీర్ణము చేసికొనగలుగునట్లుగాని అవి వ్రాయబడియుండలేదు. మన దివ్యజ్ఞానగ్రంథములను చదివినతరువాత ప్రాచ్యగ్రంథముల రమ్యములగు అనువాదములను గొన్నిటిని చదివినయెడల వానిలో మన దివ్యజ్ఞానమును జూడగలము. క్రైస్తవుల బైబిలు మన దృష్ట్యా చాలభాగములలో బాగుగా భాషాంతరీకరణ చేయబడి యుండలేదు, అయినను దానిలో విశేషముగా దివ్యజ్ఞానమును జూడగలము; కాని దానిని కనిపెట్టుటకు ముందు అందలి తత్త్వబోధనా విధానమును దెలిసియుండవలెను. దివ్యజ్ఞానమును చదివినప్పుడు ఎన్నిగ్రంథములు దానిని బలపరచుచున్నవో, అది లేనిచో ఎన్ని గ్రంథభాగములను సహేతుకముగా వివరణ చేయుట యసాధ్య మగునో, విశదము కాగలదు. అదివరకు అర్థశూన్యముగా గనబడిన చర్చి - సంస్కారములు దివ్యజ్ఞాన ప్రబోధమునలన సజీవములై హృదయానురంజకముగానుండి శోభిల్లుట మనకు తెలిసినవిషయమే. కాని, ఆక్రైస్తవమతగ్రంథములనుండిగాని, సంస్కారములనుండి గాని దివ్యజ్ఞానసిద్ధాంతమును ఊహించి చెప్పగలిగినవాని నెవ్వరిని నేనెరుగను.

కనుక ముక్తిమార్గమును జేరగల విధానములలో నొకటి అదివరకే ఆమార్గము ననుసరించుచున్నవారితో సంపర్కముగలిగి యుండుట. రెండవది - దానిని గురించి పఠనముచేయుట, లేక, శ్రవణముచేయుట. సిన్నెటుగారి "గుప్తప్రపంచము"- **The Occult World** అను గ్రంథమును 1882 సంవత్సరములో చదివినతరువాత నాకీజ్ఞానమంతయు గలిగినది. తరువాత వెంటనే వారి రెండవ గ్రంథము "ఆంతరంగిక జ్ఞానము" - **Estoeric Buddhism** - ను చదివి దానిలో వ్రాయబడినదంతయు సత్యమని, సహజమని నెరింగితిని, త్రికరణశుద్ధిగా నంగీకరించితిని; దానిని చదివిన కొలది, విన్నకొలది యెక్కువగా తెలిసికొనుటకును, తెలిసికొనదగినదానినంతయు నేర్చుకొనుటకును, సంపూర్ణముగా తెలిసికొనువరకు అవసరమైనయెడల ప్రపంచ మంతయు నన్వేషించుటకును తీవ్రమగు కోరిక, పట్టుదల నన్ను నింపివేసెను. తరువాత కొద్దికాలముననే ఇంగ్లాండులోని చర్చిలో నాకుగల పదవికి రాజీనామానిచ్చి, భారతదేశములో ఎక్కువగా పనిచేయుట కవకాశమున్నట్లు అగుపడగా, ఆదేశమునకు వెళ్లితిని.

ఆరెండుపద్ధతులు — పఠనశ్రవణములను చేయుట, అదివరకే మార్గము ననుసరించుచున్న వారితో సన్నిహితసంబంధముగలిగియుండుట — మానవులను మోక్షమార్గద్వారమునకు తీసికొనిపోగలవు. ప్రాచ్యగ్రంథములలో వ్రాయబడిన మూడవ మార్గము జ్ఞానాభివృద్ధి. కేవలము తీవ్రముగా యోచనచేయుటవలన గలిగినశక్తిచే కొన్నితత్త్వములను గ్రహింపవచ్చును, కాని అది బహు అరుదు. నాల్గవదారి మరి యొకటి కలదు. చిరకాలము సద్వృత్తి నవలంబించుటవలన, అనగా పుణ్యకార్యము లను జేయుటవలన, ఆత్మాభివృద్ధిగలిగి అంతకంత కెక్కువగా వెలుతురు కనిపించగా మార్గద్వారమును చేరవచ్చును.

## బౌద్ధుల విభజనము

నలుబదిసంవత్సరములక్రిందట బౌద్ధుల గుప్తసిద్ధాంతము దృష్ట్యా మార్గమును చేరుటకు వలయు యోగ్యతలను నాకు చెప్పవలసివచ్చినప్పుడు ఈక్రిందివిధముగా చెప్పబడినవి: మొదటిది — 'మనోద్వారవజ్జన' అనగా, మానసికద్వారములను తెరచుట, లేక, మానసికద్వారముగుండా తప్పించుకొనిపోవుట. దీనిని హిందూమత గ్రంథములలో వివేకము అని చెప్పిరి. బౌద్ధులట్లు చెప్పుట చాలవిచిత్రముగా కనిపించును; ఏలయన, సత్ ఏదియో, అసత్ ఏదియో, ఉచితమైనదేదియో అనుచితమైనదేదియో, వ్యత్యాసములను తెలియజేయు ద్వంద్వములన్నిటిని సరిగా గ్రహించునట్లుగా మన మనస్సులు తెరవబడినప్పుడే వివేకముదయించును.

రెండవ యోగ్యత: హిందువులు నిష్కామము, లేక, వైరాగ్యము అను దానిని బౌద్ధులు 'పరికమ్మ', అనగా, కార్యార్థమై ఆయితము, అని చెప్పిరి. దాని భావ మేమనగా, కేవలము ధర్మముకొరకు ధర్మము నాచరించుట నేర్చుకొని గుప్తప్రపంచములో కార్యాచరణమునకు ఆయితము కావలెను. అందుకు కర్మఫలము నపేక్షింపని యుత్కృష్టమగు ఉదాసీనము నలవరచుకొనవలసియుండును; అనగా నిష్కామము నలవరచుకొనవలెను. భావమొకటే, భావమాత్రము వేరుగా నున్నది.

హిందువులు షట్సంపత్తి యనెడు ఆరు లక్షణములుగల సదాచారమును బౌద్ధులు 'ఉపచారో' యందురు; అనగా ఆచరణయందలి శ్రద్ధ. ఈ యారు లక్షణములను పరమగురు చరణసన్నిధిలో చెప్పబడిన ఆరులక్షణములతో బోల్చిచూడవలెనని కోరెడు విద్యార్థులసౌకర్యముకొరకు 'అదృశ్యసహాయులు' అను గ్రంథములో నేను వానిగురించి వ్రాసినదానిని యిచట తిరిగి యుదాహరించెదను;

పాలీభాషలో వీని నేమందురనగా (1) శమో - శమము = మనస్సును సంపూర్ణముగా నిగ్రహించుటచే కలిగెడు శుద్ధి, మనశ్శాంతము. ఈ యోగ్యతను సంపాదించుట మిక్కిలి కష్టమైనను ముఖ్యావసరమైయున్నది; ఏలయన మనస్సు ఇచ్ఛకు లోబడి సంపూర్ణముగా దాని స్వాధీనములో లేనియెడల పరమగురువు కార్యనిర్వహణమునకది పరిపూర్ణమగు సాధనము కానేరదు.

(2) దమో - దమము = మాటలలోను క్రియలలోను పైరీతిగానే నిగ్రహము గలిగి సంశుద్ధినిబొంది యుండుట; శమము సిద్ధించినయెడల ఇది తప్పక సిద్ధించును.

(3) ఉపరతి = మూఢనమ్మకమును, అనగా, ఒక మతము విధించిన కర్మనుగాని సంస్కారమునుగాని, చేసి తీరవలెనను నమ్మకమును విసర్జించుట; దీనివలన భావస్వాతంత్ర్యమున్ను, విస్తృతమగు, ఉదారమగు సహనభావమున్ను సిద్ధించగలవు.

(4) తితిక్ష = ఓరిమి, అనగా, ఎట్టికర్మ ననుభవింపవలసివచ్చినను సంతోషముతో అనుభవింపగల సంసిద్ధత, ఎప్పుడైనను అవసరమైనయెడల నైహికమగు సమస్తమును త్యాగముచేయగల సంసిద్ధత, మరియు ఎవరెట్టి యపకారము చేసినను తనకర్మానుభవమునకు వారు నిమిత్తమాత్రులని గ్రహించి వారి యెడల లేశమైనను ద్వేషభావము లేకుండుట.

(5) సమాధానము=ఏకాగ్రత; అనగా ఎట్టిప్రేరేపణముకలిగినను తన మార్గము నుండి చలింపజాలని ఏకాగ్రత గలిగియుండుట.

(6) శ్రద్ధ = విశ్వాసము; తనలోను, తనపరమగురువులోను విశ్వాసము: పరమగురువు సమర్థతగల ఆచార్యుడనియు, తనలో ఎట్టిలోపములున్నను తన శక్తుల గురించి ఎంతసంశయ మున్నను తనలో ఈశ్వరాంశ యున్నదనియు, దానిని జ్యోతిగా ప్రజ్వలింపజేసినయెడల పరమగురువువలెనే తానుగూడ ఎప్పటికైన కాగలననియు విశ్వాసము.

హిందువుల సంప్రదాయము ప్రకారము నాల్గవ యోగ్యతను "ముముక్షుత్వము" అని చెప్పిరి. అనగా, జననమరణములతోగూడిన సంసార చక్రమునుండి మోక్షమునకై తీవ్రమగు ఆకాంక్ష: బౌద్ధులు దానిని 'అనులోమ' అందురు.

దానికి పారంపర్యమని అర్థము. పై మూడింటినుండి నాల్గవది సహజముగా అనుసరించి తీసునని అభిప్రాయము.

పైనచెప్పబడిన యోగ్యతలన్నియు 'పరమగురుచరణసన్నిధి' లో చెప్పబడిన వాని కనుగుణ్యముగానున్నట్లు స్పష్టపడగలదు. అవికూడ యోగాభ్యాసము జేయ నెంచెడు ముముక్షువులకొరకు శ్రీ శంకరాచార్యులువారును, వారి అనుచరులును వ్రాసినట్లు చెప్పెడు గ్రంథములన్నిటిలో సాధన చతుష్టయ మనబడు సాధనసంపత్తితో సరిగా సరిపోవునని తెలియగలదు. భారతదేశములో చిరకాలమునుండి వాడుకలో నున్న యోగమను పదమునకు సంధానము, లేక, ఐక్యము అని యర్థము. దానివలన సాధారణముగా ఈశ్వరునితో ఐక్యము అని యర్థము చేసికొనుటచే, అది నిజముగా నైక్యమే అయియున్నది. కాని భారతదేశములోని వివిధములగు యోగదర్శనములలో 'యోగ' శబ్దము 'ఐక్యము' అను బహుదూరమునున్న గమ్యస్థానమునకే గాక, ఆగమ్యస్థానమును జేరుటకై నియమింపబడిన శిక్షణపద్ధతులకుకూడ నుపయోగించుట కలదు. కనుక, యోగమనగా ధ్యానమని కొందరు చెప్పుదురు. చాలవరకు అన్ని విధానములలోను ధ్యానము మిక్కిలి ముఖ్యమగు అంగముగా గనబడును.

అయినను, యోగమునకు ధ్యానమొక్కటియే సాధనమనిగాని, అదియే ప్రధానమగు సాధనమనిగాని యనుకొనకూడదు. ఏలయన, ప్రత్యేకసాధనములు, పద్ధతులు గల వివిధములగు పెక్కు సిద్ధాంతములు ఇప్పటికిని గలవు. "రాజయోగము" * అను పుస్తకములో ప్రొఫెసరు ఎర్నెస్టువుడ్ గారు ఏడు ప్రధాన యోగదర్శనముల నుదాహరించిరి. అవన్నియు సప్తరేఖలలో నొక్కొకదాని కెట్లుసరిపోవునో ఆవిషయ మును, అవన్నియు నొకదానికొకటి సంబంధములేని పోటీపద్ధతులు కావనియును, అన్నిటిని సమన్వయము చేయవచ్చుననియును, ఆయన ఆపుస్తకములో విశదపరచిరి. ప్రతిగొప్ప ఆచార్యుడును ఒక్కొక్క తరగతి జీవాత్మకు తగియున్నట్లు ఒక విధానమును ప్రతిపాదించెను. ఈవిషయము భారతీయులకందరకు లెస్సగా తెలియును. అందుచే వారెల్లప్పుడును, ఎవరి స్వభావము కనుగుణ్యమగు పద్ధతిని వారవలంబించుట యుక్తమని అంగీకరించి, వారి అభిప్రాయములలో ధారాళమును, సహనమును, జూపింతురు.

* Raja Yoga — The Occult Training of the Hindus.

మన పరమగురువుల బోధలలోనున్న లక్షణమువంటి లక్షణములు కొన్ని భారతీయుల యోగదర్శనములలో ప్రతిదానిలోను గలవని ఈగ్రంథమువలన తెలియగలదు. అభ్యర్థి నిజమార్గమున బ్రవేశించకపూర్వము ఉత్తమ నైతిక సంప్రాప్తితోగూడిన ప్రాథమికశిక్షణమును బొందుట యెల్లప్పుడును అవసరమే.మార్గద్వారమును చేరినతోడనే యొక గురువు నాశ్రయించుట అవసరమని యెల్లప్పుడును చెప్పుచుందురు. ఆగ్రంథములో యోగశాస్త్రము లన్నిటిలోను మిక్కిలి ప్రాచీనమయిన పతంజలి యోగశాస్త్రమును మొదట విమర్శించిరి. దానిలో పదిశాసనములుగలవు. పరులకు హానిచేయుట, అనృతము, స్తేనము, కామాతురము, అత్యాశ, అను మొదటి అయిదును నిషేధములు; శౌచము, సంతుష్టి, తపస్సు లేక కృషి, అధ్యయనము, భక్తి, అను మిగతా అయిదును,ఆవశ్యకప్రాప్యములు.

ప్రారంభదశలో పొందెడు శిక్షలో మూడు ఆవశ్యకములు: (1) తపస్సు, లేక, కృషి; (2) స్వాధ్యాయము, అనగా, శాస్త్రముల సహాయముచే స్వస్వభావమును పరిశీలనచేసికొనుట; (3) ఈశ్వరప్రణిధానము, లేక, నిరంతరదైవభక్తి. ఈమూడింటిని ఆయన (ఎర్నెస్టువుడ్ గారు) వరుసగా పట్టుంపత్తి (అనేక ప్రయత్నములు చేయుటలో ఇచ్ఛాశక్తిని యుపయోగింపవలసియుండు సదాచారము), వివేకము (సాధకుని బాహ్యాభ్యంతరములలో సత్యాసత్యములను గ్రహింపగలుగుట) వైరాగ్యము లేక నిష్కామము (రాగములను భక్తిచేతనే యుత్తమరీతిని అతిక్రమింపగలుగుట) అనుయోగ్యతలతో పోల్చెను. ఈతొలిలక్షణములను వృద్ధిజేసికొన్న తరువాత, ముముక్షువు తన ఇచ్ఛాశక్తి నుపయోగించి తన స్థూల, ప్రాణమయ, కామమయ, మనోమయ, కోశములలో ప్రతిభాగమును నిగ్రహించి తన యిచ్చవచ్చిన రీతి నుపయోగింపగలశక్తిని సంపాదించును; ఈ కారణము చేతనే ఈ దర్శనమును 'ఇచ్ఛ' ప్రధానలక్షణముగా గల ప్రథమ రేఖకు చెందినదని ఆగ్రంథములో వ్రాసిరి.

భగవద్గీతలో శ్రీకృష్ణుడు ప్రతిపాదించిన యోగశాస్త్రము రెండవది. ఆగీతలను మన అధ్యక్షులు బహు నిర్దుష్టముగాను, బహురమ్యముగాను అనువదించిరి. దానినే సర్. ఎడ్విన్. ఆర్నాల్డుగారు స్వేచ్ఛానువాదము చేసి రచించిరి. ఈ గీత అన్నిటికంటెను ఎక్కువగా ప్రేమ సిద్ధాంతము నుపదేశించును. శిష్యుడగు అర్జునుడు మానవజాతిని విశేషముగా ప్రేమించెను; ఈశాస్త్రము ప్రకారము

కురుక్షేత్రములో యుద్ధము ప్రారంభముగాక ముందు ఆమహాయోధుడు తన శత్రువుల నందరను ప్రేమించిన వాడగుటచే వారిని హత్యచేయలేక విషాదముతో నిండినవాడై రథముమీద కూలిపోయెను. పరమగురువగు శ్రీకృష్ణుడు విశేషముగా వేదాంతమును బోధచేయుటలో జీవితములో మిక్కిలి యుత్కృష్టమయినది మానవసేవయనియు, ఈశ్వరుడు తన కేమియు లాభము లేకపోయినను లోకకళ్యాణార్థమై జీవచక్రము నెల్లప్పుడు త్రిప్పుచుండును గనుక ఉత్తమ సేవకుడనియును, మనుజుడు మానవజాతి శ్రేయస్సు నర్థించినవాడై ఈశ్వరునివలెనే తానుగూడ కర్మచేయుచుండవలెననియు ప్రబోధముచేసెను. మరియు, స్వార్థము నపేక్షింపక తమ ధర్మమును తాము నిర్వహించుచు ఈమార్గము ననుసరించి అనేకమంది మహానుభావులు పరిపాకమును బొందిరని చెప్పిరి. ఎడతెగని ప్రేమ ద్వితీయ రేఖయొక్క లక్షణము. కర్మయోగములో మానవులను సమస్తభూతములను కర్మ చేయుచు ప్రేమింపవలెననియు, భక్తియోగములో భగవంతుని ప్రేమింపవలెననియు, గీతాశాస్త్రములో ప్రేమతత్త్వము చక్కగా ప్రతిపాదింపబడినది.

గీతలో తిరిగి మూడు ప్రాథమిక సాధనములుకూడ చెప్పబడినవి. ప్రేమయుతమగు జ్ఞానమును బొందవలెననిన సాధకుడు ప్రణిపాతము, పరిప్రశ్నము, సేవ, అను మూడుమార్గముల నవలంబించవలెను. మొదటిదానిలో సమ్యక్ రాగము, రెండవదానిలో సమ్యగాలోచనము సమ్యక్ గ్రహణశక్తి, మూడవదానిలో లౌకికజీవితములో సమ్యగేచ్ఛ చేరియుండును. ఈమూడును ఇదివరకు చెప్పిన తపసాది మూడు యోగ్యతలకు సరిపోవును. ఇక్కడ హృదయరంజకమగు విశేష మేమనగా, ఈప్రణిపాతాది మూడు సాధనములద్వారా ముముక్షువు యోగ్యత సంపాదించినప్పుడు తత్త్వదర్శినులగు జ్ఞానులు జ్ఞానోపదేశమును చేయుదురని శ్రీకృష్ణుడు సెలవిచ్చెను. అనగా, వానికి పరమగురువులు సాక్షాత్కారమగుదురని అర్థము.

మూడవ దర్శనము శ్రీ శంకరాచార్యులవారిది. పైనచెప్పిన ప్రకారము, ఆయన వివేకముతో ప్రారంభించి ఇదివరకుచెప్పినవరుసనే నాలుగు సాధనములను ప్రతిపాదించిరి: మానవధర్మముగురించి అనగా, మానవులు చేయవలసిన సేవగూర్చియు, ఏవిధముగా ఆసేవ మానవపరిణామముతోను ప్రపంచవ్యవస్థతోను అనుకూలించునో దానినిగూర్చియు తెలిసికొనగోరెడు స్వభావముగల మానవుల నిమిత్తమై ఆశాస్త్రము నుద్దేశింపబడినది. ఇచట గమనింపవలసిన విషయ మేమనగా, మన

పరమగురువు కూట్‌హూమిమహర్షిగారు ఈ యోగ్యతలను ప్రతిపాదించుటలో అన్నిటిని ప్రేమదృష్ట్యా నూతనవిధముగా ప్రదర్శించిరి.

హఠయోగ శాస్త్రము నాల్గవది. సరిగా గ్రహించినయెడల దాని సారము నిట్లు చెప్పవచ్చును: స్థూలశరీరమును కఠినమగు శిక్షణలోనుంచి, పరిపూర్ణముగా దానిని శుద్ధిచేయుచు, సంపూర్ణమగు ఆరోగ్యముతో మంచిసాగసుగను సక్రమముగను బనిచేయునట్లు చేయగలిగినయెడల, జీవాత్మ ఈజన్మలో తనకు సాధ్యమైనంత వికాస మును బొందుటకై దాని నుపయోగింపగలుగును. అందు నిమిత్తమై ప్రాణాయా మము మొదలగు అనేక అభ్యాసములు నియమింపబడినవి; ఇవి శరీరములోని నాడీ వ్యూహముపైన, ప్రాణమయ కోశముపైన, వ్యాయామమువలన వృద్ధిబొందెడు స్థూల శరీరభాగములపైన పనిచేయును. కాని, దురదృష్టవశమున, ఈ హఠయోగవిషయమై మనము చదివెడు సామాన్యగ్రంథములలో వ్రాయబడినదంతయు సరియైనదికాదు. మూఢనమ్మకములచే అసలుబోధ చాలవరకు వికృతము గావింపబడినది. ఆగ్రంథ ములలో శరీరమును బాధించి, శుష్కింపజేసి లోబర్చుకొనుటకు అనేక హేయోపా యములను వివరించిరి. యూరపుదేశములోకూడ కొన్ని శతాబ్దములకిందట ఆయుపాయములే వాడుకలోనుండెను. కాని, హఠయోగమునకు సంబంధించిన సంస్కృతగ్రంథములన్నిటిలోను శరీరమునకు సంబంధించిన అభ్యాసములన్నియు శరీర మునకు సంపూర్ణమగు ఆరోగ్యమును సామర్థ్యమును సమకూర్చుటకే ఉద్దేశింపబడిన వని స్పష్టముగా వ్రాయబడియున్నది.

లయయోగము అయిదవది. కుండలినీశక్తిద్వారా మానవుని ఉన్నతశక్తు లను మేల్కొల్పుటయే దాని లక్ష్యము. ఈశక్తిని 'సర్పశక్తి' యందురు. సాధా రణముగా, ఇది మనుష్యుని వెన్నెముక మూలమందు నిద్రించుచున్నట్లు గూఢముగా నుండును. ఈశక్తి మేల్కొన్నప్పుడు దానిని శక్తికేంద్రము లనదగు మనుష్యునిలోని యేడుచక్రములగుండా ఊర్ధ్వముఖముగా నడిపింపవలెను.ఈ చక్రములగురించియు, ఈశక్తినిగురించియు ఇదివరలో కొంతవరకు 'అంతరంగికజీవితము' 'వస్తువుల గుప్త భాగము' * అను గ్రంథములలో వ్రాసియుంటిని. ఈ విషయములనన్నిటిని ప్రోగు చేసి కొన్నింటిని అదనముగాచేర్చి, 'చక్రములు' అను గ్రంథరూపమున ప్రచు రించితిని. అందులో సప్తచక్రములయొక్క పెద్ద చిత్రపటములు రంగులతో ముద్రిం

* The Inner Life : The Hidden Side of Things

పబడినవి. వేర్వేరు ప్రాణశక్తు లెట్లు ఊర్ధ్వముఖముగా ప్రవహించునో, ఆమార్గములు కూడ జూపబడినవి. పాశ్చాత్య సాధకులుగాని, మరియెవరైననుగాని, అభిజ్ఞుడగు గురువు దగ్గరనేయుండి, సలహానిచ్చి, జాగ్రతగా నడిపింపనిదే హఠయోగ పద్ధతులను గాని, లయయోగపద్ధతులనుగాని యెన్నడును అభ్యసింపరాదు. సాధారణముగా ఆపద్ధతులు ప్రాచ్యదేశములలో జన్మించినవారికి, ప్రాచ్యదేశీయులవలె నిరాడంబర ముగా ప్రశాంతముగా జీవింపగలిగినవారికి మాత్రమే తగియుండును. ఇతరుల కవి సార్థకముగానుండకపోవుటయేగాక, నిశ్చయముగా ఆరోగ్యమునకును ప్రాణము నకునుగూడ భంగకరముగనుండగలవు. ఈపద్ధతుల ననుసరించినవారిలో చాలమంది, ముఖ్యముగా అమెరికాదేశస్థులు వ్యాధిగ్రస్థులగుటయు, పిచ్చివారగుటయు నేనెరు గుదును.

ఆరవది భక్తిమార్గము. ఇదికూడ చాలవరకు భగవద్గీతలో నుపదేశింప బడినది. నిజముగా ప్రతిమతములోను గొప్పభక్తులుగలరు. వారు దేవునియందు పరి పూర్ణవిశ్వాసముంచి, స్వార్థమునకై ఏమియు వేడకుండ, దేవునివలన ప్రపంచము సృష్టింపబడినందున దేవుడే దానికి స్వామియనియును ఏమిజరుగుచున్నను ఆయనకు తెలియును గనుక అంతయు బాగుగనుండితీరవలెననియును నమ్మి సంతుష్టిబొందుచు, దేవుని కేవిధముగానైనను సేవజేయు నవకాశము దొరకినచో గొప్పభాగ్యము లభించినదని మహదానందముతో పరవశులగుచు శోభిల్లుచుందురు.

## మంత్రములు

ఆఖరుది, ఏడవదియగు మార్గమును భారతదేశములో మంత్రయోగమందురు. మిగతా శాస్త్రములకంటె దీని నిచట నెక్కువగా వివరించి దానిలోగల తత్త్వమును విశదపరచుట మంచిది. ఏలయన, మంత్రయోగమను నొక ప్రధానరూపమున వ్యక్తమగుచున్న జీవరేఖ ఇప్పుడు ప్రపంచములో ప్రబలమగుచు, ప్రాచ్య పాశ్చాత్యులందరిజీవితములలో ఇతోధికమగు గొప్ప పాత్రను వహించుచున్నది. ఈయోగ మార్గమునకు రెండు గొప్ప ఉదాహరణముల నీయవచ్చును. ఒకటి లిబరల్ కేథ లిక్ చర్చి, రెండవది కో-మేసన్రీ. ఈరెండింటియందు మన పరమగురువులు విశే షాభిమానమును జూపించుచున్నారు. వాస్తవముగా వారా సంస్థలను మానవాభ్యు దయమునకున్ను, వానిలో శ్రద్ధతో పాల్గొను సభ్యులు వేగముగా మార్గమున పురో వృద్ధినిబడయుటకున్ను వినియోగించుచున్నారు.

మంత్రమను శబ్దము సంస్కృతపదము. ఇంగ్లీషులో 'చారమ్ (Charm) స్పెల్ (Spell)' అను పదములకు సమానార్థకము. భారతదేశములో శుభకార్యములకు వాడు మంత్రములన్నియు వేదములలో శ్లోకములై యున్నవి; గుప్తజ్ఞానమును అనుభవమురీత్యా తెలిసికొన్న ఫలితముగా సాంప్రదాయానుసారముగ వచ్చుచున్న స్వరపద్ధతులపరిహారము నిర్దిష్టమగు ఉద్దేశముతో ఆమంత్రముల నుచ్చరింతురు. తంత్రశాస్త్రము ననుసరించువారు ఉపయోగించెడు మంత్రములుగూడ చాల గలవు; కాని వానిని కీడు మేళ్లకు సమానముగా నుపయోగింతురు; కనుక భారతదేశములో యుక్తాయుక్తములయిన రెండురకముల మంత్రములుగూడ అనేకముగా ప్రచారములోనున్నవి. మన పాశ్చాత్యదృష్ట్యా వానిని విభజనచేయవలెనన్న, ముఖ్యముగా అయిదువిధములగు మంత్రములు గలవని చెప్పవచ్చును:

1. కేవలము నమ్మకమువల్ల పనిచేయునవి.
2. సాంగత్యమువలన పనిచేయునవి.
3. సమ్మతి, లేక, ఒడంబడికబట్టి పనిచేయునవి.
4. అర్థమువల్లనే పనిచేయునవి.
5. అర్థముతో సంబంధములేకుండా ధ్వనివల్లనే పనిచేయునవి.

## 1. నమ్మకమువలనకలుగు ఫలితము

ఎవరైతే మంత్రముల నుచ్చరింతురో వారికి ఫలితము గలిగి తీరునని దృఢమగు నమ్మకముండుటచేతను, ఎవరిపైనైతే ఆమంత్రములు ప్రయోగింపబడుచున్నవో వారికికూడ అట్టి నమ్మకముండుటచేతను, మొదటితరగతి మంత్రములవలన ఫలితము కలుగుచున్నది. ఇద్దరకు కూడ దృఢమగు నమ్మకమున్నయెడల, ఏదోయొక గాయముగాని జబ్బుగాని కుదిరి తీరవలెనని యిరువురును నమ్మినయెడల, ఆఫలితము సంభవించితీరును; కొన్ని సందర్భములలో ఒక్కరికి నమ్మకమున్నను ఫలితము కలుగుచుండును. ఇంగ్లాండులోను, అన్ని దేశములలోని వ్యవసాయదార్లలోను అట్టి మంత్రములనేకములు ఉపయోగములోనున్నవి. సాధారణముగా, ఒకవిధమున మతముతో సంబంధించిన చిన్నచిన్న శబ్దములుండును. ఇవి పెద్దకాలమునుండి సాంప్రదాయకముగా వచ్చును; వీనివలన నిశ్చయమగు ఫలితములు కలుగునని నమ్మకముగలదు. అవి తరుచుగా కేవలము నిరర్థకములుగా గనబడును; మాటలు అసంగతముగా

నుండును. బహుశః అవి ఇంగ్లీషు, లేక, లాటిన్, లేక, ఫ్రెంచిభాషలలోని కొన్ని శబ్దములయొక్క సంకరరూపములు కావచ్చును. అవి ధ్వనిద్వారా పనిచేయవు, ఏలయన నిజమగు మంత్రోచ్చారణలో తప్పనిసరిగనుండవలసినధ్వని గాంభీర్యమే మరియు వానిలో గనబడదు; కాని కొన్ని సందర్భములలో రోగులయెడల వానిని ప్రయోగముచేసినప్పుడు తప్పక సార్థకములగుచున్నవి. ఆ పురాతన మంత్రమునందు గల నమ్మకమే దానికి కారణమైయుండవలెను.

ప్రాచ్యదేశములలోని మంత్రములు చాలవరకు నమ్మకముచేతనే పనిచేయుచున్నట్లు కనబడును. నాస్వానుభవమునుబట్టి అందుకొక యుదాహరణము చెప్పగలను. నేను సింహళద్వీపమధ్యభాగములో పనిచేయుచుండగా నొకసారి యొక కుక్క నాచేతిని గట్టిగా కఱచెను; రక్తము విశేషముగా కారుచుండెను. ఆదారినే బోవుచున్న ఒక వ్యవసాయదారు వెంటనే నావద్దకువచ్చి ప్రక్కనేయున్న ఒక పొదయొక్క ఆకులనుగోసి, వాని పసరును గాయముమీదపోసి యేవో నాకర్థముకాని మాటలను గొణిగెను. వెంటనే రక్తముకారుట ఆగిపోయెను. కనుక ఆమంత్రము నిశ్చయముగా పనిచేసెను; కాని ఆమనిషి యేమిచేయుచుండెనో నాకు తెలియదు గనుక, అచట నానమ్మకమేమియు లేదు. ప్రాచ్యదేశసంప్రదాయము ప్రకారము అట్టి సేవకు ఎవ్వరును సొమ్ముదీసికొనరు, అతనిమాటలను నేను వినగలిగినంతవరకు అవి అసంగతములుగానున్నవని చెప్పవలెను; ఒకవేళ సంగతములుగానున్నను అవి సింహళీసు భాషగాని సంస్కృతభాషగాని కాదు. సింహళదేశములో పాముకాటుకు కూడ అట్టి మంత్రములు గలవని వింటిని. అవికూడ నమ్మకమువలననే పనిచేయునని నా అభిప్రాయము; ఏదో మంచి తప్పకజరుగగలదని అందరు నమ్ముదురు, అందుచేతనే జరిగితీరును.

ఈపద్ధతిలోనే మరియొకమాదిరి గలదు. మాంత్రికుని యిచ్ఛాశక్తి చేతనే ఫలితము గలుగును. అతడొకమాటను పలుకుటగాని, చేతిని ఆడించుటగాని చేసినప్పుడు, ఒక ఫలితము కలిగితీరవలెనని సంపూర్ణమగు పట్టుదల వహించును; గనుక వెంటనే ఆప్రకారము జరుగును. కథియవారు రాజకుమారుడు హరిసింగ్‌జీరూప్‌సింగ్‌జీగారు తేలు కుట్టుటచే బాధపడుచున్నవాని బాధను ఒక్కక్షణములో కుదుర్చుట నేను జూచితిని. ఒకడు భయముచే రక్తహీనుడై, నఖము మూర్ఛపోయిన వానివలెనుండి, దారుణమగు బాధచే మూల్గుచు, ఇద్దరు మనుష్యులు పట్టుకొన్నను

సరిగా కదలలేని స్థితిలోనుండెను. ఆరాజకుమారుడు గాయముపై పంచకోణములు గల తారయొక్క చిహ్నమునుగీసి యొక సంస్కృత శబ్దమును తీవ్రముగా బల్కెను. ఆక్షణమందే ఆబాధితుడు నేలమీదనుండి యూగుచు లేచి బాధ పూర్తిగ పోయిన దనియు, సుఖముగానున్నదనియు చెప్పి రాజకుమారునికి కృతజ్ఞతతో సాష్టాంగ నమస్కారము చేసెను.

## 2. భావ సంయోగము

సంయోగముచే పనిచేసెడు కొన్ని మంత్రములు గలవు. కొన్ని వాక్యరూపములు నిర్దిష్టములగు భావములను గలిగించి మన భావములను, రాగములను పూర్తిగా మార్చివేయును. దీనికి ఉదాహరణము జాతీయగీతము (ఆంగ్లేయులది). దాని రాగము సరళముగా, బలముగానుండును, కాని అత్యంత శ్రావ్యమైనదికాదు. సాహిత్య దృష్ట్యా జూచినయెడల శబ్దములలో ప్రత్యేకప్రశస్తి యేమియులేదు. కేవల మొకగీతముగానే చూచినయెడల, అది మనలనంతగా ఆకర్షింపక, సామాన్యమగు పాటవలెనే దోచవచ్చును. కాని, రాజుయెడలను, ఆయనద్వారా ఆయన ఎవరి ప్రతినిధియై యున్నాడో ఆ ఆధ్యాత్మికప్రభువు (లోకప్రభువు) నెడలను మనకుగల భక్తియే ఆసంబంధమును గలిగించినది. ఈభావసంయోగ మెంత ప్రబలమైనదనగా, ఆగీతము మన చెవినిబడినవెంటనే మనము దృఢముగా నిలబడి భూపాలుని యెడల భక్తిని ప్రేమను ప్రవహింపజేయుదుము. మనక్రియకు జవాబు వెంటనే వచ్చును. ఏలయన, ఆధ్యాత్మికధర్మము ప్రకారము అట్లు స్వార్థరహితమైనశక్తి ప్రసారము జరిగినప్పుడు దాని కనుగుణ్యముగా శక్తి పైనుండి క్రిందకు దిగితీరవలెను. ఈజవాబు ప్రథమరేఖకు సంబంధించిన కొందరు దేవతలద్వారావచ్చును; జాతీయగీత మెప్పుడు పాడబడినను వారాకర్షింపబడుదురు; ఎవరిరాజభక్తి పురికొల్పబడినదో వారిపైనను, వారిద్వారాను, ఆ దేవతలు తమ ఆశీర్వాదమును బంపెదరు.

అంతకంటె చాలతక్కువ శక్తిమంతమైనదైనను, అదేమాదిరి మంత్రశక్తికి మరియొకఉదాహరణమేమనగా, **“The Voice that breathed O'er Eden”** అను గీతము. దానిని విన్నప్పుడు వివాహమహోత్సవమునుగూర్చియు, అట్టిసందర్భములో నుండెడు ఉత్సాహము, ఆనందముగూర్చియు ప్రబలముగా తలంచకపోవుట అసంభవము. అనేకరకములగు క్రిస్మసుగీతములు, పాటలు మన మనస్సులలో మిక్కిలి నిర్దిష్ట

ముగా భావప్రవాహములను ప్రవహింపజేయును. మధ్యయుగములలోని యుద్ధములల్లో మిక్కిలి ముఖ్యమగు పాత్రవహించిన రణారావములు ఈరీతి మంత్రములేయని చెప్పవచ్చును. వెంటనే తుల్యమగు భావములను పురికొల్పి, మరియేసహజగుణ విశేషము లేకపోయినను, వాని భావసంయోగములచేతనే ఫలితముల నిచ్చెడు శబ్ద సంచయములు అనేకములుగలవు.

## 3. దేవతలసహకారము

సమ్మతి, లేక, ఒడంబడికనుబట్టి పనిచేయు మంత్రములు కొన్నిగలవు. అనేకమతములలో ఈతరగతికిచెందిన ఉదాహరణములు కనిపించుచున్నవి. మసీదు స్తంభముయొక్క శిఖరమునుండి మహమ్మదీయులు వేయుకేక రెండవతరగతి లక్షణములనుగూడ గలిగియున్నను, ఈతరగతికి చెందినదైయున్నది. " దేవుడుతప్ప దేవుడు లేడు ", లేక, "దేవుడుతప్ప మరేమియులేదు,"(ఇది సనాతనమగు సత్యము), "మహమ్మదుదేవుని ప్రవక్త", ఈకేకలు వేయునప్పుడు కలిగెడు ఫలితము చాల చిత్రముగానుండును. ఆఫలితము కేవలము వాని అర్థమునుగూర్చి కలుగు భావనమాత్రమే కాదు; ఆకేకలను వినువారిలో నుద్దీపితమగు విశ్వాసము మహమ్మదీయ మతమునకు స్వాభావికలక్షణమైనట్టియు, ఒకవిధముగా బహురమ్యముగానుండునట్టియు మూఢభక్తి వెంటనే ప్రభవించును. ఇది భావసంయోగమునకు ఉదాహరణము కావచ్చును; కాని, యీకేకలువలన కొందరు దేవతలాహ్వానింపబడుచున్నారు; ఆదేవతల ప్రతిక్రియయే శ్రోతల హృదయములలోని యుత్సాహమునకు కారణము.

ఈమూడవతరగతి మంత్రమునకు శ్రేష్ఠమైన ఉదాహరణములు బహుశః క్రైస్తవమతములో దొరకవచ్చునని తలచెదను. ఛర్చి సంస్కారముల నెరింగిన వారందరకు ఈవిషయము తెలియగలదు. అన్నిటిలోను మిక్కిలి యుత్కృష్టమైనది " ఇది నాశరీరము " అను వాక్యము; ఏలయన ఎప్పుడా పలుకును చర్చించినను, నియమితమతగురువు ఎవరైనను, ఏభాషలోనైనను ఆమాటల నుచ్చరించినను, ఆయన వెంటనే జవాబు నిచ్చెదనని క్రీస్తుప్రభువు స్వయముగా తమఛర్చితో నొక యొడంబడికను జేసికొనెను. కాని, యీశక్తి కొన్ని షరతులకు లోబడియున్నది; క్రీస్తుప్రభువుచే స్వయముగా నిర్ణయింపబడిన " **Receive Ye, The Holy Ghost** " " మీరిప్పుడు పరిశుద్ధాత్మను స్వీకరించుడు " అను మరియొక మంత్రముచే నిమంత్రితుడైన వానికే క్రీస్తుప్రభువు నాహ్వానింపగల శక్తికలుగగలదు.

క్రీస్తు తన శిష్యులను విడిచిపోయినప్పుడు, ఏశక్తితోనైతే యీమాటలను వారికి ప్రసాదించెనో, ఆశక్తి ఆమాటలతోపాటు ఎడతెగకుండ ఇరువది శతాబ్దముల నుండియు పరంపరగావచ్చుచున్నది. దానినే గురుపారంపర్యమందురు. ఎవరైన తమ గురువు ఆపారంపర్యమందు నియోజితుడైనయెడల, అతడామాటలను "ఇదినాశరీరము" అనుమాటలతో నుద్దేశపూర్వకముగా పలికినచో వెంటనే అక్కడనున్న ప్రసాదము (రొట్టె) లో నొక యద్భుతమగుమార్పు కలుగును; బాహ్యామునకా రొట్టె యాకారమట్లే యున్నను,దాని యున్నతమగు సూక్ష్మలోక ప్రతిరూపములలో క్రీస్తుయొక్క జీవము ప్రవేశించును; అప్పుడు పాలస్తీనాలో ఆయన యున్నకాలములో ధరించిన శరీరమువలెనే వాస్తవముగా ఈప్రసాదముకూడ ఆయనయొక్క యుపాధియగును.

"ఇది నాశరీరము" అను మంత్రము సార్థకముగా పనిచేయుననుటలో సందేహామేమియులేదు; చూచుటకు కండ్లున్నచో దానిమహిమ నీనాడుగూడ జూడవచ్చును. టెన్నిసను కవి రచించిన "The Idylls of the King" అను గీతములలో "గాలహాద్" అను నతడు "యూకరిస్టు" ఉత్సవమును వర్ణించుచు "పసిబిడ్డ ముఖమువలె ప్రభాసితమగు ఆవదనము రొట్టెలోపడి నలిగి పొడియైపోవుట నేను గంటిని" అని చెప్పినట్లున్నది. దివ్యదృష్టితో చూడగలవారెవరైనను ఈరోజున నైనను ఆపవిత్ర నైవేద్యమును సమర్పించిన సమయమందు జాగ్రతగా కనిపెట్టి చూచినయెడల, రొట్టెయొక్క సూక్ష్మలోకప్రతిరూపము ఆపవిత్ర మంత్రము నుచ్చరించినవెంటనే సజీవమగు వెలుగువలె మెఱసిపోవుట చూడగలరు. క్రైస్తవ మతమునకు సంబంధించిన అన్నిశాఖల ఛర్చీలయందును క్రీస్తు నిర్ణయించిన ప్రకారము, పవిత్రమగు యూకరిస్టు యుత్సవమును జరిపినప్పుడు, వారి సంస్కారములో సంస్థాపన వాక్యములను (Words of Institution)వాడుకచేయుదురు; అన్నిటిలోను అద్భుతమగు ఆఫలితము కనబడును. ఛర్చి శాఖలన్నియు తమ సంస్కారములో సహాయపడుటకై దేవతాగణములనుగూడ నాహ్వానింతురు; అట్లాహ్వానముచేయుటలో నొక ప్రత్యేక శబ్దసంచయము నుపయోగించుటయేగాక చిరకాలమునుండియు సాంప్రదాయకముగా వచ్చుచున్న ఒకవిధమగు సంగీతమునుగూడ వాడుకచేయుదురు. ఒక ప్రత్యేక దేవతాగణము ఆశబ్దములను, ధ్వనులను, ఆహ్వానముగా గ్రహించి వెంటనే ఆసంస్కారమునకు వచ్చి వారుకూడ దానిలో పాల్గొందురు.

(ఈమంత్రముయొక్క అత్యద్భుత ప్రభావమును పూర్తిగా తెలిసికొనవలెనని
C. W. Leadbeater గారి The Science of the Sacraments అను గ్రంథమును
చూడవలెను.

## 4. పునశ్చరణముయొక్క ఫలితము

పునశ్చరణము చేయబడు మాటల అర్థముయొక్క మహిమవలన ఫలితము కనిపించెడు మంత్రములగూర్చి విచారింతము. ఒక డొకమంత్రమును దృఢమగు నమ్మకముతో పునశ్చరణము చేయును; అందుచే ఆమంత్రార్థము అతని మెదడుపైన యున్ను, మానసికశరీరముపైనయున్ను ప్రబలమగు ధాటి చేయుచుండును; అతడు ఏదైన యోగవిషయమగు గుప్తకార్యమును జేయుచున్న యెడల అట్టి పునశ్చరణము వలన అతని యిచ్ఛాశక్తి చాలా ప్రబలమగును. అట్టి మంత్రములను అనేకవిధము లుగా నుపయోగింపవచ్చును. ఆమనిషికి సంబంధించినంతవరకు రెండు ఫలములు కలుగును; అతడు చేయ యత్నించుచున్న కార్యమును చేయుటలో అతని యిచ్ఛ బలపడును, లేదా, ఆకార్యము జరిగితీరునను దృఢనమ్మకము అతని హృదయము నందు నాటిపోవును. హిందువులకు నియమింపబడిన సంధ్యావందనాది ధ్యానముల లోను, కొన్ని గుప్తవిద్యా సంప్రదాయములలోను ఇటువంటి మంత్రముల నుప యోగింతురు. ప్రతిదినము నియమితకాలములయందు కొన్నిమంత్రములను పునశ్చ రణముచేసినయెడల ఆమంత్రములలోని భావము గట్టిగా మనస్సున నాటిపోవును.

" భ్రాజిష్ణుతితరామర్కాదవదాత తరోహిమాత్
ఆకాశవ్యాణుతరోహ్యాద్ద ఆత్మాలవా మేవసః॥ "

" ఆత్మ సూర్యునికంటె నెక్కువ ప్రకాశముగను, మంచుకంటె నెక్కువ పరి శుద్ధముగను, ఆకాశముకంటె నెక్కువ సూక్ష్మముగను నుండును. ఆయాత్మ నాలో హృదయస్థమై యున్నది. నేను ఆయాత్మను, ఆ ఆత్మయు నేనే "

ఈమంత్రము బహుశ్రేష్ఠమైన యుదాహరణము. దీని నుచ్చరించినప్పుడెంత మహిమగలదియో, మనస్సులో తలంచినప్పుడుగూడ అంత మహిమగలది.

## ఆశీర్వాదములు

ఛర్చిలోను, దేవాలయములలోను, ఫ్రీమేసనీలోను, పరమగురువుల శిష్యుల చేతను ఇయ్యబడు ఆశీర్వాదములన్నియు ఈతరగతికి చెందినవే. కాని. ఒక

మనిషి స్వయముగా తాను ఇచ్చెడు ఆశీర్వాదములనియు, తన నొక ప్రతినిధిగా నుపయోగించి తనద్వారా ఒకయున్న తాధికారిక పురుషుడు పంపెడు ఆశీర్వాదములనియు ఆశీర్వాదములను రెండురకములుగా విభజింపవచ్చును. మొదటిది కేవలము ఒక వ్యక్తి త్రికరణశుద్ధిగా తెలిపెడు సదాశయము; దీనికి తండ్రి మరణించు సమయమునగాని, ప్రయాణ సమయమున, ముఖ్యముగా ఆపదలతో గూడిన ప్రయాణ సమయమునగాని తన బిడ్డలకు ఇచ్చు ఆశీస్సు ఇందుకు మంచి యుదాహరణము. జాకబు మానహీనమగు మోసముచేయుటచే కొన్ని చిక్కులు కలిగినను, మరణకాలమందు ఐజాక్ తనకుమాళ్ళు అయిన ఈసా, జాకబుగార్ల కిచ్చిన ఆశీర్వాదమొక చక్కనియుదాహరణము. బైబులు చదివినవారు ఈగాథను జ్ఞప్తికి తెచ్చుకొన్నయెడల, ఐజాక్ తన ఆశీర్వాదము సార్థకమైనదని సంపూర్ణ విశ్వాసముతో నుండెననియు, జాకబు తనపైనచేసిన మోసమును తెలిసికొన్న తరువాత తానదివరలో పలికిన ఆశీర్వాదమును త్రిప్పుకొనలేక పోయెననియు తెలిసికొందురు.

ఈ మాదిరి యాశీర్వాదమువలన ఫలమేమైన గలుగునా, కలిగినయెడల ఎట్లుకలుగును, అను ప్రశ్నవచ్చును. దీనికి ఒక్కటేజవాబు. ఏమనగా, ఆశీర్వాదములో ఎట్టిఆసక్తి, ఎట్టిఆత్మశక్తియుండునో దానిపైన ఫలితముకూడ ఆధారపడియుండును. ఆశీర్వాదమొక సంకల్పరూపమును నిర్మించును; ఆరూపము గ్రహీత నంటుకొనును; ఆ రూపముయొక్క పరిమాణము, బలము, నిలుకడ దాతయొక్క ఇచ్ఛాశక్తిపై నాధారపడియుండును. ఏదోలాంఛనముగా మాత్రమే యిచ్చినయెడల దానిలో రాగముగాని, యుద్దేశముగాని యేమియు లేనియెడల ఫలితముకూడ అటులనే బహు అల్పముగను, క్షణమాత్రముగను నుండును; అట్లుగాక నిండుహృదయముతో నిర్దిష్టమగు దృఢబుద్ధితో నిచ్చినయెడల దానిఫలితము గాఢముగా చాల కాలముండును.

నియమితుడగు నొకపూజారివంటి మతాధికారిద్వారా ఒక ఉన్నతాశయము నుండి ప్రవహించెడు శక్తిననుసరించి ఆయధికారియిచ్చెడు ఆశీస్సులు రెండవరకము. ఛర్చిలో ఆరాధనానంతరము పూజారి (లేక అర్చకుడు) ఇచ్చెడు ఆశీర్వాదములు దీనికి మంచియుదాహరణము. ఒక నియమితపదవికి తక్కువస్థానమందున్నవాడు ఈ యాశీర్వాదము నిచ్చుటకు వీలులేకపోవచ్చును; ఈ యాశీర్వాదము నిచ్చెడు అధికారము ప్రత్యేకముగా కొందరు పూజార్లకు, నియమింపబడిన గురువులకుమాత్రమే

(అర్చకత్వపు దీక్షనిచ్చుకాలమందు) ఇయ్యబడుటచేత ఇదికూడ మూడవతరగతి మంత్రములకు చెందునని చెప్పనచ్చును. ఈ తరగతిలో నిజముగా అర్చకుడు పైనుండి వచ్చెడుశక్తి ప్రసారమునకు కేవలమొక కాలువవలె మాత్రముండును. అతడు దురదృష్టవశమున లాంఛనప్రాయముగా ఇతరమంత్రములతోపాటు ఆశీర్వాచన వాక్యములనుగూడ నుచ్చరించినను, అతనిద్వారా ప్రవహించు ఆధ్యాత్మిక శక్తిలో మాత్రము భేదమేమియు నుండదు.

ఆశీర్వాదమందరిపైన సమానముగానే ప్రసరించును. కాని ఏ వ్యక్తికెంత బలము చేకూరునన్న విషయము ఆవ్యక్తియొక్క గ్రహణశక్తిపై నాధారపడియుండును. అతడు ప్రేమతోను భక్తితోను నిండియున్నయెడల గొప్పసహాయముగలిగి యుద్ధరింపబడును. ఏదో యితరవిషయముగురించి అశ్రద్ధగా యోచనచేయుచున్న యెడల నొక యున్నతమగు స్పందస్పర్శవలన గలిగెడులాభమును మాత్రమే పొందగలడు. అర్చనసమయమందు ఒక బిషప్, అనగా ఒక ప్రధానగురువు యున్నయెడల తప్పక అతడే యాశీర్వాదమునిచ్చును. కారణమేమనగా, ప్రధానగురువుగా అభిషిక్తుడైనప్పుడు అతని సూక్ష్మశరీరములు, లేక, తత్త్వములు, అర్చకుని శరీరములకంటె చాలా ఎక్కువగా వికసించియుండును; అందుచేత నా యున్నతమగు లోకములునుండి వచ్చుశక్తి అతనిద్వారా ప్రసరించును. ఫ్రీమేసనరీలోకూడా సభముగియునపుడు అభిషిక్తుడైన అధ్యక్షుడుగాని ఆచార్యుడుగాని ఆశీర్వాదము నిచ్చును గనుక అప్పుడు కూడ ఈ విధముగానే శక్తి ప్రసరించును.

పరమగురువుచే శిష్యుడుగా స్వీకరింపబడినవాడు ఆయన ప్రభావప్రసారమునకొక మార్గము, లేక, కాలువగా నేర్పడునని యిదివరలో తెలిసికొంటిమి; ఆప్రభావమతనిద్వారా యెల్లప్పుడు ప్రవహించుచుండునుగాన, అతడుదానిశక్తిని తనయిష్టమువచ్చిన వారిపై నొకింతకాలము ప్రసరింపజేయగలడు. అదే ప్రకారము తారకదీక్ష పొందినవాడు సిద్ధసోదరబృందముయొక్క ఆశీర్వాదము నియ్యగలుగును. ఆ సోదర బృందముయొక్క యాశీర్వాదమనగా, నిజముగ దానియధిపతియగు లోకనాయకుని దనియే మనము గ్రహింపవలెను.

## 6. శబ్దము, లేక, ధ్వనియొక్క ప్రభావము.

కేవలము ధ్వనిచేతనే పనిచేసెడు మంత్రములగూర్చి యిప్పుడు ఆలోచించవచ్చును. ధ్వనివలన గలిగెడు స్పందము మానవుని వివిధశరీరములను తాకి, అన్నిటిని

తనతో సమ్మిశ్రితముగనుండునట్లు చేయును. ధ్వని యనగా గాలిలో నొకతరంగము. ప్రతిసంగీతస్వరమునకు **over tones** —ఉపస్వరములు – కలవు. ఆయుపస్వరములను గూడ అది స్పందింపజేయును. నాలుగైదు ఉపస్వరములు సంగీతములో గుర్తించ బడినవి, గాని, చెవి వినగలిగినదానికంటె చాలా యెక్కువదూరము ఆస్పందములు విస్తరించును. వానికనుగుణ్యమగు స్పందములు సూక్ష్మతరమగు ఉన్నతద్రవ్యములో గూడ గలుగును. కనుక కొన్ని స్వరములనుగాని, ఒకటేస్వరమునుగాని గానముచేసిన యెడల సూక్ష్మోపాధులపైనగూడ ఫలితములు కనిపించును. అవి సూక్ష్మములగుటచే గాలిలో స్పందములు కలిగించజాలని ఉపస్వరములు (వానిని ధ్వనులనియే చెప్పవలసి యుండును) కూడ కలవు. అయినను, అవి ఆకాశద్రవ్యమును చలనములో బెట్టును; ఆకాశద్రవ్యమాస్పందములను మంత్రముపఠించు మనిషికిని అతని చుట్టునున్న ఇతర మనుష్యులకును అందజేయును. మంత్రము పఠించువాడు ప్రత్యేకముగా ఏవ్యక్తి పైనైననుతన ఇచ్ఛాశక్తిని బరపుచున్నచో తప్పక అతని నాస్పందములు తాకితీరును. కనుకధ్వనివలన పనిచేయు మంత్రములు భూలోకములో స్థూలమగు ఫలితములను నిశ్చయముగా సంభవింప జేయవచ్చును.

సాధారణముగా, అట్టి మంత్రము మంచినాదముగలిగి ప్రతిధ్వనించెడు పెక్కుధ్వనులతో సక్రమముగా అమర్చబడియుండును. ఒక్కొక్కప్పుడు ఓమ్ అను పవిత్రశబ్దములోవలె ఒక యక్షరము మాత్రమే యుపయోగింపబడును. కాని, ఆ 'ఓమ్' అను శబ్దమును అనేకవిధములుగా నుచ్చరింపవచ్చును, అన్నియు వేర్వేరు ఫలితములను గలిగించును. ఫలితము స్వరలక్షణమునుబట్టియు, స్వరము నుచ్చ రించు విధమునుబట్టియు నుండును. కొన్ని కార్యముల నిమిత్తము పెదవుల మూయ కుండ 'అ', 'ఉ' రెండింటిని కలిపి 'ఓ' అని యొత్తి సఖముకాలము పలికి తరువాత 'మ్' శబ్దమునకు మార్చుదుము. కొన్ని యితర కార్యముల నిమిత్తము 'ఓ' శబ్దమును బలముగా దీర్ఘముగా పలుకుదుము. ఈరెండు పద్ధతుల యొక్క ఫలితములు చాల భేదముగా నుండును. 'ఓ' ను దీర్ఘముగా పలికినప్పుడు మనలో మనకుగాకుండ చుట్టుప్రక్కల నందరకు ఫలముగలుగును. 'మ్' ను దీర్ఘముగా బలికినచో దాదాపు ఫలితమంతయు మనకే కలుగును. ఒక్కొప్పుడు 'అ-ఉ-మ్' మూడును వేర్వేరుగా పలుకుదుము. మరియు దానినే యొకదానితర్వాత నొకటి చొప్పున వరుసగా అనేకభిన్నములగు స్వరములతో నుచ్చరింపవచ్చును. భారతీయుల

గ్రంథముల ప్రకారము ఆశబ్దమును నూటడెబ్బది విధములుగా నుచ్చరించవచ్చు ననియు, ప్రతిదానికి ప్రత్యేకఫలితము కలదనియు, మంత్రము లన్నిటిలోను అది మిక్కిలి శక్తిగల మంత్రమనియు చెప్పగా వింటిని.

హిందువుల యీపవిత్రశబ్దము ఈజిప్టియను భాషలోని 'ఆమెన్' అను శబ్దమునకు సరియైనది. దానినుండియే గ్రీకుభాషలోని 'ఐయాన్' (aion) లాటిన్ భాషలోని 'ఐవమ్' ఉద్భవించినవి. "ఏయాన్" aeon కూడ దానిలోనుండి యుత్పన్నమైనదే. 'ఓమ్' అను శబ్దము మన అయిదవ మూలజాతిలో అనిర్వచనీయమగు ఆ యీశ్వరుని స్వరూపమును తెలియచేయును, అదేవిధముగా నాల్గవమూల జాతిలో 'టా' (Tau) అను శబ్దము ఉపయోగింపబడెననియును చెప్పుదురు. ప్రతిమూల జాతికి ప్రసాదింపబడిన ఈప్రత్యామ్నాయ పదములన్నియు ఏడవమూల జాతిలో పూర్తికాబోవు ఒకమహావాక్యముయొక్క అక్షరములని స్వామి టి. సుబ్బారావుగారొకసారి మాకు చెప్పిరి.

ధ్యానమునుగాని, యొక సభనుగాని ప్రారంభించుటకు ముందు ఈశబ్దమును సరిగా నుచ్చరించినయెడల గలిగెడు ప్రత్యేకఫలిత మెల్లప్పుడు నొక హెచ్చరికవలె నుండును. ఒక ఇనుపకమ్మిలోని యణువులను విద్యుచ్ఛక్తి యెట్లు సరిజేయునో, అదే విధముగా ఆశబ్దము సూక్ష్మశరీరములలోని యణువులను క్రమముగ నేర్పాటు చేయును. విద్యుచ్ఛక్తి ప్రవేశించకపూర్వము ఇనుపకమ్మిలోని యణువులు వేర్వేరు దిక్కులకు తిరిగియుండి, ఆశక్తి ప్రవేశించినంతనే అణువులన్నియు ఒకే దిక్కునకు తిరుగునట్టుగానే, ఆపవిత్ర శబ్దమునుచ్చరించిన వెంటనే మనలోని ప్రతియణువును ఒక్కతీరున సర్దుకొనును.అప్పుడు ధ్యానమువలనను, అధ్యయనమువలనను లాభమును బొందగలిగిన శ్రేష్ఠతమమగు స్థితిలో నుందుము. అంతేగాక, అది యితరమానవ మానవేతర జీవులన్నిటికి ఒక పిలుపుగా పనిజేయును; దానిని విన్నవెంటనే, దాని అర్థమును శక్తిని తెలిసికొని కొందరును, ఆవిచిత్రమగు ధ్వనిచేతనే ఆకర్షింపబడి కొందరును వచ్చి చుట్టును జేరుదురు.

ఈశబ్దవిషయము చాల లోతుగా చొచ్చుకొనిపోవును. "ఈశ్వరునిశబ్దము వలననే లోకములు నిర్మింపబడినవి" అను విషయమును ముందుగా గ్రహించవలసియున్నది. అనంతమునుండి మొట్టమొదట బయలువెడలినది బ్రహ్మము, లేక, శబ్దము; అట్లు చెప్పుట కేవలముశబ్దాలంకారము కాదని నిశ్చయముగా చెప్ప

వచ్చును. అదియొక యథార్థము; కాని, గాలిలేకపోవుటచే మనము శబ్దమను కొనునది యుండుట కవకాశములేని పరమోన్నత లోకమున అప్రిథమ సృష్టి జరిగినది. అయినను, మనశబ్దమునకు సరిపోవునట్టియు, శబ్దమువలె పనిచేయునట్టియు, శక్తియే విశ్వమును సృష్టించుటకు వినియోగపరచబడినది.

సృష్టిచేయగల ఆశబ్దము — Creative Word — యొక్క స్వభావమును భూలోకములో — ఈ స్థూలప్రిపంచములో — మనము గ్రిహించుటకు ఆశించగలమని నాకు తోచదు. "ఆయన పలికెను, అది జరిగెను." "వెలుగు కావలెను; వెలుగు వచ్చెను." అని దేవుడు చెప్పెను. ఇది యీశ్వరుని ప్రిథమ ఆవిష్కరణము; అంధకారములో దాగియున్న ఈశ్వరసంకల్పము శబ్దబ్రిహ్మముగా ప్రభవించినది. ఈపరమ సత్యము వలననేకాబోలు, ఈలోకములో పలుకబడినట్టియు గానముచేయబడినట్టియు శబ్దములు వానియునికికి ఎట్టిసంబంధములేనంత విస్తారమగు ఉన్నతశక్తిని ఆహ్వానించుచున్నవి. మన మనస్సులలో ప్రిస్తుతము గ్రహింపలేనట్టి శబ్దసంబంధమైన మరియొక విషయము గలదని నేనునిశ్చయముగా చెప్పగలను. మనము దాని నతి సంగ్రహముగాను చూచాయగాను మాత్రమే చెప్పగలము. కాని శబ్దముయొక్క ప్రిభావము మిక్కిలి యుత్కృష్టమయినది, అద్భుతమైనది అని మాత్రము గ్రహింపగలము.

శబ్దముయొక్క శక్తిపై ఆధారపడియుండు మంత్రములన్నియు అవి యేభాషలో రచింపబడినవో ఆభాషలో నుపయోగించినప్పుడే సార్థకముగా పనిచేయును. ఒకమంత్రమును ఒక భాషలోనుంచి మరియొక భాషలోని కనువదించినప్పుడు, ఆశబ్దక్రమముమారి క్రొత్తశబ్దసంచయ మేర్పడును. సామాన్యముగా, శరీరమును సమశుృతికి తెచ్చి క్షేమకరములగు ఫలితములనిచ్చుట కుద్దేశింపబడిన సౌమ్యమగు మంత్రములలో దీర్ఘమగు 'ఆ' 'ఓ' వంటి అచ్చులు చాలవరకుండును. భారతీయుల ప్రిణవములోను, ఈజిప్షియనులు వాడుకజేసి క్రైస్తవమతమున కందజేసిన 'ఆమెన్' లోను ఈ విషయమును చూడగలము. ఈ శబ్దమును రెండుస్వరములపై పలికినచో ఉత్తమముగానుండును. ఛర్చిలో దానిని సాంప్రదాయానుసారముగ రెండుస్వరములలోనె పలుకుదురు.

దుష్టకార్యముల నిమిత్తముపయోగింపబడెడు మంత్రములలో సామాన్యముగా కటుచలగు నచ్చులును, చీల్చి బద్దలుచేసినట్లుండెడు కఠినములగు హ్రీం, హ్రుంగ్,

ఫట్ మొదలగు హల్లులును ఉండును. ఈ వికృతమగు కేకలు భయంకరమగు శక్తి తోను ద్వేషముతోను ఉచ్చరింపబడును; అందుచేతనవి కీడుచేయుటకు దారుణమగు శక్తిగలిగియుండును. ఒక్కొక్కప్పుడు అచ్చులన్నియు ఈకర్ణకఠోరమగు హల్లులమధ్య చేర్చబడును. సామాన్యముగా వాడుకలోనున్న ఏ భాషలోని అక్షరములచేనైనను ఈశబ్దముల నుచ్చరించుట కసాధ్యముగానుండి, విచిత్రముగా పేలిపోవుచున్నట్లుండు శాపములతో అంతమగును. ప్రాచ్య దేశములలోని వారి కీవిషయములగురించి కొంత వరకు తెలిసియుండుటచే, తరుచుగా మంత్రములను దుష్టకార్యముల నిమిత్తమే ఉపయోగింతురని నేను భయపడుదును. నీగ్రోజాతులలోగూడ ఈరీతిగానే జరుగు చుండును. వెస్టు ఇండీసు దీవులలోను, దక్షిణ అమెరికాలోను నేనుచూచిన 'వూడూ' 'ఓబియా' సంస్కారముల సందర్భములో ఆప్రకారము మంత్రముల నుచ్చరించుట చూచితిని. ఆమంత్రములు, మంత్రోచ్చాటనములు విశేషద్వేషపూరితములై యున్నవని నేను చెప్పగలను.

ఉపకారయోగ్యములు, ప్రీతికరములునగు మంత్రములతో మనకు సంబంధ ముగాని, హానికరమగువానితో సంబంధములేదు. కానిమంచినైనను, చెడ్డవైనను అవి పనిచేయు విధానమొక్కటే. మంత్రమునుచ్చరించువారి సూక్ష్మశరీరములలోగాని, యెవరిపై మంత్రముపయోగింపబడుచున్నదో వారిసూక్ష్మశరీరములలోగాని స్పంద ములను పరిభవింపజేయుటకే మంత్రములుద్దేశింపబడినవి. ఒక్కొక్కప్పుడు కేవలము క్రొత్తగతుల స్పందములను ప్రసరింపజేయుటకుకూడ వానినుపయోగింతురు. మూడు వేలసార్లు ఒకమంత్రమును జపింపవలసినదని చెప్పుట పాశ్చాత్యులకు కడువింతగా దోచును. "మనకు తీరికయెట్లుకలుగును?" అని మొదటవారికొక గొప్పశంకకలుగును. కాలమే ధనమనివారందురు;ప్రాచ్య దేశస్థులు కాలముతో నిమిత్తములేదందురు. భేదము దృక్పథములోనే గలదు. ప్రాచ్య దేశీయుల పద్ధతులు భావములు పాశ్చాత్యజీవితములకు సాధారణముగా అనుకూలించవు. కానియెవరి నిమిత్తముద్దేశింపబడినవో వారికుప యుక్తముగానుండును. మన అంతరంగిక శాఖలోని సభ్యులకు నియమింపబడిన ధ్యానాధ్యయనములు బహుదుర్భరములని ఆ సాధనములకలవాటు పడనివారను కొందురు; కాని ప్రాచ్య దేశీయుడెవ్వడును అట్లుతలంపడు.

బ్రాహ్మణుడు తనజీవితమునంతయు మతగ్రంథముల పఠనముతోనే గడుపును. అతడు దినమంతయు సేవనిని చేసినను ఒకమంత్రము నుచ్చరించుచునో, ఒక సత్సం

కల్పముతోనో చేయుచుండును. జీవితమంతయు కేవలము మతానుసారముగా గడుపును. ఏమయినను, అట్లుగడుపునని యే అనుకొందురు. ప్రస్తుతము చాలమంది విషయములో మతానుసరణము కేవల మొకగుల్ల వలె బాహ్యారూపముగా మాత్రమున్నది. కాని, వారుపలికెడుమాటలకు జీవమునుశక్తిని వెనుకటివలె నియ్యలేకపోయినను శబ్దముల నుచ్చరించుట మాత్రముమానలేదు. వారికి కావలసినంత కాలము గలదు; గనుక ఒకవాక్యమును రోజుకు నూటయెనిమిదిసార్లు సులభముగా పునశ్చరణము చేయగలరు; అట్లుచేయుటలో వారియుద్దేశము స్పష్టముగా తెలియుచునే యున్నది.

ప్రార్థన జేయునపుడు అనాగరికునివలె వ్యర్థముగా తిరిగితిరిగి చేయవలదని క్రీస్తు తమ శిష్యులను హెచ్చరించెనని చెప్పుదురు. కొందరావాక్యమును పురస్కరించుకొని పునశ్చరణములన్నియు వ్యర్థములేయని యూహించుచున్నారు. భగవంతుని ప్రార్థించుటలో అది నిశ్చయముగా వ్యర్థమే, ఏలయన చేసిన ప్రార్థననే తిరిగి తిరిగి చేయుటవల్ల మొదటిసారిచేసిన ప్రార్థనను దేవుడు వినలేదని అర్థమగును! శిష్యులకు — పరిణామమార్గమునందు కొంత అభివృద్ధిబొందినవారలకు— ఇట్టి పునశ్చరణములు నిరర్థకములే, (లేక, నిరర్థకములైయుండవలెను). నిర్దిష్టముగా నొక యుద్దేశమును స్థిరపరచుకొని దాని నొక్కసారి ప్రబలముగా తెలియచేసినచో వారికది నిశ్చయముగా సరిపోయి యుండవలెను. కాని, సామాన్యమానవుడాస్థితికి రాలేదు గనుక, ఒక క్రొత్త స్పందము నతనిలో గలిగించవలెనన్న చాలకాలము అతనిపై నిలుకడగా, గట్టిగా నొత్తిడిచేయుచుండవలెను. కావున పునశ్చరణము లతనికి వ్యర్థముగాకపోవుటయేగాక, నిర్దిష్టమగు ఫలితములు కలుగుటకు అవి తప్పక ఆవశ్యకములగును. ఈశబ్దములును, వానివలన ప్రభవించెడు వివిధములగు స్పందములును మానవుని యుపాధులపై నిరంతరము నొత్తిడిచేయుచుండుటవలన, ఈయుపాధులన్నియును నిలుకడగా నొకేవిధమగు భావములతో సమశ్రుతమై యుండును. ఇదివరలో నాల్గవ అధ్యాయములో చెప్పినట్లు భారతీయగురువు తనశిష్యుల విషయములో చేసెడు కార్యమున్ను, ఈస్పందములను సమశ్రుతముగజేయు కార్యమున్ను ఒక్కవిధమైనవే. గురువుయొక్క కామమయశరీరమునుండి యెల్లప్పుడును ప్రసరించెడు స్పందములు శిష్యుల కామశరీరములపై బనిచేయుచుండును. దాని ఫలితమేమనగా గురువునుండి వెడలెడు తరంగములు సహజముగా శిష్యుని వానికంటె ఎక్కువ బలము

గలిగియుండును గనుక, గురువు శిష్యులను క్రమేణా తనతో నెక్కువ సమశ్రుతముగా జేసికొనుచుండును. కామమానసిక శరీరములలో ఏభాగమును సంస్కరించవలసియున్నదో ఆభాగమును సంస్కరించుటకై ఒకమంత్రమును నిరంతరము పునశ్చరణము చేయవలసినదని నియమించబడును. అట్టి పునశ్చరణమువలన ప్రబలమగు ఫలితములు తప్పక కలుగగలవనియు, కలుగుచున్నవనియు నిస్సంశయముగా చెప్పవచ్చును.

ఆపద్ధతులే క్రైస్తవదేశములలో గూడ నియమింపబడినవి. రోమను కేథలిక్ మతస్థుడు వాని మతగ్రంథములలోని మంత్రములను పునశ్చరణము చేయుట తరుచుగా చూడవచ్చును. సాధారణముగా అతడు వానిని గొణుగుటమాత్రమే జరుగును, గనుక వానివలన అతనికి స్ఫురించెడు భావములు తప్ప యితర యుపయోగముండదు. భారతదేశములో మంత్రములను బిగ్గరగా గానముచేయుదురు. గానముచేయబడిన మంత్రము తప్పక ఫలము నిచ్చును. ఈవిషయములో ఆధునిక భాషలకంటె ప్రాచీన భాషలు శ్రేష్ఠతరమైనవని చెప్పుటకది యొక కారణము. ఆధునిక భాషలను సాధారణముగా అతిత్వరితముగను కుఱుచగను మాట్లాడుదురు; ఇటాలియన్, స్పేనిష్' గ్రీక్ వ్యవసాయదార్లు మాత్రము పూర్వమువలెనే దీర్ఘముగా రాగములు తీయుచు మాట్లాడుదురు. లిబరలు కేథలిక్ చర్చిలో మాత్రము స్థానిక భాషలో ఆరాధన జరుపవలెనని నిర్ణయించితిమి. ఏలయన, చెప్పుచున్న విషయములను జనులుగ్రహించి తెలివిగా సంస్కారములన్నిటిలోను పాల్గొన్నయెడల ఎక్కువ భక్తికలుగునని మేము కనిపెట్టితిమి. లాటిన్‌భాషలో ఎక్కువ మాధుర్యము కలదనుటలో సందేహములేదు. ఈమాదిరి మంత్రము లనేకములు కేవలము శబ్దసంచయములుగానుండి అర్థశూన్యములైయున్నవి. 'పిస్టిస్‌సోఫియా' అను నాస్టిక్ క్రైస్తవుల సుప్రసిద్ధగ్రంథములో అట్టి అర్థశూన్యములగు మంత్రములు చాలగలవు. వానికిపెట్టిన గుర్తులను చూడగా అవి గానము చేయుటకుద్దేశింపబడియుండవలెను.

భారతీయుల మంత్రములలో మంచిమాధుర్యముగలిగి దొర్లుచున్నట్లుండెడు శబ్దములను జూతుము; వాని స్పందవేగములు క్రమక్రమముగా మానవుని శరీరములకన్నిటికిని అబ్బును, గనుక శక్తిని పొదుపుగా నుపయోగించుట కవి అనుకూలించును. మంత్రముచే చేయగలదేదినైనను మంత్రములేకుండ మన స్వశక్తిచేతనే చేయవచ్చును, కాని మంత్రము శ్రమ తగ్గించెడు యంత్రమువంటిది. అవసరమగు స్పంద

ములను చలనములోబెట్టి, మనము చేయవలసిన పనిలో కొంతపని నది చేయుటవలన మనపని తేలికయగును. కావున, మంత్రమును శక్తిని పొదుపుచేయు సాధనముగా నెంచవచ్చును.

మరియొక విషయమేమనగా, అనాగరికులయెదుటగాని, దుష్టబుద్ధిగల వారి యెదుటగాని మంత్రములను పఠింపకూడదని భారతీయులు తమ గ్రంథములలో నొక్కిచెప్పిరి. ఏలయన, మంత్రబలము తరుచుగా చెడ్డను, మంచిని యొకేవిధముగా వృద్ధిచేయును. ఆమంత్రముల ఉన్నతరూపములలో వెలువడు స్పందములకు జవాబు నియ్యలేనివాడెవడైన నున్నయెడల, అతడు నీచమగు స్పందములనే గ్రహించును, అందుచే అతనిలోని దుష్టత్వము ప్రబలము కావచ్చును. ఎవరికైన హాని కలుగుట కవకాశమున్నయెడల, అచ్చట మంత్రములను ఎన్నడును ఉచ్చరించరాదు.

స్వప్రయోజనమునకుగాక, మరియొకరికి సహాయముచేయు నుద్దేశముతో మంత్రమును జపించవచ్చునని మేడమ్బ్లవట్స్కీగారు చెప్పుట నాకు జ్ఞాపకము. ఈవిధముగా, పవిత్రశబ్దమగు ఓంకారమునుగాని, గాయిత్రీమంత్రమునుగాని, లేక,అతి మధురములు రమ్యములునగు బౌద్ధమంత్రములలో నొక దానినిగాని, ప్రత్యేకముగా నొకమనిషిని తలచుకొని మంత్రశక్తిని వానివైపు ప్రసరింపజేయుచు పఠనము చేయ వచ్చును. కాని, ఈవిషయములలో కడు జాగ్రతతో నుండవలెనని ఆమె మాకు సలహానిచ్చెను. మరియు, ఎవ్వరును తనశక్తికిమించిన మంత్రమును ఉపయోగించు టకు ప్రయత్నింపరాదని హెచ్చరికనిచ్చెను. మన గురువులు మనకట్టి మంత్రముల నెన్నడును ఉపదేశించరు. కాని ప్రారంభకులకు జాగ్రతకై నేను చెప్పునది యేమ నగా, ఓంకారమునైనను ఒకవిధముగా నుచ్చరించినప్పుడు తలనొప్పిగాని, వికారము గాని, నిస్త్రాణగాని కలిగినయెడల, ఆక్షణమందే దానిని మానివేయవలెను. కొన్ని నెలలపాటు దానిని నిలుపుచేసి, యీలోపున మనశీలమును వృద్ధిచేసికొనుచు తరు వాత తిరిగి ప్రయత్నము చేయవలెను. ఆశబ్దము నుపయోగించుటలో గొప్పశక్తులను మన మాహ్వానము చేయుచున్నాము. మన మాశక్తుల యున్నతికి చేరియుండని యెడల అవి సమకూరితముగా నుండకపోవచ్చును, ఫలితము శుభకరముగానుండక పోవచ్చును.

గానముచేయబడిన శబ్దముయొక్క స్పందముల ఫలితమునకుతోడు, సంయో గము రీత్యా కొన్నిశక్తులనుగూడ గలిగియుండుటచే, ఈమంత్రములలో చాలభాగము

మన మూడవ తరగతి మంత్రములను పోలియుండును. ఉదాహరణమునకు, 'గాయత్రి' 'తిసరణ' (బౌద్ధుల త్రిశరణములు), ఈరెండును కేవలము భిన్నములగు మంత్రములైనను కొందరు దేవతలకు వానితో సంబంధము కలదు.

ప్రాచీనమంత్రములన్నిటిలోను 'గాయత్రి' బహుశః మిక్కిలి యుత్కృష్టమైనది, సుందరమైనది కావచ్చును. అనాదినుండియు భారతదేశమంతటను ఆమంత్రము జపింపబడుచున్నది. దేవతాగణము దానిని గ్రహించి, దాని కద్భుతమగు రీతిని బదులుచెప్పుట కలవాటుపడిరి. దేవతలిచ్చెడు జవాబుయొక్క లక్షణమును జూచిన, మానవుని జ్ఞప్తిని దాటిన ప్రాచీనకాలములోగూడ అట్టి మంత్రములను పరోపకారార్థమై యుపయోగించుటవలన గలిగెడు లాభమును సంపూర్ణముగా గ్రహించి యభ్యసించిరని తెలియచేయును. అది యెల్లప్పుడును 'ఓమ్' కారముతో ప్రారంభమగును; తరువాత మానవుడు జీవించెడు భూలోక, భువర్లోక, సువర్లోకములు వరుసగా చెప్పబడును; ఒక్కొక్క లోకనే పేర్కొనబడినప్పుడు ఆలోకములోని దేవతలు తమకియ్యబడెడు కార్యమును జేయుటకై సంతోషముతోను, ఉత్సాహముతోను జపించువానిచుట్టును గుంపుగా మూగెదరు. భారతదేశములో శివుని నీలకంఠుడని పిలుతురనియు, ఆనామమువచ్చుట కొక కథకూడ గలదనియు అందరకు తెలిసినవిషయమే. గాయత్రీమంత్రమును జపించునప్పుడు జవాబు నిచ్చెడు దేవతలలో కొంతమందికి నీలకంఠములుండుట బహుచిత్రమగు విషయము. ఆదేవతలందరు ప్రథమ రేఖకు చెందియుండుట స్పష్టము.

అద్భుతమగు ఈ గాయత్రీ మంత్రము సూర్యుని, అనగా, వాస్తవముగ సూర్యమండలమున కధిపతియగు సూర్యనారాయణమూర్తిని ధ్యానించెడు మంత్రమై యున్నది. మనముచూచెడు భౌతికసూర్యగోళము సూర్యనారాయణమూర్తియొక్క మహద్వైభవముగల చిహ్నము. ఆ మంత్రమును పలికినవెంటనే ఒక గొప్ప వెలుగు బాణమువలె జపితపైకి, లోనికి ప్రసరించును. ఆ క్షణమందు భౌతిక సూర్యుడేదిక్కున నున్నను, అది ఆయనవద్దనుంచి వచ్చినట్లేయుండును. ప్రథమరేఖయొక్క శక్తి ఆవిష్కరణమైనప్పుడెల్ల అగుపడు ఇంద్రనీలద్యుతితో మెఱయు లేతబంగరురంగుతో పూయబడిన శ్వేతవర్ణము గలిగి యా రశ్మిశోభిల్లుచుండును. అది జపిత అంతరంగమును, ఆత్మను, సహానింపివేసి శీఘ్రముగాతిరిగి వెలుపలికి పోవును. కాని యిట్లు వెలుపలికిపోవునపుడు ఇంద్రధనస్సులోని యేడు రంగులుగల సూచ్యాకారములగు

ఏడు కిరణములుగా బోవును. జపిత ' ప్రిజమ్ ' (త్రికోణాకారముగల గాజుకడ్డి) వలె పనిచేయును. అయినను, ఆ కిరణములరంగులవరుస అట్టి సందర్భములలో మామూలుగానుండక తలక్రిందుగానుండును. సామాన్యముగా మనమాధ్యాత్మికశక్తులను ప్రసరింపజేసినప్పుడు, ఇట్టికిరణములు మనహృదయమునుండియో మెదడునుండియో యేదో యొక కేంద్రమునుండి బయలుదేరి వ్యాపించి, వ్యాపించినకొలది ఉన్నతమగు దీపస్తంభమునుండి ప్రకాశించు కిరణములవలె పింఛమును విప్పినట్లుగా విస్తరించును; కాని యీ రేఖలు జపిత స్థూలశరీరముకంటె వెడల్పగుమట్టును — అనగా ఆతని తేజోమండలముయొక్క పరిధిని — పీఠముగా జేసికొని సూచ్యాకారముగాబోయి కొనలుతేలి, నక్షత్రమును చిత్రించిన ఎట్లుండునో అట్లుండును, కాని ఆ రేఖలు కేవలము త్రికోణములవలె నుండక సూచులవలె నుండును.

ఆశ్చర్యకరమగు మరియొక విషయమేమన, ఈ యేడు రేఖలు వృత్తాకారముగా అన్ని దిశలకు వ్యాపించక, అర్ధచంద్రాకారముగ జపిత యేవైపు తిరిగియుండునో ఆవైపునకు ప్రసరించుచుండును. అంతేగాక, ఈ రేఖాపింఛములు కొనలుతేలువరకు సన్నగిలుచు ఘనీభవించుచున్నట్లుండి తుదకు కండ్లుచీకట్లుకమ్మునంతటి ప్రకాశవంతమగు చుక్కలుగా కనబడును. అంతకంటెనెక్కువ చిత్రమగు విషయమేమన, ఈ చుక్కలు సజీవములైనట్లుగా ప్రవర్తించును. ఎవరైన వానిదారికడ్డముగా నున్న యెడల, ఆ చుక్క సమ్మరానంత వేగముతో వంగిపోయి అతనిహృదయమును మెదడునుతాకి యొకక్షణము వానిని ప్రకాశింపజేయును. ప్రతియొకరేఖయు అనేకమంది జనులపై వరుసగా ఈ ఫలితమునే కలుగజేయుచున్నట్లు కనిపించును. విశేషసమ్మర్ద ముగల జనసమూహములో ఈ మంత్రము నుపయోగించి పరీక్షించగా, ఈ రేఖలు సమూహముగా తమలోతాము పంపకముచేసికొని యొక్కొక్క రేఖ తనకెదురుగా నున్న జనులపైనమాత్రమే పనిచేయుచున్నట్లు కనిపెట్టితిని.

మంత్రమును పఠించెడుభాషలో విశేషమంతగాలేనట్లు కనబడుచున్నది. నిర్దిష్టమగునుద్దేశముతో ఆంగ్లేయభాషలో పఠించినను సంపూర్ణమగు ఫలితముకలిగెను. ఆ యుద్దేశముతోనే సంస్కృతభాషలో పఠించినను ఫలితము సమానముగానే యుండెను, గాని ఆకాంతి శరములచుట్టును ఒక శబ్దరూపమునుగూడ కలిగించెను. ఆశబ్దరూపము కర్రపై అతి సున్నితముగను, అద్భుతముగను చెక్కిన నకిషీవలె గన

బడెను. ఈ శబ్దరూపము కొద్దిదూరముమాత్రమే వ్యాపించెను. రేఖలశక్తిలోగాని, పరిమాణములోగాని భేదమేమియు గనబడలేదు.

బౌద్ధమతస్థుల 'తిసరణ' మును పఠించినప్పుడు సన్యాసులుధరించు కాషాయ వస్త్రమునకు సంబంధించిన దేవతలు ప్రత్యక్షమగుదురు. వారుఅద్భుతమగు శాంతిని సంతోషమును ప్రసరింపజేయుదురు; వారుమిక్కిలి ప్రశాంతముగానున్నను, అసమానమగు సంతోషమునుగూడ ప్రదర్శింతురు. దేవతలు ప్రత్యక్షమగుదురని చెప్పినప్పుడు ఆకాశములోని దిశలనన్నిటిని జ్ఞాపకముంచుకొనవలెను. వారు ఎక్కడనో దూరముననున్న స్వర్గమునుండి బయలుదేరి ప్రయాణముచేసి రానక్కరలేదు. ఈశ్వరుని ప్రతినిధులగు మహాశక్తులు ఆ మంత్రమునకు జవాబుగా ఆ యా రూపములలో ఆవిష్కరించునని చెప్పినయెడల విషయము బొత్తిగా క్లిష్టముగాచేసిన వాడనగుదునేమోయని సందేహించుచున్నాను. ఆదేవతలెల్లప్పుడును అచటనే సిద్ధముగానుందురు, ఆహ్వానము వచ్చినవెంటనే బహిర్ముఖులై ప్రత్యక్షమగుదురు.

ఆ విధమగు ప్రార్థనయొక్కయు, దానివలనగలిగెడు ఫలితముయొక్కయు చరిత్రనుపూర్తిగా చెప్పితిని. మనము ప్రబలముగా నొకభావమును గురించి భావనజేసినయెడల ఆ భావమునకు ప్రాణము పోయుశక్తి మనకు ప్రత్యక్షమగును. ఒక ప్రబలమగుభక్తిభావము క్షణములో జవాబును దెచ్చును. అట్లుగానిచో విశ్వము నిర్జీవమగును. వెంటనే జవాబువచ్చుట ప్రకృతిధర్మము; విన్నపము, జవాబురెండును నాణెముయొక్క రెండుప్రక్కలవలె నుండును. కర్మనుగూర్చి చెప్పినప్పుడు కారణమునకు కార్యము రెండవప్రక్కయని చెప్పినట్లుగా విన్నపమునకు రెండవప్రక్కనే జవాబుకూడ నుండును. ప్రకృతిలో అద్భుతమగు నైక్యము గలదు. కాని, మానవులు తమ నీచప్రకృతులచే అతిదట్టముగా ఆవృతమై యుండుటవలన దాని నెంతమాత్రము నెరుగరు. మన హృదయములు తెరచుకొనుటయే కావలసియున్నది. ప్రకృతిని నిరోధింపక, దానికి సంపూర్ణముగా మనము లొంగిపోగలిగినయెడల, దానిని త్వరలో సాధించి స్వాధీనముచేసికొనగలమని అతిసులభముగా తెలియగలదు. ఏలయన, మనమవలంబించు నైఖరివలన ప్రకృతి శక్తులను మేలుకొలుపగలము, అప్పుడు సర్వము మనతో కలిసిపనిచేయును. ఈవిషయమంతయు 'మోక్షమార్గ ప్రదీపిక' లో స్పష్టముగా తెలుపబడినది. మనము ప్రకృతిశక్తులను గుర్తించవలెను, వాని కనుగుణ్యముగా ప్రవర్తించుటకు సంసిద్ధులముకావలెను. అప్పుడు ఈశక్తులన్నియు మనకను

కూలముగా ప్రవహించుచుండునుగనుక అంతవరకు కష్టముగా నున్నపనులన్నియు ఎంతైన సులభతరమగును.

మంత్రముల విషయమై నాకు బాగుగా తెలియని మరియొక భాగము కలదు. శబ్దములకు మాత్రమేగాక మాటలకు, సంఖ్యలకు, అక్షరములకు కూడ ప్రత్యేక శక్తులుకలవు. ప్రస్తుతకాలములో వానిగురించి మనమేమియు శ్రమదీసి కొనుట లేదు. కాని, సంస్కృతభాషలోను, హీబ్రూభాషలోను ప్రతియక్షరమునకు ఒకసంఖ్య, ఒకశక్తి, ఒకరంగు ఇయ్యబడినవి. కొందరు దివ్యదృష్టిగలవారు మన అచ్చుపుస్తకములలోగల సామాన్య రోమను అక్షరములలో 'ఏ' ను ఎఱ్ఱగాను, 'బి' ను నీలముగాను, 'సి' ను పసుపుపచ్చగాను, 'డి' ను ఆకుపచ్చగాను, ఈప్రకారముగా ఒక్కొక్క అక్షరమును ఒక్కొక్కరంగుతో జూచుట నేనెరుగు దును. నాకట్టి యనుభవ మెన్నడును గలుగలేదు. నామనస్సావిధముగ పనిచేయదని తలచెదను. అదేవిధముగ, వారములోని ప్రతిరోజును వేర్వేరు రంగులతో జూచెడు సూక్ష్మదృష్టిగలవారుగూడ గలరు. అదికూడ నాకనుభవములేదు. నాతత్త్వమున కందు కవసరమగు సన్నితముకూడ లేదు, దాని అర్థమైనను నాకు తెలియదు. అది గ్రహాప్రభావములతో సంబంధించియుండవచ్చును. కాని నాకేమియు తెలి యదు. ఈవిషయము మంత్రములతోగూడ సంబంధించియున్నది. కొందరు మంత్రి శాస్త్రవేత్తలు ప్రతి అక్షరమునకు అక్షరమాలలో దానికిగల స్థానముతో నిమిత్తము లేకుండ దానికొక ప్రత్యేక సంఖ్యాత్మకమగు విలువ నిచ్చెదరు. ఒకమాటయొక్క గాని, వాక్యముయొక్కగాని, అక్షరములవిలువను సంకలనముజేసి, మరియొకమాట లోని అక్షరములనుగాని వాక్యములోని అక్షరములనుగాని అదేరీతిగా సంకలనము చేసి, రెండింటికి యొకే మొత్తము వచ్చినచో, రెండింటికి యొకేమంత్రఫలము కలుగునని చెప్పుదురు. ఆవిషయము నాకేమియు తెలియదు. సాధారణముగా, మంత్రమొక సూత్రమువలె కుఱుచదై బలముగనుండును; ఏకార్యమునకైనను మనమొక నిర్ణీతమైన ఫలితమును కలుగజేయవలెననిన మనముచేయు ప్రమాణ వచనము ఆమంత్రరూపముననే యుండవలెను. మనము జనులలో గాఢముగను, వేగముగను మార్పుగలిగించవలెననిన, మనమెల్లప్పుడును మంచి పటుత్వముగల చిన్నచిన్న వాక్యములనే వాడుకచేయవలెనుగాని, దీర్ఘములగు డొంకతిరుగుడు వాక్యముల నుపయోగించిన లాభములేదు. ఆమాటలు యోధుని శాసనములవలె

గాని, లేక, మంత్రములవలె గాని యుండవలెను, మరియు నిర్దిష్టమగు ఉన్నతిని చేరవలెను. చాల భయకంపితుడగు మనిషికి సహాయపడదలచితిమని యనుకొనుడు: "నేను బలముగనుంటిని, ముమ్మాటికి బలముగ నుంటిని, నేను ఈశ్వరాంశను, ఈశ్వరుడు శక్తిస్వరూపుడు గనుక నేను శక్తిమయుడను" అను భావమును పునశ్చరణము చేసినయెడల మనలోని యీశ్వరశక్తి బహిర్గతమై ఆభయకంపితునకు ధైర్యము గలిగించును. అన్ని యితరమార్గములలోవలెనే యీమార్గమునగూడ జ్ఞానము శక్తిగా పరిణమింపగలదు. మనము శ్రేష్ఠతమముగా పనిచేయదలచినయెడల, జ్ఞానము కలిగియుండవలెను. జ్ఞానముకలుగవలెననిన అధ్యయనము చేయవలెను. జ్ఞానియొక్క జీవితము ఈశ్వరుని జీవితమున కనుగుణ్యముగా నుండును గనుక, అతడు శాంతముతోను, ఆనందముతోను జీవింపగలడు. సర్వమును దెలిసికొన్నవాడై సమస్త భూతములయందును అనుకంపగలిగియుండును. స్వార్థపరత్వమును శాశ్వతముగ విసర్జించినవాడై కేవల మితరులకు సేవజేయుటకును, ఆశీర్వదించుటకును జీవించును.

## కావలసిన యోగ్యతలు మాత్ర మెన్నటికి మారవు

పైనవివరించిన వివిధములగు పద్ధతులను యోచించుటలో వాని విధానములన్నియు నొకదానికొకటి వ్యతిరేకముగాను, అన్యోన్యవిరుద్ధముగాను ఉండునని యెన్నడును తలంచరాదు. ప్రతివిధానములోను మిగతా విధానములన్నిటికి చెందిన యేదో కొంతభాగము కలిసియుండును. దేనిలో ఏవిధానము ప్రధానమైయుండునో, దాని నా పేరుతో నిర్వచనము చేయుదురు. వానిలో నేదైనను ముఖ్యావశ్యకమనిగూడ తలంచరాదు. వానికన్నిటికి పునాదియైనట్టియు, పరమగురుచరణసన్నిధిలో విశేషముగా నొక్కిచెప్పబడినట్టియు విషయములు—శీలమును వృద్ధిజేసికొనుట, జీవితమును పరిశుద్ధముజేసికొనుట, సేవకై ఆత్మసమర్పణము గావించుకొనుట — ముఖ్యముగా కావలయును.

వివిధములగు విధానములనన్నటిని పోల్చిచూచుటవలన,ప్రథమ యోగదీక్షకు ఆయితమగు ముముక్షువు పెంపొందించుకొనవలసిన యోగ్యతలు మొదట చూచినప్పుడు విశేషముగా భేదించుచున్నట్లు కనబడినను, వాస్తవముగా అవన్నియు తత్త్వతః సమానములేయని తెలియగలదు. పురోవృద్ధికొరకై దీక్షబూని పట్టుదలతో బనిచేసెడు ప్రత్యేకజీవుల పరిణామము విషయమై గతయిరువదియైదు శతాబ్దముల

నుండియు, బహుశః అంతకుపూర్వము చిరకాలమునుండియుగూడ, సరిగా ఈవిధానమే సక్రమముగా నవలంబింపబడుచున్నది. దీక్షలనిచ్చుటకు కొన్నికొన్ని కాలములయందు (ప్రస్తుతకాలమట్టిదే) సందర్భములు ఇతరకాలములయందుకంటె ఎక్కువ అనుకూలముగా నున్నప్పటికి, యోగ్యతలలో మాత్రము భేదముండదు. యోగ్యతలు ఏవిధముగానైనను తగ్గింపబడినవని తలచెడు పొరపాటునుమాత్ర మెన్నడును జేయకుండ మనము బహుజాగ్రతగానుండవలెను. కనుక వివిధములగు మార్గములన్నియు యోగదీక్షయను నొక్క ద్వారముననే తీసికొనిపోవునని తెలియుచున్నది.



## ఏడవ అధ్యాయము

# ప్రథమ యోగదీక్ష

### ఏకోపదేష్ట

చాలమంది యోగదీక్షనుగురించి యోచించినప్పుడు, అది తమ స్వలాభము కొరకై పొందవలసిన యొక గొప్ప యోగ్యతయని తలచెదరు. దీక్షితుడనగా విశేషముగా వికాసముబొందిన వాడనియు, బాహ్యప్రపంచములోని సామాన్యమానవునితో పోల్చిచూడ గొప్ప దివ్యస్వరూపుడనియు తలచెదరు. అది సత్యమే. కాని మనము విషయమునంతను ఉన్నతమగు అలౌకికదృష్టితో చూడ ప్రయత్నించిన యెడల బాగుగా అర్థముకాగలదు. యోగదీక్షయొక్క విశేషము ఒకానొక వ్యక్తి ఘనతబొందుటలో లేదు, ఉత్కృష్టమగు నొకమహాబృందములో, క్రైస్తవధర్మ సంప్రదాయములో అతిరమ్యముగా వర్ణించినట్లు యోగుల సంసర్గములో (Communion of Saints), అతడుగూడజేరి వారితో నొకడగుటలోనే గలదు.

మహీపీఠము (సోదరబృందము) యొక్క నిర్మాణమున్ను, పరమగురువుల కార్యమున్ను సరిగా గ్రహించినయెడల, ప్రథమ యోగదీక్షద్వారా సోదరబృందములో చేరుటలో నెట్టి యుత్కృష్టమగు యథార్థముగలదో బాగుగ తెలియగలదు. ఆవిషయమును తరువాయి అధ్యాయములలో వివరించెదను. అభ్యర్థి యిప్పుడు, అనగా ప్రథమ యోగదీక్షనుబొందినప్పుడు, కేవలము వ్యక్తిగతమగు నొక మానవుడు కాడు; బ్రహ్మాండమగు శక్తిలో అతడొక అంశమాయెను. మనసూర్యమండలాధిపతియగు సూర్యనారాయణమూర్తికి ప్రతిగోళముమీదను ఒక ప్రతినిధి గలరు. ఆప్రతినిధి ఆయన తరపున రాజప్రతినిధివలె పనిచేయును. మనభూగోళమందలి ప్రతినిధిని 'లోకప్రభువు' అనెదరు. వారే సోదరబృందమునకధిపతి. ప్రతియొకరును ప్రత్యేకముగా నిర్వహింపదగిన కార్యములుగల మహాపురుషుల సోదరబృందము; అంతేగాక అదియొక బ్రహ్మాండమగు ఏకత్వము. అది ఆలోకప్రభువు ఇచ్చవచ్చినరీతి నుపయోగింపదగినపనిముట్టు, ఆయన ఉపయోగింపగలిగిన మహాప్రభావముగల ఆయుధము. అత్యద్భుతము, అవాఙ్మానసగోచరమునగు మహాసంకల్పకారణమున ఏకము అనేకమై తిరిగి యిప్పుడు ఏకత్వము నొందుచున్నది. ఈ విశ్వవిధానములో ఏయంశముకూడ — ఏకత్వమునొందినప్పుడు—తన ప్రత్యేకవ్యక్తిత్వమునుగాని, శక్తినిగాని, యిసుమంతైన

గోల్పోదు సరిగదా, వేయిరెట్లు ఎక్కువ శక్తిని చేర్చుకొనును; ఆప్రభువులోని భాగమగును, ఆయన ధరించు శరీరములోని యొక అంగమగును; ఆయనచేత ధరించెడు ఆయుధములోను, ఆయన ప్రయోగించెడు జంత్రములోను, ఆయన యుపయోగించెడు పనిముట్లులోను నొకభాగమగును.

లోకమునకంతకు నొకడే పరమోపదేష్టకలడు. కాని, మొదటి రెండు యోగ దీక్షలు నిచ్చుటలో ఆయన తన తరపున నొక పరమపురుషుని ప్రతినిధిగా నియోగించి ఆసంస్కారమును జరిపింపవచ్చును. అప్పుడైనను, ప్రతినిధియగు ఆపరమ పురుషుడు దీక్షనిచ్చెడు విశిష్టసమయమందు లోకప్రభువును తలచి యాహ్వానించును. ముముక్షువుయొక్క ఆధ్యాత్మికజీవితములో అది యద్భుతమగు సమయము. అచిరకాలముక్రిందట పరమగురువు కూట్‌హూమీగారు ఒక శిష్యుని స్వీకరించుచు నిట్లనిరి :

"నీయాశయముయొక్క మొదటి లక్ష్యమును చేరితివి. కనుక, ముందు సోపానమును చేరుటకు వలయు ఎక్కువ ఘనమైన యోగ్యతలను సంపాదించుటకై నీవీక్షణమునుండియు శ్రద్ధవహింపవలెనని నిన్ను హెచ్చరించుచున్నాను; క్రైస్తవులు మోక్షము, లేక, పరిత్రాణము అనియెడు 'ప్రవాహములోనికి దిగుట'కు, నీవు ఆయిత పడవలసియున్నది. ఈప్రవాహప్రవేశము దీర్ఘమగు నీజన్మ పరంపరలో ముఖ్యమగు అవస్థకాగలదు; నీయేడువందల జన్మలకు పరాకోటియై వెలయును. అనేకయుగములక్రిందట వ్యక్తిత్వమునుబొంది మనుష్యవర్గములో ప్రవేశించితివి. భవిష్యత్తున అచిరకాలములోనే సిద్ధపురుషుడవై మనుష్యవర్గమును విడిచి మానవాతీతుడవు కాగలవు. ఈ ఆద్యంతములు రెండింటిమధ్యను ప్రథమయోగ దీక్షావస్థకంటె ఎక్కువ ముఖ్యమైనదేదియులేదు; దానిని జేరుటకై నీదృష్టిని మరల్చవలెను. అదినిన్ను శాశ్వతముగా సురక్షితునిచేయుటయేగాక, లోకసేవాపరతంత్రులై ఆద్యంతములు లేక శాశ్వతముగా నున్నట్టి సోదరబృందములో నిన్ను చేర్చును.

"అట్టి యద్భుతమగు సంఘటనమున కెంతజాగ్రతతో సన్నద్ధుడవు కావలెనో బాగుగా యోచించుకొనుము. దానిమహావైభవమును, సౌందర్యమును నిరంతరము మనమున నుంచుకొనుము. అట్టి ప్రబలమగు కృషి జేయుటకు నీశరీరము బహు కోమలముగానున్నది. కాని నీకు దివ్యమైనట్టియు బహు అరుదైనట్టియు అవకాశము దొరకినది, దానిని పూర్తిగా నుపయోగించుకొనుము."

## సోదరబృందము

జీవాత్మ దీక్షితుడైనప్పుడు లోకములో అత్యంతసమరసముగల యొకసంస్థలో అతడొక భాగమగును; ఆమహాశ్వేత సోదరబృందముయొక్క అపారమగు చైతన్య సముద్రములోగలసి యేకమైపోవును. చాలకాలమువరకు క్రొత్తదీక్షితునకే యేకత్వముయొక్క అంతరార్థము బోధపడదు. ఈ నూతనసంబంధమెంతసన్నిహితమైనదో ఆలోక ప్రభువుయొక్క చైతన్యమెంత ఘనమైనదో, ఋషిసోదరులందరు వారిచైతన్యములో కొంతవరకెట్లు పాల్గొందురో తెలిసికొనగలుగుటకుముందు అతడు గర్భగృహాములలోపలికి చొఱుచుకొనిపోవలెను. ఈలోకమునందది అగ్రాహ్యము, అనిర్వచనీయమునై, ఆధ్యాత్మికము, సూక్ష్మమునగుటచే మాటలకతీతమైయుండును. అయినను, అదియొక మహిమాన్వితమగు సత్యము. ఆసత్యమును మనము గ్రహింప మొదలుపెట్టినయెడల, అన్యమైనదంతయు అసత్తు అని కనిపించును. స్వీకృతశిష్యుడు తనతలంపులను పరమగురువు తలంపుతో బోల్చిచూచుకొనగలడని యిదివరలో తెలిసికొనియుంటిమి; అటులనే దీక్షితుడుగూడ నిప్పుడు తనతలంపులను ఆ సోదర బృందముయొక్క తలంపులతో బోల్చిచూచుకొనగలుగును. బ్రహ్మాండమగు వారి చైతన్యమునుండి తనస్థితినిబట్టి తానెంతవరకు గ్రహింపగలుగునో అంతవరకు తనలోనికి గైకొనుచుండును. తనలోనికెంతగా గైకొనుచుండునో అంతకెక్కువగా గ్రహింప గలుగుచుండును. అందుచేత, అతని చైతన్యము క్రమేణావ్యాప్తిచెందును; భావసంకోచమెన్నడును అతనినంటనేరదు. పరమగురువుయొక్క స్థూలోపాధులలో వికల్పము గలిగించి ఆయన పనికిభంగముకలిగించకుండ స్వీకృతశిష్యుడెట్లు అప్రమత్తుడై యుండవలెనో, అటులనే సోదరబృందములోని సభ్యుడుకూడ సంపూర్ణమగు నైక్యముతో పనిచేయుచున్న ఆమహీపీఠము వారిమహాచైతన్యములో నపశ్రుతి కలిగించకుండ శ్రద్ధవహించియుండవలెను.

మన పరమగురువులుచేయుచున్న కార్యమునే సోదరబృందమంతయుగూడ చేయుచున్నదని యెప్పుడును తలంచరాదు. వారిలోచాలమంది సంపూర్ణమగు నేకాగ్రత, పరిపూర్ణమగు ప్రశాంతము కావలసియుండు ఇతరకార్యములలో నిమగ్నులై యుందురు. క్రొత్తగచేరినయువకులు తమడున్నతస్థితిని మరచిపోయి ఆసోదరబృందముయొక్క కార్యమునకంతరాయము గలిగించెడు స్పందతరంగములను ప్రభవింప

జేసినయెడల ఆపరమ పురుషుల మహాత్కార్యమునకు భంగముగలుగవచ్చును. మన పరమగురువులైన యెడల అట్టిపొరపాట్ల నుపేక్షచేసిన చేయవచ్చును. భవిష్యత్తున ఈ క్రొత్తసభ్యుడు సోదరబృందముయొక్క శక్తులను సద్వినియోగము చేయునను నమ్మకముతో అప్పుడప్పుడట్టి స్వల్పచీకాకులను ఓరిమితో సహింపనంగీకరించ వచ్చును. కాని వ్యక్తులకుశిక్షణనిచ్చుటలో ఎట్టిసంబంధములేని పరమపురుషులు "మాకార్యమునకు భంగముకలుగుచున్నది. పరిపక్వమునొందని వ్యక్తులు బైట దూరముగా నుండుటమంచిది," అని చెప్పవచ్చునని మనము గ్రహింపవలెను. బైటనున్నందున నష్టమేమియులేదనియు, బైటనున్నను పురోవృద్ధిని బడయవచ్చు ననియు, దీక్షనుబడయుటకుముందు శిష్యులు ఎక్కువశ్రేష్ఠులు, శక్తిగలవారు, బుద్ధి మంతులు అగుటకు కృషిచేయవచ్చుననియు వారు చెప్పవచ్చును.

దీక్షితుని చైతన్యమెంతో యద్భుతముగ వ్యాప్తిచెందును గనుక, దీక్షవలన గలిగెడుమార్పును, పునర్జన్మమని చెప్పుట బహుయుక్తముగా నుండును. ఆతడొక 'పసిబిడ్డ'వలె నూతనజీవితమును, క్రైస్తు జీవితమును జీవింపనారంభించును.ఆ'క్రైస్తు' లేక "బుద్ధిలోక చైతన్యము" అతని హృదయమునం దుదయించును. మరియును, ఇప్పుడతడు ఆ సోదరబృందముయొక్క ఆశీర్వాదమును — అనగా, అతనికి యుక్తమని, ఉపయోగకరమని తోచినవారి కెవరికైనను ప్రసరింపచేయగల నొక బ్రహ్మాండమైన శక్తిని — ఇయ్యగలడు. అతడాసోదర బృందముయొక్క శక్తిని తనద్వారా యెంతవరకైతే ప్రవహింపనిచ్చునో అంతవరకే ఆశక్తి అతని గుండా ప్రవహించును. తానెట్టి కార్యములనిమిత్తమై యెంతవరకాశక్తిని వినియోగ పరచునో ఆబాధ్యత పూర్తిగా తనదేనని జ్ఞాపకముంచుకొని ఆశక్తిని వినియోగించ వలెను. దీక్షనిచ్చెడు సమయమందు పరమపురుషులిచ్చెడు ఆశీర్వాదముయొక్క అర్థమేమనగా: "నేనునిన్ను ఆశీర్వదించుచున్నాను; నాశక్తిని,నా ఆశీర్వాదమును నీలో ప్రవహింపచేయుచున్నాను, నీవు తిరిగి యీ సుహృద్భావమును నిరంతరము పరులపై బరపుచుండుము."

క్రొత్తదీక్షితునకు విశ్వాసమెంత యెక్కువగానుండునో అతనిద్వారా అంత యెక్కువగా శక్తిప్రవహించును. లేశమైన సంశయముగలిగినను, లేక, అట్టి బ్రహ్మాండమగుశక్తిని తనద్వారా ప్రవహింపజేయు బాధ్యతచే కృంగిపోయినను, ఈయద్భుతమగు వరమును పూర్తిగా నుపయోగింపజాలడు. అట్లుగాక, శ్రద్ధయను

యోగ్యతను గలిగియుండి, పరమగురువునందును, సోదరబృందమునందును పరిపూర్ణ విశ్వాసము గలిగియుండి, వారితో తానొకటి యగుటచే సమస్తము తనకు సాధ్యమగునను సంపూర్ణనిశ్చయము గలిగియున్నయెడల, అతడు ప్రపంచములో ఎచటకు పోయినను తనచుట్టును సంతోషమును, ఆశీర్వాదమును వెదజల్లుచు కేవలమొక జ్ఞానదేవతవలె సంచరించగలడు.

ఆ మహాశ్వేత సోదరబృందముయొక్క చైతన్యము వర్ణనాతీతము, అద్భుతము నైనది. అది బహుశాంతము, ప్రకాశవంతమునగు మహార్ణవమువలెనుండుటచే ఆచైతన్యములో లేశమైనపులకరము బుట్టినయెడల అది ఆక్షణమందే యొకచివరనుండి మరియొక చివరకు తళుక్కుమని మెఱసిపోవును; అయినను ప్రతి సోదరునకు అదంతయు తనస్వంత చైతన్యమువలెనే దోచును; కాని యేఒక్క మానవచైతన్యముబొంది యెుఱగని బలమును, శక్తిని, జ్ఞానమును గలిగియుండును. ఆ సోదరబృందముయొక్క విశ్వచైతన్యము దివ్యమగు మహాసముద్రమువలె అతిఘనముగా, అత్యద్భుతముగా, సాటిలేనిదై యుండును. ప్రథమయోగ దీక్షనుబొంది సోదరబృందములో చేరినవారైనను, ఆ చైతన్యముయొక్క కొన్ని జాడలను మాత్రమే చూడగలరు, అక్కడక్కడ కొన్ని స్వల్పవిషయములను మాత్రమే జ్ఞాపకముంచుకొనగలరు. నిర్వాణలోకములోనే దానిని సంపూర్ణముగా అనుభవింపసాధ్యమగును, ఏలయన ఆలోకములోనే సోదరబృందము ప్రధానముగా ఉనికిగలిగియుండును, అయినను, స్థూలలోకముసహా అన్నిలోకములలోను దాని యావిష్కరణము గలదు.

శిష్యులజట్టు అంతయు పరమగురువు చైతన్యములో నేకమైయున్నట్లుగానే సోదరబృందమంతయు లోకప్రభువుయొక్క చైతన్యములో నేకమైయుండురు. పరమసోదరులందరు తమలోతామొక విషయముగూర్చి స్వేచ్ఛగా చర్చచేయవచ్చును. గాని ఆ చర్చ ఒక్కొక్కని మనస్సులో ఆవిషయమునకు సంబంధించిన వివిధరూపములు భిన్నాభిప్రాయములు ప్రదర్శితమై వానినన్నిటిని సంపూర్ణముగా, ఆ మనస్సులోనే విమర్శచేయుచున్నట్లగపడును. కాని, ఎంతచర్చ జరుగుచున్నను, బ్రహ్మాండమైన భీకరప్రశాంతములో చలింపసాధ్యము కాని నిశ్చయములో నున్నామని తోచును. ఇంత ప్రశాంతతలోను ప్రతి సూచనయు సాదరముగా సత్కరింపబడును. అంతేగాక సోదరబృందమంతయు ప్రతిసోదరునియొక్క అభిప్రాయముకొరకై ఆతురతతో అతిశ్రద్ధగా వేచియున్నట్లు తోచును. ఈచైతన్యముతో సరిగాపోల్చదగినది భూలోకములో

నేదియునులేదు. దానిస్పర్శ యొకింతకలిగినచో నేదోనవ్యము, ఆశ్చర్యకరమునగు దానితో సంబంధము కలిగినట్లుండును; అయినను, వర్ణింపలేనంత అద్భుతముగను రమ్యముగను నుండును; దానికి ఋజువుగాని, సామ్యముగాని అవసరములేకయే యేదో అజ్ఞాతమగు నున్నతలోకమునకు చెందినట్లు స్పష్టముగా ప్రకటితమగును.

ప్రత్యేకవ్యక్తిత్వములన్నియు అంత ఆశ్చర్యకరముగా ఆచైతన్యములో మిళితమైనను, అవన్నియు అతిస్పష్టముగా ప్రత్యేకించియుండును; ఏలయన, ముఖ్యమగు ప్రతి తీర్మానమునకు ప్రతిసోదరుని అంగీకారము కావలసియుండును. ఆలోకప్రభువు శాసనమునకు తిరుగులేదు; అయినను ఆమహాసంఘములోని సభ్యులందరి అంగీకారమును ఆయన బొందుచుండును. ఎవ్వరేవిషయమై చెప్పినను యోచించుట కెల్లప్పుడును ఆయనసంసిద్ధుడైయుండురు. ఈ మహాపాలకవర్గముతో భూలోకములోని యే ఆలోచనసభకు పోలిక ఇసుమంతైననుండదు. అధికారపదవుల యందుండువారందరికంటె గొప్పవారయిన ఆ పరమపురుషులను ఎవ్వరును ఆ పదవులకెన్నుకొనలేదు. ఏ సంస్థయు వారినచటనియమించలేదు. విశేష వికాసముచేతను, గొప్పజ్ఞానముచేతను, వారాపదవులను సంపాదించిరి. తనకంటె గొప్పవారితీర్మానమును ఎవ్వడును సంశయింపడు, ఎందుచేతననగా, అతడుతనకంటె వాస్తవముగా శ్రేష్ఠుడనియు, తనకంటెనెక్కువ అంతర్దృష్టియు ఎక్కువసంపూర్ణముగా తీర్మానింపగలశక్తియు గలవాడని అతడెరుగును. ఈమానవాతీతులందరు ఒకేరీతిని యోచింపవలసినదనిగాని, పని చేయవలసినదనిగాని లేశమైనను బలవంతములేదు, ఉండనేరదు. కాని, వారలకందరకు ఆమహాసంస్థయందు అపారమగు విశ్వాసముండుటచేత వారిలో భేదాభిప్రాయములు స్థిరముగనుండిపోవుట కేవలమసంభవము. అట్టిలోకప్రభువుయొక్క ఆధిపత్యము క్రింద పనిచేయుచున్న అట్టిసోదర బృందముతో సంబంధించినప్పుడే, ఇంగ్లాండులోని ఛర్చియుద్యోగులలో నొకరు చెప్పినట్లు, "ఆయనసేవలోనే సంపూర్ణమగు స్వేచ్ఛగలదు"; అను చక్కనివాక్యము పూర్తిగా బోధపడును.

## భంగపాట్లు

అట్లు నిర్మాణము కాబడినసంస్థలో భంగపాటునకుగాని, యే విధమగు చిక్కులకుగాని, యెట్టియవకాశముండకూడదు; అయినను. మానవులు సహజముగా దుర్బలులగుట చేతను, ఈ మహాసోదరబృందముయొక్క సభ్యులందరు మానవా

తీతులుకాక పోవుటచేతను, అప్పుపడప్పుడుభంగపాట్లు సంభవించుచుండును, కాని, అవి అతిఅరుదుగా సంభవించును. మోక్షమార్గప్రదీపికలో చెప్పినట్లు, "మహాను భావులు తమ బృహద్బాధ్యతయొక్క భారమును భరింపలేక, ముందుకుసాగిపోలేక, మోక్షద్వారమునుండి సహితము వెనుకకు పడిపోవుచుందురు." పరమపురుషత్వము సిద్ధించినప్పుడే పరిపూర్ణక్షేమము కలుగగలదు. ఉపదేష్టఅభ్యర్థితో "నీ వీ ప్రవాహ ములో ప్రవేశించితివిగనుక, ఇకనెప్పటికి క్షేమముగానుండగలవు" అని చెప్పునని యిదివరలో చదివితిమి. కాని, అతడు తన మార్గములో నుండెడు ప్రేరేపణములలో దేనికైనను లొంగిపోయినయెడల, అతని పురోవృద్ధిని విశేషముగా ఆలసింపజేసి కొనును. ఎప్పటికీ క్షేమముగానుండగలరను వాక్యమునకర్థమేమనగా, అయిదవ పరి వర్తనములో మధ్యనువచ్చెడు "తీర్మానకాలమందు", అనగా ద్రవ్యాత్మకమగు శరీరముతో నవతరించి క్రీస్తు ఈ ప్రపంచచక్రములో ఏయాత్మలు పరమావధికి చేరగలవో ఏవిచేరలేవో తీర్మానించెడుకాలమందు, అనర్హులుగా వెనుకకు త్రోసి వేయఃబడరని నిశ్చయమును సూచించును. శాశ్వతమగు శిక్షయనునది లేదు, క్రీస్తు చెప్పినట్లు అదియొకకాలముపాటు ఉండవచ్చును. ఈపరిణామవిధానములో గమ్య స్థానమును చేరజాలనివారు కొందరున్నారు, తరువాత రాబోవువిధానమును వార నుసరింతురు. ఇప్పుడు మందముగావెనుకబడియున్న విద్యార్థి యొకసంవత్సరము తప్పిపోయి, మరుచటియేడు జట్టుతో చురుకుగాచదివి ఆజట్టులో మొదటివాడుగా కూడ నుండుటసంభవించును, పరిణామములోగూడ అదేవిధముగ జరుగును.

దీక్షితులైనవారిలో నెవరైన అట్టిభంగపాటును నొందుటయను విచారకరమగు ఘోరసంఘటనము సంభవించినయెడల, అపారమగు ఆ చైతన్యము నందంతటను తీవ్రమగుబాధ ఒక తరంగమువలె పాకిపోవును. ఏలయన, ఆబృందమునుండి యొక్క రైనను వేరుపడినయెడల, అందరిహృదయనాళములను కోసి,చేసిన యొకశస్త్రచికిత్స వలె మిక్కిలిబాధకరముగానుండును. ఒక సోదరుడు విడిపోవుటయనునది ఆ సోదర బృందమున కత్యంతవిషాదకరమగు విషయము. అట్టి వియోగము సంభవించినను, పతితుడైన సోదరుడెంతదూరము తప్పిపోయినను, అతడుశాశ్వతముగా వీడిపోనేరడు. ఎప్పుడో, ఎచటనో, ఎలాగుననో, అతడు తిరిగివచ్చును. తెగగొట్టుటకు సాధ్యముకాని యొక లంకెగలదు; కానివారందరితో అతనికి పునః సంయోగము గలుగునంతవరకు

అతడెట్టికష్టమార్గమున బోవలెనో, ఎట్టిబాధననుభవింపవలెనో మనకు బాగుగ తెలియదు.

మోక్షమార్గప్రదీపికలో, ఒకటవభాగము 21వ సూత్రములో చెప్పబడినట్లు "అంతర్వాణి అతనిలో నిలిచియుండును; మార్గమునతడు పూర్తిగా విసర్జించినను, ఎప్పుడో యొక రోజున అది అతనిలో ప్రతిధ్వనించి, అతనిని రెండింటిగా చీల్చివేసి, అతని దివ్యస్వభావమునుండి నీచరాగములను వేరుపరచును. అప్పుడతని నీచప్రకృతి విసర్జింపబడినదై, బాధతో, నిస్పృహతో రోదనముచేయుచుండ, అతడు తిరిగి వచ్చును."

సోదరబృందమునకు సహింపసాధ్యముగాని రాగమేదయిన అకస్మాత్తుగా విజృంభించుటచే కొంతకాలముచ్యుతులగువారు కొందరుందురు. పరమగురువు తనకును, తప్పుదారినబడిన తమశిష్యునకును మధ్యతాత్కాలికముగా నొక తెరను నిర్మించునట్లుగానే, సోదరబృందముకూడ తప్పిపోయిన తమ సోదరునిచుట్టు నొకసంచి వంటిదానిని నిర్మించి యతనిని తమనుండి కొంతకాలము వేరుచేయుదురు. కాని యొక్కొక్కప్పుడు సోదరబృందము, కర్మనియతి నతిక్రమించకుండ, ఉపయోగింప గలిగినశక్తినంతను వినియోగపరచినను, ఒక సోదరుడు శఠుడై తనకపకారమో, అగౌరవమో జరిగినదనుకొని యహంకారమును, దురభిమానమును విడిచిపెట్టలేక పోవును. అట్టిసందర్భములలో నతడుమంచిమార్గమునకు తిరిగివచ్చువరకు అతనినొక సంచివంటిదానిలో కప్పివేయవలసి యుండును.

అనేకయుగములు గడచినను దీక్షాప్రదానవిధానము మార్పుచెందక యొకే విధముగానున్నది. అయినను దానిలో నొకవిధమగు లక్షణము — మార్పుచేయుట కవకాశము నిచ్చెడులక్షణము — గలదు. ఉపదేష్టయిచ్చెడు దీక్షలో రెండుభాగము లుండును. ప్రథమభాగములో మార్పేమియునుండదు; రెండవభాగము దీక్షను బొందుచున్న అభ్యర్థికి వ్యక్తిగతముగా నిచ్చెడు సలహాయైయుండును;దీనినిసామాన్య ముగా రహస్యభాగమందురు. అభ్యర్థికి ప్రబలశత్రువైనవానియొక్క విగ్రహమును నిర్మించిచూపించి, వానినా అభ్యర్థియేమిచేయును, అతనినిపూర్తిగా క్షమించుటకు సంసిద్ధుడైయున్నాడా, అటువంటిహీనుడు సహితము తనకంటబడినయెడల వానికి సహాయముచేయునా, మొదలగు ప్రశ్నలనడిగిన సందర్భములను నేనెరుగుదును. మరికొన్ని సందర్భములలో అభ్యర్థి అదివరలో ఎట్టిసత్కార్యములను జేసెనో

ప్రశ్నించి, అతనివలన సహాయమును బొందినవారిని సాక్ష్యమిచ్చుటకై యచటకు రప్పింతురు. దీక్షాసంస్కారము నిపుడువివరించెదను..

## ఒక ప్రథమయోగదీక్షయొక్క వివరణము

1915 సంవత్సరములో వైశాఖపౌర్ణమి ఉత్సవము మేయినెల 29 వ తేదీ ఉదయం జరుగనై యున్నందున, మేయినెల 27 వ తేదీ రాత్రి యొక అభ్యర్థికి దీక్ష నొసంగుటకు నిశ్చయింపబడినది. అందుకు సిద్ధముగానుండవలసినదని మాకాజ్ఞ వచ్చెను. ఆసమయమందు మైత్రేయప్రభువు ఉపదేష్టగానుండిరి. అందుచే సంస్కారము ఆయన తోటలోనే జరిగినది. మోర్యమహర్షి గారు గాని, కూట్‌హూమిమహర్షి గారుగాని సంస్కారమును జరిపినయెడల, అది సామాన్యముగ వారి గృహముల మధ్యనున్న నదిపై వంతెనకు దగ్గరనేయున్న ప్రాచీనగుహాలయములో జరుగును. ఆరాత్రి పరమపురుషులు చాలమంది సమావేశమయిరి. మాకు పరిచయముగల వారందరు దయచేసిరి.రమ్యమగు ఆయుద్యానవనముఆనాడు రమ్యతమముగ నుండెను. పొదలన్నియు నెల్లని పుష్పములతో నేత్రోత్సవము గావించుచుండెను. నవకుసుమితములగు గులాబీల పరిమళముతో పవనుడు హృదయముల రంజిల్లచేయుచుండెను. మైత్రేయప్రభువు ఆయనయింటియెదుటనున్న భూరుహముచుట్టును స్థాపితమైన చలువరాతి తిన్నెపయిన, ఆయన మామూలుస్థలమున ఆసీనులయిరి. పరమగురువులందరును అర్ధచంద్రాకారముగా ఆయనకు రెండుప్రక్కలను రెండుమెట్లు క్రిందుగానున్న పచ్చిక తిన్నెమీద వారికొరకు వేయబడినఆసనములపై గూర్చుండిరి. ప్రభువు వైవస్వతమనువును, మహాచోహనువారునుగూడ ఆచలువరాతి తిన్నెమీదనే దక్షిణాభిముఖముగనుంచబడిన దక్షిణామూర్తివారి సింహాసనమను పేరుగల నకిషీ చెక్కిన సింహాసనముయొక్క చెరి యొక భుజమును జేరి కూర్చుండిరి.

అభ్యర్థియును, అతని పరమగురువును, మైత్రేయులవారిపాదములవద్దకొంచెము క్రిందుగా నిలబడిరి. వారివెనుకను, దిగువను, దీక్షితులయినట్టియు, దీక్షితులుకానట్టియు ఇతరశిష్యులు కొందరు నిలబడిరి. ఈప్రేక్షకులను సంస్కారములో చాల భాగమును చూడనిత్తురు. కొన్నిసమయములయందు మాత్రము ప్రధానపాత్రలు జరుపు తంతు కనబడకుండ బంగరువలె వెలుగు తెరను వేయుదురు. అభ్యర్థి,సంప్రదాయము ప్రకారము, వదులుగా జీరాడు తెల్లని నూలువస్త్రములను ధరించెను.

పరమపురుషులు చాలవరకు అద్భుతమగు పెద్దబంగరు జరీయంచులుగల తెల్లని పట్టు దుస్తులను ధరించిరి.

పైన దేవగణములు ఎగురుచు తిరుగుచుండెను. శ్రావ్యమగు వారి మృదు గానము ఆకాశము నింపెను. ఆగానమాధురి యేదో ఆశ్చర్యకరము సూక్ష్మమునగు విధమున అభ్యర్థియొక్క జీవస్వరములోనుండి అతనిగుణములను భవితవ్యములను ప్రకటించు నొక సంకులబద్ధమైన స్వరజాలము నుద్భవింపజేసినట్లు అగుపించెను. విహంగముల మధురగానమునకు సెలయేటి మృదుహాసమువలెనే, ఆసంస్కారసమయమున పలుకబడినమాటలకు ఆగంధర్వగానము ఆటంకముగాక ఆలంబనమేయగుచు, ఒక్కొక్క సమయమున విజయగానమువలె నుప్పొంగుచు సంస్కారము జరిగింత సేపు సాగుచుండెను. ఆగానమువలన వాయువే గానము చేయుచున్నట్లుండెను. మాట్లాడువారి కంఠస్వరములను ముంచివేయక వానికి శోభను సమకూర్చుచుండెను. ఆగానము ప్రతి అభ్యర్థియొక్క ప్రత్యేక జీవస్వరముపై నాధారపడియుండును. అభ్యర్థి యెట్లుండెనో, యేమికానున్నాడో మనకీలోకములో గ్రాహ్యముకాని రీతిని, సర్వమును తెలియచేయునట్టి స్వరములతోను, స్వరకల్పనలతోను గానము సాగుచుండును.

ఆరంగమధ్యమున, ప్రతిపాదనచేయునట్టియు, బలపరచునట్టియు, పరమగురువుల నడుమ అభ్యర్థి నిలబడెను. అతని గురువగు కూట్‌హూమిమహర్షిగారు అతనిని ముందుకు నడుపగా జీససుమహర్షి బలపరచుటకై నిలబడిరి. మైత్రేయప్రభువు మందహాసముచేయుచు "నావద్దకు మీరిటుల తీసికొనివచ్చిన ఈతడెవరు ?" అని ఈ సంస్కారములో అడుగవలసిన మొదటిప్రశ్న నడిగిరి.

"మహాసోదరబృందములో చేరనాశించెడు అభ్యర్థి" యని మన పరమగురువు మామూలురీతిని జవాబుచెప్పెను.

మై. ప్ర :— "ఇతడందుకు యోగ్యుడని మీ బాధ్యతపై చెప్పగలరా ?"

కూ. హూ:— "అవును, నేను చెప్పగలను."

మై. ప్ర:— "ఇతడు నడువదలచినమార్గమున ఇతని సరిగా నడుపుదుమని మీరు పూచీపడెదరా ?"

కూ. హూ:— "నేను పూచీ పడెదను."

మై. ప్రె:— "మా నిబంధనముప్రకారము ప్రతి అభ్యర్థికి ఇరువురు పెద్ద సోదరులు పూచీపడవలెను; ఈ దరఖాస్తును బలపరచుటకు మరియొక సోదరు డెవరైన గలరా ?"

జీససుమహర్షి :— (మొదటిసారి మాట్లాడుచు) "బలపరచుటకు నేను సిద్ధముగానున్నాను."

మై. ప్ర. — "ఇతని కదనముగా శక్తులను ప్రసాదించినయెడల, వానిని ఈశ్వరకార్యమును వృద్ధిపరచుటకై సద్వినియోగము చేయునని మీకు ఋజువుగలదా ?"

కూ. హూ. — "ఈయభ్యర్థి ఈజన్మలో చాల చిన్నవాడు, కాని యీస్వల్పకాలములోనే పెక్కు సత్కర్మలను జేసెను. ప్రపంచములో మనకార్యమును జేయప్రారంభించుచున్నాడు. గ్రీసుదేశములో గడపిన జన్మలో నావేదాంత సిద్ధాంతములను ప్రచారము చేయుటకును తనదేశము నభివృద్ధిజేయుటకును విశేషముగా శ్రమపడెను."

జీససుమహర్షి :— "ఇతడు రెండుజన్మలలో తనకుగల అపారమగు బలమును వినియోగించి నాకార్యములు ఓరిమితో నెరవేర్చెను. పరిపాలకుడుగానున్న జన్మలో అధర్మమును తొలగించి ఘనమైన ఆదర్శమును తన జీవితములో ప్రదర్శించెను. సన్యాసిగానున్న జన్మలో ప్రేమను, పవిత్రతను, పారమార్థికమును విస్తారముగా వ్యాప్తిజేసెను. ఈకారణములచేతనే నేనిప్పుడు బలపరచుచున్నాను."

మై. ప్ర. — (ఆయువకునిజూచి నవ్వుచు) "ఈయభ్యర్థి శరీరము వయస్సులో బహుచిన్నది. మన సోదరబృందములో సభ్యత్వగౌరవమును బొందుట కిదివరలో ఇంతచిన్నశరీర మెన్నడును తీసికొని రాబడియుండలేదు. బాహ్యప్రపంచములో నింకను జీవించుచున్న మన సోదరబృందములోని సభ్యులెవరైనను మాతరపున ఈ చిన్నశరీరమునకు కావలసిన సహాయమును సలహాను ఇచ్చుటకు సిద్ధముగా నున్నారా ?"

సిరియసు — (సి. డబ్లియు. యల్‌గారు) వెనుకనిలబడిన శిష్యవర్గములో నుండి ముందుకువచ్చి "ప్రభూ, ఇతనిశరీరము నాకందు బాటులోనున్నంతకాలము నాశక్తికొలది నాకు సాధ్యమయిన దంతయు మిక్కిలి సంతోషముతో చేసెదను," అని చెప్పెను.

మై. ప్ర. — "ఈచిన్నయభ్యర్థికి కావలసిన సహాయము నంతను ఇయ్య గలుగుటకు నీహృదయమునం దితనియెడ సంపూర్ణసోదర ప్రేమ గలదా ?"

సిరియసు — "కలదు."

మై. ప్ర. — (మొదటిసారి ప్రత్యక్షముగా అభ్యర్థి నుద్దేశించి) "నీవుకూడ ఈసోదరుని ప్రేమింతువా ? అవసరమైనప్పుడు వీనిసహాయ మును బొందుట నీకిష్టమేనా ?" అని యడిగిరి.

అందు కాయువకుడు "నిశ్చయముగ, మనఃపూర్వకముగ ప్రేమించెదను. వారి సహాయము లేనిదే నేనిచట నిలబడియుండను." అని బదులుచెప్పెను. మైత్రే యులవారు గంభీరముగా తమ శిరమును వంచిరి. పరమగురువులు యువకుని ఆయువ దేష్ట కెదురుగా నిలబెట్టిరి. అతనిపై దృష్టి నిలిపి మైత్రేయప్రభు విట్లనిరి:

"అంతములేకుండ శాశ్వతముగనున్న సోదరబృందములో చేరుటకు నీకభి లాషగలదా ?"

"ప్రభూ ! నే నింతచిన్న వయస్సులోనుండ చేరుటకు యోగ్యుడనని మీరు దలచినయెడల, చేరుటకు నాకిష్టమే." అని యతడు బదులు చెప్పెను.

మై. ప్ర. — "ఈసోదరబృందముయొక్క ఆదర్శమును నీ వెరుంగుదువా ?" అని యడుగ, యువకుడు — "పరిణామ విధానము ననుసరించి ఈశ్వర సంకల్పమును నిర్వహించుట మూలముగా ఆయన ఇచ్చను నెరవేర్చుటయే సోదర బృందముయొక్క ఉద్దేశము" అని జవాబు చెప్పెను.

మై. ప్ర. — "నిన్ను నీవు సంపూర్ణముగా మరచిపోయి, లోకకళ్యాణమును ప్రధానముగా నెంచి, ఈశ్వరుడు ప్రేమమూర్తియైనట్లుగానే, నీజీవితము నంతయు ప్రేమమయముగా చేసికొని, నీజీవిత మును, నీశక్తిని సర్వమును ఈకార్యముకొరకై వినియో

గించెదనని ప్రతిన బట్టెదవా ?" అని యువకుని యడుగగా,
అభ్యర్థి "నాపరమగురువు సహాయముతో నాశక్తికొలది నేనందుకొరకై కృషి చేసెదను," అని జవాబు చెప్పెను.

మై. ప్ర. — "రహస్యముగా నుంచవలసినదని చెప్పెడు విషయములను రహస్యముగా నుంచెదనని వాగ్దానము చేసెదవా ?"

యువకుడు — "నేనట్లే వాగ్దానము చేసెదను."

ఆతరువాత, భువర్లోకజ్ఞానము గురించియు, భువర్లోకకార్యము గురించియు అతనిని మామూలుప్రశ్నలనడిగిరి. అనేక భువర్లోకవస్తువుల నతనికిచూపించిరి. అవి యేమిటో అతడు సమాధానము చెప్పవలసియుండెను. సజీవునియొక్కయు మృతుని యొక్కయు కామశరీరములకు గలభేదములను గుర్తించి చెప్పవలసియుండెను. అటులనే నిజమగు మనిషికిని, ఆమనిషియొక్క సంకల్పస్వరూపమునకుగల భేదమును, పరమగురువునకు వారిప్రతిరూపమునకుగల భేదమును గుర్తింపవలసియుండెను. అప్పుడు ఉపదేష్ట అనేక భువర్లోకసందర్భములను చూపించి యే సందర్భములో ఎట్లుసహాయము చేసెదవని అతనినడిగిరి. అతడు చెప్పగలిగినంతవరకు బాగుగా జవాబులిచ్చెను. తుదకు ఆయన చిరునవ్వునవ్వి జవాబులన్నియు చాలతృప్తికరముగా నున్నవనిరి.

ఆ తరువాత ఉపదేష్టబోధచేసిరి. ఆ బోధ బహుగంభీరముగను మనోహరముగనునుండెను. అందులో కొంతభాగము సామాన్యముగా నొకేరీతిగనుండును, అయినను ప్రతిఅభ్యర్థికి ప్రత్యేకముగావర్తించు కొన్నిమాటలు చేర్చబడును. ఈబోధలో ప్రపంచములో సోదరబృందము చేయవలసినకార్యము గూర్చియు ప్రపంచదుఃఖములయొక్క బృహద్భారమును వహించుటలో ప్రతిసభ్యుడు పాల్గొనవలసియున్నందున ప్రతియొకసభ్యుని పైనగలబాధ్యతగూర్చియు చెప్పుదురు. మరియు ఆసోదరబృందమంతయు నొకేసంస్థయై, ఒకేధర్మముననుసరించి, ఒకేయధిపతికిలోబడి పనిచేయుచుండుటచే ప్రతిసభ్యుడును సేవచేయుచు, సలహానిచ్చుచు, సహాయము చేయుటకు సంసిద్ధుడై యుండవలెను. ఏ సోదరునికైనను ఒకస్థానికవిషయమై ప్రత్యేకజ్ఞానముగాని, అతనికొక విశిష్టమగుశక్తిగాని యున్నయెడల, మానవపురోవృద్ధికొరకై సోదరబృందము చేసెడుకార్యములో ఏదైననొకశాఖలో వినియోగపరచుటకై ఆసోదరుడాజ్ఞానమునుగాని శక్తినిగాని సమర్పించుభాగ్యము గలిగియుండును. లోక

ప్రభువుయొక్క అధికారము నిరాఘాటమైనదైనను సోదరబృందములోని యిక్కలి చిన్నసోదరుని అంగీకారమునుగూడ తీసికొనకుండ ముఖ్యమగు తీర్మానమును దేనిని చేయరు. ప్రతిసోదరుడును ప్రపంచములో నేభాగమందున్నను ఆసోదరబృందమునకు ప్రతినిధియైయుండును. ఎక్కడకుపంపిన అక్కడకుపోయి, ఏ కార్యమును చేయమనిన ఆకార్యమును చేయుటకుసంసిద్ధుడైయుండి, సర్వదా సోదరబృందముయొక్క కార్య నిర్వాహణముకై తనను తానుసంపూర్ణ సమర్పణముచేసికొనును. చిన్నసభ్యులు వారివారి అధికారుల ఆజ్ఞలను శిరసావహింతురన్న సంగతినిజమే, అయినను స్థానిక విషయములగురించి తమకుగల జ్ఞానముతో తగుసూచనలను జేయుచు సహాయము కూడ చేయుచుండగలరు.

ఇహలోకములో జీవించుచున్న ప్రతిసోదరుడును తానొక కేంద్రముననియు, లోకప్రభువు అవసరమునుబట్టి ఎవరికైనను సహాయముచేయుటకై తనద్వారాశక్తిని ప్రసరింపజేయవచ్చుననియు, పెద్దసోదరుడెవరైనను ఏక్షణమందైనను లోకప్రభువు ఆశీర్వాదమును ప్రసాదించుటకై తనను వెల్లువగానుపయోగింపవచ్చుననియు జ్ఞప్తి యుంచుకొనవలెను. కనుక ఏ సమయమందు తాను ఉపయోగపడవలసియుండునో తనకు తెలియదు గనుక ప్రతిచిన్నసోదరుడు అనుక్షణము సిద్ధముగానుండవలెను. సోదరుడు తనజీవితకాలమంతయు కేవలము సేవాపరాయణుడై యుండవలెను. నిరంతరము సేవజేయుటకై అవకాశముకొరకు కనిపెట్టి చూచుచుండవలెను. సేవచేయుటయే అతనికి పరమానందమై యుండవలెను. సోదరబృందముయొక్క గౌరవము తనచేతిలోనున్నదని జ్ఞప్తి గలిగియుండవలెను; తనమాటవల్లగాని, క్రియవల్లగాని ఆబృందమునకు మానవులదృష్టిలో ఎట్టికళంకమురాకుండ, దానిని జనులు ఇసుమంతైన చులకనగా జూడకుండ, మనోవాక్కాయకర్మలచే సంశుద్ధిగలిగి మెలకువగా నుండవలెను.

ప్రవాహమునందు ప్రవేశించినతోడనే పరీక్ష, పోరాటము ముగిసెనని అతడెన్నడును తలచరాదు. నిజముగా అతడు వెనుకటికంటె ఎక్కువకృషిచేయ వలసియుండును. కాని అందుకు తగినబలముకూడ అతనికిచేకూరును. అతనిశక్తి వెనుకటికంటె హెచ్చుగనుండును గనుకనే అతనిబాధ్యతగూడ అధికమగును. తానొక ప్రత్యేకవ్యక్తిగా ఈ సోపానము నధిగమించి తోడిమానవులకంటె నున్నతమగుస్థానమును బొందియుండలేదని జ్ఞాపకముంచుకొనవలెను. మానవజాతియంతయు

తనద్వారా స్వల్పముగా నుద్ధరింపబడినదనియు, శృంఖలములనుండి స్వల్పముగా విడిపించుకొనగలిగినదనియు, స్వశక్తిచేతనే యీ స్థితికి రాగలిగినదనియు తెలిసికొని సంతసించవలెను. సోదరబృందముయొక్క ఆశీర్వాదమెల్లప్పుడును అతనితోనుండును. పరులపై దాని నతడెంతవరకు ప్రసరింపజేయునో సరిగా అంతవరకే అది యతని లోనికి ప్రసరించును. ఇదియొక సనాతన ధర్మ సూత్రము.

పైనచెప్పిన దంతయు ప్రతివానికి సామాన్యముగ చేయబడు బోధయైయున్నది. ఈ యభ్యర్థికి ఉపదేష్ట ప్రత్యేకముగా ఈ క్రింది విధముగ సలహానిచ్చిరి:

"నీ శరీరమతిబాల్యములో నున్నది, గనుక మహత్తరమగు ఈ దీక్షాప్రదానము యొక్క బాధ్యతను భరించుట కష్టముగా నుండవచ్చును. కాని, నీ పిన్నవయస్సు వలననే ఇదివరకెన్నడును ఏ మానవునకు లభించని అద్భుతమగు అవకాశము నీకు లభించుచున్నది. నీవు పూర్వజన్మలలో జేసిన స్వార్థత్యాగముయొక్క కర్మఫలితముగా ఇప్పుడు నీకీ భాగ్యము వచ్చినది. దానినీజన్మలో నీవు సార్థకము చేసికొనవలెను. ఇంతత్వరగా నీకై ద్వారములను తెరచుటకు నిర్ణయించుటలో మేము వివేకముతో ప్రవర్తించితిమని నీవు నీ నడతవలన ఋజువు చేయగలవని నమ్మెదము. మనమందరము ఒకే సోదరబృందములో సభ్యులమనియు, అందరిలోను సంపూర్ణమగు నైక్యభావము గలదనియు నెల్లప్పుడును జ్ఞప్తిగలిగి యుండుము. దాని ప్రతిష్టకు నీవలన ఎన్నడును భంగము కలుగకుండ జాగ్రత్తగా నుండుము. ఈ జన్మలో ఇంతత్వరగా ప్రారంభించుటచే నీవు చాల దూరము పోవచ్చును. పైకెక్కుత్రోవ బహునిట్రముగా నుండును; కాని నీ ప్రేమ, నీబలము నీకు తోడుకాగలవు. జ్ఞానాభివృద్ధికై కృషి చేయుము, నీ యుపాధులన్నిటిని పూర్తిగా నిగ్రహించుట నేర్చుకొనుము. మెలకువ, నిశ్చయబుద్ధి, దూరదృష్టి—వీనిని పెంపొందించుకొనుము. నేను ప్రపంచములో బోధ చేయుటకు వచ్చుసరికి నీవునాకు నమ్మకమైన బంటుగా నుండుటకు సిద్ధముగా నుందువని యాసించెదను. నీ ప్రేమధనము వలననే ఈ మార్గమున ఇంతవరకు రాగలిగితివి; ఆ ప్రేమ నీలో దినదినాభివృద్ధిగా పెరిగి నీకు బలమునిచ్చుగాక, అదినిన్ను పరమ పదమును జేర్చుగాక."

అప్పుడు మైత్రేయులవారు పరమగురువుల వైపునకు తిరిగి యిట్లనిరి: "ఈ యభ్యర్థి సంతుష్టి కరముగ నున్నాడు; మన బృందములో జేర్చుకొనుటకు మీకందరకు సమ్మతమేనా?" "మాకు సమ్మతమే" యని అందరును ఏకగ్రీవముగా

నుడివిరి. తరువాత ఉపదేష్టతమస్థానము నుండి లేచి శంబళద్వీపము వైపునకు తిరిగి "ఓ ప్రభూ, ఓ సచ్చిదానందమూర్తీ, నీపేరున, నీకై నేనీపనిని జేయననుగ్రహించెదవా?" అని గట్టిగా పలికెను. దానికి జవాబు వెంటనే ఆలోక ప్రభువు సమ్మతిని తెలియజేయు ఉజ్జ్వలతార మైత్రేయ ప్రభువు శిరముపై వెలుగజొచ్చెను. అందరును సవినయముగా శిరముల వంచి నమస్కరించిరి. జయభేరీవలె విజయోత్సాహముతో దేవతల గానము మ్రోగెను. అట్లు గానము సాగుచుండ, పరమగురువులు ముందునడున అభ్యర్థి వారిని వెంబడించుచు ముందుకు పోయి, సోదర బృందములో ప్రవేశపెట్టుట కధికారముగల జగదేకోపదేష్ట యొక్క ప్రతినిధియగు ఆమైత్రేయుల వారి యెదుట మోకరించెను. అచంచలమగు విద్యుత్తువలె మెఱయుచున్న ఒక మెఱపు తీగె ఆ తారనుండి యుపదేష్టయొక్క హృదయమునకు వ్యాపించి, అచటనుండి అభ్యర్థి హృదయమునకు ప్రవేశించెను. బ్రహ్మాండమైన ఆ విద్యుచ్ఛక్తి యొక్క ప్రభావము వలస, అభ్యర్థిలోని ప్రజ్ఞానాంశువును తెలియుజేయుచు చిన్న రజిత తారవలె వెలుగుచున్న చైతన్యము పొంగి మిక్కిలి ప్రకాశవంతమై, అతని కారణ శరీరమును నింపెను; అద్భుతముగా ఒక్క క్షణ మాత్రము ప్రజ్ఞానాంశువు జీవాత్మతో నైక్యమై పోయెను, (పరమ పురుషత్వము సిద్ధించి నప్పుడే ఆ ఐక్యము శాశ్వతముగా నుండిపోవును). అంత, ప్రభువు తన హస్తములను అభ్యర్థి శిరముపై నుంచి, అతని నిజనామమున పిలచి * యిట్లనిరి:

"ఎవరి తార మనపై ప్రకాశించుచున్నదో ఆ యేకోపదేష్ట పేరను శాశ్వత జీవనముగల సోదర బృందములోనికి నిన్ను ప్రవేశపెట్టుచున్నాను. నీవు దానిలో యోగ్యుడవు, ప్రయోజకుడవు అగు సభ్యుడవై యుందునట్లు చూచుకొనుము. ఇప్పటికి నీవు శాశ్వతముగా సురక్షితుడనైతివి. నీవు స్రోతస్సులో ప్రవేశించితివి. ఆవల దరికి శీఘ్రముగా జేరెదవుగాక!"

దేవగానము మధుర సంతస స్వరముల మహార్ణవమువలె విస్తరించి గాలిని సహితము బలము తోను ఆనందముతోను నింపి వేసినట్లుండెను. ఉపదేష్టయు అభ్యర్థియు, అతనిని ప్రవేశపెట్టిన పరమగురువు లిరువురును మనువు యొక్కయు మహా

* ప్రతి మనుష్యునకు ఈలోకమున ఒక వ్యవహారిక నామముండును. అది యొక జన్మలోనే యుండును. జీవాత్మ కొక నామ ముండును. ఆ నామమును దీక్షాసమయమున నుపయోగింతురు. దీనిని సూచించుటకే హిందూదేశములో సన్యాసము దీసికొన్నవారు పేరును మార్చుకొందురు.

చోహాను యొక్కయు ఆశీర్వాద తరంగములను వహించిన అతి మనోహరములగు వర్ణములచే కప్పి వేయబడిరి. మరియొక మానవుడు మోక్షమార్గమున బ్రవేశించి నందున, మానవ జాతిలో పుష్పించిన ప్రథమకుసుమ మయిన శ్రీగౌతమ బుద్ధుల వారి దివ్య సువర్ణకాంతి వారిపై నాశీస్సుల గురిపించుచు తిరుగ జొచ్చెను. మరియు, ఆరజిత తార ఒకింత కాలము విస్తరించి ఉపదేష్టను, నవ్య సోదరుని తన అద్భుత మగు తేజస్సులో కప్పివేసెను. తిరిగి వారు కనిపించు సరికి అభ్యర్థి ధరించినవి నూలు వస్త్రములు గానుండక, ఇతరదీక్షిత సోదరుల దుస్తులు వలెనే తెల్లని పట్టు వస్త్రములై శోభిల్లెను.

ఉపదేష్ట తన కారణ శరీరమును ప్రకాశింపజేయగా దానికి జవాబుగా క్రొత్త దీక్షితుని కారణ శరీరముకూడ ప్రకాశించిన దృశ్యము ఎన్నడును మఱపురానంతటి యద్భుత సౌందర్యముతో విలసిల్లెను. ఆకుపచ్చతో మిళితమైన బంగారుకాంతి ప్రకాశించెను; సామాన్యముగా, కారణశరీరములోని శాశ్వతాణువులో నొక చిన్న చుక్కవలె వెలుగుచు గనబడెడు ప్రజ్ఞానాంశువు అతి శోభాయమానముగా ప్రకాశించుటచే ఆ ప్రకాశవంతమగు చుక్క పొంగి, విస్తరించి అండాకృతిగానున్న అతని తేజోమండలమంతటను వ్యాపించెను. ఈ సందర్భములో ప్రజ్ఞానాంశువు తనలోని అల్పాంశమగు జీవాత్మతో తాత్కాలికముగ తాదాత్మ్యమునొంది తానే ప్రతిజ్ఞ లన్నిటిని చేయును. కామశరీరముపై ప్రభావముకూడ బహు చిత్రముగానుండును. దాని సమతుల్యతయొక్క స్థిరత్వము చెడకుండ దానికొక సాత్వికమగు గొప్పయూపు ఇయ్యబడుటచే ఇకముందు తనమూలమునుండి చలింపక, తన యజమాని స్వాధీనము నుండి తప్పిపోక చాలా యెక్కువ చురుకుగా అనుభవించుచుండును. ఉపదేష్ట తన లోని స్పందమును అభ్యర్థి కామశరీరములో పునరుద్భవింపజేసి ఆ యూపునిచ్చి ఆ శరీరములో కంపముగాని కలవరముగాని లేకుండ దానిని స్థిరముగాజేసి, అపార ముగా హెచ్చిన శక్తితో స్పందించునట్లు జేయును.

ఇదంతయు జరిగిన తరువాత, ఉపదేష్ట జ్ఞానబీగమును (రహస్యోపదేశము) ఆ క్రొత్త సోదరునకిచ్చిరి. సోదరబృందమునకు చెందినట్టియు, తానదివర కెరిగియుండ నట్టియు సోదరు నెవరినైనను కామశరీరములోనుండగా పొరబడకుండ ఎట్లుగుర్తింప వచ్చునో అతనికి బోధజేసిరి. సాధ్యమయినంత త్వరలో ఆ యువకుని కవసరమగు బుద్ధి లోకసాధకములను చేయించవలసినదని పరమ గురువుల శిష్యులలో పెద్దవారు

కొందరి కాదేశము నిచ్చిరి. తరువాత, అచట సమావేశమైన సోదరులందరు ఆక్రొత్త దీక్షితుని యాశీర్వదించుటతో ఆ సంస్కారము ముగిసెను. ఆ నూతన సోదరుడు కూడ, సోదరబృందముయొక్క ఆశీర్వాదమును ప్రపంచమునకిచ్చి, ఆవిధముగాతనకు ప్రసాదింపబడిన నవ్యమహాశక్తిని మొదటిసారి వినియోగపరచెను. ఆ యాశీర్వాదము ప్రపంచమంతటను వ్యాపించుచు ప్రతి వస్తువునకు నూతనజీవమును, నూతనశక్తిని, అధికమగు సౌందర్యమును చేకూర్చుచుండ, కోట్లాదిజనుల గుసగుసలు గాఢమగు ఆనందముతోను కృతజ్ఞతతోను నిండిన గానముగా రూపమొంది వాతావరణ మంతయు నిండిపోయెను. కళ్యాణకరమగు శక్తి మరియొకటి ఆవిష్కరణమయ్యెను; తన బిడ్డలభారముచే బాధపడుచు మూల్గుచుండెడు ప్రకృతి తన బిడ్డలలో నొకడు తన బాధను నివారణచేయనున్న సోదరబృందములోచేరుటజూచి ఆహ్లాదముతో నుప్పొంగును. ప్రపంచముయొక్క జీవమంతయు నేకైకజీవము; అందులో ఏ యంశమైనను నిజమగు పురోవృద్ధిని బొందినయెడల ప్రకృతియంతయు దానివల్ల లాభమును బొందును; నిర్జీవములని మనము పొరపాటున తలచెడు జడపదార్థములుగూడ ఆ లాభమును బొందును.

అద్భుతమగు ఆ సంస్కార మా పరికారము ముగిసెను. పరమగురువులందరు క్రొత్త సోదరుని చుట్టును జేరి హృదయ పూర్వకముగా నభినందించుచుండ, అంత వరకు వెలుగుచున్న తార అదృశ్యమయ్యెను.

ఆ మరుచటి దినము రాత్రిక్రొత్త సోదరుని ఆ లోకప్రభువు దర్శనము చేయించవలసినదని నా కాజ్ఞ వచ్చెను. ఇది యొక మిక్కిలి అసాధారణమగు గౌరవము; ఇది ప్రథమ దీక్షాసంస్కారములోని భాగము కాదు. సాధారణముగా, ఇట్టిది మూడవ యోగదీక్షతో పాటు జరుగును. నియమిత సమయమునకు మేమిరువురము శంబళద్వీపమున కేగితిమి; మామూలు పరికారము పెద్దచావిడిలో మాకు దర్శనమిచ్చిరి. మేము పోవుసరికి లోక ప్రభువు గౌతమ బుద్ధులవారి తోను మైత్రేయ ప్రభువుల తోను ముచ్చటించుచుండిరి. అప్పుడు మైత్రేయులవారు "మన నూతన సోదరుడు, నిరంతరము పరికాశించుచుండెడు ప్రేమతార" ఇదుగోయని ఆ యువకుని ప్రభువున కెఱుక పరచెను. అప్పుడు ప్రభువగు సనత్కుమారులవారు మోకరించియున్న యువకుని జూచి యనుగ్రహపూర్వకముగా చిరునవ్వు నవ్విరి.

యువకుడు కరముల జోడించి నమస్కరింపగా ఆ ప్రభువు తమ దక్షిణ హస్తముతో అతని హస్త యుగ్మమును బట్టుకొని యిట్లనిరి:

"కుమారా! నీవు లెస్సగా జేసితివి. నేను చాల సంతసించితిని. నీ కీ సంగతి చెప్పుటకే నిన్నిచటకు రప్పించితిని. పొమ్ము, వెనుకటి కంటె నెక్కువ శీఘ్రముగా బనిచేయుము. నాక్రొత్త ఉపజాతి యొక్క భవిష్యదభ్యుదయములో నీవు గొప్ప పాత్రను ధరింప వలసియున్నది. కొద్దిగంటల క్రిందట నాతార నీపైన స్పష్టముగ ప్రకాశించినది. ఇకముందు నీవు దానిని జూడలేకపోయినను, నిజముగా అది యెల్లప్పుడును నీపైన తిరుగాడుచుండును. అది యెచ్చట ప్రకాశించినను అచ్చట నెల్లప్పుడును శక్తియు, శుద్ధియు, శాంతియు నేలుచుండును."

తరువాత బుద్ధభగవానుడు తమ కరమును ఆ యువకుని తలపై నుంచి యిట్లని పలికిరి: "నేను గూడ నాయాశీర్వాదమును నా అభినందనములను నీ కియ్యగోరెదను. ఏలయన నీ వింత త్వరితముగా పొందిన అభివృద్ధి వలన ఇకముందు గూడ బహు శీఘ్రముగా పురోభివృద్ధిని బొందెదవని ఆశించుచున్నాను. మరియు భవిష్యత్తున నిన్ను లోకములకు వెలుగు నిచ్చెడు ఆధ్యాత్మిక సంఘములో సభ్యుడవనియు, ఆదివ్యమగు గుప్తబృందములో నొక సోదరుడవనియు కొనియాడగలనని యాశించెదను."

వెనుక నిలబడిన ముగ్గురు కుమారులుగూడ అతనినిజూచి చిరునగవు నవ్విరి. అతడు మాటాడకుండ మోకరించియుండెను, కాని ప్రేమతోను భక్తితోను భాసిల్లుచుండెను. లోకప్రభువు ఆశీర్వాదపూర్వకముగా కరమునెత్తగా మేము సాష్టాంగ మొనరించితిమి. తరువాత మేమువారి శెలవుదీసికొని వెడలివచ్చితిమి.

## సంస్కారమునకు పట్టుకాలము

ఈ దీక్షా సంస్కారము పట్టుకాలము వేర్వేరు సందర్భములనుబట్టి మారుచుండును. ఒకటి, అభ్యర్థికిగల జ్ఞానసంపత్తు. కొన్ని సంప్రదాయములలో మూడు అహోరాత్రములు పట్టునని చెప్పిరి. కాని తరుచుగా చాల తక్కువ కాలములోనే పూర్తియగును. నేను స్వయముగా నెరిగిన యొక సందర్భములో రెండురాత్రులు పట్టెను, ఒక పగలంతయు ఏకాంతవాసములో గడచెను. ఇతర సందర్భములలో ఒక్కరాత్రిలోనే సంక్షిప్తముగా ముగిసెను. ఆ సమయమున బోధింపబడుచుండెడు-

చాల విషయములు పరమగురువుల పెద్దశిష్యులు తరువాత బోధించవచ్చునని వారికి విడిచిపెట్టిరి. వెనుకటి కాలములలో దీక్షాప్రదానములంత కాలము పట్టుటకు కారణ మేమనగా, అభ్యర్థులకు భువర్లోక కార్యనిర్వాహణముగురించి ఆ సమయమున బోధ చేయవలసి యుండెను. అంతేగాక, బుద్ధి లోకానుభవములనుగూడ అతడు పొంద వలసియుండెను. ఏలయన, ప్రథమ యోగదీక్షకు ముందు బుద్ధిలోకోపాధి (ఆనంద మయకోశము)లో కొంత వికాసము కలుగవలసియున్నది. లేనియెడల ఆ యంతరువున ఇయ్యవలసిన కొన్ని బోధలను గ్రహింపశక్యముగాదు. దివ్యజ్ఞానులలో చాలమంది యిదివరలోనే భువర్లోకకార్యమును బూర్తిచేయుటచేత వారు భువర్లోకముయొక్క వివరముల నెరుంగుదురు. ఈ జ్ఞానము నదివరకే సంపాదించియుండనియెడల దీక్షా ప్రదాన సమయమందు దానిని బోధచేయవలసియుండును. కాని అభ్యర్థికి బుద్ధి లోక మున వికాసము కొంతగలదని యుపదేష్టకు తెలిసియున్నయెడల, మరుచటిరాత్రిగాని శేక వీలుననుసరించి మరియొకప్పుడుగాని అభ్యర్థికి బుద్ధి లోకానుభవములను గలుగ జేసి అవసరమగు బోధచేయవలసినదని పెద్దశిష్యుల నాదేశించి, ఆ పనిని తరుచుగా వారికి విడిచిపెట్టుచుండిరి.

దీక్షా సంస్కారములోని ప్రధానభాగము ఆరుగంటలకు తక్కువగా పట్టును, కాని అంతకు పూర్వమును తరువాతను గూడ అభ్యర్థికి కొంతగడు వియ్య బడును, పరమగురువులు దీక్షానంతరము అభ్యర్థుల నెల్లప్పుడును అభినందింతురు, ప్రతి పరమగురువు కూడ దయాపూర్వకముగా కొన్ని విషయములను జెప్పుదురు. అట్టి సమావేశ అవకాశము దొరికినప్పుడు వారు తమ శిష్యులకు కొన్ని ఉత్తరవు లను గూడ నిచ్చెదరు. సాధారణముగా అట్టి సందర్భమొక గొప్ప యుత్సవము వలె హృదయరంజకముగా నుండును. అందులో చిన్న సభ్యులకు ప్రత్యేకముగ సంతోషకారణమగును. మరియొకముముక్షువు సోదర బృందములో సభ్యత్వము బొంది శాశ్వతముగా సురక్షితుడైన యెడల అది అందరకును విజయమేకదా.

## కు మా ర త్వ ము

స్వీకృత శిష్యునకును పరమ గురువునకును గల సన్నిహిత సంబంధమును గురించి యిదివరలో చెప్పియుంటిని. క్రమేణా యీ అన్యోన్యత గాఢముగా పెరుగు చుండును. సామాన్యముగా శిష్యుడు దీక్షాసంస్కార యోగ్యత బడయుటకు సమీప

స్థితికి వచ్చినప్పుడు పరమగురువు అతనిని వెనుకటికంటె ఎక్కువగాఢమగు నైక్యములోనికి తీసికొనుట యుక్తమని యెంచును. అప్పుడు శిష్యుని పరమగురువు యొక్క పుత్రుడని పిలచెదరు. వారిద్దరకు గల సంబంధ మెట్టిదన, శిష్యుని నీచ మనస్సుమాత్రమేగాక అతని కారణ శరీరములోని జీవాత్మ కూడ ఆ పరమపురుషుని చైతన్యముచే నా వృతమై యుండును, కనుక శిష్యునకును గురువునకును మధ్య నడ్డముగా తెరవేయుటకిక సాధ్యముకాదు. బుద్ధిమంతుడగు నొక ఫ్రెంచి దేశీయుడు చెప్పినట్లుగా "ప్రేమ సంఘటనలన్నిటిలోను, ప్రేమించువారు ఒకరును ప్రేమింపబడ నిచ్చువారు మరి యొకరును ఎల్లప్పుడును ఉండును."

ఈ వాక్యము మానవప్రేమ విషయములో పదింటికి తొమ్మిది సందర్భములలో తప్పక నిజమే. సామాన్యముగా దానికి కారణమేమన, రెండు ఆత్మలలో నొకటి రెండవదాని కంటె నెక్కువ వికాసము పొంది యుండును. అందుచే అది ఎక్కువ గాఢముగా ప్రేమించగలదు. చిన్న ఆత్మ ఆ ప్రేమ భాగ్యమును గ్రహించి తన శక్తికొలది తిరిగి ప్రేమ నిచ్చును. కాని యెంతయుత్తమ యత్నము జేసినను తన పెద్ద సోదరుడు సహజముగను బహుసులభముగను ప్రసరింపజేసిన అద్భుత ప్రేమ దానముకంటె శిష్యుడిచ్చునది తక్కువై యుండును. గురుశిష్యుల మధ్య సంబంధ మెప్పుడును ఈ విధముగా నుండక తప్పదు.

మరియొకవిషయము. మన సామాన్య జీవితములలో మనము జూచెడు ప్రేమ తరుచుగా అస్థిరముగను, చంచలముగను, నిరుత్సాహకరముగను నుండును. ప్రియుని ఉదాసీనతచేగాని, నిర్దయచేగాని ప్రతిఫలము లేకపోవుటచేగాని ఆ ప్రేమ అన్యాక్రాంతముగావచ్చును. ప్రియుడు మన కనిష్టమగురీతిని నడచుటచేగాని, మన కసహ్యము, చీకాకుగలిగించు విధమున ప్రవర్తించుటచేగాని మన ప్రేమ ద్వేషముగాగూడ మారిపోవచ్చును. కాని అంతకంటె ఎక్కువ సత్యము, ఎక్కువ గాఢమునగు ప్రేమ మరియొకటి గలదు. దానినేదియు చలింపజేయనేరదు. ఆప్రేమ ప్రతిఫలమునుగాని, జవాబునుగాని కోరదు. ప్రియునియొక్క అశ్రద్ధగాని, ఉదాసీనతగాని, అయోగ్యతగాని దానిని బాధింపనేరదు. ప్రేమింపబడుచున్న వ్యక్తి ఏదైననేరము జేసినను, సిగ్గుబాటుగా ప్రవర్తించినను, ఆవ్యక్తికొరకై దుఃఖించి తీవ్రమగు బాధపడునుగాని ఆప్రేమలో నెట్టి కొఱతయు గలుగనేరదు, దాని గాఢత్వములోగాని, శక్తిలోగాని, ఔత్స

క్యములోగాని రవంతైన తరుగు రానేరదు. వాస్తవముగా, గాఢమగు దుఃఖము ననుభవించును.

ఈశ్వరుడు తన ప్రపంచమునెడల జూపెడు ప్రేమస్వభావ మట్టిదే. పుత్రత్వ మనెడు అనిర్వచనీయమగు భాగ్యము ప్రసాదించెడు పరమగురువునకు శిష్యులయెడల గల ప్రేమస్వభావముగూడ నట్టిదై యుండవలెను. ఆయన తమ శిష్యులను సంపూర్ణముగా విశ్వసింతురు. తననుండి వారిని వేఱుజేయగలశక్తిని ఆయన ఐచ్ఛికముగా విసర్జించును. ఎందుచేతననగా, ఆ ప్రకారము వారితో సంపూర్ణము, అవిచ్ఛిన్నము నగు నైక్యము గలిగియుండుటచేతనే వారికి తన స్వస్వభావమును వారు గ్రహింపగలిగినంతవరకు సంపూర్ణముగా పంచిపెట్టగలుగుదురు. ఆయన ఈప్రకారము ఆత్మత్యాగము చేయుటచేతనే శిష్యుడు గురువువద్దనుండి గ్రహించగలదానినంతను ఆయన శిష్యున కీయగలుగుదురు.

ఆప్రకారము గురువు తన్నుతాను శిష్యునిదయ కధీనునిగా జేసికొనెనని వాస్తవముగా చెప్పవచ్చును. దీనివల్ల మనపై నెంత భయంకరమగు బాధ్యతగలదో యోచింపవచ్చును.

బహు అరుదైనను అట్టి ప్రేమ మానవులలో భూలోకముమీదగూడ గనబడగలదు. కాని, యెచ్చట ప్రదర్శితమైనను దాని లక్షణమొక్కటే, దాని ఫలితమును ఒక్కటే; ప్రేమ ఉత్తమమైనదానిని నీచమైనదాని వశముచేయును. అనుత్తమమగు ప్రేమ యెల్లప్పుడును అనుత్తమమగు త్యాగమే యగును. అయినను ఈ సంపూర్ణ యజ్ఞము, ఈ సంపూర్ణ ఆత్మపరిత్యాగము ప్రసాదించెడు ఆనందము భూలోకములోని సంతోషము లన్నిటిని అతిశయించినది. ఈ ప్రేమయే దివ్యమైన ప్రేమ. ఇదియే, దేవుని ప్రేమతో తుల్యమైనది. ఈ ఆత్మపరిత్యాగమే మానవుని క్రీస్తుయొక్క హృదయకుహరములోనికి తీసికొని పోగలదు. "ప్రేమ అనేక పాపములను కప్పివేయును," "ఆమె బాగుగా ప్రేమించెనుగనుక, అనేకములగు ఆమె పాపములన్నియు క్షమింపబడెను." అనువాక్యములు నిశ్చయముగ సత్యమే.

మోక్షమార్గ ప్రదీపికలో ఇట్టి అత్యంత సన్నిహితమగు సంయోగమునకు ఒక చక్కని యుదాహరణము గలదు. "నా శాంతిని నీ కొసగెదను" అనువాక్యము తన స్వస్వరూపులైన ప్రియతమ శిష్యులకుమాత్రమే గురువునలన ఉచ్చరింపబడగలద్ను.

అని అందులో వ్రాయబడెను. కావున ఆ శాంతిని సంపూర్ణముగా ఇతరుల కందజేయ గల అమూల్యమగు భాగ్యము గలవార లీశిష్యులు. పరమగురువుయొక్క స్వీకృత శిష్యుడు ప్రతివాడును వారిపేరిట ఆశీర్వాదమునిచ్చెడు అధికారమును, బాధ్యతను గూడ గలిగియుండును. అట్లుచేయుట కత డెప్పుడు ప్రయత్నించినను పరమగురువు యొక్కశక్తి అద్భుతముగ ప్రసరించును. ముఖ్యముగా అతడు ఏ గృహమునందైన ప్రవేశించినపుడు "పరమగురువు ఆశీర్వాదము ఈ గృహముపైనను, ఈ గృహవాసు లందరిపైనను నిలుచుగాక" యని మనస్సులో ఆశీర్వదింపవలెను. కాని గురుపుత్రుడు గురువుగారి సన్నిహిత సాన్నిధ్యముయొక్క అనుభూతినిగూడ, అనగా పూర్ణతరము. శ్రేష్ఠతరమునగు శాంతినిగూడ, ప్రసాదింపగలడు. గురుపుత్రుడైనవాడు మహాశ్వేత సోదరబృందములోగూడ సభ్యుడయిగాని, త్వరలో సభ్యుడు కాగలవాడైగాని యుం డును. ఆకారణమువలననే ఇదివరలో చెప్పినట్లు అతనికి విశేషాతిశయమగు ఆశీర్వా దము నీయగలశక్తికూడ గలుగును.

ఒకప్పుడు నాభాగ్యవశమున నా పరిసరములలో నివసించు ఒక గొప్పదేవ తతో పరిచయముగలిగెను. ఆ దేవతకు వేర్వేఱు సందర్భములలో నే నీరెండు ఆశీ ర్వాదములనుగూడ నిచ్చుట నాకు బాగుగా జ్ఞప్తికలదు. ఒకసారి వాని ప్రాంతముల ప్రక్కనుండి యొక నావలో బోవుచు నా పరమగురువుయొక్క సంపూర్ణమగు ఆశీ స్సును నమస్కారపూర్వకముగా వాని కిచ్చితిని. దాని నతడు గ్రహించినరీతి బహు రమ్యముగా నుండెను. నా ఆశీస్సును గ్రహించుచు అతడు శిరమును బాగుగవంచి నమస్కరించినపుడు వాని ముఖమునందు సంపూర్ణమగు భక్తియును, మృదుమనో హరమగు పవిత్రతయును వెలుగుచుండెను. మరియొకరోజున అట్టి సందర్భములోనే నే నా సోదరబృందముయొక్క ఆశీస్సు నిచ్చితిని. వెంటనే ఆ గొప్పదేవతలోని ప్రతి శక్తియు సంతోషాతిశయమున మెఱసిపోయెను, వాని ప్రదేశమంతయు కాంతితో వెలిగెను. ఆదేవతయేగాక వానిచేతిక్రింద పనిచేయు భూతములన్నియు సజీవములయి ఉద్దీపితములైనట్లుండెను. ప్రకృతియంతయు హఠాత్తుగా ఒక్కసారి బదులు పలికినట్లా యెను. నాపరమగురువుయం దతని కెంతగాఢమగు భక్తియున్నను, ఆయన అతనికి గురువుకాదు, కాని నాకు ప్రభువైనవారు అతనికిగూడ ప్రభువే. అందరకు లోకప్రభు వొక్కరేగదా.

## దీ క్ష యొ క్క అం త రు వు

ఎవ్వరైన నొక మానవుడు దీక్షను బొందుట కర్హుడగుచున్నాడా యను ప్రశ్న మూడు విషయములపై ఆధారపడియుండును. ఈ మూడు విషయములు వేరైనను అవి తిరిగి యొక దానిమీద నొకటి ఆధారపడియుండును. పరమగురు చరణ సన్నిధిలో నియమింపబడిన నాలుగు యోగ్యతలను ఎంతవరకు సంపాదించెనను విషయము మొదటిది. అనగా, అన్ని యోగ్యతలను ఒక కనీస పరిమాణమునకు తక్కువ కాకుండ సంపాదించి యుండవలెననియు, కొన్నిటిలో కనీసమునకు మించి యుండవలెననియు దాని భావము. దీని కొక ఉదాహరణము నిచ్చెదను. కొన్ని పరీక్షలలో ప్రశ్న పత్రములను దిద్దుటలో నవలంబించెడు పద్ధతిని జ్ఞాపకము చేసికొనుడు. ఏ భాగములోను నూటికి యిరువది యైదు మార్కుల కంటె తక్కువ రాకూడదనియు, ఎందులో తక్కువ వచ్చినను విద్యార్థి తప్పిపోయినట్లే యెంచబడుననియు, మొత్త మన్ని భాగములలోను కలిపి నూటికి నలుబది మార్కులు వచ్చిన గాని కృతార్థుడుగా నేరడనియు, పరీక్షాధికారులు ప్రథమములోనే నిర్ణయించిరని యూహింపుడు. ప్రతి భాగములోను నూటికి యిరువది యైదు చొప్పున మార్కులు వచ్చినంత మాత్రమున విద్యార్థి కృతార్థుడు గా నేరడని స్పష్టమేగదా. కొన్నిటిలో ఇరువది యైదు, ముప్పది మార్కులు చొప్పున వచ్చిన యెడల, కృతార్థుడుగావలె నన్న మిగతా భాగములలో చాలా ఎక్కువ మార్కులు రావలెననుట కూడ స్పష్టమే, లేనిచో కొఱత పూర్తి కానేరదు.

సరిగా అదే విధానము యోగవిషయములలో గూడ నవలంబింపబడును. అభ్యర్థి కృతార్థుడు గావలెననిన, నాలుగు యోగ్యతలలోను కొంత అభివృద్ధి కనబడవలెను. కొన్నిటిలో విశేషాభివృద్ధి కనబడవలెను. వివేకము పూర్తిగా శూన్యమైన యెడల అభ్యర్థి యెన్నటికి విజయుడు కానేరడు. కావలసిన దానికంటె వివేకము కొంచెము తక్కువైనను, ప్రేమ గనుక వరదవలె పొంగి పొరలుచున్న యెడల ఆలోపము దీని వలన పూర్తి కాగలదు. రెండవ విషయమేమన, జీవాత్మ తన స్థూలోపాధులను తన యిచ్ఛానుసార ముపయోగించుకొనదగియుండునట్లు శిక్షణము నిచ్చి వానిపైన సంపూర్ణ నిగ్రహము గలిగియుండవలెను. దివ్యజ్ఞాన సాహిత్యములోని తొలి గ్రంథములలో చెప్పబడినట్లు దేహాత్మ జీవాత్మలను రెండింటిని సంయోగము చేయవలెను. ఈ యోగాభ్యాసముచే గలిగెడు విశేషశ్రమనుస్థూల శరీరము

నకు సహితము వ్యాపించెడు శ్రమను—సహించుటకు తగిన బలమును గలిగియుండుట మూడవ విషయము.

ఎంతవర కభివృద్ధి బొందిన తరువాత దీక్ష యొసంగబడునను విషయములో చాల భేదము లుండుట కవకాశము గలదు. దీక్షితులందరు సమానమగు వికాసము గలిగియుండురనుకొనుట పొరపాటు. యమ్. యే పరీక్షలో నుత్తీర్ణులయిన వారి కందరకు సమానమగు జ్ఞానముండదు గదా. ఒక అభ్యర్థి చాలా గుణములలో విశేషయోగ్యతను సంపాదించి యుండవచ్చును; ఒక్కదానిలో విశేష లోపముండ వచ్చును. అట్టి సందర్భములో లోపమున్న గుణమును వృద్ధిజేసికొనుచు, వికసించి యున్న గుణముల నితోధికముగా వృద్ధిజేసికొనవలసి యుండును.

కనుక, దీక్ష నొసంగబడుట కొక నియమిత వికాసముండుట ఆవశ్యకమే అయినను కొందరభ్యర్థులు కొన్ని విషయములలో తక్కిన వానిలోకంటె ఎక్కువ వికాసము బొంది యుండవచ్చును. మరియు, ఒక దీక్షకు మరియొక దీక్షకు మధ్య నుండు కాలవ్యవధిలో విశేషభేదము లుండుట కూడ జాతము. ఇప్పుడే ప్రథమ దీక్షను బొందిన వానికి రెండవ దీక్ష కవసరమగు యోగ్యతలు గూడ చాలవర కుండుట సంభవింపవచ్చును. అట్టివాని విషయములో ప్రథమదీక్షకు రెండవదీక్ష మధ్య గడువు చాల తక్కువయై యుండవచ్చును. అటులగాక, కనీసమగు శక్తిని మాత్రము సంపాదించి ప్రథమదీక్షను బొందగలిగిన వాడు నెమ్మదిగా తన యోగ్యతలను, శక్తులను, జ్ఞానమును పూర్తిగా వృద్ధిజేసికొన్న గాని రెండవదీక్ష కర్హుడు గానేరడు. కనుక అట్టి వాడు రెండవ దీక్షకై చాల కాలము వేచి యుండవలసియుండును.

## ప్రస్తుతావకాశము

ప్రపంచ చరిత్రలో మన మొక విశిష్టమగు స్థానమును జేరితిమి. ఇప్పుడు పరిణామములో అన్ని యంతరువులయందును పురోవృద్ధి కడు వేగముగా జరుగ గలదు. ఏలయన, జగద్గురువు త్వరలో రానై యుండుటచేత ఆధ్యాత్మిక విషయముల గూర్చి అతిప్రబలమగు సంకల్పములు, రాగములు పురోవృద్ధి మార్గమున వెల్లువ లుగా ప్రవహించుచున్నవి. కనుక ఇప్పుడు ఆ మార్గమున ఎవరు ప్రయత్నము చేసి నను ప్రవాహము నీదుచు అతి త్వరితముగా అభివృద్ధి బొందగలరు. ఇది కేవలము మానవుల సంకల్పముల యొక్కయు రాగముల యొక్కయు ప్రవాహమునకే వర్తిం చదు, ఏలయిన, ఆ జగద్గురువు రాక విషయమై నిర్దిష్టమగు జ్ఞానము గల మానవులు

బహుతక్కువ మంది గలరు; అందుచేత ఆ ప్రవాహములో వారి సంకల్పమునకు గల ప్రభావము గూడ బహుస్వల్పముగా నుండును. ఆ సంకల్పమును బాగుగ నెరింగి నట్టియు, దాని నిర్వహణములో అన్ని విధముల సహాయ పడుటకు యత్నించుచున్నట్టియు, అసంఖ్యాకములగు గొప్ప దేవతా గణముల యొక్క సంకల్పములు రాగములు బ్రహ్మాండమగు శక్తిని గలిగి యుండుట ముఖ్యమైన విషయము.

అంతవేగముగా అభివృద్ధినిబడయుటలో నిశ్చయముగా విశేషమగు శ్రమ కలుగును. ఈవిషయమును ముముక్షువులు సాధారణముగా గ్రహింపజాలరు. యోగ పథమున అతి శీఘ్రముగా పురోవృద్ధిని బడయవలయునని ఆశించెడు ముముక్షువు పరిపూర్ణ శరీరారోగ్యము ముఖ్యావశ్యకమని జ్ఞప్తియుంచుకొనుట మిక్కిలి శ్రేయస్కరము. సామాన్యముగా, ఇరువదికిపైగా జన్మలలో చేయగలిగిన అభివృద్ధిని యొక్క జన్మలో చేయుట కతడు సంకల్పించుకొని యున్నాడు. దీక్షను బొందుటకు వలయు యోగ్యతలలో మినహాయింపు లేమియు నుండనేరవు గనుకను, ఇరువది జన్మలలో జేసినను ఒక్కజన్మలో జేసినను చేయవలసిన కార్యమంతయు సమానమేయగుట చేతను, అతడు సఫలుడు కావలెననిన, అతని యుపాధులన్నిటిని యెక్కువ శ్రమపెట్టి పని చేయించవలసియుండునన్న సంగతి విశదము కాగలదు.

ప్రపంచములో ఏదైన పరీక్షకు చదువవలెననిన, సామాన్యముగ దానికి నిర్ణయమైన కాలముకంటె చాల తక్కువ కాలములో తయారగుట సాధ్యము కావచ్చును. కాని విద్యార్థి తన మెదడునకు, తన నేత్రములకు, తన శరీరమునకు, తన సహనశక్తికి విస్తారముగా శ్రమనిచ్చి పనిచేయవలసియుండును. ఇట్లు మితిమీఱి శ్రమపడుటవలన ఆరోగ్యమున కేగాక, ఒకొక్కప్పుడు ప్రాణమునకుగూడ భంగము కలుగవచ్చునని మన మెరుగుదుము. ఆధ్యాత్మిక విషయములలో వేగముగా పరిశ్రమ చేయుటలోగూడ ఇట్టి పరిస్థితులే కలుగుచుండును. శీఘ్రముగా అభివృద్ధిని బొందవచ్చును; పొందినవారును గలరు; ఎవరైనను అట్లు శీఘ్రముగా అభివృద్ధిపొందుట చాల చక్కని విషయమే. కాని, మితిమీఱిన శ్రమ కలుగకుండ బహు జాగ్రత్తగా నుండవలెను. లేనిచో చివరకు పురోవృద్ధి త్వరితమగుటకు బదులు ఆలస్యమే యగును. సాధనమును ప్రారంభించునపుడు మంచి ఆరోగ్యమున్నంతమాత్రమున సరిపోదు; తుదివరకు ఆరోగ్యము నిలుపుకొనుటకూడ అవసరము. ఏలయన, పురోవృద్ధికూడ నొక అవధిని చేర్చగల సాధనమే. మఱియును, మన మభివృద్ధిబొంద ప్రయత్నించుట

కేవలము గొప్పవారము, జ్ఞానులము అగుటకొరకేగాదు; ఉత్తమ ఫలితములు గలుగునట్లు మానవజాతికి సేవజేయుటకై తగిన శక్తిని, జ్ఞానమును, సంపాదించుట మన ఆశయము. ప్రపంచజ్ఞానముయొక్క పారలౌకిక స్వరూపమే యోగవిద్యయని మన మెన్నటికి మరువరాదు.

## యువకులగు దీక్షితులు

ఇంతవరకు బహు అరుదుగాతప్ప, ముముక్షువులకు వయస్సు గడచి, శరీరములు బాగుగ వికసించినతరువాతను, తమ జీవితములలో తమ చర్యలవలన ఈశ్వర సంకల్పమును నెరవేర్చుటకు మనఃపూర్వకముగా ప్రతినబట్టినట్లు ఋజువుచేసిన తరువాతను, దీక్ష యొసగబడుచుండెను. గత కొద్ది సంవత్సరములలో శరీరములు చాల చిన్నవయసుననున్నను కొన్ని జీవాత్మలకు దీక్షాప్రదానము చేయబడినది. మాకు తెలిసిన కారణమేమనగా, ప్రభువు ఈ ప్రపంచమునం దవతరించుసరికి వారిని సేవించుటకు కొందరు యువకులు సిద్ధముగా నుండవలెనని ఆ ప్రకారము దీక్షలనిచ్చిరి. ఆ జగద్గురువు అవతరించినపుడు, సోదరబృందముయొక్క అద్భుతమగు చైతన్యము వినియోగించెదరు. ఒకానొకచోట స్థూలశరీరధారుల నెంతమందిని వారు తమచెంత చేర్చుకొనగలరో అంత నికరముగా అచట వారి కార్యము నెరవేరును. ప్రపంచములోని యే సామాన్య లౌకికునైనను అతనిశక్తి ననుసరించి జగద్గురువు ఉపయోగింపగలరు, కాని పరమగురువుయొక్క స్వీకృత శిష్యుడైయున్నవాడు లౌకికునికంటె అనేకవిధముల నెక్కువ ప్రయోజనకారిగానుండును. ప్రథమ యోగదీక్షను బొంది, సోదరబృందముయొక్క సభ్యులనందరను ఐక్యముజేయు లంకెలనన్నింటిని పూర్తిగా వికసింపజేసికొన్న సోదరుడైనయెడల, అంతులేనంత ఎక్కువగా నుపయోగింపబడగలడు. దీక్షనొసంగబడునది యెల్లప్పుడును జీవాత్మయే. కనుక, ఆకాలమునకు జీవాత్మ ధరించు శరీరముయొక్క వయస్సుతో నిమిత్తము లేదు.

చిన్నవయస్సుగలవారికి ఎప్పుడు దీక్ష నొసంగినను, భూలోకములో వారితో కలిసిగాని వారికి దగ్గరగా నివసించునట్టియు, సోదరబృందమునకు చెందినట్టియు, పెద్ద సభ్యులు ఆ యువకులకు సహాయముచేసి నడిపించుటకు పూనుకొనుచుండిరి. దీక్షను బొందిన ఫలితముగా చైతన్యము విస్తరించుటవలనను, శక్తిసామర్థ్యము లధికమగుటవలనను, అతని బాధ్యతకూడ హెచ్చును. కనుక ఈ పెద్దల సహాయ మవసరమగును.

సోదరబృందములో సభ్యుడుకాని మానవుడు చేయు దుష్కర్మవలన గలిగెడు ఫలిత ములకంటె దీక్షితుడు చేయు పొరపాటువలన ఎక్కువ ప్రమాదకరమగు ఫలితములు గలుగును. కనుక, ఈ యువకులకొరకై యిచట కొన్ని ఆదేశములనిచ్చుట యుచి తముగా నుండవచ్చును.

వెనుకటి జన్మలలోను, బహుశః యీ జన్మలోను, తన సేవచే లోకమునకు చేయవలసినంత సహాయము చేసియుండుటచేతను, ఆ మార్గమునే అనుసరించి యీశ్వరుని చైతన్య ప్రసారమున కెక్కువ యుపయోగకరమగు వెల్లువ కాగలడను ఆశచేతను, తనకు దీక్షాప్రదానము చేయబడినదని ప్రతి సోదరుడు ఎల్లప్పుడును జ్ఞాపకముంచుకొనవలెను. అత డెక్కువ ప్రయోజనకారిగా నుండగలుగుట కవకా శము కలదు కనుకనే ఆతనికి దీక్ష యొసంగబడినది. ఆసంస్కారసమయమందు కేవలము జీవాత్మగా గాక ప్రజ్ఞానాంశువుగా కూడ ప్రమాణము జేసి, ఈశ్వరుడు సర్వదా తన ప్రేమను ప్రసరింప జేయుచున్నట్లుగానే తాను కూడ ఆశీర్వాద పూర్వకముగా యావజ్జీవము ఆత్మసమర్పణము జేయుచుందునని ప్రతిజ్ఞ చేయుచు న్నాడు. కాబట్టి అనుదినము ప్రతిక్షణము అత డా ప్రతిజ్ఞను జ్ఞప్తియందుంచుకొని తన సమస్తకార్యకలాపములను దాని కనుగుణ్యముగా నుండునట్లు ప్రవర్తించుచుండ వలెను. అతని పూర్వకర్మవలన అనేకములగు స్వాభావిక లక్షణములును ప్రవృత్తు లును ఉండును. అవి తనను, తన ఉత్తమ ప్రకృతిని, లోక కల్యాణమును మరచు నట్లు చేసి, తనను గురించియు తన స్వంత శ్రేయస్సును గురించియు తలపోయునట్లు చేయకుండ శ్రద్ధతీసికొనవలెను.

యువకుడగు దీక్షితుడు ముందుగా ఒక కళాశాలలోనో, విశ్వవిద్యాలయ ములోనో సామాన్యమగు శిక్షణ పొంది తను ముందు చేయవలసిన ఘనకార్యమును చేయ బూనుటకు సజ్జీకరణము పొందవలెను. అట్టి శిక్షణములో అత్యుత్సాహ ముతో బనిచేయవలసిన సందర్భములును, స్వార్థపరములగు అనేక ఆశయములును అతని నెదుర్కొను చుండును. జీవితమంతయు ననేక ప్రేరేపణములతో నిండి యుండును. సోదరబృందమునకు తాను జేసిన ప్రతిజ్ఞను మరచునట్లు అవకాశము లతని చుట్టును ముసురుచుండును. వీని అన్నిటి మధ్యను తన జీవితమంతయు సోదర బృందముయొక్క ఆశయముల కర్పణము చేయబడిన దన్న చిత్తవృత్తిని స్పష్ట ముగా స్థిరపరచుకొని యుండవలెను. ఈ యైహిక జీవితములో అతడు చదువు

చున్నను, ఆడుచున్నను, వేడుక సలుపుచున్నను, ప్రతిసందర్భములోను అతని మనమున "నేనుచేయుచున్న కార్యము నా పరమ గురువు కార్యాచరణమునకై నన్నెక్కువ యోగ్యునిగా చేయగలదా, ప్రేమను సౌఖ్యమును వ్యాపింపజేయుట కెక్కువ సమర్థునిగా జేయగలదా?" అను ప్రశ్న యెల్లప్పుడును ద్యోతకమై యుండవలెను.

సోదరబృందముయొక్క సేవయే తనకు ప్రధానకర్తవ్యమని అత డెల్లప్పుడు స్మృతి గలిగి యుండవలెను. ఆ కర్తవ్యమును నిర్వహించుట తన కసాధ్యమగు సందర్భములో తానెన్నడు పడకుండునట్లు శ్రద్ధ వహింపవలెను. అతడొక సన్యాసివలె జీవింపవలెనని అభిప్రాయము కాదు. అతడు సంఘములో జీవించి యుండగా, ఆ జీవితము వలన తనకు గలిగెడు అభివృద్ధిని బొందుచు, ఈశ్వరుని శక్తి ప్రసారమున కొక యుక్తమగు కాలువగా తన నది చేయుచున్నదో లేదో కనిపెట్టుచు చూచుకొనుచుండవలెను. ఇకముందు అతని యనుభవము ఎంత సంతోషకరమైనను, ఎంత అనపాయకరమైన దైనను, యెట్టిదైననుసరే, అది అతనిని ఈశ్వరసంకల్ప నిర్వహణమున కెక్కువ సంతుష్టికరమగు నుపకరణముగా జేయలేకపోయిన గాని, అతనికి ఈశ్వరసేవకై అవకాశము నొసంగక పోయిన గాని, అది కేవలము నిరర్థకము, కాలహరణహేతువు కాగలదు. సహాయము చేయుట కెట్టి యవకాశము తన కంటబడినను, దాని నతడు వెంటనే వినియోగపరచుకొనుటకు ప్రయత్నింపవలెను. తనను ప్రయోజనకారిగా జేయువిషయముల నన్నిటిని నేర్చుకొనవలెను.

## దీక్షితుడు అందరికి సోదరుడే

శిష్యుడు ప్రథమయోగ దీక్ష యను సోపానము నధిగమించి సోదరబృందములో సభ్యుడు కాగానే, వెనుకటి కంటె ఎక్కువ విశిష్టముగను, ఘనతరముగను ప్రతి మానవునకుగూడ సోదరుడగుచున్నాడు. వారి జీవితములలో అతడు జోక్యము కలుగజేసికొనవలెనని గాని, వారిని విమర్శించుచు నడుపుటకు ప్రయత్నించవలసినదని గాని దీనిభావముకాదు. అతనిపని యుత్సాహము కలుగజేయుటయేగాని, విమర్శించుట కాదు. అత డేమయిన సూచన చేయవలసిన కారణమున్నయెడల, దానిని బహు జాగ్రతతోను, మర్యాదతోను చెప్పవలెను. సోదర బృందములోని యున్నత శ్రేణులకు చెందిన సభ్యులను ప్రపంచము చూడదు. ప్రపంచదృష్టికి లోబడెడు తక్కువ తరగతివారిని బట్టి ప్రపంచ మా సంస్థను విమర్శ చేయవచ్చును. సోదరబృందము

యొక్క గౌరవము క్రొత్తసభ్యుని చేతులలో నుండునని దీక్షాసమయమందు చేయు ఉపదేశములో చెప్పిన వాక్యమున కిదియే అర్థము.

ప్రేమను, ఆశీస్సును ప్రసరింపజేయుట అతనివిధియై యున్నది. అందుచే అతడెచటనున్నను, అచట సౌఖ్య మెక్కువగా నతిశయించుచుండవలెను. కనుక, అతడు నిలుకడగా బహిర్ముఖుడగుచుండవలెను. ఇకమీదట అతని చర్యల విషయమై లోకమెట్లు తీర్మానించినను అతనికి నిమిత్తములేదు. తన నడతలో తన ఆదర్శములకు బద్ధుడై, ఆ యాశయములయెడల విశ్వాసము గలిగియున్నంతకాలము, లోకమున కతడిష్టుడైనను, అనిష్టుడైనను, లెక్కలేదు. సోదర బృందములోని కొందరు గురుజనులు అతని నేనిమిషమందైనను, ఎచ్చటనైనను ఉపయోగించ దలచవచ్చును. వారట్లు ఉపయోగించుచున్న సంగతికూడ అతనికి తెలియకపోవచ్చును. కాని బహిర్ముఖుడు కాకుండ, అంతర్ముఖుడై తన స్వంత విషయములగూర్చియే తలపోయుచున్నయెడల, అతడట్లు ఉపయోగింపబడనేరడు. శీలమును నిర్మించుకొనుటయే అతని పరమ కర్తవ్యము. అతని పరమగురువు అతనివైపు జూచినయెడల లోకకల్యాణమును గూర్చి యోచించుచుండుట కనపడవలెనుగాని, ప్రపంచమువలన తనకు సుఖము కలుగుచున్నదా, దుఃఖము కలుగుచున్నదా యని తలపోయుచుండుట ఆయన కంట బడరాదు.



# ఎనిమిదవ అధ్యాయము

## జీవాత్మ

### జీవాత్మ పుట్టుక

మోక్షమార్గము నందలి మిగతా సోపానములను బాగుగా గ్రహింపవలెననిన, జీవాత్మ గురించియు, అతడు తన శక్తుల నెట్లు మేల్కొల్పి దేహాత్మను తనతో సమశ్రుతికి తెచ్చుకొనుటకును, బుద్ధిలోకమును చేరి అచట ఆత్మైక్యమును గ్రహింపగలుగుటకును, ఆ శక్తుల నెట్లు ఉపయోగించునను విషయము గురించియు ఇచట విచారించుట అవసరము.

ప్రథమమూర్తి
రెండవమూర్తి
మూడవమూర్తి
ఆదిలోకము
అనుపాదక లోకము
ఆత్మలోక సత్య లోకము
బుద్ధి లోకము
మానసిక లోకము
భువర్లోకము
భూలోకము
తప జన లోకములు
మహర్
సువర్ లోకములు

"దృశ్యాదృశ్య మానవుడు," "క్రైస్తవ మత సిద్ధాంతము" అను గ్రంథములలో ప్రచురించిన పటము నిచట తిరిగి ప్రచురించుచున్నాను. దానిని జూచిన యెడల ఈశ్వరుని సృష్టి ప్రసారములు మూడును పరిణామ విధానములో ఎట్లు ప్రభవించుచున్నవో తెలియును. పటమునకు పైభాగమందు మూడు వృత్తములు గలవు. అవి ఈశ్వరుని త్రిమూర్తులను తెలియచేయును. ప్రతి వృత్తము నుండియు నొక రేఖ క్రిందకు దిగుచున్నది. ప్రకృతిలోని సప్తలోకములను తెలియజేయు అడ్డ రేఖల గుండా ఆ నిలువు రేఖలు సరాసరిగా బోవుచున్నవి. మూడవ మూర్తిని తెలియచేయు ఆఖరు వృత్తము నుండి సరాసరి క్రిందికి పోయినది. క్రిందికి పోయిన కొలది నల్లగాను దళసరిగాను నున్నది. పరిశుద్ధాత్మ— బ్రహ్మ— మొదట అన్ని లోకములలోను అణువులను నిర్మించి, తరువాత ఆ యణువులను ప్రోగుజేసి పంచభూతములను నిర్మించును. ఆ ప్రకారము వేర్వేరు లోకములలోని ద్రవ్యము సజీవముగా జేయబడుచున్నదని పటములోని నల్లరేఖవల్ల తెలియగలదు.

సజీవముగా నొనరించబడిన ఆ ద్రవ్యములోనికి రెండవ ప్రసారము రెండవ వృత్తమునుండి (ఈశ్వరపుత్రుడు—విష్ణువునుండి) క్రిందకు ప్రవహించును. ఈ రెండవ ప్రసారముగా ఆవిష్కరణమైన ఈశ్వరచైతన్యము ఆ ద్రవ్యమును తీసుకొని తానధివసించుటకు తగినట్లు వేర్వేరు రూపములను తయారు చేసి వానిలో తాను మూర్తిమంత మగును. మిక్కిలి స్థూలమగు అంతరువున ఆ జీవము ఖనిజవర్గమును చైతన్యవంతముగా చేయును. అందులోనుండి క్రమక్రమముగా పరిణామము బొంది అంతకంత కెక్కువ నిర్దిష్టమగుచు వృక్షవర్గములో అభిమ్మతమగును. అటుపిమ్మట జంతువర్గములో వ్యక్తమగును. జంతువర్గములో అత్యుత్తమ స్థితికి వచ్చిన తరువాత మిక్కిలి చిత్రమగు మార్పు సంభవించును. కేవలము ఒక క్రొత్తసంఘటనము గాన వచ్చుచున్నది. మూడవ సృష్టిప్రసారము మొదటి వృత్తమునుండి (ఈశ్వరుని ప్రథమమూర్తి—శివుడు—తండ్రియగు ఈశ్వరుడు) దిగును.

ఇంతవరకు ఏశక్తి ఆత్మస్వరూపమునుండి చైతన్యము నిచ్చుచుండెనో ఇప్పుడది ద్రవ్యమై తిరిగి ఆత్మనంతము చేయబడుచున్నది. ప్రథమమూర్తినుండి ప్రసరించు ఈ నూతనశక్తి, యింతవరకు జంతువులో ఆత్మగనుండినదానిని పట్టుకొని, దానినే తన ఉపాధిగా జేసికొనును. ఆ యుపాధియొక్క ద్రవ్యము అతి సూక్ష్మముగా నుండి మనస్థూలేంద్రియములకు కేవలమ గోచరమైయుండును. ఈయుపాధియే కారణ

శరీరము; దీనిలో నివసించెడు ఆత్మయే జీవాత్మ. ఈజీవాత్మ వెంటనే ఆజంతు—ఆత్మ యొక్క లక్షణములనన్నిటిని,అనగా, ఆజంతువు అనేకయుగముల కాలములోతన యావ త్పరిణామఫలితముగా నార్జించిన లక్షణముల నన్నింటిని తనలోనికి గ్రహించుకొనును. జంతు పరిణామఫలితముగా ఆర్జింపబడిన గుణములలో నొక్కటియైనను నష్టపోదు.

## తురీయాత్మ (ప్రజ్ఞానాంశువు) – జీవాత్మ

మనకు తెలిసినటువంటి సూర్యనారాయణమూర్తియొక్క ఆయుత్తమమూర్తి నుండి ప్రసరించెడు అద్భుతమగు ఈ శక్తియేమి? నిజముగ అది యీశ్వరుని జీవమే. ప్రథమ ద్వితీయ మూర్తులనుండి ప్రసరించెడు శక్తులుకూడ అట్టివేయని మీరన వచ్చును. అదియును నిజమే. అవిరెండును, నెమ్మదిగా, క్రమక్రమముగా, లోకము తరువాత లోకముద్వారా వానిలోని ప్రతి యుపలోకముద్వారా వచ్చియుండుట చేత, వానిచుట్టును ద్రవ్యమును ప్రోగుచేసికొనుచు, ఆ ద్రవ్యరూపములలో పూర్తి గకలసిపోయి యుండుటచే, వాని నిజత్వమును దెలిసికొనుటకుగాని, ఈశ్వరజీవముగా గుర్తించుటకుగాని సాధ్యము కాకపోవుచున్నది. కాని ఈ మూడవ సృష్టిప్రసారము మెఱసిపోవుచు తనమూలమునుండి సరాసరిగ క్రిందకు ప్రసరించును; మధ్యలోకము లలోని ద్రవ్యముతో దానికెట్టి సంబంధము నుండదు. అది పరిశుద్ధమగు తెల్లని వెలు తురు; దేనిలోనుండి ప్రసరించినను దానికెట్టి మలినము నంటదు.

స్పష్టముగా తెలియుటకొరకై మన పటములో ఈ మూడవ ప్రసారము ఈశ్వరుని ప్రథమమూర్తినుండి సరాసరిగా ప్రవహించుచున్నట్లు కనబరచినను, నిజ ముగా అది వారినుండి చాలకాలముక్రిందటనే బయలుదేరి మన లోకములలోని రెండవ లోకములో మధ్యభాగమందు ఎగురుచు తిరుగాడుచుండును. ఆ లోకములో ఎగురుచు నున్నదానిని తురీయాత్మ లేక ప్రజ్ఞానాంశువు అందురు. దురభిప్రాయములు పొరపాట్లు కలుగకుండ అర్థము చేసికొనవలెననిన, తురీయాత్మను ఈశ్వరునిలోనొక అంశము, లేక, భాగముగా భావించుట యుక్తముగా నుండును. కాని, ఈశ్వరుడు నిజముగా అవిభాజ్యుడు: మన మానవబుద్ధి కిదంతయు అసందర్భముగా కనిపించును; ఇందులోగల పరమసత్యమును గ్రహింప మన బుద్ధికి సాధ్యముకాదు.

ఈశ్వర చైతన్యము ద్రవ్యములోనికి దిగెడు పద్ధతి సామాన్యముగా ఎల్లప్పు డును ఒకేవిధముగ నుండునట్లు కనపడును. కాని వేర్వేరులోకములలో నుండెడు భిన్నములగు పరిస్థితులవలన సహజముగా వివరములలో అనేక భేదములు సంభవిం

చును. ఈశ్వరుడే తనలోనొక చిన్న అంశమగు ప్రజ్ఞానాంశువును (తురీయాత్మను—మొనాడ్‌ను) తన లోకమునకు చాలా క్రిందుగనున్న లోకములోనికి పంపును. నిశ్చయముగా అట్టి అవరోహణమువలన విశేషముగా పరిచ్ఛిన్నత కలిగి తీరవలెను. కాని యీ విషయమంతయు మన ప్రజ్ఞకు అతీతమగునదగుటచేత దానిని వర్ణించుటకు గాని గ్రహించుటకుగాని మనకు సాధ్యముకాదు. సరిగా ఆదేరీతిని, తురీయాత్మకూడ తనలో నొక చిన్న అంశమును క్రిందకు పంపును; అదియే జీవాత్మ అగుచున్నది. ఈ సందర్భములోగూడ పరిచ్ఛిన్నత విస్తారముగ అధికమగును. తిరిగి జీవాత్మ తనలో నొక చిన్న అంశమును మానవుని మానసిక, కామ, స్థూల శరీరముల లోనికి ప్రవేశ పెట్టినప్పుడుగూడ అదియే సంభవించును. ఆచిన్న అంశమునే మనము దేహాత్మ, లేక, తైజసవైశ్వానరుడు అందుము (**Personality**).

ఈ కడపటి అల్పాంశమే మనలో దివ్యదృష్టిగలవారికి మానవునిలో కదలుచు కనిపించు చైతన్యకేంద్రము (ఈ అల్పమగు చిట్టచివర అంశము). ఒకానొక లాక్షణిక శాస్త్రము ప్రకారము దీనిని హృదయమునందు వసించెడు "అంగుష్ఠమాత్రుడగు సువర్ణ కాంతిగల పురుషుడు" (నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా) తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః॥) అని వర్ణించిరి; దాని నొక నక్షత్ర రూపమున మాలో చాలామంది జూచుచుందుము. నేనెల్లప్పుడును దానినొక ఉజ్జ్వలమగు తారవలెనే చూచితినని తలచెదను. మానవుడే చైతన్యతారను తన యిష్టము వచ్చినచోట, అనగా, తనలోని సప్త ప్రధాన చక్రములలో ఏదోయొకదానిలో నుంచుకొనవచ్చును. వీనిలో నేది మానవునకు చాల సహజముగానుండునన్న సంగతి ఆ మానవుడు చెందిన రేఖనుబట్టియు, జాతినిబట్టియు, ఉపజాతినిబట్టియు, చాలవరకు నిర్ణయమగును. అయిదవమూలజాతిలో అయిదవ ఉపజాతికిచెందిన మనము సాధారణముగా ఆ చైతన్యమును మెదడులోని సహస్రార చక్రములోనుంచుకొందుము. ఇతరజాతులకు చెందిన కొందరు మానవులలో, దానిని హృదయమునందలి అనాహత చక్రములోగాని, గొంతుకవద్దనున్న విశుద్ధ చక్రములోగాని, భ్రూమధ్యనున్న ఆజ్ఞాచక్రములోగాని యుంచుకొనుట సహజమై యుండవచ్చును.

ఈ చైతన్యతార దిగువ మూడు స్థూలలోకములలోను జీవాత్మయొక్క ప్రతినిధి; ఆ లోకముల ఉపాధులలో ఆవిష్కరణమైనప్పుడు, దానిని దేహాత్మ యందుము. ఇచట భూలోకములో స్నేహితులందరకు తెలిసిన మానవుడు అదేహాత్మయే.

## దేహాత్మతో సంబంధము

దేహాత్మ కేవలము జీవాత్మలోని భాగమైనప్పటికి, దానిలోని జీవము శక్తి జీవాత్మకు చెందినదైనను, తరుచు ఆసంగతుల నది మరచిపోయి, తనకు తాను కేవలము ప్రత్యేకమగు జీవమునని తలచుచు, తన స్వప్రయోజనములకై యిచట పనిచేయుచుండును. జీవాత్మతో దాని కెల్లప్పుడును సంబంధము గలిపెడు మార్గ మొకటి కలదు. దానిని మన గ్రంథములలో అంతఃకరణ మందురు; కాని దాని నుపయోగించుటకై సాధారణముగా దేహాత్మ యత్నమేమియు జేయదు. ఈ విషయముల గురించి యేమియు చదివి యెరుగని సామాన్య జనుల విషయములో మానవు డనగా అతని దేహాత్మయే; జీవాత్మ బహు అరుదుగాను, అసంపూర్ణము గాను మాత్రమే ప్రకటిత మగును.

జీవాత్మ దేహాత్మలకు సంబంధమును గలిపెడుమార్గము క్రమక్రమముగా తెరవబడుచుండుటయే మానవుని పరిణామములో తొలి దశలయందు జరిగెడు పని. తద్వారా జీవాత్మ తనశక్తిని అధికాధికముగ ప్రదర్శించుచు, తుదకు దేహాత్మను సంపూర్ణముగ స్వాధీనము చేసికొని, దానికి ప్రత్యేకమగు భావనగాని, ఇచ్ఛగాని లేకుండునట్లు జేసి, తన (జీవాత్మయొక్క) భావనను, తన ఇచ్ఛను మాత్రమే యీ దిగువ లోకములలో ప్రకటించు దానినిగా చేయును. ఒక సంగతి స్పష్టముగా తెలిసికొనవలసి యున్నది. అది యేమన. జీవాత్మఉన్నత లోకమునకు (అనగా శుద్ధ మానసిక లోకము, లేక, మహర్లోకమునకు) చెంది యుండుట చేత దిగువ లోకములలో సంపూర్ణముగా ఎన్నడును ఆవిష్కరణము కాజాలదు. కనుక, జీవాత్మ ఉద్దేశించని దేదియు దేహాత్మలో ప్రకటితము కాదనియు, ఈదిగువ లోకములలో, జీవాత్మకు సంబంధించినది ఎంతవరకు ప్రదర్శితముకాగలదో అంతవరకు మాత్రమే దేహాత్మలో ప్రదర్శితమగుననియు మనము గ్రహించవలసియున్నది.

కేవలము అశిక్షితుడగు మానవునకు జీవాత్మతో నేరై సంబంధము ఉండ నేరదు; దీక్షితునకు సంపూర్ణమగు సంబంధ ముండును; కనుక సహజముగ నీరెండు కొనల మధ్యను అన్ని విధములగు అంతరువుల యందుండెడు మానవులు ఉందురు. మరియు, జీవాత్మ కూడ పరిణామ వికాసము బొందుచున్నదనియు వేర్వేరు పరిణామావస్థలయందున్న జీవాత్మలతోను మనము వ్యవహరింపవలసియుండుననియు కూడ జ్ఞాపకముంచు కొనవలసి యున్నది. ఏది యెట్లున్నను, దేహాత్మ యెప్పుడైన

నుండగలిగిన దానికంటె జీవాత్మ అనేక విధములచే అపారముగ పెద్దదిగా నుండు ననుట నిశ్చయము. జీవాత్మ తురీయాత్మలో నొక చిన్న అంశమే యైనను, అతని శక్తులు అవికసితములై యున్నప్పుడు గూడ అతని కారణ శరీరములో అతడు సంపూర్ణుడై యుండును. దేహాత్మలో అతని జీవస్పర్శ మాత్రము ప్రకటిత మగును.

ఈ లోకములో జీవమని మనకు తెలిసిన దానికంటె జీవాత్మ యుండెడు లోకములో జీవము అంతులేనంత విస్తృతముగను, స్పష్టముగను ఉండుననుట నిజము. అంతకంత కెక్కువ పూర్ణముగా జీవాత్మను ప్రకటించుట నేర్చుకొనుటయే దేహాత్మకు పరిణామము. అదే విధముగా, అంతకంత కెక్కువ పూర్ణముగా తురీయాత్మను ప్రకటించుట నేర్చుకొనుటయే జీవాత్మకు పరిణామము. పరిణామము బొందని దేహాత్మ జీవాత్మతో తనకు గల సంబంధమును మరచిపోయి తాను సంపూర్ణస్వతంత్రుడనను కొనును. కాని, చాల నున్నత మగు అంతరువుండున్న జీవాత్మ తురీయాత్మతో తనకు గల సంబంధము నెరుగక పోవుట సాధ్యముకాదు. కొన్ని జీవాత్మలు ఇతరుల కంటె తమ పరిణామావసరములను ఎక్కువగా గుర్తించి యుండుట నిశ్చయము; అనగా జీవాత్మలలో పెద్దవి, పిన్నవి యుండుననియు, పిన్నవానికంటె పెద్దవి తమ గూఢశక్తులను వికసింపజేసికొనుట కెక్కువ శ్రద్ధతో కృషిసలుపు చున్నవనియు అర్థము.

## తన లోకములోనే

దేహాత్మ ద్వారాగాని జీవాత్మకు పురోవృద్ధి లేదని మన మనుకొనవచ్చును: కాని అది సరికాదు. కొద్ది గుణములకు సంబంధించినంతవరకు మాత్రము అది నిజము కావచ్చును. "దృశ్యాదృశ్య మానవుడు" అను గ్రంథములో వివరించి చెప్పిన ప్రకారము, అడవి మనిషి, లేక, కిరాతుని యొక్క కారణ శరీరము రంగే మియు లేక వర్ణహీనముగా నుండును. పరిణామ విధానములో అతడు సుగుణములను వృద్ధిజేసి కొన్న కొలది దాని కనుగుణ్యములగు స్పందములు కారణశరీర ద్రవ్యములో ప్రభవించినప్పుడు, ఆ గుణములకు సంబంధించిన రంగులు ఆ కారణశరీరములో ప్రదర్శితమగును; కనుక కొంతకాలమునకు కారణశరీరము శూన్యముగా నుండుటకు బదులు జీవముతో చురుకుగా స్పందించుచుండును. అందుచే జీవాత్మ దాని ద్వారా యెక్కువగా బహిర్గతమగు చుండును; కనుక కారణ శరీరము పరి

ణామములో నపారముగా పెరగవలసియుండును; మరియు దాని భౌతిక కేంద్రము నుండి బహుదూరముగా విస్తరించుచుండును; అందుచే మానవుడు తన తేజో మండలములో వందలు, వేలు మనుష్యులను చేర్చుకొని, వారిపై శ్రేయోదాయక మగు ప్రభావమును ప్రసరింప జేయగలుగును.

కాని, ఇదంతయు అద్భుతముగ నున్నను, జీవాత్మ అభివృద్ధిలో నొక భాగము మాత్రమే అయియున్నది. ఈ లోకములో మనకు తెలియని అనేక మార్గముల ద్వారా అతడభివృద్ధి బొందుచుండును. తన సమానులతోను, గొప్ప అరూప దేవతల తోను, అన్నిరకములగు అద్భుతమైన దేవతల మధ్యను, మనకు ఊహాతీతమైన ప్రపంచములో అతడు జీవించుచుండును. తన చుట్టునున్న విశాల ప్రపంచములోని చిత్రములగు విషయములన్నియు పసిబిడ్డకేమియు తెలియనట్లుగానే, ఆమహత్తర మైన జీవితము గురించి అవికసితమైన జీవాత్మకు ఏమియు తెలియకపోవచ్చును; కాని అతని చైతన్యము క్రమేణా వికసించినకొలది ఆవైభవమును గ్రహించుచుండును. దాని అద్భుత సౌందర్యము చేతను, విస్పష్టతచేతను గాఢముగా నాకర్షింపబడును.

అదియట్లు జరుగుచుండ, అతడుగూడ దివ్యమగు మూర్తిత్వము బొందుచుండను; మానవుడెట్లుండవలెనని యీశ్వరుడు సంకల్పించెనో ఒకింత భావమును మొదటిసారి మనకు స్ఫురింపజేయును. అట్టి జీవుల విషయములో, దిగువలోకములలో వలె తలంపులు రూపములను ధరించి మెగులుచుండవు, విద్యుత్తులవలె నొకరియొద్ద నుండి మరియొకరికి శరవేగముతో పోవుచుండును. ఇచట క్రమేణా స్వాధీనములోనికి వచ్చుచున్నట్టియు, లోపలనున్న ఆత్మస్వరూపమును బహు అల్పముగా ప్రకటించుట నేర్చుకొనుచున్నట్టియు; నూతనముగా సంపాదించబడినట్టియు ఉపాధులేమియు లేవు; ఇచట పర్వతములకంటె ప్రాచీనమగు ఒక్కటే శరీరము (కారణశరీరము) మన యెదుట నుండును; దానికి నిత్యము అండవలెనుండు దివ్యవైభవమును అది ప్రదర్శించుచుండును. దాని శక్తులు క్రమేణా వికసించుచున్నకొలది దానిగుండా ఆ దివ్య వైభవము అంతకంతకెక్కువగా ప్రకాశించుచుండును.

ఇప్పుడిచట బాహ్యరూపములతో వ్యవహరించము; వస్తువుల యదార్థస్వరూపములనే జూతుము, అసంపూర్ణముగా వ్యక్తమగుచున్న ఆంతరంగిక సత్యమునేగనుచుందుము. ఇచట నాణెముయొక్క రెండుప్రక్కలవలె కార్యకారణములు (కర్మయు దాని ఫలితమును) రెండును నొకటై స్పష్టముగా నైక్యమై గనబడును. ఇచట రూప

రహితమగు శుద్ధమనస్సేగాని రూపసహితమగు స్థూలమనస్సు యుండదు; సమస్త రూపములలో నుండెడు భావమేగాని, రూపముల బహుత్వముండదు; ప్రతి విషయములోని సారము ఇచట దొరకును; వివరములను విచారింప నవసరము లేదు. ఒక విషయముగురించి చర్చించుటగాని వ్యాఖ్యానము చేయుటకు ప్రయత్నించుటగాని అవసరము లేదు; ఆవిషయముయొక్క భావము, లేక, సారమంతయు ప్రత్యక్షముగా గనబడుచుండుటచేత, చదరంగపుబల్లమీద బంటును కదిపినట్లు మొత్తముగా దాని నంతను ఉపయోగింతుము. ఈ లోకములో మన కొక వేదాంత సిద్ధాంతమువలె గన బడు విషయమును బోధించవలెననిన, అనేక గ్రంథములు కావలసి యుండును. అచట అదంతయు ఒకే నిర్దిష్టమగు విషయమైయుండును; బల్లమీద పేకముక్కలను వేసినట్లుగా, ఆ భావము నొక్కసారిగా నెదుట బెట్టవచ్చును. ఇచట కొన్నిగంటలు కాలము పట్టు సంగీత కచ్చేరీయంతయు అచట నొక్క ప్రబలమగు స్వరముగా ప్రద ర్శితమగును; ఒక చిత్రకళాశాలలోని రచన పద్ధతులన్నియు ఒక దివ్యమగుభావ ముతో ప్రకటితమగును; ఇట్టి అద్భుతములగు భావములతోనే జీవాత్మలు ఒకరితో నొకరు సంభాషించుకొనుచుండును.

జీవాత్మలన్నియును ఈ ప్రపంచములో మనకు తెలిసినవాని అన్నిటికంటెను అన్నివిధముల విశేషముగా గొప్పవై యుండుటచే, జీవాత్మలలోగల భేదములను మన ప్రపంచభాషలో విశదముచేయుట సులభమగు కార్యముకాదు. ఉపమానము లచే చెప్పినచో అనేక కారణములవలన దురభిప్రాయములు కలుగవచ్చును. అయి నను వారితో నాకు కలిగినసంసర్గమువలన నాకు తోచిన అభిప్రాయమును కొంత వరకు తెలియ చేయుటకు ప్రయత్నించెదను. బాగుగా అభివృద్ధి పొందిన జీవా త్మను జూచినపుడు, గొప్ప ప్రతిష్ఠయు, రాచ ఠీవియు గలిగి, బహుమర్యాదగా నుండి జ్ఞానముతోను అనుకంపతోను వెలయు రాయబారి జ్ఞాపకము వచ్చును; వికాసము లేని జీవాత్మయైన యెడల నిమ్నపటియగు పల్లెటూరు దొరవలె మోటుగా నుండును. ముక్తిమార్గము ననుసరించుచున్న జీవాత్మయై పరమ పురుషత్వమును బొందుటకు సిద్ధముగనున్న యెడల, గొప్ప దేవతలవలె అపారమగు శక్తిగల ఆధ్యా త్మిక ప్రభావములను ప్రసరింపజేయుచుండును.

## జీవాత్మకు దేహాత్మయెడలగల ఆదరము

కనుక, స్థూలలోక తమస్సులో కప్పబడిపోయినట్టియు, సంకుచితమైనట్టియు, సగము సగము నిర్మాణమైనట్టియు, దేహాత్మయొక్క అస్పష్టముగా బహుదూరమున జరుగుచున్న కొట్టులాటలో పాల్గొనుటకంటె జీవాత్మకు తనలోకములోనే గాఢముగా కార్యాచరణములో నిమగ్నమగుటయు, శక్తినంతను వినియోగించి యుత్సాహముతో బనిచేయుటయు ఎక్కువ, ముఖ్యము సంతోషదాయకము అని తోచిన యెడల, ఆశ్చర్యమేమైన కలదా?

సామాన్య మానవుని ప్రాపంచక జీవితములో జీవాత్మకు శ్రద్ధను గలిగించునదేమియు నుండదు; అప్పుడప్పుడు మాత్రము కొంచెము ముఖ్యమైన దేమైన సంభవించును: అట్టిది సంభవించినప్పుడు జీవాత్మ దృష్టి నాకర్షించును. అప్పుడా సంఘటనమువలన గ్రహింపదగిన దేమైన నున్నయెడల జీవాత్మ దానిని గ్రహించును. సామాన్య మానవుడు సంపూర్ణముగా జీవింపక ఖండఖండములుగా జీవించును. అతడు సగము కాలమునకుపైగా నిజమగు ఉన్నత జీవితమునుగూర్చి లేశమైన నెరుకగలిగి యుండడు. మన జీవాత్మలు మన విషయమై తగినంత శ్రద్ధ తీసికొనుటలేదని మనలో కొందరము క్లేశపడవచ్చును; మనము మన జీవాత్మలగురించి యెంతవరకు తలపోయుచుందుమో ప్రశ్నించుకొనుట మంచిది. ఏరోజునైన ఎన్ని సార్లు మనము జీవాత్మగురించి తలంచి యుందుము? మన యోచనలో నెక్కువ భాగము ఉన్నతమగు ఆధ్యాత్మిక విషయములగూర్చి వినియోగింప మొదలుపెట్టిన వెంటనే, అనగా, నిజమగు జీవనమును జీవింప ప్రయత్నించిన వెంటనే, జీవాత్మకూడ మనలనుగూర్చి యెక్కువ శ్రద్ధదీసికొనుటకు సాధ్యమగును. మనము జీవాత్మ దృష్టి నాకర్షింపవలెనన్న మన దేహాత్మను దానికి ఉపయోగకారిగా నుండునట్లు చేయవలెను.

జీవాత్మ తన పరిణామములో కొన్ని ముఖ్యమగు భాగములను దేహాత్మ ద్వారాను, దానియొక్క మానసిక, కామ, స్థూల శరీరముల ద్వారాను మాత్రమే సాధించవలసి యున్నదని యెరుగును; కనుక ఎప్పుడో యొకప్పుడు దేహాత్మగురించి శ్రద్ధవహించి దానిని పూర్తిగా స్వగ్రహములోనికి తీసికొనిరావలెననిగూడ నెరుగును. కాని, ఆపని తరుచు అనాకర్షణీయముగ నుండవచ్చుననియు, ఒకానొక దేహాత్మ నిరుత్సాహకరముగను, నిరాశాజనకముగను గనబడవచ్చుననియు మనము సులభ

ముగా గ్రహింపవచ్చును. మనము ప్రపంచమును జూచినయెడల, అనేకమందిజనుల స్థూలశరీరములు మాంసాహారముచేతను, సారాయిచేతను, పొగాకుచేతను, విషపూరితములై యుండుటయు, కామమయ శరీరములు దురాశచేతను, విషయభోగాసక్తిచేతను పొగలుగమ్మి యుండుటయు, మానసిక శరీరములు వ్యాపారము, గుఱ్ఱపు పందెములు, జూదములు, పోరాటములు తప్ప మరి యేవిషయమునందును ఆసక్తి లేకుండుటయు జూచుచుందుము. అట్టి సందర్భములలో జీవాత్మ తన ఉన్నతస్థానము నుండి వాని నన్నిటిని పర్యవేక్షణజేసి తన యత్నమును ఈజన్మకు విరమింప నెంచుటయు, మరియొక జన్మలో రాబోవు స్థూలోపాధు లింతకంటె అనుకూలముగ నుండవచ్చునని ఆశించుటయు, వ్యర్థముగా ఈజన్మలో ఏల శ్రమపడవలెనని సందేహించుటయు, జీవాత్మకు సహజము కావచ్చునని మనము సులభముగా గ్రహింపవచ్చును. "అయ్యో, ఈ దేహాత్మతో నేనేమి చేయగలను? ఇప్పటికి దీనిని విడిచిపెట్టి ముందుజన్మకై ఆశించుట మంచిది,అది ఇంతకంటె అధ్వానము కాబోదుగదా; ఈలోపున ఇంతకంటె చాల ముఖ్యమైన పనిని ఈ యున్నత లోకములో చేయవలసి యున్నది, దానిని చేసికొనుచుండుట యుక్తము" అనికూడ జీవాత్మ అనుకొనవచ్చునని మన మూహింపవచ్చును.

క్రొత్తజన్మయొక్క ప్రారంభదశలో ఈమాదిరి సంగతి తరుచుగా జరుగుచుండును. బిడ్డ పుట్టినదిమొదలు జీవాత్మ దానిపై తిరుగాడుచుండును, కొందరి విషయములో పసితనమునుండియు బిడ్డ సన్మార్గములో అభివృద్ధినొందునట్లు ప్రయత్నించుచుండును. సాధారణముగ ఏడేండ్లు వయస్సు వచ్చువరకు జీవాత్మ బిడ్డయెడల శ్రద్ధ తీసికొనదు, అప్పటికి కర్మదేవత చేయవలసినపని పూర్తియగును. బిడ్డలలో స్థూల దృష్టికి భేదములెంత విస్తారముగా గనిపించునో, వారి జీవాత్మ–దేహాత్మలకుగల సంబంధములుగూడ అంత విస్తారముగా భేదించును. దానిలో ఆశ్చర్యమేమియులేదు. కొందరు బిడ్డల దేహాత్మలు బహు చురుకుగా, ఉత్సాహకరముగా నుండును.మరికొందరివి బహు మందముగను, తుంటరిగను నుండును. ఈ రెండవ విధమగు లక్షణములు ప్రబలముగానున్నయెడల, జీవాత్మ కొంతకాలము శ్రద్ధతగ్గించి, చిన్నబిడ్డ శరీరము పెరిగినకొలది దేహాత్మ ఎక్కువ తెలివిగలిగి ఎక్కువ సులభముగా సంస్కారణము పొందగలదని ఆశించి యూరకుండును.

జీవాత్మ ఆ ప్రాకారము నిర్ణయించుకొనుట మనకు తెలివి తక్కువగా గని పించ వచ్చును. ఏలయన, ఈ జన్మలో ఈ దేహాత్మ యందు శ్రద్ధవహింపక ఉపేక్ష చేసిన యెడల, మరుచటి జన్మలో దేహాత్మ ఇప్పటికంటె ఏ విధముగను మంచిది కాకపోవచ్చును. మరియు పసితనములో శరీరముపై తన ప్రభావము నేమియు జూపింపక అశ్రద్ధజేసిన యెడల దుష్టగుణములు నశించుటకు బదులు క్రమేణా ప్రబలము కానచ్చును, కాని మన మిట్టి విషయముల గురించి తీర్మానింపగల స్థితిలో లేము; మనకు గల జ్ఞాన మతిస్వల్పము; ఆ జీవాత్మ ఉన్నత లోకములలో జేసెడు కార్యము సంగతి మన కేమియు తెలియదు.

పైన చెప్పిన దానిని బట్టి జూచిన, మనము భూలోకములో మాత్రమే జూడగల మానవుడు పరిణామములో నేస్థితిలో నున్నాడో నిశ్చయముగా తీర్మా నించుట ఎంత యసాధ్యమో తెలియగలదు. ఒకని విషయములో కర్మకారణములచే బహు చక్కని శరీరము ప్రాప్తింపవచ్చును, కాని అతని జీవాత్మ విశేషముగా పరి ణామము బొందియుండక పోవచ్చును; మరియొకనికి కర్మనశమున లోపభూయిష్టమగు శరీరము ప్రాప్తింపవచ్చును, కాని జీవాత్మ విశేషముగా పరిణామ వికాసమును బొంది యుండవచ్చును. బుద్ధభగవానుని జాతక కథలలో ఒక కథలో దీని కొక మంచి ఉదాహరణము గలదు. ఒకదినమున, ఒకానొకడు కష్టములను జెప్పుకొనెడు జనులందరివలెనే బుద్ధుని వద్దకు వచ్చి తనకు ధ్యానము చేయుట బహుకష్టముగా నున్నదని చెప్పుకొనెను. దానికి స్పష్టమగు స్వల్ప కారణము గలదనియు, వెనుకటి ఒక జన్మలో ధ్యానము జేసికొనెడు పుణ్యపురుషులను బాధించి తపోభంగము చేయు దురలవాటును అతడు చేసికొనెననియు బుద్ధుడు చెప్పి వానిని బంపివేసెను. అయి నను, ధ్యానమును బాగుగా నెఱవేర్పగలిగిన అతని స్నేహితుల కంటె అతని జీవాత్మ ఎక్కువ పరిణామ వికాసమును బొంది యుండవచ్చును.

జీవాత్మ తన శక్తి నంతను ప్రబలముగా దేహాత్మపై ప్రయోగింప నిశ్చ యించిన యెడల, అతడు చేయగలిగిన మార్పు అత్యద్భుతముగా నుండును. ఈ విష యముల గురించి స్వయముగ పరిశోధన జేసిన వానికి తప్ప అన్యులకు దీని అద్భుతము బోధపడనేరదు. పరిస్థితులు అనుకూలముగ నున్నప్పుడు, అనగా జీవాత్మ తగినంత బలముగలదై యుండి, దేహాత్మ బాగుపడుటకు సాధ్యము కానంత దుర్మార్గముగా నుండక పోయిన యెడల, ముఖ్యముగా దేహాత్మ కూడ జీవాత్మ చేయుచున్న కృషిలో

సహాయపడవలెననియు, జీవాత్మకు ఆకర్షణీయముగా నుండి జీవాత్మను పరిపూర్ణముగా ప్రదర్శించవలెననియు పట్టుదలతో గట్టి ప్రయత్నము చేయుచున్న యెడల, జీవాత్మ చేయగల మార్పు యెంత అద్భుతముగ నుండునో, యెంత వేగముగ జరుగునో, యెంత సంపూర్ణముగా నుండునో ఆ విషయమయి స్వయముగా పరిశోధన చేయనివాడెవడును ఊహింపజాలడు.

## దేహాత్మయొక్క వైఖరి

ఈ విషయమును ఏకకాలమందు రెండు దృక్పథముల ద్వారా విమర్శింప వలసి యుండుటచేత దీనిలోగల కష్టము చాలా ఎక్కువగుచున్నది. మనలో చాల మంది ఈ లోకములో దృఢమగు దేహాత్మలను గలిగియుండి దేహాత్మలుగానే ఆలోచించుచు ప్రత్యేకముగా పనిచేయుచుందుము. అయినను, నిజముగా జీవాత్మలమని యెరుగుదుము. మనలో, చిరకాలము ధ్యానముచేయుటచే సూక్ష్మ ప్రభావముల నెక్కువ సున్నితముగా గ్రహింపగలవారు ఈ జీవాత్మ తమ చర్యలలో జోక్యము కలిగించుకొనుట తరుచు కాంచుచుందురు. జీవాత్మతో ఎంత యెక్కువగా నైక్యమగుటకు అలవాటు చేసికొనగలుగుదుమో, అంత స్పష్టముగాను, వివేకముగాను జీవిత సమస్యలను జూడగలుగుదుము. కాని మనమింకను దేహాత్మలమే యనుకొనుచు మన ఉత్తమ జీవాత్మల వైపు సహాయము కొరకు చూచుచున్నంత కాలము వారికి విధేయులమై యుండి వారి ప్రభావములను గ్రోలుటకు సంసిద్ధులమగుచు, వారిని జేరుటకు ప్రయత్నించుచుండవలెను. మరియు వారికి ఉపయోగకరములగు స్పందములను పట్టుదలతో ప్రసరింపజేయుచుండుట మనవిధియైయుండుటయేగాక, మనకు శ్రేయస్కరమైయుండును. అధమము మనము జీవాత్మపోయెడు మార్గమున కాటంకముగ నుండక, మనశక్తి కొలది మనము చేయగలిగిన దంతయు నుత్తమరీతిని జేయుచుండునట్లు నిశ్చయులమై యుండవలెను. స్వార్థపరత్వమనగా దేహాత్మయొక్క వ్యక్తిత్వమును బలపరచుకొనుటయే గనుగ, స్వార్థపరత్వమును విసర్జించుట మన ప్రథమ కర్తవ్యమై యుండవలెను. తరువాత, మన మనస్సులను ఉత్తమమగు భావములతో నింపియుంచుకొనవలెను; ఏలయన, మన మనస్సులు నిరంతరము నీచమగు నైహికవిషయములతో నిండియున్న యెడల—ఈయైహిక విషయములు సహజముగ శ్లాఘనీయములైనవైనను— జీవాత్మ అట్టి మనస్సులను

తన ఆవిష్కరణమునకు ఉపాధులుగా నుపయోగింపనేరదు. జీవాత్మ పరీక్షార్థమై యొక ప్రయత్నమును జేసినప్పుడు, పరిశోధనకై యొకచూపు చూచినప్పుడు, మనము వారి యాజ్ఞలను శిరసావహించి యుత్సాహముతో వారికి సహకారము చేయవలెను. మన మట్లు చేసినయెడల జీవాత్మయు మన మనస్సుల నంతకంతకెక్కువగా స్వాధీనముచేసికొని యీదిగువలోకములతో సంబంధించినంతవరకు తన సహజధర్మమును నిర్వహించగలుగును. ఆవిధముగ మనము చేరదలచిన గమ్యస్థానమునంతకంతకు దగ్గరగా చేరగలము. దేహాత్మ జీవాత్మలు రెండింటిని ఏకముజేసెడు ప్రథమయోగ దీక్షకు సరాసరిగా దీసికొనిపోయెడు మార్గమున అడుగుపెట్టినవార మగుదుము. ఆప్రథమదీక్షను బొందుటలో ఉత్తమమైనది నీచమైనదానిని జీర్ణముచేసికొనెను; కనుక, జీవాత్మయొక్క ఆవిష్కరణముకానిదేదియు దేహాత్మలో లేశమైనను ఇప్పుడు గానరాదు; దేహాత్మ కేవలము జీవాత్మయొక్క స్వరూపమైయుండును.

ఇంతకుపూర్వము దేహాత్మకు అసహనము, కోపము, విచారము మొదలగు అనేక దుర్గుణములుండి యుండవచ్చును, కాని అవన్నియు పూర్తిగా తొలగిపోయినవి, ఇప్పుడు దేహాత్మ పైనుండి వచ్చిన గుణములను మాత్రమే ప్రదర్శించును. అట్లు జీవాత్మ దేహాత్మను తనతో సంశ్రుతము జేసికొన్నవాడై, ఏకత్వమునకు నిలయమగు బుద్ధి లోకమున కూర్ధ్వముఖముగబోవును. తన పురోవృద్ధికి ఆటంకమై నిలచెడు స్వకాయదృష్టి, లేక, దేహాత్మబుద్ధిని విడుచుట కిదియే మార్గము. అందుచేతనే, బుద్ధి లోకానుభవము అదివరకు ప్రాప్తించనియెడల ఆ ప్రథమ యోగదీక్షా సమయమునందైనను గలుగుట ఆవశ్యకమగును. చాలమందికి ఆయనుభవము అదివరకే యుండియుండును, ఏలయన, ఉత్తమరాగములు కామమయశరీరములో నుద్భవించినవై బుద్ధిలోకశరీరములో ప్రతిబింబితములై ఆశరీరమును మేల్కొల్పి దీక్షకుపూర్వమే దానిలో కొంత ఉద్దీపనమును గలిగించియుండును.

## ఐక్యానుభవము

ప్రకృతిలో జీవించియున్నదంతయు నిజముగ నొకటే; సోదరబృందములో ప్రవేశించువారందరును ఇది సత్యమని తెలిసికొనుట వారివిధియైయున్నది. ఆత్మయొకటేయని మనము నేర్చుకొంటిమి; దాని అర్థమేమో తెలిసికొన ప్రయత్నించితిమి; కాని దీక్షాసమయమున అభ్యర్థి బుద్ధిలోకమున బ్రవేశించునప్పుడు చూచి

నట్లుగా ఆత్మస్వరూపమును మనము స్వయముగా జూచినప్పుడు కలిగెడు అనుభవము పూర్వానుభవములన్నిటికంటె కేవలము భిన్నముగానుండును. ఒక యుదాహరణము నిచ్చెదను. ఐహికజీవితములో. మనలో ప్రతియొకరును ఒక్కొక్క బావియడుగున జీవించుచున్నట్లు ఊహింపుము. ఆనూతిలోనుండి సూర్యరశ్మివెఫు జూచెదము. ఆరశ్మి నూతియడుగునకు మనకొరకై వచ్చినట్లుగానే ప్రకాశించుచువచ్చుచుండును. ప్రతిబావిలోనికి యొక్కొక్క రశ్మి వచ్చుచున్నను సూర్యునివెలుగు యొక్కటే గదా. అటులనే, ఏకైకేశ్వరుని వెలుగు మన అందరి హృదయకుహరములలోని యంధకారమును ప్రకాశింపజేయును. దీక్షితుడు దేహాత్మయను బావినుండి పైకెక్కి అదివరలో తనయొక్కనిలోనే వెలుగుచున్నదనుకొన్న వెలుగు నిజముగ అందరిలోను వెలుగుచున్న అనంతమగు విశ్వమయమగు వెలుగని తెలిసికొనును.

కారణశరీరములో నివసించుచున్నప్పుడు సమస్తజీవులలోని యీశ్వర చైతన్యమును జీవాత్మ అంగీకరించియున్నది; మరియొక జీవాత్మను జూచినపుడు తనచైతన్యము అతనిలోనున్న ఈశ్వరాంశను గుర్తించుటకా యన్నట్లు ఎగిరి గంతువైచును. కాని బుద్ధిలోకములో బయట గంతువేసి స్వాగతమిచ్చుటకు ప్రయత్నింపదు; ఏలయన, ఆజీవాత్మ అదివరకే తన హృదయస్థమై యుండెను. అత డాచైతన్యమే అయ్యెను, ఆతని చైతన్యము తనదే అయ్యెను. ఇక నక్కడ "నీవు," "నేను" అనునవి లేవు, ఏలయన, రెండును నొకటే, ద్వంద్వమును అతిక్రమించియు, రెండింటినిగూడ గలిగి యుండు 'తత్' యొక్క ముఖములే.

అయినను, విచిత్రమగు ఈపురోగమనములో పృథక్ భావము సంపూర్ణముగా నశించునుగాని, వ్యక్తిత్వభావము నష్టపోదు. అదియొక అసందర్భమువలె గనిపించును, కాని సత్యమగుట స్పష్టము. మానవుడు తన గతమునంతను జ్ఞప్తిగలిగి యుండును. అతడు అతడే, ఎప్పుడో పూర్వకాలమున అన్నివిధములగు పనులను జేసినవాడే. అత డేవిధముగను మారలేదు. ఒక్కటే మార్పుమాత్రము గలదు. అది యేమన, మునుపటికంటె ఇప్పుడు విశేషముగా అతిశయించి యున్నాడు. మరియు తనలో అనేక ఇతరవ్యక్తులుగూడ నున్నట్లు భావించును. ఇప్పుడిచట మన మొక వందమందిమి ఏకకాలమున మనచైతన్యములను బుద్ధిలోకమునకు గొనిపోయినయెడల, అవియన్నియు ఒకేచైతన్య మగును. కాని, అది ప్రతివానికి తనచైతన్యమువలెనే తోచును; అయితే ఇప్పు డాచైతన్యములో ఇతరులందరును చేరియుందురు.

ఎవరికివారు ఇతరులనందరను తనలో కలుపుకొని ఐక్యముజేసికొన్నట్లు భావించుదురు; కనుక ఇచట నొకవిధమగు భ్రమయున్నట్లు స్పష్టమగుచున్నది. కాని కొంచెము యెక్కువ అనుభవము కలిగినయెడల మనమందరము ఒక పరమచైతన్యములోని అంశములమనియు, ఇంతదనుక మనగుణములు, మన ప్రజ్ఞ, మనశక్తులు అనుకొన్నవన్నియును ఆపరమచైతన్యముయొక్క గుణములు, ప్రజ్ఞ, శక్తులు అనియు మనకు స్పష్టముగా తెలియును. "తత్త్వమసి" అను చిర ప్రసిద్ధమైన వాక్యము యథార్థమనియు, సత్యమనియు మనకు ప్రత్యక్షానుభవమగుచున్నది. ఈలోకములో నుండి దానిని గురించి మాటలాడుటయు, దానిని గ్రహించుటయు, లేదా, మనస్సుచే గ్రహించితిమని తలచుటయు నొకటి, అద్భుతమగు ఆప్రపంచములో ప్రవేశించి స్వానుభవమువలన ఇక నెన్నడును చలించనేరని నిశ్చయముతో తెలిసికొనుట మరియొకటి.

ఈబుద్ధి లోకచైతన్యము స్థూలశరీరములోని మెదడుపైన సంపూర్ణముగ ముద్రితమైనప్పుడు, జీవితములోని సమస్తకార్యములను, సమస్తసంబంధములను ఒక నూతనదృష్టితో జూతుము. ఇకమీదట మన మొకమనిషినిగాని, వస్తువునుగాని యెంతదయతోను, సానుభూతితోను జూచినను మనకంటె వేరైన మనిషిగాగాని, వస్తువుగాగాని జూడము. మన మామనిషియే యగుదుము, ఆవస్తువే యగుదుము; మన స్వంత మెదడులోని భావమునుగాని, మన అంగముల చలనమునుగాని తెలిసికొన్నట్లే ఆమనిషి లేక, ఆవస్తువునుగూడ తెలిసియుందుము. అతని ఉద్దేశములను మన ఉద్దేశములవలెనే మెచ్చుకొందుము. కాని, ఎక్కువ జ్ఞానమును, మరియొక దృష్టిపథమును, గలిగిన మనలోని మరియొక భాగము కేవలము మరియొకవిధముగ నాచరించవచ్చునని సంపూర్ణముగా గ్రహించవలెను.

మరియు, మానవుడు బుద్ధిలోకముయొక్క స్థూలతమమగు ఉపలోకములో ప్రవేశించినవెంటనే సమస్తజీవముతోను సంపూర్ణముగా నైక్యమైపోయినట్లు యెరుక గలిగియుండునని తలంపరాదు. విశేషముగా కృషిజేసి శ్రమపడి ఆలోకముయొక్క సూక్ష్మతమమగు ఉపలోకమును చేరినప్పుడే అట్టి సంపూర్ణమగు నైక్యభావము కలుగును. బుద్ధిలోకములో ప్రవేశమును గనుటవలననే అపారమగు చైతన్యవిస్తరణము ననుభవింపగలరు; అందరితో తానొకటైతినని గ్రహింపగలరు; కాని మన మీ భూలోకములోనుండి ధ్యానము చేయుచు మన చైతన్యమును భువర్లోకములోనికి తీసికొని

పోవుట కెంతశ్రమపడుచున్నామో, అట్లే మానవుడు బుద్ధిలోకప్రవేశముగలిగిన తరువాతగూడ కృషి జేయుచు, ఆత్మవికాసముబొందుచు చాలకాలము గడపవలసి యుండును. మెట్టుతరువాత మెట్టు, ఉపలోకముతరువాత ఉపలోకము, ఈమాదిరిగా క్రమేణా ముముక్షువుమార్గము నధిరోహణము జేయవలెను: పురోవృద్ధికాలెనన్న, ఆయంతరువునగూడ శ్రమపడి కృషి జేయవలసియుండును.

ప్రథమయోగదీక్షనుబొంది, బుద్ధిలోకమున ప్రజ్ఞగలిగి సచేతనముగ ప్రవేశించినతరువాత అభ్యర్థి ఈకార్యమును, అనగా, క్రమక్రమముగా ఉపలోకముల నన్నింటిని అధిగమింపవలసిన కార్యమును, బూర్తిచేయవలసియున్నది. ఎందుచేత ననగా, తన పురోవృద్ధికి అడ్డంకులు కాగల మూడు గొప్ప బంధములను ఇప్పుడు తొలగించుకొనవలసియున్నది. ఇప్పుడతడు నిశ్చయముగా పవిత్రమోక్షమార్గమున నున్నాడు. బౌద్ధమతసంప్రదాయములో అట్టివానిని "సోతపత్తి" లేక "సోహాణ" అందురు, అనగా, "స్రోతస్సునందు ప్రవేశించినవాడు" అని అర్థము. హిందువులలో అతనిని "పరివ్రాజకుడు" అందురు, అనగా, తిరుగుచుండువాడు, మూడు స్థూలలోకములలోను తనకు శాంతినొసగెడు స్థానములేక తిరుగుచుండువాడు అని యర్థము.

## తొమ్మిదవ అధ్యాయము.

# 2-3 యోగదీక్షలు

### మొదటి మూడు శృంఖలములు

ప్రథమ యోగదీక్షను బొందిన అభ్యర్థి నిర్దిష్టముగా నిజ మార్గమున ప్రవేశించినవా డగును. ఆ మార్గము పరమపురుషత్వమునకు, అనగా, మానవత్వమునుండి అతిమానవత్వమున చేర్చెడు ద్వారమునకు గొనిపోవును. క్రిందనుండి యీ మార్గమువైపు జూచిన యెడల ప్రథమయోగ దీక్షను బొందువరకు జేసిన కృషివలన ముముక్షువు అలసిపోకుండుటయు, అంతులేకుండ పైకిపోవుచు బహు శ్రమకరమగు మార్గమున కండ్లు తిరుగునంతటి యెత్తుగనున్న శిఖరములను గని అతడు నిరుత్సాహపడి వెనుకకు జంకకుండుటయు జూచి మన మాశ్చర్య పడ వచ్చును. కాని అతడు జీవమనెడు బుగ్గవద్ద కడుపారత్రాగెను. అందుచే అతని హృదయము పరిశుద్ధమైనది. కనుక అతనికి పదిమంది మనుష్యుల బలము చేకూరినది. ఆదర్శప్రాయమగు మానవత్వము యొక్క మహా వైభవము అతని కంత కంత కెక్కువ స్పష్టముగా గోచరమగుచు, అతనికి భూలోకములో నెట్టి ఐహిక విషయము వల్లను గలుగని అసమానమగు ఆవేశమును గలుగజేయుచు, అతని నాకర్షించుచుండును.

అతని యాత్రలోని ప్రథమదశ రెండవదీక్షతో అంతమగును. దానిని బొందవలెనినిన మూడు శృంఖలములను (బంధములు, లేక, సంయోజనములను)వదిలించుకొనవలెను. (1) స్వకాయదృష్టి లేక, దేహాత్మబుద్ధి (2) విచికిత్స, లేక, సంశయము, (3) శీలవ్రతపరామర్శ, లేక, మూఢనమ్మకము. దీనిలో మొదటిది "నేను-నేను" అనుకొనెడు అహంభావము. ఇది దేహాత్మకు సంబంధించినంతవరకు కేవలము భ్రమయై యున్నది. కనుక, నిజమగు ఊర్ధ్వగమనములో ప్రథమ మెట్టు వద్దనే, మొట్ట మొదటనే, దీనిని విసర్జించవలెను. కాని యీ బంధమును సంపూర్ణముగా పోగొట్టుకొనుటలో ఇంతకంటె అధికమగు విశేషము గలదు. ఎందుచేతననగా, ప్రాజ్ఞాత్మ కూడ నిజముగ సమస్తముతోను ఏకమేయనియు, తన అవసరములకు తోడి మానవ సోదరుల అవసరములకు పోటీయేమియు లేదనియు, పరుల అభివృద్ధికై తోడ్పడుట

చేతనే తాను కూడ నిజముగ అభివృద్ధి నొందుచున్నాననియు అతనికి గ్రాహ్యమగును.

రెండవ బంధము గూర్చి కొంచెము హెచ్చరిక నియ్యవలసియున్నది. పాశ్చాత్యుల మనోభావముల కలవాటుపడి అందులో శిక్షితులైనవారు దురదృష్టవశమున ఒక అభిప్రాయమునకు తగుల్కొని యుండిరి. ఒక శిష్యుడు ఏదైన నొక మతమునకు గాని, తెగకుగాని, శాఖకుగాని, చెందిన యెడల కేవలము గుడ్డిగా, విమర్శన లేకుండ ఆ సిద్ధాంతముల నతడు నమ్మితీరవలెనని వా రనుకొందురు. కనుక యోగ శాస్త్రము ప్రకారము సంశయము పురోవృద్ధి కొక ఆటంకమని చెప్పినప్పుడు, ఈయోగ మార్గములో గూడ మూఢనమ్మక మావశ్యకమని వారు తలచవచ్చును. ఇంతకంటె తప్పు అభిప్రాయము వేరొండులేదు.

కొన్ని విషయములను గురించి సంశయము, లేక, అనిశ్చయము ఆధ్యాత్మిక పురోవృద్ధికి భంగకరమగుట నిజమే. కాని, ఎవరికివారు పరిశోధనచేసిగాని, సహేతుకముగా చర్చజేసిగాని యొక నిశ్చితాభిప్రాయమునకు వచ్చుటయే యీ సంశయమునకు విరుగుడుగాని మూఢనమ్మకముకాదు. (మూఢనమ్మక మొక బంధమే యని యిప్పుడే చూచెదము.) ఎక్కములగురించి బిడ్డ సంశయపడుచున్నంతకాలము అతనికి గణిత శాస్త్రములో ప్రవీణత ఎన్నటికి కలుగనేరదు. కాని అతనికి పరిశోధన వలనగాని, వాదమువలనగాని సరియైన గ్రహణశక్తి కలిగినప్పుడు ఎక్కములలోని సంగతులు సరియైనవేయని నమ్మకము కలిగి అతని సంశయము నివారణకాగలదు. రెండురెళ్ళు నాలుగు అని నమ్ముట కేవలము ఎవరో యొకరు చెప్పినారనిగాదు, అది నిజమని అతనికి స్పష్టముగా కనబడుచున్నది కనుకనే నమ్ముచున్నాడు. యోగ శాస్త్రములోగూడ సంశయము నివారణచేసికొనగల పద్ధతి సరిగా ఇదియే నిజముగా ఇది యొక్కటియే పద్ధతి.

విచికిత్స అను శబ్దమును నిర్వచనము చేయుటలో కర్మ, పునర్జన్మ సిద్ధాంతముల విషయమై సంశయమనియు, ఈపవిత్ర మోక్షమార్గము ననుసరించినయెడల పరమకల్యాణము చేకూరునా లేదా యనెడు సంశయమనియు విశదము చేయబడినది. కర్మ, పునర్జన్మ మొదలగు విషయములను తెలిసికొనుటవలన ఆ సంశయము నివారణ అగుటయేగాక, ప్రపంచము భగవంతునిచే మానవునికై యేర్పాటు చేయబడిన పాఠశాలయనియు, అమరమగు జీవము నశ్వరములగు రూపములద్వారా పరిణా

మము నొందుటయే యీశ్వర సంకల్పమనియు, ప్రతి భాగములోను ఆ సంకల్పము అద్భుతముగాను, కళ్యాణకరముగాను నుండుననియు, స్పష్టముగా తెలియును. ఈ రెండవబంధము విడిపోయిన వెంటనే దీక్షితునకు స్వానుభవమువలనగాని, హేతువాదమువలనగాని, యీ విషయములగురించి గుప్త శాస్త్రము చెప్పునదంతయు సత్యమేయని సంపూర్ణమగు నిశ్చయము కలుగును.

మూడవబంధము శీలవ్రతపరామర్శ: నిర్హేతుకములైనట్టియు, తప్పులైనట్టియు అన్ని విధములగు ఆచారములను నమ్ముట, మరియు హృదయశుద్ధికై బాహ్యవ్రత సంస్కారాదులపై ఆధారపడియుండుట, మొదలగు దీనినే శీలవ్రత పరామర్శఅందురు. అన్ని గొప్ప మతములలోను ఉన్నట్టి ప్రార్థనలు, పూజలు, సంస్కారములు, యాత్రలు, ఉపవాసములు, అనేకవిధములగు కర్మకాండలు, వ్రతములు మొదలగునవి మనకు ఊతకఱ్ఱలవలె సహాయకరముగా నుండవచ్చునుగాని, అంతకుమించి వానిలో విశేషమేమియు లేదని అతడు గ్రహించును. బుద్ధిమంతుడు వానిలో తన కుపయోగకరములుగా గనిపించువానిని అవలంబించునుగాని, మోక్షప్రాప్తికై వానిలోనే యొకదానిని పూర్తిగా నమ్ముకొని యుండడు. మోక్షము తనలోనుండియే రావలెనని అతడు నిశ్చయముగా నెరుగును. పైనచెప్పిన సాహాయ్యములెంత యుపయోగకరములైనను, తన ఇచ్ఛను, తన జ్ఞానమును, తన ప్రేమను అవి యెంత వృద్ధిజేసినను, తన స్వంతకృషి లేనిదే మోక్షప్రాప్తి లేదనియు, అట్టి స్వంతకృషిలో అవి యెన్నటికి సమానము కానేరవనియు అతడెరుగును. ఈ బంధమును తెగగొట్టివేసినవాడు సరియగు జ్ఞానమును గలిగియుండును. మానవులందరకు ఆవశ్యకమయిన ఒకేమత మేదియులేదని, అన్ని మతములద్వారా మోక్షమార్గమును చేరవచ్చుననియు గ్రహించును. మరియు, ఏమతమక్కరలేకుండగనే అపవర్గమార్గములను చేరవచ్చుననిగూడ అతడెరుంగును.

ఈ మూడు బంధములును అన్యోన్య సంబంధము గలిగియున్నవి. ప్రాజ్ఞాత్మకును దేహాత్మకును గల భేదము పూర్తిగా బోధపడినయెడల పునర్జన్మ సంభవించు రీతిని గ్రహించి ఆవిషయమగు సంశయమునంతను నివృత్తి చేసికొనగలుగుటకు కొంతవరకు సాధ్యమగును. దీనిఫలితముగా జీవాత్మయొక్క ఆధ్యాత్మిక శాశ్వతత్వము గురించి గలిగిన జ్ఞానము సాధకునకు తనస్వంత ఆధ్యాత్మిక శక్తిపై విశ్వాసమును గలుగచేయును, అందు మూఢనమ్మకము నశించును.

## మార్గమునందలి అవస్థలలోని అంతర్భాగములు

ప్రధాన మార్గములోని ప్రతి అవస్థయు నాలుగు అంతర్భాగములుగా విభజింపబడినది. మొదటిది "మార్గో" (మార్గము, లేక, దారి); దీనిలో అభ్యర్థి బంధములను వదల్చుకొనవలెను. రెండవది "ఫల" దానిఫలము, దీనిలో మనస్సు తన యత్నము లంతకంత కెక్కువగుటచే కలుగుచున్న ఫలమును గాంచును, మూడవది "భావగ"_సిద్ధి, ఈకాలములో ఫలితము సంపూర్తియైనందున, ఈస్థితిలో ముముక్షువు దృఢముగా నిలిచి ఇచట చేయవలసిన కార్యము నంతను సంతృప్తికరముగా నెరవేర్చ గలుగును. నాల్గవది "గోత్రభు" అనగా, తరువాత దీక్షను బొందుట కర్హుడయ్యెనని తెలియజేయుస్థితి.

ముముక్షువు 'గోత్రభు' కావలెనన్న, మార్గమునందు అతడున్న అవస్థయందలి బంధములనుండి పూర్తిగా విముక్తుడగుట ముఖ్యావశ్యకమని తెలియుచున్నది. ముముక్షువు రెండవ దీక్షను బొందుటకు ముందు ఆలోకప్రభువుచే నియమింపబడిన ఉపదేష్ట ఇతడు ప్రథమదీక్షాసమయమునబొందిన శక్తుల నెట్లు వినియోగపరచెనో పరీక్షించుటకై సాక్ష్యమును గోరును. అభ్యర్థివలన సాహాయ్యమును బొందిన జీవులు ముందుకువచ్చి సాక్ష్య మిచ్చెడు భాగమే యీసంస్కారములోని మిక్కిలి మనోహరమగు భాగము. ఈరెండవ దీక్షను బొందుటకు అభ్యర్థి తన మానసికశరీరములో స్వేచ్ఛగా పనిచేయగల శక్తినిగూడ సంపాదించి యుండవలెను. ఎందుచేతననగా, ప్రథమయోగదీక్షాసంస్కారము భువర్లోకములో జరిగినను, రెండవది సువర్లోకములోనే, అనగా, స్థూలమానసికలోకములోనే జరుగును.

దీక్షలు ఏదో యొక చావిడిలోనో, తోటలోనో జరుగునని చెప్పిన దానిని బట్టి పైవిషయము విరుద్ధముగా దోచవచ్చును. కాని నిజముగా వైరుధ్యమేమియు లేదు. మైత్రేయ ప్రభువు ఉపదేష్టగా నున్నప్పుడు సంస్కారము వారి తోటలోగాని, వారి పెద్ద గదిలోగాని జరుగును. వారు తమ స్థూల శరీరములోనే యుందురు. వారికి దగ్గరనే నివసించెడు వైవస్వత మనువు కూడ తరుచుగా స్థూలశరీరములోనే అక్కడకు వచ్చుచుందురు. అక్కడకు వచ్చు తక్కిన వారందరు ప్రథమ దీక్షాసమయమందు సామాన్యముగ తమ కామ శరీరములలోను, రెండవ దీక్షాసమయమందు మానసిక శరీరములలోను ఉందురు. అక్కడనుండెడు పరమపురుషులు వారి చైతన్య

ములను అత్యంత సులభముగా ఏలోకమున కావలసిన ఆలోకమునందు కేంద్రీకరింప గలను. భూలోకములో గల ప్రతి వస్తువునకు భువర్లోక సువర్లోకములలో సరియగు ప్రతి రూపములు గలవు, కనుక నేను జేసెడు వర్ణనలన్నియు యథార్థములే. స్థూల పదార్థములకు సంబంధించి వర్ణించిన స్థితిగతులు కూడ యథార్థములే.

## రెండవ దీక్ష

వెనుకటి అధ్యాయములలోని విధానముననుసరించి రెండవ దీక్షాసంస్కార మునకు సంబంధించిన వివరముల నిచట చెప్పెదను. చైత్రశుద్ధ పౌర్ణమి నాటి రాత్రి మైత్రేయ ప్రభువు భవనములో పరమపురుషుల మహాసమావేశ మొకటి జరుగు ననియు, ఆ సందర్భమున కొందరు అభ్యర్థులను 'సకృదగామిన్' అను రెండవ దీక్షకు ప్రవేశపెట్టుదురనియు మాకు సమాచారము వచ్చినది. ఆ యువకుల సంరక్షకులు పది గంటలు దాటకుండా తమను కలసికొనవలసినదని మోర్యమహర్షి గారు కోరిరి. ఆ సాయంత్రము భారతీయ స్నేహితులు చాలమంది అచట తిరుగాడుచుండిరి. అభ్య ర్థులును వారి సంరక్షకులును ముందుగా కూట్‌హూమి మహర్షి గారి ఆశ్రమమునకు వెళ్లగా ఆ మిత్రులందరు బహుజాగ్రత్తగా వారి ననుసరించిపోయి కొంత దూర మున మర్యాదగా నిలుచుండిరి. వారు ఆమహర్షి గారి ఆశ్రమమును జేరిన తోడనే మోర్యమహర్షి గారు కూడ దయచేసిరి. వెంటనే పరమగురువు లిరువురును మైత్రేయ ప్రభువు మందిరమున కేగిరి. శిష్యులుకూడ వారి ననుసరించి పోయి తోటలో నిలిచి పోయిరి.

ఈ తోట హిమాలయ పర్వతముల దక్షిణచటియలయం దున్నది. అక్కడ నుండి జూచినచో భారతదేశ విశాలమైదానములు చాల దూరమువరకు కనిపిం చును. అది యొక పల్లములో నున్నందున చాటుగానున్నది. దాని వెనుక కుడివైపు నకు చుట్టి వచ్చు దేవదారు వృక్షముల అడవి గలదు. ఈ యడవికి పైగా తూర్పు దిశను రాతితో కట్టిన పురాతన గృహ మొకటి కలదు. దానిలో స్తంభములు గల విశాలమగు వసారాలు గలవు. ఆ గృహమందే మన జాతికి మనువగు వైవస్వత ప్రభువు నివసింతురు. మైత్రేయుల వారి యుద్యానవనమంతయు పున్నమచంద్రుని రజతచంద్రికల కాంతితో శోభిల్లుచుండెను. అచట మందార గుత్తులును, వసంత కుసుమిత కుసుమములును ఆ వెన్నెలలో అతిమనోహరముగా వెలయుచుండెను.

అచటి మహావృక్షము చుట్టు నున్న తెల్లని చలువరాతి తిన్నెపైన ఆ చంద్రకాంతి కండ్లు మిఱుమిట్లు గొలుపునట్లు ప్రకాశించుచుండెను. మైత్రేయుల వారు గృహములో నుండి రాగానే వారి అభిమాన విరామ స్థలమగు ఆ తిన్నెపై ఆసీనులైరి. పరమగురువులు ఆయన ఆసనమునకు క్రిందుగా పచ్చిక బయలు మీద ఆయన కిరు ప్రక్కలను అర్ధచంద్రాకారముగా కూర్చుండిరి. ఆ వేదికమీదనే ఒక మెట్టుక్రిందగా పరమగురువులగు కూట్‌హూమి, జ్వాల్‌కుల్ గార్ల మధ్యను ఇద్దరు అభ్యర్థులు నిలువబడిరి. వారి వెనుక భాగమున ఆ యిద్దరిలో చిన్నవానికి భూలోకములో సంరక్షకులుగా నియమింపబడిన వారు నిలబడిరి. బోధిసత్త్వులకు కుడిప్రక్కన కొంచెము వెనుకగా వైవస్వతమనువు కూర్చుండిరి. వారిరువురిపైన గౌతమబుద్ధుల వారి దివ్య విగ్రహము ప్రకాశించుచుండెను. గౌతమ బుద్ధులు వారు తమ కడపటి జన్మములో నీ యిరువురు అభ్యర్థులనుండి "ఎన్నడును ఉల్లఘింపబడని శపథమును" స్వీకరించి యుండిరి. సర్వశక్తియుతమగు వారి ఆశీర్వాదమును ఈనాడా యువకులు తీసికొనబోవుచున్న దీక్షాసమయమందు వారికి ప్రసాదించిరి. వారికి దగ్గరనే అయిదు రేఖల కధిపతియగు మహాచోహన్‌వా రుండిరి. కొంచెము స్త్రైపైన తరువాత బోధిసత్త్వులు చేసిన గంభీరమగు ఆ వాహనమునకు జవాబుగా వారిరువురి మధ్యను కొంచెము ఎత్తున ఒక తార తళుక్కున మెఱసెను. లోకప్రభువును, మహీపీఠమున కధిపతియును, ఏకోపదేష్టయునగు శ్రీసనత్కుమారుల వారి యుజ్జ్వల తారయే ఆ తార.

కూట్‌హూమి, జ్వాల్‌కుల్ మహర్షులు ఇరువురును ఆయభ్యర్థులను ఒకయడుగు ముందుకు నడిపిరి. అప్పుడు బోధిసత్త్వు లిట్లు ప్రశ్నించిరి: "మీరు నాయెదుటకు తీసికొనివచ్చినవారిద్దరును ఎవరు ?"

కూ॥ హూ॥ "ఈసోదరులిద్దరును పృథక్త్వము, సంశయము, మూఢనమ్మకము అను మూడు బంధములను తెంపివేసి వారి కర్మయొక్క ఫలితము ననుభవించి, వారి శ్రమయొక్క ఫలితమును జూపించి సక్రిదాగమిన్ పథమున బ్రవేశింపగోరుచున్నారు. వీరిని గోత్రభులుగా మీసముఖమున బెట్టుచున్నాను.

మై. ప్ర. :— "ఈసోదరులు ప్రవేశింపదలచినమార్గమున వారిని యిక ముందు కూడ నడుపుచుందురా ?"

కూ. హూ. :— "అట్లే చేయుదును."

మై. ప్ర. :— మానిబంధనము ప్రకారము ఇరువురు పెద్దసోదరులు రెండవ దీక్షను బడయగోరెడు ప్రతి అభ్యర్థియొక్క యోగ్యతను దృఢపరచవలెను. మరియొక సోదరుడెవ్వరైన వారి కోరికను బలపరచెదరా?"

"నేను బలపరచెద"నని జ్వాల్‌కుల్ మహర్షి జవాబు చెప్పిరి. సంరక్షకులవైపు జూచి మైత్రేయప్రభువు ఇట్లనిరి: "బాహ్యప్రపంచములో మీరిరువురును సోదరులవలె వీరిలో చిన్నవారిని మీసంరక్షణయందుంచుకొనిరి. సంరక్షకులుగానుండుటలో మీకు కొంత అనుభవము గలిగినది. ఇతని శరీరమింకను బహు కోమలముగానుండుటచే ఇకముందుగూడ మీరు సంరక్షకులుగానుండి ఇతడు మార్గమందలి రెండవభాగమును చరించుటలో ఇతనికి సహాయపడు బాధ్యతను వహించుట కంగీకరించుచున్నారా?" "మేమందులకు సంతోషముతో అంగీకరించుచున్నాము," అని వారు జవాబు చెప్పిరి.

మై. ప్ర. "మీరు సంతోషముతో సులభముగా ఆకార్యమును నిర్వహింపగలుగుటకు మీకతనియందు తగినంత గాఢమగు ప్రేమ గలదా" అని ప్రశ్నింపగా, "ఆనందదాయకమగు ఈకార్యమును మేము ప్రారంభించినప్పుడుకంటె ఇప్పుడు వానియెడల మాప్రేమ ఎక్కువ గాఢముగా నున్నది; అతనికి నేర్చుకొనుట కాసక్తికలదు, గనుక అతనికి బోధ జేయుటయు, దారిజూపుటయు చాలసులభము," అని వారు జవాబు చెప్పిరి. మైత్రేయుల వారాచిన్న అభ్యర్థిని "ఈసోదరులిద్దరియెడలను నీకుగూడ సమానమగు ప్రేమగలదా? నీకును వారికిని మధ్య ఏవిధమగు మనఃస్పర్థయు గలుగనియ్యక వారికి సంతోషముగా లోబడియుండి వారు చెప్పినట్లు నడుచుకొందువా? అని యడిగిరి." "నేను వారిద్దరను మిక్కిలి గాఢముగా ప్రేమింతును, వారు నాయెడల జూపుచున్న శ్రద్ధకు నేనెంతైన కృతజ్ఞుడను. అందుచే నేను సంతోషముగా వారు చెప్పినట్లు నడచుకొందును," అని అతడు బదులు పలికెను.

ఆపరిభువు వారిద్దరనుజూచి "అయితే మీరు సక్రిదాగమిన్ పథము ననుసరింపగోరుదురా ?" అని ప్రశ్నించిరి.

"మేమందుల కర్హులమైయున్నచో తప్పక ననుసరింపగోరెదము," అని యువకులు జవాబు చెప్పిరి. బోధిసత్త్వులప్పుడిట్లనిరి: "ఒక్కొక్క యోగదీక్షకు అభ్యర్థుల నర్పించినప్పుడు అదివరలో వారికి ప్రసాదింపబడినశక్తులను వారెట్లు వినియోగపరచిరని అడుగుట ఈసోదరబృందమునకు అనాదినుండియు ఆచారమైయున్నది. ఒకశక్తిని పరులకు సహాయముచేయుటకై ఉపయోగించినప్పుడే దానిని శక్తి అనదగును. కనుక, క్రిందటిసారి మీరు మాయెదుట నిలచి సోదరబృందములోనికి ప్రవేశపెట్టబడిన తరువాత, మీరు చేసిన సేవకు ఎవరు ఋజువు పలుకగలరు ? మీరేమైన నిర్దిష్టమగు బోధజేసిరా, మీరెంతమందికి సహాయముజేసిరి ?" గంభీరమగు ఈమాటలు ఒక గొప్ప ప్రకటనవలె ప్రపంచమంతటను మ్రోగినట్లుగా, గాలిని బద్దలుచేసికొనుచు పోయెను. వెంటనే నాలుగు దిశలనుండి యొకగొప్ప సాక్షుల సమూహము తరంగములవలె లేచి, ఆమధ్యను నిలబడిన అభ్యర్థులపై దృష్టి నిలిపి, ప్రేమతోను కృతజ్ఞతతోను జూచుచు నిశ్శబ్దముగా నిలిచియుండిరి. అప్పుడుకూట్ హూమి మహర్షి యిట్లని పలికిరి

"వీరందరును అనేక దేశములనుండి అనేక జాతులలోనుండి వచ్చిరి. నాశిష్యులగు వీరిద్దరివద్దనుండి వీరందరు వెలుగును, బలమును, సౌఖ్యమును బొందిరి; నా సందేశమును ఈనాపెద్ద కుమారుడు వేలాది జనులకు ప్రబోధము చేసెను, అంధకారములోనున్న వారికి వెలుగునిచ్చుటకై ఎడతెగకుండ శ్రమపడి పనిచేసెను. వారందరు ఋజువుపలుకుట కిప్పుడు వచ్చియున్నారు; అతడొక పుస్తకమునుగూడ రచించెను. అనేక వ్యాసములను వ్రాసెను. అవన్నియు అతని పరార్థచింతను ఋజువు చేయును. ఈనాచిన్నకుమారుడు (పరమగురువు ప్రేమతో మందహాసము చేసిరి) బహిరంగముగా పనిచేయుటకు వయస్సులో చాల చిన్నవాడై యున్నాడు. కాని నేనతని కిచ్చిన బోధను చిన్న పొత్తముగా లోకమునకతడు ప్రసాదించెను. లక్షలకొలది జనులు దానిని జదివి ప్రేమతో అతని మార్గదర్శిగా నెంచుచున్నారు. వారందరుకూడ నిచట సాక్ష్యమిచ్చుటకు సిద్ధముగా నున్నారు." వెంటనే "మేము సాక్ష్యమిచ్చెదము" అనెడుమాటలు అన్ని దిశలనుండియు అనేక కంఠములనుండి వినవచ్చెను". అంతమంది యొక్కసారిగా సాక్ష్యము చెప్పినప్పుడు వాతావరణ మంతయు

ఒక్కసారి మాట్లాడినట్లాయెను. అప్పుడు బోధిసత్త్వుల మందహాస మతి మధురమై వర్ణనాతీతముగ నుండెను. లోకరక్షకుడగు ఆ ప్రభువు తమ ప్రశ్నకు వచ్చిన జవాబునువిని అమితానందము బొందిరి. అప్పుడు మొదటి సంరక్షకుడిట్లు పలికెను. "ఈ అభ్యర్థులలో పెద్దవాడు విశేషమగు చిక్కులు, తీవ్రమగు పోరాటము సంభవించినపుడు నాయందును నా సోదరునియందును పరిపూర్ణ విశ్వాసముగలిగి, యెంతమంది వ్యతిరేకముగా నున్నను చలింపక, ధైర్యముతోనుండి బలమునుగాని, మాధుర్యమునుగాని, ప్రసన్నతనుగాని, సత్యమునుగాని గోలుపోక దృఢమగు భక్తిగలిగి యుండెనని నేను ఋజువు పలుకుచున్నాను. తన శక్తులనన్నిటిని పరులకు సేవజేయుటకే వినియోగించుచు అలసటగాని, స్వార్థపరత్వముగాని లేక నిత్యము పనిచేయుచున్నాడనిగూడ నేను సాక్ష్యము చెప్పెదను. నా సంరక్షణలో నున్న యీచిన్నబిడ్డ తానుకలసికొన్న వారి కందరకు సాహాయ్యము జేయ నెల్లప్పుడు ప్రయత్నించుచుండునవియు, సాహాయ్యము చేయుటలో అతనికి అద్భుతమగు చతురత గలదనియు నేను ఋజువియ్యగలను. అతడెచటనున్నను ప్రకాశవంతమగు ప్రేమను పవిత్రతను ప్రసరింప జేయుటచేత అతని సన్నిధినుండుటయే మహా ప్రసాదముగ నుండును. అతని అమూల్యమగు చిన్నపాత్రముయొక్క విలువ అందరకు తెలియును."

రెండవ సంరక్షకుడుగూడ ఆ యభ్యర్థుల తరపున ఇట్లు మాట్లాడెను:

"నాకు ప్రియులగు ఈ యభ్యర్థుల పక్షమున నేనుగూడ నా సాక్ష్యము నియ్య గోరెదను. పెద్దవాడు స్వయముగ భక్తితోను ప్రేమతోను ఆత్మత్యాగముజేసి నాకు అండగానుండి విశేషముగా సహాయము చేసెనని నేను చెప్పగలను, మరియు అతడు పెక్కుజనులకు ప్రబోధముచేసి వారిజీవితములకు వెలుగును గొనితెచ్చెనని చాలమంది వలన వింటిని. చిన్న అభ్యర్థి విషయమై, అతడు అడయారులోను, కాశీలోను, అనేకమంది సభ్యులలో అద్భుతమగు ప్రేమను, భక్తిని నెలకొల్పెననియు, వారల జీవితములలో అద్భుతమగు పరివర్తనమును గలిగించెననియు నేను స్వయముగా నెరుగుదునని సాక్ష్యమియ్యగలను. మరియు అతడు రచించిన గ్రంథము పఠించుటవలన తమ జీవితమంతయు నూతన వికాసముతో గనిపించుచుండెనని అనేకమంది వద్దనుండి నాకు పెక్కు జాబులు వచ్చెను."

అప్పుడు కూటహూమి మహర్షి అచట చేరిన గుంపులలోనుండి ఆయువకుల వలన సత్యమునుదెలిసికొని వారిని మార్గదర్శులుగా నెంచి,వారిననుసరించుచున్న వారిని

రండని పిలచిరి. అనేకులు ముందుకువచ్చి వారిఅనుభవములను జెప్పుచు మనఃపూర్వక ముగా కృతజ్ఞతను దెలిపిరి. "పరమగురు చరణసన్నిధి" వలన తమ జీవితములో గొప్ప పరివర్తనముకలిగినదని అనేకులు చెప్పిరి. చాలాసహాయమును బొందినమరికొంతమంది ఆసమయమునకు మేల్కొనియుండి వారివారి పనులను జేసికొనుచుండుటవలన, అచటకు వచ్చుటకు అవకాశము లేకపోయెను, అందుచే వారి సజీవప్రతిమలను పరమగురువు నిర్మించి చూపించెను. వీరు చెప్పునదిగాని, చేయునదిగాని యేమియు లేకపోయినను ఆసమయమునందు ప్రసరించుచుండిన అద్భుతశక్తుల స్పర్శ కొంతయైనను ఆ విగ్రహ ములద్వారా అసలు మనుష్యులకు చేరియుండవచ్చును. అప్పుడా సమూహములు మరలిపోయెను. తరువాత సంస్కారము సాగెను.

బోధిసత్త్వులు అభ్యర్థులను జూచి, వారు చేసిన సేవకు సంతోషమునుదెలిపి, యిప్పుడు ప్రసాదింపబోవు శక్తులను, వెనుకటి శక్తులనుగూడ మానవసేవ నిమిత్తమై యుపయోగింతురని ఆశయమును దెలిపి యిటుల చెప్పిరి:

"భూమిమీద మీ సోదరులను బంధించెడు మూఢశృంఖలములను మీరు శాశ్వతముగ తొలిగించుకొని తెంపివేసిరి. కనుక ఇకముందు మీ శక్తిని వినియో గించి వారి సంకెళ్ళ భారమును తగ్గించుటకు ప్రయత్నింపవలెను. భిన్నాత్మభావము భ్రమయని మీకు సంపూర్ణనిశ్చయము కలిగినది. ఇప్పుడా నిశ్చయమును స్థూలో పాధులపైన ముద్రితముచేయవలెను. అట్లు చేసినయెడల ప్రత్యగాత్మ కొరకై యెట్టి తలంపుగాని, క్రియగాని యెన్నడును ఆయుపాధులలో పుట్టనేరదు. మీ రేమిచేసినను అందరిలోనుండెడు ఏకాత్మకై చేయుదురు. ఈప్రకారము చేయుటకై మీరు కృషి సలిపెదరా, మీరు విజయముబొందువరకు మీయత్నమును సాగించెదరా ?"

"నేను చేసెదను," నేను చేసెదను" అని ఆయువకులనిరి. మైత్రేయుల వారు మరియు నిట్లనిరి :

"విచికిత్స, లేక, సంశయమను బంధమును మీరు తెంపివేసిరి. పరిణామము యథార్థమగు విషయమనియు, ఎప్పటికప్పుడు సరిజేయుచుండెడు కర్మనియతి నను సరించి నిరంతరము ప్రకృతి ద్రవ్యములోనికి మునుగుచుండుటయే పరిణామ విధాన మనియును, మీరు నిశ్చయముగా నెరుగుదురు. మీకిప్పుడు ప్రసాదించెడు శక్తుల నుపయోగించి ఆప్రధానవిషయములగురించి సంశయ మెవరికున్నను మీరు తొల గించుచుండవలెను. మీజ్ఞానమును వారితో పంచుకొనవలెను. మీ రార్జించినజ్ఞానము

కేవలము మీకొరకై కాదని మీరు జ్ఞాపకముంచుకొనవలెను. కనుక మీశక్తుల నితరులలో వికాసము గలిగించుటకు వినియోగించెదరా ? ''

" నేనాలాగుననే చేసెదను '' అని అభ్యర్థులు పలికిరి. తిరిగి ఆప్రభు విట్లనిరి:

"మీరు మూఢ నమ్మకము—శీల వ్రతపరామర్శ—ను పూర్తిగ విసర్జించిరి; సత్యమును ఏ మతములో నైనను గనవచ్చునని మీరెరుగుదురు; వ్రతములు, సంస్కారములు మొదలగు వానిలో స్వతస్సిద్ధమగు విలువలేదనియు, వాని వలన గలిగెడు ప్రయోజనమంతయును వాని నాచరింప కుండగనే ఇచ్ఛచేతను జ్ఞానముచేతను బొందవచ్చుననియు మీరు తెలిసికొంటిరి. మఱియు పరిణామమును నడిపించెడు పరమశక్తి కోపించి శిక్షించు ననెడు మూఢనమ్మకము మీలో నశించినది. సర్వసృష్టియు ప్రేమలో నావృతమై యున్నదనియు, మానవులలో మీరు ప్రచారము చేయవలసినది ఆవిశ్వ ప్రేమతత్త్వమనియు మీరు గ్రహించిరి. కనుక మీరీ శుభ సందేశమును వ్యాప్తి చేసి అంధ కారమును దొలగింప ప్రయత్నించెదరా?"

"అట్లే చేసెదను", అని యిరువురును బదులు చెప్పిరి. మైత్రేయ ప్రభువు మరియు నిట్లనిరి:

"అజ్ఞానము చేతను, భ్రమ చేతను కల్పించుకొన్న అంధకారము తప్ప వేరు విధమగు నంధకారములేదని యెన్నడును మరువకుడు. ప్రతి మంచి దానము, ప్రతి పరిపూర్ణదానము, పైనుండి ఆవెలుగుల తండ్రి యొద్దనుండియే లభించును. ఆయనలో అస్థిరత్వము లేదు, లేశమైనను మరలుట యనునది లేదు, ఆయనలో చీకటి యనునది యిసుమంతయు లేదు. మానవులు ఆయన వెలుతురు వైపునకు వీపులను త్రిప్పి తమనీడలలో నడచుచు చీకటి, చీకటియని యరచుచుందురు." మైత్రేయప్రభు వట్లు చెప్పి ముగించినతరువాత, మానసికలోకములో చేయవలసిన పనినిగురించి అభ్యర్థులను కొన్ని పరీక్షలుచేసిరి. భవిష్యత్తులో వారి కొప్పగించవలసియుండిన కొందరు స్వర్గలోకవాసులను వారు పరీక్షించవలసివచ్చెను. ఆయాజీవుల లోపములను గమనించి వారిలో ఎవరికి ఏవిధముగ సహాయముచేసెదరని ప్రభువు అభ్యర్థుల నడిగెను. ఆజీవులలో మధ్యయుగములనాటి సన్యాసి యొకడుండెను. అతనికి గాఢమగు భక్తికలదు. కాని దేవునిగురించియు, మునులగురించియు, ఛర్చిగురించియు

అతనికి బహుసంకుచితమగు భావములుగలవు. అతనికెట్లు పురోవృద్ధి గలుగజేయు దురని ప్రభువువారిని ప్రశ్నించిరి.

రెండవ యోగదీక్షలో జరుగు తంతు అంతయు మానసికలోకములో జరుగును, అందరును మనోమయకోశములలోనే పనిచేయుచుందురు, గాని భువర్లోక ములో నుపయోగింపబడు 'మాయావి' రూపములలో వ్యవహరింపరు.

ఈపరీక్షలో అభ్యర్థులు సరిగా సమాధానములు ఇచ్చినతరువాత వారు మైత్రేయప్రభువువద్దకు గొనిపోబడిరి. ఆయనయెదుట వారు మోకరించిరి. ఆప్రభువు లేచి శంబళద్వీపము వైపునకు తిరిగి "ఓప్రభూ, సచ్చిదానందమూర్తీ, మీపేరను మీకొరకై యీకార్యమును జేతునా ?" అని గట్టిగా పలికిరి. అంత ఏకోపదేష్ట యనుమతిని దెలుపుటకు ఉజ్జ్వలతార ఆయనపై మెఱసెను. బోధిసత్త్వులు తమ దక్షిణహస్తమును ఆశీర్వాదపూర్వకముగా పైకెత్తినప్పుడు (శ్రీ) గౌతమబుద్ధులవారి విగ్రహము ఇతోధికమగు కాంతితో కన్నులు మిఱుమిట్లుగొలుపుచు ప్రకాశించెను. మైత్రేయులవారు వంగియున్న అభ్యర్థుల శిరములలో ఒకదాని వెనుక నొకదానిపై తమ చేతులనుంచినపుడు మహాచోహానువారుకూడ లేచి తమ ఆశీస్సుల నిచ్చిరి. అచటనున్నవారందరును మహానుభావుల సమక్షమందు భక్తితో వంగి నమస్క రించిరి. ఒకింతకాలమంతయు నిశ్శబ్దముగానుండెను.

ఆనిశ్శబ్దములోనే వారికి జ్ఞానబీగ మియ్యబడెను. ఆసమయమున బోధిసత్త్వులు తమమానసిక, కారణశరీరములనుండి శక్తికిరణములను వర్షింపజేసిరి. అవి ఆనూతన దీక్షితుల మానసికకారణశరీరములపై ప్రసరించి అచటనున్న తాదృశశక్తిబీజము లను ఆకస్మికముగా అద్భుతమగు వృద్ధిబొందునట్లు పురికొల్పెను. సూర్యకిరణములచే పురికొల్పబడినదై మొగ్గ హఠాత్తుగ రమ్యమగు పుష్పముగా వికసించినట్లు వారి మానసిక కారణశరీరములు తమలో నిగూఢముగానున్న శక్తులను వికసింపజేసికొని ప్రకాశవంతమగు సౌందర్యముతో అత్యద్భుతముగా విస్తరించెను. అట్లు విడుదల చేయబడిన బుద్ధియను నూతనమహాశక్తి విస్తరించిన ఆశరీరములద్వారా స్వేచ్ఛా విహారముచేయగలదు. మైత్రేయులవారు యువకుల నుద్దేశించి యిట్లనిరి:

"నేను మీకిచ్చుచున్న క్రొత్తశక్తిని గైకొనుడు. సంపూర్ణవిశ్వాసముతో నిర్భయముగా దాని ననుస ఈశ స్థూలోపాధులద్వారా మీమెదడులలో ప్రవేశించి మీపరివర్తనను పొరపాటులేకుండ నడుపుటకుగాను మీరు మీస్థూలో

పాధులను నిగ్రహించి సులభముగా లొంగునట్లుంచుకొనవలెను. ఆప్రకార మాశక్తి మీకు ముందుగల మార్గమున వెలుగునిచ్చి ప్రకాశవంతముగా నుద్దీపనముచేయుచు మూడవ అవస్థను చేరుటకు మిమ్ములనాయితముచేయును." మైత్రేయులవారు ఘనమగు తుది యాశీర్వాదమునిచ్చి ముగించిరి. వెలుగుచుండిన తారయు, దానివద్ద నుండిన దివ్యవిగ్రహములును అదృశ్యమయ్యెను. అందరును తిరిగినంగి నమస్కరించిరి. సంస్కారమంతటితో ముగిసెను.

అచట సమావేశమైన పరమగురువులందరు వారిస్థానములను వీడిరి. ప్రతి వారును క్రొత్తదీక్షితుల నభినందించి ఆశీర్వదించిరి. కొంచెము దూరముపోయి నిలువబడి యుండిన సాక్షిసమూహములు వారి నాయకులకు నమస్కరించి సెలవు దీసికొనుటకై తిరిగి దగ్గరకు వచ్చిరి. వారలనుజూచి కూట్‌హూమి మహర్షి వారితో కొద్దిగా మాట్లాడిరి. నూతనదీక్షితులు అప్పుడే నూతనముగా సంపాదించిన జ్ఞానమునుబట్టి వారికి కొంచెము సలహానిచ్చి ఆశీర్వదించి వారిని బంపివేసిరి.

## మానసిక వికాసము

రెండవ యోగదీక్షవలన మానసికశరీరముయొక్క వికాసము వేగముగా బెరుగును. దాదాపు ఈసమయముననే శిష్యుడు మాయావిరూపము నుపయోగించుట నేర్చుకొనును. ఇది మానసిక శరీరములో పనిచేయగలిగినవారు తాత్కాలికముగా నిర్మించుకొన్న కామశరీరమయియున్నది. సాధారణముగా మానవుడు భువర్లోకములో సంచారము చేయునపుడు కామమయశరీరమునే ఉపయోగించును. తన కామశరీరములో పనిచేయుచున్నప్పుడు భూలోకములో గనబడవలసిన అవసరము గలిగినయెడల తన కామశరీరము చుట్టును ఒక స్థూలశరీరమును నిర్మించి ప్రత్యక్షముగావలసియుండును. ఇట్లు చేయుటలో విశేషమగు శక్తివ్యయమగును; గనుక ఈ ప్రకారము అప్పుడప్పుడు మాత్రము జరుగునుగాని తరుచుగా జరుగదు. అతడు తన మానసిక శరీరములో బనిచేయుచుండగా భువర్లోకములో గనబడవలసియున్న యెడల భువర్లోక ద్రవ్యముతో తాత్కాలికముగ నొక కామశరీరమును నిర్మించి ప్రత్యక్షము గావలెను. దానినే మాయావి రూపమందురు. అతడు తన పనినిబూర్తి చేసికొన్న తరువాత తిరిగి మానసికలోకమునకు విరమించును. ఆ తాత్కాలిక శరీరముయొక్క ద్రవ్యము తిరిగి భువర్లోక ద్రవ్యములో కలిసిపోవును.

ప్రథమ యోగదీక్షను బొందువరకు శిష్యుడు తన కామమయ శరీరములో రాత్రులందు పనిచేయుచుండును. దానిని సంపూర్ణముగా నిగ్రహములోనికి తెచ్చుకొని తన యిష్టానుసార ముపయోగించుకొనగలిగిన తరువాత మానసిక శరీరములో పనిచేయ నారంభించును. అదికూడ పూర్తిగా నిగ్రహములోనికి వచ్చి పొందిక పడినతరువాత కామమయ శరీరముకంటె ఎక్కువ సులభముగా నుపయోగింపదగిన ఉపాధియగును. కనుక భువర్లోకములో నసాధ్యమైన చాలాపనిని మానసిక లోకములో చేయవచ్చును. మాయావిరూపమును నిర్మించుకొనగలశక్తి కలుగుటచే సాధకుడు వెంటనే మానసికలోకమునుండి భువర్లోకమునకు పోయి తిరిగిరాగలుగును; మరియు అన్ని వేళలయందును మానసికలోకముయొక్క ఎక్కువశక్తిని, తీవ్రతరమగు అనుభూతిని ఉపయోగింపగలుగును. భువర్లోకములో ఎవరికైన గనబడవలసి యున్నయెడల మాయావిరూపమును నిర్మించుకొనిన మాత్రముచాలును. మొదట పరమగురువు శిష్యునకు మాయావిరూపమును నిర్మాణముచేయుపద్ధతిని జూపించుట అవసరము. దానిని నిర్మించుకొనుట మొదట అంత సులభమైన పనిగాకపోయినను తరువాత అతడు తనకుతానే నిర్మించుకొనగలుగును.

ఈ రెండవయోగ దీక్ష సందర్భములో మానసిక శరీరము విశేషముగా విస్తరించి అభివృద్ధి బొందును. కాని, సాధారణముగా కొన్ని సంవత్సరములు గడచిన తరువాత గాని ఈ యభివృద్ధి యొక్క ఫలితములు స్థూల శరీరములోని మెదడులో వ్యక్తము కానేరవు. అవివ్యక్తమగుట ప్రారంభించుట తోడనే నిస్సంశయముగా మెదడునకు విశేష శ్రమ గలుగును. ఏలయన, వెంటనే దానిని సమశ్రుతికి తెచ్చుట సాధ్యము కాదు.

## అపాయకరమగు అవస్థ

అయిదవ యోగ దీక్షను బొందుటకు పూర్వము ఏసమయ మందైనను పతనము కలుగుట గాని, వ్యర్థముగా తిరుగుచు అనేక జన్మల నెత్తవలసి వచ్చుటగాని జరుగ వచ్చును, కాని మార్గావస్థలన్నిటిలోను రెండవ దీక్షను బొందిన తరువాత కాలము అనేక విధములచే మిక్కిలి అపాయకరమైనదై యున్నది. అభ్యర్థి శీలములో ఎట్టి లోపమున్నను, ముఖ్యముగా ఈ సమయములో, అది పైకి ప్రకటిత మగును. ఇట్టి ఔన్నత్యమునకు వచ్చు మనిషి పతితుడగుట అసాధ్యమై యుండవలెను. కాని

దురదృష్ట వశమున అది కూడ అప్పుడప్పుడు జరుగుచుండునని అనుభవము వలన తెలియుచున్నది. ప్రమాద మెప్పుడును గర్వమువలన గలుగును. మనుష్యుని స్వభావములో లేశమైన గర్వమున్న యెడల పతితుడయ్యెడు గొప్ప ప్రమాదము గలదు. మన మిచట తెలివి అనుకొనునది కేవలము యదార్థమైన వస్తువు యొక్క ప్రతిబింబము మాత్రమే, అయినను, మనలో కొందరము మన తెలివిని, మనప్రజ్ఞను, మన సూక్ష్మబుద్ధిని జూచి గర్వపడుచుందుము. కనుక మానవుడు భవిష్యత్తున తన తెలివి యెల్లిందునో ఈమన్మాత్రమైన గనియున్నచో తీవ్రమగు ప్రమాదము గలదు. అతడు గనుక ఆ తప్పు మార్గమున బయలు దేరిన యెడల వెనుకకు మరలివచ్చుట అనునది మిక్కిలి దుష్కరమగును. ఎడతెగని, అధికాధికమగు మెలకువ తప్ప ఈ అవస్థలో నుండి జయముతో బయట పడుటకు మరియొక సాధనము లేదు. మరియు గర్వము గాని, స్వార్థపరత్వము గాని, దురభిమానముగాని లేశమైన లేకుండ చంపి వేయుటకై నిత్యము కృషి చేయుచుండవలెను.

ఈ విషయము లన్నిటి అంతరార్థమును సంపూర్ణముగా తెలిసి కొన్న యెడల బైబిలు లోని అనేక వాక్యముల అర్థము అకస్మాత్తుగ, విచిత్రమగు రీతిని ద్యోతక మగును. సెంటుజాన్ క్రీస్తుకు బాప్టిజమ్ (జ్ఞానస్నానము) నిచ్చిన తరువాత క్రీస్తునకు అరణ్యములో గలిగిన ప్రేరేపణ రెండవ దీక్షానంతరము సంభవించునని పైన చెప్పిన ప్రమాదస్థితినే సూచించును. అడవిలో గడపిన నలుబది రోజులు కాలమున్ను రెండవయోగ దీక్ష సమయమున గలిగిన మానసిక శరీర విస్తరణము స్థూలమగు మెదడులో ప్రవేశించుటకు పట్టిన కాలమును సూచించును. అందుకు క్రీస్తుకు నలుబది రోజులు మాత్రమే పట్టెను గాని సామాన్య మానవునికి నలుబది యేండ్లు కూడ పట్టవచ్చును. జీసను జీవితములో ఆ కాలము ఆయన ద్వారా పని చేయుటకై రానున్న క్రీస్తుకు ఆ మెదడు అనుకూలించునట్లు సరిచేయుచున్న కాలమై యున్నది. అప్పుడు సైతాను, అనగా, నీచప్రకృతి, దీక్షితుని ప్రేరేపణ జేయుటకై వచ్చి మొదట అతని శక్తులను స్వప్రయోజనముల కొరకై వినియోగింపుమని ప్రోత్సహించును. "నీవు గనుక ఈశ్వరపుత్రుడవే యైనచో, ఈ రాళ్లనురొట్టెలుగా మార్చివేయుము," అనును. పిదప, దేవాలయము యొక్క శిఖరమునుండి క్రిందకు దుమికి ప్రజల నందరకు విస్మయము గలిగించు విచిత్రమును జూపింపమని ప్రోత్సహించును. తుదకు ప్రపంచములోని రాజ్యవైభవముల నన్నింటిని జూపించి, "నీవుక్రిందపడినన్ను

పూజించినచో, వీనినన్నిటిని నీకిచ్చెదను," అని ఆ సైతాను ప్రోత్సహించును. ఇచట గమనింపవలసిన విషయమేమనగా, క్రీస్తు తన శక్తులను స్వార్థము నిమిత్తమై ఉపయోగించుటకు ప్రేరేపణము కలుగుట. ఈ ప్రేరేపణములన్నియు గర్వము యొక్క వివిధ రూపములే.

ప్రథమ యోగదీక్షను పునర్జన్మతో పోల్చినట్లే, రెండవ దీక్షను న్యాయముగా బాప్టిజముతో, అనగా పరిశుద్ధాత్మకు అగ్నిసమక్షమందు జరిగెడు బాప్టిజముతో పోల్చవచ్చును. ఏలయన, ఆక్షణమందు ప్రసారమయ్యెడు శక్తి త్రిమూర్తులలో మూడవ మూర్తి నుండి ప్రసరించు శక్తి అయియున్నది. దానిని క్రిందకు దిగుచున్న అగ్ని ప్రవాహమని, లేక, సజీవమగు వెలుగు యొక్క యుజ్జ్వల స్రవంతి యని వర్ణించినను చాలదు. ఈస్థితిలో నున్న మానవుని బౌద్ధమతస్థులు 'సక్రదాగమిన్', అనగా, ఒక్కసారి తిరిగివచ్చువాడు అందురు. అంతవరకు వచ్చిన మానవుడు నాల్గవ దీక్షను బొంది యర్హత్ అగు సరికి మరి యొక్క జన్మ మాత్రమెత్తవలసి యుండునని దాని భావము. అర్హత్ అయిన తరువాత తప్పని సరిగా భూలోకమున జన్మనెత్తవలసిన అవసరములేదు. భారతీయులు ఈ రెండవ మెట్టుకు 'కుటీచక' అందురు, అనగా, ఒక కుటీరమును నిర్మించుకొన్న వాడని, శాంతినిచ్చు స్థానమును చేరిన వాడని దాని భావము.

ఈయవస్థలో వదల్చుకొనవలసిన బంధము లేమియులేవు. ఇది సాధారణముగా సూక్ష్మశక్తులును, తెలివియును విస్తారముగా అభివృద్ధి బొందవలసిన కాలము. సామాన్యముగా సూక్ష్మశక్తులని చెప్పెడు శక్తులు అదివరలోనే ప్రాప్తమై యుండని యెడల, ఈయవస్థయందు వానిని వికసింపజేసికొనుట సంప్రదాయమైయున్నది. ఏలయన, అవి లేనియెడల ఇప్పుడు ప్రసాదింపబడు జ్ఞానమును జీర్ణము చేసికొనుటగాని, మానవ కళ్యాణార్థమై జరుగు నుత్తమ కార్యములో పాల్గొనుటకు దీక్షితున కిప్పుడు లభించు అధికారమునుబట్టి అతడు చేయవలసినపని చేయుటగాని అసాధ్యమగునని కనిపించుచున్నది. భువర్లోకప్రజ్ఞ భూలోకమున జాగ్రదవస్థలోగూడ అతని అధీనమై యుండవలెను. రాత్రులందు నిద్రలో సువర్లోకమతనియెదుట బహిరంగముగా గన్పించుచుండును. ఏలయన, స్థూలదేహమును విడిచిపెట్టినపుడు మానవుని ప్రజ్ఞ, అతడీ స్థూలదేహములో నున్నపు డేలోకములోనుండెనో అంతకంటె ఒక అంతరువు పైనున్న లోకములో పనిచేయుచుండును. డాక్టరు బిసెంటుగారు "దీక్ష-

మానవపరిపాకము" అను పుస్తకములో దీనిని మరియొకవిధముగా వ్యాఖ్యానము జేసిరి. "మూడవ దీక్షకు యోగ్యుడగుటకు ముందు మానవుడు బుద్ధిలోకమునుండి బుద్ధిని (అంతర్వాణిని)భూలోకపు జాగ్రదవస్థలోనికి తెచ్చుకొనవలెను. ఆబుద్ధి అతని యందు స్థిరపడి అతనిని నడిపించుచుండవలెను. మరియు ఆమె యిట్లు చెప్పెను: "ఈ విధానమును సూక్ష్మశక్తులు వికసించుట యందురు. అదినిజమే. అవి నిజముగ సూక్ష్మశక్తులే. కాని, ఇది దివ్యదృష్టి దివ్యశ్రవణము అను శక్తులను సంపాదించుట మాత్రముకాదు. వానిని సంపాదించెడు విధానము వేరు."

## మూడవ దీక్ష

రెండవ దీక్షానంతరము అభ్యర్థి నాలుగు ఉప–దశలను గడచి, తిరిగి గోత్రభుడైనపుడు, మూడవదీక్షకు యోగ్యుడై "అనాగమిన్" అనగా, "తిరిగిరానివాడు" అగును. తరువాత నాల్గవదీక్షనుగూడ ఆజన్మలోనే బొందగలడని దాని భావము. భారతీయులీయవస్థను "హంస" అందురు. ఈ"హంస శబ్దమునకు "సోహం"–అదినేను (తదహమస్మి) అని యర్థముగూడ గలదని కొందరి అభిప్రాయము. మరియు నీటిని పాలను కలిపియుంచినచో హంస నీటినుండి పాలను వేరుచేయగలదని భారతదేశములో ఒక సంప్రదాయము గలదు. అటులనే జ్ఞాని, లేక, యోగికూడ జీవిత సంఘటనలలో ప్రాణుల కేవి యెంతవర కుపయోగించునో విచక్షణ చేయగలడు.

ఈ మూడవ దీక్షను క్రైస్తవ మత సంప్రదాయములోని క్రీస్తుయొక్క–మూర్త్యంతరముతో పోల్చవచ్చును. క్రీస్తు విడిగా నొక యెత్తైన పర్వత శిఖరమునకు వెళ్ళెను. శిష్యుల సమక్షమందు ఆయనరూపము మారిపోయెను. "ఆయన వదనము సూర్యునివలె ప్రకాశించెను, ఆయన వస్త్రము వెలుతురువలె తెల్లగానుండెను," "మంచువలె బహుతెల్లగా నుండెను, భూమిపైగల రజకుడెవ్వడును దాని నంతకంటె ఎక్కువ తెల్లగా చేయలేడు." ఈ వర్ణన ప్రజ్ఞాత్మను [Augoeides) స్ఫురింపజేయుచున్నది. ఇది మూడవదీక్షా సమయమందు సంభవించెడు దానికి సరియైన ప్రతిమయేయని చెప్పవచ్చును. రెండవదీక్షయందు మానసిక శరీరము పురికొల్పబడినట్లుగానే ఈ మూడవదీక్షయందు ముఖ్యముగా కారణశరీరము వికసింపజేయబడును. జీవాత్మ తురీయాత్మకెక్కువ సన్నిహితముగా దీసికొనిరాబడును. కనుక జీవాత్మ ఆ ప్రకారము రూపాంతరము నొందెనని నిజముగ చెప్పవచ్చును. అద్భుతమగు ఆశక్తి

ప్రసారమువలన దేహాత్మకూడ పరివర్తనము జెందును. ప్రథమ దీక్షాసమయమున జీవాత్మ-దేహాత్మలు రెండును ఏకమయ్యెను; ఆ యేకత్వమున కెన్నడును భంగము కలుగనేరదు. కాని యిప్పుడు జీవాత్మలో గలిగెడు వికాసమీా దిగువరూపములలో నెన్నడును ప్రతిఫలింపనేరదు.

సువార్తలో వ్రాయబడిన చరిత్ర ప్రకారము మార్త్యంతరము సంభవించిన కాలమందు పాతనిబంధనములోని ప్రధానపాత్రలగు మోసెస్, ఎలీజాగార్లు ప్రత్యక్షమయిరి. మోసెస్ యూదుల ప్రవక్తలలో శ్రేష్టుడు, ఎలీజా యూదుల ధర్మమును ప్రతిపాదింపగలిగినవాడు. వారిరువురును సత్యమును చేరగల రెండు విధానములను (ఒకటి ధర్మానుసరణము, రెండవది దేవుని ప్రవక్తచేయు బోధవలన ప్రబోధమును బడయుట) ప్రతిపాదించిరి. సువార్తయను క్రొత్తనిబంధనమును ప్రతిష్టింపనున్న క్రీస్తుతోగూడ ఆ మహాశయు లిరువురు నున్నట్లు వర్ణింపబడినది. ఈ చిహ్నము లన్నిటికి మూడవదీక్షకు సంబంధించిన సంగతుల కనుగుణ్యముగా అర్థము చెప్పవచ్చును.

ఈ యవస్థకు సంబంధించిన మరియొక చిహ్నము సువార్తలోని కథలో గనిపించును. క్రీస్తు ఆలయములోని తన తండ్రికి ప్రదర్శింపబడెనట. అప్పుడు పసిబిడ్డ యని చెప్పుటచేత సాంప్రదాయకమైన గాథలో ఈ ఘట్టము కొంచెము అసందర్భముగా గనిపించును. మానవపురోవృద్ధి యందలి ఈ యవస్థయందు మహీపీఠమునకు అధిపతియును, ప్రపంచముయొక్క ఆధ్యాత్మిక ప్రభువునునగు ఆ సనత్కుమారుల వారి సమక్షమునకు మానవుడు తీసికొనపోబడును. ఈ మూడవదీక్షను ఆలోక ప్రభువు స్వయముగా నిచ్చును, లేక, శుక్రమండలమునుండి వారితోగూడ దయచేసిన వారి శిష్యులు ముగ్గురు జ్యోతిష్మతులలో అందుకు నియమింపబడిన యొకరిత్తురు. శిష్యులలో నొకరు దీక్ష నొసంగినపక్షమున ఆసంస్కారానంతరము అభ్యర్థిని ప్రభువు దర్శనమునకు కొనిపోవుదురు. ఆప్రకారము క్రీస్తు తన తండ్రి సమక్షమునకు గొనిపోబడెను. దీక్షితునిలోని బుద్ధి నిర్వాణ లోకములో దానిమూలముతో నేకమగు వరకు ఉద్ధరింపబడును. అప్పుడు మానవునియొక్క మొదటి రెండు, (ఆత్మ, బుద్ధి), తత్త్వములకు అత్యద్భుతమగు నైక్యము సమకూరును.

## నాల్గవ, అయిదవ బంధములు

అనాగమిన్, లేక, హంస, పగలు తన దినచర్య నంతను జరుపుకొనుచు, శుద్ధమానసిక లోకమునకు చెందిన శక్తులన్నియు సంపూర్ణముగా అతని యధీన

మందుండుటచే అతనికి గలిగెడు అద్భుత అవకాశముల నన్నిటిని ఉపయోగించుకొనుచు ఆనందించుచుండును. రాత్రులందు స్థూల శరీరమును విడిచినపుడు బుద్ధి లోకమునకు చెందిన అద్భుతమగు విశాలచైతన్యములో మరియొక సారి ప్రవేశించును. ఈ యవస్థ యందుండునపుడు దీక్షితుడు కామరాగ, పతిఘ, అనెడు రెండు బంధముల శేషములను, అనగా, ఇంద్రియార్థముల ననుభవింప వలెననెడు రాగము (ఉదాహరణము—భూలోకపదార్థములయందు అనురాగము); ప్రతిఘము, అనగా, కోపము—రాగము, కోపము, ద్వేషము అనునవి స్పర్శమాత్ర మైనను లేకుండ నశింపు చేసికొని పరిశుద్ధుడు కావలెను. బాహ్యావిషయములకు వేనికిని ఏ విధముగను తను దాసుడుగాకుండ ముముక్షువు సంపూర్ణ విరాగి కావలెను. దీని వలన సంతోషకరమైనట్టియు, సుందరమైనట్టియు, శుద్ధమైనట్టియు వస్తువులు అతని నాకర్షింపవనిగాని, దానికి వ్యతిరేకములైనవి అతనికి అసహ్యాకరములుగావనిగాని భావించరాదు. ఇవన్నియు అతని అనుభవములో నుండును, గాని అతని విధిని నెరవేర్చుటలో అవి యడ్డంకులుగానేరవు. అతని కార్యమున కవసరమైన అత్యావసర సందర్భములలో వాని నన్నిటిని యొక్క సారిగా తుడిచి వేయగలడు.

తరుచుగా కలుగుచుండెడు ఒక దురభిప్రాయము కలుగకుండ మన మిచట జాగ్రత పడవలెను. పరమ పవిత్రమైనట్టియు, ఉత్తమ మయినట్టియు మానవప్రేమ యెన్నటికి నశించదు. యోగాభ్యాసము వలన అట్టి ప్రేమ యెన్నడును తరుగదు సరిగదా, మొదటి ఒకరిద్దరి పైన మాత్రమే జూపబడిన ప్రేమ ఇప్పుడు పెరిగి, విస్తరించి, సమస్త జీవుల యెడల సమానమగు గాఢత్వముతో జూపబడును. కాని, ముముక్షువు క్రమేణా తనచుట్టునుండెడు వారి దేహాత్మలతో సంబంధించిన సామాన్య విషయములను, యోచనలను, పూర్తిగ నతిక్రమించును. అందుచే, అతని ప్రేమలో సామాన్యముగ నైహిక ప్రేమననుసరించి వచ్చుచుండెడు అన్యాయము గాని, పక్షపాతము గాని అతనియందెంత మాత్రము నుండవు.

అయినను, ఈ ప్రకారము అతనికి సర్వభూతముల యెడల విశాలమైనప్రేమ యలవడినందున, సన్నిహితులగు స్నేహితుల యెడల అతనికి గల ప్రేమ తగ్గిపోవునని యెన్నడును తలచరాదు. బుద్ధునకు ఆనందునకును, క్రీస్తునకు సెయింట్ జానుకును గల అసామాన్యమగు పరిపూర్ణ ప్రేమానుబంధమును ఉదాహరణముగ దీసికొనవచ్చును. దీని వలన ఈ ప్రేమ తగ్గుటకు బదులు అపారముగా వృద్ధి జెందుననియు

గురుశిష్యుల మధ్యగల సంబంధము మానవ బాంధవ్యములన్నిటి కంటె చాలా బలవత్తరమైనదనియు విశదముకాగలదు. మోక్షమార్గమున పెరిగెడు ప్రేమ జీవాత్మల మధ్య పెరుగును గాని కేవలము దేహాత్మల మధ్యగాదు. కనుక, అది ప్రబలముగా శాశ్వతముగా నుండును. దానిలో తరుగు గాని, మార్పుగాని గలుగునని భయము లేదు. ఏలయన అది “భయమును తొలగించు పరిపూర్ణప్రేమ.”



# పదియవ అధ్యాయము

## ఉత్తమదీక్షలు

### అర్హత్, లేక, పరమహంస

ప్రథమ, ద్వితీయ, తృతీయ దీక్షలబొందిన తరువాతదశలలో ముముక్షువు బుద్ధిలోక చైతన్యమును క్రమేణా వికసింపజేసికొనును. కాని, నాల్గవ దీక్షాసమయమున నిర్వాణలోకమున బ్రవేశించును. అప్పటినుండియు నిలుకడగా ఆలోకము యొక్క దిగువ అయిదు ఉపలోకములలోనికి యూర్థ్వగమనము చేయుచుండును. ఆ భాగములోనే మానవుని ఆత్మ యునికి గలిగియుండును. ఈ నాల్గవదీక్ష ఒక విధముగా మార్గమధ్యస్థితియని చెప్పవచ్చును. ఏలయన, ప్రథమ దీక్షకును, నాల్గవదీక్షకును మధ్య సాధారణ సమయములలో సగటున ఏడుజన్మలు కావలసియుండుననియు నాలుగు అయిదు దీక్షలమధ్యగూడ సగటున ఏడుజన్మలు కావలసియుండుననియు చెప్పుదురు. కాని, ఇదివరకు చెప్పినట్లు ఈ సంఖ్యలు విస్తారముగా హెచ్చవచ్చును లేక, తగ్గవచ్చును. మరియును, ఈ జన్మలకు కావలసినకాలము పెక్కుమంది విషయములో మిక్కిలి దీర్ఘముగా నుండదు, ఏలయన, సాధారణముగా స్వర్గలోక నివాసము లేకుండ ఈజన్మలన్నియు ఒకదాని తరువాత నొకటి శీఘ్రముగా సంభవించుచుండును.

బౌద్ధమత సంప్రదాయములో నాల్గవదీక్షను బొందినవానిని "అర్హాత్" అనియందురు. అనగా యోగ్యుడు, లేక పూజ్యుడు, పరిపూర్ణుడు అని అర్థము. ప్రాచ్యగ్రంథములలో దానినిగురించి రమ్యములగు అనేక విషయములు చెప్పబడియున్నవి. పరిణామములో అతడు పొందిన ఉన్నతి వారికి బాగుగా తెలియును. హిందువులు అతనిని "పరమహంస" — హంసకు పైవాడు అని యందురు.

క్రైస్తవ సంప్రదాయములో ఈనాల్గవ దీక్షకు సరిపోవు ఘట్టము "గెత్సిమేన్" వనములో క్రీస్తునకు గలిగినబాధ, శిలువపైన కొరతవేయుట, పునరుత్థానము, అను భాగములలో గనబడును. దీనికికొన్ని ప్రాథమిక దశలుండుటచేత, ఈయవస్థను "పవిత్రవారము" లో జరిగినట్లు చెప్పబడే వివిధ సంఘటనలను పూర్తిగా సూచించును. మొట్టమొదటి సంఘటనము లాజరస్సును మృతులలోనుండి క్రీస్తు ఉద్ధరించుట; సువార్తలో చెప్పినకథలో "పామ్" ఆదివారమునకు ఒకటి రెండు వారములు ముందు

గనే యిది సంభవించెనని వ్రాయబడినను, ఆ యాదివారమునకు ముందు రోజు శని వారముననే యెల్లప్పుడును దాని స్మరణోత్సవము జరుపబడుచున్నది. ఆదివారము రోజున జెరూసలెమ్ నగరములోనికి విజయోత్సాహముతో ప్రవేశము జరిగెను; సోమ మంగళవారములలో దేవాలయములో కొన్ని యుపన్యాసము లియ్యబడెను. బుధవారమురోజున జూడాస్ ఇస్కారియట్ వలన ద్రోహము జరిగెను; గురువారము రోజున పవిత్ర యూకరిస్టు సంస్కారము స్థాపించబడెను. గురువారమురాత్రి పైలేట్, హెరాడ్ గార్లవద్ద విచారణలు జరిగెను; శుభకరమగు శుక్రవారమురోజున శిలువపై కొరతవేయుట, పవిత్ర శనివారమురోజున చెరసాలలోని భూతములకు ప్రబోధము చేయుటజరిగెను. శనివారమునాటి అర్ధరాత్రిమున—ఆదివారమునాటి ప్రథమక్షణ మందు—విజయుడైన క్రీస్తుయొక్క మృతకోత్థాపనము జరిగెను.

క్రీస్తు యొక్క జీవిత నాటకములోని యీ వివరములన్నియు నాల్గవయోగ దీక్షా సమయమందు జరిగెడు సంగతులకు సంబంధించి యుండును. శనివారము రోజున లాజరస్సును మృత కోత్థానము చేయుటలో క్రీస్తు అసాధారణ మైనట్టియు అద్భుతమయినట్టియు కార్యమును చేసెను. చాలవరకు దాని ఫలితముగానే అతడు శీఘ్రముగా భూలోకములో నొక విజయమును బొందెను. మృతుని యుద్ధరించె నను వార్త వినిన తోడనే జనులందరును కలిసి వచ్చి ఆయన కొరకువేచియుండిరి; జెరూసలెమ్ నగరమునకు పోవుటకై గృహములో నుండి బయటకు రాగానే అద్భుత మగు నుత్సాహమును వెలిబుచ్చుచు మహాగౌరవమును జూపిరి. ప్రాచ్యదేశములలో పూజ్య పురుషుని యిప్పటికి గౌరవించు పద్ధతిని వారాయనను ఆనాడు సన్మానించిరి. జనులందరును అమితోత్సాముతో క్రీస్తును వెంబడించి జెరూసలెమ్ చేరిరి. స్వల్ప మగు ఆ యైహిక గౌరవమును ప్రజల వలన బొందినవారై క్రీస్తు వారలకు బోధ చేయదలచి దేవాలయములో నుపన్యాసముల నిచ్చిరి. అనేకు లచటికి వచ్చి వారిని దర్శించి, వారి బోధలను విని, ఆనందించిరి. దీక్షాసమయమందు నిజముగా జరిగెడు దాని కిదంతయు చిహ్నము. దీక్షితుడు చాలమంది నాకర్షించుచు, జనరంజకుడై ప్రజలచే గుర్తింపబడి గౌరవించబడును. తరువాత నెల్లప్పుడును ఒక ద్రోహిబయలు దేరి వ్యతిరేకముగా ప్రచారము చేసి, అతడు చేసినది చెప్పినది అంతయు కీడువలె గన్పించునట్లు చేయును. 'రుయిస్ బోక్రిక్' చెప్పినట్లు: "ఒక్కొక్కప్పుడు ఈయభా గ్యులు సర్వమును గోల్పోవుదురు—ప్రపంచములోని మంచి వస్తువులను, స్నేహితు

లను, బంధువులను, అన్నింటిని గోల్పోవుదురు. సకల జీవులచేత్యజింప బడుదురు, వారి పవిత్రత గూడ అనుమానింప బడును; జనులందరిచే నిరసింపబడి, తిరస్కరింప బడుదురు; ఒక్కొక్కప్పుడు వివిధములగు వ్యాధులచే గూడ బాధింపబడుదురు."

తరువాత నిరాపనిందలు, దుర్భాషలు, అతనిపైగురియును, ప్రపంచమంతటిచే నొక్కసారి నిరాకరింపబడును. దాని తరువాత 'గెత్సిమేన్' వనములోనిరంగము వచ్చును. అచట క్రీస్తు అందరిచే విడిచి పెట్టబడిన వాడై దిక్కు మాలిన వానివలె నుండును. తరువాత నందరిచే గేలిచేయబడును, శిలువపై గొరత వేయబడును. తుదకు శిలువపై నుండగా "నాప్రభూ, నాప్రభూ, నీవు కూడ నన్ను విడనాడితివా?" అను కేక వినవచ్చును.

మేడమ్ బ్లవట్‌స్కీగారి 'గుప్తవిద్య,' Secret Doctrine అను గ్రంథములో; నొక క్రొత్త వ్యాఖ్యానమును జేసిరి. నేను దానిని స్వయముగా ఋజువు చూడలేక పోయితిని. ఆ మాటలకు "నాప్రభూ, నన్నెంతగా శోభిల్ల జేయుచుంటివి?" అని అర్థమని ఆమె ప్రతిపాదించెను. రెండింటిలోను ఏది సరియైనదో నేను చెప్పలేను, కాని రెండింటిలోను చాల సత్యము గలదు. నాల్గవ దీక్ష యొక్క ఒక ముఖ్యలక్షణమే మనగా, అభ్యర్థి పూర్తిగ నొంటరిగా విడిచిపెట్టి బడవలెను. మొదట భూలోకములో నొంటరిగా నిలబడవలెను. ఏవియోకొన్ని దురభిప్రాయముల వలన స్నేహితులందరు నెదురు తిరిగెదరు, తరువాత సర్వము సరిగా నడవ వచ్చును. కాని, యొకింత కాలము ప్రపంచమంతయు తనకు వ్యతిరేకముగా నున్నదను భావము కలుగును.

బహుశ, అది యంత గొప్ప పరీక్ష కాకపోవచ్చును. కాని మరి యొక ఆంతరంగిక అనుభవము కలదు. ఒక నిమిషము పాటు 'అవీచి' యను నిస్తరంగ స్థితిని, స్పందరహిత మగు అవస్థను గూడ అతడనుభవింప వలసియుండును. సామాన్యముగా అందరును అనుకొనునట్లు "అవీచి" యనగా ఒక నరకము కాదు. ఇది సమస్త జీవమునుండియు—ఈశ్వర జీవమునుండియు కూడ—పూర్తిగ వేరుచేయబడి ఆకాశములో కేవలము నొంటరిగా నిలబడెడు స్థితియై యున్నది. నిస్సంశయముగా ఏ మానవునికైనను అది బహు భయంకరమగు అనుభవము. అది యొక క్షణమాత్రముండునని చెప్పుదురు. కాని ఆ ఘోర భయము ననుభవించిన వారి కది యొక యుగమువలె గనిపించును. ఏలయన, ఆ యంతరువునందు దేశకాల భేదములుండవు. మహాభయం

కరమగు ఆ పరీక్ష జేయుటలో రెండు ఉద్దేశములు గలవని తలచెదను. మొదటిది: మానవులకు కర్మ ఫలితముగా "అవీచి" వంటి స్థితి ప్రాప్తించి నప్పుడు వారి యెడల సంపూర్ణ సానుభూతి సాధకునకు గలుగునట్లు చేయుట; రెండవది: సాధకుడు, ఈశ్వరుని నుండి వేరై, యేకాకి నైతిననుకొనుటచే గలిగిన భీతి కేవలము భ్రాంతియు ప్రేరేపణము మాత్రమే యనియును, ఈశ్వరునితో నేకమైతినను సంపూర్ణ నిశ్చయము గలుగుటచే విజయుడై బాహ్యమగు ప్రతి దాని నుండియు వేరై యొంటరిగా నిలువగలుగుటయును నేర్చుకొనుట. ఈ భయంకర పరీక్షకు నిలువ లేక కొందరు కూలిపోయిరి. వీరు వెనుకకు పోయి తిరిగి మెట్లన్నియు నెమ్మదిగా నెక్కి యీ యున్నత దీక్షకై శ్రమపడవలసి యుండును. కాని, యీ భయంకరమగు సంకటమును ధైర్యముతో నెదుర్కొని బయట పడిన వానికి నిజముగా, అతి దారుణమైనను, అద్భుతమగు అనుభవమై యుండును. కనుక పరీక్షాసమయమందు "నన్నేందులకిట్లు విడనాడితివి, తండ్రీ?" అనుమాటలు వర్తించినను, "నన్నింతగా శోభిల్ల జేయుచున్నావు" అనుమాటలు ఆ యనుభవములోనుండి విజయుడై వచ్చినవాని మనోభావమును బాగుగా వ్యక్తము చేయునని చెప్పవచ్చును.

దుఃఖము, విజయము, ఈరెండు లక్షణములు కలిసియుండుటచేతనే, యీ దీక్ష తక్కిన దీక్షల నన్నింటికి భిన్నముగానుండును. మొదటి మూడు దీక్షలకు క్రైస్తవ సంప్రదాయములో నొక్కొక్క నిర్దిష్టమగు సంఘటనము (జననము, బాప్తిస్మము, మార్త్యంతరము) చిహ్నమై యున్నది. కాని యీ నాల్గవదీక్షను ప్రకటించుటకు వరుసగా అనేక సంఘటనములు కావలసివచ్చెను. శిలువపైన కొరత వేయుటతో నంత మొందిన బాధలన్నియును ఈ దీక్షయొక్క యొకభాగమును తెలియ జేయుటకై యుపయోగింపబడినవి. మృత్యువును జయించి పునరుత్థానమును బొందుట రెండవ భాగమును తెలియచేయును. ఈ యవస్థయం దెల్లప్పుడును స్థూల, కామ,మానసిక శరీరములన్నిటిలోను బాధ కలుగును;లోకముచే ఖండింపబడుటయు అపజయము నొందుచున్నట్లగుపడుటయు ఎల్లప్పుడును సంభవించును. కాని బాహ్య ప్రపంచమునకు తెలియని యద్భుతమగు విజయము ఉన్నతలోకములలో నెల్లప్పుడును కలుగుచునే యుండును. ఈ దీక్షతో తప్పనిసరిగ కలిసియుండెడు విచిత్రమగు బాధ దీక్షితుని మార్గమున కడ్డముగా నుండెడు కర్మశేషమును పూర్తిగా పరిహరించును. ఈ బాధ ననుభవించుటలో అతడు జూపెడు ఓరిమి, సంతోషము, అతని

శీలమును బలపరచుటలో మిక్కిలి ప్రయోజనకరములై యుండును. మరియు, అతడు ముందున్న కార్యములో నెంతవరకు నుపయోగకారిగ నుండునో నిర్ణయించుటకు కూడ సహాయపడును.

ఈ దీక్షకు ముఖ్యచిహ్నములగు "కొరతవేయుట" "పునరోత్థానము" అనునవి ఈజిప్టులోని యొక ప్రాచీనసూత్రములో ఈక్రిందివిధముగా వర్ణింపబడెను:

"అభ్యర్థిని కర్రశిలువపై కట్టివేయవలెను, అతడు మృతుడు కావలెను, పాతి పెట్టబడవలెను, పాతాళమునకు పోవలెను, తిరిగి మూడవరోజున మృతకోత్థాపనము కావలెను."

ఆ ప్రాచీన దినములలో, సమాధ్యవస్థలో నుండగా రాతిపెట్టెలో నుంచబడిన అభ్యర్థియొక్క శరీరమును పూర్తిగా మూడు పగళ్ళు మూడు రాత్రులు గడచి నాల్గవరోజునకూడ కొంతకాలము గడచినతరువాత, బయటకుతీసి దేవాలయము, లేక, పిరమిడ్డునకు తూర్పుదిశను బహిరంగప్రదేశములోనికి తీసికొనిపోగా, అచట ఉదయభానుని తొలికిరణములు అతని వదనముపైబడి ఆతనిని దీర్ఘనిద్రనుండి మేల్కొల్పుచుండెను. "శిలువలేనిచో కిరీటములేదు" అని యొక పాతసామెతగలదు. మానవుడు స్థూలద్రవ్యములోనికి అవరోహణచేసి, ద్రవ్యమను శిలువపై బంధితుడైన తరువాతగాని పునరోత్థానమునుబొంది దివ్యమకుటమును ధరింప సాధ్యముకాదని,దాని భావము అనవచ్చును. కాని, పరిచ్ఛిన్నమునొంది, దుఃఖము ననుభవించి శ్రమపడుట చేతనే విజయము బొందగలిగెను. ఆపునరోత్థానమును వర్ణింప మనకు సాధ్యము కాదు. మనశబ్దజాలమంతయు దాని అద్భుత వైభవమునకు కళంకము తెచ్చినట్లుండును. వర్ణించుటకే ప్రయత్నముచేసినను అది దైవదూషణవలె ఘోరముగా గనబడును. కాని, యొకసంగతి మాత్రము చెప్పవచ్చును. సమస్త దుఃఖములను, కష్టములను, శ్రమలను, ప్రేరేపణములను, పరీక్షలను తరించి సంపూర్ణవిజయమును బొందడమైనది. జ్ఞానముచేతను ఆత్మశక్తిచేతను వానినన్నిటిని గెలిచియుండుటచే ఆవిజయము శాశ్వతముగా అతనిదైయుండును. బుద్ధభగవానుడు తమ మోక్షము నెట్లు ప్రకటించిరో జ్ఞప్తికి తెచ్చుకొనవచ్చును:

ఇంద్రియంబులు చెరసాల; ఎవరుగట్టి
నారో దానిని యెరుగంగగోరి పెక్కు
దేహబంధాలలోజిక్కి తిరిగితిరిగి

ఎడ తెఱపిలేని యిడుమలగుడిచినాడ;
ఇప్పుడన్ననో, నీవె యీ యిల్లుగట్టి
నాడవని యెఱింగితి, నీవు నాకుగోచ
రించితివి, బాధలను గోడ లింక బెట్ట
జాల, వా గోడలకుపైన దూలములను
ఉంచజాలవు, గృహము నశించిపోయె
భ్రాంతి నిర్మితమగు వెన్ను వాసమూడి
ముక్కలైపోయె, నిక ముందు ముక్తినిచ్చు
దారి నిష్కంటకంబయ్యె, త్వరగ జనెద.!

## నిర్వాణము

ఇకమీదట అర్హతుడు స్థూలశరీరములో జాగ్రదవస్థలో నుండగానే బుద్ధిలోక చైతన్యమును గలిగియుండును. నిద్రలోగాని సమాధ్యవస్థలోగాని యుండి శరీరమును విడిచినప్పుడు తత్క్షణమే అవాచ్యమగు నిర్వాణలోక వైభవములోనికి పోవును. ప్రథమయోగదీక్షను బొందుటకుముందు బుద్ధిలోకానుభవ మెుకింత యెట్లావశ్యక మో అట్లే అర్హత్ దీక్షను బొందుటకుముందు నిర్వాణలోక చైతన్యానుభవ మెుకింత అవసరమైయుండును. ఇప్పుడు ప్రతిదినము నిర్వాణలోకములోని కంతకంతకు పైకిపోవుటకు యత్నము చేయుచుండవలెను. ఈకార్యములో అపారమగు కష్టము గలదు. కాని క్రమేణా అనిర్వచనీయమగు ఆ దివ్యవైభవములోనికి అధిరోహణము చేయగలుగును.

ఆ లోకములో ప్రథమ ప్రవేశము కేవలము దిగ్భ్రమను గలిగించి కలవరపరచును; బుద్ధి లోకానుభవము గలవారికి సహితము ఆశ్చర్యము గలిగించు నంతటి గాఢమగు జీవపరిస్ఫుటతను స్ఫురింపజేయును. ఇదివరకు సాధకుడు ఒకలోకమునుండి మరియొక లోకమునకు ప్రథమసారి అధిరోహణము చేసినప్పు డిట్టి యాశ్చర్యము, ఇప్పటికంటె తక్కువగానైనను, కలుగుచుండెను. సంపూర్ణమగు, స్వచ్ఛమగు చైతన్యముతో భూలోకమునుండి మొదటిసారి భువర్లోకము లోనికి బోయినప్పుడు అచ్చట జీవనవిస్తృతిని జూచి ఆశ్చర్య పడుచు"జీవమననేమో తెలియునను కొంటిని కాని యింతవరకు నాకేమియు తెలియలేదు!" అని కేక వేయుదుము. మానసిక

లోకములోనికి మొదటిసారి పోయినప్పుడు గలిగెడు ఆశ్చర్యము దీనికి ద్విగుణీకృతము గానుండును. భువర్లోకమద్భుతముగ నుండెను,కాని సువర్లోకముతో బోల్చిన యెడల అది శూన్యముగ గనిపించును. మహర్లోకములోనికి, అనగా, ఉత్తమ మానసిక లోకములోనికి పోయినప్పుడు వెనుకటి కంటె ఎక్కువ ఆశ్చర్యము కలుగును. ప్రతి అంతరువునకు అధికమగు ఆశ్చర్యానుభవము కలుగుచునే యుండును. ఎప్పటి కప్పుడు, రానున్న అనుభవము వెనుకటి అనుభవముల నన్నిటిని అతిక్రమించి యూహాతీతమై యుండుటచేత, ముందుగా ఏ అనుభవమునకు మానసికముగా సిద్ధపడుటకుసాధ్యము కాదు. ఉన్నత లోకములలో నుండెడు జీవమతి గాఢమగు ఆనందముతో నిండి, వాచామగోచరమై యుండును.

ప్రాచ్యదేశ భాషలలో పండితులగు పాశ్చాత్యులు నిర్వాణమను పదమునకు నాశము, లేక, నిర్మూలము అని అర్ధము చెప్పిరి. ఊపిరిచే దీపమార్పి వేయబడినట్లు "ఆర్పివేయఁబడినది" అని ధాతువును బట్టి అర్ధము చెప్పిరి. సత్యమున కింతకంటె ఎక్కువ విరుద్ధమైనది మరేదియు నుండదు. కాని యొకటి మాత్రము సత్యము. మన మీ స్థూల లోకములో మానవుడని భావించిన దంతయు పూర్తిగా నాశమొందెను. అచట, ఇక మీదట, అతడుమానవుడు కాడు, మానవునిలోని దేవుడు మాత్రమే, ఇతర దేవుళ్లలో నొక దేవుడు, ఇతర దేవుళ్ల కంటె కొంచెము తక్కువయైన దేవుడు.

విశ్వమంతయు నొక బ్రహ్మాండమైన సజీవతేజస్సమితితో నిండి, విశ్వమంతయు ఆ తేజస్సే అయి, అంతయు కలసి, ఏ సంబంధమును లేక, అనివార్యముగా ఒక మహాకాంతి సముద్రము వలె ముందుకు చొచ్చుచు కొని పోవుచున్నట్లును, ఆ వెలుగంతయు ఏదో నిర్ణీతమగు ఉద్దేశముతో (అట్టిది యూహింప సాధ్యమయిన యెడల) బ్రహ్మాండమగు ఏకాగ్రతతో, లేశమైన శ్రమగాని, యత్నముగాని, లేకుండ పురోగమించుచున్నట్లూహింప ప్రయత్నింపుడు—వర్ణించుటకు మాటలు లేవు. మొట్టమొదట అద్భుతమగు నొక ఆనందానుభవము మాత్రము కలుగును, ఆ వెలుగు యొక్క గాఢమగు ప్రకాశము తప్ప మరేదియు గనిపించదు. కాని క్రమక్రమముగా కండ్లు చీకట్లు కమ్మెడు ఈ ప్రకాశములో గూడ బీజములు వంటి యెక్కువ ప్రకాశవంతమగు కేంద్రములు గలవని గ్రహింతుము. వీని ద్వారా ఆ వెలుగున కొక నవ్యలక్షణమబ్బుచున్నది. ఈలక్షణము చేతనే యీ వెలుగు దిగువ

లోకములలో గోచరమగు చున్నది. ఈలక్షణము యొక్క సహాయము లేని యెడల దిగువలోకనివాసులు దాని తేజస్సును గ్రహింప సాధ్యము కాదు. తరువాత క్రమ క్రమముగా ఈయుపసూర్యులే గ్రహాధిపతులు, గొప్ప దేవతలు, కర్మాధి దేవతలు, ధ్యాన చోహానులు, బుద్ధులు, క్రైస్తులు, మహర్షులు మొదలగు పరమపురుషులును, మనకు నామములైన తెలియని మహానుభావు లెందరో యితరులును, అని గ్రహింప గలుగుదుము. వారల ద్వారానే దిగువలోకములకు జీవము, వెలుగు ప్రవహించు చున్నవని గూడ తెలిసికొందుము.

ఈ యద్భుతమగు సత్యమునకు అలవాటు పడిన కొలదియు, వారివైభవోన్న తికి చాల క్రిందుగా నున్నను, మనము కూడ వారందరితో నేకమై యున్నట్లు కొంచెము కొంచెముగా గ్రహించెదము. వారందరిలో గాక, మధ్యనున్న యావదా కాశములోను గూడ వసించుచున్న ఆయేకేశ్వరునితో గూడ మన మేకమైయున్నట్లు గ్రహింతుము; మనము గూడ నొక కేంద్రముగా నున్నామనియు, దిగువ అంతరువు నందున్న మన ద్వారా గూడ మనకంటె చాలా దిగువను దూరముగా నున్న వారికి వెలుగును జీవమును ప్రసరింప జేయుచున్నామనియును గ్రహింతుము. (దూరముగ నున్న వారనగా, ఆ కాంతినుండి దూరముగ నున్నవారని అర్థము కాదు, ఎందుచేత ననగా సకల భూతములు దానిలోని యంశములే, అదికానిదేదియులేదు. ఆ కాంతిని తెలిసికొని అనుభూతి నొందుటకు దూరముగ నున్న వారని అర్థము.)

ఆ చైతన్య మెచట జూచినను కేంద్రమే గాని పరిధి కానరానిదని మేడమ్ బ్లవట్స్కీగారు తరుచు వర్ణించుచుండిరి. ఆ వాక్యము చాలా భావగర్భిత మైనది. ఇత రులు కొంతమంది కూడ ఈ అభిప్రాయమునే తెలియపరచినట్లు చెప్పుదురు, గాని హెర్మిస్ గ్రంథములలో మాత్రము తప్పక గనిపించును. ఆచైతన్యమును వినాశమని వర్ణించుట సత్యమున కెంత దూరము! ఆచైతన్యమును బొందిన దీక్షితుడు (తాను తానేయను) వ్యక్తి భావమును లేశమైనను నష్టపోడు. అతని స్మృతి అవిచ్ఛిన్నము గా నుండును. అతడు పూర్వపు మనుష్యుడే, కాని యిప్పుడతడు సకలమును గూడనై యున్నాడు, గనుక 'అహం' అనగా ఏమో తెలిసిన వాడై "నేను నేను" (అహ మస్మి) అని చెప్పగలడు. ప్రాగ్జ్యోతి Light of Asia అను గ్రంథములో సర్ ఎడ్విన్ ఆర్నాల్డు గారు అతిమనోహరముగా వర్ణించిరి:

కోరికలులేనివారికి
కోరదగిన సంపదాళి కోరకవచ్చున్
ఏరికి అహము నశించునో
వారికి యీ విశ్వమెల్ల బరగునహంబై.
అంత మొందుట నిర్వాణమన్న మాట
కర్థమని చెప్పు మానవు డనృతవాది;
వికలమైదోచువారి దివ్వెలకునవల
వెలుగుచుండెడు జ్యోతిని దెలియలేక
ప్రాణమున్, గాలమును మించి పరగునట్టి
నిర్మలానంద మెఱుంగనేరకయును
బరగనిర్వాణమన్న జీవంబటంచు
పలుకువారలు పొరబడ్డవార లనుము.

నిర్వాణమును బొందినవారిని నిర్జీవుడని వర్ణించిరి. నిర్జీవుడనగా మృతుడని యర్థముకాదు, ఏలయన అతడు మిక్కిలి యుజ్జ్వలమగు జీవమున కుదాహరణముగ వెలయుచుండును. సంసారమును శాశ్వతముగా దాటినవాడై, మృత్యువునకు జీవమునకు రెండింటికిగూడ నతీతుడై యుండుటచే నిర్జీవుడనబడును. దేవుడు లేనికాలమే నరకమనియు, కాలములేని దేవుడే స్వర్గమనియు ఒకరు నిర్వచనముచేసిరి. ఇందులో స్వర్గముగురించి చేసిన నిర్వచనము ఇతోధికముగా నిర్వాణమునకు వర్తించును.

నిర్వాణమును వర్ణించుటకు ఏ ప్రయత్నముచేసినను, అది వింతగాగనిపించక మానదు. మనస్సులకు పరిచయమైన దంతయు ఆ యంతరువునుచేరుటకు చాలా పూర్వమే మాయమయ్యెను. కనుక మన ముపయోగింపగల మాటలేవియు నిర్వాణలోకానుభవమును లేశమైనను బ్రకటింపనేరవు. ఆయంతరువునగూడ నిశ్చయముగా ఈశ్వరాంశకు ఒకవిధమగు కోశముగలదు, కాని దానిని వర్ణింప సాధ్యముకాదు. ఏలయన, ఒకవిధముగాజూచిన అది అణువువలె గన్పడును, మరియొకవిధముగా జూచిన యావత్తులోకమువలె గన్పించును. అచటిమానవుడు అంతటనుగూడనున్నట్లు అనుభవించును. కాని తనలో నెచ్చటనైన పరిజ్ఞను కేంద్రీకరింపగలడు. ఎచ్చటనైతే యొకనిమిషము శక్తిప్రసారము తగ్గునో అది తనకొక యుపాధి యగును.

అనిర్వచనీయమగు నిర్వాణవైభవము భూలోకమునందలి గ్రహణశక్తి నతిశ యించుట తప్పదు. కనుక ప్రతిభాశీలురగు కవుల వర్ణనములుగూడ నిష్ఫలమగుట నిశ్చయము. అయినను దానిని వర్ణింప ప్రయత్నించెదు ప్రతియొకరును ఒక్కొక్క విశిష్టమగు దృష్టితో జూచి వర్ణింతురు; ఒకరు చెప్పనివిషయమును మరియొకరు చెప్ప వచ్చును. నా అభిప్రాయములను కొంతవర కిదివరలోనే దెల్ప ప్రయత్నించితిని. నాకు ప్రాణస్నేహితుడు, సోదరుడునగు బిషప్ జార్జిసిడ్నీ అరండేలుగారు రచించిన "నిర్వాణ" మను గ్రంధమునుండి కొన్ని భాగముల నిచట పొందుపరచెదను. ఆయన అనిర్వచనీయమగుదానిని నిర్వచనము చేయుటకు శూరునివలె సాహసముతో అత్య ద్భుతమగు యత్నమును జేసెను. వర్ణించుటకు మన యత్నములన్నియు వ్యర్ధము లగునన్నమాట నిజమే. కాని, ఆయన నాకంటె ఎక్కువ కృతార్ధుడయ్యెనని చెప్పక తప్పదు: ఆయన ఇట్లు వర్ణించిరి.

పరమగురువు కూట్‌హూమి మహర్షిగారిని అదివరకెన్నడును చూడని రూప మున జూచినది నాకు జ్ఞాపకమున్న మొదటివిషయము. ఆయన సాధారణముగ ఎల్లప్పుడును ప్రకాశవంతముగా-పరమప్రకాశవంతముగా-నుందురు. కాని యిప్పుడు ప్రకాశమును మించియుండిరి. నిర్వాణచైతన్యము నాకు కలిగిన ప్రధమక్షణమందు నేనాయనలో జూచిన దివ్య వైభవమును వర్ణించుటకు నాకిచట తగినమాట యేదియు గనిపించుటలేదు. ప్రభావము, ప్రకాశము అను శబ్దము లతి పేలవముగా నుండును. "చీకట్లు కమ్మించెడు" లేక, "మిరుమిట్లుగొల్పు" అనుపదములు బహుశః ఎక్కువ అర్ధవంతమేమో. ఎందుచేతననగా, ఒకక్షణము నేను పరవశత్వమున బూర్తిగా మునిగిపోతిని. ఆదృశ్యమును జూడలేక నాముఖమును కప్పివేసికొనవలెనను కొంటిని, కాని నాకండ్లను ఆయననుండి మరలింపలేకపోతిని. అంత అగాధమగు తేజ స్సుతో ఆయన శోభిల్లుచుండెను. ఆ క్షణమందు అంతకంటె ఎక్కువ తేజోవంతమగు శోభను నే నూహింపలేకపోయినను, లోకప్రభువుకంటె ఆయన కొంచెము తక్కువ శోభాయమానముగ నుండిరని నేను తరువాత గ్రహించితిని.

"నేను ధైర్యముపూనితిని. నీవు జయింపనేర్వవలసిన క్రొత్తరాజ్యములోనికి నీకు స్వాగతము" అని కూట్‌హూమి మహర్షిగారు నాతో చెప్పుచున్నట్లుగా నాకు తోచెను. ఆయన శక్తిలో నాచైతన్యము వికసించుచున్నది. ఒకగడపదాటి వెళ్లినట్లు నిర్వాణములో బ్రవేశించితిని. మాటలును, వాక్యములును, ఎంతరమ్యముగానున్నను

ఎంత ప్రభావముతోనున్నను, ఇచట పరిస్థితులను వర్ణింపబూనినచో వాని నపవిత్రము జేసినట్లగును. ఈ యున్నతావస్థలో గలుగు ప్రథమానుభవలేశమైనను ఏకోపదేష్ట సన్నిధానమున గలుగు అనుభవమునుదక్క, మిగతా అన్ని లోకములయందలి అనుభవములను అత్యాధికముగ మించియుండును. మహాశ్వేత సోదరబృందములోనికి నన్ను ప్రవేశపెట్టిన సందర్భమున, ప్రథమ యోగదీక్షాసమయమందు, బుద్ధిలోక దృశ్యమును మొదటసారి చూచుట జ్ఞాపకమున్నది. నా పరమగురువును ఆయన బుద్ధిలోక శరీరములోజూచి నేనద్భుతపడుట నాకిప్పటికి మరవురాదు. తరువాత దినములలో సమస్తవస్తువులతోను అద్భుతముగా ఎట్టి ఐక్యభావమును బొందితినో వృక్షములతోను, పుష్పములతోనుగూడ ఏకమై వానితో పెరుగుచు, వానితోనే వృద్ధి బొందుచూ వానిలోనే వానితోపాటు దుఃఖించుచు, సంతోషించుచు ఎట్లు సామరస్యముతో నైక్యజీవనము జీవించితినో నాకు బాగుగా జ్ఞాపకముగలదు. యుగముల నుండి నాకు సఖుడుగానున్న కారణశరీరము నెట్లు విసర్జించితినోగూడ జ్ఞప్తిగలదు. ఈ క్రొత్తరాజ్యములో ప్రవేశించుటకు ఒకక్షణము పూర్వముగల అనుభవమునకును ప్రవేశించిన మరుచటి క్షణమందుగల అనుభవమునకుగల తారతమ్యము చీల్చి వేరుచేసినట్లు స్పష్టముగా గనబడుటగూడ జ్ఞాపకముగలదు.

"కాని యీ నాడు ఆ పరమగురువు ఇదివరలో నెన్నడును జూచి యెరుగని క్రొత్త వారివలె నుండిరి. నేను చిన్నబిడ్డవలె ఏరాజ్యమునందు ప్రవేశించుచుంటినో ఆ రాజ్యము యొక్క మహద్వైభవముతో అలంకరించుకొన్నట్లు గనిపించుచుండిరి. ఆ క్రొత్త చైతన్యము నన్ను కప్పివేసెను. ఒక్క క్షణములో ఆ ప్రపంచమంతయు ఆశ్చర్యమగు దివ్య నూతన మాల్యములతో నిండిపోయెను. అంతయు నొకటే, కాని వేరుగా, కేవలము విపరీతముగా నున్నది. ఒక క్రొత్తదైవత్వము నా కండ్ల యెదుట ప్రత్యక్షమై, నా దృష్టి కొక నవ్యభావమును, ఒక నూతన లక్ష్యమును ఆవిష్కరణము చేయుచున్నది. అది బుద్ధిలోక మందలి యైక్యతయే, కాని, దాని కలితమై, మహిమాన్వితమై, ఎక్కువ అద్భుతమైన యైక్యత. ఏదో అద్భుతమగు విధమున మిక్కిలి అపారమగు, ఉత్కృష్టమగు స్థితిలో నైక్యమై పోయెను. ఏకత్వము కంటె ఎక్కువ సత్యమైనది, యెక్కువ యథార్థమయినది యేదోయున్నది. అది అసాధ్యముగా దోచవచ్చును, అయినను అది యట్లున్నది.

"బుద్ధిలోక వైభవమును గూడ మితముగ గన్పింపజేయు నట్టి దాని స్వభావ మేమై యుండును? నేను మాటల నుపయోగింపవలెను; కాని మాటల నుపయోగించుట దారుణమగు పతనమువలె నగపడును. అది యొక మహనీయమగు వెలుగు యొక్క వైభవము, ఈశ్వరుని సనాతనత్వమునకు ప్రతిబింబమైన దివ్యమగు తేజో మండలము, అని మాత్రము చెప్పగలను. ఈశ్వర శక్తిని ప్రతిబింబించు నిర్మలమగు దర్పణము, ఈశ్వర శ్రేష్ఠతయొక్క ప్రతిరూపము, నాకు నట్టెదుట నున్నది. ఆ దర్పణము, ఆ ప్రతిబింబము అనంతమగు ప్రకాశార్ణవమే. నేనిదివరకే దానిలో నొక విధముగ నొక భాగము నైతిని గాని, క్రింది లోకములలో నొక దాని తరువాత నొకదానిలో పొందిన యైక్యతలయొక్క పరిపాకమువల్ల నేను దానిలో నొక భాగము నైతిని. ఆ యైక్యత లెట్టివనిన: బాహ్యప్రపంచములో సోదరత్వము, బుద్ధిలోకములో నైక్యత, నిర్వాణలోకములో మహనీయమగు ప్రకాశము.

"ఇంతవరకు బుద్ధిలోకములోని ఏకత్వము యావత్ప్రపంచములోను అత్యుత్కృష్టమగు సత్యముగా గనిపించెను. కాని దాని కంటెను గూడ ఈ మహనీయమగు వెలుగు సత్యమున కెక్కువ సన్నిహితముగా నుండెను. ఆది వెలుగు, మార్గము వెలుగు, అంతము వెలుగు. "వెలుగుండు గాక" అని యీశ్వరుడనెను. అనిర్వచనీయమగు వెలుగుండెను. సర్వత్ర వెలుగే గలదు. ఈ స్థూల ప్రపంచములోని వెలుగు రమ్యముగానున్నను, ఆ విజయ ప్రకాశమున కది యొక అస్పష్టమగు, దుర్బలమగు ఛాయా రూపము మాత్రమే అయి యున్నది. అది మనకు తెలిసిన రూపములలో ప్రవేశించుటకు దిగకపూర్వము స్వచ్ఛందమగుస్థితిలోనున్న సూర్యకాంతి;రూపములచే మలినము గాక పరిశుద్ధముగా నున్న వెలుగు. రూపమునకు జీవమైన జ్యోతి. ఎల్లప్పుడును ద్యోతకమగుచుండు "అమృతత్వ సందేశము", వర్తమానములోని భవిష్యత్తు, అయినను సనాతనము. మనకు తెలిసిన వెలుగుయొక్క మహనీయమగు "ఒక" — ఆ,అనజాలను—దివ్య స్వరూపము, ఒకసారము. ప్రాచ్య దేశములలోని అకలంకమగు అరుణోదయ కాంతి కంటె అద్భుతమైనది మరియొకటి చూడజాలము. అట్టి అత్యద్భుతమగు అరుణోదయవైభవ మంతయు దివ్యముగా వికసించి, నిర్వాణమను మధ్యాహ్న రూపమున అద్భుతమగు పరిపాకము నొందెను.

"ఈశ్వరుడే వెలుగు,వెలుగే ఈశ్వరుడు, మానవుడు వెలుగు,అంతయు వెలుగు", అని చెప్పినచో "వెలుగు కొరకై చూడుము! వెలుగు ననుసరింపుము! సమస్త వస్తు

వులలో నుండెడు ఈశ్వరుని వెలుగును జూచి దానితో నేకమగుట నేర్చుకొనుము,"
అని చెప్పెడు ప్రాచీన ఈజిప్టు దేశపు ప్రబోధమునకు నూతన వ్యాఖ్యానముగా నుండును. నేను ప్రపంచమును జూచుచున్నాను, ప్రపంచమంతయు వెలుగు అను భావములో జూచుచున్నాను. ఈశ్వరుని వెలుగే మానవునిలో వెలుగై, రాతిలోని వెలుగై, వృక్షములోని వెలుగై, జంతువులోని వెలుగై ఆవిష్కరణ మగుచున్నది. సర్వము వెలుగే. కండ్లు చీకట్లుకమ్మునట్లున్న కేంద్రమండలి దివ్యమగు వెలుగు పరిధి నైపు ప్రసరించుచు భిన్నములగు రంగులుగా మారిపోవుచున్నది. ప్రతిచోటను ఈశ్వరుని వెలుగే, ప్రతిచోటను అంధత్వ కారణంబగు దివ్యవైభవమే, ప్రతివర్గములోను ప్రతి వస్తువులోను మండుచుండెడు భవిష్యద్బీజమే. ఆ వెలుగు బీజము తన తెలుపును. ఏడురంగులుగా విభజించును.

"ప్రకృతిలో ప్రతివర్గములోను ఏడు రంగులు గల ఏడు గొప్ప మార్గములు గలవు. ప్రారంభమందు ప్రతి మార్గములోను ఆరంగు అంతర్గతముగ నుండి క్రమముగా బహిర్గత మగుచు తుదకు దివ్యమగు పరిపాకమును బొందును. ఖనిజవర్గములో రాజు లని చెప్పదగిన వజ్రము, కెంపు, పచ్చ, నీలము, వాని రంగులలో నుత్తమమగు పరి పాకమును బొందుట కనిపించును. కాని అట్టడుగున ప్రారంభదశలో ఈ దివ్యవైభవ ములన్నియు బంధింప బడియుండి, క్రమేణా పరిణామములో విడుదల బొంది తుదకు స్వేచ్ఛగా, అద్భుతముగా ఆ వర్గములో రాజులయి వెలయుచుండును. ప్రతివర్గములో నిట్లే జరుగుచున్నది. స్వేచ్ఛను బొందినవి కూడ ఎక్కువ ప్రబలమగు, ఎక్కువ అద్భు తమగు స్వేచ్ఛను సంపాదించుటకై తిరిగి నిర్బంధమును గైకొనుచున్నవి.

"నిలుకడగా నిలిచిపోయిన మెఱుపువలెనున్న నిర్వాణములో స్నాతుడనై, నోలలా డుచు, సమస్త వస్తువులలోను బంధింపబడియున్న మెఱుపులను జూచుచున్నాను. కిరాతకునిలోని మబ్బుగనున్న వెలుగును, వికసిత పురుషునిలో ప్రకాశవంతమగు వెలు గును, మానవాతీతుడగు సిద్ధపురుషునిలోని దివ్యమగు వెలుగునుగూడ చూచుచు న్నాను. ప్రతిచోటను ప్రతిరంగు రూపాంతరము నొందుట, దివ్యవైభవమును బొం దుట, మహనీయమగు అతీతత్వమును బొందుట జూచుచున్నాను. కాంతిశూన్యత యను అర్థములో "నలుపు" అనునది యెచ్చటనులేదు. ఈశ్వరుడు "వెలుగుచుండు గాక" అనినవెంటనే సర్వత్ర వెలుగుండెను, సర్వత్రవెలుగున్నది. "ఆయనవెలుగు మన అంధకారములోగూడ ప్రకాశించుచున్నది."

"నిర్వాణమననేమి? దివ్యమైన వెలుగు. నేను బహుశః నిర్వాణమందలి నీచ తమమగు అంతరువులనే, స్థూలతమమగు పొరలనేక్షణకాలము తాకియుండవచ్చును. అతిస్థూలమగు ఈ వైభవమును సహితము ఇచట భూలోకములో నూహింపలేను. కాని, నేను భూలోకమునకు తిరిగివచ్చుసరికి సత్యముయొక్క నూతనానుభవ మొకటి నాలోనిలిచిపోయెను. సత్యమునకు సన్నిహితమగు నొక సోపానము నెక్కితిని. ప్రపంచములో నేననుకొన్న దానికంటె ఎక్కువసఖ్యత, ఒక గాఢతరమగు ఏకత్వము, ఒక దివ్యతరమగు మహాలము, ఒక దివ్యతరమగు మార్గము,ఒకదివ్యతరమగు గమ్యము గనబడుచున్నవి. చుట్టును ప్రతిచోటను సర్వకాలములయందును, సూర్యకిరణములు— ఈశ్వరునిదూతలు — ప్రకాశించుచున్నవి. ప్రతిరంగును ఆయనమాటనే, ఆయనవాణినే పలుకును. ప్రతి రూపమును ఆయన సంకల్పమునే ప్రకటించును. నేనా సూర్యరశ్మిలోని ధూళినైయుండియు దానిలోని భాగమునే; ఆ సూర్యుని వైపు ఊర్ధ్వముఖముగా జూచుచు స్వకీయమగు దైవత్వ చిహ్నమును గాంచుచున్నాను. తుట్టతుదకు నేను బొందగలిగిన పరమావధియొక్క నిశ్చయమును ప్రత్యక్షరూపమున గాంచుచున్నాను. మన ప్రభువు సూర్యభగవానుడెట్లున్నాడో అటులనే మనమందరముగూడ నుందుము. ఏలయన అదివారి యిచ్ఛ."

"వెలుగేభావ, సంకల్పము, పరిధానము, ఉపాధి. ఆ వెలుగొకసారి మెఱసిన సమగ్రమగు తత్త్వసిద్ధాంత మొకటి మనకిచట స్ఫురించగలదు."

"వెలుగు సూర్యునియొక్క ఇచ్ఛ, సూర్యునియొక్క జ్ఞానము, సూర్యునియొక్క ప్రేమ. నిర్వాణమనగా ఆనందమని గ్రంథములలో వ్రాయబడినది. కేవలము పొలిమేర సీమనుండి జూచియుగూడ నిర్వాణమంతకంటె అనంతముగా ఎక్కువైనదని నేను తెలుసుకొంటిని. ఒక్కక్షణమాత్రము గంటిని, కాని నాకు లోపలను వెలుపలనుగూడ సమస్తవస్తువులు క్రొత్తరూపములను దాల్చినట్టు కనబడుచున్నది. నేనుంటిని, కాని సంపూర్ణముగా మారిపోతిని. నాచుట్టునున్న ప్రతివస్తువును నూతనవిధముగా గనబడుచున్నది, అన్నిటివిలువలు మారుచున్నట్లున్నది. ఇప్పుడు సహితము ప్రతివస్తువు వెనుకటికంటె చాలా ఎక్కువ భావమును స్ఫురింపజేయుచున్నది. ప్రతివర్గములోని ప్రతిపదార్థమును సత్యముగాగాక, చాలవరకు సత్యముయొక్క ఛాయగా గనిపించును. ఏలయన, ఆ వెలుగుయొక్క ప్రతిబింబములన్నియు ఎంత అల్పముగను, ఎంత అసంపూర్ణముగ నుండునో నేను జూచుచుంటిని.అవియంత దుర్బ

లముల్లైనవని యిదివరలో నేనెరుగను. అయినను, ప్రతిపదార్థమును నేననుకొన్న దానికంటె చాలాయెక్కువ యదార్థముగానుండుటయు, నేననుకొన్నంత ఛాయా స్వరూపములుగా నుండకపోవుటయుగూడ సత్యమే. రూపమునొందిన అవకాశమెట్లు చెరసాల యగుచున్నదో నేను చూచుచుంటిని, ఆఛాయలను తెలుసుకొనుచుంటిని, నేనాశాశ్వత కాంతియొక్క దివ్యవైభవము వికసించుటను గనుచుంటిని, సత్యమును గ్రహించుచుంటిని. ఈ నిర్వాణలోకముతో బోల్చినయెడల, ఇతరలోకములన్నియు ఛాయాలోకములే. ఈనిర్వాణలోకమున్న కారణముచేతనే ఆలోకము లన్నియు ఎక్కువ యదార్థములగుచున్నవి; ఏలయన, ఈశ్వరసంకల్పముయొక్క ముద్రను ప్రతి వస్తువుపైన నిప్పుడు జూచుచుంటిని. కనుక, అన్నివస్తువులను వెనుకటికంటె చాలా ఎక్కువ గాఢముగా గౌరవింపవలసియున్నది.

వేదాంతులు శుద్ధసత్త్వముగురించి చెప్పుదురు. దానితో నాకు ప్రత్యక్ష సంపర్కము గలుగలేదుగాని, ఇదివరలో నేననుభవించిన చైతన్యస్థితు లన్నిటికంటెను శుద్ధసత్త్వమునకు తక్కువదూరముననున్న (అనగా, ఎక్కువసన్నిహితమగు) దానితో సంపర్కముగలిగినది, గనుక శుద్ధసత్త్వ మెట్లుండునో నేనుకొంచెము గ్రహించిన ట్లగపడుచున్నది.

ఈవిషయమున భాష, భావనమును అర్థమునుగూడ మరుగుపరుచుననుట యెంత వాస్తవము! నిర్వాణలోక విషయములను వర్ణింపవలెననిన నాకు నిర్వాణలోక భాషకావలయును. మయర్సుకవి బహురమ్యముగా చెప్పినట్లు

> చెప్పగలిగితి నేనది తప్పకుండ
> విశ్వసింతువు నిశ్చయవిధముగాంచి!
> నేనుచూచితి; చెప్పగలేను నీకు;
> ఎట్లు చెప్పుదునది, గ్రహియింతువెట్లు?
> నాదు భూమిక ప్రభువీక నీదుహృదిని."

ప్రతిభా శాలియగు ఆ గ్రంథకర్తకు (అరండేలు గారికి) న్యాయము జరుగవలెననిన, నేను పై నుదహరించిన దంతయు ఆయన గ్రంథము (నిర్వాణము) లో నుండి అక్కడక్కడ కొన్ని భాగముల నుండి ఏరితీసిన వాక్యము లని మాత్రము చెప్పవలసి యున్నది. ఆ గ్రంథమును శ్రద్ధగా చదువవలెనని పాఠకులను గట్టిగా

హెచ్చరించుచున్నాను. అది అడయారులోని దివ్యజ్ఞాన ప్రచురణ శాలలో దొరుకును.

"ఆర్యుల విజ్ఞానము" అను గ్రంథములో బౌద్ధ సన్యాసి ఆనంద. యమ్, అను నతడు నిర్వాణము గురించి యిట్లు వ్రాసెను:

"ఈశబ్దము యొక్క ధాత్వర్థము "ఆర్పివేయబడిన" — ఊదుటచే, దీప మార్పి వేయబడినట్లు ఆర్పివేయబడిన — అని చెప్పవలెను. కాని, దీనిని గురించి యింతవరకు చెప్పబడిన దంతయు గ్రహించిన మీరు, దీని అర్థము కేవలము నాశము, లేక, నిర్మూలము అని ప్రతిపాదించువారు ఎంత పొరబడిరో తెలిసికొన గలరు. ఒకదృష్టిలో నాశము అని చెప్పనచ్చును, కోరిక యొక్కయు, రాగము యొక్కయు, దేహమే నేనను భ్రాంతి యొక్కయు నాశమే. కాని, "నేతి" మొదలగు నిషేధార్థక శబ్దములతో గాక వాస్తవ్యముగా చెప్పుటకు ప్రయత్నించునప్పుడు దుర్గమమగు కష్టము మనల నెదుర్కొనును. ఎందుచేతనన, మనము చేసెడు నిశ్చితార్థకములగు నిర్వచనము లన్నియు మన మెరిగిన పరిభాషలోను, మానవ యోచనకు పరిచయమైన శబ్దములలోను తప్పని సరిగా చెప్పవలసియుండును. కాని, యిచట చెప్పవలసిన ఆ "తత్" సమస్త జీవమున కతీత మైనదియు, సమస్తజీవము పరిపాకమునకై ఏ గమ్యము నుద్దేశించి పోవుచున్నదో ఆ పరమావధియు యున్నది.

"సుబోధితుడగు బౌద్ధునకు నిర్వాణమనగా చరమము, పరమము, జీవపరమావధి. ఈ స్థితి మనకు తెలిసినట్టియు, సంకుచితమైనట్టియు, నిత్యము మారుచుండు నట్టియు, "ఆత్మ—స్వాప్న"మునకు కేవలము భిన్నమైనది; ఇది వాచామగోచరమే గాక, భావాతీతమైనది. అయినను, కేవల మూహాతీతమైన యీ దివ్యవైభవము, సంసార పోరాటమందున్న జీవుల కందరకు పరమాశయమగు ఈ శాంతి మనకు మిక్కిలి సన్నిహితముగా నున్నది, అత్యంత సన్నిహితమగు మనచైతన్యము కంటె గూడ ఎక్కువ సన్నిహితముగా నున్నది. సరిగా గ్రహింప గలవారికి ప్రియతమమగు మనోరథము కంటె ప్రియతరమై యున్నది. ఇందులోనే ఆర్యుల విజ్ఞానముయొక్క అద్భుతము, ఘనత యున్నవి. ఆత్మపరిచ్ఛిన్నమువలన మానవుడు తనకు తాను కల్పించుకొన్న బంధములనుండి ముక్తిని బొందుటకై, ఆర్యులలో నుత్తములగు మహానుభావులు ఈ విజ్ఞానమును సంపాదించి కృతార్థులైరి. ఇది సూర్య చంద్రుల

ప్రభావమును మించినద్దై, మానవ చైతన్యము చేరగల చరమస్థితికి - నక్షత్రమండలముయొక్క ఉన్నత స్థితికి—కూడ అనంతముగా అవల నున్నది. ఏ సర్వసంశ్లేషకమగు ఆకాశములో ఈవిశ్వములన్నియు ఎల్లలు లేని నిలయమును గలిగియున్నవో ఆ యాకాశమండలి అనంతమగు అగాధముల కావలనున్నవి; అమితమగు ఆశతో ఆకాశమున కెగురుచు వ్యర్థముగా రెక్కలను గొట్టుకొనుచు పోయి పోయి తుదకు పవనలేమిచే క్రిందకు రాలనున్న విహంగమువలె పతనావస్థలోనున్న భావనయొక్క ఉన్నతుల కన్నిటికి అనంతమగు దూరమున నున్నది. అయినను మన మిప్పుడు తలంచుచున్న తలంపునకు పైనే యున్నది. నశ్వరమగు ఈక్షణమందు "మనము" అని యెంచదగిన చైతన్యమునకు పైనే యున్నది.

"స్వార్థరహితముగా జీవించుటకు, స్వార్థరహితముగా మృతినొందుటకు మాత్రమాశించుచు, ఉత్తమజీవితమును సేవించుట తప్ప వేఱు ప్రతిఫలము నపేక్షింపక, ఎట్టి యున్నతస్వర్గము నాశింపక, శాశ్వతమగు ఆనందము నపేక్షింపక, దినదినము ఎక్కువ స్వార్థరహితుడగుటకు మాత్రమా కాంక్షించుచు జీవించుట— ఇదియే ఆ పరమగురువు జీవితాదర్శము, జీవిత పాఠము, జీవితబోధ: దానివలననే సమస్త జీవులకు తుదకు శాంతి గలుగుగాక!"

ఈమధ్య నొక యుపన్యాసములో నీ విషయము నుదహరించుచు డాక్టరు బిసెంటుగారి ట్లు చెప్పిరి:

"బౌద్ధుల వేదాంతములో గౌతమబుద్ధులవారు పలికిన అద్భుతమగు నొక వాక్యము కలదు. నిర్వాణావస్థను మానవుల కర్థమగునట్లు మానవ భాషలో నిర్వచించుటకు వారు ప్రయత్నించిరి. "ధమ్మపదము"ను చీనాదేశీయులు భాషాంతరీకరణము జేసిరి. ఆ అనువాదమును టూ్రబ్నరు గారు ఆంగ్లేయ భాషలోనికి తిరిగి అనువదించిరి. ఆ చైనీయుల గ్రంథములో నిట్లున్నది: నిర్వాణము లేనిచో మరేదియు నుండ నేరదు: విషయమును బోధపఱచుటకై అనేక శబ్దముల నుపయోగించి, సృజింపబడని దానిని తీసికొని, దానితో సృజింపబడిన దానిని కలుపుచు, సత్ ను దీసికొని అసత్తుతో గలుపుచు, తుదకు నిర్వాణమున్నదనియు, అదిలేనిచో మరేద్దియు నుండ నేరదనియు చెప్పి ముగించిరి. అనిర్వచనీయ మైన దానిని నిర్వచించుటకు ప్రయత్నించిరని ఆ పరమపూజ్యులకు సవినయముగా నమస్కరించి చెప్పుచున్నాను. అవ్యక్తమైనది, అదృశ్యమైనది, సత్ అయినది లేనిచో విశ్వము సృష్టింపబడనేరదని వారు

చెప్పిన దానికి గూఢార్థము. కనుక నిర్వాణము సంపూర్ణ స్థితిగాని శూన్యముగాదు. ఏకత్వదర్శనమును చదివినను ఆ భావము మాత్రము మీ మనస్సులలో మొదట గట్టిగా నాటుకొని యుండవలెను. వానిలో వాడబడు శబ్దములు తరుచుగా శూన్యమును స్ఫురించున ట్లగపడును. అందుచేతనే పాశ్చాత్యులు నిర్వాణ మనగా నాశమని చెప్పుదురు. దానిని మీరు సంపూర్ణత్వముగా భావించినయెడల, వ్యక్తిత్వభావమును కేవలము నష్టపోకుండగనే చైతన్య మంతకంతకు విస్తరించునని మీరు గ్రహింప గలరు. పరిధిలేని వృత్తముయొక్క కేంద్రము నూహింప గలిగినయెడల మీరు సత్యము నొకింత గ్రహింపగలరు."

అద్భుతమగు ఆ ఏకత్వమును మానవు డొకసారి గ్రహించినయెడల దాని నెన్నటికి మరువజాలడు, వెనుకటివలె నెన్నటికి నుండనేరడు. ఏలయన, పరులకు సేవ జేయుటకై స్థూలోపాధులలో తా నెంతగాఢముగా నాచ్ఛాదితుడైపోయినను, ద్రవ్యమను శిలువకు తా నెంతగట్టిగా బంధింపబడినను, ఎంతసంకుచితమై, సంఛన్నమై, సందానితమైపోయినను ఒకటిమాత్రము మరువలేడు; దివ్యమగు సౌందర్యమూర్తియగు ఆప్రభువును తననేత్రములతో జూచినవిషయమును మరువలేడు; బహుదూరముననున్నట్టియు, బహుదూరముగనున్నను మిక్కిలి సన్నిహితముగానున్నట్టియు, చూడగలిగినచో నిరంతరము మనలోపలనే ఉన్నట్టియు దేశమును జూచినట్లు ఎన్నటికి మరువలేడు. ఎందుచేతననగా, నిర్వాణమును జేరుటకై యెచటనో బహుదూరముననున్న స్వర్గమునకు పోనక్కరలేదు, మనస్వస్థానమునుండియే మనచైతన్యద్వారమును దెరచి దాని దివ్యవైభవమును గనుగొనవచ్చును.

బుద్ధభగవానుడు చిరకాలముక్రిందట చెప్పినట్లు "విలపించకుము, మొఱబెట్టకుము, ప్రార్థింపకుము, నీ కండ్లను దెఱచిచూడుము, వెలుగు నీకన్నివైపులనున్నది, అత్యద్భుతముగానున్నది, అతిరమ్యముగానున్నది, ఇంతవరకు మానవుడు కలలు కన్నదానికంటె, ఆకాంక్షించిన దానికంటె ఎంతో అతిశయించియున్నది. అది యెల్లప్పుడును శాశ్వతముగ, అనంతముగ నుండును."

"బహుదూరముననున్న దేశము" అను మాటలు ప్రవక్తయగు 'ఇసయా' చెప్పిన వాక్యమునుండి యెత్తిచెప్పబడినది. కాని, అదితప్పు అనువాదమగుట ఆశ్చర్యకరమగు విషయము. ఇసయా బహుదూరముగానున్న దేశముగురించి మాట్లాడలేదు. ఒకదాని కొకటి విశేషదూరముగానున్న స్థలములుగల దేశమని అతడు చెప్పెను.

ఈ రెండవభావము మొదటిదాని కెంతభిన్నముగానున్నదో అంతరమ్యముగానున్నది. దీనివలన ఆపవిత్ర ఈయున్నతలోకానుభవములను బొందెననియు, భూమిమీద మనము క్రిక్కిరిసి పాకులాడుచున్న సందుగొందులను సువర్లోకములోని తారలచే వెదచల్లబడిన విశాలమైదానములయొక్క అద్భుతవైభవముతో బోల్చుచుండెననియు సూచింపబడుచున్నది. నిజముగా, ఆస్వర్గలోకానుభవములతో ఈ భూలోకనివాసమును బోల్చినయెడల, దీనిని క్రిక్కిరిసిన చీకటిసందుగొందులలో పాకులాడుచు పోవుటయని చెప్పవచ్చును; అదియన్నను అద్భుతమగు సార్థకజీవితము, అచట నివసించువారి ఇచ్ఛల నాత్మవంతములుగాజేసి ఆయిచ్ఛలద్వారా పనిచేయుచుండెడు ఈశ్వరసంకల్పమును సంపూర్ణముగా గ్రహించి పనిచేయుట కవకాశముగల మహాద్భాగ్యము.

## అర్హత్ చేయవలసిన కార్యము.

అర్హత్ చేయవలసిన కార్యము బ్రహ్మాండమైనది. మానవులకుగల లోకములలో తుదిలోకముయొక్క సర్వోత్కృష్టమగు ఉన్నతావస్థను అతడు చేరవలసియున్నది. ఆపనిచేయుచు పదిశృంఖలములలో కడపటి అయిదు శృంఖలములను విసర్జింపవలసియున్నది.

(6 ) రూపరాగ = రూపసౌందర్యము యెడల రాగము, లేక, రూపముతో భూలోకములోగాని సువర్లోకములోగాని జీవించవలెనను కోరిక.

( 7) అరూపరాగ = రూపములేని జీవితమునకై కోరిక.

( 8) మానో (మానః)= గర్వము, లేక, స్వాభిమానము.

( 9) ఉద్ధాచ్ఛ (ఉత్థాపనం) = కలవరము, చిరాకు, చీకాకు.

(10) అవిజ్జ (అవిద్య) = అజ్ఞానము.

ఆరు, ఏడుబంధములలో రాగము అనగా ఆకర్షణమేగాక, ద్వేషము, అనగా నిరాకరణమను భావముకూడ గలదు. ఈ రెండు బంధములను తెంపివేయవలెనని చెప్పుటలో, దిగువరూపలోకములలోగాని, పైన అరూపలోకములలోగాని అతడు పనిచేయవలసివచ్చినయెడల, ఎద్దియును అతనికి ఆకర్షణగాని, నిరాకరణముగాని గలిగింపగూడదనియు, అతనికార్యముల కెట్టియాటంకము కలుగకుండునట్లు శీలమును సరిజేసికొనవలెననియు భావమైయున్నది. ఎనిమిదవబంధమగు మానమును నాశము

చేయుటతో తనుసాధించిన కార్యముల ఘనతను బూర్తిగా మరచిపోవును. అతనికి గర్వమనునది అసాధ్యమగును. ఏలయన, అత డిప్పుడు నిరంతరము వెలుగులో నిలిచి యుండుటచే తనను బోల్చుకొనుటకు తనకంటె తక్కువదేదియు గనబడదు. అప్పుడు ఏదియు భంగపరచజాలని పరిపూర్ణశాంతి యులవడును. అత డా ప్రశాంతములో సమస్తజ్ఞానమును సంపాదించుటకును, మన భూచక్రము సంబంధించినంతవరకు సర్వజ్ఞుడగుటకును స్వేచ్ఛగలిగియుండును.

## అయిదవ దీక్ష

ఇప్పుడభ్యర్థి అయిదవదగు సిద్ధపురుషదీక్ష కర్హుడగును. "ఏకార్యమును నిర్వహించుట కతడు మానవుడయ్యెనో దానిని నెరవేర్చికృతార్థుడయ్యెను."కనుక, మానవాతీతునిగా చేసెడు తుది సోపానము నత డధిగమించును. బౌద్ధు లట్టివానిని "అశేఖ" యందురు. అనగా, అతడు నేర్చుకొనవలసిన దేమియులేదు. ప్రకృతిలో మానవజాతి వికసింపజేసికొనవలసిన లక్షణములన్నిటిని వికసింపజేసికొనెను. హిందువులు వానిని జీవన్ముక్తుడు, అనగా, ముక్తిని బొందినజీవుడు, అందురు; అతనిఇచ్ఛ 'ఏకం అద్వితీయం' అయిన ఈశ్వరేచ్ఛతో నేకమగుటచే ముక్తుడందురుగాని, అతనికి ప్రత్యేకముగా స్వతంత్రతలభించినదనిగాదు. అతడు భూలోకములో స్థూలదేహమునుధరించి జాగ్రదవస్థలోనున్నప్పుడును, ఆశరీరమును విడిచి మాటలకేగాక భావనకుకూడ అతీతమైన మోనాడిక్ (అను పాదక) లోకమును చేరియున్నప్పుడును గూడ, నిరంతరము నిర్వాణలోకముయొక్క వెలుగులోనే యుండును. ఈ స్థితినిగురించి బుద్ధభగవాను డెట్లు చెప్పినారోచూడుడు:

> "కొలత కసాధ్యమయిన దానిని మాటలచే కొల్చుటకు పూనకుము. అగాధములోనికి భావనా సూత్రమును బరపకుము. ప్రశ్నించు వాడు పొరబడును, బదులు పల్కు వాడును పొరబడును. ఏమియు పలుకకుము."

క్రైస్తవ సంప్రదాయములోని పరిశుద్ధాత్మయొక్క ఆరోహణము, అవరోహణము ఈసిద్ధపురుషత్వ ప్రాప్తికి సరిపోవును. ఏలయన, సిద్ధపురుషుడు మానవత్వమును, ఈ భూమండలమును గూడ బూర్తిగా నతిక్రమించినను, ఆయన కిష్టమైనచో క్రీస్తువలెనే మానవులకు బోధచేసి సహాయము చేయుటకై తిరిగి భూలోకమునకు రావ

చ్చును. ఆరోహణము జేసి ఆయన ఆ పరిశుద్ధాత్మతో నేకమగును. ఆయనకా నూతన శక్తి గలిగిన వెంటనే ఎల్లప్పుడును తప్పనిసరిగ, ఆయన చేసెడు మొదటి పని యేమ నగా, క్రైస్తు పెంటికాస్టు విందునందు తమ శిష్యుల శిరములపై అగ్నిజ్వాలలను వర్షింపజేసినట్లుగా, ఆయన శిష్యులపై తన నూతన శక్తిని ప్రసరింపచేయును. పూర్వపు గ్రంథములలో ప్రచురింపబడిన మానవతత్త్వములకు సంబంధించిన పట మును దేనిని జూచినను, ఈశ్వరుడు **Prakritic Cosmic Plane** (ప్రాకృత విశ్వలోక ములో*నున్న మానవుని ఆత్మలోనున్న గలిగించెడు ఆవిష్కరణములకు గల సంబం ధము బాగుగా తెలియగలదు. మానవునిలోని త్రిమూర్త్యాత్మకమగు ఆత్మ, నిర్వాణ లోకముయొక్క దిగువ భాగములోనున్న, ఈశ్వరుని మూడవమూర్తి—పరిశుద్ధాత్మ— యొక్క నీచతమమగు ఆవిష్కరణము ఆ నిర్వాణ లోకములోనే పైభాగములోనున్న గనబడును. ఆ యంతరువున సిద్ధపురుషుడు ఈశ్వరునితో నేకమగును. పరిశుద్ధాత్మ యొక్క యుత్సవమనబడెడు "విట్సన్ డే" రోజున జరిగెడు క్రైస్తవ విందునకు ఇది నిజమగు వివరణము. ఈశ్వరాంశతో నేకమగును గనుకనే అశేఖుడు (జీవన్ముక్తుడు) శిష్యులను స్వీకరింపగలడు. అర్హత్—పరమహంస— విశేషముగా బోధచేయవలసి యున్నను, ఒక సిద్ధపురుషుని ఆదేశము ననుసరించి వారి తరపున పనిచేయుచు, వారి యాజ్ఞలను భూలోకములో నిర్వహించును. కాని, ఆయన కింకను ఈశ్వరాంశతో ఆవిధమగు ప్రత్యేక సంబంధ మేర్పడలేదు గనుక, స్వంతముగా శిష్యులను స్వీకరించరు.

## సిద్ధపురుషత్వము నకావల

జీవన్ముక్త దీక్షకు పైన చోహాన్ దీక్ష కలదు. దాని కింకను పైన ఇతర దీక్షలు కలవు. వానిని మహీపీఠము గురించి వ్రాసిన అధ్యాయములో వివరించెదను. సత్త్వనిశ్రేణిక తేజోమేఘములలోనికి వ్యాపించి యుండును. అచటకు మన మెవ్వరము ప్రవేశించలేము. మనకంటె నున్నతియందుండి, మనకంటె అనంతముగా ఎక్కువ జ్ఞానము గల వారిని యీ విషయముల గురించి యడిగినచో, తమ దృష్టికి కూడ

*మన యేడులోకములతోను గూడిన భూమండలము, విశ్వము (cosmos) యొక్క **Prakritic Plane** అనగా స్థూలతమ పార్థివతత్త్వలోకమై యున్నది. మన భూమండలములో ఆది, అనుపాదక, నిర్వాణ, బుద్ధి, సువర్ (మానసిక), భువర్, స్థూల, లోకములని యేడు ఉపలోకములు గలవు. ప్రతి ఉపలోకమునకు తిరిగి యేడు ఉపలోకములు గలవు.

మించి యున్నదని మాత్రము చెప్పుదురు. మనకు తెలిసిన వానికంటె ఎక్కువ సోపానముల నెన్నిటినో వారెరుగుదురు. కాని యీ శ్రేణి యింకను పైకి, భావనాతీతమగు దివ్యోన్నతులకు సాగిపోవును. అది ఎచట అంతమగునో యెవ్వరికెరుక!

నేనింతవరకు చెప్పిన దంతయు కేవలము యథార్థమే యైనను, ఆ నిశ్రేణిక అంత మెవ్వరికి గానరాక పోయినను, మహీపీఠములో నున్నత శ్రేణుల యందున్న వారి కార్యకలాపమగోచరమైనను, ప్రపంచమందున్న వస్తువు లన్నిటివలెనే, వారి యునికియు వారు చేయుపనియు యథార్థమైనది నిశ్చయమైనది అనియు, అంతేగాక వారిని మేము జూచుటలో లేశమైన సంశయము లేదనియు అతిస్పష్టముగా తెలియ చేయగోరుచున్నాను. బోధిసత్త్వులు చేయు ఉన్నత కార్యముల విషయమై నాకే మియు తెలియక పోయినను, అనేక సంవత్సరముల నుండి నిరంతరము దాదాపు ప్రతిదినము ఆయన కార్యాచరణములో నిమగ్నులై యుండగా ఆయనను నేను చూచుచున్నాను. మరియు, లోక ప్రభువు సనత్కుమారుల వారి అద్భుతమైనట్టియు మనకు గ్రాహ్యము కానట్టియు యునికిని గూడ అనేకసార్లు చూచితిని. కనుక ప్రపంచములో నే నెరిగిన మనుష్యుల యునికి యెంత వాస్తవమో, ఆ పావన పురుషుల యునికి గూడ నాకంత యథార్థమై యున్నది. వారి యునికి గురించియు, వారు ప్రపంచ పరిణామమునకై చేయు కార్యములలో కొంత భాగము గురించియు నేనెరుంగుదునని నిశ్చయముగా చెప్పగలను.

వారినిగూర్చి నేనుచెప్పగలిగినదంతయు పరమసత్యమని నాకు సంపూర్ణనిశ్చయము గలదు. కాని వారిని వివరించలేను; వారికార్యములో లేశమాత్రముకంటె నెక్కువ గ్రహింపలేను. నేను ధ్యానచోహానులను జూచితిని, గ్రహాధిపతులను జూచితిని, యితర సూర్యమండలమునుండి యేతెంచిన రాయభారులను జూచితిని. వారందరి యునికి గూర్చియు, వారిమహనీయమగు దివ్యవైభవముగూర్చియు, నేను సంపూర్ణ నిశ్చయముతో బలుకగలను, కాని, వారు నెరవేర్చవలసిన బ్రహ్మాండమగు కర్తవ్యమేదో నాకేమియు తెలియదు. సూర్యమండలమున కధిపతియగు ఈశ్వరుని యావిష్కరణమును, వారిసమానులగు వారితో కలిసియుండగా స్వయముగా జూచితిని. ఆయనలో నేను జూచిన దివ్యవైభవమునకు కోట్లాదిరెట్లు దివ్యతరమగు వైభవమును వా రాయనలో జూచెదరు. భగవద్గీతలలో అర్జునుడు విశ్వరూపమును జూచినట్లుగా నేనుగూడ నిస్సంశయముగా ఆ రూపమును జూచితిని. ఈవిషయములన్నియు యథా

ర్థములని నా సాక్ష్యమును గ్రంథస్థముచేయగోరెదను. ఇట్లు వ్రాయుచున్నందుకు జనులు నన్ను నిరసించి గేలిచేయవచ్చునని నాకు తెలియును. "ఈ విషయముల గురించి చెప్పుటకు నీ వెవ్వరవు ?" అని జను లడిగెదరు. కాని, నేను జూచితిని, చూచిన దానిని సాక్ష్యము చెప్పుటకు నిరాకరించుట పిఱికితనము కాగలదు.

దివ్యజ్ఞాన విషయములగూర్చి నేను చెప్పితినన్న కారణముచే ఎవ్వరును నమ్మ నక్కఱలేదని, నామాటలలోను న్వ్రాతలలోనుగూడ అనేకసార్లు తిరిగి తిరిగి చెప్పితిని. ప్రతివారును ఆ విషయములను తమకుతాము బాగుగా పరిశోధించి అర్థముచేసికొని యెవరికితోచిన నిర్ణయములకు వారు రావలెను. ఎవరయిన నొకసిద్ధాంతము నంగీక రించుటకు దానిని స్వానుభవముచే నెఱుగుటగాని, అది మిక్కిలి సహేతుకము సమం జసమునై యుండుటగాని ముఖ్యకారణమయి యుండవలెను. కాని, వినదలచినవారున్న యెడల నా సాక్ష్యము గలదని నేను ప్రకటించుటలో తప్పేమియులేదు. నా సాక్ష్య మును ఈ పుస్తకములోను ఇతర పుస్తకములలోను ప్రకటించితిని.

ఈ యిరువదవ శతాబ్దములో దివ్యజ్ఞానము గురించి వ్రాయుచున్న మేము రెండువేల సంవత్సరముల క్రిందట సెయింటు జాన్ స్పష్టముగా చెప్పినమాటను పూర్తిగా దృఢపరచగలము. సె॥ జాన్ ఇట్లు చెప్పెను:

> "ఆదినుండి యేదియుండెనో, మే మేదివింటిమో, కన్నులార ఏది చూచితిమో, ఏది నిదానించి కనుగొంటిమో, మా చేతులు దేని తాకి చూచెనో ... ... మేము చూచినదానిని వినినదానిని మీకును తెలి యజేయుచున్నాము." యోహాను I 1-3.

స్వయముగా జూచినమేము ఋజువుపలికెదము. మా సాక్ష్యమును ప్రపంచ మంగీకరించునా లేదా యన్న సందేహముతో మాకు నిమిత్తములేదు.

ఆ పరమేశు మహిమను గన్ననతడు
భ్రమను జెందునె, సంశయించునె, కాదనునె!
ఆహా! లోకమా! నీ వేకకంఠమై
అంతయుం గాదనిన నేమి?
నీ వాదరిని నుందువు, శేలవగుచు,
నేనో, ఈదరిని జేరి ధన్యుండనైతిగాదె!

అని ఆచార్యుడు మయర్సు సెంౙపాలు అను కావ్యములో వ్రాసిరి.

## సప్తపథములు

అశేఖదీక్షను బొందినతరువాత వెంటనే ఈయున్నతమార్గము సప్తపథములుగా చీలిపోవును. సిద్ధపురుషుడు వీనిలో నొకదాని నెన్నుకొనవలెను. ఈ విషయమై "మానవుడు ఎచటనుండి, ఎట్లు, ఎచటికి" అను గ్రంథములో వ్రాయబడిన దాని నిచట యుదహరించుట యుక్తము.

"మానవుడు మానవవర్గము దాటి ముక్తుడై, అతిమానవత్వమును బొందు నప్పుడు సప్తపథములు అతని యెదుట గనబడును. వానిలో నొకదాని నత డెన్నుకొనవలెను. (1) అతడు సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము గల నిర్వాణ లోకానందమును గ్రోలుచు, మనకు గోచరము కాని కార్యములందు పాల్గొనుచు, బహుశః ఏదో యొక భవిష్యత్ప్రపంచములో ఈశ్వరావతారముగా అవతరించుటకు సంకల్పించుకొనవచ్చును. దీనిని "ధర్మకాయాంబరమును స్వీకరించుట" యందురు. (2) అతడు "ఆధ్యాత్మికావస్థలో" బ్రవేశింపవచ్చును. ఈ మాటలయొక్క అర్థములన్నియు మనకు తెలియవు. "సంభోగకాయాంబరమును" స్వీకరించుటయను అర్థ మొకటి కూడ యుండియుండవచ్చును. (3) ఆధ్యాత్మికశక్తుల పెన్నిధిలో అతడు చేరవచ్చును. ఈ నిధినుండి ఈశ్వరప్రతినిధులు తమ కార్యములకు వలయుశక్తులను దీసికొనుచుందురు. దీనిని "నిర్మాణకాయాంబరమును" స్వీకరించుట యందురు. (4) ఏ ప్రపంచములో తాను పరిపాకము నొందెనో దానిని పాలించి నడుపు పాలకవర్గములో సభ్యుడుగా జేరవచ్చును. (5) రాబోవు చక్రమునకు పోయి దాని రూపనిర్మాణములో తోడ్పడవచ్చును. (6) అద్భుతమగు దేవతాపరిణామములో బ్రవేశింపవచ్చును. (7) ఈశ్వరసంకల్పము నెరవేర్చుటకును, ఆయనపాలించు జగత్తంతలోను ఆయన కార్యముల నిర్వహించుటకు మాత్రము జీవించుచు, ఆయన సేవకుడు, దూతయునై, యీ సౌరజగత్తులో నేభాగమందైనను ఉపయోగింపబడుటకును సమర్పించుకొనవచ్చును. సేనాధిపతి సందేశములను యుద్ధభూమిలో నేభాగమునకైనను గొనిపోవుటకు సంసిద్ధులయిన సేవకాదళముండునట్లుగానే, వీరు సర్వమును శాసించు ఈశ్వరుని సేవాదళము. "ఆయనచిత్తముననుసరించెడు మంత్రివర్గము." ఈ యేడవది

మిక్కిలి కఠినమగు మార్గముగా ఎంచబడినట్లు కనిపించుచున్నది. బహుశః ఇది సిద్ధ పురుషుడు చేయగలిగిన సర్వోత్కృష్టమగు త్యాగము కావచ్చును. అందుచేతనే దీనికి విశేషగౌరవము గలదు. ఈ కార్యదళములోని సభ్యునకు స్థూలశరీరముండదు. ఏగోళమునకు పంపబడునో ఆ గోళము యొక్క ద్రవ్యముతో నొక శరీరమును తనక్రియా శక్తిచే నిర్మించుకొనును. అర్హతపదవి మొదలు పైనున్న వేర్వేరు అంతరువుల యందుండు మహానుభావులు ఆ సేవాదళము నందుందురు".

ధర్మకాయాంబరమును స్వీకరించువారు తురీయాత్మలోనికి విరమించి, నిర్వాణలోక యణువును గూడ విసర్జింతురు. సంభోగ కాయాంబరమును స్వీకరించినవారు నిర్వాణ లోకమునకు చెందిన అణువునుంచుకొని, త్రిమూర్త్యాత్మకముగా కనిపించును. నిర్మాణకాయులు కారణశరీరము నేగాక, తమయావత్పరిణామములోను వెంటవచ్చుచున్న శాశ్వతమగు నణువులనన్నిటిని గూడనుంచుకొందురు. అందుచేత, ఏక్షణమందైనను వారిచుట్టును మానసిక, కామమయ, స్థూలశరీరములను వారి యిష్టానుసారము నిర్మించుకొనగలుగుదురు. వారే ప్రపంచమునుండి వచ్చిరో, ఆ ప్రపంచముతో నిర్దిష్టమగు సంబంధమును వారు నిలబెట్టుకొందురు. ఆ ప్రపంచమునకు ఆధ్యాత్మికశక్తిని ప్రసరింపజేయు పెన్నిధికి వారు కూడ శక్తిని చేర్చుచుందురు. "అంతర్వాణి" అనుపొత్తములో నిర్మాణకాయులను ప్రపంచమున కింతకంటె ఎక్కువబాధ, ఎక్కువ దుఃఖము, కలుగకుండ రక్షించుటకై యున్న "కోటగోడ" యనివర్ణించిరి. దీనియంతరార్థమును గ్రహింపనివారికి ప్రపంచమునకు బాధ, దుఃఖము వెలుపలినుండి వచ్చుచున్నవనియు, ఇట్లురాకుండ సిద్ధపురుషులు వానిని నివారణ చేయుచున్నారనియు తోచవచ్చును. కాని, అది నిజముకాదు. ప్రపంచములోని కష్టము యావత్తు బాధితులవలననే వచ్చుచున్నది. మానవుడు తనకు తానేశాస్త; తననాశమును గాని, క్షేమమునుగాని తానే తీర్మానించుకొనును. మానవుల శ్రేయస్సునకై అపారమగు ఆధ్యాత్మికశక్తిని సిద్ధపరచి ప్రసరింపజేయుచుండుట నిర్మాణకాయుల కార్యము. నిరంతరము ఈ శక్తిని ప్రభవింపజేయుచుందురు. వారు దానిలో నేమియునుపయోగించుకొనరు. యావచ్ఛక్తిని ప్రపంచబృహద్భారమును తొలిగించుటకై వినియోగపడు నిమిత్తము దివ్యసోదర బృందము యొక్క అధీనము చేయుదురు.

కనుక, జీవన్ముక్తిని బొందువారలలో బహుకొద్దిమంది మాత్రమే మహీపీఠములో చేరి భూమిమీద నుందురని తెలియగలదు. కాని,వీరికిని వీరికార్యమునకును, విశేషప్రాముఖ్యత గలదు. అందుచేత, మిగతా అధ్యాయములను ఆ విషయముల కొరకు వినియోగపరచెదను.



# పదునొకొండవ అధ్యాయము

# పరమగురువుల కార్యము

## సంగ్రహము

సిద్ధపురుషులయిన మానవులలో బహుకొద్ది మందిమాత్రమే మహీపీఠములో సభ్యులుగాచేరి ఈశ్వరసంకల్పము ననుసరించి భూమిపై పరిణామమును నడుపుటకు పూనుకొని పనిచేయుచుందురని యిప్పుడే చెప్పియున్నాను. ప్రస్తుతమట్టికార్యమును పూనుకొన్న అతిమానవులు యేబది, లేక, అరువదిమంది యుందురు. వారి సామాన్య కార్యకలాపముగురించి మన అధ్యక్షులు — డాక్టరు బిసెంటు — 'సిద్ధపురుషులు' అను పొత్తములో నిట్లు విశదపరచిరి:

"వారు మానవాభ్యుదయమునకు లెక్కలేనన్ని విధముల తోడ్పడుదురు. ఉన్నతలోకమునుండి వారీప్రపంచమునకంతకు వెలుగును జీవమును ప్రసరింపజేయుదురు. దానిని గ్రహింపశక్తిగలిగిన వారందరు సూర్యరశ్మిని గ్రహించినట్లు స్వేచ్ఛగా గ్రహించి జీర్ణముచేసికొందురు. స్థూలప్రపంచమంతయు సూర్యునిచే కేంద్రీకరింపబడిన ఈశ్వరజీవముచే జీవించుచున్నట్లుగానే ఆధ్యాత్మిక ప్రపంచమంతయు మహీపీఠముచే కేంద్రీకరింపబడిన ఆ యీశ్వరజీవముచేతనే జీవించుచున్నది. తరువాత, మతములతో ప్రత్యేకసంబంధముగల పరమగురువులు ఈ మతములను తటాకములుగా నుపయోగింతురు. వీనిలోనికి ఆధ్యాత్మికశక్తిని ప్రవహింపజేసి ప్రతిమతములోను శ్రద్ధాభక్తులు గలవారందరకు అనుగ్రహపూర్వకముగా నియమితమైన ప్రవక్తల ద్వారా దానిని పంచిపెట్టుచుందురు. ఆ తరువాత, మహనీయమగు విజ్ఞాన కార్యము గలదు. దానిలో పరమగురువులు గొప్పమానసికశక్తిగల సంకల్పరూపములను ప్రసరింపజేయుదురు. మానవులలో ప్రతిభాశీలురు ఆ రూపములను గైకొని జీర్ణము చేసికొని ప్రపంచమున కిచ్చెదరు. ఈ యంతరువునందే పరమగురువులు వారి ఆశయములను వారిశిష్యులకు తెలియపరచి వారు ఏ పనులను చేకొని చేయవలయునో సూచింతురు. తరువాత సువర్లోకములో — స్థూలమానసికలోకములో — సంకల్పరూపములను ప్రభవింపజేయుచుందురు. ఆ రూపములు రూపమనస్సును ప్రోత్సహించి దానిచే ఈ ప్రపంచములో ప్రయోజనకరములగు కార్యకలాపములను చేయించును. మరియు ఆ సంకల్పరూపములద్వారా సువర్లోకనివాసులకు ప్రబోధము చేయుచుందురు. దాని

తరువాత మధ్యలోకములో - భువర్లోకములో—మృతులనువారికి సహాయపడుట, శ్రోత్రశిష్యులకు కావలసిన ప్రబోధముగురించి అవసరమగు ఆదేశములనిచ్చుచు పర్యవేక్షణము జేయుట, సహాయము కావలసిన అసంఖ్యాకులగు జీవులకు సహాయమును బంపుట, ఇటువంటి అనేక విధములగు పనులనుచేయుచుందురు. భూలోకములో సంఘటనము లేమార్గమున బోవుచున్నవో కనిపెట్టిజూచుచు, దుష్టశక్తులను ధర్మము ననుసరించి సాధ్యమయినంతవరకు సవరించుటగాని, నిర్వీర్యముగా చేయుటగాని జరిగించుచు, పరిణామమున కనుకూలముగను వ్యతిరేకముగను పనిచేయుచుండెడు శక్తులనన్నిటిని నిరంతరము సమతుల్యముగాజేయుచు, మేలును బలపరచుచు కీడును నిరసింపజేయుచు, సర్వతోముఖముగ పనిచేయుచుందురు. మరియు జాతుల కధిదేవతలగు దేవతలతో కలసి పనిచేయుచుందురు. ఇతరులు భౌతికశక్తులను నడుపుచున్నట్లుగా వారు ఆధ్యాత్మికశక్తులను నడుపుచుందురు."

## ప్రాంతములు

మన అధ్యక్షులు సుప్రసిద్ధమగు విశాలదృష్టితో అంత సంక్షేపముగా నుదహరించిన కార్యములలో కొన్నిటిని మనమెక్కువ వివరముగా ఆలోచించుట అవసరము. సిద్ధపురుషులసంఖ్య స్వల్పమైనను ప్రపంచమంతటిలో నేజీవిని ఉపేక్షచేయకుండునట్లును, అశ్రద్ధచేయకుండునట్లును తగు ఏర్పాట్లనుజేసిరి. పూర్వకాలములలో ఛర్చి అధికార్లు దేశమునంతను చిన్నచిన్న ప్రాంతములుగా విభజించి, ఆ యాప్రాంతములలోని ఛర్చిలద్వారా ప్రతిమనుష్యునకు ఆధ్యాత్మికముగను, శారీరకముగను వానియవసరములను సంతుష్టిపరచుటకు ఏర్పాట్లుచేయుచుండిరి. ఆ విధముగనే భూమండలమునంతను ప్రత్యేకభాగములుగా విభజించిరి. అయితే సిద్ధపురుషుల స్వాధీనమందుండు ప్రాంతములు చిన్నపేటలు జిల్లాలుగాక పెద్దదేశములు, ఖండములునైయున్నవి.

ప్రస్తుతము ప్రపంచము విభజింపబడిన విధమునుజూచిన, యూరపుదేశమొక సిద్ధపురుషుని చేతిలోను, భారతదేశము మరియొకరిచేతిలోను ఉన్నవి; అదేవిధముగా ఖండములన్నియు వేర్వేరుగా విభజింపబడి వేర్వేరు సిద్ధపురుషుల చేతులయందుంచబడినవని తలచవచ్చును. ఈ విభజనము రాచకీయపద్ధతుల ననుసరించిగాని దేశీయసరిహద్దుల ననుసరించిగాని చేయబడినవికావు. ప్రతిసిద్ధపురుషుని రాజ్యములోను వివిధ

తరగతుల జీవపరిణామమును, రూపపరిణామమును—కేవలము మానవపరిణామమే గాక ఘనమగు దేవతాగణముల పరిణామమును, వనదేవతలు, జలదేవతలు మొదలగు ప్రకృతిభూతముల పరిణామమును, ఖనిజవృక్షజంతువర్గముల పరిణామమును, ఆత్మవర్గముల (Elemental Essence) పరిణామమును, మానవజాతికింతవరకు ఏమియు దెలియని అనేక యితరపరిణామములును—ఆ పరమ పురుషుని ఆధిపత్యము క్రింద సాగుచుండును. కనుక చేయవలసినకార్య మపారముగనున్నది. సిద్ధపురుషుల సంరక్షణలోనుండుటయేగాక, ప్రతిదేశమునకు, ప్రతిజాతికి యొక్కొక్క దేవత (Spirit of the Race-Guardian Angel) సంరక్షకునివలెనుండి దాని అభ్యుదయమును కనిపెట్టిజూచుచు నడుపుచుండును. ఈదేవతలను ప్రాచీనసంప్రదాయములోని గ్రామదేవతలతో పోల్చవచ్చును. కాని వారీగ్రామదేవతలకంటె చాలానున్నత స్థానముననుండి పనిచేయుచుందురు. 'పల్లాసు అథీని' అటువంటి దేవతలలో నొకరు.

ఈశ్వరసంకల్పమును నెరవేర్చుటలో అనేకవిధములగు శక్తులు పనిచేయుచుండును. సహజముగా ఇవన్నియు అన్యోన్యసహకారముతో నొకేమార్గమున పనిచేయుచుండును.

పదునెనిమిదవ శతాబ్దములో ఫ్రాన్సుదేశములో గలిగిన మహావిప్లవము, రష్యాదేశములో ఈ శతాబ్దములోనే జరిగిన కల్లోలములు, మొదలగుదేశవిపత్తులను పైనచెప్పిన ఈశ్వరప్రతినిధులగు సిద్ధపురుషులకు ఆరోపించరాదు. అట్లుచేయుట యొక గొప్పపొరపాటు. ఆ విపత్తులన్నియు కేవలము మానవులలోని పశుత్వము వలనను, వినాశకరమగు ద్వేషభావములు విజృంభించుట వలనను సంభవించును. అట్టి విపత్తులవలన, ఆ సిద్ధపురుషులును జాతిదేవతలును ప్రజాపరిపాలనా పద్ధతులను ప్రవేశపెట్టుటకై ప్రయోగములను జేయుటలో ఎట్టి అపాయముగలదో, వారి కార్యమున కెట్టి భంగము కలుగగలదో బాగుగ విశదము కాగలదు. నిరంకుశ పరిపాలనలో ఘోరమగు చెడుగున్నది. ఒక్కొక్కప్పుడు విశేషమగు బాధయునుండును. కాని, కొంతవరకైనను ఒకవిధమగు కట్టుబాటు, శిక్షణయుండును. సాంఘికప్రతిష్ఠ, స్థిరత్వము, ఆత్మనిగ్రహము నష్టపోకుండ నిరంకుశత్వము నెట్లు అంతమొందించుట యనునది గొప్పచిక్కు సమస్య అయినది. నిగ్రహము పోయినప్పుడు సామాన్యముగా చాలమంది మనుష్యులు మానవత్వమును మరచిపోవుదురు; ఉద్రేకము పొంగిపొరలుచుండును; మూకలు విచ్చలవిడిగా చెలరేగుదురు; దుష్టప్రభావతరంగములచే

జనులావేశము నొందుదురు. జాతిదేవత ప్రజలభావగతిని నడుపుటకు ప్రయత్నించుచుండును. గొప్ప జనసమూహములను నడుపుటకుత్సహించును. రణరంగములో ముందుకు చొచ్చుకొని పోవుటకు సైన్యములను సైన్యాధిపతి ప్రోత్సాహము చేయునట్లు, ఈ దేవత ప్రజలలో అవసరమైనప్పుడు గొప్పదేశభక్తిని పుట్టించి వీరకృత్యములు చేయుటకు వారిని ప్రోత్సహించును. కాని వివేకియగు సేనాధిపతి కంటె నెక్కువగా ఆ దేవత తనప్రజల ప్రాణములను నిర్లక్ష్యముగా బలికానియ్యడు, వారిని దుఃఖము పాలుచేయడు.

## శ క్తి ప్ర స ర ణ ము

సిద్ధపురుషుల కార్యములో చాల భాగము భూలోకమునకు చాలాపైనున్న అంతరువులలో జరుగుచుండునని యిదివరలో చెప్పి యుంటిని. వారి శక్తులనేగాక, నిర్మాణకాయులచే పూరింపబడిన మహాదాశయమునుండి శక్తిని గూడ ప్రసరింప చేయుచుందురు. ఈయుద్ధారకశక్తిలో కొంతభాగము ప్రపంచమున కుపయోగపడ వలసియుండుట ప్రపంచకర్మఫలితమై యున్నది. సామాన్యమానవులుకూడ మానవ సేవకై తమ సంకల్పములను, రాగములను, వినియోగము చేయుటరీత్యా తమ ఇచ్ఛలను ఈశ్వరేచ్ఛ కనుకూలముగా నుండునట్లు చేసినయెడల, ఆ మహాశక్తినిధికి కొంచెము శక్తినిచేర్చి ఆ మహాయజ్ఞములో పాల్గొను భాగ్యమును బొందినవారగుదురు. ఇందువలన మానవజాతియంతయు ఏకాంశముగా పరిణామము చెందుచున్నది. సోదరత్వములో గల మహిమచే ప్రతిమానవుడును తానొంటరిగానున్న యెడల పొందగలిగిన దానికంటె ఎన్నియో రెట్లధికముగా పురోవృద్ధిని బడయగలుగును. ఇదంతయు ఈశ్వరసంకల్పమే. ఆ సంకల్పమును నెరవేర్చుటలో మనము గూడ పాల్గొందుమని ఆయన నిశ్చయించి యుండుట విశదమే. ఆయన ఆ పరిణామ విధానమును సంకల్పించినప్పుడు "నాబిడ్డలు ఒకానొకస్థితికి అభివృద్ధి బొందిన తరువాత నాకు వివేకముతో తోడ్పడగలరు, కనుక, ఆస్థితికివచ్చిన తరువాత నాశక్తిని వారు వినియోగించుకొనగలుగునట్లు ఏర్పాటు చేసెదను," అని తలచిరి. అందుచే ఆయన ప్రతివాని సహాయమును నమ్ముకొని యుందురు.

ఉన్నతమగుఅంతరువులయందు దివ్యసోదరబృందము యావత్తుమానవజాతితో నేకమై యుండును. కాబట్టి ఆ మహాతటాకమునుండి శక్తి ఆ బృందముద్వారా

మానవులకు ప్రాప్తించుచుండును. ఉన్నతమానసిక లోకము—మహర్లోకము— నుండి సిద్ధపురుషులు సమస్తజీవాత్మల పైన మినహాయింపులేమియు లేకుండ, శక్తిని ప్రసరింపజేయుచు వారి అంతరంగిక జీవమును వికసింపజేయుటలో సాధ్యమైనంత వరకు సహాయము చేయుచున్నారు. నిజముగా ఈశ్వరుడే పరిణామతత్త్వమై, ప్రతి జీవియొక్క హృదయమునందును ఉన్నందున, ఆ జీవము మొక్కమొలచి పెరుగవలసినట్టియు, చనిపోనేరనట్టియు బీజమువలె నున్నది. మానవునిలో ఆ బీజము మొలకెత్తి భూమిపైనున్న గాలి కొరకు వెదకుచున్నది; మహీపీఠముయొక్క వెల్లువల ద్వారా ప్రవహించుచున్న ఆధ్యాత్మికశక్తియను సూర్యరశ్మి కారణముగా ఇప్పుడా మొక్క సత్వరాభివృద్ధి నొందుచున్నది. ఎక్కువ అభివృద్ధిపొందినవారు ఈశ్వర సంకల్పమునను సరించి అధికాధికముగా దైవీప్రకృతిలో పాల్గొనుచు తమకంటె తక్కువ స్థితిలోనున్న వారికి సహాయము చేయుటకుగల అనేకమార్గములలో నిదియొకటి.

ఈ ప్రత్యేక కార్యమును చేయబూనిన ప్రతిసిద్ధపురుషుడును కోట్లాది జనులపై నేకకాలమున శక్తిని ప్రసరింపజేయుచుందురు; కాని, వారు ప్రవహింపజేసెడు శక్తి యొక్క అద్భుత లక్షణమేమనగా, ప్రత్యేకముగా ప్రతివానిని వేర్వేరుగానుద్దేశించి వాని కనుకూలముగా నుండునట్లు శక్తి ప్రసరణము జరిగినట్లును, లక్ష్యమంతయు ఒక్కని పైన మాత్రమేయుంచి, వాని నొక్కని మాత్రమే యుద్దేశించి సహాయము చేయుచున్నట్లును ప్రతివానికి తోచుచుండును.

ఇది యెట్లుజరుగునో మనస్థూలలోకమునందు విశదపరచుట సులభముకాదు. కాని, దానికి కారణమేమనగా — పరమగురువుయొక్క చైతన్యము నిర్వాణలోకములో ఒక బిందువువంటిదేయైనను, ఆలోకమంతటను విస్తరించియుండును; (అందుచేతనే అట్లుసంభవించుచున్నది). ఆయన ఆబిందువును దిగువలోకములలోనికి చాలా క్రిందికి తీసికొనివచ్చి అచట అపారమగు నొకబుడగవలె దానిని విస్తరింపచేయును. ఆ పెద్దగోళమునకు వెలుపల ఆయన సహాయముచేయనుద్దేశించిన జనులందరి కారణ శరీరములుండును. ఆయన ఆగోళమంతటిలోను నిండి, చుట్టునున్న ప్రతివ్యక్తికి సమస్తము దానేఅయి సమగ్రముగా గనిపించును. ఈ విధముగా కోట్లాదిజనుల ఆదర్శములను ఆయన తమజీవములో నింపెదరు. వారికివేర్వేరుగా ఆదర్శక్రీస్తు, ఆదర్శరాముడు, ఆదర్శకృష్ణుడువలెనో, ఒక దేవతవలెనో, ఒక భూతనాయకునివలెనో తోచును.

ఈ కార్యము ఒక క్రైస్తవ పురోహితునిక్రిందనున్న ఒక పెద్దప్రాంతమును పర్యవేక్షణచేయుట వంటిదికాదు. రెండింటికి చాలాభేదముకలదు. దీనిలో పరమ గురువు ముఖ్యముగా నొకతరగతి మనుష్యులగురించి, అనగా, తన పరిణామవిధానము నవలంబించి వృద్ధిబొందుచున్నవారిని గురించి శ్రద్ధదీసికొందురు. కాని వారిలో చాలామంది ఆయన చేయుచున్నకార్యము నేమియు నెరుగరు. ఆయన ప్రత్యేకముగా శ్రద్ధవహించి వ్యవహరించవలసిన సందర్భములుకూడ అనేకములుండును. అటువంటి కార్యములలో వారు కొందరు దేవతలనుపయోగింతురు; నిర్దిష్టమగు కొన్నిహద్దుల లోపల విశేషమగు స్వేచ్ఛనిచ్చి ఆ దేవతలచే ఆ కార్యములను చేయింతురు. దేవతలుకూడ ప్రకృతిభూతములను వినియోగించి, అనేక విధములగు సంకల్పరూపము లను నిర్మించెదరు. ఆ ప్రకారము వారు అనేక విధములుగా పెద్దరంగములో పని చేయుచుందురు.

## భక్తియొక్క ఉపయోగము

'సంస్కారశాస్త్రము'—The Science of Sacraments—అను గ్రంథములో సిద్ధపురుషులు అన్నిమతములలోని సంస్కారములను ఉపయోగించి, ఆసంస్కారములద్వారా వారిశక్తిని ప్రపంచములో దిగువలోకములలోనికి యెట్లుప్రసరింపజేయుదురో, ఆ ప్రకారము సాధ్యమయినంతమంది జనులలో ఆధ్యాత్మిక పురోవృద్ధిని యెట్లుప్రోత్సహించుచుందురో తెలియచేసితిని. కాని, యిట్లుప్రోత్సాహము చేయుట మతసంస్కారముల విషయములోనేగాదు; దొరకిన అవకాశమును ప్రతిదానిని ఆ సోదరబృందము వినియోగించెదరు. ఏదైన యుత్సవ సందర్భములో చాలామంది జనులు భక్తిభావముతో సమావేశమైనయెడల, అప్పుడందరిమనస్సులు ఉన్నతము, ఘనమునగు పవిత్రభావములతో నిండియుండును గనుక, అట్టిసమావేశము పరమ గురువునకొక అసాధారణమగు అవకాశమునిచ్చును. వెంటనేవారు దానినొకచక్రని కేంద్రముగా నుపయోగించి దానిద్వారా ఆధ్యాత్మికప్రభావమును ప్రసరింపచేయుదురు. జనులు చెదరిపోయి యెవరి యిండ్లలోవారు జీవించుచున్నప్పుడు, వారు విడివిడిగానున్న సన్ననిరేఖలవలె నుందురు. ప్రతిరేఖద్వారా బహుకొద్ది శక్తిమాత్రమే ప్రసరింప గలదు. అట్లుగాక అందరును ఒకచోట సమావేశమైనప్పుడు ఒక పెద్ద గొట్టము, లేక, తూరవంటిది నిర్మాణమైనట్లగును. ఒక్కొక్క ప్రత్యేకరేఖ ద్వారా

ప్రసరించుశక్తి ప్రసారములన్నిటి మొత్తముకంటె ఎక్కువగా పెద్దవరదవలె ఆతూర ద్వారా ఆశీర్వాదమును ప్రవహింపజేయ వచ్చును.

పుణ్యక్షేత్రమగు కాశీనగరములో పదిలక్షలమంది యాత్రికులు సమావేశ మగుట నేను జూచితిని. అందులో చాలామంది విద్యాహీనులు, అజ్ఞానులు, మూఢ విశ్వాసముగలవారు అయినసంగతినిజమే. కాని, ఆ సమయమందు వారందరును భక్తితోనిండి యేకాగ్రచిత్తులైయుందురు. అప్పుడు ప్రభవింపబడు భక్తిభావము యొక్క పరిమాణము లెక్కింపలేనిదైయుండును. అట్టియవకాశమును సిద్ధపురుషులు ఎన్నడును విడువరు, దానినుపయోగించి శ్రేయస్సును గలుగజేసి తీరెదరు. అచట చేరిన జనులందరు బాగుగా తెలిసినవారై, సమానమగుభక్తి యుత్సాహములను గలిగియున్న యెడల, విస్తారముగా ఎక్కువశక్తిని ప్రభవింపజేసియుందురన్న సంగతి నిస్సంశయము; అంతేగాదు, కేవలము ఉన్నతమగు సూక్ష్మలోకములో పనిచేయగల శక్తినిగూడ ప్రసరింపజేయవచ్చును. కాని, అజ్ఞానులయినట్టియు మూఢవిశ్వాసము గలిగినట్టియు జనులు ప్రభవింపజేయగల విస్తారమగుశక్తియొక్క విలువను తెలిసి కొనలేక ఉపేక్షచేయు పొరపాటునుమాత్రమెన్నడును చేయరాదు. సోదరబృందము లోని సభ్యులకు ఒక అద్భుతమగుశక్తికలదు. వారు కీడునుండి మేలునువేరుజేయ గలరు; విశేషముగా కీడు ఉన్నచోటనుండిగూడ దానిలో లేశమాత్రమైన మంచికి యుపయోగించదగు శక్తియున్నచో, దానిని గ్రహించి పైకితీయగలరు.

అతిగాఢమగుభక్తితో తీవ్రమగు మతాభిమానమో, లేక, శాఖాభిమానమో కలిసియుండుట సామాన్యముగా జూచుచుందుము. అట్టిసందర్భములో పరమగురువు ద్వేషభావమును గమనించక, భక్తిభావమును పూర్తిగా గ్రహించి దానినుపయో గింతురు. కనుక మిక్కిలి అనుచితమగు గుణములు గలిగినవారుకూడ తరుచు కొంత సత్కర్మను ప్రభవింపజేయుట గలదు. ఆచెడ్డగుణములు లేనియెడల వారిసత్కర్మ పెక్కురెట్లధికముగా నుండుట నిస్సంశయము.

కాశీనగరము వంటి క్షేత్రము, సంవత్సరమున కొకసారి జరుగుతీర్థయాత్ర లటుండగా, ఎల్లప్పుడును బ్రహ్మాండమగు నొకశక్తి కేంద్రమయియుండును. అది దేవాలయములతోను, ప్రాచీనపవిత్ర వస్తుశేషములతోను నిండియున్న నగరము గనుక, వీనిని గూడ పరమగురువులు శక్తి ప్రసరణమునకు వెల్లువలుగా నుపయోగిం తురు. ఇది ప్రపంచమంతటను వర్తించును. ఒకస్థలమందు, ఏ మతమునకు చెందిన

వాడైనను, ఒక గొప్పయోగికి సంబంధించిన శేషములుండవచ్చును. ఆ శేషములు కనుక వాస్తవమైనవి అయిన యెడల, అది యొకపుణ్యపురుషునకు సంబంధించినవి గనుక వానినుండి ప్రబలమగు శక్తి ప్రసరించుచుండును. కనుక, దానిని పూజించు వారి నాశీర్వదించుటకై యొకశక్తి ప్రవాహమును ప్రసరింపజేయుటకు దాని నుప యోగింపవచ్చును. కాని, అనేకసందర్భములలో ఆ శేషము వాస్తవమయినది కాదు. అయితే, మనకు మిక్కిలి ముఖ్యముగాగనబడు అంశము వాస్తవముగా మన మను కొనునంత ముఖ్యముకాకపోవచ్చును.

చాలాకాలమునుండి జనులందరు ఒకవస్తువును విశేషమగు భక్తితో పూజించి దానినొక పవిత్రకేంద్రముగా గావించి యున్న యెడల, ఆకారణముచేతనే సోదరబృందము వారు దానినొక యథార్థమగు శేషముగానెంచి సార్థకముగా నుప యోగింపగలరు. జనులందరు శేషముయొక్క వాస్తవత్వముగురించి భ్రమలోనున్నను వారలభక్తిగాఢమై,యథార్థమై యున్నది గనుక దానిప్రయోజనములో భేదమేమియు నుండదు. గాఢమగు భక్తియే ముఖ్యవిషయము. దీనిని గనుక జనులు పూర్తిగా గ్రహించిన యెడల ఇటలీ, సిసిలీ, స్పేయిన్ దేశములలోని కేథలిక్ రయితులును, భారతదేశములోని కర్షకులున్ను మూఢభక్తితో ప్రార్థించుటయు పూజించుటయు జూచి, యథార్థములు కానట్టి వస్తువును, స్థలములను పూజించుచున్నారని అపహ సించుట మానివేయుదురని తలచెదను. భ్రమలో నుండి పూజచేయుటకంటె సత్య మును గ్రహించి చేయుట శ్రేష్ఠమను సంగతి నిస్సంశయము. అయినను, అజ్ఞానులు గాఢమగు భక్తితో పూజించు వస్తువులను ఒక్కసారి లాగివేసి నాశముచేయుట యుచితముకాదని గ్రహింపవలెను. వారికి జ్ఞానముకలిగి యుత్తమమగు విషయము లను గ్రహింపగలుగువరకు ఓరిమిని జూపించుట యుక్తమైయుండును. అట్టి విగ్రహ నాశము వలన ప్రపంచమునకు విశేషనష్టమే కలుగును. ఏలయన, దానివలన జను లలోని భక్తికూడ నశించుటయేగాక, వరమగురువులు శక్తి ప్రసరణమునకై యుప యోగించెడు ద్వారములను గూడ మూసివేయడ మగును.

మరియు, అమాయకుడగు కర్షకునకు ఒకపవిత్ర శేషముయొక్క సత్యాసత్య ములను నిర్ణయించుట కేవలమసాధ్యము. కనుక సదుద్దేశముతోను పవిత్రహృదయ ముతోను, అతడు సమర్పించెడు,భక్తియొక్క ఫలితము అతనికి తెలియని విష యముపై నాధారపడియుండుట । కేవలము అన్యాయమగును. వాస్తవికమహాప్రపం

చములోని వ్యవహారములు కేవలము అంత అక్రమముగా పరిష్కరింపబడవు. భక్తి దేనియందు లగ్నమైయున్నను, అదిభక్తుడనుకొనుచున్న వస్తువుఅయినను, కాకపోయినను, నిజమగు భక్తికిసంపూర్ణ ఫలితముండితీరును. ప్రధానమగు విషయము భక్తి—భక్తియొక్క ఊట—ఆభక్తికి ఫలితము కలిగి తీరవలెను. పవిత్రమైనదని అనుకొనుచున్న శేషపదార్థము కేవలము భక్తిని లగ్నము చేయుట కొక కేంద్రమగుచున్నది. ఆ కేంద్రము వాస్తవమైనను, ఊహానిర్మితమైనను ఫలితమొకరీతిగానే యుండును.

## శిష్యులు చేయు కార్యము

పరమగురువుల శిష్యులు పనినేర్చుకొనెడు పనివాండ్రు అనియును, వారున్న క్రింది యంతరువులయందు శక్తి ప్రసరణమున కుపాధులుగా నుందురనియు, ప్రపంచములో పరమగురువుల కార్యమైయున్న మానవ నాగరికతా సంస్కృతికి సంబంధించిన ప్రతి శాఖలోను అనేకవిధములగు కార్యమును చేయుచుందురనియు, ఇదివరకు చెప్పియుంటిని. ఈ కార్యములో చాలభాగము శిష్యులద్వారా ప్రబోధమునుగాని సూచనలుగాని బొందిన ఇతరులచే చేయబడుచుండును, లేక, వారిచే స్థాపించబడినటువంటిగాని, వారి ప్రభావమునకులోనై యున్నటువంటిగాని సంఘములద్వారాను సంస్థలద్వారాను చేయబడవచ్చును. ఈమాదిరి ప్రభావములు లేకపోయినయెడల, మానవజాతి నిజముగా కడుపేదమై యుండును. కాని, నిజముగా జ్ఞానధనమెచటినుండి వచ్చుచున్నదో ఆ మూలమునుమాత్రము లోకమేమియు నెరుగదు. పరమపురుషులు తాము చేయవలసిన ఘనకార్యమునువిడిచి, యీ సుకరములగు చిన్న పనులవైపు దృష్టిని మరల్చినయెడల పరిణామయంత్రమంతయు తారుమారైపోవును; గనుక వారీ చిన్నపనులను స్వయముగా చేయబూనజాలరు.

ఉదాహరణకు, ఈ సిద్ధపురుషులు గ్రంథముల నేలరచింపరని మానవులప్పుడప్పుడు ప్రశ్నింతురు. సిద్ధపురుషులు ప్రపంచపరిణామమును సాగించుచున్నారనియు, దానిలో కొన్ని విషయములగురించి మాత్రము జనులకు సమాచారము నిచ్చుటకై వారి మహాత్కార్యమును విడిచిపెట్టనేరరనియు మానవులు మరచిపోవుదురు. సిద్ధపురుషులలో నొకరికి గ్రంథరచనకై తీరికయున్నయెడల, వారిశక్తిని వినియోగించుటకు అంతకంటె శ్రేష్ఠతరమగు కార్యము లేనియెడల, వారు రచించెడు గ్రంథము మన

గ్రంథములకంటె ఎక్కువ శ్రేష్టముగా నుండుననుట సత్యమే. పరిపూర్ణముగా చేయ గలిగిన మనుష్యులే సమస్త కార్యములను చేయవలెనని యీశ్వర సంకల్పమైన యెడల, మన శక్తుల నుపయోగించుట కవకాశమే యుండదు. గనుక ఈ ప్రపంచ ములో మనవంటివారు జీవించిన ప్రయోజనమే కనిపించదు.

ఈమధ్యను సిద్ధపురుషుల శిష్యులు బాహుళ్యముగా నేర్పాటుచేసిన కార్యమే మనగా, భువర్లోకములో నిర్దిష్టమైన సేవజేయుట. దీనినిగూర్చి "అదృశ్యసహాయులు" అనుపుస్తకములో వ్రాసియుంటిని. ఆసేవలో విశేషభాగము క్రొత్తగా మృతులయిన వారినిగూర్చి వినియోగింపబడుచున్నది. ఈమృతులు తరుచుగా గందరగోళములోపడి, దిగ్భ్రమజెందినవారై, మిక్కిలి బాధపడుదురు. అందులో ముఖ్యముగా, వారి జీవిత ములలో (కొన్ని మతములలో మూర్ఖులచే ప్రతిపాదించబడు) ఘోరనరకము, నరక బాధగురించి విన్నకథలచే భయకంపితులైయున్న వారిస్థితి భువర్లోకములో మిక్కిలి దీనముగా నుండును. వారికి సహాయమత్యావశ్యకమై యుండును. అట్టివారికి సహా యము చేయుట చాల సంవత్సరములనుండి జరుగుచున్నను, ఒక సంస్థగా నేర్పడి సేవజేయుట దివ్యజ్ఞాన సమాజము పుట్టినతరువాతనే మొదటిసారిగా ప్రారంభమ య్యెను. ప్రారంభమందు సజీవులైయున్నవారే ఆసంస్థలోచేరిరి. రాత్రులందు వారి శరీరములు నిద్రలోనుండగా సేవాకార్యమును చేయుటకు సంకల్పించిరి. కాని త్వర లోనే అదివరకే మృతులై ఇటువంటి పనినిగురించి యెన్నడును ఊహించనైన యూ హించని వారిలోనుండి చాలమందిని కూడగట్టుకొని వారికా సేవావిధానమును నేర్పి, పని సాగించుచుండిరి.

అప్పటివరకు భువర్లోకములోనికి క్రొత్తగా ప్రవేశించినవారు సామాన్య ముగ ఎవరిబాధలను వారు పడుచుండిరి; కాని భువర్లోకములో వారి బంధువు లెవ రైన నున్నయెడల ఒక్కొక్కప్పుడు వారు వీరిని కలుసుకొని నూతన పరిస్థితుల నెరు కపరచి సహాయము చేయుచుండిరి. ఉదాహరణమునకు, చనిపోయిన తల్లి తనబిడ్డల నుకనిపెట్టి చూచుచుండును. త్వరలోనే యొక బిడ్డ చనిపోవుట సంభవించినయెడల తల్లి వెంటనే ఆబిడ్డను కలిసికొని తాను చెప్పగలిగినదంతయు చెప్పి, చేయగలిగిన సహాయమునంతను చేయును. సాధారణముగా మృతులలోని సుహృదయులు కొం

దరు అవసరము కలిగినప్పుడెల్ల తమకు తెలిసినసంగతులను ఇతరులకు చెప్పి సహాయ పడుచుందురు. పూర్వపు నాగరికతల ప్రకారము పెద్దకుటుంబములు, సమష్టికుటుంబములు పరిపాటిగానున్నప్పుడు మరణానంతరము సహాయములులేక బాధపడినవారు బహుతక్కువగానుండి యుండవలెను. కుటుంబ బాంధవ్యములు కేవలము జీవించియున్నప్పుడేగాక మరణానంతరమున అదృశ్యలోకములలోనికికూడ వ్యాపించియుండుట అవసరమని భారతదేశ మతగ్రంథములలో ఎట్లు నొక్కివక్కాణింపబడినదో ప్రాచ్య దేశ సాహిత్యమును చదివినవారికి జ్ఞాపకముండవచ్చును. అయినప్పటికి భువర్లోక పరిస్థితి అప్పుడు యెట్లుండెననగా, వైద్యశాలలుగాని పాఠశాలలుగాని ప్రజలకు బహిరంగముగా భోగట్టానిచ్చెడు కార్యాలయములుగాని లేక చాలమంది జనులు బాధ పడవలసిన దేశములోని పరిస్థితులవలె నుండెను. గొప్పవిపత్తులు, యుద్ధములు సంభవించినవుడు మృతులగు మనుష్యులకు భువర్లోక పరిస్థితులగూర్చి జ్ఞానమేమియు లేక పోవుటచే వారా లోకములో అతి తీవ్రముగా బాధపడుచుండిరి.

## ప్రతిశతాబ్దాంతమందు జరుగుచున్న కృషి

మానవాభ్యుదయమునకై సిద్ధపురుషులు చేసెడు కార్యవిధానమును మన అధ్యక్షులు—డాక్టరు బిసెంటుగారు—లండను నగరమునందు 1907 సంవత్సరములో ఇచ్చిన యుపన్యాసములో బహుచక్కగా చిత్రించిరి. మధ్యయుగములలో యూరపు ఖండము నావరించిన ఘోరమగు అజ్ఞానతిమిరము నుండి ఆ ఖండమునుద్ధరించుటకై సోదరబృందము చేసిన కృషిగురించి కొంతవరకు వివరించెను. పదమూడవ శతాబ్దములో టిబెటు దేశమునందు అప్పుడు నివసించుచుండిన ఒకగొప్ప దివ్యపురుషుడు యూరపుదేశము నుద్దీపనము చేయుటకై ప్రతి శతాబ్దములో ఆఖరుపాదమునందొక ప్రత్యేకయత్నమును చేయవలసినదని సోదరబృందమును శాసించిరని ఆమె తెలియపరచిరి. చరిత్రను గనుక జాగ్రత్తగా పరిశీలించిన యెడల, అప్పటినుండియు ఆ సోదరబృందమునుండి ప్రతిశతాబ్దములోను ఆఖరుపాదమున ఒక నూతన కిరణము ప్రసరింప జేయబడుచున్నదని తెలియగలదు. వానినన్నిటిని(క్రిట్జుకుంజుగారిట్లు వివరించిరి:

| | కాలము | పురోవృద్ధి స్వభావము | ఫలితము |
|---|---|---|---|
| 1 | 1275 సం॥రం ఆ ప్రాంతమున | రోజర్ బేకన్; మానసిక సంస్కృతి యొక్క పునరుద్ధరణము | సంస్కృతిలో ప్రజాస్వామ్యత్వము, సంస్కృతి యొక్క పునరుద్ధరణము |
| 2 | 1375 సం॥రం ఆ ప్రాంతమున | క్రైస్తవ రోజీక్రూజ్‌న్ను సంస్కృతి వ్యాప్తియున్ను | Renaissance * |
| 3 | 1475 సం॥రం ఆ ప్రాంతమున | గ్రంథముద్రణము; జ్ఞానమును గ్రంథస్థము చేసి స్థిరపరుచుట | జ్ఞానములో ప్రజాస్వామ్యము; |
| 4 | 1575 సం॥రం ఆ ప్రాంతమున | ఫ్రాన్సిసు బేకన్ భౌతిక విజ్ఞానశాస్త్రము—ఆంగ్లేయ భాషావ్యాప్తి | సంస్కరణము Reformation |
| 5 | 1675 సం॥రం ఆ ప్రాంతమున | అన్ని తరగతుల నేకము చేయు ప్రయత్నములు; రహస్యసంఘములు | రాచకీయ ప్రజాస్వామ్యత్వము. |
| 6 | 1775 సం॥రం ఆ ప్రాంతమున | శోచనీయమగు విప్లవము ద్వారా రాచకీయ స్వాతంత్ర్యము | విప్లవము. |
| 7 | 1875 సం॥రం ఆ ప్రాంతమున | దివ్యజ్ఞాన సమాజము; ఆత్మపరిశోధక సంఘము; లిబరల్ కేథలిక్ చర్చి; కోమేసస్రీ; పరిణామము | యోగశాస్త్రములో ప్రజాస్వామ్యత్వము. |
| 8 | 1975 సం॥రం ఆ ప్రాంతమున | అంతరంగిక జ్ఞానవ్యాప్తి ఆధ్యాత్మిక పరిణామము | పరిణామము |

*సంస్కృతియొక్క పునరుద్ధరణము నెమ్మదిగాను, క్రమక్రమముగాను జరిగినట్లు స్పష్టపడుచున్నను, పెక్కుమంది ప్రమాణపురుషులు ఇంతకుదరిమిలాను, అనగా, 1453 సం॥రంలో కాన్‌స్టేంటినోపిల్ పతనమయిన తరువాతనే సార్థకముగా ప్రారంభమయ్యెనని అభిప్రాయపడుచున్నారు.

ఈ ప్రయత్నములలోని తుది యత్నము 1875 సంవత్సరములో దివ్యజ్ఞాన సమాజమును స్థాపించుటయై యున్నది. బహుజాగ్రత్తగా యోచన చేసినతరువాత పరమగురువులగు మోర్యా, కూట్‌హూమి మహర్షులు ఈ సమాజమును స్థాపించెడు బాధ్యతను వహించిరి. భూలోకములో వారలకు సహాయముచేయుటకై మహనీయురాలైన మేడమ్ బ్లవట్స్కీగారిని యెంచిరి. ఆమెచేయవలసిన మహత్కార్యమునకై ఆమెకెట్టి శిక్షణఇయ్యబడినదో, కల్నల్ ఆల్కాటుగారిని అమెరికా దేశములో వెదకి కలిసి కొనవలసినదనిచెప్పి సోదరబృందము ఆమెను అమెరికా దేశమున కెట్లుపంపిరో, సమాజము న్యూయార్కు నగరములో నెట్లు స్థాపించబడినదో, తరువాత ప్రధాన కార్యాలయము ఎట్లు భారతదేశమునకు మార్చబడినదో దివ్యజ్ఞాన సాహిత్యపాఠకుల కందరకు తెలిసిన విషయములే. సంస్థాపకశక్తి, మనుష్యులతో మాట్లాడుటకు వారిని సమావేశపరచుటకు వలయుకుశలత, బాహ్యప్రపంచములో ప్రజలను కూడగట్టుకొని యొకయుద్యమమును లేవదీసి దానిని నడపగల సామర్థ్యము, మొదలగు బ్లవట్స్కీగారిలో లేనిగుణములు ఆల్కాటుగారిలో బాగుగా నెలయుచుండెను. అందుచేతనే బ్లవట్స్కీగారికి ఆల్కాటు గారిని సహాయులుగా నిర్ణయించిరి.

నేనీ గ్రంథమును వ్రాయుచుండ మన సమాజమునకు యాబది సంవత్సరముల వయస్సు నిండినది. అది యింతవరకెడ తెగకుండ మానవజాతికి సేవజేయుచున్నది. మానవజీవితములో ప్రతిశాఖలోను మన సమాజముచేసిన విస్తారమగు మేలును "ఇంత" అని నిర్ణయించి చెప్పలేము. దాని ప్రభావమును సభ్యుల సంఖ్యచేగాని, దాని శాఖల సంఖ్యచేగాని, కొల్చుటకు శక్యముకాదు. అయినను, ప్రపంచములో నాగరికతగల ప్రతి దేశమునకు అది వ్యాపించి యున్నది. సంఖ్యలుచూచినను నిర్లక్ష్యము చేయదగినంత స్వల్పముగాలేవు. మానవులు కృషిసలిపెడు ప్రతిశాఖలోను దివ్యజ్ఞాన సమాజముయొక్క నాదము సలక్షణముగా ధ్వనించుచున్నది. ఆనాదము యొక్క స్పందములు అసంఖ్యాకములుగా బయులుదేరి మన చుట్టును ప్రసరించి రాజకీయవేత్తల మాటలలోను, భౌతికవిజ్ఞాన శాస్త్రవేత్తల పరిశోధనలలోను, సాహిత్యవేత్తలరచనలలోను, కళాభిజ్ఞుల ప్రదర్శనములలోను వ్యక్తములగుచున్నవి. వీరిలో చాలమంది దివ్యజ్ఞానమను మాటనైన వినియుండకపోవచ్చును. కాని దాని ప్రభావము మాత్రము వారిలో నిస్సంశయముగా గనిపించుచున్నది. ఆనాదము అదృశ్యలోకముల యొక్క వాస్తవమగు పరిస్థితులను, మనస్సుయొక్క ప్రబలశక్తిని, దివ్యజ్ఞానము స్ఫుట

ముగా మనయెదుట నుంచినది: బాహ్యజీవితములో మానవసోదరత్వమును పాటించ వలెనని హెచ్చరించినది. మానవులందరు నొకరీతిగనుండి, యొకేవిధముగా జీవింప వలెనని చెప్పక, భిన్నముగానున్నను అన్యోన్య సహకారమునకై సంఘీభావముతో ప్రయత్నము సలుపవలెనని ప్రకటించినది. ప్రతి తరగతియొక్క ప్రతిసభ్యుడు ఎవని విశిష్టలక్షణమును వాడు పెంపొందించుకొని బలముగా నుండవలసియున్నను, అందరును ఒకరియెడల నొకరు గౌరవప్రేమలు గలిగి మానవత్వమను బంధములో కట్టబడి సోదరులవలె నుండవలెనని యుద్ఘాటించినది. వెనుకటికంటె నెక్కువగా ప్రాచ్య పాశ్చాత్య జాతులను దగ్గరగా దీసికొని వచ్చినది. మతములలో తారతమ్యమును సమ్యగ్దృష్టితో జూచుట నేర్పి, అన్ని మతము లొకేమూలమునుండి వచ్చినవనియు ఒకే ప్రబోధము చేసినవనియును స్పష్టముగా ప్రకటించి మతసామరస్యమును పెంపొందించినది: యావచ్ఛక్తితో, త్రికరణశుద్ధితో, మవస్ఫూర్తిగా శాశ్వతమగు మానవ కళ్యాణమునకై పరమగురువుల సేవజేయుటకుగాను అనేకవేలమందిని వారిచరణ సన్నిధిని చేర్చినది.

## జాతులు

ప్రపంచ కార్యనిర్వహణములో సోదరబృందము వర్తమానమునేగాక, భవిష్యత్తును గూడ చాల దూరమువరకు చూచుచుందురు. మానవగుణములన్నియు పరిపూర్ణ సౌష్టవముతో సక్రమగతిని వికాసము నొందగల క్రొత్త జాతులయొక్కయు క్రొత్త తెగలయొక్కయు పరిణామమునకేర్పాట్లు చేయుదురు. పదమూడవ అధ్యాయములో జూడబోవునట్లు మానవజాతియొక్క పురోవృద్ధియేదో అకస్మాత్తుగా ఒక్కసారి జరుగదు. జాతులన్నియు మహాప్రపంచ పాఠశాలలోని వేర్వేరు తరగతులలోవలె నుండును. ఒక్కొక్కతరగతిలోని విద్యార్థులవలెనే, ఒక్కొక్కజాతియు శారీరికముగను, రాగద్వేషములలోను, మానసికముగను, కొన్ని ప్రత్యేక లక్షణములను వికసింప జేసికొనవలసియున్నది. నవీనకళాశాలలోని విద్యావిధానము కాల నిర్ణయములోను, అధ్యయనము చేయవలసిన విషయక్రమములోను—ఎంత నిర్దిష్టముగాను స్పష్టముగాను నుండునో, అట్లే జాతుల పరిణామము గూడనుండును.

గొప్పదగు ఆర్యజాతి యిపుడు ప్రపంచములో ప్రముఖముగా నున్నది. అది యింకను నడియావనమునకురాలేదు. దానిమేధాశక్తి అనుత్తమమైయున్నది. అది

అట్లాంటియను జాతికి తరువాత వచ్చెను. ఆ వెనుకటి జాతికిచెందిన మనుష్యులిప్పటికి మానవజాతిలో ఎక్కువ భాగమైయుండి భూమియందు విశేషభాగము నాక్రమించి యున్నారు.

## ఆ గ మ న ము

ఈసందర్భములో ప్రస్తుతము మూడుగొప్పకార్యములు ప్రారంభమై ఆచరణలో నున్నవి. రెండువేల యేండ్లక్రిందట జీసను శరీరమును ధరించిన మహాపురుషుడు, క్రైస్తు, జగద్గురువులైన బోధిసత్త్వులు, తిరిగి ప్రపంచమునకురానైయున్నారు. ఆయన వచ్చునప్పుడు, ఆయన ఉపయోగార్థమై ఒకభౌతిక యుపాధిని సిద్ధముచేయవలసియున్నది. ఇది మొదటి కార్యము. ఆయనరాకకు ఇదివరలో చెప్పిన శతవార్షిక సంఘటనలతో సంబంధములేదు. అవన్నియు ప్రథమరేఖకు చెందినవి. జాతుల యొక్కయు, ఉపజాతులయొక్కయు అభివృద్ధికి సంబంధించిన గుప్తకార్యశాఖకు చెందినవి. ఈరాబోవు సంఘటనము ద్వితీయరేఖకు చెందినది, చిరకాలమున కొకసారి సంభవించునది.

జగద్గురువు ఇప్పుడు సహితము మనద్వారములవద్ద నున్నారు. ఆయనశక్తి ఆయనజ్ఞానము, ఆయనప్రేమ, అంతకంత కెక్కువగా ఆవిష్కరణము కాగలవని మనమాశింపవచ్చును. ప్రాక్ తారక సంఘము. **Order of the Star in the East**అను సంస్థ 1911 సంవత్సరములో స్థాపించబడినది. ఏ మతమునకు చెందినవారైనను, ఏజాతికి చెందినవారైనను జగద్గురువు త్వరలోరానైయున్నారనినమ్మి ప్రపంచమునకు ఆ సంగతిని ప్రకటింప గొప్ప యత్నముచేయుటకు సంసిద్ధులగుటకును, ఆయన వచ్చినప్పుడు ఆయనకు సేవజేయుటకు సాధ్యమైనంత వరకుఅర్హత సంపాదించుకొనుటకును, అంగీకరించు వారినందఱను ఏకము చేయుటకు ఆ సంఘము ఉద్దేశింపబడినది.

మైత్రేయప్రభువు తమరాకను మనఅధ్యక్షులద్వారా ప్రపంచమునకు ప్రకటింపననుగ్రహించిరి. కనుక, గతముప్పదియేడు సంవత్సరములలోను అద్భుతమగు వాగ్ధాటితో ఆమె ప్రచారముచేయుచున్న ఆదర్శమార్గముననే కొంతవరకు జగద్గురువుల ప్రబోధము కూడనుండవచ్చునని మనమనుకొనుట సమంజసముకావచ్చును. జగద్గురువు మానవజాతిని విచారణచేసి, తీర్మానించి భూమిని నాశముచేయుటకై వచ్చు

ననెడు మూఢనమ్మకమును క్రైస్తవులలో కొన్ని తెగలవారు ఇంకను విడిచిపెట్ట లేకపోవుచున్నారు. అందుచే వారు విశేషముగా భయముతోను, సంశయముతోను బాధపడుచున్నారు. కాని, దేవుడనినగలిగెడు భయము కేవలము దురభిప్రాయము చేతనే కలుగుచున్నది.

క్రైస్తుయొక్క రాక యొక యవధితో సంబంధించియున్న సంగతివాస్తవము. కాని అది ప్రపంచముయొక్క అంతముకాదు; ఒకయుగాంతము, లేక, ఒకవిధానాంతము అనదగును. రెండువేల సంవత్సరముల క్రిందట యూదుల ధర్మవిధానమంత మయ్యెననియు, తాము క్రొత్తనిబంధనమును—సువార్తా విధానమను క్రొత్తనిబంధనమును—స్థాపింపనేతెంచితిననియు క్రైస్తు చెప్పెను. అదేవిధముగా, ఆయన తిరిగివచ్చి మరియొక క్రొత్తవిధానమును స్థాపించుటతో వెనుకటి సువార్తానిబంధనము అంత మొందును. ఆయన ఆమహాప్రబోధమునే చేయుదురు. సత్యమెల్లప్పుడు నొకటే, అందుచేబోధకూడ నొకటైయుండి తీరవలయును. అయితే మనకిప్పుడు కొంచె మెక్కువ జ్ఞానము కలిగినదిగనుక, బోధకూడ కొంచెమధికముగను, ఎక్కువస్పష్టముగను నుండవచ్చును. నూతనదుస్తులలో, నవ్యసౌందర్యముతో, ఈనాడు మనకు తగి యుండురీతిని ప్రదర్శింపబడవచ్చును. చాలమంది జనులకు సమ్మతముగనుండునట్లు కొంతవివరణముండవచ్చును.

ప్రస్తుతమున్న మతములన్నిటిలోను సత్యము కనిపించుచున్నదిగనుక, అది నిశ్చయముగా నొకటేయైయుండును. కాని, ఆ మతములు సత్యమును ప్రదర్శించెడు పద్ధతులలో విశేషముగా భేదముకలదు; కాని, వాని యనుచరులకు అవిబోధించెడు జీవితధర్మములో మాత్రము భేదమేమియు లేక పూర్తిగా నొకేవిధముగానుండును. క్రైస్తవ, బౌద్ధ, హిందూ, మహమ్మదీయ మతములలో బాహ్యముగా జనబాహుళ్యమునకు చేయుబోధలలో విశేషభేదము కనిపించును. కాని, యీ మతములలో సత్పురుషులైన వారిని యెవరిని పరీక్షించి చూచినను వారందరిదైనందిన జీవితము లొకేరీతిగనుండును. మానవునకుండవలసిన సద్గుణముల గూర్చియు, ఉండకూడని దుర్గుణముల గూర్చియు అన్నిమతములు ఏకీభవించును.

మానవుడు ధార్మికబుద్ధిగలిగి, సత్యశీలుడై, దయాళుడై, గౌరవనీయుడై, పేదలకు సహాయకారియై యుండవలెననియు, కఠినహృదయుడై, క్రూరుడై, అసృతవాదియై, గౌరవహీనుడై యున్నయెడల మానవునికి పురోవృద్ధి యుండనేరదనియు అన్ని

-మతములు చెప్పును. ఏమతములోనైనను, వాస్తవముగా ప్రయోజనకరమగు విష యములు మనకెవ్వరికి నిశ్చయముగా తెలియనట్టియు, మన ప్రవర్తనను చక్కబరచ జాలని అస్పష్టమగు మిట్టవేదాంత విశేషములు గావనియు, ముఖ్యమగు విషయములు మన నిత్య దైనందిన జీవితములకు సంబంధించిన నైతికసూత్రములనియు, మనతోడి మానవులలో మనలను యోగ్యులుగా చేయునవి ఆసూత్రములే యనియు, అనుభ వజ్ఞులగు మానవులవలె మనము గుర్తించవలసియున్నది. ఆ నైతికసూత్రములు ఇప్ప డున్న మతములన్నిటికి సామాన్యములైయున్నవి. క్రొత్తగా చేయబడనున్న బోధ యెద్దియైనను దానిలోకూడ ఈనైతిక సూత్రములు మాత్రము మారక నిలిచి యుండును.

ఆ జగద్గురు వేమి బోధచేయునో కొంతవర కూహించి చెప్పవచ్చునని తల చెదను. ప్రేమ, సోదరభావము కొరతపడుటచేతనే ప్రపంచములోని కీడులన్నియు గలుగుచున్నవన్న ప్రధాన సత్యమును ఆయం నొక్కి చెప్పుట నిశ్చయము. మాన వుడు సరిగా ప్రేమించుట నేర్చుకొని సోదరత్వము నవలంబించినయెడల సమస్త కీడును నశించి స్వర్ణయుగము ప్రారంభము కాగలదు. కాని, వెంటనే, అది సంభవిం చునని ఆశించుట కవకాశములేదు. కాని, మానవులు తమంతటతాము స్వయముగా యోచన జేసికొని, ఇతరమార్గములయందుకంటె ప్రేమమార్గమున ఎంత శ్రేయస్సు గలుగునో గ్రహింప నారంభింతురు.

## ఆ ర వ యు ప జా తి

రెండవగొప్పవిషయ మేమనగా, మన ఆర్యజాతియొక్క ఆరవయుపజాతికి శరీరము, రాగములు, మనస్సు వీనినన్నిటిని నిర్ణయించి రూపనిర్మాణము చేయవలసి యున్నది. ఈ యారవ ఉపజాతి అమెరికాలోను, ఆస్ట్రేలియాలోను, బహుశః ప్రపంచములో మరికొన్ని యితర భాగములలోను ఇదివరకే మొలకెత్తియున్నది. మనువు తమ మనస్సంకల్ప శక్తిచేతను, ఇచ్ఛాశక్తిచేతను గలిగిన మహానిర్మాణ శక్తిని వినియోగించి సూక్ష్మలోకములలో పనిచేయుచు రాబోవు యుగమున పుట్ట వలసిన బిడ్డల స్థూలశరీరాకృతులనుగూడ అవకాశమునుబట్టి దిద్దుచున్నారు. బాహ్య ప్రపంచములో పనిచేయుచున్న సోదరబృందములోని క్రొత్తసభ్యులలో కొంతమం దిని సాధ్యమైనప్పుడెల్ల ఈబిడ్డలకు నవ్యజాతికి తగియుండురీతిని విద్యాశిక్షణములను

గలుపవలసినదని ఆజ్ఞాపించిరి. ఇంతవరకు ఈకార్యము స్వల్పముగా జరుగుచున్నది. కాని మున్ముందు విస్తారముగా పెరిగిపోవుట నిశ్చయము. కొన్ని శతాబ్దముల స్వల్ప కాలములో ఈ యారవ యుపజాతి క్రొత్తప్రపంచములో యౌవనముపొంది విశిష్టముగను, అద్భుతముగను విలసిల్లుచుండును; పాతప్రపంచములో అయిదవ యుపజాతి క్రమేణా పెరుగుచు పరిపూర్ణతనొందును. బహుశః కొంతకాలము తరువాత ఆరవ యుపజాతి నడివయస్సునకు పెరిగి ప్రకాశవంతముగను దివ్యముగను శోభిల్లుచు అయిదవ ఉపజాతిపై తన ఆశీర్వాదమును ప్రసరింపజేయవచ్చును. ఆ యాశీర్వాద బలముచే మొదటిసారిగా ఒక జాతి ఫలవంతము, గౌరవనీయమునగు వృద్ధాప్యములోనికి ప్రశాంతముగా, గంభీరముగా క్షీణించుట సంభవింపవచ్చును. వర్తమానమునను, భవిష్యత్తునను ఉపసిజాతికి చేసెడు సేవకును, సంపూర్ణత్యాగముచేసి అసురశక్తులతో విజయవంతముగా సాగించినపోరాటమునకును, ఇదివరలో మానవజాతి యెన్నడెరిగియుండని అద్భుతావకాశములకు ద్వారముల దెరచినందుకును, ఈ అయిదవ యుపజాతికి అది పారితోషికము కావచ్చును.

ఆరవఉపజాతికి చెందుటలోగల విశేషమును మనము గ్రహింపవలసియున్నది. మన అభిప్రాయములు మార్పునకు లొంగక, స్థిరస్వభావము గలిగియుండుట కవకాశము గలదు. ఆరవ యుపజాతి పూర్తిగా స్థాపితమైనప్పుడు, వారి స్థూల, కామ, మానసిక శరీరములలో సామాన్య అయిదవ ఉపజాతి మానవునిలో గనబడని కొన్ని విశిష్ట లక్షణములు నిర్దిష్టముగా వ్యక్తమగును. ఆరవఉపజాతి అయిదవఉపజాతిలో నుండి క్రమేణా వికసింపవలసియున్నదనియు, ఈక్రొత్త లక్షణములన్నియు, నొకటి తరువాత నొకటి ప్రతిజీవాత్మలోను నెమ్మదిగా వృద్ధిపొందవలసి యున్నదనియు జ్ఞప్తియుంచుకొనవలెను. ఈ సజ్జీకరణము చాల కాలముపట్టును, అనేక జన్మలు కావలసియుండవచ్చును. కాబట్టి యొక్కసారి మనుష్యులవంక జూచి అందులో ప్రత్యేకముగా యువకులవైపుజూచి, వెంటనే వీరు క్రొత్తయుపజాతికి చెందినవారనియు, వారు చెందరనియు చెప్పగలమని అనుకొనరాదు.

అంతకంటె "రామునికి క్రొత్తఉపజాతి లక్షణములు నూటికి యిరువది అయిదుపాళ్లు ఉన్నట్లు కనిపించుచున్నది. కృష్ణునకు నూటికి యేబదిపాళ్లు, గోవిందునకు నూటికి డెబ్బదిఅయిదుపాళ్లు చొప్పున యున్నట్లున్నది. కేశవునికన్నియు సంపూర్ణముగా నున్నట్లున్నది; నేను జూచినంతవరకు కేశవుడు పరిపూర్ణుడువలెనున్నాడు,"

అనిచెప్పిన చెప్పవచ్చును. కాని మీారోకవిషయము గ్రహింపవలసియున్నది. చాల వికాసమునొందిన పిల్లలని మీారూహించుచున్నవారందరు రామునివంటివారే అయి యుండవచ్చును. కృష్ణునివంటివారు ఇప్పుడు ప్రపంచములో బహు అరుదుగా నుం దురు. గోవిందునివంటివారు, కేశవునివంటివారు ప్రపంచములో మన చిన్న బృంద ములో తప్ప ఎచటను లేరని చెప్పవచ్చును. మరియు పరిణామవికాసములు విశేష ముగా భేదించుచుండుననికూడ జ్ఞాపకముంచుకొనవలెను. ఒకపిల్లవాడు కామమయ మానసిక శరీరములలో విశేషమగు నభివృద్ధి నొందినను, అతనిస్థూలశరీరములో ఆ వికాసము విస్తారముగ బహిర్గతము కాకపోవచ్చును. లేదా, వంశపారంపర్యముచే లక్షణమగు దృఢశరీరము కలిగియుండవచ్చును, అందుచే, ఉన్నతలోకములలో అప్పటికతడు సహజముగా పొందిన అభివృద్ధికంటె ఎక్కువ అభివృద్ధిని కనబరచ వచ్చును. ప్రస్తుతము బహుకొద్దిమందిమాత్రమే అన్నిలక్షణములను బొందుట కాశింపవచ్చును, వారు ఒకటిరెండు లక్షణములను గలిగియున్నచో ధన్యులనుకొన వచ్చును.

ఆజాతి యుచ్ఛస్థితిలో నున్నప్పుడుకూడ అందరివికాసము సరిసమానము గా నుండదు. ఉదాహరణమునకు ఈక్రొత్తజాతివారు ముఖ్యముగా పొడుగైనతలలు గలిగియుందురు. కాని, అడ్డతలకాయలుగల తెగలుకూడ కొన్నియుండును. ఎఱ్ఱని శిరోజములుగలవారు నల్లనిశిరోజములు గలవారునుందురు. నీలవర్ణముగల నేత్రములు గలవారు, గోధుమవర్ణముగల నేత్రములుగలవారునుఉందురు. సహజముగా, కామ మానసిక లక్షణములెక్కువ ముఖ్యములై యుండును. కాని సాధారణముగా, శరీరా కారమునుబట్టియే వారిని గుర్తింపగలుగుదుము, స్వార్థరాహిత్యము వారిజీవితములో సామాన్య లక్షణము. తీవ్రమగు సేవాపరాయణత్వము ప్రధానలక్షణము. వీనికి తోడుగా, ఉబుకుచుండెడు దయాళుత్వము, విశాలహృదయముతోగూడిన తితిక్ష వెలయుచుండవలెను. తనస్వసౌఖ్యమునుమరచి, యెల్లప్పుడు నితరులకెట్లు సహాయపడ గలుగుదునాయని తలపోయుచుండువాడు ఆమార్గమున చాలదూరము పోయినవాడ గును. వివేకము, ప్రపంచజ్ఞానముగూడ ప్రబలమగు లక్షణములుగ వ్యక్తమగు చుండును.

శరీరలక్షణములను బట్టి తెలిసికొనగోరిన యెడల, బహుశః కోమలములగు, సొగసైన కరచరణములు, సన్ననిపొడుగైన వ్రేండ్లు, కోలగానుండు గోళ్లు, వేళ్ల

యొక్క—అందులో ప్రత్యేకముగా బొటనవ్రేలుయొక్క పలుచన, మిక్కిలి ప్రధాన లక్షణములైయుండును. చర్మముయొక్క లక్షణము గూడ ముఖ్యమే. అదిముతుకగా నుండక, యెల్లప్పుడును మృదువుగాను, సున్నితముగానుఉండి ప్రకాశించుచుండును. ముఖములలో మూడురకములుండును. (1) ఎత్తయిననుదురుగలిగి చాలా కోలగా నుండునది; (2) విశాలమగునుదురుకలిగి కొద్దిగా కోలగానుండునది; (3) కుఱుచగా నుండి వెడల్పు ఎక్కువగా గలిగియుండునది. ఇందులో మూడవరకము అరుదుగా నుండును. శ్రద్ధగా పరిశీలించిన యెడల ఆరవఉపజాతికి దగ్గరగా చేరుచున్న మనుష్యునిలో నొక విశిష్ట లక్షణమును త్వరలోనే కనిపెట్టవచ్చును.

దివ్యజ్ఞానసమాజముతో ఏవిధమగు సంబంధము లేని పరిశోధకులు కేలిఫోర్నియా, ఆస్ట్రేలియా, న్యూజీల్యాండు, దేశములలో కొందరు బిడ్డలలో నొకక్రొత్త జాతి లక్షణములను గుర్తించినట్లుచెప్పుట తరుచుగా వినుచుందుము. ఉదాహరణమునకు: 1923 సంవత్సరములో కెప్టెనుపేప్ అనునతడు బ్రిటిషుసంఘము వారి యెదుట ఉపన్యసించుచు"ఆస్ట్రల్—అమెరికన్" జాతియనునొక నూతన జాతియుద్భవించుచున్నదని చెప్పి, ఆ జాతిలక్షణముల నీక్రిందివిధముగా వర్ణించెను:—

"తల, ముఖ్యముగా ముందుభాగము, గోపురమువలె నెత్తుగానుండును. చెవులు ఇప్పటివలె క్రిందకు వ్రేలాడవు; తలవెంట్రుకలు, చర్మము సుందరముగా నుండును; నేత్రములు ప్రకాశవంతములుగా చుఱుకుగా నుండునుగాని, పెద్దవిగా నుండవు; ముక్కుదూలము చిన్నతనములోనే స్ఫుటముగా తేలియుండును; పెదవులు పలుచనై సులభముగా చలించునవైయుండును;కనుబొమ్మలు ప్రముఖముగానుండును; మెదడుయొక్క ముందుభాగము చాలపెద్దదిగా పెరిగియుండును.ముఖము కొంచెము త్రికోణాకారముగా నుండునుగాని కొనదేరియుండదు; శరీరము మంచి అంగసౌష్టవమును ఆరోగ్యమును గలిగి సాత్త్వికముగా నుండును. "అంతామెదడే, రక్తమాంసములు శూన్యము" అనునట్లుగాక, సర్వతోముఖమగు అభివృద్ధి గలిగియుండును. ఈ క్రొత్తజాతికి చెందినబిడ్డ యొక్క మానసిక ప్రవృత్తిలో, త్వరితముగా సానుభూతిని జూపుట,బాధితుల యెడలకరుణ,ప్రధానసూత్రములను సులభముగా గ్రహింపగలశక్తి, కుశాగ్రబుద్ధి, ఏపనిని చేసినను సమగ్రముగాచేయుట, సున్నితత్వము, నిశితమగు న్యాయబుద్ధి, చిలుకవలె నొప్పగించెడు తెలివిలేమి, పరులకు సహాయము చేయుటకై ఆతురత, ఈ లక్షణములన్నియు ద్యోతకములగుచుండును. మరియు

వారు మోటుఅయిన ఆహారమును ఏవగించుకొందురు, తరుచుగా ఏ పదార్థమును విస్తారముగా భుజింపరు. మిగిలినవిషయములలో సామాన్యపుబిడ్డలవలెనే యుందురు. కాని, వారికి విద్యగఱపుటకు విశేషగుణగ్రహణశక్తి, సానుభూతిగల ఉపాధ్యాయులు కావలెను.

అంతకుపూర్వపు సంవత్సరములో (1922) లాస్ ఏన్జెలీస్ ఆదివారపు పత్రికలో కాలిఫోర్నియా, న్యూజీలాండు దేశములలో నుద్భవించుచున్న నూతనజాతిగురించి యొక పెద్ద వ్యాసము ప్రచురింపబడెను. దానిలో ఆజాతిబిడ్డలలో ప్రదర్శితములగు కొన్ని మానసిక, శారీరిక లక్షణముల నుదహరించి వారికి అసామాన్యమగు సమతుల్యత, బుద్ధివికాసము గలవని ప్రత్యేకముగా ప్రశంసించిరి.

## ఆ ఱ వ మూ ల జా తి

మూడవ గొప్ప సంఘటనమేమనగా, ఆరవమూలజాతియొక్క స్థాపనము. అది యిప్పటికి యేడు శతాబ్దముల తరువాత కేలిఫోర్నియాలో స్థాపించబడును. మన పరమగురువు మోర్యమహర్షి ఆజాతికి మనువుగానుండును. ఆయన ఆధిపత్యముక్రింద ఒక సంఘము నిర్మాణము చేయబడును. అనేక యుగములనుండి ఆయనతో కలిసి పనిచేయుచున్న సోదరుడు—పరమగురువు కూట్‌హూమి మహర్షి ఆ యారవమూల జాతికి బోధిసత్త్వులై ఆమనువుకు తోడుగానుందురు. ఆ సంఘముగురించి 'మానవుడు ఎచటనుండి, ఎట్లు, ఎచటికి' అను గ్రంథములో వ్రాసియుంటిమి. కొన్ని వందల సంవత్సరములనగా మానవుని అనగా ఆత్మయొక్క జీవితములో నిజముగా బహుస్వల్ప కాలమే. ఆ సంఘము కొన్ని వందల సంవత్సరముల తరువాత స్థాపితముకానున్నను, దానికికూడ ప్రయత్నము లిదివరకే ప్రారంభమయినవి. ఈ ప్రయత్నములలో దివ్యజ్ఞానసమాజము చాల గొప్ప పాత్ర వహించుచున్నది.

సమాజముయొక్క ప్రతిలాఙ్ఛియు. ప్రతిసభ్యుడు, తాను సంపాదించిన దివ్యజ్ఞానమును బాహ్యప్రపంచములో వినియోగపరుచునట్లు ప్రోత్సహించుచున్నది. ఇది వరకట్లు చేయకపోయినయెడల, ఇకముందు ప్రోత్సహించి తీరవలెను. అయితే, ప్రతి సభ్యుడును తన శక్తిస్వభావము లనుసరించియును, మనుష్యులతో కలిసి తిరుగునప్పుడు తనకు లభించు అవకాశములనుబట్టియును సేవచేయుచుండవలెను. అదియంతయు ప్రస్తుత జాతికి సహాయకారిగా నుండును. దివ్యజ్ఞాన మందిరములో అనేకరక

ముల మనుష్యులు కలిసి ఒకరికొకరు సహాయముచేసికొనుచు పనిచేయవలెనుగనుక, ఆలాడ్జి తన ఆదర్శములను యథార్థముగా అనుసరించుచున్నయెడల, సభ్యులలో విశాలదృష్టి, ధారాళమగు శీలము వృద్ధియగును. ఏలయన; సోదరభావముగురించి దివ్యజ్ఞాన సమాజలాడ్జిలలో లభించెడు ప్రబోధము ప్రపంచములో నింకెక్కడను లభింపనేరదు. అట్లు పనిచేసిననాడే లాడ్జిలు సార్థకమగును. సాధారణముగా, ప్రపంచములో అనేకములగు సంఘములు ఏదో యొక లక్ష్యమునుగాని, ఆదర్శమునుగాని దృష్టిలోనుంచుకొని పనిచేయును. కాని, ఒక్కొక్కమాదిరి పరిపూర్ణత, ఒక్కొక్క మానవుని గట్టిగా ఆకర్షించినను, మానవ సోదరత్వమను ఆదర్శము సంపూర్ణ విజయము బొందవలెననిన ప్రేమ, సత్యము, సౌందర్యము, మొదలగు అదర్శము లన్నిటిని చేర్చి యీశ్వరునితో మానవుని శాశ్వతముగా బంధింపగల బలమగు త్రాడుగా పేనుటయే మార్గమని దివ్యజ్ఞాన సమాజములోనున్న మనకందరకు తెలియును. ఎంత ప్రశస్తమైనను, ఎంత సార్థకముగా పనిచేయఁగలిగినదైనను, వానిలో ఏయొక్క ఆదర్శముగూడ ప్రత్యేకముగా ఆ మహాకార్యమును నిర్వహింపనేరదు. చిరకాలము క్రిందట హితోపదేశములో చెప్పినట్లు

అల్ప విషయముల్ సంధించి యలఘుకార్య
సాధన మొనరింతురుగదా చతురమతులు;
గరికిపోచల త్రాడుగాగట్టి కాదె
మదగజంబును గట్టును మావటీడు.

నిజమగు దివ్యజ్ఞానికి క్రమేణా అలవడగల సోదరభావముగూడ అంత ప్రబలముగా నుండును. అతనిని తోటిసభ్యునితో కలుపునది అంతరంగిక ప్రోద్బలముగాని బయటనుండివచ్చు బలవంతముగాదు. సమాజములో సభ్యత్వమనగా పరమగురువులచే శిక్షణనుబొందుటయే. ఆశిక్షణనుబొందుటలో అతడు కృతార్థుడయినయెడల, భూలోకములో ఆరవమూలజాతి స్థాపితమయినప్పుడు ఆ సంఘములో జననమొందుటకు యోగ్యుడైయుండును.

— ♦ —

# పన్నెండవ అధ్యాయము

# చోహానులు — రేఖలు

## చోహానులు

వెనుకటి అధ్యాయములో గొప్పపరమగురువుల యొక్క పెక్కువిధములగు కార్యకలాపముల గురించి కొంతవరకు చెప్పుటకు ప్రయత్నించితిని. కాని, అనేకము లింకనుగలవు. కొన్నిటిగురించి మన కేమియు తెలియదు. మనకుగల స్వల్పజ్ఞానమును బట్టి వారికార్యమపారమై వివిధముగనుండుననియు, సిద్ధపురుషులు వారివారి స్వభావములను బట్టియు అభిరుచులనుబట్టియు వేర్వేరువిధములుగా వ్యవహరింతురనియు, తెలియుచున్నది. సమస్తవిషయములలోను సప్తీకరణము—ఏడువిధములుగా విభజనముచేయుట—గనబడుచున్నది. దివ్యసోదరబృందములోగూడ ఇది వ్యక్తమగుచున్నది. దీనినిగురించి యిప్పుడే వివరించెదను. మహీపీఠములో సప్తరేఖలును విస్పష్టముగా ప్రదర్శితమగుచున్నవి. ప్రథమరేఖ—పరిపాలకరేఖ—లోకప్రభువు చేతిలోనున్నది. రెండవరేఖ కధిపతి బుద్ధుడు. ఏకాలమునందే మూలజాతి ప్రపంచములో బలముగానుండునో, ఆ జాతిమనువులోక ప్రభువు క్రిందను, ఆ జాతి బోధిసత్త్వులు అప్పటిబుద్ధుని క్రిందను బనిచేయుచుందురు. వీరిరువురితో సమాన శ్రేణిలో మహాచోహాన్ వారుందురు. తక్కిన అయిదు రేఖలలో ప్రతి రేఖకు ప్రత్యేకముగా నొక అధిపతియున్నను, మహాచోహాన్ వారు ఆ అయిదు రేఖలను పర్యవేక్షణచేయుచుందురు. దీని తరువాత అధ్యాయములో ఈమహీపీఠములోని యున్నతశ్రేణులగురించి నాశక్తికొలది చెప్పెదను. ఈయధ్యాయములో ప్రథమద్వితీయ రేఖలకుచెందిన మోర్య, కూటీహూమిమహర్షుల కార్యము గురించియు, వారితో సమానశ్రేణిలో నున్న మిగతా అయిదు రేఖల అధిపతుల గురించియు వివరించెదను.

ఆరవదీక్షను బొందిన సిద్ధపురుషులను చోహానులందురు. మహీపీఠములో మిక్కిలి నిర్దిష్టమయినట్టియు, ఉత్కృష్ట మయినట్టియు పదవులయందుండి మూడు మొదలు ఏడువరకు రేఖల కధిపతులయియున్న సిద్ధపురుషులకు గూడ చోహాను బిరుదము నుపయోగింతురు. చోహాను అనుశబ్దమునకు ప్రభువు అని అర్థమనియును, ఆపదమును ఒక పదవియందున్నవారి బిరుదుకు చిహ్నముగానేగాక, సామాన్యవాచకముగా గూడ వాడుదురనియును మాకు తెలియవచ్చెను. ఇంగ్లాండులో

"లార్డు"—ప్రభువు—అను పదమును ఆబిరుదముగల వారికేగాక, లార్డు ఛాన్సెలర్, లార్డులెఫ్టినెంటు ఆఫ్ ది కౌంటీ, మొదలగు కొన్నిప్రత్యేక పదవుల నలంకరించువారికి గూడ వాడుదురు. చోహాను అనుపదముకూడ ఇట్లే వాడబడుచున్నది. గుప్తవిద్య అనుగ్రంథములోను, ఇతర గ్రంథములలోను తరుచుగా నుదహరించబడిన ధ్యాన చోహాను అనుమాటలో గూడ ఈ పదముగనబడుచున్నది. ఈబిరుదము గలవారు మహోత్కృష్టమగు పదవులయందుందురు; వారికి మనభూమండలముయొక్క మహీ పీఠముతో ఏమియు సంబంధము లేదు.

## ప ర మ గు రు వు జ్వా ల్ కు ల్ గా రి ప ట్టీ

పరమగురువుల కార్యములోని యీ భాగము నేమాత్రమయిన గ్రహింప వలెననిన, సప్తరేఖలగురించి కొంచెము తెలిసికొనుట అవసరమైయుండును. ఈ విష యము బహుక్లిష్టమైనది. చాలాకాలము క్రిందట యీరేఖలను గురించి మాకు కొంత భోగట్టాచెప్పిరి. అప్పుడు మాకు తెలిసినది మిక్కిలి అసంపూర్ణముగానున్నను, చాలా ఉపయోగకరముగ నుండెను. ఏసందర్భమున మాకది చెప్పబడినదో నాకు బాగుగా జ్ఞాపకమున్నది. కూపరు ఓక్లేగారును, నేనును, మరియొక భారతీయసోదరుడును అడయారులో డాబామీద కూర్చుండి మాట్లాడుకొనుచుంటిమి. అది సమాజము అడయారుకు క్రొత్తగా వచ్చిన కాలము. ఆ రోజులలో ప్రధానకార్యాలయ మందిరమున్ను, దాని వెనుక అడవివలెనున్న యిరువది తొమ్మిది యకరముల భూమిన్ని మాత్రముండెను. మేమట్లు మాట్లాడుకొనుచుండగా, అకస్మాత్తుగా జ్వాల్‌కుల్ మహర్షిగారు మాయెదుట ప్రత్యక్షమయిరి. అప్పటి కాయన కూట్ హూమిమహర్షిగారి ప్రధానశిష్యుడుగా నుండిరి. ఆరోజులలో చాల దయతోను, ఓరిమితోను ఆయన మాకు విశేషముగా బోధచేయుచుండిరి. ఆరోజున ఆయన కూర్చుండి మాతో మాట్లాడుటలో రేఖలగురించిన విషయము ప్రస్తావనమునకు వచ్చెను. కూపరు ఓక్లేగారు వారిమామూలు పద్ధతిని "గురువుగారూ, దయచేసి యీరేఖలగురించి సర్వము మాకు చెప్పెదరా," అని యడిగెను.

ఆయన ఒకసారి రెప్పవాల్చి, "మంచిది; కాని, మీరు మిక్కిలి ఉన్నతమగు యోగదీక్షను బొందువరకు మీకు దీనివిషయమంతయు చెప్పుటకు వీలులేదు. నేనిప్పుడు చెప్పగలిగినది అసంపూర్తిగానుండును. అందుచే దురభిప్రాయములుకూడ

కలుగుట తప్పదు. నేను చెప్పగలదానిని గ్రహించెదరా, లేక, పూర్తిగా తెలిసి కొనుటకు యోగ్యతకలుగువరకు ఆగెదరా ?" అని ప్రశ్నించిరి. ఏమియు లేనిదాని కంటె కొంతయైన లభించిన మంచిదనితలచి మాకు చెప్పగలిగినదానిని చెప్పుమని ఆయనను కోరితిమి. ఆయన చెప్పిన దానిని శ్రద్ధగా వ్రాసికొంటిమి. కాని, దానిలో చాల భాగము మాకు బోధపడలేదు. చివర "ఇంతకంటె నేను మీకు చెప్పలేను, నేను ప్రతిజ్ఞా బద్ధుడనై యున్నాను. మీబుద్ధిశక్తివలన మీరు ఇంతకంటె హెచ్చుగా నేమయిన గ్రహింపగలిగినయెడల అది సరిగానున్నదో లేదో చెప్పెదను," అని ఆయన నుడివిరి. ఆయన చెప్పిన స్వల్పభాగముకూడ మిక్కిలి అమూల్యముగా గనబడెను.

రేఖలను వాని లక్షణములను తెలియచేయు యీ క్రింది చక్రము ఆయన మాకు అప్పుడు చెప్పినదే:

| రేఖ సంఖ్య | రేఖలలక్షణము | రేఖకు సంబంధించిన విశిష్టమైన యోగము | రేఖకు చెందిన కడపటి మతము |
|---|---|---|---|
| 1 | ఫోహాట్ - పెకినా | — — — — — | బ్రాహ్మణ మతము |
| 2 | జ్ఞానము | రాజయోగము (మానవ మనస్సు) | బౌద్ధమతము |
| 3 | ఆకాశము | జ్యోతిషము (ప్రకృతి సిద్ధమగు ఆకర్షణశక్తులు) | ఛాల్డియను మతము |
| 4 | హోరసు పుట్టుక | హఠయోగము (శరీర వికాసము) | ఈ జిప్షియను మతము |
| 5 | అగ్ని | రసవాదము, (భౌతిక పదార్థములు) | జొరాస్ట్రియను మతము |
| 6 | దేవుని అవతారము | భక్తి | క్రైస్తవమతము (కబాలా Etc) |
| 7 | — — — — | సంస్కారములకు సంబంధించిన గుప్తవిద్య. | భూతముల ఆరాధనము. |

ప్రతిరేఖకు ఎదురుగా జూపబడిన మతము ఆరేఖయొక్క పరిపూర్ణ దర్శనమే యని తలచకూడదనియు, ప్రపంచములో ఆరేఖ ప్రబలముగానున్న కాలముయొక్క

శీమముగా భూమిపైన నిలిచియున్నదనియు ఆయనమాకు తెలియపరచిరి. ప్రథమ రేఖకు చెందిన గుప్తవిద్యయు, ఏడవ రేఖయొక్క లక్షణమును ఆయనమాకు చెప్పలేదు. మొదటిది క్రియాశక్తియనియు, రెండవది దేవతాగణములతో సహకార మనియు, నూహింపవచ్చును. "హోరసుపుట్టుక" అనగా అర్ధమేమిటో ఆయన చెప్పలేదు, కాని, నాల్గవ రేఖయొక్క లక్షణములలో నొకటి క్రియా ప్రతిక్రియలశక్తులను, ప్రకృతిలోగల స్త్రీపురుష శక్తులను, ఉపయోగించుటయని తెలిపిరి. లింగార్చనము అనునది యేమతములలో కనబడినను, దానికి కారణము ఈ రేఖకు సంబంధించిన కొన్ని రహస్యముల నపార్ధము చేసికొని, ఆ రహస్యములకు స్థూలరూపమును నారోపించుటయేయని గ్రహించవలెను. ఏడవ రేఖ సరిగ పూర్తిగా వికసించినయెడల ఉత్తమ దేవతలతో సంబంధముగలిగి వారలనుండి ప్రబోధమును బొందుచుందురు. పైనచెప్పినదంతయు జూచినయెడల, మాకు చెప్పినవి బహుస్వల్పమని తెలియగలదు. ఇవి రేఖలవిషయమై సంపూర్ణమగు వివరణము గాకపోవుటయేగాక, పూర్తియగు సంగ్రహముకూడ గానేరదు. ఎందుచేతననగా, మాకిచ్చిన వర్ణనలో చాలా పెద్ద లోపములున్నవనియు, చాల కాలమైన తరువాతగాని వానిని పూర్తిజేయుటకు వీలులేదనియు ఆయన మాకు స్పష్టముగా చెప్పిరి. మాకు తెలిసినంతవరకు ఈవిషయము గురించి వ్రాతమూలమున బహుస్వల్పముగానున్నది. గ్రంథస్థమై యున్నదయినను సుగ్రాహ్యముగాదు. సిద్ధపురుషులను దీనినిగూర్చి ప్రశ్నించినను వారు జవాబు చెప్పుటలో బహు ముక్తసరిగా నుండి మౌనము వహింతురు. *

## సప్తీకరణము

ఆవిష్కరణమయిన ప్రపంచములో జీవమునకు సంబంధించిగాని, ద్రవ్యమునకు సంబంధించిగాని యేదియున్నను, ప్రతిదానిలోను ఒకవిధమగు సప్తగుణవిభాగము - సప్తీకరణముగలదని ముఖ్యముగా తెలిసికొనవలెను. మన ప్రపంచ చక్రములోగల జీవమంతయు ఏదోయొక రేఖకు చెంది ఆరేఖద్వారా పోవుచుండును. ప్రతిరేఖలోను ఏడు ఉపభాగము లుండును. అట్టిభాగములు విశ్వములో నలుబది తొమ్మిది

* ఈగ్రంథము మొదటికూర్పు అచ్చులోనున్నప్పుడు 'సప్తరేఖలు' అని ఎర్నెస్టు వుడ్ గారు ప్రచురించిన గ్రంథము వెలువడినది. అది బహుగొప్ప గ్రంథము. దానిలో ఈవిషయము నూతన దృష్టితో విమర్శింపబడి బహుజ్ఞానదాయకముగానున్నది.

గలవు. ఏడేసి ఉపభాగములు గలిగిన ఏడు మహావిశ్వరేఖలు గలవు. ఆఏడు రేఖలును సప్తమహేశ్వరులనుండిగాని, వారిద్వారాగాని ప్రవహించుచుండును. అయితే మన ప్రపంచచక్రములో, బహుశః మన సౌరకుటుంబములో పైనచెప్పిన యేడింటిలో ఒక మహావిశ్వరేఖమాత్రమే పనిచేయుచున్నది. నేను మొదటచెప్పిన ఏడు రేఖలును ఈరేఖయొక్క ఉపరేఖలైయున్నవి. ఆమహేశ్వరునిచే సృష్టింపబడినది మన సౌర కుటుంబ మొక్కటియే యని యెన్నడును తలంపరాదు. సప్తమహేశ్వరులలో ప్రతి యొకరును కోట్లాది మండలముల కధిపతులై యుండవచ్చును. 'అంతరంగికజీవితము' అను గ్రంథములో నేను తెలియపర్చినట్లు:

"మన సౌరకుటుంబమంతయు దాని యధిపతియగు ఈశ్వరుని ఆవిష్కరణమై యున్నది. దానిలోని ప్రతియణువును నిశ్చయముగా ఆ యీశ్వరుని ఉపాధులలోని భాగమైయున్నది. సౌరకుటుంబములోని పార్థివ-స్థూల-పదార్థమంతయు గలిసి వారి స్థూలశరీరమనదగును, దానిలోని భువర్లోకపదార్థమంతయు వారి కామశరీరమనదగును, అట్లే మానసికలోకపదార్థమంతయు మానసికశరీరమనదగును. అటులనే మిగిలిన వానిని గూడ నూహింపవచ్చును. వారిమండలమునకు పూర్తిగా వెలుపలను ఆవలను గూడ వారు బ్రహ్మాండముగా వ్యాపించి యునికిగలిగి యుందురు. దానినిబట్టి పైన చెప్పిన దంతయు నిజముకాదని అనుకొనగాదు. ఈ సౌరకుటుంబాధిపతియగు ఈశ్వరునిలో ఏడుగురు గ్రహమండలాధిపతు లుందురు. వీరు యీశ్వరునిలోని శక్తి కేంద్రములనవచ్చును. ఈ కేంద్రములద్వారా ఈశ్వరశక్తి ప్రవహించుచుండును. అయినను, ఈశక్తులన్నియు గలిసి యీశ్వరుడగుచున్నాడని యొక భావములో చెప్ప వచ్చును. ఈశ్వరోపాధులని పైనచెప్పిన ద్రవ్యముతోనే వారిలోగల గ్రహాధిదేవతల యుపాధులుగూడ నేర్పడుచున్నవి. ఏలయన, ఆకుటుంబములో నెక్కడనో, ఎవరి లోనో యొకరిలో భాగమై యుండని అణువు యొక్కటిగూడ లేదు. ఈవిషయము ప్రతిలోకమునకు వర్తించును. కాని, భువర్లోకపదార్థము మన ప్రస్తుత విచారణకు సరిపడునంత ద్రవముగానుండుటచేతను. స్థూలపదార్థమునకు సన్నిహితముగానుండి మనము గ్రహించుట కవకాశము ఉండుటచేతను, దానిని ఉదాహరణముగా దీసికొందము.

ఈ సౌరకుటుంబములోగల భువర్లోకద్రవ్యములోని ప్రతియణువును సూర్య మండలేశ్వరుని కామశరీరములోని భాగమైయున్నది. కాని, అది సప్తగ్రహాధిదేవ

తలలో ఎవరోయొకరి కామశరీరములోని భాగముకూడనైయున్నది. మనకామశరీరములలోని ద్రవ్యమంతయుగూడ దానిలోని భాగమైయున్నదని జ్ఞాపకముంచుకొనవలెను. ప్రత్యేకముగా మనకేచెంది మనదైనట్టి పదార్థమేదియునులేదు. ప్రతి కామశరీరములోను సప్తగ్రహాధిదేవతలకు చెందినయణువులుగలవు. కాని వాని నిష్పత్తులు మాత్ర మనంతముగా భేదించును. ఒకగ్రహాధిదేవతనుండి బయలువెడలిన తురీయాత్మల యావత్పరిణామములోను వారుధరించు శరీరములలో ఆ గ్రహాధిదేవతయొక్క అణువులు మిగతావానికంటె అధికముగా నుండును. ఈ విధముగా సప్తరేఖలలో ఎవ రే రేఖకు చెందిరో తెలిసికొనవచ్చును."

## స ప్త చే త న ము లు

క్రైస్తవ పరిభాషలో ఈ సప్తచేతనములకుగల సూచన సువిశేషప్రవక్త యగు సెంటుజాన్‌కు గలిగిన దృశ్యములో గలదు.

" ఆ సింహాసనమునకుముందు ఏడుదీపములు వెలుగుచున్నవి. ఆ యేడును దేవుని ఆత్మలు " అని ఆయన వర్ణించిరి. వారే సప్తమర్మములు (Mystical Seven) గొప్ప గ్రహమండలాధిపతులు, కేవలము ఈశ్వరునిలోని జీవకేంద్రములు. వారే మనరేఖలకధిపతులు—మన ప్రపంచమునకేగాక యావత్ సౌరకుటుంబమండలమునకుగూడ రేఖాధిపతులు. మనమందరము ఆ యేడుగురు మహానుభావులలో నెవరో యొకరిలోనుండి, కొందరొకరిద్వారా మరికొందరు మరియొకరిద్వారా—వచ్చియుండవలెను.

మేడమ్బ్లవట్‌స్కీగారు రచించిన 'గుప్తవిద్య' అను గ్రంథములో సప్త మహాప్రభువులు, ఆదిపురుషసప్తకము, నిర్మాణశక్తులు, అశరీరచేతనములు, ధ్యానచోహానులు, సాన్నిధ్యదేవతలు అని యుదహరింపబడినవారు వీరే. సాన్నిధ్యదేవతలు అను బిరుదు రెండువేర్వేరు అర్థములలో వాడబడినది. పవిత్రయూకరిస్టు యుత్సవమును క్రైస్తవసోదరు లెప్పుడు జరిపినను ఒక సాన్నిధ్యదేవత ప్రత్యక్షమగును. అది నిజముగా క్రైస్తుప్రభువుయొక్క సంకల్పరూపమే; వారిచైతన్యముయొక్క ఉపాధియే; అందుచేత వారిస్వరూపదర్శనమే యనుట సమంజసముగానున్నది. కాని, పైనచెప్పిన మహానుభావులేడుగురును మరియొకకారణముచే సాన్నిధ్యదేవతలను బిరుదమును బడసిరి. వారెల్లప్పుడును కేవలము ఈశ్వరసాన్నిధ్యమందే యుందురు. సప్తరేఖలకు

అధిపతులగుటచే ఆ రేఖలకు ప్రతినిధులుగా అచటనుందురు. వారిలోగల దివ్యజీవము లోని కొంతభాగము మనలో ప్రతివారిలోను నుండును, గనుక మనకందరకు ప్రతి నిధులుగా వారచటనుందురనికూడ చెప్పవచ్చును.

ఎందుచేతననగా, మనలో ప్రతియొకరును ఒక్కొక్క రేఖకు ప్రధానముగా చెందియున్నను, ప్రతివానిలోను తక్కిన రేఖలకు చెందినదికూడ కొంత కొంతయుం డును. ఏ రేఖకు ప్రధానముగా చెందియుందుమో ఆ రేఖను అనంతత్వమునుండి కాలము లోనికి తురీయాత్మరూపమున ప్రవహించిన వాహినియని యనదగును. అద్భుతమగు ఈ మహానుభావులలో ఎవరిలోనో యొకరిలో నిజముగా భాగమైయుండనట్టి శక్తిగాని, ద్రవ్యముగాని, ఒకయణువైనను మనలో నెవ్వరిలోను నుండదు. ఈయేడు గురి ద్రవ్యముతోను ప్రతిమానవుడు నిస్సంశయముగా పూర్తిగానిండియుండును; కాని, వానిలో ఏదోయొకటి ప్రబలముగానుండును. కాబట్టి, యీ మహాతారాధిదేవతలు రవ్వంతైన కదిలినచో, ఆ కదలిక మనలో ప్రతివానిని యేదోయొకవిధముగా బాధిం చకతప్పదు. ఏలయన, మనయెముకలు వారియెముకలలోని భాగము, మనరక్తమాం సములు వారిరక్తమాంసములలోని భాగము, మనలోని యీశ్వరాంశము వారి యంశములోని యంశము, ఈ సంగతే జ్యోతిశ్శాస్త్రమునకు నిజమగు నాధారము, కాని జనులాశాస్త్రమును సరిగాగ్రహింపలేక తరుచుగా పొరబడుచుండుటచే ఆశా స్త్రమునకు అప్రతిష్ఠకలుగుచున్నది.

మనమెల్లప్పుడును ఆ సూర్యనారాయణమూర్తి సమక్షముననే యుందుము. ఎందుచేతననగా, వారి మండలములో వారు లేని తావు లేదు, ఉన్నదంతయు వారి లోని భాగమే. కాని, ఒక విశిష్టమగు భావములో ఈసప్తగ్రహాధిదేవతలు—సప్తచేత నములు—వారిలో భాగము, వారి యావిష్కరణములు, వారి గుణములనదగినవి, వారిలోనుండు శక్తిప్రసారకేంద్రములై యున్నవి. యూదులు వారికిచ్చిన నామ ములు ఈవిశేషమును సూచించును. మొదటిది—మైకేల్ అనగా, 'సీరాజకుమారుడు' ఈనామమునకు దైవబలముఅని యర్థము. 'దేవునివలె బలమైనవాడు' అనికూడ దీనికి అర్థము చెప్పుదురు. హీబ్రూభాషలో 'ఏల్' అనగా దేవుడు అని యర్థము 'బెథేల్' అనగా 'దేవుని గృహము'. బైబిలులోని మొదటి పద్యములో దేవునికి 'ఎలోహిమ్' అనుమాట వాడబడినది. ఏడుగురు ఆత్మల పేర్లలోను చివర 'ఎల్', అను పదము కనబడును. 'గెబ్రియల్' అనగా 'దేవుని సర్వజ్ఞత్వము'; ఒక్కొ

క్కప్పుడాయనను "దైవవీరుడు" అందురు. మైకేల్‌నకు అంగారకునితో సంబంధము న్నట్లుగానే, గేబ్రియల్‌నకు బుధునితో సంబధముగలదు. "రాఫేల్" అనగా "దేవుని రోగనివారణశక్తి" అని యర్థము; ఆయనకు సూర్యునితో సంబంధముకలదు. భూమి పైన గొప్ప ఆరోగ్యదాత సూర్యుడేకదా. "యూరియల్" అనగా "దేవుని జ్యోతి" లేక అగ్ని; "జాడ్కియెల్" అనగా "దేవునికరుణ"; వీనికి బృహస్పతితో సంబంధము గలదు. మిగతావారిని "ఛామ్యుయెల్" "జోఫియల్" అందురు; కాని, ఆమాటల యర్థములు గాని, గ్రహసంబంధములుగాని నాకిప్పుడు జ్ఞాపకమువచ్చుటలేదు.

సెంటుడెనిస్ ఈసప్త ఆత్మలను "నిర్మాతలు" అని, దేవుని సహకారులని పేర్కొనెను. సెంటు ఆగస్టైన్ ఈశ్వరసంకల్పము, లేక, ఆదర్శమూర్తి మంతము వారి యధీనమందున్నదని చెప్పెను. సెంటుథామస్ ఆక్వినస్ కంటికి గోచరమగు సమస్త ఫలితములకు దేవుడు ప్రధానకారణమనియు, ఈదేవతలు రెండవకారణమనియు వ్రాసెను. సర్వము ఈశ్వరునివలననే చేయబడును, కాని యీగ్రహాధిపతులద్వారా చేయబడును. గ్రహములు యాదృచ్ఛికముగా నేర్పబడిన పదార్థసంచయములనియు, శుక్లపటమువంటి రూపరహితము, అస్పష్టమునగు పదార్థమునుండి ఘనీభవించిన వనియు విజ్ఞానశాస్త్రము చెప్పుచున్నది. అంతవరకది నిజమే, కాని ఆయాప్రత్యేక కేంద్రములందు ఎందుకు కూడి ఘనీభవించవలెను? దానికి కారణమేమనగా, గ్రహములన్నియు సమతుల్యముగా నుండునట్లు ఆయాస్థానములను నిర్ణయించు నిర్ణేతలు, ఆధ్యాత్మికజ్ఞానశక్తులు ఒక్కొక్క గ్రహమువెనుక ఒక్కొక్కరు గలరు. వాస్తవ ముగా, ఈప్రపంచములో ఏదియున్నను, అది విశ్వధర్మముల ననుసరించి ప్రకృతి శక్తులు పనిచేయుటవలన గలిగిన ఫలితమైయున్నది. కాని ప్రతిశక్తిని నడిపించెడు ఒక పరిపాలకుడు, ఒక జ్ఞానమూర్తి, గలరని మాత్రము మరువరాదు. పైన చేసిన వివర ణములో నేను క్రైస్తవ పరిభాషను వాడుకచేసితిని, కాని ప్రతిమతములోను వేర్వేరు నామములతో ఆమహానుభావు లుదహరింపబడుట జూడగలము.

## ఏడు విధములగు జీవులు

భవిష్యత్తున "మనము" కావలసియుండిన ఆమూల ప్రకృతి అవ్యక్తము, అవిభక్తమునగు అనంతత్వమునుండి ప్రథమతః ప్రభవించినప్పుడు పెద్దతొట్టిలో నుండి ఏడుమార్గముల ద్వారా ప్రవహించు నీటివలె, ఏడు వేర్వేరు మార్గముల

ద్వారా ప్రవహించెను. గొట్టములలో ఒక్కొక్కదానిలో నొక్కొక్క విధమగు రంగు పదార్థమున్నయెడల తొట్టిలోని నీరు గొట్టములద్వారా ప్రవహించుటలో ఆ యా రంగులను చేర్చుకొని వేర్వేరు రంగులుగల నీరుగా ఎట్లు ప్రవహించునో, అట్లే ఏడుమార్గములద్వారా ప్రవహించు మూలపదార్థముగూడ భిన్నమై వెడలును.ఆత్మ (Elemental Essences) వర్గములలోను, ఖనిజ, వృక్ష, జంతువర్గములలోను ఏడు రేఖలు విశిష్టలక్షణములను గలిగి వేర్వేరుగా నుండును. మానవులలోగూడ అట్లే ఆ రేఖలు భిన్నములై కనిపించును. కాని ఆ రేఖల ప్రభావము దిగువవర్గములలోను, మానవులలోనుగూడ వేరువిధముగా ప్రకటితమగును; కాని దిగువవర్గములలో ప్రకటితమైనపద్ధతికి వేరుపద్ధతిలో మానవులలో ప్రకటితమగును. అది సహజమే. మానవులలోవలె దిగువవర్గములలో వ్యక్తిత్వములేదు గనుక, ఒకజాతి జంతువులన్నియును ఒకే రేఖమీదనుండును. కనుక ప్రపంచములోని వివిధజంతువులన్నిటిని అవిచెందిన రేఖలనుబట్టి యేడువరుసలలో నమర్చవచ్చును. జంతువులు మానవసంపర్కము వలననే వ్యక్తిత్వమునుబొంది మనుష్య వర్గములో ప్రవేశింపగలవు. గనుకఏడు రేఖలలో ప్రతిరేఖయందును అగ్రస్థానమున ఒకజాతి పెంపుడుజంతు వుండును. ఆ రేఖలోని జంతువు లన్నిటికి ఆ విధమగు జంతువుద్వారానే మానవత్వము సిద్ధించగలదు. ఏనుగు, కుక్క, పిల్లి, గుఱ్ఱము, కోతి, వీనిని అటువంటి పెంపుడు జంతువుల కుదాహరణముగా దీసికొనవచ్చును. ఒకకుక్కలో ఇప్పుడు పరిణామము బొందుచున్న విశ్వజీవము ఒకగుఱ్ఱములోగాని, పిల్లిలోగాని, ప్రవేశించి పరిణామము బొందదు. అది కుక్కజాతిలోనే వ్యక్తిత్వము ప్రాప్తించువరకు పరిణామము బొందునని స్పష్టమగుచున్నది.

ఏ యే జంతువులు, ఏ యే ఓషధులు, ఏ యే రేఖలకుచెందునో చెప్పుట కింకను సరియైన పరిశోధనలు చేయబడలేదు. కాని ఖనిజములకు చెందినరత్నముల గూర్చి కొన్ని యేండ్లక్రిందట నేను పరిశోధనచేయగా ప్రతిరేఖకు ఒక్కొక్కమణి, లేక, రత్నము ప్రతినిధిగానున్నదనియు, దానిద్వారానే ఆ రేఖయొక్క శక్తి తక్కినవానిలో కంటె ఎక్కువ శీఘ్రముగా బనిచేయగలదనియు కనిపెట్టితిని. 'సంస్కారశాస్త్రము' అను గ్రంథములో ప్రచురించిన పట్టీని తిరిగి యిచట ప్రచురించెదను. ఈ పట్టీలో ప్రతిరేఖలోను అగ్రస్థానమందున్న రత్నమును, ఆ రేఖకుచెందిన ఇతరరాళ్ళను జూపించితిని. ఆ అగ్రరత్నములోనున్న శక్తియే ఆ రేఖలోని యితరరాళ్లలోగూడ నున్నను, అందులోనున్నంత శక్తివంతముగా మిగతావానిలో ప్రకటితముకాదు.

| రేఖ | అగ్రస్థానమందున్న రత్నము. | ఇతరరాళ్లు |
|---|---|---|
| 1 | వజ్రము | రాతిస్ఫటికము |
| 2 | నీలము | నీలవర్ణముగల ఇతరరాళ్లు |
| 3 | పచ్చ | పచ్చరంగుగల ఇతరరాళ్లు |
| 4 | చంద్రకాంతము, లేక, సూర్యకాంతము | అనేక రంగులుగల రాళ్లు |
| 5 | గోమేధికము | పీతాశ్మ, పుష్యరాగము మొదలగునవి. |
| 6 | కెంపు | ఎరుపురంగుగల ఇతరరాళ్లు |
| 7 | కురువిందము, లేక, పద్మరాగము | ఊదా రంగుగల ఇతరరాళ్లు |

పైన చెప్పినదానినంతనుబట్టి, మానవులలో ఈ యేడుజాతులు ప్రదర్శితమగుచున్నవనియు, మనలో ప్రతివారు ఏదోయొక రేఖకు చెందియుండవలెననియు స్పష్టపడగలదు. మానవజాతిలో ఇట్టిమూలభేదములున్నట్లు సర్వదాగుర్తింపబడియున్నది. ఒక శతాబ్దముక్రిందట, మానవులను వారిస్వభావములనుబట్టి, పిత్త, వాత, శ్లేష్మ, కాంక మొదలగు వేర్వేరు తత్త్వములకు చెందినట్లు విభాగముచేయుట చూతుము. జ్యోతిష్కులు గ్రహములబట్టి బృహస్పతి లక్షణములు, శుక్రలక్షణములు, శనిలక్షణములు, కుజలక్షణములు గలవారని మనలను విభజింతురు. ఇవన్నియు మానవులలోని సహజ లక్షణములను, అనగా, ఏ మార్గముల (రేఖల) ద్వారా వచ్చితిమో లేక, ఏ మార్గములద్వారా రావలెనని శాసింపబడినదో, ఆ మార్గములలో గలభేదములచే నేర్పడిన లక్షణములను తెలియజేసెడు భిన్నపద్ధతులని ;నా అభిప్రాయము.

సామాన్య మానవుడు ఏ రేఖకుచెందినది కనుగొనుట సులభసాధ్యమని యెన్నడును తలంచరాదు. ఎందుచేతననగా, మానవుడు స్థూలద్రవ్యములో విశేషముగా చిక్కుకొనిపోయి, అనేక విధములగు కర్మను చేయుచున్నాడు. ఆ కర్మలో

కొంతభాగము ప్రబలమై అతని సహజలక్షణములను మఱుగుపరచవచ్చును. పూర్తిగా ఒకజన్మ అంతయు అట్లుండవచ్చును. కాని మోక్షమార్గమును చేరనున్న మనుష్యునిలో ఒకనిర్దిష్టమగు పేరక ప్రవృత్తి, లేక, నడిపింపగలశక్తి కనిపించవలెను. అతడేరేఖకు చెందియున్నాడో, అతని శక్తులకుకూడ ఆ రేఖాలక్షణములు ఉండును. కనుక ఆరేఖకు సంబంధించిన సేవాకార్యములవైపునకే అతడు పోజూచును; మరియు ఆరేఖకుసంబంధించిన పరమగురువు పాదసన్నిధికతడుచేరును; ఆరేఖాధిపతియైన చోహాన్ యొక్క ఆధిపత్యములోనున్న (ఆయన ప్రధానాచార్యుడనదగిన) కళాశాలలో చేరినవాడగును.

## సంస్కారోపేతమగుగుప్తవిద్య – (మేజిక్):

## చికిత్సలు.

పైన తెలియపరచిన పట్టీనిబట్టి వేర్వేరు రేఖలకు చెందిన మనుష్యులు ఒక నిర్దిష్టమగు ఫలితమును బొందుటకై మేజిక్‌ను ఉపయోగపరచదలచినయెడల ఎట్టి పద్ధతుల నవలంబించవచ్చునో తెలిసికొనుటకుగాను ఒకటిరెండు ఉదాహరణముల నిచ్చినయెడల ఈ రేఖలలోని భేదములనుగూడ కొంతవరకు గ్రహింపగలరు. ప్రథమరేఖకుచెందిన మనుష్యుడు ఏవిధమగుసాధనమునుగూడ నుపయోగింపక కేవలము అనివార్యమగు తన యిచ్ఛాశక్తివలననే ఫలితమును సాధించును. రెండవరేఖకుచెందిన యెడల, తన ఇచ్ఛాశక్తిని ఉపయోగపరచుటయేగాక, కార్యసాధనకై వలయుపద్ధతులనన్నిటిని సంపూర్ణముగా గ్రహించి, యే మార్గము వెంట తనశక్తిని ప్రసరింపజేసిన మిక్కిలి ప్రయోజనకరముగానుండునో ఆ మార్గమున తనశక్తినివినియోగించి పనిచేయును. మూడవరేఖకు చెందినమనిషి సహజముగా మానసికశక్తుల నుపయోగించును. కాని, యే సమయమున నందేమిచేసిన తనకుసంపూర్ణమగు ఫలితముకలుగగలదో బహుజాగ్రతగా గమనించి పనిచేయును. నాల్గవరేఖకుచెందినవాడు భూలోకపు ఆకాశీయపదార్థము (Ether) యొక్క సూక్ష్మతరశక్తుల నుపయోగించును; అయిదవ రేఖకుచెందిన సోదరుడు భువర్లోకపు వెలుగు అనబడెడుశక్తి ప్రవాహములను ప్రసరింపచేయును. ఆరవరేఖ నుపాసించువాడు తనయిష్టదేవతయందు సంపూర్ణవిశ్వాసముంచి, వారినిగాఢమగు భక్తితో ప్రార్థించి, కార్యమును సాధించును. ఏడవరేఖకుచెందినవాడు విశేషముగా తాంత్రికసంస్కారముల నుపయోగించి,

బహుళః దేవతాగణముల సహాయముకొరకాహ్వానముగూడ చేయుచు, కృతార్థుడగుటకు ప్రయత్నించును.

మరియు,రోగమునకు చికిత్సజేయ ప్రయత్నించినయెడల,ప్రథమరేఖకుచెందిన మనిషి ఆ విశ్వజీవమునుండి ఆరోగ్యమును, బలమును గ్రహించియుపయోగించును. రెండవరేఖవారు వ్యాధియొక్క స్వభావమును బూర్తిగాగ్రహించి మిక్కిలి ప్రయోజనకరముగానుండునట్లు సూటిగా తనయిచ్ఛాశక్తిని వినియోగించును. మూడవ రేఖవారు ఆ మహాగ్రహాధిదేవత నాహ్వానముచేసి జ్యోతిశ్శాస్త్రానుసారముగా మంచిసమయమున తనచికిత్సలనుజేయును. నాల్గవరేఖవారు అంగమర్దనము మొదలగు స్థూలసాధనములను వినియోగించును. అయిదవ తరగతివారు ఔషధములను వాడుకచేయుదురు. ఆరవ తరగతివారు విశ్వాసము, లేక, నమ్మికను ప్రధానముగా జేసికొందురు.ఏడవరేఖవారు మంత్రములను, తాంత్రికసంస్కారములను ఉపయోగించెదరు. చికిత్సచేయఃబూనువారు తనయిష్టమువచ్చిన విధానము ననుసరించవచ్చును గాని, వారిరేఖకు అనుగుణ్యమగు విధానము మిక్కిలి ప్రయోజనకరముగా గనిపించవచ్చును.

## రే ఖా ధి ప తు ల గు చో హా ను లు

ఇతరులలోకంటె సిద్ధపురుషుల సోదరబృందమునకు చెందినవారిలో ఈరేఖా విభేదములు ఎక్కువస్పష్టముగా గనిపించును. వారల తేజోమండలములలో అవి నిర్దిష్టముగా ప్రకటితమగును. సిద్ధపురుషుడు ఏరేఖకు చెందునో దానిలక్షణము వారి ఆకృతిలోనేగాక,వారుచేయవలసిన కార్యములోగూడ నిస్సంశయముగా గనిపించును. మూడు మొదలు ఏడు రేఖలకధిపతులగు చోహానుల కార్యమును, వారితోసమాన అంతరువునందుండి మొదటి రెండు రేఖలకు చెందినయిరువురు చోహానులయొక్క కార్యమును జాగ్రతగా పరిశీలనజేసినయెడల, ఈ రేఖలవిశిష్టలక్షణములను సంపూర్ణముగా తెలిసికొనగలము. మహీపీఠములోని యీ రేఖాధిపతులు ఏడుగురిలోను "సింహాసనము సన్నిధినుండు సప్త ఆత్మల" ప్రతిబింబములను జూడగలము.

ఇచట మేము ప్రతిరేఖకు సంబంధించిన గుణములను గురించియు, ఆరేఖాధిపతి చేయుకార్యమునుగురించియుగూడ అతిసంగ్రహముగా మాత్రము చెప్పగలమని జ్ఞాపకముంచుకొనవలెను. మరియు, ఒక రేఖకుసంబంధించిన గుణములు పూర్తిగా

నున్నచోట మిగతారేఖలకు చెందినగుణములేమియులేవని భావించరాదనికూడ శ్రద్ధగా గమనించవలెను. ఉదాహరణమునకు, ఒక సిద్ధపురుషునికి బలముమిక్కిలి ప్రముఖముగానున్నదని చెప్పినప్పుడు, భక్తి, ప్రేమ మొదలగు గుణములన్నిటి లోనుగూడ మానవుడు పొందవలసిన పరిపూర్ణతను ఆయన పొందియుండుట నిశ్చయము.

చోహాను దీక్షపొందినవారిలో ప్రథమరేఖకు ప్రతినిధి గానున్న మోర్య మహర్షి గారినిగూర్చి యిదివరలో కొంతవరకు వ్రాసియుంటిని. ఆరేఖకు సహజము, అచంచలము, గంభీరమునగు బలము ఆయనలో వ్యక్తమగుచుండును. ఆయన మానవులను నడిపించుటలోను, జాతులను నిర్మించుటలోను విశేషముగా పనిచేయు చుందురు. ఆవిషయముగురించి ముందు అధ్యాయములో వివరించెదను. మనము జ్యూపిటరు అని వ్యవహరించుచున్న పరమగురువు—అగస్త్యమహర్షి —కూడ ప్రథమ రేఖకు చెందినవారే. మహీపీఠము తరపున భారతదేశమునకు సంరక్షకులుగా నున్నారు. అయిదవ మూలజాతియొక్క దీర్ఘజీవితకాలములో దాని యావదభ్యు దయముయొక్క బీజములను తన గర్భమున ధరించి, కాలానుసారముగ ప్రతి యుప జాతికి అవసరమగు బీజములనిచ్చుచు, అవి యచట పెరిగి పక్వమునొంది ఫలవంత ములగుటను గాంచుచుండెడు భారతజాతికి ఆయన సంరక్షకులుగానున్నారు. మరియు, అగోచరమగు గుప్తవిద్యలనన్నిటిని ఆయన అతి గాఢముగా పరిశీలన చేయుచుందురు. రసాయనశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము అను రెండును ఆగుప్తశాస్త్రములయొక్క పైమెంకులువంటివి. ఈశాస్త్రముల విషయమై ఆయనచేయు పరిశ్రమలవలన ఒక రేఖలోనే యెన్నివిధములగు కార్యములను చేయవచ్చునో తెలియగలదు.

మన పరమగురువు కూట్‌హూమిమహర్షి పూర్వము గ్రీసుదేశములో 'పైథా గొరాస్' అను సుప్రసిద్ధులైన అధ్యాపకులైయుండిరి. ఆయన కూడ చోహాను పదవినిపొందినవారే. ఆయంతరువునందు ఆయన ద్వితీయరేఖకు ప్రతిధులుగా నుందురు. ఇది జ్ఞానరేఖ, ప్రపంచమునకు గొప్ప ఆచార్యుల నిచ్చును. ఈరేఖకు చెందిన కార్యముముందు అధ్యాయములో బోధిసత్త్వులను, బుద్ధులనుగూర్చి చెప్పు నప్పుడు బాగుగ బోధపడగలదు. ఆయనను అనుసరించి జీవింపగల మహాభాగ్యమును, అనిర్వచనీయమగు ఆనందమును నాకు లభించినవి. ఆపరమగురువు ముఖారవిందము నుండి ఎట్టి యద్భుతమగు ప్రేమ, జ్ఞానము ప్రసరించుచుండునో యిదివరలో చెప్పి

యుంటెని. శిష్యులకియ్యబడు ప్రబోధముగురించియు, శిక్షణగూర్చియు నేనిదివరలో చెప్పినదంతయు ప్రత్యేకముగా ఆయన విధానమునే తెలియచేయును. ఇతర రేఖలకు చెందిన పరమగురువులుకూడ వారి శిష్యులను సరిగా ఆస్థితికే తీసికొనివత్తురు; సరిగా ఆయుత్తమగుణములనే వికసింపజేయుదురు. వారి పద్ధతు లెల్లప్పుడు పరమపవిత్రములై, నిర్దుష్టములైయుండును. కాని, ఆపద్ధతులలో స్పష్టముగా భేదములు కనిపించుచుండును. వాస్తవముగా, వేర్వేరు శిష్యులయెడల ఒకేపరమగురువు అవలంబించు పద్ధతులలోనే భేదములుండును.

వెనీషియను చోహాన్ అను మహాపరమగురువు మూడవ రేఖ కధిపతియైయున్నారు. ఈమూడవ రేఖకుచెందినట్టియు, సేవాపరాయణులైనట్టియు పురుషులలో మిక్కిలి ప్రబలముగా గనిపించెడు లక్షణమేమనగా, ఎట్టి పరిస్థితులలోనైనను ఎట్టి మనుష్యులతోనైనను సామరస్యముతో పనిచేయగలుగుట.దాని ప్రభావముచే వారు అందరితోను మిక్కిలి అనుగుణ్యముగా పనిచేయగలిగి అందరకు ఇష్టులై, ఎక్కువ ప్రయోజనకరముగా సహాయపడగలుగుదురు. సెంటుపాల్ చెప్పినట్లు "అందరకు అన్నియు" కాగలుగుదురు. ఈరేఖలో బాగుగా పురోవృద్ధిగాంచినవారికి గొప్ప ఉపాయము, నేర్పు, యుక్తకాలమందు యుక్తమయినదానిని చేయగలిగెడు అసామాన్యమగు శక్తి యొప్పుచుండును. జ్యోతిష మీరేఖకు సంబంధించినదే. ఏలయన, అన్యులు గ్రహింప గలిగినంతవరకు, ఈశాస్త్రము దెలిసినవారు ఏకార్యమును జేయుట కెప్పుడు ఉత్తమమయిన సమయమో, ఏశక్తుల నెప్పుడు చలనములో బెట్టిన శ్రేష్ఠముగా నుండునో, ఏకాలమునందేకార్యము చేయదగినదో, మొదలగు విషయములనన్నిటిని బాగుగా పరిశీలించి తెలిసికొని, విశేషశ్రమను తగ్గించుకొని యెక్కువ ఉపయోగకరముగా నుందురు.

నాల్గవ రేఖకధిపతి పరమగురువు సెరాపిస్ అయియున్నారు.దివ్యజ్ఞానసమాజము యొక్క తొలిదినములలో ఆయననుగురించి విశేషముగా వినుచుండెడువారము.ఎందుచేతననగా, కల్నల్ ఆల్కాటుగారి గురువగు మోర్యమహర్షి గారు ఇతరకార్యములలో నిమగ్నులైయుండుటచే,కొంతకాలము ఆల్కాటుగారు సెరాపిస్‌మహర్షి గారి శిక్షణలో నుండిరి. ఆప్రకారము పరమగురువులు తాత్కాలికమగు, ప్రత్యేక అవసరముల కొరకు శిష్యులను తరుచుగా మార్చుకొనుచుందురు. ఈరేఖయొక్క ప్రత్యేకలక్షణములు సౌందర్యము, సామరస్యము అయియుండుటచేత, ఈరేఖకుచెందినవారెచ

టనున్నను, వారి పరిసరములలో సామరస్యమును నెలకొల్పుచుందురు. అట్లు చేయు వరకు వారికి సంతుష్టికలుగదు. ఈ రేఖలో కళకు ప్రాధాన్యముగలదు; చాలమంది కళాభిజ్ఞులు ఈ రేఖకు చెందినవారే అయి యుందురు.

పరమగురువు హైలేరియను అయిదవ రేఖాధిపతియై యున్నారు. ఆయనలోగల అద్భుతమగు లక్షణము శాస్త్రసమ్మతమగు శుద్ధత. ఆయన పూర్వ మొక జన్మలో గ్రీసుదేశములో పుట్టి 'అయాంబ్లికస్' అను నామమును స్వీకరించి, 'నియోప్లేటానిక్' తత్త్వదర్శనము ననుసరించి యుండిరి. మేబెల్ కాల్లిన్సు అను నామెద్వారా ఈయన మనకు మోక్షమార్గప్రదీపిక - (The Light on the Path), "శ్వేతపంకజ గీతము" (The Idyll of the White Lotus) అను గ్రంధములను ప్రసాదించిరి. మన అధ్యక్షులు చెప్పినట్లు, ఆయన ఆంగ్లేయభాషలో కావ్యమువంటి రచనము వ్రాయుటలోను మధురభాషణములోను అందెవేసిన చతురులై యున్నారు. ప్రపంచములోని సుప్రసిద్ధులగు విజ్ఞానశాస్త్రవేత్తలలో ఎక్కువమంది పైన ఆయన ప్రభావము ప్రసరించుచుండును. ఆయన రేఖలో బాగుగా అభివృద్ధిబొందినవారు శుద్ధతను, విజ్ఞానశాస్త్రపరిశోధనలనుజేయుటలో ప్రశస్తిని బొందుటచే, శాస్త్రపరిశోధన సంబంధించినంతవరకు వారు పూర్తిగా విశ్వసనీయులై యుందురు. ఆపరమగురువునకు తెలిసిన విజ్ఞానశాస్త్రము సామాన్యముగా మనము ఆపేరుతో చెప్పుకొనుదాని కంటె విశేషముగా విస్తరించియుండును. మానవజీవితమునకు సంబంధించిన అనేక ప్రకృతిశక్తులను ఆయన బాగుగా నెరిగినవారై వాని నుపయోగించుచుందురు.

ప్రకృతి మానవుల మానసికప్రవృత్తులనన్నిటిని గుర్తించి అనేకవిధములుగా వానిని బలపరచుచుండును. ఒక మనిషి సుఖముగా, సంతోషముగానున్న యెడల, ఇతరజంతువులు వానిని జూచి ఆనందించును. క్షుద్రదేవతాగణములన్నియు సంతోషముతో వానిని చేరును; అందుచే, అతని సుఖము హెచ్చును. ఈమాదిరి ప్రతిక్రియ ప్రతిచోటను జరుగుచుండును. యూరపుదేశములో ఉత్తరభాగమందు క్షుద్ర దేవతాగణములు కొంతవరకు యోచనచేయుచున్నట్లును, తరుచు విచారముతో ఆత్మపరిశీలనముచేసికొనుచున్నట్లును గనబడుచుండును. అట్టి దేవతాగణములు స్కాట్లండు, ఐర్లండు, వేల్సు, బ్రిటన్నీ, మొదలగు ప్రదేశములలో విస్తారముగా తిరుగుచుండును. సంతోషమున కంత త్వరితముగా వారియొద్దనుండి జవాబు రాదు. అచటి ప్రజలలోగూడ సంతోషముగాని, ఉత్సాహముగాని అంతగా కనిపించదు.

ఆ దేశములలో ప్రకృతి తక్కువసంతోషకరముగానుండును. వర్షములు విస్తారముగా కురియును, ఆకాశ మెల్లప్పుడును మేఘావృతమై యుండును, భూమి యంతయు బూడిదరంగుతోగూడిన పచ్చనిరంగులో నుండును. అచట జీవనము, కవిత్వము రెండునుగూడ నిరుత్సాహకరములై భావగర్భితముగానుండును.

ఆ దేశములను, గ్రీసు,సిసిలీ మొదలగు దేశములతో బోల్చినయెడల దారుణ మగు వ్యత్యాసము గనిపించును. గ్రీసు, సిసిలీ దేశములలో సర్వము బంగరు,నీలము, ఎరుపు కాంతులతో ప్రకాశించుచుండును. అచటిజనులు మిక్కిలిసంతోషముతోను ఆనందముతోను గనిపింతురు. ప్రకృతిలోని జీవులన్నియు మానవుని ఆనందములో వాస్తవముగా నోలలాడుచుండును; మానవులు సంతోషము, ప్రేమ, ఉత్సాహము గలిగియున్నయెడల అవివారిచుట్టును జేరును, వారితేజోమండలములలోనుండి ఆనం దించును; అట్టివారిని విశేషగౌరవాభిమానములతో జూచును. ఈ కాలమునందు భూలోకమునకు సంబంధించిన జ్ఞానము సవివరముగా వ్యాప్తిచెందినను, ఈ దేవతా గణములకు సంబంధించిన భాగమంతయు పూర్తిగా వదిలివేయబడినది. రెండుపాళ్లు ఉదజని, ఒకపాలు ప్రాణవాయువుకలిసి నీరగుచున్నదని మనకుతెలుసును. ప్రాచీన భారతీయులకును, ప్రాచీన గ్రీసు దేశస్థులకును ఆవివరములు తెలియకపోవచ్చును; కాని, జలమునకు సంబంధించిన పలురకముల దేవతలను వారుగుర్తించిరి. మనము వర్తమానమున విద్యుచ్ఛక్తిని, నీటి ఆవిరిశక్తిని, తెలిసికొని యెన్నివిధములుగా యంత్రములను నడిపించుట కుపయోగించుచుంటిమో, అట్లే పూర్వు లాజలదేవతల సహాయమునుగూడ అంతర్నిర్దిష్టముగా నుపయోగించుకొనుచుండిరి.

ఆరవరేఖాధిపతి పరమగురువు జీసస అయియున్నారు. తియానాలో 'అప్పో ల్లోనియస్' గా జన్మించినజన్మలో వారుసిద్ధపురుషులయిరి. తరువాత, ఆయన దక్షిణ భారతదేశములో సుప్రసిద్ధ మతాచార్యులయిన శ్రీరామానుజాచార్యులుగా నవత రించిరి. ఈ యారవరేఖకు భక్తిముఖ్యలక్షణమైయున్నది. ఏమతమునకు చెందిన వారైనను భక్తులు, భక్తిపారవశ్యముచే తన్మయులగువారు, ఈరేఖకు చెందినవారే అయియుందురు. ఏవిధముగా ఈశ్వరుని ఆరాధించినను, అట్టివారలనందరను జీసస మహర్షి కనిపెట్టి సంరక్షించుచుందురు. సోదరబృందమువారు పందొమ్మిదివందల సంవత్సరములక్రిందటి తియానా నివాసుడగు అప్పోల్లోనియస్‌ను అనేక దేశములలో కొన్నిశక్తియుతములగు పవిత్రకేంద్రములను స్థాపించుటకై బంపిరి. తా మెత్తులు,

లేక, రక్షలువంటిపదార్థములను ఆయనకిచ్చి వానిని ఆ యాక్షేత్రములలో భూస్థాపితము చేయవలసినదని ఆయన నా దేశించిరి. ఆ రక్షలనుండి ప్రభవించెడుశక్తుల వలన, ఆస్థలములు భవిష్యత్తున గొప్పశక్తి కేంద్రములగునట్లు సిద్ధముచేయుటయే దీని యుద్దేశము. ఈ క్షేత్రములలో కొన్ని యుపయోగములోనికి వచ్చి యున్నవి; కొన్ని యింకనురాలేదు; కొద్దికాలములో అవతరింపబోవు జగద్గురువు చేయుపని కొరకు వీనినన్నిటిని వినియోగపరచెదరు.కనుక, రాబోవుజగద్గురువుయొక్క కార్యము రెండువేల సంవత్సరముల క్రితమే నిర్దిష్టముగా, సవివరముగా నిర్ణయింపబడి, అందు కొరకై ఈ భూలోకములోసహితము ఏర్పాట్లు చేయబడెను.

ఏడవరేఖ కధిపతులు పరమగురువు కౌంటు, డి. సెంటు జెర్మేన్. ఆయనను తరుచుగా రకోక్జిమహర్షి యని పిలచెదరు. పదునెనిమిదవ శతాబ్దములో ఆయన యొక ప్రసిద్ధపురుషుడైయుండెను. ఆయన ఒక రాజవంశమునకు చెందినవాడై, ఆ వంశములో ఆఖరు పురుషుడైయుండెను. పదునేడవ శతాబ్దములో ఆయన వెర్యులమ్ ప్రభువు అను బిరుదుగల ఫ్రాన్సిసు బేకన్‌గాను, పదునారవ శతాబ్దములో 'రాబర్టస్' అను సన్యాసిగాను, పదునైదవ శతాబ్దములో 'హన్యాడిజేనోస్' గాను, పదునాల్గవ శతాబ్దములో క్రిస్టియను రోసెన్ క్రూజ్‌గాను, పదమూడవ శతాబ్దములో రోజరు బేకన్‌గాను జన్మలనెత్తెను. 'గుప్తప్రపంచము'_The Occult World అను గ్రంథములో ఆయనను హంగేరియన్ అడెప్టు అని వ్యవహరించిరి. ఇంకను పూర్వకాలములో నియోప్లాటానిక్ సంప్రదాయమునకు చెందిన ప్రోక్లస్‌గాను, అంతకుపూర్వము సెంటు ఆల్బన్‌గాను జన్మించెను. ఆయన చాలవరకు సంస్కారోపేతమగు గుప్తవిద్య నుపయోగించి గొప్పదేవతల నాహ్వానముచేసి వారిచే పని చేయింతురు. దేవతలందరు ఆపరమపురుషునకు అతివిధేయులై, ఆయన నియమించిన పనిని మిక్కిలి సంతోషముతో చేయుదురు. యూరోపియను భాషలన్నిటిని, అనేక ప్రాచ్యదేశ భాషలను ఆయన బాగుగ మాట్లాడగలరు.కాని, సాధారణముగా,ఆయన లాటిను భాషలోనే వ్యవహరింతురు. ఆయన ఆలోచనలను వెల్లడిచేయుటకు లాటిను భాషనే ప్రత్యేకముగా నుపయోగింతురు. మరియు, ఉన్నతలోకములో లాటిన్‌భాష యొక్క వైభవము, సాత్వికము, ఈభూలోకములో మనకు తెలిసినదానినంతను అతిశయించి శోభిల్లుచుండును. ఆపరమగురువు అధ్వర్యము వహించి వివిధములగు సంస్కారములను జరుపునపుడు పెక్కురంగులుగల అద్భుతమగు దుస్తులను,మణిమయ

చిహ్నములను ధరింతురు. ఆయనకుపూర్వమొక రోమనుచక్రవర్తికిచెందిన బంగారు తీగతో అల్లిన కవచమొకటికలదు. ఆయన దానిపైన దివ్యమగు ఎఱ్ఱని బనాతు అంగీని ధరింతురు. వజ్రములతోను కెంపులతోను చెక్కబడిన సప్తకోణతార మెఱయు చుండెడు కొక్కెముతో ఆ యంగీని బిగింతురు. ఆయన ఒక్కొక్కప్పుడు ఉదారంగు గల అతిరమ్యమగు దుస్తులను ధరింతురు. ఆయన ఆప్రాకారము సంస్కారములతో విస్తారము సంబంధముగలిగియుండి, ఇప్పుడు ప్రపంచమునకు నామములుకూడ తెలియని పురాతన రహస్య సంప్రదాయములకు సంబంధించిన సంస్కారములను జరుపుచుందురు; అయినను, యూరపుదేశముయొక్క ప్రస్తుత రాజకీయపరిస్థితుల లోను, ఆధునిక భౌతిక విజ్ఞానశాస్త్రముయొక్క పురోవృద్ధిలోను గొప్ప అభిమాన మును శ్రద్ధనుజూపించుచుందురు.

## కావలసిన గుణసంపత్తు

చోహానుయొక్కయు, వారి శేఖులయొక్కయు లక్షణములగూర్చియు, ఆయా శేఖులద్వారా పనిచేయదలచినవారు మనస్సున నిలుపుకొనవలసిన భావమును గూర్చియు సంస్కారశాస్త్రము — The Science of the Sacraments — అను గ్రంధములో నేను వ్రాసినదానిని సంగ్రహముగా ఇచట తెలియపరచెదను :

1. బలము — " నేను బలముతో, ధైర్యముతో, పట్టుదలతో వారిసేవ జేసెదను. "

2. జ్ఞానము :— " పరిపూర్ణ ప్రేమవలన మాత్రమే వికసింపజేసికొన దగిన బుద్ధిని నేను సంపాదించెదను. "

3. ఎట్టిపరిస్థితులలోనైనను సమరసముతో మెలగగలుగుట, లేక, నేర్పు:—"ఏ క్షణమందు ఏమిచెప్పవలెనో, ఏమిచేయవలెనో సరిగా దానిని చెప్పగలుగునట్టియు, చేయగలుగునట్టియు, శక్తిని సంపాదించు టకు ప్రయత్నించెదను; మరియు ప్రతివానికి మిక్కిలి సార్థక ముగా సహాయపడుటకు వాని మనస్తత్త్వమును దెలిసికొని అందుకనుగుణ్యముగా ప్రవర్తించెదను.

4. సౌందర్యము, సమరసత:— " నాకు సాధ్యమైనంతవరకు నాజీవితములోను, నాచుట్టుప్రక్కలను సౌందర్యమును, సమరసతను ప్రదర్శింప

చేసెదను. నాపరమగురువులకు యోగ్యముగా నుండునట్లు చేసెదను; ఆయనను శీఘ్రతరముగా సేవింపగలుగుటకు ప్రకృతిలో నెల్లడను సౌందర్యమును గనుటకు ప్రయత్నించెదను. ”

5. శాస్త్రము – (వివరములతో గూడిన జ్ఞానము) :– “ నేను జ్ఞానమును, శుద్ధతను, సంపాదించి వారిసేవకై వినియోగపరచెదను. ”

6. భక్తి :– “ నేను అసమానమగు భక్తివలన గలిగెడు శక్తిని నాలో వికసింపజేసికొని, దానిద్వారా ఇతరులను గురుచరణారవిందములకు గొనిపోయెదను. ”

7. నియమితమైనసేవ:– “ ఈశ్వరుని సన్నిధానమందుండు పవిత్రదేవతలు సర్వదా సంసిద్ధులై దయతో ప్రసాదించెడు సహాయము నంతను గైకొని, సార్థకముగా వినియోగించుటకు అనువుగా నుండునట్లు ఈశ్వరుడు ఆదేశించిన మార్గముల ననుసరించి, నేను చేసెడు సేవను నియమించి యేర్పాటుచేసికొందును. ”

ఈగుణములన్నియు మనలో ప్రతివారిలోను సకాలములో వికసింపవలసియుండును; కాని, మనము పరిపాకమునొంది అతి మానవులయినప్పుడే యీగుణములన్నియు మనలో పరిపూర్ణముగా వికసించును. ప్రస్తుతకాలమందు, మనలో ఒక్కొక్కగుణముమాత్రము మిగతా గుణములకంటె విశేషముగా అభివృద్ధిబొందుటలోనే మనలోపము ప్రత్యక్షముగా గనిపించుచున్నది. కొందరిలో శాస్త్రానుసారమగు శుద్ధత, విచక్షణశక్తి బాగుగా అభివృద్ధిగాంచును, కాని, వారిలో ప్రేమ, భక్తి బాగుగా వికసింపకపోవుటచే వారి స్వభావము కఠినముగాను, నిరుత్సాహకరముగాను నుండును. వారు తరుచు నిర్దయులవలె గనిపింతురు; తోటి మానవులయెడల దురభిప్రాయములు గలిగి అనుమానించుచుందురు. ఏవిషయమునైన తీర్మానించవలసివచ్చినను, ఒక సమస్యను తెలివిని వినియోగించి పరిష్కరించవలసియున్నను, వారు తరుచు తీవ్రముగా విమర్శచేయుదురు. వారి తీర్పు సాధారణముగా వారిమాటకు కొంచెమెదురు చెప్పినవారికి వ్యతిరేకముగా నుండునుగాని, అనుకూలముగా నుండదు. సహజముగా ప్రేమ, భక్తిగలిగినవారు ఇతరుల అభిప్రాయములను సానుభూతితో జూచి వారి తప్పులను తీవ్రముగా ఖండింపక దయను, జాలినిజూపి అనుకూల

ముగా తీర్మానింపజాలరు. మిక్కిలి దయాళువులగుటచే వారి తీర్పు న్యాయపక్షమునుండకతప్పినను, అది కరుణతోగూడినదై యుండును. పైరెండు తరగతుల మనుష్యులుగూడ సరియగు న్యాయముచేయుటలేదు. వారి న్యాయబుద్ధి వారి సహజ స్వాభావిక లక్షణములకు లోబడిపోవును. సిద్ధపురుషుడు పరిపూర్ణ సమతుల్యతగలవాడు గనుక మనలో కాలక్రమమున, ఇట్టి హెచ్చుతగ్గులు లేకుండ, అన్నిగుణములు సమతుల్యముగానుండునట్లు సరిచూచుకొనవలసియున్నది. భగవద్గీతలో చెప్పినట్లు " సమత్వం యోగ ఉచ్యతే " – సమత్వమే యోగము.

## కాలచక్రపరిభ్రమణము ననుసరించ గలిగెడు మార్పులు

గ్రహాధిదేవతలు ఏడుగురులోను కొంతనియమిత కాలముగడచినపుడెల్ల కొన్నిమార్పులు కలుగుచుండును. ఈ మార్పులను ఉచ్ఛ్వాసనిశ్వాసములతోగాని, గుండెలు కొట్టుకొనుటతోగాని పోల్చవచ్చును. అదియెట్లున్నను, ఆ మార్పులు అనంతములుగానున్నట్లున్నవి. వారికామశరీరములలోని పదార్థముతోనే మనకామశరీరములుకూడ నిర్మింపబడియుండుటచేత, ఆ గ్రహాధిపతుల కామశరీరములలో ఎట్టి మార్పు కలిగినను ప్రపంచములోని ప్రతిమానవుని కామశరీరములోగూడ మార్పు కలిగితీరవలెను. ఆ గ్రహాధిదేవతకు సంబంధించిన ద్రవ్యమెవ్వరిలో ఎక్కువ ప్రధానముగానుండునో వారిలో ఆ మార్పుగూడ ఎక్కువస్ఫుటముగా వ్యక్తమగును. భువర్లోకము నుదాహరణముగా మాత్రమేతీసికొన్నట్లు జ్ఞాపకముంచుకొని మిగతా లోకములలోగూడ అదేవిధముగా జరుగునని గుర్తించినయెడల, గ్రహాధిదేవతల భావములును రాగములును మనకెంత ముఖ్యమైయున్నవో కొంతవరకు బోధపడును.

వీని స్వభావమెట్లున్నను, మానవజాతుల దీర్ఘచరిత్రలో ఈ మార్పులు స్పష్టముగా గనిపించుచున్నవి.మానవుల స్వభావములలోను, వారినాగరికతయొక్క లక్షణములలోను కొంత నియమితకాలమున కొక్కొక్కసారి తప్పక కనిపించుచున్నవి. ప్రపంచముల ఆయుష్కాలముల మాటయటుంచి, ఒకమూలజాతి ఆయుష్కాలమును మాత్రమే పరీక్షించినను, దానిలో సప్తరేఖలును వరుసగా ఒకదానితరువాత నొకటి (బహుశః ఒకటికంటె ఎక్కువసార్లు కూడ) ప్రబలముగా గనిపించునట్లు గనబడును. కాని ప్రతి యొకరేఖయు ప్రబలముగానున్న కాలములో తిరిగి యేడుఉపచక్రములు

కనబడుచుండును. ఈ విషయము బహువిచిత్రమైనది, క్లిష్టమైనది గనుక కొంత వివరణ మవసరమై యున్నది.

ఉదాహరణమునకు, ఒకజాతిచరిత్రలో అయిదవ రేఖ ప్రముఖముగానున్న కాలమును తీసికొందము. ఆకాలమంతటిలోను ఆ రేఖయొక్క ప్రధానభావము (ఆభావమునకనుసరించి ఏదయిన మతము స్థాపింపబడియున్నయెడల ఆ మతముకూడ) జనులందరిమనస్సులలోను ప్రధానముగనుండును. అట్లయిదవ రేఖ ప్రధానముగనున్న ఆ కాలమును ఏడుభాగములుగా విభజింపవచ్చును.ప్రథమ భాగములో అయిదవ రేఖ లక్షణము ప్రధానముగానున్నను ప్రథమ రేఖయొక్క ప్రభావముకూడ దానిలో మిళితమైగనబడును. ప్రథమ రేఖకు చెందినపద్ధతులుకూడ కొంతవరకు కలిసియుండును. అదేవిధముగ, ఆ జాతిరెండవభాగములో జాతిప్రధాన రేఖ లక్షణములతో రెండవ రేఖలక్షణములు పద్ధతులు మిళితమైయుండును.అయిదవభాగమునకు వచ్చినతోడనే మిశ్రమమేమియులేక పూర్తిగా అయిదవ రేఖయొక్క లక్షణములు, పద్ధతులు ప్రదర్శితమై ప్రబలముగను, పరిశుద్ధముగను గనిపించుచుండును. ఈ భాగములు, ఉపభాగములు, వానికిసంబంధించిన ఉపజాతులకు వానిశాఖలకు సరిపడియుండవలెనని తోచును. కాని, యింతవరకు మేముదానిని నిశ్చయముగా నిర్ధారణచేసి చెప్పలేకపోవుచున్నాము.

## భ క్తి పా ల న ము

విషయము బహుక్లిష్టము, అస్పష్టము అయియున్నప్పుడు, మనకు దానిని గురించిప్రస్తుతముగల కించిత్ జ్ఞానముతో చర్చించుచున్నప్పుడు, సరియైనయుదాహరణములనిచ్చుటకు ప్రయత్నించుట క్షేమకరముకాదు. అయినను,ఆరవ రేఖ అయిన భక్తిరేఖ ఇటీవలప్రాముఖ్యతకు వచ్చినదని మనకు తెలియవచ్చినదిగనుక, పూర్వకాలపుభక్తులు ప్రదర్శించిన అద్భుతశక్తులను గురించినగాథలనుబట్టి ఆ రేఖ మొదటి విభాగము ఎటువంటిప్రభావమును గనపరచెనో కనుగొనగలమని యూహించవచ్చును. రెండవవిభాగము యొక్కప్రభావము జ్ఞానమునే ప్రధాన ఆదర్శముగా నుంచుకొని జ్ఞానమునకైపాటుపడిన కొన్ని తెగలు(Gnostic sects)యందుగనబడును; మూడవ విభాగముయొక్క ప్రభావము జ్యోతిషులలో కనిపించును; నాల్గవ భాగముయొక్క ప్రభావము ఇచ్ఛాశక్తిని వృద్ధిచేసికొనుటకై బాధకరములును అసహ్యా

కరములును అగు పరిస్థితులనుసహించుచు కొందరుచేసిన విచిత్రమగు వక్రప్రయత్నములలో చూడనగును, (ఉదాహరణము: సెంటు సైమన్ స్టైలైటిస్, ఫ్లెజెల్లాంట్సు). అయిదవ విభాగముయొక్క ప్రభావము మధ్యయుగములో రసాయనశాస్త్రజ్ఞుల యొక్కయు (నీచలోహములనుండి బంగారము తయారుచేయబూనిన శాస్త్రజ్ఞులు) రోసిక్రూషియనులయొక్కయు జీవితములలో నగపడును; పరిశుద్ధ భక్తితోగూడిన ఆరవ ఉపభాగముయొక్క ప్రభావము సన్యాసులు, తాపసులు భక్తిపరవశులై జూపించిన ఆనందపరవశతలో విశదమగును; ఏడవ ఉపభాగములో రోమను ఛర్చికి సంబంధించిన బాహ్యాచారములను యథావిధిగా అనుసరించుట, దేవతల నాహ్వానము చేయుట సంభవించుచుండును.

ఈకాలములో బయలుదేరిన భువర్లోకవాసులగు భూతముల నాహ్వానించు అభ్యాసమును, దాని నీచస్వరూపముల లక్షణమైన భూతారాధనయును రాబోవు ఏడవరేఖయొక్క ప్రభావమును తెలియచేయు చిహ్నములని భావింపవచ్చును. అట్లాంటిస్ ఖండములో ఏడవరేఖలక్షణము బలముగానున్న కాలములో ఆఖరు భాగమందు ప్రపంచములో బయలుదేరి, అప్పటినుండియు పనిచేయుచున్న యొక రహస్యసంఘముచే ఈయుద్యమము స్థాపించబడి యుండుటచేత, ఈసంగతి నిశ్చయమే యని అనుకొనవచ్చును.

ఒకరేఖ తన కాలములో ఎంత నిశ్చయముగాను, ఎంతప్రబలముగాను తన ప్రభావమును, అధికారమును ప్రదర్శించునో, ఛర్చియొక్క చరిత్రనేమైనను చదివిన వారికి బాగుగా తెలియగలదు. మధ్యయుగములలో కేవలము మూఢభక్తి యెంత తీవ్రముగా నుండెనో, మతముగురించి లేశమైనను దెలియనివారుకూడ మతము పేరను మాట్లాడుచు, తమ మూఢాభిప్రాయములను జనులందరిపైన, తమకంటె బాగుగ తెలిసినవారిపైనగూడ, ఎట్లు బలవంతముగా రుద్దుచుండిరో గ్రహింపవచ్చును. నాడు ఛర్చికి సంబంధించిన యుద్యోగములలోనుండి తమ అధికారమును నిరంకుశముగా నుపయోగపరచుచుండిన క్రైస్తవమతసిద్ధాంతులు సహితము, తాము బోధించుచున్న సిద్ధాంతములయొక్క వాస్తవార్థము లేశమైనను ఎరుగరైరి. వారికంటె బాగుగా తెలిసినవారు, వాస్తవమతసిద్ధాంతములను వివరించి బోధచేయగలిగినవారు ఉండిరి, కాని జనబాహుళ్యము ఆపండితులను వినకపోవుటయేగాక, పాపము, వారిని మతద్రోహులని నిందించి బాధించుచుండిరి.

ఈతమోయుగమునందంతటను, వాస్తవముగ కొంచెము తెలిసిన గుప్తరసాయనశాస్త్ర వేత్తలవంటివారు (ఈశాస్త్రవేత్తల కందరకు విశేషముగా తెలియునని కాదు, కాని నిశ్చయముగా వారిలో కొందరకు క్రైస్తవులకంటె ఎక్కువగా తెలియును), టెంప్లార్సు, రోసిక్రూషియన్సు, మొదలగు రహస్యసంఘములలో గనిపించుచుండిరి. ఫ్రీమేసనీలో కొంతరహస్యము గూఢముగా నుంచబడెను. వారలనందరను అజ్ఞానులగు క్రైస్తవులు దైవభక్తియను పేరను విశేషముగా బాధపెట్టిరి. ఆమధ్యయుగములనాటి యోగులు చాలామంది మనోహరమగు భక్తిపూరితులై, ఆధ్యాత్మిక దృష్టికూడ గలవారైయున్న సంగతి నిజమే. కాని, సామాన్యముగ, వారి స్వభావము బహు సంకుచితమై యుండుటచేత, అభిప్రాయభేదములను మన్నింపలేకపోయిరి; వారితో నేకీభవించనివారిని నిరసించుటయేగాక, బహిరంగముగా హింసించుచుండిరి. వాస్తవముగా, ఆధ్యాత్మిక ఆదర్శములుగలవారు కొందరుండిరి; కాని, జనులు వారల ననుమానించుచుండిరి. రైస్‌బ్రోక్, మార్గరెటు, క్రిస్టినా ఎబ్నరు, మోలినాస్, జాకబ్ బోహ్మి, మొదలగు ప్రశాంతవాదులు—అటువంటివారు. ఎల్లప్పుడును అజ్ఞానులే తెలిసినపండితులపై నిరంకుశముగా స్వారిచేయుచుండిరి. ఆభక్తి అజ్ఞానముచే ఆవృతమైనను యథార్థమైనది, గాఢమైనది అని మనము మరువకూడదు.

భక్తి కేవలము క్రైస్తవమతములోనే ప్రబలియుండలేదు. అంతకు వెనుకటి రేఖలకుచెంది ప్రపంచములో మిగిలియుండిన ఇతరమతములలోగూడ దాని అధికారము ప్రతిఫలించెను. హిందూమతము సామాన్యముగా ఉత్సాహరహితమై వైరాగ్యయుతమైనదని భక్తిభావముగలవారను కొనవచ్చును. త్రిమూర్తులలో మొదటివాడు, జగత్పితయగు శివుని మతము (శైవసిద్ధాంతము) దాదాపు భారతదేశమంతటను వ్యాపించెను. ఈనాటికికూడ భారతీయులలో ముప్పాతిక భాగము శివుని ఆరాధనచేయుదురు. ధర్మము వీరి ఆదర్శము;అది ఆమతములో ముఖ్యాంశమనుటకు సందేహములేదు. మానవులు వారివారి కర్మఫలము ననుసరించి వేర్వేరు వర్ణములలో పుట్టుదురని వారినమ్మకము. ఎవరే వర్ణములో పుట్టినప్పటికి వారా వర్ణధర్మమును పాలించవలెను. జన్మించిన వర్ణము నతిక్రమించి పై వర్ణములోనికి బోవుట మిక్కిలి యసామాన్యమైన విషయము; అట్టి విషయమును చాలకాలమువరకు ఎవ్వరును ఎరుగరు. వారు న్యాయమును, ధర్మమును గౌరవించి పూజించిరి. జీవితపరిస్థితులలో అసంతుష్టినిగాని, ఆందోళనమునుగాని వారెన్నడు ఆమోదించియుండ

లేదు. ఎవరిపరిస్థితులను వారు సాధ్యమైనంతవరకు పరిపూర్ణముగా వినియోగ పరచుకొనుటయే యీశ్వరుని చేరగలమార్గమనియు, అట్లు చేసిన యెడల జన్మజన్మకు పరిస్థితులు బాగుపడుననియు వారు బోధించుచుండిరి. కాని, ఏవర్ణములో పుట్టినవాడైనను, తన పరిస్థితులను పోరాటమువలన బాగుపరచుకొనుటకు ప్రయత్నింపక, భగవంతుడు తనకు ప్రసాదించిన జన్మలో ఈశ్వరచిత్తము ననుసరించి స్వధర్మమును పాలించుటవలన తన పరిస్థితులు బాగుపడగలవని తెలుసుకొని సరిగా జీవించిన యెడల, ఈశ్వరుని చేరగల ద్వారము ఎల్లప్పుడును తెరచి యుండుననని స్పష్టముగా నుద్ఘాటించిరి.

గాఢమగు భక్తిస్వభావముగల మానవునికి పైనచెప్పినదంతయు కడు నిరుత్సాహకరముగను, మిట్టవేదాంతమువలెను గనిపించవచ్చును. బహుశః ఆ అభిప్రాయము నిజము కావచ్చును. కాని, భక్తిరేఖ ప్రపంచములో ప్రసరించినప్పుడొక గొప్పమార్పు వచ్చెను. త్రిమూర్తులలో రెండవవారగు విష్ణుమూర్తి శ్రీకృష్ణుడుగా అవతరించుటయు, ఆయనను గాఢమగు భక్తితో గొలుచుటయు ప్రారంభమయ్యెను. అప్పుడాభక్తి హద్దులులేకుండ పొంగిపొరలెను; దాని యుద్రేక మపారముగా హెచ్చిపోయెను; ఆయుద్రేకమతిశయించి అనేక విధముల కేవలము ఉన్మాద తాండవమైపోయెను. ఇప్పటికిహిందూదేశములో విష్ణుభక్తులభక్తి, భక్తిప్రధానమగుమతము ననుసరించు క్రైస్తవులభక్తిని మించి యుండవచ్చును. ఆభక్తి పారవశ్యమును, ఉద్రేకపూరితములగు ప్రదర్శనములను, ఉత్సాహరహితులగు మనబోటి పాశ్చాత్యులు చూచి భరించుట కష్టముగానుండును. వ్యాపారముచేసి జీవించుచుండెడు కఠినహృదయులుకూడ బాలకృష్ణుని నామము చెవినిబడినంతనే భక్తిపరవశులై కన్నీరు కార్చుచు పూర్తిగా మారిపోవుట నేను స్వయముగా జూచితిని. పాశ్చాత్యజాతులలో బాలజీసను యెడల భక్తియంతయు భారతీయులలో బాలకృష్ణునియెడల గనబడును.

సహజముగా, భక్తిస్వభావములేని యొక మతముపైన భక్తియొక్క ప్రభావము పైనచెప్పినవిధముగా ప్రకటితమయ్యెను. బౌద్ధమతముకూడ భక్తిస్వభావము గల మతమనుట కవకాశములేదు. బౌద్ధమతము గొప్పదైన నాల్గవ మూలజాతికి హిందూమత మొసంగిన ప్రసాదమైయున్నది. ఆజాతియొక్క పరిణామములో వచ్చెడు భక్తియుగము మన జాతితోపాటు ఒకేసారి రానక్కరలేదు. బౌద్ధమతములో ప్రార్థన

లవసరములేదు. కనుక, దేవుడున్నాడనివారు అంగీకరించినంతవరకు వారు చెప్పునది యేమనగా: 'దేవుడు చేయవలసిన కార్యము మనకు తెలిసినదానికంటె దేవునికే ఎక్కువ బాగుగా తెలియును. దేవుని ప్రార్థించుటగాని, ఆయన చేయవలసినకార్యము ఆయనకు జ్ఞాపకము చేయుటగాని కేవలము వ్యర్థము. మన మూహింపగలిగినదాని కంటె దేవుడు తన కార్యమును ఎక్కువ చక్కగా చేయుచున్నాడు." బర్మాదేశము లోని బౌద్ధ లిట్లు చెప్పుదురు: "అపర్యాప్తమగు వెలుగుకలదు, కాని అది మనకొరకు కాదు; ఎప్పుడో యొకనాడు మనము దానిని చేరెదము; ఈలోపున మన ప్రభువు చేసిన బోధననుసరించి, వారి ఆదేశానుసారముగా మనము చేయవలసిన కార్యముల నెల్ల సరిగా జేయుటయే మనకర్తవ్యము."

దేవుడున్నాడన్న విషయము వారునమ్మకపోవుటలేదు. దేవుడు మనకందరకు అతీతుడనియు,మన కనంతమగు దూరమున నుండుటచే మనకందుబాటులో లేరనియు వారు చెప్పుదురు. వారుభగవంతుని యునికిగురించి నిశ్చయబుద్ధిగలవారగుటచే ఆసంగతి నిర్వివాదాంశముగా నెంచెదరు. క్రైస్తవ మతప్రచారకులు బౌద్ధులు నాస్తికు లందురు. నేను బౌద్ధులతో కలిసిజీవించితిని. క్రైస్తవమత ప్రచారకులకంటె, వారల నెక్కువ సన్నిహితముగా నెరుగుదును. వానిలో నాస్తికభావమిసుమంతైన లేదనియు, భగవంతునియెడల వారికిగలగౌరవభక్తులపారమగుటచే వారు భగవంతునిగూర్చి చనవుతో మాట్లాడరనియు నేను చెప్పగలను. పాశ్చాత్యులవలె భగవంతునిగూర్చి రూఢిగాను, ఆయన సంకల్పముగూర్చియు, ఆయనచేయదలచిన పనిగురించియు పూర్తిగా దెలిసినవారివలెను, బౌద్ధులెన్నడును మాట్లాడరు. భగవంతునిగూర్చి ఆ ప్రకారము మాట్లాడుట ప్రాచ్యదేశీయుల కపచారమువలె దోచును.

కాని బౌద్ధమతమునకుకూడ భక్తియొక్క తాపము సోకకపోలేదు. బర్మా దేశములో బుద్ధభగవానుని దేవునివలెనే పూజింతురు. బౌద్ధబాలురకు నేనొక ప్రశ్నోత్తరమాలను వ్రాయవలసివచ్చినప్పుడు దీనిని కనిపెట్టితిని. అట్టిపుస్తకమును కల్నల్ ఆల్కాటుగారు మొదటి విద్యార్థుల నిమిత్తమైవ్రాసిరి. కాని ఆయన జవా బులు పెద్దవారుకూడ అర్థముచేసికొనలేనంత కఠినముగానుండెను. అందుచే ఆల్కాటు గారు వ్రాసిన అద్భుతమైన గ్రంథమును పెద్దవిద్యార్థులకు విడిచిపెట్టి చిన్నబిడ్డల ఉపయోగము నిమిత్తము ఉపోద్ఘాతమువంటి ఆరంభగ్రంథమును వ్రాయవలసి వచ్చెను. అందులో ఒక ప్రశ్న—"బుద్ధుడు దేవుడా?"

జవాబు— "కాదు, దేవుడుకాదు. మనవంటిమానవుడే, కాని మనకంటె మిక్కిలి విశేషముగా అభివృద్ధిబొందిన మానవుడు." ఈ జవాబును సింహళద్వీపములోను, సయాము దేశములోను పూర్తిగా అంగీకరించిరి. కాని మేము బర్మాదేశమునకు వచ్చుసరికి అచ్చటి బౌద్ధులు దానికి ఆక్షేపణచెప్పి యిట్లనిరి: "మనకు తెలిసినయే దేవునికంటెనుగూడ ఆయన మిక్కిలి గొప్పవాడు." గాడ్(God) అను ఆంగ్లేయ పదమునకు సంస్కృతములో 'దేవ' యందురు. భారతీయులు 'దేవ' అనుపదమును ఆంగ్లేయులు 'God' అను మాటనువాడుకచేయు భావములో ఎన్నడును వాడుక చేయరు. బ్రహ్మ, విష్ణు, శివులను గూర్చిగాని, ఈశ్వరునిగూర్చిగాని మాట్లాడినప్పుడు మాత్రమే ఆభావములో నుపయోగింతురు.

భారతీయులకు మూడుకోట్ల ముప్పదిలక్షలు (లేక ముప్పదిమూడుకోట్ల) 'gods' గలరని క్రైస్తవ మతప్రచారకులు చెప్పునప్పుడు, వారు 'deva' అను పదమును 'gods'అని భాషాంతరీకరణము చేసిచెప్పుదురు. ముప్పదిమూడుకోట్లలోను అనేకమంది దేవతలు, క్షుద్రదేవతలు, మొదలగు గణములనేకములుండును. మన ఆంగ్లేయులవలెనే భారతీయులుకూడ వానినిపూజింపరు. అట్టిదేవతలున్నారని వారెరుగుదురు, వారిని వివరించిచెప్పుదురు. అంతకంటె విశేషమేమియులేదు. బర్మాదేశములోని బౌద్ధమతములో భక్తికూడ ఆ ప్రకారము కలిసినదని కనుగొంటిమి. సింహళదేశములోని జనులు చాలవరకు అచటకువలసపోయిన భారతీయుల వంశీయులగుటచే వారిని బుద్ధుని కేలపూజలు చేయుచుంటిరని అడిగినయెడల, బుద్ధుడుమానవులకు చేసిన మహోపకారమునకు కృతజ్ఞతను దెలుపుటకై పూజింతుమని జవాబు చెప్పుదురు."మీరు చేయుచున్నదానిని బుద్ధుడుచూచి సంతోషించునని మీరుతలచెదరా?' అని వారినడుగగా, "లేదు, లేదు. వారు పరానిర్వాణములోనికి పోయిరి. మేము చేయుచున్నదానిని వారుగుర్తించెదరని మేము తలచుటలేదు. వారు మాకుబోధించుటచేతనే మాకీధర్మము తెలిసినది; అందుచే వారి నామమును శాశ్వతముగా దలచుకొని కృతజ్ఞతాపూర్వకముగా పూజలనర్పించుదుము" అనిచెప్పిరి.

కనుక, బాలకృష్ణుడు ప్రపంచములో ఇరువది నాలుగువందల సంవత్సరముల క్రితమవతరించినది మొదలు ప్రపంచమంతటను ఈ భక్తితరంగముయొక్క ప్రభావము ప్రబలముగా గనిపించినది. కానియిప్పుడు, ఆ యారవభాగముయొక్క ప్రత్యేక తీవ్రతతగ్గిపోయి, రాబోవు ఏడవరేఖయొక్క ప్రభావమునకు శీఘ్రముగా చోటిచ్చు

చున్నది. పెక్కు ఆర్యదేశములలోని గ్రామీణులలో మూఢభక్తి యిప్పటికిని ప్రబలముగానున్న సంగతినిజము. కాని విద్యావంతులైనవారు విషయమును పూర్తిగా గ్రహించనిదే కేవలము భక్తివలన అంత సులభముగా ఆకర్షింపబడుటలేదు. ఒక దశలో, ముఖ్యముగా నాల్గవయుపజాతి జనులు తమహృదయములకు నాటినప్రతి వస్తువును భజించి, సంపూర్ణసమర్పణము చేయసంసిద్ధులైయున్నప్పుడు, దానియుపయోగము విశేషముగానుండెను. అయిదవ ఉపజాతిలో స్థూలమనస్సు మిక్కిలి ప్రబలముగా వికాసము నొందినప్పుడే ప్రతీకారముగా వెంటనే నాస్తికవాదముద్భవించెను. అదియును, ఇప్పుడసంతృప్తికరముగా కనిపించుచున్నది. ఆతరంగము చాల వరకు గడచిపోయినదని చెప్పవచ్చును. ఇప్పుడు, మనుష్యులు సర్వమును వెఱ్ఱిగా నిరాకరించుట మానివేసి, పరీక్షించి, పరిశోధనచేయుటకు సంసిద్ధులగుచున్నారు.

ఇప్పుడు రెండువిధములగు మార్పులుకలుగుచున్నవి. రేఖాప్రభావము మారుచుండుటయేగాక, నాల్గవ ఉపజాతియొక్క రాగప్రవృత్తిలోను, అయిదవ ఉపజాతియొక్క తెలివిలోనుగల ఉత్తమాంశముల నన్నిటిని మిళితముచేసి, అంతర్వాణి, వివేకము అను నూతన లక్షణమును గొనితెచ్చు ఆరవ ఉపజాతిప్రారంభ మగుచున్నది.

## సంస్కారాభ్యుదయము

ఇప్పుడురానున్న రేఖ విశేషముగా సంస్కారములకు చెందినది. మధ్యయుగములలోగూడ సంస్కారములు ప్రబలముగానుండెను. కాని, దానికికారణము ఆరవ రేఖయొక్క ఏడవ ఉపరేఖప్రభావమై యుండెను. ఇప్పుడు మనకు ఏడవరేఖయొక్క ప్రథమ ఉపరేఖప్రభావము కలుగనైయున్నది. అందుచేత మనకు రానున్న రేఖాఫలితము దేవతల పరిణామమున కదియెంతయుపయోగకరముగా నుండునో దానిని బట్టి విచారింపబడునుగాని, భక్తిసంబంధమగు ఫలితములను బట్టికాదు. లోకములో ఏమిజరుగుచున్నదో సాధ్యమైనంతవరకు మానవులు గ్రహించుట తమకర్తవ్యముగా చేసికొన్నయెడల, ఆరేఖాప్రభావము మిక్కిలి శ్రేయోదాయకముగా నుండును.

ఆధునికమతములో రానురాను ప్రతి సంవత్సరము సంస్కారమున కెక్కువ ప్రాముఖ్యత వచ్చుచున్నది. ఇంగ్లాండుదేశములో గత శతాబ్దములో మధ్యకాలమున ఛర్చీలలో చైతన్యమేమియును లేదు. సామాన్యపు పల్లెప్రాంతపు ఛర్చీలో ప్రత్యేకదుస్తులుగాని, అలంకారములుగాని, కిటికీలకు రంగులుగాని, యేమియు లేక

సర్వము నిస్తేజసముగను, నిరాడంబరముగను నుండెను. వస్తువులన్నిటిని దేవునికి, దేవతారాధనమునకు తగినట్లుంచవలెననిగాని, సుందరముగను మర్యాదపూర్వకముగను నుంచవలెననిగాని శ్రద్ధ యెవ్వరికిలేదు. దృష్టియంతయు మతబోధమీదనే యుండెను. ఆబోధ సహితము వ్యావహారికదృష్టితో చేయబడుచుండెను. ఈరోజున ఇంగ్లాండులో ఆ ఛర్చిలలోనికే పోయి చూచినయెడల ఒక్కటియు అప్పటివలె కనిపించదు, విశేషముగా భేదము కనిపించును. వెనుకటి అశ్రద్ధకు బదులు ప్రతిచోటను భక్తిశ్రద్ధలు వెలయుచున్నవి. చాలవరకు ఛర్చిలన్నియు చక్కగా అలంకరింపబడుచున్నవి. చిన్న ఛర్చిలలోను, పెద్దవానిలోనుగూడ సంస్కారములన్నియు భక్తిశ్రద్ధలతోను, యథోక్తముగను, జేయబడుచున్నవి. ఛర్చిలయెడల దృక్పథమే పూర్తిగా మారినది.

ఈరేఖలోని మార్పులవలన కలుగుచున్న ప్రభావము ఇతరవిధములుగాగూడ వ్యక్తమగుచున్నది. ఫ్రీమేసనీకి రూపాంతరముగా కోమేస్రనీ యుదయించి వృద్ధిబొందుచున్నది. కోమేసనరీకి ఇతర సంప్రదాయములకు భేదమేమనగా, స్త్రీలు పురుషులతో అన్నివిధముల సమానముగానుండి వారి ప్రక్కనునిలిచి పనిచేయుట ఈకాలమర్యాదగనుక, అందుకనుగుణముగా స్త్రీలనుగూడ దానిలో చేర్చుకొందురు. ఈ యుద్యమమును స్థాపించినవారికి రేఖాప్రభావముగురించి తలంపులేదు. అయినను, కాలానుసారముగా నవ్యరేఖాప్రభావముచే అది స్థాపింపబడి, నడుపబడుచున్నది. విక్టోరియారాణి పరిపాలనచేయుచున్న కాలములో లండను నగరవీథులలో చాలకాల మే విధమయిన శోభగాని, అలంకారములుగాని, సంస్కారములుగాని లేవు; ఆమె పరిపాలన చివరభాగమందు పూర్వపు శోభకు తిరిగి ప్రాణమునచ్చెను; ఏడవ ఎడ్వర్డు పరిపాలనలో పూర్వపు వైభవమంతయు పునరుద్ధరింపబడెను. ఇదంతయు నాకు బాగుగా జ్ఞాపకముగలదు. ఈ క్రొత్తరేఖయొక్క ప్రభావమును చాలమంది జనులిప్పుడు తెలిసికొని, యిదివరలో నెన్నడును చేయని రీతిని సంస్కారములను చూచుటకును, వానిలో పాల్గొనుటకును అభిలషించుచుందురు.

## పదమూడవ అధ్యాయము

# త్రిమూర్తులు—త్రికోణములు

### ఈశ్వరత్రయము

సాధారణముగా మనుజులు దేవుడు అని చెప్పినపుడు సూర్యమండలాధిపతియగు ఈశ్వరుడు – సూర్యనారాయణమూర్తి–అని వారి అభిప్రాయము. ఈయనమూడు మూర్తులుగలవాడు, లేక, త్రిమూర్త్యాత్మకమైనవాడు; మూడు ముఖములద్వారా పనిచేయును. ఈ మూర్తులను వేర్వేరు మతములలో వేర్వేరుపేర్లతో బిలచెదరు, కాని యొకే అర్థములో భావించుటలేదు. ఏలయన; త్రిమూర్త్యత్వము అను ఈమహా పదకమునకు వివిధములగు భావములుండుటచే ఏయొకమతముకూడ సత్యమును సంపూర్ణముగా నిరూపించలేకపోయినది. కొన్ని మతములలో జనకుడు, జనని, కుమారుడు అని త్రిమూర్తులుగలరు; ఉత్పత్తి, అన్యోన్యసంబంధముల విధానములను యోచించినయెడల ఇదిమనకు అధమముగ్రహించుటకైన సాధ్యముకావచ్చును. ఉదాహరణముగ–ఈజిప్షియనుమతములోని 'ఒసైరిస్, ఐసిస్, హోరస్' న్ను స్కాండినేవియను పురాణగాధలలోని 'ఓడిన్, ఫ్రెయా, థోర్' న్ను, ఈ తరగతిలోచేరును. అస్సీరియనులును, ఫోయినీషియనులును 'అను, యా, బెల్' అను పురుషత్రయమును డ్రూయిడ్లు 'టాలక్, ఫాన్, మొల్లాక్' అనిరి. బౌద్ధమతములో ఉత్తరాదిసంప్రదాయము ప్రకారము వారిని 'అమితాభ, అవలోకితేశ్వర, మంజుశ్రీ' అందురు. యూదుల కబాలాలో వారిని 'కెథర్, బినా, ఖోక్మా' యని పిలచెదరు. జొరాస్ట్రియను మతములో 'అహురమాజ్దా, ఆషా, వోహుమానో', లేక, 'అహురమజ్దా, మిత్ర, అహ్రిమాన్' అని బిలతురు. ఆవిష్కరణములు భేదించినను, ఎల్లయెడలను త్రిమూర్త్యత్వమును అంగీకరించుచున్నారు.

భారతదేశీయుల హిందూమత సంప్రదాయములో 'శివ, విష్ణు, బ్రహ్మ' యని త్రిమూర్తులుగలరు. ఈమూర్తిత్రయములో మాతృత్వ అంశము కనబడదు. కాని,

# ఈశ్వరుడు

రెండవమూర్తి ప్రథమమూర్తి




అశేఖ (జీవన్ముక్త)

అయిదవ దీక్ష

త్రిమూర్తులలో ప్రతియొక్కొక్కరికి యొక్కొక్క శక్తిగలదనియు, ఆశక్తి స్త్రీస్వరూపిణి యనియు గుర్తించబడినది. మరియును ఆశక్తులు త్రిమూర్తులయొక్క భార్యలు అని లాక్షణికముగా చెప్పుదురు. ఈ స్త్రీస్వరూపములు త్రిమూర్తులు ప్రకృతిలో ఆవిష్కరించనందువలన గలిగిన రూపములని స్పష్టమగుచున్నది. బహుశః త్రిమూర్తులను చెప్పినప్పుడు మన మూహించుస్థానముకంటె ఈ స్త్రీమూర్తులు కొంచెము తక్కువస్థానమున ఆవిష్కరణమై యుండవచ్చును. క్రైస్తవ మతములో 'తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ' అనెడు మూర్తిత్రయముకలదు. ఈ సందర్భములో, పూర్వపు గ్రంథములలో పరిశుద్ధాత్మను స్త్రీస్వరూపమైనట్లు స్పష్టముగా చెప్పియుండుట విచిత్రముగా గనిపించును. ఇదిగాక, మానవుడు భగవంతుని మాతృస్వరూపమును సహజముగా నంగీకరింపవలసిన అవశ్యకత క్రైస్తవమతములో 'పవిత్ర కన్య' (Blessed Virgin) సిద్ధాంతములో కనబడుచున్నది. ఆమె, పావనులగు త్రిమూర్తులలో నొకమూర్తిగాకపోయినను, ఆమెను జగన్మాతయనియు, దేవతలరాణి యనియు, సాగరతార అనియు వర్ణించెదరు.

లోకమునుపాలించు అంతరంగపాలక వర్గములో మాతృత్వమునకు సంబంధించిన యొక గొప్పశాఖకలదనియు, ఆ పరిపాలకవర్గములో దానికొక ముఖ్యమగు స్థానము కలదనియు చదువరులు గ్రహించవలసియున్నది. మనువు జాతులయొక్కయు ఉపజాతులయొక్కయు స్థూలశరీరపురోవృద్ధికి సంబంధించిన శాఖకు ఎట్లు అధిపతియై యున్నారో, మతమును విద్యను పాలించు మరియొక శాఖకు బోధిసత్త్వులెట్లు అధిపతియైయున్నారో, అట్లేజగదంబయను ఒకగొప్ప అధికారిణి మాతృత్వశాఖకధిపతియై యున్నారు. వైవస్వతప్రభువు మనువుపదవిని, మైత్రేయప్రభువు బోధిసత్త్వపదవిని అలంకరించుచున్నట్లే, ఒకప్పుడు జీసను శరీరమునకు తల్లియైన యొకగొప్ప దేవత ప్రస్తుత మా జగదంబపదవి నలంకరించుచున్నది.

ముఖ్యముగా ప్రపంచములోని తల్లులందరి క్షేమమును కనిపెట్టిచూచుట ఈ శాఖయొక్క కర్తవ్యమైయున్నది. గుప్తశాస్త్రదృష్ట్యా జూచినయెడల స్త్రీయొక్క ఉత్తమమగు వైభవము సంఘములో నాయకురాలగుటలోగాని, విశ్వకళాశాలలో ఉన్నతపట్టమును బొందుటలోగాని, సంసారజీవితమందు హేయముతో ఒంటెత్తుగా

ఒక మేడలో నివసించుటలోగాని లేదు, జన్మలెత్తుటకు సిద్ధముగనున్న జీవాత్మలకు ప్రశస్తమగు ఉపాధులనొసగుటలోనే ఆమెకీర్తివైభవములు గలవు. ఈ మాతృత్వ కార్యము దాచుకొనవలసినదిగాని, విసర్జింపవలసినదిగాని, ఒకింతసిగ్గుపడవలసినది గాని కాదు, స్త్రీ జన్మయొక్క దివ్యతమమైన వైభవమందులోనే గలదు. ఇది పురుషులకు లేనట్టియు, స్త్రీలకు మాత్రమే గలిగినట్టియు అద్భుతమగు నవకాశము పురుషుల కితర అవకాశములుండవచ్చును. మాతృత్వమనెడు అత్యద్భుతమగు ఆ హక్కు పురుషులదికాదు. ఇదిలోకకళ్యాణార్థమై, జాత్యభివృద్ధికై స్త్రీలు చేసెడుమహాత్కార్యము. పురుషులమగు మన కేమియు తెలియని అపారమగుబాధకులోనై వారీసేవ చేయుచున్నారు.

ఈకారణముచేతనే, దారుణమగు బాధకులోనై ఈమహాత్కార్యమును స్త్రీలు చేయవలసియుండుటచేతనే, లోకపరిపాలకవర్గములో ఈ ప్రత్యేకశాఖ యేర్పాటుచేయబడినది. ప్రతిస్త్రీ ప్రసూతిసమయమందు బాధపడుచున్నప్పుడు, ఆమె కర్మ ననుసరించి ఆమెకు తగినసహాయము, బలమునిచ్చి కనిపెట్టుట ఆశాఖాధి కారుల విధియైయున్నది. ఇదివరలో చెప్పినట్లు జగదంబచేతిక్రింద ఆమె యాజ్ఞలను బాలించుటకై లెక్కలేని దేవతాగణములు కలరు. ప్రతిశిశువుయొక్క జననకాల మందును ఎవరో యొక దేవత ఆజగదంబ ప్రతినిధిగావచ్చి దగ్గరనుండి కాపాడు చుండును. పవిత్ర యూఖరిస్టు సంస్కారము నెప్పుడు జరిపినను ఒక సన్నిధానదేవత తప్పకవచ్చుచుండును. ఆదేవతను కేవలము క్రైస్తుయొక్క సంకల్పరూపమని చెప్ప వచ్చును. ఆరూపముద్వారా క్రైస్తు పురోహితుని నివేదన నంగీకరించి యామోదించును, కనుక క్రైస్తు నిజముగ నొకడేయైనను, అనేకవేల దేవాలయములలో నేకకాలమందు తన ప్రతినిధులద్వారా ప్రత్యక్షమగును. అదేరీతిగా, చాల దిగువ యంతరువులోనైనను జగదంబకూడ ప్రసవించుచున్న ప్రతితల్లియొక్క మంచము ప్రక్కను తన ప్రతినిధిద్వారా ప్రత్యక్షమగును. అట్టి పరిస్థితులలో అనేకమంది స్త్రీలు ఆమెను జూచియుండిరి. ఆమెను జూడలేనట్టి స్త్రీలు సహితము ఆమెద్వారా ప్రసరించెడు సహాయమును బలమును అనుభవించిరి.

ప్రతిస్త్రీకూడ ఆపరీక్షాసమయమందు సాధ్యమైనంత ఉత్తమమగు పరిసరములను గలిగి యుండవలెనని, అనగా, ఆమె నందరు నిజమగు గాఢానురాగముతో జూడ

వలెననియు, ఆమె మిక్కిలి పవిత్రము, ఉత్తమము నగు ప్రభావములతో నిండి యుండవలెననియు, ఉత్తమ ప్రభావములు తక్క వేరేమియు పుట్టబోవు శిశువుపై ప్రసరింపరాదనియు, ప్రపంచజీవితములో మిక్కిలి అనుకూలమగు ప్రారంభ మాశిశువునకు సమకూడవలెననియు ఆజగదంబయొక్క హృదయపూర్వకమగు ఆశయ మైయున్నది. మిక్కిలి పరిశుద్ధము, ఉత్తమమునగు ప్రభావము వినా అన్యమేదియు ఆశిశువునంటరాదు. ప్రతి విషయములోను సంపూర్ణమగు పారిశుద్ధ్య ముండుట అత్యావశ్యకమైయున్నది. ఆరోగ్య నియమముల నతికఠినముగా, జాగ్రతగా పాటించుటవలననే అట్టి అనుకూలపరిస్థితులు సమకూడగలవు. అప్పుడే ఉత్కృష్ట మగు జీవాత్మ నివసింపదగిన ఆరోగ్యకరమగు ప్రశస్తమైన శరీరము జన్మింపగలదు.

విస్తారముగా వికసించిన జీవాత్మలకు యోగ్యమైన శరీరములను ప్రాప్తింప జేయుటకై జగదంబయును, ఆమె సేవకులగు దేవతలును గొప్ప ఆతురతపడు చుందురు. వేలకొలది జీవాత్మలు, పరిణామములో పురోవృద్ధి నొందిన జీవాత్మలు, తిరిగి జన్మలనెత్తి యవతరించుటకు సంసిద్ధులై యున్నారు. వారందరు రాబోవు జగద్గురువు కార్యములో సహాయపడుటకును పాల్గొనుటకును ఉత్సహించుచున్నారు; కాని వారికి తగినఉపాధులను కనుగొనుట మిక్కిలి కష్టమగుచున్నది. పాశ్చాత్యదేశములలో స్త్రీపురుషులకు వివాహములుచేసికొనదగిన పరిస్థితులుగాని, సౌకర్యములు గాని గలుగుట లేదనియు, ధనాభావముచే చాలమంది బిడ్డలుగల పెద్ద కుటుంబములను భరింప శక్యముకాదనియు నొక దుష్ట సంప్రదాయము ప్రబలుచున్నది. అవివేకమైనట్టియు, ధననాశనకరమైనట్టియు ఆడంబర జీవనమే దానికి ముఖ్యకారణము. స్త్రీజన్మ మెత్తుటచే తమకు మిక్కిలి యద్భుతమగు నవకాశము గలిగినదని గ్రహింపక, పురుషుల జీవితములను నడతలను అన్నివిషయములలోను తాముకూడ ననుకరించుటకుగాను స్త్రీలు వివాహబంధములనుండి తప్పించుకొని స్వేచ్ఛగా తిరుగవలెనని అభిలషించుచున్నారు; జన్మచే గలిగిన ప్రత్యేక హక్కుల లాభమును పొందుటకు బదులు వానిని నష్టపోవుచున్నారు. ఆవిధముగ తలచుటయు, ఆచరించుటయు నిస్సంశయముగా జాతియొక్క భవిష్యత్తునకు మిక్కిలి భంగకరమై యుండును. ఏలయన, శ్రేష్ఠతరమగు స్త్రీపురుషులు అవివాహితులుగా నుండుటచే జాతిని వృద్ధిజేయుటలో పాల్గొనక, ఆ పవిత్రకార్యమును అజ్ఞులు, అయోగ్యులునగు జీవులకు విడిచివేసినవారగుదురు.

భారతదేశములో పరిస్థితులు వేరు. అక్కడ సామాన్యముగ ప్రతివారును వివాహముచేసికొందురు. కాని, అగ్రవర్ణములలోగూడ సరియైన పర్యవేక్షము లేక పోవుటచే పరిస్థితులు యోగ్యముగా నుండక, బలము ఆరోగ్యముగల శరీరములు పుట్టుట కవకాశము లేకపోవుచున్నది. ఇది చాల ముఖ్యమగు విషయము; యోగ శాస్త్రము నభ్యసించు విద్యార్థులందరును బహుశ్రద్ధగా యోచనచేయవలసినదై యున్నది. వీరు తగు శ్రద్ధ వహించి, ఎక్కువ తృప్తికరమగు పరిస్థితు లేర్పడుటకు తమకు సాధ్యమయినదంతయు తప్పక చేసితీరవలెను.

అన్ని దేశములలోని స్త్రీలును ఒక సంఘముగా జేరి యీ ముఖ్యవిషయము గురించి సరియగు భోగట్టాను తమ సోదరీలలో వ్యాప్తిచేయుటకై కృషిచేయుట యుచితము. ప్రతిస్త్రీయును తన జన్మవలన తనకు కలిగిన దివ్యమగు అవకాశమును బూర్తిగా గ్రహించునట్లు చేయవలెను; ప్రతివనితయు గర్భవతియగుటకు పూర్వ మెట్లుండవలెనో, గర్భిణియైయున్నప్పుడు ఎట్లుండవలెనో, ప్రసవించినతరువాత ఎట్లుండవలెనో, పూర్తిగ తెలిసికొనవలెను. పరిపూర్ణపారిశుద్ధ్యమును, సంపూర్ణ శ్రద్ధయును గలిగిన పరిస్థితులలో శిశువును పెంచుచుండుటయేగాక, పరిపూర్ణ భువర్లోక మానసికలోక పరిస్థితులు— అనగా, ప్రేమ విశ్వాసము, సౌఖ్యము, పవిత్రత — శిశువునకు సమకూడవలెను. ఈప్రకారము చేయు నెడల, జగదంబ యొక్క కార్యము చాల సుఖకరమగుటయేగాక, జాతియొక్క భవిష్యత్తు శుభకర ముగనుండుట నిశ్చయము.

స్త్రీశరీరములోనున్న సిద్ధులెవరైనగలరా యని తరుచు ప్రశ్నించుచుందురు. జగదంబ యున్నదనుటయే దానికి జవాబు. అద్భుతమగు పరమపవిత్రతవల్లనున్ను, ఇతరవిధములగూడ నామె విశేషముగా అభివృద్ధిబొంది యుండుటచేతనున్ను, పాల స్తీనాలో చిరకాలము క్రిందట జీససు అను శిష్యుని శరీరమునకు మాతయగుట కామె శరీరమునకు అవకాశము లభించెను. ఆమాతృత్వమువలన నామెకు సంభవించిన దారుణమగు బాధనంతను అద్భుతమగు నోర్పుతోను, ఔదార్యముతోను సహించుటచేతనే, ఆమె ఆజన్మలోనే జీవన్ముక్తి బొందెను. ఆయంతువును చేరిన తరువాత ఆమె యెదుటనున్న సప్తపథములనుజూచి దివ్యమైన దేవతా పరిణామ

ములో నామె ప్రవేశింప నిర్ణయించెను. వెంటనే గొప్పగౌరవ ప్రతిష్ఠలతో ఆమె ఆదేవతాగణములోనికి తీసికొనబడెను.

రోమన్ కేథలిక్ సిద్ధాంతములో చెప్పిన "స్వీకరణము'—Assumption— అను మాటలోగల సత్యమిదియే. ఆమెను స్థూలశరీరముతోనే స్వర్గములోనికి తీసికొనిపోయిరని అర్థముకాదు; ఆమె ఆశరీరమును విడిచినతరువాత దేవతాగణములో చేరెననియు, వెంటనే జగన్మాత పదవికి నియోజింపబడియుండుటచే వాస్తవముగ దేవతల కందరకు రాణియయ్యెననియు భావము. చర్చివారు చెప్పినదంతయు కవితా ధోరణిలోనున్నది. ఒక గొప్ప దేవతకు స్థూలశరీరమవసరములేదు. కాని జగన్మాత పదవియందామె యున్నంతకాలము ఆమె స్త్రీ రూపములోనే మన కెల్లప్పుడును గనుపించుచుండును. ఆమె కార్యములో ఆమెకు సహాయపడుటకు నిశ్చయించుకొనిన సిద్ధపురుషులుగూడ స్త్రీరూపములోనే గనిపించుచుందురు.

గడచిన అన్నిశతాబ్దములలోను వేనవేలు స్త్రీపురుషులు భక్తిపూర్వకముగా ఆమె పాదపంకజములవద్ద హృదయపూర్వకమయిన భక్తినర్పించిరి. ఆభక్తిలో అణుమాత్రమైనను వ్యర్థమగుటగాని తప్పుదారినిపోవుటగాని జరుగలేదు. ఏలయన, మానవజాతి యందామెకుగల ప్రేమచేతనే ఆభక్తి పురికొల్పబడుచున్నందున ఆమె ఆభక్తి బలమునంతను వారు పూనిన భారమగు కార్యమునకై సర్వదా వినియోగించుచున్నది. మానవుల కిసుమంతైన తెలియకపోయినను, వారామె దివ్యచరణములవద్ద అద్భుతమగు ప్రేమధనమును కురిపించిరి. అందుకు కారణము ఆమె యొకప్పుడు బాలజీససునకు తల్లియగుటకాదు,ఇప్పుడు సజీవులైయున్న జనులందరకు ఆమె తల్లియై యుండుటయే.

ఈ జగన్మాతను గురించిన జ్ఞానమంతయు కేవలము క్రైస్తవమత సంప్రదాయములోనే గలదని యూహింపరాదు. భారతదేశములో 'జగదంబ' యనియు, చీనాదేశములో 'క్వాన్-యిన్' అనగా, దయకు జ్ఞానమునకు తల్లియనియు, స్పష్టముగా గుర్తించియుండిరి. ముఖ్యముగా ఆమె ప్రేమ, భక్తి, పవిత్రతలకు ప్రతినిధి యనియు, ఆదర్శస్వరూపమనియు, సారమనియు గ్రహింపవలసియున్నది. ఆమె నిజముగ పరాజ్ఞానమే. కాని అన్నిటికంటెను అధికముగ కష్టములోగాని, దుఃఖములోగాని, లేమిలోగాని, జబ్బులోగాని, మరియేయితర విపత్తులోగాని యున్నవారినందర నోదార్చి, ఆశ్వాసించి, సహాయముచేయు మాత ఆమెయే.

పావనమూర్తిత్రయముయొక్క ప్రతిమూర్తిలోనుగల స్త్రీయంశ, లేక, శక్తి ఈ క్రిందిపటములో జూపించిన సుప్రసిద్ధ చిహ్నరూపమున కొన్నిచోట్ల గుర్తింప బడుచున్నది.



వీరికంటె ఉన్నతులు, శ్రేష్ఠులునైన ఈశ్వరులలోగూడ ఈవిధమగు త్రిమూర్త్యత్వముగలదు. మనమెరిగినదానికిని మనమూహింపగలదానికిని అతీతుడై చాల వెనుకను, ఆవలను కేవలుడుగలడు. ఆ కేవలుడుకూడ త్రిమూర్త్యాత్మకముగనే ఆవిష్కరించును: ఈ చివరమానవునిలో ఆత్మబుద్ధి, మనస్సు అను త్రిమూర్త్యత్వమును జూడగలము. ఈ మూడును ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులను తెలియజేయును, మానవునిలోని త్రిమూర్త్యత్వము ఆయీశ్వరుని సర్వోత్కృష్టమగు త్రిమూర్త్యత్వముయొక్క ప్రతిబింబమైయున్నది. అయినను, ఇది కేవలము ప్రతిబింబమేకాదు. అంతకంటె చాలవిశిష్టమైనది. ఇది ఈశ్వరునిలోని త్రిమూర్తులకు చిహ్నమై యుండుటయేగాక, మనస్థూలచైతన్యముతో గ్రహింపసాధ్యము కాని విధమున, ఈ క్రింద యంతరువున ఆ ముగ్గురు మూర్తులయొక్క ఆవిష్కరణమును, రూపమునుగూడ నైయున్నవి.

## ప్రతినిధిత్రయము

ఈశ్వరుడు త్రిమూర్త్యాత్మకమైయున్నట్లు, మహీపీఠము మూడు గొప్ప శాఖలుగానున్నది. ఆ మూడుశాఖలకు ముగ్గురు మహిమాన్వితులగు అధికారులు గలరు. వారు కేవలమీశ్వరుని త్రిమూర్తుల ప్రతిబింబములైయుండక, వాస్తవముగ వారి ఆవిష్కరణరూపములై యున్నారు. వారు లోకప్రభువు, బుద్ధభగవానుడు, మహాచోహాన్. ఆవిష్కరణమైన ఈశ్వరుడుండునట్టియు, మానవపరిణామక్షేత్రమున కావలనున్నట్టియు లోకములలోగూడ జాగ్రదవస్థలో చైతన్యమునొసంగు అత్యున్నత

మగు దీక్షావస్థలను వారుచేరిరి. లోకప్రభువు మనసప్తలోకములలో నుత్తమమగు ప్రథమలోకమందుండి, యీశ్వరుని ప్రథమమూర్తితో నేకమై, ఈశ్వరునియిచ్ఛను భూమండలములో నిర్వహించును. బుద్ధుడు ఈశ్వరుని రెండవమూర్తితో నేకమై రెండవ లోకమగు అనుపాదకలోకమందుండి ఈశ్వరుని జ్ఞానమును మానవులకు ప్రసరింపజేయుచుండును. మహాచోహాను ఈశ్వరుని మూడవమూర్తితో పూర్తిగ నేకమై నిర్వాణ, లేక, సత్యలోకమందు నివసించుచు ఈశ్వరుని క్రియాశక్తిని వినియోగించును. ఈయన క్రైస్తవ సంప్రదాయములోని పరిశుద్ధాత్మకు సరిపోవును. వాస్తవముగ ఈయన ఈశ్వరునిహస్తమే; భూలోకములో ఈశ్వరకార్యనిర్వాహణమునకై చాపబడినహస్తము అనదగును. ఈ క్రిందపటమువలన ఈ విషయములు విశదము కాగలవు.

| ఈశ్వరుడు | ఈశ్వరశక్తులు | లోకములు | ప్రతినిధిత్రయము | రేఖ |
|---|---|---|---|---|
| ప్రథమమూర్తి | ఇచ్ఛ | ఆది, లేక, ప్రారంభలోకము | లోకప్రభువు | 1 |
| రెండవమూర్తి | జ్ఞానము | అనుపాదక, లేక, మొనాడిక్ లోకము | బుద్ధుడు | 2 |
| మూడవమూర్తి | క్రియ | ఆత్మ, లేక, సత్యలోకము | మహాచోహాన్ | 3_7 |

ఈ మహాత్రికోణములో మొదటి యిరువురును మూడవవారికంటె వేరై యున్నారు. వారుచేయు కార్యముస్వభావతః భూలోకమువరకు దిగదు. ప్రథమమూర్తియొక్క మహాప్రతినిధియగు లోకప్రభువు చేయుకార్యము ఆత్మలోకమువరకు మాత్రమే దిగును. బుద్ధుడు చేయుకార్యము నాల్గవలోకమగు బుద్ధిలోకమువరకే చేరును. అయినను, పైలోకములలో వారుచేసెడు మహాత్కార్యము జరుగనియెడల దిగువలోకములలోని కార్యము జరుగుటసాధ్యముకాదు. కనుక వారిప్రభావమును వారి ప్రతినిధులగు వైవస్వతమనువు, మైత్రేయప్రభువుద్వారా స్థూలతమలోకమగు భూలోకమువరకు ప్రసరింపజేయుట కేర్పాట్లుచేయుదురు.

ఈ పరమపురుషు లిరువురును వారివారి రేఖలలో మహాచోహాన్. వారితో సమానయంతరువు నందుందురు. వారు మహాచోహాన్ అనుదీక్షనుబొందిరి. ఆ ప్రకారము మరియొక మూర్తిత్రయము భూలోకమువరకు ఈశ్వరశక్తులను నిర్వహించుటకు ఏర్పడినది. ఈ రెండుమూర్తిత్రయములను ఒకేపటములో జూపింపవచ్చును. ఈక్రింద పటమును జూడుడు.




ఒకమూల జాతిపరిణామము పూర్తియగువరకు మనువు ఆ జాతి పరిణామము యొక్క యావత్తు వివరములను నిర్ణయించుచుండును. బోధిసత్త్వుడు జగద్గురువై మతశాఖకు, విద్యాశాఖకు మంత్రివలెనుండి ఆజాతిమానవులందరును సాధ్యమైనంత వరకు ఆధ్యాత్మికదృష్టిని పెంపొందించుకొనుటలో సహాయపడుచుండును. ఈశ్వర సంకల్పము ననుసరించి వివిధములగు సంస్కృతి, నాగరికత వికాస మొందునట్లు మానవుల మనస్సులను మహాచోహాన్ నడిపించుచుండును. ఈముగ్గురను శిరము, హృదయము, అయిదు వ్రేళ్లుగల హస్తము అని చెప్పవచ్చును. ఈముగ్గురును ప్రపంచములో చుఱుకుగా బనిచేయుచు, జాతినంతను ఒక్కజీవునివలె దిద్దుచు, ఒక దివ్యపురుషునిగా చేతురు.

దివ్యపురుషుడగుట కేవలము ఉపమానముకొరకు చెప్పినదికాదు. అది యథార్థమగు విషయము. ఏలయన ప్రతిమూలజాతియొక్క పరిణామము పూర్తియగు సరికి జీవన్ముక్తిబొందినమానవులందరు దివ్యపురుషుడని చెప్పదగు నొకేబ్రహ్మాండమగు జీవముగా నేర్పడుదురు. భూలోకమందలి మానవునిలోవలెనే ఆ దివ్యపురుషునిలోగూడ ఏడు గొప్పచక్రములుండును. ఒక్కొక్క గొప్పపురుషుడొక్కొక్క చక్రమందుండును. ఈ దివ్యపురుషునిలో మనువుశిరోచక్రమందును, బోధిసత్త్వులు హృదయచక్రమందును నుందురు. వారిభృత్యులమగు మనమందరము వారిలో భాగమై దివ్యమగు విధమున వారితోనేకమైయుందుము. అద్భుతమగు ఆదివ్యపురుషుడు ఎన్నడో భవిష్యత్తున నొకసూర్యదేవునకు మంత్రియగుటకు ఇతోధికముగ పరిణామము జెందుచుండును. ఇదంతయు అత్యాశ్చర్యకరముగను, ఊహాతీతముగను నుండును. ఒకయద్భుతమేమనగా, ఆదివ్యపురుషునిలోని ప్రతిసిద్ధపురుషుడు అందరితో నేకమైయున్నను తనవ్యక్తిత్వమునుగాని స్వేచ్ఛనుగాని నష్టపోక, వానియిష్టము వచ్చినరీతిని దివ్యపురుషునితో నిమిత్తములేకుండ, ఇతరమయిన పనిచేయుటకుకూడ అవకాశము గలిగియుందురు.

కొద్దికాలము క్రిందటివరకు మహాచోహాన్ పదవికి ఆ తరగతికిచెందిన సిద్ధపురుషుని స్థిరముగ నియోజించుట ఆచారముకాదు. అయిదురేఖలకు చెందిన చోహానులు వరుసగ నొకరితరువాత నొకరు ఆ అయిదురేఖలకుకూడ అధిపతియగుచుండెను. కాని వారా మహాచోహాన్ పదవినలంకరించుటకుముందు మహాచోహాన్ దీక్షను బొందవలసియుండెను. ప్రస్తుతము కొంతమార్పు జరిగెను; అయిదురేఖలలో ప్రతిరేఖకు ప్రత్యేకముగ నొక చోహాను ఆధిపత్యము వహించుచున్నారు; వీరు అయిదుగురుగాక ఒక మహాచోహాను ప్రత్యేతముగాగలరు. జగద్గురువు త్వరలోరానుండుటయే యీ మార్పునకు కారణమై యుండవచ్చును.

## రే ఖ ల కు హ ద్దు లు

మూడు మొదలు ఏడువరకు రేఖలలో మనభూగోళముపైన దీసికొనదగిన అత్యున్నతదీక్ష మహాచోహాన్ దీక్షయైయున్నది. కాని మొదటిరెండు రేఖలపైన ఈ క్రిందను పటములో జూపించినప్రకారము ఇంకను పైకిబోవుటకు సాధ్యమగును.

మొదటిరెండు రేఖలద్వారా బుద్ధదీక్షను బొందవచ్చును. మొదటి రేఖద్వారా అంత కంటెను పైకిబోవచ్చును.

<table>
<tr><th colspan="3">రేఖలు — యోగదీక్షలు</th></tr>
<tr><td>ప్రథమరేఖ</td><td>ద్వితీయరేఖ</td><td>మూడు మొదలు ఏడువరకు రేఖలు</td></tr>
<tr><td>9. తొమ్మిదవదీక్ష</td><td rowspan="2" colspan="2"></td></tr>
<tr><td>లోకప్రభువు</td></tr>
<tr><td colspan="2">8. యెనిమిదవ దీక్ష</td><td rowspan="2"></td></tr>
<tr><td>ప్రత్యేకబుద్ధులు</td><td>బుద్ధుడు</td></tr>
<tr><td colspan="3">7. ఏడవదీక్ష</td></tr>
<tr><td>మనువు</td><td>బోధి సత్త్వులు</td><td>మహా-చోహాన్</td></tr>
<tr><td colspan="3">1-6 ఒకటిమొదలు ఆరువరకు దీక్షలు</td></tr>
</table>

ఈవిషయములో ఏమయిన అన్యాయము జరుగుచున్నదా యనెడు దురభిప్రాయము కలుగకుండ, అన్ని రేఖలలోను సమానవేగముతో నిర్వాణమును బొంద వచ్చునని స్పష్టముగా చెప్పవలసియున్నది. అశేఖుడు, లేక, జీవన్ముక్తుడు అయిన తరువాత యోగి నిర్వాణానందములో బ్రవేశించి మన దృష్టికి అనంతముగా కనిపించుకాలము ఆనందము ననుభవించుటకు స్వేచ్ఛగలిగి యుండును. కాని, అత డనుభవింపగల ఈప్రథమదశలోని ఆనందము, మన కూహాతీతమయినప్పటికి,

చోహాక్ మహాచోహానులు వారి ఉన్నతదశలలో అనుభవింపగల ఆనందమునకు చాలా తక్కువ. ఈచోహన్ మహాచోహానులు పొందెడు ఆనందముకూడ మొదటి రెండు రేఖలమీాదను పరమోత్తమమగు దీక్షలను భూలోకజీవితములో పొందుట కవసరమగు బ్రహ్మాండమగు త్యాగమును, యత్నమును చేసిన సిద్ధపురుషులు తుదకు చేరగలిగెడు నిర్వాణానస్థల ఆనందవైభవము ముందు వెలవెలబోవును. మన మహీపీఠమునకు చెందని యితర శ్రేణులలో పనిజేయబూనినయెడల మూడు మొదలు యేడు రేఖలలోగూడ ఎక్కువ పురోవృద్ధిని బొందుట కవకాశముగలదు.

## రేఖను మార్చుకొనుట

ఒకరేఖనుండి మరియొక రేఖకు మారుట సాధ్యమగును. కాని యోగి దృఢ వ్రతుడై కడు దీక్షతో బనిచేయవలెను. అందుచేత, యోగాభ్యాసముచేయువానికి అన్నిద్వారములును సమానముగా తెరచియుండును. మన దివ్యజ్ఞానసమాజముతో సన్నిహితసంబంధముగల పరమపురుషులిద్దరు ఈయత్నమును, చేయనిశ్చయించిరని తెలియుచున్నది. మనలో వ్యక్తిగతముగ వారితో సంబంధమును నిలబెట్టుకొనగోరిన వారు, తెలిసియో తెలియకయో, ఆప్రయత్నమునుగూడ చేయుచున్నవారగు దురు. ఈమార్పు జరిగెడు విధానమును సిద్ధాంతరీత్యా చెప్పుట సులభమేగాని ఆచ రణలో బెట్టుట మిక్కిలి కష్టము. ఆరవభక్తిరేఖపై నున్న మానవుడు రెండవజ్ఞాన రేఖకు మారవలెననిన, తన ఆరవరేఖయొక్క రెండవ ఉపభాగములోని ప్రభావము నకు లోబడుటకు కృషిచేయవలెను. తరువాత ఆయుపరేఖప్రభావము తన జీవిత ములో గాఢమై తుదకు ప్రముఖలక్షణమగునట్లు నిలుకడగా కృషిసలుపవలెను. అందువలన, అతడు ఆరవరేఖలో రెండవ యుపరేఖయందుండుటకు బదులు రెండవ రేఖలో ఆరవ యుపరేఖకు మారును. అనగా, తన వర్ధమాన జ్ఞానమానముచే తన భక్తిని సంశ్రితముజేసికొని, తుదకాభక్తియంతయు దివ్యజ్ఞానముయెడల భక్తిగా మారునట్లు చేయును. అందులో కృతార్థుడయిన తరువాత, తగినంత శ్రమతో దీర్ఘ కాలము ప్రయత్నముచేసిన యెడల రెండవరేఖయొక్క మరియొక యుపరేఖకు మారవచ్చును.

ఇచ్చట సామాన్య నియమములనుండి కొంతమార్పు స్పష్టముగా గనిపించు చున్నది. ఏలయన, ఒక గ్రహాధిపతిద్వారా వచ్చిన తురీయాత్మ మరియొక గ్రహాధి పతిద్వారా మరలిపోవును. అట్టి మార్పులు మిక్కిలి అరుదుగా జరుగును. అన్నియు

తుదకు సమతుల్యత నొందును. సాధారణముగా మార్పులన్నియు మొదటి రెండు రేఖలలోనికి జరుగుచున్నవి. ఆ రేఖలలోనున్నవారిలో తక్కువ పరిణామావస్థలలో నున్నవారు బహుకొద్దిమంది మాత్రముందురు.

## పరిపూర్ణ ఏకత్వము

ఈరూపత్రయములలోని సభ్యులందరకు ఈశ్వరునితోగల అద్భుతమగు నైక్యమును బోధిసత్త్వుల ఉదాహరణమునుదీసికొని విశదముచేయవచ్చును. పరమగురువునకు శిష్యునకుగల సంబంధము భూలోకములో నూహింపదగిన బాంధవ్యములనన్నిటికంటె మిక్కిలి సన్నిహితమైనదని యిదివరలో జూచియుంటిమి. పరమగురువు కూట్‌హూమిగారికిన్ని ఆయన గురువు ధృవమహర్షి గారికిన్ని గల సంబంధము ఎక్కువ ఉన్నతమగు అంతరువునందుండును గనుక, యెక్కువ సన్నిహితముగానుండును. మైత్రేయప్రభువు శిష్యులను స్వీకరించినకాలములో ధృవమహర్షి ఆయనకు శిష్యుడై యుండెనుగనుక, వారిరువురకుగల సంబంధముకూడ నూహింపరానిదై యుండును. ఆకారణముచేత పరమగురువు కూట్‌హూమిగారు మైత్రేయప్రభువుతో నేకమై యున్నారు. వారి అంతరువునందు ఏకత్వమింకను ఎక్కువ పరిపూర్ణముగా నుండును గనుక, కూట్‌హూమి మహర్షి బోధిసత్త్వునితో అద్భుతమగు రీతిని యేకమై యున్నారు.

సిద్ధపురుషులు మనకంటె చాలా ఉన్నతస్థితిలోనుండుటచే, అచ్చట పైయంతరువులకును క్రిందియంతరువులకునుగల వైభవభేదమును మనము గుర్తించలేము. వారందరు మనపైన తారలువలె ఒక్కరీతిగనే గనిపింతురు, అయినను, సిద్ధపురుషులు మైత్రేయప్రభువు పాదరేణువులమని చెప్పుకొందురు. మనకు గోచరింపకపోయినను, అచ్చట నపారమగు భేదముండి యుండవలెను. అద్భుతమగు ఈయున్నతుల వైపు జూచినయెడల ఆమహిమకు మనకండ్లు చీకట్లు కమ్మును. ఆతేజస్సులో ఆదివ్యపురుషుల తేజోమండలముల ప్రమాణముల హెచ్చు తక్కువలనుబట్టి వారిమధ్య భేదములున్నవనుకొనవలసినదేగాని, ఒకరికంటె మరియొకరు గొప్పవారని నిర్ణయింప సాహసించలేము. కాని, పరమగురువు కూట్‌హూమిగారికిన్ని మైత్రేయప్రభువునకున్ను గల ఏకత్వము తక్కువ అంతరువులలో నూహింపదగినదానికంటె ఎక్కువ యథార్థమైనది ఘనమైనదియని మాత్రము గ్రహించవచ్చును.

బోధిసత్త్వ లీశ్వరుని రెండవమూర్తికి ప్రతినిధులై యుండుటచేత వారికుప్రకుగల ఐక్యము ఇంతకంటెను ఎక్కువగానుండును. బోధిసత్త్వ లీశ్వరుని తరపున భూమిపై ప్రతినిధిగానుండుట కంగీకరించి యున్నారు. దేవుడగు క్రైస్తునకును మానవుడగు క్రైస్తునకునుగల మూర్త్యైక్యతలోని భావమిదియే. పాశ్చాత్యులు క్రైస్తుప్రభువు అని పిలుచువారే బోధిసత్త్వులు. ఆయన అంతరంగిక ప్రజ్ఞానము, త్రిమూర్తులలో రెండవమూర్తియొక్క రూపము, ప్రతినిధియునై యున్నారు. క్రైస్తుయొక్క ద్వంద్వస్వభావములోగల మర్మమిందులోనేగలదు. "ఆయన దేవుడు - మానవుడు అయియున్నను, ఆయన ఇరువురుకాదు, ఒక్క క్రైస్తు మాత్రమే అయియున్నాడు-దైవత్వము శరీరమును ధరించి మానవత్వమును బొందుటచేగాక, దైవత్వములో మానవత్వమును లయముచేసుకొనుటచేతనే ఒక్కడైనవాడు."

మైత్రేయప్రభువు పరిణామములో ప్రవేశించుటకు అనేకయుగములు పూర్వముకూడ ఈశ్వరునిమూర్తిత్రయములోని రెండవమూర్తి యుండెను. రెండవ సృష్టి ప్రసారము జరిగినసందర్భములో ఈశ్వరుని రెండవమూర్తి అవతరించుటకు ప్రథమ అవతరణముజేసెను. అప్పుడా రెండవమూర్తి తన ఆవిష్కరణమునకై, తన క్రొత్తసూర్యమండలమునకు చెందినట్టియు, అదివరకే పరిశుద్ధాత్మ (మూడవ మూర్తి) చే గర్భోత్పత్తి చేయబడి చైతన్యవంతముగా చేయబడినట్టియు, నవ్యద్రవ్యమును దీసికొని దానినుండి తన ఉపాధులను నిర్మించుకొనుటద్వారా రెండవ ప్రసారము గావించిరి. అది జరిగినప్పుడు, ఆవిష్కరణమైన క్రైస్తునకు వ్యతిరేకముగ అవ్యక్తమగు క్రైస్తుభావము మొదటిసారి ఏర్పడెను. ఆసమయమందుకూడ మానవుడగు క్రైస్తుకంటె దేవుడగు క్రైస్తు ఒక విధముగా ఎక్కువ యన్నసంగతి నిజమై యుండవలెను. ఈశ్వరసృష్టిలోని వేర్వేరు గ్రహమండలములపై రెండవ మూర్తియొక్క ప్రతినిధులుగా నుండవలసిన బోధిసత్త్వులొకరి తరువాత నొకరు వారి రేఖాధిపత్యమును బొందినప్పుడు వారు తిరిగి ఆరెండవమూర్తితో పరిపూర్ణముగు నైక్యమును బొందుదురు; అందుచే వారు "మానవుడగు క్రైస్తు" అను బిరుదమునకు తగియుందురు. ఆకారణముచే, ఆదీక్ష సంప్రాప్తమగు సమయమందు ప్రతిబోధిసత్త్వునకు సుస్థిరమగు మూర్త్యైక్యత లభించును.

ఈశ్వరుని యీ రెండవమూర్తి ద్రవ్యములోనికి ప్రసరించి, మూర్తిత్వమును బొంది మానవుడగును. అట్లు "దైవత్వముయొక్క సంపర్కము కలుగుటచే తండ్రితో

సమానుడనియు, మానవత్వముయొక్క సంపర్కము కలుగుటచే తండ్రికంటె తక్కువ యనియు," అథనేషియన్ సంప్రదాయమువారు చెప్పుదురు. మన ప్రభువు బోధి సత్త్వుడుకూడ మనవంటి మానవుడే. ఇప్పటికి అటువంటి మానవుడే, కాని పరిపాకమునొందిన మానవుడు. ఆమానవత్వము దైవత్వములో పూర్తిగా మిళితమైపోవుటచే ఆయన నిజముగా నొక క్రైస్తు అనియు, త్రిమూర్తులలో రెండవమూర్తియొక్క ప్రతినిధియనియు చెప్పుదురు. ఆయనలో, ఆయనద్వారా మనమా యీశ్వరశక్తిని చేరవచ్చును. అందుచేతనే, క్రైస్తును దేవునకు మానవునకు మధ్యవర్తియని చెప్పుదురు. ఆయన మనతరపున వేరమేమియును చేయరు, ఛాందసులగు క్రైస్తవులు చాలమంది నమ్మునట్లు మనకేదో ఘోరమగు శిక్షపడకుండ లంచమిచ్చి మనలను రక్షింపడు. కాని, నిజముగా ఆయన మధ్యవర్తియే, ఈశ్వరునకు మానవునకు మధ్యను వర్తించుచున్నవారు; మానవున కగుపించువారు, తనద్వారా ఈశ్వరశక్తిని మానవ జాతికి ప్రవహింపజేయువారు; కనుకనే సకల శుభములను మనకు లభింపజేయు మతములన్నిటికి అధిపతియైయున్నారు.



## పదునాల్గవ అధ్యాయము

# మూర్తిత్రయముల జ్ఞానము

### బుద్ధుడు

గౌతమ ప్రభువు వర్తమాన కాలంబున బుద్ధపదవినలంకరించుచున్నారు. ఆయన భారతదేశములో ఇరువదియైదు వందలసంవత్సరముల క్రిందట తుదిజన్మమునెత్తెను. దానితో బోధిసత్త్వులుగా నెత్తినజన్మలను పూర్తిజేసి, వెనుకటి కశ్యపబుద్ధుని తరువాత బుద్ధుడై, మనభూగోళముయొక్క మహీపీఠములో రెండవరేఖ కధిపతి అయ్యెను. ఆ గౌతమసిద్ధార్థుని జీవితమును Light of Asia_ లైట్ ఆఫ్ ఏషియా_అను కావ్యరూపమున సర్ ఎడ్విన్ ఆర్నాల్డు అత్యద్భుతముగా వర్ణించెను. ఆంగ్లేయభాషలో మిక్కిలి మనోహరము, ప్రబోధకరమునగు కావ్యములలో అదియొకటి.

ఒక ప్రపంచపరిణామ కాలములో ఏడుగురు బుద్ధులు వరుసగా నొకరి తరువాత నొకరు ఒకజాతికొక బుద్ధుడుచొప్పున వచ్చెదరు. ప్రతిబుద్ధుడును యావత్ప్రపంచమునందు రెండవరేఖకు సంబంధించిన ప్రత్యేకకార్యమును పూనుకొని, ఉన్నత లోకములలో జేయవలసిన కార్యమును తనచేతిలోనుంచుకొని, స్థూలలోకమునందు జగద్గురువు పదవిని తన ప్రతినిధియు సహాయుడునునగు బోధిసత్త్వుల కొప్పగించును. ఈ బోధిసత్త్వుడే ప్రపంచమునకు జగద్గురువై పనిచేయును. బుద్ధపదవిని బొందిన వారిని ప్రాచ్యదేశపు గ్రంథకర్తలు అతిగాఢమగు భక్తితో పూజించి మహాగౌరవముతో శ్లాఘింతురు. మనము పరమగురువులను ప్రేమలోను జ్ఞానములోను దైవసమానులని యెట్లు భక్తితో జూతుమో, అంతకు పెక్కురెట్లధికమగు భక్తితో ఆపరమగురువులు బుద్ధుని గౌరవింతురు. మన మానవజాతిలోనుండి పరిణామము బొంది బుద్ధపదవినిచేరిన ప్రథమ మానవుడు మన ప్రస్తుతబుద్ధుడగు గౌతముడు. వెనుకటి బుద్ధులందరును ఇతరపరిణామ ఫలములైయుండిరి. ఆయున్నతపదవిని బొందుటకై ఆ యితపడుటలో ఆయన అపారమగు ప్రత్యేకకృషిని జేయవలసియుండెను. ఆకృషి అంత ఉత్కృష్టమైనదగుటచేతనే బౌద్ధులు దానిని తరుచు 'మహాభినిష్క్రమణము' అనగా, మహాత్యాగము అని శ్లాఘింతురు.

అనేకవేల సంవత్సరములక్రిందట పరమపురుషులలో నొకరు నాల్గవ మూలజాతికి జగద్గురువు అగుటకు యోగ్యత సంపాదింపనవసరముకలిగెను. ఏలయన,

మానవజాతికి కావలసినబుద్ధులు ఆ మానవులలోనుండియే రావలసిన సమయము వచ్చెను. మన చక్రముయొక్క నాల్గవజన్మలో నాల్గవ పరివర్తనములో మధ్యకాలము వరకు, మనకు కావలసిన మనువులను, జగద్గురువులను ఇతర గొప్ప అధికారులను మనకంటె చాలాఎక్కువ పురోవృద్ధిని బొందినచక్రములయందలి యితర మానవ జాతులు మన జాతికి ప్రసాదించిరి. మనమట్లు సహాయముపొంది యుండుటచేత, మనకంటె చిన్నవారై తక్కువపరిణామమునొందిన వ్యూహములకు అవసరము కలిగి నప్పుడు మనముకూడ సహాయము చేయవలసియుండును.

అట్టి విధములుగా సమస్తజీవముయొక్క సౌభ్రాతృత్వము ప్రదర్శితమగు చున్నది. ఇది కేవలము మానవసోదరత్వమే కాదనియు, ఒక ప్రపంచచక్రములోని జీవములయొక్క సోదరత్వము మాత్రమేకూడ గాదనియు, ఒక సౌరకుటుంబములోని అన్ని చక్రములలోని జీవులు సోదరభావముతో నొకరి కొకరు సహాయముచేసికొను చుందురనియు విశదమగును. సూర్యకుటుంబములుకూడ ఆప్రకారము పరస్పర సహాయముచేసికొను ననుటకు నాకు ప్రత్యక్షనిదర్శనమేమియులేదు. కాని సాదృశ్యముచే అట్లు జరుగుచుండునని నేనూహించెదను. ఇదివరలో చెప్పినట్లు ఇతర వ్యూహములనుండి వచ్చిన ఆగంతువులను నేను స్వయముగా జూచితిని. మరియు వారు కేవలము విహారార్థమై ప్రయాణముచేయుచుండుట లేదనియు, నిశ్చయముగ ఏదోయొక సత్కార్యము నిమిత్తమై మన వ్యూహములోనికి వచ్చియుండిరనియు నేను కనిపెట్టితిని. వారేకార్యమునకై వచ్చిరో నాకు తెలియదు. తెలిసికొనుట నాపనికాదు.

పైనచెప్పిన ప్రకారము చిరకాలముక్రిందట ఒకసమయమందు మానవజాతి తన స్వంతగురువులను సిద్ధముచేసికొనుట కారంభించియుండవలెను. కాని యిట్టి యుత్కృష్టమగు బాధ్యతనహింపగలస్థితికి సరిగా నెవ్వరునుచేరియుండలేదని మాకు తెలిసినది. ఆ కాలమందు ఆధ్యాత్మికవికాసములో సమానులై మానవజాతియొక్క మొదటి ఫలములని చెప్పదగిన యిరువురుసోదరులు మాత్రముండిరి. వారిలో నొకరు ప్రస్తుతము గౌతమబుద్ధ ప్రభువని మనము చెప్పుచుండెడువారు; రెండవవారు మన ప్రస్తుత జగద్గురువులగు మైత్రేయ ప్రభువు. అవసరమగు యోగ్యతలలో ఏవిధముగా వారు కొంతతక్కువో మనకు తెలియదు. కాని, కేవలము మానవజాతియెడల ఆయ నకుగల అపారప్రేమచే గౌతమ ప్రభువు అవసరమగు పరిణామముబొందుటకు

వలయు ప్రత్యేకకృషినంతను జేయసంసిద్ధుడనగుదునని వెంటనే అంగీకరించెను. ఒక్కొక్క జన్మలో నొక్కొక్క సుగుణమును సాధించుచు అనేక జన్మలలో ననేక విశిష్టలక్షణములను సంపాదించుకొనెనని సంప్రదాయముచే తెలియును.

బౌద్ధుల పవిత్రగ్రంథములన్నిటిలోను బుద్ధుని ఆమహాత్యాగము ప్రశంసింప బడినది. కాని, ఆత్యాగముయొక్క నిజస్వభావమును వారు సరిగా గ్రహింపలేదు. ఏలయన, బుద్ధుడు బుద్ధపదవినిబొందినతరువాత ధర్మమును బోధించుటకై నిర్వాణ లోకమునుండి క్రిందకు దిగివచ్చుటయే ఆమహాత్యాగమని చాలమంది నమ్మెదరు. ఆయన దిగివచ్చుట నిజమే, కాని, అదియొక గొప్ప త్యాగమనదగినదికాదు. అది సుఖకరమయినది కాకపోయినను, చాల సామాన్యమైన కార్యము. ఆయన నిత్య శాశ్వతజీవనమనదగిన జ్ఞానమును సోదరమానవునకు బోధచేసి సహాయపడుటకై, మానవజాతిలో ప్రథమబుద్ధుడగుటకు వలయు యోగ్యతను సంపాదించుటకు ఆయన అనేకవేలసంవత్సరములు గడుపుటయే ఆయన చేసిన మహాత్యాగము.

ఆయన ఆకార్యమును బహుఘనముగా జేసిరి. దానితరువాత, ఆయన ఆకాలపు బోధిసత్త్వుడై యెత్తిన వివిధ అవతారములగురించి మనకు కొంతవరకు తెలుసును. కాని మనకేమియు తెలియని యితరజన్మలనేకములుండవచ్చును. ఆయన వ్యాసులుగా జన్మించిరి, ప్రాచీన ఈజిప్టుదేశములో హెర్మిస్‌గా జననమొందెను; అప్పుడాయనను త్రివిధాఘనతముడనియు (Thrice-Greatest), జ్ఞాన పిత (Father of All Wisdom) అనియు పిలుచుచుండిరి. ఆయన అనల మతముయొక్క ప్రవక్తలగు యిరువది తొమ్మండుగుర జోరాష్ట్రులలో మొదటి జోరాష్ట్రునిగా అవతరించెను. ఆతరువాత గ్రీసుదేశములో ఆర్ఫియసుగా జన్మించి గీతగానములచే బోధించెను. తుదకు భారతదేశములో ఉత్తరప్రాంతమున జన్మించి తనధర్మమును బోధించి, వెనుకటి జన్మలలో తన శిష్యులయిన జీవాత్మలనన్నిటిని తన చుట్టును జేర్చుకొనుచు, నలుబదియైదేండ్లు గంగామైదానమంతటను పర్యటనము గావించిరి.

ఇంతవరకు మనము గ్రహింపసాధ్యముకాని విధమున, బహుశః పెక్కుయుగములపాటు విశేషశ్రమపడి పనిచేసియుండుటచే కాబోలు, ఆబుద్ధునికార్యములో ఆయన పూర్తిచేయుటకు వ్యవధిచాలక కొన్ని భాగములు మిగిలిపోయినవి. ఏమయిన నుకావచ్చును గాని, అట్టి అంతయువును జేరిన మహానుభావునిలో పొరపాటుగాని, భంగపాటుగాని యుండుట కేవలమసంభవము; కాని, వెనుకటి జన్మలో పడిన అధిక

శ్రీమ ఆయన శక్తికికూడ మించినదై యుండవచ్చును. యథార్థము మనకు తెలియదు; కాని ఆయనకాలములో సంపూర్తిచేయలేకపోయిన కొన్నిస్వల్ప విషయములు మిగిలిపోయినసంగతి మాత్రము వాస్తవము. కనుక గౌతమ ప్రభువుయొక్క శరీరపతనానంతర జీవితము వెనుకటి బుద్ధుల జీవితములకంటె కొంచెము వేరుగా నున్నది. ఇదివరకు చెప్పినట్లు సామాన్యముగా, బోధిసత్త్వులు తమ ఆఖరు జన్మను గడపి బుద్ధత్వపదవినిబొందినతరువాత క్రైస్తవమతసంప్రదాయములో చెప్పినట్లు తను "పండించిన వెన్నులను" గూడ దీసికొని దివ్యవైభవములో ప్రవేశించినతరువాత, తన బాహ్యకార్యమును పూర్తిగా తన స్థానీయుని కొప్పగించి, మానవజాతికై ఉన్నత లోకములలో కృషిసలుపుదురు. ఒక ధ్యానిబుద్ధుని వివిధములగు ఈకార్యకలాపము లెటువంటివైనను, ఆయనమాత్రము తిరిగి భూమిమీద అవతరించరు. కాని, గౌతమ బుద్ధుని జీవితము నావరించియున్న చిత్రపరిస్థితులన్నిటికారణముగా రెండు భేదములు కనబడుచున్నవి, రెండుమార్పులు చేయబడినవి, లోపము పూర్తిచేయుటకు రెండు పనులు చేయబడినవి.

## పరిశిష్ట క్రియలు

మొదటిది యేమన: గౌతమప్రభువు బుద్ధపదవినిబొందినవెంటనే మహేశుడును, ఏకోపదేష్టయునగు లోకప్రభువు శుక్రమండలమునుండివచ్చిన జ్యోతిష్పతులగు తమ ముగ్గురు శిష్యులలో నొకరిని భూలోకములో జన్మించి బహుకొద్దికాలము భారతదేశమంతటను సంచారముచేసి కొన్ని మఠములు అను మత కేంద్రములను నెలకొల్పుటకై పంపుట. ఆజన్మలో ఆయనపేరు శంకరాచార్యులు. ఆయన రెండువేల సంవత్సరముల పైకాలము క్రిందట జన్మించి ఆచార్యపరంపరను స్థాపించినవారుగాని, మన ప్రస్థానత్రయమునకు వ్యాఖ్యానములను రచించిన శంకరాచార్యులవారుకారు.

సుమారిరువది శతాబ్దములక్రిందట అవతరించిన శంకరాచార్యులవారు హిందూతత్త్వదర్శనము నొకదానిని స్థాపించి, హిందూమతములోని సంస్కారరూపములకు నూతనజీవమునిచ్చి, బుద్ధుని యుపదేశము లనేకములను సమీకరణముచేసి, హిందూమతమును చాలవరకు పునరుద్ధరించెను. ఈనాటి హిందూమతము దాని మహాదాదర్శమునుండి పెక్కువిధముల కొఱతబడియున్నను, బుద్ధునికాలమునకు పూర్వమున్నస్థితికంటె నెక్కువ చైతన్యవంతముగా నున్నది. ఆపురాతన కాలములో హిందూమతము ఆచారానుసరణమాత్రమై భ్రష్టమై యుండెను. పశువులను బలి

యిచ్చెడు దురాచారము మాసిపోవుటకు చాలవరకు శంకరాచార్యులు వారే కారణము. భారతదేశములో నిప్పటికిని పశుబలులు కానవచ్చుచున్నను, చాలతక్కువగా, జరుగుచున్నవని చెప్పవచ్చును. ఆయన భూలోకములో బోధచేయుటయేగాక, ఉన్నతలోకములకు సంబంధించిన కొంతయోగవిషయమగు గుప్తకార్యమునుగూడ చేసెను. భారతదేశముయొక్క అనంతరజీవనమునకా గుప్తకార్యము విశేష ప్రయోజనకారియయ్యెను.

నేనుచెప్పిన రెండవ పరిశిష్టక్రియను నెరవేర్చుటకు గౌతమప్రభువు స్వాయముగ బూనుకొనెను. ఆయన కేవలము ఇతరమగు నున్నతలోకకార్యమునకే కాలమునంతను వినియోగించుటకు బదులు తాను పరిణామముపొందిన యీప్రపంచముతో తగినంత సంబంధమునుంచుకొని యుండిరి. ఆకారణముచే ఆయన స్థానీయులు అవసరమైనప్పుడు ఆయనను ఆహ్వానముచేయగలరు; మరియు అత్యావశ్యకమగు సందర్భములలో ఆయన సలహాను సహాయమును బొందగలరు. అదియునుగాక, ప్రతి సంవత్సరము ఆయన నిర్వాణ దినసందర్భమున ఈ ప్రపంచమున కొకసారి దయచేసి తన ఆశీర్వచనములను వర్షింపజేయుట కంగీకరించిరి.

బుద్ధదేవుని కొక విశిష్టమగు శక్తికలదు. ప్రపంచమునకు తన ఆశీర్వాదమును ప్రసాదించినప్పుడాశక్తిని ఆయన ప్రసరింపజేయుదురు. ఆయన ఆశీర్వాదము అసమానమై అత్యద్భుతముగానుండును. ఏలయన, బుద్ధులయినవారు తమపదవిచేతను, అధికారబలముచేతను మనకూహాతీతమగు లోకములతో సంపర్కము గలిగియుండి, ఆ లోకములకు చెందిన ప్రత్యేకశక్తులను రూపాంతరమొనరించి మన లోకములకు దింపి ప్రసరింపజేయగలరు. బుద్ధుని మాధ్యస్థములేనియెడల ఆశక్తులు మనకీయైహికజీవనములో నిరుపయోగముగా నుండును. ఆశక్తుల స్పందములు అతిదారుణము, అత్యద్భుతమునగు వేగముగలవగుటచేత, మనకెంతమాత్రము తెలియకనే అవి మనలోనుండి యిటు నటుపోవుచుండును. వానియునికిగూడ మనమెన్నడును తెలిసికొని యుండము. కాని, యిప్పుడాయన ఆశీర్వాదముయొక్క శక్తి ప్రపంచమంతటను వెదజల్లబడి, తత్క్షణమే అది వివిధములగు వెల్లువలద్వారా తెరచిన గొట్టములలో నీరుచొచ్చి ప్రవహించునట్లు ప్రసరించి, ప్రపంచములోని సత్కర్మకు బలముచేకూర్చును; దానిని గ్రహింపగలవారి హృదయములకు శాంతిని, ఆనందమును సమకూర్చును.

## వైశాఖోత్సవము

గౌతమబుద్ధుని కడపటియవతారములో ఆయన జననము, బుద్ధత్వమునొందుట, నిర్యాణము, మూడు ముఖ్యసంఘటనలుగూడ వైశాఖ శుద్ధపౌర్ణమి రోజుననే సంభవించియుండుటచేత, ఆ దినమే (సాధారణముగా మే నెలలో) ఈ యద్భుత ఆశీర్వాద ప్రసారము జరుగుటకు నిర్ణయమైనది.

గౌతమబుద్ధు లీపౌర్ణమిరోజున మన ప్రపంచమును సందర్శించు సందర్భమున, దానిలోగల ఉత్కృష్టమగు అంతరంగిక మహాత్మ్యమట్లుండ, భూలోకములో ఒక యుత్సవముగూడ జరుపబడును. ఆ యుత్సవమునకు సమావేశమగు సామాన్య యాత్రికుల సమక్షమందు ఆయన ప్రత్యక్షముగా గనిపించును. యాత్రికులందరు వాస్తవముగా ఆయనను చూడగలరో లేదో నేను నిశ్చయముగ చెప్పలేను. కాని, ఆయన ప్రత్యక్షమగు క్షణమందు యాత్రికులందరు సాష్టాంగముగ నమస్కరింతురు. గౌతమ ప్రభువును నిస్సంశయముగా చూచెడు సిద్ధపురుషులును, వారల శిష్యులును నమస్కరించుటజూచి జనసమూహముకూడ వారిననుకరించి సాష్టాంగపడవచ్చును. అధమము యాత్రికులలో కొందరయినను ఆ ప్రభువును జూచియుందురని అనుకొనవచ్చును. ఎందుచేతననగా, ఆ యుత్సవము జరిగెడుసంగతి మధ్య ఆసియాలోని బౌద్ధమతస్థులందరకు బాగుగా తెలియును. దానిని బుద్ధుని 'ఛాయాదర్శనము', లేక, ప్రతిబింబదర్శనము, అని చెప్పుకొందురు. ఆ యుత్సవమును గురించి సాంప్రదాయానుసారముగ చెప్పెడుగాధలు చాలవరకు వాస్తవముగా గనిపించును. అనేకమంది యాత్రికుల జట్టులు సంవత్సరములకొలది తిరిగియున్నను ఉత్సవము జరిగెడుస్థలమును గనిపెట్టలేకపోయిరని కొన్ని కథలనప్పుడప్పుడు వినుచుందుముగాని, సాధారణముగా మేము చూడగలిగినంతవరకు ఆ సమయమునకు ఆ పరిసరప్రాంతమందున్న మనుజుడెవడైనను ఆ యుత్సవమునకు హాజరు కాలేకపోవుటకు అభ్యంతరము మాకేమియు కనిపించలేదు. యాత్రికుల సంఖ్యను తగ్గించుటకు యత్నమేమియు గనబడదు. లోకప్రభువును, ఆయన శిష్యులు ముగ్గురునుదక్క, మహాశ్వేత సోదరబృందము వారందరు ఆ యుత్సవమునకు వచ్చెదరు. మన దివ్యజ్ఞానసమాజసభ్యులలో త్రికరణశుద్ధిగా బ్రయత్నముచేయువారు వారి కామశరీరములలో ఆ యుత్సవమున కేలరాజాలరో కారణముకనిపించదు. రహస్యమును తెలిసికొనినవారు యుత్సవమునకు, అనగా

సరిగా పౌర్ణమిఘడియకు పూర్వమొక గంటయున్న తరువాత నొకగంటయున్న తమ శరీరములను నిద్రపుచ్చుటకు ప్రియత్నింతురు.




లోయ

ఈ యుత్సవమొక చిన్న పీఠభూమిమీాద జరుగును. దానిచుట్టును చిన్న చిన్న కొండలుగలవు; అది హిమగిరి కుత్తరదిశను, నేపాలుదేశపొలిమేర కనతిదూరమున నున్నది. అది లాస్సానగరమునకు పడమరదిశను రమారమి నాలుగువందలమైళ్ళ దూరమున నుండవచ్చును. ఈ చిన్నప్రిదేశమాకారములో దీర్ఘ చతురస్రముమువలె నుండును. పొడవు మైలున్నరయును, వెడల్పు అంతకు తక్కువగాను నుండవచ్చును.

నేల దక్షిణమునుండి యుత్తరమునకు కొంచెము వాలుగలిగి యుండును. అక్కడక్కడ కుళవంటిగడ్డియు, కర్కశమగు పనికిరాని తుప్పలునున్నను, చాలవరకు ఆమైదానము బోడిరాతిభూమియైయున్నది. ఆ పీఠభూమిలో కొంతవరకు పడమటి వైపున ఒక యేరు ప్రవహించి, వాయవ్యమూలనుదాటి, ఉత్తరహద్దునకు మధ్యగా బయటకుపోయి, దేవదారువృక్షములతో నిండిన యొకలోయ గుండాపోయి, తుద కొక దూరముననున్న సరస్సులో కలియును. చుట్టుప్రక్కల ప్రదేశమంతయు నిర్జనమై యడవివలె నుండును. మైదానమునకు తూర్పువైపున నొక కొండ వాలున ఒక శిధిలమైన స్తూపమును, దాని ప్రక్కనే రెండుమూడు గుడిసెలును దక్క ఎచ్చటను మనుష్యనివాసములు కనబడవు. మైదానముమీద దక్షిణభాగములో మధ్యను బూడిదరంగుతోగూడి కొంచెము తెలుపురంగుగల పెద్దరాయి యొకటి గలదు. దానిపైన యేదో మెఱయు పదార్థముతో చారలుగీయబడినట్లు కనబడును. పన్నెండు అడుగుల పొడవు, ఆరడుగుల వెడల్పు, మూడడుగల యెత్తుగలిగి ఆరాయి యొక వేదికవలె నుండును.

ఆపౌర్ణమిరోజునకు ముందు కొన్నిదినములనుండియు అనేక నల్లని విచిత్రమైన డేరాలు ఆయేటిగట్లపైన, ప్రక్కనున్న కొండచరియలపైన లేచుచుండును. అంతవరకు నిర్జనమైయున్న యీప్రదేశము పెద్ద జనసమూహముల నెగడులతో ఉత్సాహముగలిగించుచుండును. మధ్య ఆసియాలోని లంబాడీలవంటి మూకలనుండి యనేకు లచటికి వచ్చెదరు. కొందరింకను పైనుండి వత్తురు. చతుర్దశిరోజున ఆయాత్రికులందరు పరిశుభ్రముగా స్నానముచేసి, వస్త్రములను శుభ్రముగా నుతుకుకొని యుత్సవమునకు సిద్ధపడుదురు.

పౌర్ణమి ఘడియకు కొన్నిగంటలు ముందే వీరందరు మైదానముమీద పల్లముగానున్న ఉత్తరభాగమున సమావేశమై, అందరును నిశ్శబ్దముగా బారులు దీర్చి వేదికకుముందు చాలదూరమున గూర్చుందురు. సాధారణముగా కొందరు లామాలు (టిబెటులోని మతగురువులు) కూడ వచ్చెదరు. వారీసందర్భములో యాత్రికుల కుపన్యసించుచుందురు. పౌర్ణమి ముహూర్తమున కొక గంటముందు భువర్లోక ఆగంతువులు దయచేయుదురు; వారిలో దివ్యసోదరబృందములోని సభ్యులు కూడ నుందురు. యాత్రికులకు కనబడుటకుగాను సాధారణముగా వీరిలో కొందరు స్థూలదేహములతో ప్రత్యక్షమగుదురు. వారిని జూచినతోడనే యాత్రికులు

మోకరించియు, సాష్టాంగపడియు నమస్కరింతురు. తరుచుగా మనపరమగురువులును, వారికంటె నెక్కువవారునుగూడ ఈసందర్భములో వారిశిష్యులతోను, అచట సమావేశమైనవారిలో కొందరితోను స్నేహపూర్వకముగా సంభాషింప ననుగ్రహింతురు. ఈలోపున, నియమితులైన కొందరు పురుషు లాశిలావేదికను శుభ్రపరచి, మిక్కిలి మనోహరమగు పుష్పములతో దానిని కప్పి, నాలుగు మూలలను పవిత్రపంకజ హారముల నుంచెదరు. ఆవేదికమధ్య అత్యద్భుతముగా నకిషీ చెక్కబడిన బంగరు కలశమును నీటితో నింపి యుంచెదరు. దానికిముందు పుష్పములమధ్య కొంతస్థలమును విడిచిపెట్టెదరు.

## ఉత్సవము

పౌర్ణమి ముహూర్తమున కరగంటముందు మహాచోహానువారు సౌంజ్ఞచేయగా సోదరబృందముయొక్క సభ్యులందరు మైదానమునకు మధ్యభాగమున వేదికకుత్తర దిశనుచేరి మూడు వరుసలులోనుండి వృత్తాకారముగా నిలబడుదురు. అందరును వలయకేంద్రమునైపు జూచుచుందురు. వారిలో నూతన సభ్యులందరు వెలుపలి వరుస లోనుందురు. పెద్దఅధికారులు లోపలివృత్తములో ముఖ్యమగు స్థానములయందుందురు.

అప్పుడు బౌద్ధమతగ్రంథములలోని కొన్ని శ్లోకములను పాలీభాషలో చదివెదరు. అది ముగిసి నిశ్శబ్దముగానున్న తరువాత మైత్రేయప్రభువు వృత్తకేంద్రమందు ప్రత్యక్షమగును. అధికారమునకు, శక్తికి చిహ్నమగు రాజదండమును ఆయన తమ కరముల ధరించియుందురు. అద్భుతమగు ఈచిహ్నమొక విధముగా గ్రహమండలేశ్వరుడు ప్రసరింపజేయు శక్తులకు భౌతిక కేంద్రముగనున్నది. ఆయన మన గోళచక్రముగుండా అనేక కోట్లసంవత్సరములక్రిందట మొదటిసారి జీవతరంగమును ప్రసరింపజేసినప్పుడు ఈదండమును మంత్రించి చాల శక్తివంతమొనర్చెను. ఈదండ మీశ్వరుని శ్రద్ధ ఏకాగ్రమైనట్లు పార్థివ చిహ్నమనియు, ఈశ్వరుని దృష్టి యొక గ్రహమునుండి మరియొక గ్రహమునకు మారునప్పుడు ఈదండముకూడ దాని ననుసరించుననియు, అది యే గ్రహమునందుండిన ఆగ్రహము అప్పటికి పరిణామమునకు ప్రధానరంగమై యుండుననియు, మనగోళమును విడిచి తరువాత గోళమునకదిపోయినయెడల మనభూమి ఇప్పటివలె నుండక జడమైపోవుననియు మేము వినియుంటిమి. పృథ్వీద్రవ్యములేని గ్రహగోళములోనికికూడ దీనిని తీసికొనిపోవుదురో లేదో మాకు తెలియదు. ఇది యెట్లుపయోగింపబడునో, ప్రపంచక్షేమమున కెట్లు ఇది తోడ్పడునో మాకేమియు తెలియదు. ఈదండమెల్లప్పుడును శంబళద్వీపములో లోకప్రభువువద్ద భద్రపరచబడియుండును. మాకు తెలిసినంతవరకు ఈవైశాఖోత్సవమునకు మాత్రమే ఆయన యొద్దనుండి యీదం

డము బయటకు కదలును. అది ఇప్పుడు లోకమునకు నష్టమైపోయిన 'ఆరికేల్కమ్' అను లోహముతో చేయబడి దాదాపు రెండడుగుల పొడవును, రమారమి రెండంగుళముల వ్యాసమును గలిగి 'రూళ్ళ' కఱ్ఱవలెనుండును. రెండు అగ్రములయందు ఒక్కొక్క పెద్దవజ్రము బంతివలె చెక్కబడి యుండును; ఈవజ్రపుబంతులకు సూచ్యాకారముగల రెండు శిఖరములుండును. అది యెల్లప్పుడును అగ్నిచే నావృతమైయున్నట్లుండును, దాని తేజోమండలము మిక్కిలి ప్రకాశవంతమై స్వచ్ఛమగు జ్యోతివలె చిత్రముగా నుండును. మైత్రేయప్రభువుతక్క మరియెవ్వరును ఈసంస్కారసందర్భములో దానిని తాకరను విషయము గమనింపవలసియున్నది.

సిద్ధపురుషుల వలయముయొక్క కేంద్రమందు మైత్రేయప్రభువు ప్రత్యక్షమైనప్పుడు ఆసిద్ధపురుషులు, దీక్షితులు, అందరును ఆయనకు సవినయముగ నమస్కరింతురు. తరువాత మరియొక శ్లోకమును చదివెదరు. ఆతరువాత శ్లోకముల నింకను చదువుచు లోపలి రెండు వలయములలో నుండువారును ఎనిమిదిభాగములుగా విడిపోయి వెలుపలి వలయములో నొక శిలువవలె నేర్పడుదురు.



మైత్రేయులవారు కేంద్రమందే యుందురు. ఆతరువాత శిలువవలె నున్నవారందరు త్రిభుజాకారముగా నిలబడుదురు. మైత్రేయప్రభువు ఆ త్రిభుజాగ్రమందు దురు. ఆయన ఇప్పుడు వేదికకు దగ్గరగా నుందురు. బంగరుకలశమునకు ముందున్న ఖాళీస్థలమందు ఆయన భక్తిపూర్వకముగా మంత్రదండమునుంచును. ఆయన వెనుక

వెలుపలి వలయములోనున్నవారందరు విడిపోయి పటములో చూపించిన ప్రకారము విచిత్రమగు విధమున వేదికాభిముఖులై నిలబడెదరు. ఆతరువాత వీరందరు తలక్రిందుగనున్న త్రిభుజమువలె నేర్పడుదురు. ఈయాకృతి, చుట్టూ ఉండెడు సర్పము మాత్రము లేకుండ మన దివ్యజ్ఞానసమాజముయొక్క సుప్రసిద్ధ చిహ్నమును బోలియుండును. తరువాత ఈ వ్యూహమంతయు పంచకోణ తారాకారముగ నేర్పడుదురు. మైత్రేయులవారు వేదికకు చేరువగనున్న దక్షిణాగ్రమందే యుండును. తక్కిన యున్నతాధికారులు, లేక చోహానులు, అయిదుచోట్ల, అనగా, రేఖలు ఒకదాని నొకటి కలసికొనుచున్న స్థలములయందు, నిలబడుదురు. ఆవ్యూహాకృతులను వర్ణించుట సులభముకాదు గనుక వాని యాకారములను 13 వ చిత్రములో చూపించడమైనది.

ఆఖరుమండలరూపము యేర్పడినప్పుడు శ్లోకపఠనమాగిపోవును. కొంచెముసేపు అందరు నిశ్శబ్దముగానున్న తరువాత మైత్రేయప్రభువు తిరిగి దండమును చేతుల ధరించి, దానిని తనశిరముపైకెత్తి పాలీభాషలో గంభీరమగు స్వరముతో "అంతయు సిద్ధముగానున్నది. ప్రభూ! దయచేయుడు!" అని యాహ్వానము చేయును. తరువాత నాదండమును వెనుకటిస్థానమున నుంచుదురు. సరిగా పౌర్ణమి సుముహూర్తమునకు బుద్ధభగవానుడు దక్షిణముననున్న కొండలపై ఖగోపరిభాగమున తేలుచు బ్రహ్మాండమగు రూపమున గనిపింతురు. దివ్యసోదరబృందములోని సభ్యులందరు కరముల జోడించి నమస్కరింతురు. వారివెనుకనున్న యాత్రికులందరు సాష్టాంగమొనరించియటులనేయుందురు. తక్కినవారు బుద్ధుడు తనభూలోకజీవితములో బడిపిల్లవాడగు చాత్తునకు స్వయముగనేర్పిన మూడుశ్లోకములను పఠింతురు.

1. శాక్యమునియగు బుద్ధభగవానుడు మానవులలో నుత్తమబోధకుడు. ఆయన చేయవలసినదానిని జేసి ఆవలియొడ్డున—నిర్వాణమున — చేరెను. ఆయన బలవీర్యములతో నిండినవాడు. ఆ పరమపూజ్యుని మార్గదర్శిగా గైకొందును.
2. సత్యము ఆధ్యాత్మికమయినది.అది మానవుని కామవికారములనుండియు, కోరికనుండియు, దుఃఖమునుండియు విముక్తునిజేయును; అది యకళంకము, మధురము, సరళము, సహేతుకమునై యున్నది. ఈ సత్యమును మార్గదర్శిగా గైకొందును.

౩. సత్యము నెరిగినట్టియు, నాలుగుజంటలుగా నాలుగు తరగతులలో నున్నట్టియు, ఎనిమిదితరగతుల పరమపురుషులకు, ఎవ రేమియిచ్చినను నిజముగా గొప్పఫలితముగలుగును. ఈ పరమపురుషుల సోదరబృందము నే మార్గదర్శిగా గైకొందును.

## మహామంగళము

అప్పుడు జనులందరు లేచి ఆ ప్రభువును దర్శించుచుండగా, వారి శ్రేయస్సుకొరకై సోదరబృందము మహామంగళసూక్తములోని దివ్యవాక్యములను గానము చేయుదురు. ప్రొఫెసర్ రీస్ డేవిడుగారు ఆ గీతములను ఆంగ్లేయభాషలోని కనువదించిరి. వానిభావము ఇట్లున్నది:

శుభమునర్థించు మనుజులు, ఋభువులెల్ల
మంగళంబంద్రు బహుళహూ సంగతులను,
కానవచియింపవే, గురుఘనవరేణ్యా
ఎద్దియగు మహితమంగళం, బెద్దిశుభమొ.

బుద్ధిహీనుల సేవలపొంతబోక
జ్ఞానవంతులసేవను బూని యుంట
గౌరవార్హుల నెప్పుడు గౌరవించు
టిది మహామంగళంబంచు విదితమగును.

మంచి దేశములందు వసించియుంట
పూర్వజన్మల సత్కృతి పొసగియుంట
మంచి కోరికలే మదిగాంచియుంట
ఇది మహామంగళంబంచు విదితమగును.

సూక్ష్మబుద్ధియు సద్విద్యశుభదమైన
ఆత్మనియతి సుశిక్షితమైన మనసు
ప్రియము మధురముగా నుండునిచుమవాక్కు
ఇది మహామంగళంబంచు మదినెఱుంగు.

తల్లిదండ్రులబూజించి తనియ జేసి
ఆలుబిడ్డల బోషించి యనవరతము
నిర్మలంబైన వృత్తిని నేర్పు మెఱయు
టిది మహామంగళంబండ్రు విదితనరులు.

భిక్షమానక ధర్మంబు పెంచుచుంట
బంధుజనులకై బాసటై బఱగుచుంట
పాపరహితములైనట్టి పనుల జేయు
టిదిమహామంగళంబంచు మదినెఱుంగు.

హేయమంచును పాపంబు జేయకుంట
మత్తుగొల్పెడు పానంబుమానియుంట
మంచి పనులను జేయంగ మసలియుంట
ఇది మహామంగళంబందు రుదితయశులు.

వినయభావంబు, నమ్రత, ఎనసియుంట
తృప్తి, మేలుమఱువకుంట, తీవ్రభక్తి,
యుక్తవేళల ధర్మప్రసక్తివినుట,
ఇది మహామంగళంబని మదినెఱుంగు,

ఘనమయిన, దుఃఖసహనము వినుతదమము,
శాంతులయినట్టి వారల సంగతియును
యుక్తకాలిక మతవచస్సక్తిగనుట,
ఇదిమహామంగళంబని మదినెఱుంగు.

ఆత్మనిగ్రహశౌచము లమఱుచుండ
సత్యముల నాలుగింటిని చక్కనెఱిగి
అమల నిర్వాణధామము ననుభవించు
టిది మహామంగళంబంచు మదినెఱుంగు.

జీవితంబున గల్గెడు చెట్టలనెడు
మహిత ఘాతల కదలక మాఱువడక

భగ్నరాగియు నవికల భద్రుడగుట
ఇది మహామంగళంబంచు మదినెఱుంగు.

ఇట్టి సత్త్వవర్తనగల యట్టివాడు
సర్వవిధముల నేరికజయ్యుడగుట
నిర్భయంబుగనుండెడు నిస్తరించి,
ఇది మహామంగంళంబగు నిశ్చయంబు.

కొండలపై దేలుచు గనిపించెడురూపము మిక్కిలిపెద్దదైయుండును. కాని ఆప్రభువు భూలోకములో ధరించినశరీరాకృతినే పూర్తిగబోలియుండును. ఆయన పద్మాసీనుడై చేతులజోడించి, బౌద్ధసన్యాసులు ధరించెడురీతిని కాషాయాంబరములను ధరించియుండును. దక్షిణహస్తముమాత్రము కప్పబడక పైకి కనిపించుచుండును. మానవమనస్సు లూహింపగలిగిన దివ్యలక్షణములన్నిటితో గూడి, శాంతము, శక్తి జ్ఞానము, ప్రేమ, అన్నిటిని మేళవించు వర్చస్సుగలిగి భాసిల్లుచున్న ఆదివ్యవదనమును వర్ణింపసాధ్యముకాదు. ఆయన శరీరఛాయ స్వచ్ఛమగు పసుపుగలిసిన తెలుపు అని చెప్పవచ్చును. ముఖము తీర్చి దిద్దినట్లుండును; నుదురు విశాలమై గంభీరముగ నుండును; నేత్రము లరవిందదళములవలె పెద్దవై, ప్రకాశవంతములై, ముదరరంగుగల నల్లని నీలమువలె మెఱయుచుండును: నాసిక గరుడముక్కువలె చక్కగ కొన దేలియుండును; పెదవులు అరుణవర్ణముగలిగి దిట్టముగా నమరియుండును. కాని, యీవర్ణనమంతయు బాహ్యరూప లక్షణములను మాత్రమే కొంతవరకు తెలుపును గాని, ఆసమగ్రజీవము నెంతమాత్రము చిత్రింపలేదు. శిరోజములు నీలములవలె నల్లనై అలలవలెనుండుమ; ఆ జుట్టు భారతీయుల ఆచారముప్రకారము పొడవుగా లేదు, ప్రాచ్యదేశ సన్యాసుల సంప్రదాయముననుసరించి పూర్తిగా ముండనమైనను చేయబడలేదు. చిత్రముగా భుజములపైకి కత్తిరింపబడి, మధ్యపాపటదీసి వెనుకకు దువ్వివేయబడియున్నది. రాజకుమారుడగు సిద్ధార్థుడు సత్యాన్వేషణమునకై గృహమువీడిపోయినప్పుడు తన పొడుగైన కేశములను చేతబట్టి ఖడ్గముతో నొక్కవ్రేటున భుజములపైకి నరికివేసెననియు, ఆతరువాత ఆ కేశముల నెల్లప్పుడును అంతవరకే యుంచుకొనెననియు నొక గాధకలదు.

ఆయన ఆకృతి నావరించియుండు దివ్యమగు తేజోమండల మీదృశ్యమంతటిలోను మిక్కిలి ముఖ్యమగు లక్షణము. బాగుగా పరిణామమునొందిన మనుజులందరి

తేజోమండలములువలెనే, అదికూడ ఒకేకేంద్రముగల పెక్కుగోళములవలెనుండును. **Man Visible and Invisible** "దృశ్యాదృశ్యమానవుడు' అను గ్రంథములో ఇరువదియారవ చిత్రపటములో గనబరచిన అర్హాత్ యొక్క తేజోమండలమువలెనే దీని యాకారముగూడనుండును. కాని, రంగులయొక్క యేర్పాటుమాత్రము విశిష్టమై యున్నది. ఆయన విగ్రహమంతయు వెలుగుచే నావృతమైయున్నది. ఆవెలుగు కండ్లు చీకట్లుకమ్మునంతటి ప్రకాశవంతముగానున్నను స్ఫటికమువలె స్వచ్ఛముగా నుండును. ఆ వెలుగుపై నొకక్షణమైనను దృష్టినినిలుపుటకు శక్యముకాదు. అయినను, దానిలోనుండి ఆయనవదనమును, వస్త్రములవర్ణమును స్పష్టముగా జూడగలము. ఆవెలుగుకు వెలుపల దివ్యమగు నీలవర్ణముగల వలయముండును. దాని తరువాత వరుసగా కరగినబంగారువంటి పసుపుపచ్చ, మనోహరమగు ఊదా, స్వచ్ఛమగు రజతమువంటి తెలుపు, కెంపువంటి యెఱుపురంగులుగల గోళములు వ్యాపించి యుండును. ఆకాశమున జూచినప్పుడు బద్దెలవలె కనిపించుచున్నను ఇవన్నియు వాస్తవముగా గోళములే. ఈగోళములకు బైట ఈచెప్పినరంగుల కిరణములన్నియు కలిసిపోయి, మధ్యమధ్య ఆకుపచ్చ ఊదారంగులు మెఱయుచుండ, శరములవలె చొఱుచుకొని పోవుచుండును.

బౌద్ధుల పవిత్రగ్రంథములలో ఆప్రభువుయొక్క తేజోమండలమును వర్ణించినప్పుడు రంగులన్నియు సరిగా పైనచెప్పినరీతిగనె వివరింపబడినవి. 1885 వ సంవత్సరములో సింహళములోని బౌద్ధులకొక ప్రత్యేకపతాకమును నిర్ణయింపవలసి వచ్చినప్పుడు మనసమాజస్థాపకులు, ప్రథమఅధ్యక్షులునగు కల్నల్ ఆల్కాటుగారు కొలంబోలోని సింహళీయ సోదరులతో నాలోచించి పైనచెప్పిన వరుసనే వర్ణసంచయమునెంచి యుపయోగించిరి. కొన్ని సంవత్సరములతరువాత ఆయన టిబెట్ దేశముతరపున భారతదేశ రాజప్రతినిధివద్దకు వచ్చిన రాయబారితో డార్జిలింగు నగరములో మాట్లాడినపుడు "దలాయిలామా" పతాకములోగూడ రంగులన్నియు పైవిధముగనే యుండునని అతడుచెప్పినట్లు ఆల్కాటుగారి "ఓల్డు డయిరీలీవ్సు" వలన తెలియుచున్నది. ఈపతాకచిహ్నములోగలభావము సాంప్రదాయకముగా అన్ని దేశములలోను సర్వత్ర అంగీకరింపబడినట్లు కనబడుచున్నది. బర్మాలోని రంగూనులోను, కాలిఫోర్నియాలోని "సాక్రమెంటో" లోను గల బౌద్ధదేవాలయములలో గూడ నేనావిషయమును (పతాకములోని రంగులపద్ధతి) స్వయముగా జూచితిని.

ఈగ్రంథముయొక్క ప్రథమముద్రణములో ముద్రించిన ముఖచిత్రములో దుర దృష్టవశమున రంగులవరుస తప్పుగా ముద్రింపబడినది. ఆపొరపాటిప్పుడు సవరణ చేయబడినది. ఆవైశాఖోత్సవసమయమున ఆకాశములో వాస్తవముగా గనబడు రంగులయొక్క కాంతిగాని, పరిశుద్ధతగాని అచ్చులో సరిగా ప్రదర్శించుట అసాధ్య ముగదా! మేముచేయగలిగినది పాఠకుల కొంకింతసూచనజేసి మిగిలినది వారియూ హకు విడుచుటయే.

వెనుకటిరోజులలో ప్రచురింపబడిన గ్రంథములలో మానవుని తేజోమండల ములో సిందూరవర్ణమున్న యెడల కోపమునుమాత్రమే తెలియజేయునని చెప్పబడి నది. సామాన్యపు స్థూలభువర్లోకములో అది సత్యమే. కాని యున్నతలోకములలో పరిశీలనజేసినయెడల సామాన్యపు సిందూరపు ఎరుపుకంటె బహు తేజోవంతమగు ఎరుపురంగు గనిపించును. అది జీవజ్యోతియొక్క సారము, జంకెరుగని ధైర్యము, అచంచలమగు గొప్పపూనిక — అనుగుణములను సూచించును. బుద్ధభగవానునికా గుణములు అనుత్తమమగురీతిని యుండుటచేతనే ఆయన తేజోమండలములో ఈ యెరుపురంగు గనిపించుచున్నది. అసామాన్యమగు ప్రాముఖ్యతతో అట్లాయెరుపు రంగు అతి ప్రకాశవంతముగా వ్యక్తమగుటచే, ఇదివరలో నేనుచెప్పినప్రకారము, అనేకయుగములపాటు ఆత్మవికాసముకొరకై బ్రహ్మాండమగు కృషిజేయుటవలన ఆయనలో ప్రత్యేకముగా ఆగుణము లావిష్కరించెనని మన మూహింపవచ్చును.

ఈయుత్సవములో మిక్కిలి ప్రధానపాత్రవహించిన మైత్రేయప్రభువు కాల క్రమమున గౌతమబుద్ధునిస్థానమున బుద్ధపదవి నలంకరించును. మైత్రేయులవారి తేజోమండలమును ఇప్పుడు వర్ణించిన బుద్ధభగవానుని తేజోమండలముతో బోల్చుట ప్రయోజనకరముగ నుండవచ్చును. దానినూహించుట కతిసులభమగు మార్గమేమన "దృశ్యాదృశ్యమానవుడు" అను గ్రంథములోని యిరువదియారవ చిత్రపటము నెదుటనుంచుకొని దానినిజూచుచు, ఈక్రిందచెప్పబోవురీతిని భావనలో అవసరమగు మార్పుల నూహించుకొనవలెను. ఆ పటమునకు, ఆయన తేజోమండలమునకు సామాన్యమగు పోలికగలదు. కాని, దానికంటె విశేషముగా పెద్దదైయుండును. రంగులు కొంచెము భిన్నముగా నమర్చబడి యుండును.

అర్హాత్ తేజోమండలమునందువలెనే దాని గర్భమందు కండ్లను మిఱుమిట్లు గొలుపు తెల్లని కాంతియుండును. అచటనున్న పసుపుపచ్చనిరంగును దీసివేసి

గులాబి అండమును లోపలనున్న తెలుపువరకు విస్తరింపజేయవలెను; ఆగులాబి అండమునకు వెలుపల నీలమునకు బదులు ఆకుపచ్చ, దాని తరువాత నీలము, అటు తరువాత ఆపుస్తకములో జూపించిన ప్రకారము ఊదాయుండును; కాని, ఆ ఊదా రంగు తరువాత వెడల్పైన సుశోభితమగు లేతగులాబిరంగు బద్దెను వేయవలెను; ఆగులాబిలో ఊదారంగు కలిసినట్లు తెలియకుండ కలిసిపోవలెను. అన్నింటికిపైన, పుస్తకములో కనబరచిన ప్రకారము, రంగులన్నియు మిశ్రమమై కిరణములవలె ప్రసరించుచుండును. అదేప్రకారము దానిలోనుండి తెల్లని కాంతికిరణములు తళుకుతళుకుమని మెఱయుచుండును. కాని అవికూడ ఎప్పుడును ఉండు లేతగులాబి రంగుయొక్క స్పర్శను కొద్దిగా కలిగియున్నట్లు కనిపించును. తేజోమండలమంతయు 'దృశ్యాదృశ్య మానవుడు' లోని పదకొండవ చిత్రపటములోవలె బహు లలిత ముగనుండియు అద్భుతముగా వెలుగుచున్న గులాబిరంగుచే పూతబూయబడియు న్నట్లుగా కనిపించును.

ఇందులో ముఖ్యముగా గమనింపవలసినవిషయమేమనగా, ఈ తేజోమండలము లోని రంగులలో నారింజ, నీలిరంగులు లేవు, తక్కినవి సూర్యకాంతిలోని వర్ణము లున్న వరుసలోనేయున్నవి. మొదట గులాబి (ఇది మొదటపునకు సంబంధించినదే), తరువాత పసుపుపచ్చ, అటుతరువాత వరుసగా ఆకుపచ్చ, నీలము, ఊదాయున్నవి, దానితరువాత 'అల్ట్రావయొలెటు (ultraviolet) లోనికిపోయి పిదప గులాబిలోనికి కరగిపోవుచున్నది. భూలోకమునందలి సూక్ష్మతమ అంతర్లోకము తరువాత భువర్లో కమందలి స్థూలతమ అంతర్లోకము ప్రారంభమగునట్లు యీ గులాబితో మరియొక వర్ణమాల పైస్థాయిని ఆరంభమగును.

నేను పైనచెప్పినదంతయు మిక్కిలి అసంతృప్తికరమగు వర్ణనమనుటకు సందేహములేదు. కాని యింతకు మించి మేము చేయగలిగినది కనిపించదు. మనము చెప్పగలదానికంటె అది యెన్నియో కొలతలకు వ్యాపించియుండునని మాత్రము జ్ఞాపకముంచుకొనవలసియున్నది. ఇంతవరకు వర్ణించుటలో మూడు కొలతలలో గనబడు దృశ్యమునువలె ప్రదర్శింప ప్రయత్నించితిని. కొంచెము భిన్నమగు విధమున మరియొక దృశ్యమును గనవచ్చుననియు, అంతయు కేవలము సత్యమేఅయినను ఫలితములు కొద్దిగా వేరుగానుండవచ్చుననియు జ్ఞాపకముంచుకొనుట వివేకవంత

ముగానుండును. ఉన్నతలోకమునకు సంబంధించిన సత్యములను భూలోకములో గ్రాహ్యమగునట్లు చెప్పుటకు ప్రయత్నించుట కేవలము వ్యర్థము.

మహామంగళసూక్తపఠనము పూర్తియైనతరువాత, మైత్రేయప్రభువు వేదిక నుండి బంగారు కలశమును దీసికొని తన శిరముపైకెత్తి కొన్నినిమిషము లట్లుంచును. యాత్రికులందరుగూడ తమ పాత్రల నట్లే యెత్తుదురు. ఆప్రభువు తిరిగి కలశమును వేదికపై నుంచినతరువాత మరియొక శ్లోకము చదువబడును:

"ఆప్రభువు, జ్ఞానప్రపూర్ణుడు, అష్టవిధజ్ఞానంబును బొందినవాడు, పదునైదు పవిత్రాభ్యాసములలోను కృతార్థుడైనవాడు, బుద్ధపదవినిచేరు యాత్రను విజయముగా సాగించినవాడు, త్రిలోకవేది, అసమానుడు, దేవతలకు మానవులకు కూడ గురువు, ఆపరమపూజ్యుడు, అతడే బుద్ధభగవానుడు."

ఈశ్లోకము పూర్తియగుచుండ బుద్ధభగవానుడు ఆశీర్వాదపూర్వకముగా తన దక్షిణహస్తమును పైకెత్తును.అప్పు డనిర్వచనీయమగు ప్రేమహాసము ఆయన ముఖారవిందమును ప్రకాశింపజేయును. పైనుండి దేవతలు విరివిగా పుష్పవర్షమును కురిపింతురు. దివ్యసోదరబృందమువారందరు తిరిగి వంగి నమస్కరింతురు. యాత్రికులు సాష్టాంగపడుదురు. ఆప్రభువుయొక్క రూపము నెమ్మదిగా కాంతిలో కనిపించకమాయమగును. యాత్రికసమూహమంతయు ఆనందముతో స్తోత్ర పాఠముల జేయుచుందురు. సోదరబృందములోని సభ్యులందరు వారి ప్రవేశక్రమానుసరణిగ మైత్రేయప్రభువువద్దకుపోయి కలశములోని తీర్థమును స్వీకరింతురు. యాత్రికులందరు వారివారి పాత్రలలోని యుదకమును కొద్దిగా త్రాగి మిగిలిన తీర్థమును వారిచిత్రమగు తోలు బుడ్లలో నింప్లకు తీసికొనిపోవుదురు. ఆపవిత్రతీర్థమును గృహమునుండి దుష్టగణములను పారద్రోలుటకును, బహుశః వ్యాధులను నివారణచేయుటకును వినియోగింతురు. మహాసమూహమువిడిపోయి యొకరినొకరు అభినందించుకొనుచుందురు, వారు పాల్గొనిన అద్భుతమగు నుత్సవముయొక్క మరపురాని స్మృతిని వారితోగూడ, దూరముననున్న తమగృహములకు గొనిపోయెదరు.

## బుద్ధుని పూర్వుఐ

ధర్మోపదేశికుడగు సెంటు జాన్ స్వప్నదర్శనములోని బుద్ధుని పూర్వుల యొక్క వర్ణనము చిత్రముగా గనిపించును.

"సింహాసనముచుట్టును ఇరువదినాలుగు ఆసనములు కలవు. శ్వేతవస్త్రము లను ధరించిన యిరువదినలుగురు పెద్దలు వానిపైకూర్చుని యుండుట జూచితిని, వారిశిరములపై బంగారుమకుటములు గలవు."

ఈదృశ్యమునుజూచెడు భాగ్యముగలిగినవారు తమ విశ్వాసకారణముచేతనే జూడగలుగుదురు. ప్రతివానికి ఎప్పుడోయొకరోజున ఆభాగ్య మబ్బుట నిశ్చయము. కనుక సెంటుజాన్ చూడనాశించినప్రకారము, యూదుల సంప్రదాయములో చెప్పిన యిరువదినలుగురు పెద్దలను జూచెను. ఆయిరువదినాలుగు సంఖ్య ఆదృశ్య మును మొట్టమొదటజూచిన తేదీని తెలియజేయును. ఇప్పుడు మనము ఆత్మైక్యము నొంది అనిర్వచనీయమగు ఆదివ్యవైభవమును జూడకలిగినయెడల ఇరువదినలుగురును గాక, ఇరువదియైదుగురుపెద్దలను జూడవలెను. ఏలయన, యూదుల సిద్ధాంతములో ఈసెంటుజాన్ స్వప్నదర్శనము స్థిరపడిపోయినతరువాత మరియొక బుద్ధదేవుడు ఆబుద్ధపదవిని బొందెను. ఆపెద్దలు మనపరివర్తనములోని గోళములలో జ్ఞానమును బోధించిన పరమగురువులు. ఒక్కొక్కప్రపంచమున ఏడుగురు బుద్ధులుందురు గనుక మనకు గడచిన మూడు ప్రపంచములకు ఇరువదియొక్కమంది బుద్ధులువచ్చియుండ వలెను. మన గౌతమబుద్ధుడు ఈనాల్గవ పరివర్తములో ఈప్రపంచమున నాల్గవ బుద్ధుడు గనుక, ఇప్పుడు ఇరువదియైదుగురు పెద్దలు కనబడి తీరవలెను.

క్రైస్తవమత సంప్రదాయములో దానిని కొంచెము వేరుగా చెప్పిరి. పన్నెండుగురు అపోస్తలులును, పన్నెండుగురు ప్రవక్తలును, కలిసి యిరువది నలుగురు అయ్యేనని వారు చెప్పుదురు. ఆయిరువదినలుగురు అపోస్తలులు, ప్రవ క్తలుఅయియున్నయెడల ద్రష్టయగు సెంటుజాన్ కూడ వారిలో చేరియుండ వలెను. మరియు, ఆసంగతి తప్పక చెప్పబడియుండును. ఆపెద్దల శిరములపై బంగరు మకుటములుగలవనిచెప్పి, మరికొన్ని వాక్యముల తరువాత, దివ్యమగు త్రిమూర్తుల గీతములో పాడినట్లు, వారి కిరీటములను ప్రభువుయెదుట బడవైచిరని వ్రాయబడినది.

నాచిన్నతనములో ఈసంగతిని విన్నప్పుడు, ఈపెద్దలు తమ మకుటములను పారవేసినతరువాత తిరిగితిరిగి వారికి మకుటము లెచటనుండి వచ్చుచుండెనని నేను చాల ఆశ్చర్యపడుట నాకిప్పటికి జ్ఞప్తియున్నది. అప్పుడు నాకది బోధపడలేదు. పారవేసినమకుటములు తిరిగి పారవేయబడుటకు వారిశిరస్సులపై ఎట్లు ఎక్కునో నేనూహింపలేకపోయితిని. అట్టి విచిత్రభావములు చిన్నబిడ్డలకు కలుగుటలో ఆశ్చర్య

ములేదు. కాని, సరిగా గ్రహించినయెడల సందేహములన్నియు నివారణయగును. బుద్ధభగవానుని విగ్రహములను జూచినయెడల ఆయన శిరముపైనుండి యొక చిన్న బొప్పి లేక సూచివంటిది పైకివచ్చుచుండుట చూచెదము. అది బంగరు వర్ణముగల మకుటమువలె గన్పించును. పాశ్చ్యాత్యగ్రంథములలో సహస్రదళకమలమని చిత్రముగా వర్ణింపబడిన మానవుని శిరోగ్రమందుండెడు సహస్రారచక్రమునుండి ప్రసరించెడు ఆధ్యాత్మికశక్తి నది తెలియఁజేయును.

ఆధ్యాత్మికముగా విశేషముగా వికసించిన మానవునిలోని ఆచక్రము దివ్య తేజస్సును, వైభవమును ప్రసరింపజేయుచుండును; అందుచే నిజముగా వాని శిరముపై అది కిరీటమువలె ప్రకాశించుచుండును. సెంటుజాన్ వాక్యముయొక్క భావనేమ నగా, అతడు తనలో వికసింపజేసికొనినదానినంతను, తనుజేసెడు అద్భుతమగు కర్మ ఫలమునంతను, తను ప్రభవింపజేసెడు దివ్యమగు ఆధ్యాత్మికశక్తినంతను, సర్వమును నిరంతరము ఈశ్వరకార్యనిర్వహణమునకై ఈశ్వరార్పణము జేయుచున్నాడు. కనుక తిరిగితిరిగి తన మకుటమును ఈశ్వరపాదయుగళమందు పడవేయఁగలడు. ఏలయన, లోపలినుండిశక్తి పొంగిపొరలి పైకివచ్చుచుండును, గనుక, కిరీటములు ఎప్పటి కప్పుడు నిరంతరము ఏర్పడుచుండును.

## బోధిసత్త్వ మైత్రేయులు

మైత్రేయశబ్దమునకు దయాళుత్వము, లేక, కరుణయని అర్థము. మైత్రేయ ప్రభువు గౌతమబుద్ధుని తరువాత బోధిసత్త్వపదవిని స్వీకరించిరి. అప్పటినుండియు ధర్మప్రతిష్ఠాపనమునకై అనేక యత్నములనుజేసిరి. ఆయన ఆపదవిని స్వీకరించిన తరువాత గావించిన కార్యములలో మొదటిదేమన, గౌతమబుద్ధులీలోకములో జీవించి చరించుటచే నుద్భవించిన అపారమగు ఆధ్యాత్మికశక్తిని పురస్కరించుకొని ప్రపంచములో వేర్వేరు ప్రదేశములయందు మహనీయులగు ప్రవక్తలును, ఆచార్యు లును ప్రచారార్థమై ఏకకాలమందు పుట్టునట్లు ఏర్పాటుచేసిరి. కావున బహుకొద్దికాల ములోనే గౌతమబుద్ధులేగాక, భారతదేశములో శ్రీశంకరాచార్యులు,మహావీరుడున్ను, పర్షియాదేశములో "మిత్ర" యున్ను, చైనాదేశములో "లావోట్సీ" "కన్‌ఫ్యూషి యస్" గార్లున్ను, గ్రీసుదేశములో పైథాగొరాస్‌యున్ను జన్మించిరి.

బోధిసత్త్వులు స్వయముగా భారతదేశములో శ్రీకృష్ణుడుగాను, పాలస్తీనా కొండలలో క్రీస్తుగాను జన్మించెను. శ్రీకృష్ణుడుగా నవతరించినప్పుడు భక్తిని ప్రబోధముజేసిరి. బాలకృష్ణునియెడల లెక్కలేనిజనులతిగాఢమగు భక్తిని ప్రదర్శించిరి. తిరిగి పాలస్తీనాలో అవతరించినప్పుడుకూడ ఆయన బోధ యొక్క ప్రధానలక్షణము భక్తియై యుండెను. "మీకు నేనిప్పుడు క్రొత్తగా శాసించునదేమన: నేను మిమ్ములను ప్రేమించుచున్నట్లు మీరందరు నొకరినొకరు ప్రేమింపుడు " అని క్రీస్తు చెప్పెను. తాను తనతండ్రితో నేకమైయున్నట్లే తన శిష్యులందరు గూడ తనలోనేకమై యుండవలెనని ఆయన చెప్పెను. ఆయన ముఖ్య శిష్యుడగు సెంటుజాన్‌కూడ భక్తినిగురించియే నొక్కిచెప్పెను. "ప్రేమించనివారు దేవుని యెరుగనట్లే, ఏలయన దేవుడు ప్రేమమూర్తి' యని పలుమారు ఆయన చెప్పెను.

ఇప్పుడు క్రైస్తవమతమని చెప్పబడుదానిని ఆదిని క్రీస్తుచేసినబోధల ప్రకారము చూచినయెడల, నిస్సంశయముగా అద్భుతమగు ప్రదర్శనమని చెప్పవలెను. కాని, తరువాత అజ్ఞానులగు వ్యాఖ్యాతల చేతులలోబడి దాని యౌన్నత్యమునుండి పతితమై దీనమగు స్థితికివచ్చెను. మానవులొండొరుల యెడల సోదరభావమును, ప్రేమను జూపవలెననెడు ప్రబోధము క్రొత్తగా ప్రపంచములో మొదటిసారిగా క్రీస్తుచేచేయబడెనని యనుకొనరాదు. సెంటు అగస్టైన్ De Civitate Dei అను తన గ్రంథములో చెప్పినట్లు "దేనినైతే మనమిప్పుడు క్రైస్తవమత మనుచున్నామో సరిగా అదియే పూర్వులలోనూగలదు. క్రీస్తు అవతరించక పూర్వము అదిలేకపోలేదు, మానవజాతి ప్రారంభదశలనుండియుగూడ గలదు; ఆయన అవతరించినది మొదలు సనాతనము, సత్యమునగు ఆధర్మమును మనము క్రైస్తవమనుచున్నాము."

భగవద్గీతను జదివినవారందరకు దానిలో ప్రేమయు, భక్తియు ఎంతవరకు బోధింపబడినవో బాగుగ తెలియును. టిబెటు దేశములో నొక గొప్పమతసంస్కర్త యగు త్సాంగ్-కా-పా యొక్క శరీరమునుగూడ బోధిసత్త్వుడప్పుడుపయోగించు చుండెను. మరియు ఇన్నిశతాబ్దములలోను తమ శిష్యులగు నాగార్జునుడు, ఆర్యసంగ, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు మొదలగు వారిననేకులను ప్రపంచములోనికి బంపిరి. వారుక్రొత్తశాఖలను స్థాపించి, మతరహస్యములను నూతన విధముగా

ప్రబోధము జేసిరి. మహామ్మదీయ మతస్థాపకుడుకూడ బోధిసత్త్వుల శిష్యులలో నొకడే.

పైన చెప్పినరీతిగా మతబోధకులను బంపుటబోధిసత్త్వుని కార్యములో కొంత భాగమై యున్నది. వారికార్యము మానవుల కొఱకేగాక దేవగణములుసహా భూమండలమునందుండు సకలజీవులయొక్క జ్ఞానవికాసమునకు సంబంధించియుండును. ప్రస్తుతము ప్రపంచములోనున్న మతములన్నింటికి ఆయన అధిపతియై యున్నారు. కాలగతిలో అనేకమతములుక్షయమై పోయెను. ఆమతములకుకూడ ఆయనయే అధిపతి. ఆమతముల తొలిరూపమునకు మాత్రమే ఆయనబాధ్యులుగాని కాలక్రమేణా యుగములుగడచినకొలది, మానవులా మతములలో సహజముగా తప్పక గలిగించెడు అవభ్రష్టములకు, దుస్థితికి ఆయనబాధ్యులుకారు. ప్రపంచము నందలి కాలమానస్థితుల ననుసరించియు, ఆయాదేశములకు మనుష్యులకు తగి యుండురీతిని, ఆయన మతములో అవసరమగు మార్పులనుజేసి క్రొత్తమతము నొక దానిని స్థాపించెదరు. కాని పరిణామము ముందుకుసాగినకొలది మతములరూపములు భేదించినను ప్రధాననైతిక సూత్రములు మాత్రమెల్లప్పుడు నొకేవిధముగా నుండును.

ప్రస్తుతమూలజాతి అభివృద్ధినొందుచుండగా, ఆయన భూలోకములో నింకను అనేకసార్లు అవతరించి అనేక క్రొత్తమతములను స్థాపించును. ఆయన ఎప్పుడవతరించినను, ఆజాతిలోనుండి విశ్వాసముతో తన్ననుసరించెడు కొందరు మనుష్యులను తనచుట్టును చేర్చుకొనుచుండును. వారిలోనుండి అంతరంగశిష్యులనదగిన కొంత మందినియెంచి తనకెక్కువసన్నిహితులుగా జేసికొనును. తరువాత, ఆజాతి నడివయస్సుదాటి అంత్యదశలోనున్నప్పుడు, మరియొక క్రొత్తజాతి ప్రపంచములో ప్రబలుచున్నప్పుడు, ఆబోధిసత్త్వులు అనేక జన్మలనుండి తనతోకలిసి పనిచేయుచుండిన తన అంతరంగ శిష్యులందరు తన తుదియవతారసమయమున ఒకసారి కలిసి జన్మించునట్లు ఏర్పాటుచేయును.

ఆతుది యవతారములో ఆయన ఘనమగు బుద్ధదీక్షనుబొంది బుద్ధపదవిని బొందెదరు. ఆకాలమందు పూర్వపుశిష్యులందరు జాగ్రదవస్థలో పూర్వజన్మలయొక్క యెఱుకగాని, స్మృతిగాని గలిగియుండకపోయినను, ఆయనచే గాఢముగా ఆకర్షింపబడుదురు. ఆయన ప్రభావముచే అనేకులు మోక్షమార్గమున ప్రవేశింతురు; చాల

మంది అదివరకే విశేషముగా పరిణామము నొందియుండుటచే, ఉన్నతస్థితులనుజేరి పురోవృద్ధిని బొందగలుగుదురు. గౌతమ ప్రభువు బుద్ధుడయినప్పుడు పెక్కుమంది వెంటనే అర్హత్ స్థానమును చేరినట్లు బౌద్ధమతగ్రంథములలోనున్న గాథలను జదివినప్పుడు, అది యసాధ్యమైన విషయమని మేము మొదటతలచితిమి; కాని, జాగ్రతగా పరిశీలనచేసినతరువాత, ఆగాథలన్నియు సత్యములని తెలిసికొంటిమి.సంఖ్యలతిశయోక్తిగానచ్చును, కాని పెక్కుమంది శిష్యులు బుద్ధుని ఆకర్షణశక్తిచే ఇయ్యబడిన ప్రబలమగు ప్రోత్సాహముచేత, ఆకస్మికముగా ఈయుత్తమయోగదీక్షలను బొందగలిగిరనుట నిస్సందేహము.

## ఆషాఢోత్సవము

ఇదివరలోవర్ణించిన ఆగొప్ప వైశాఖోత్సవమేగాక సోదరబృందములోని సభ్యులందరు ప్రతిసంవత్సరము అధికారరీత్యా సమావేశమగు సందర్భము మరియొకటి గలదు. సామాన్యముగ ఈసమావేశము హిమాలయ పర్వతముల దక్షిణచరియలలోనున్న మైత్రేయప్రభువుయొక్క నివాసమందు జరుగుచుండును. ఈసందర్భమున భూలోకమునుండి యాత్రికులెవ్వరురారు. కాని, యీ యుత్సవముసంగతి తెలిసిన భువర్లోకవాసులందరు రావచ్చును. ఇది ఆషాఢ శుద్ధపౌర్ణమిరోజున సాధారణముగా జూలై నెలలో జరుగును.

ఇదిబుద్ధభగవానుడు తను కనుగొన్నట్టి, సామాన్యముగా "ధమ్మ చక్కప్పవత్తనసూత్త"—ధర్మచక్రప్రవర్తన సూత్రము—అనబడు మహోపన్యాసమును తన అయిదుగురు శిష్యులకు ప్రప్రథమమున ఉపదేశించిన దినమునకు స్మారకచిహ్నముగా జరిపెడువార్షికోత్సవము. ఈసూత్తముద్వారా ప్రప్రథమమున బుద్ధుని మధ్యమ మార్గమును వ్యాఖ్యానించు చతురార్య సత్యములును, ఆర్యాష్టాంగ మార్గమును బోధింపబడెను. అదియే ప్రపంచములో మానవుడు సంపూర్ణమగు ధర్మము నాచరించుచు గడపగలజీవనపథము. మితిమీరిన సన్యాసమునకును, కేవలసంసారలంపటత్వముచే గలుగుడుపేక్షకును మధ్యమమార్గమదియే.

మైత్రేయప్రభువున కామహనీయుడగు బుద్ధునియందుగల గాఢానురాగముచే ఆవార్షికోత్సవసమయమున దివ్యసోదరబృంద సమక్షమందు ఆయుపదేశమునే పఠించవలసినదని శాసించిరి. ఆవిషయమునే వివరణము చేయుచు మైత్రేయులవారుగూడ కొంచెమునేపు వ్యాఖ్యానపూర్వకముగా నుపన్యసింతురు. సరిగపౌర్ణమి క్షణమందా

యుపదేశపఠనము జరుగును. తరువాత నియ్యబడెడు ఉపన్యాసముసహా అంతయు అరగంటలో పూర్తియగును. మైత్రేయులవారు తమయింటిముందున్న రమణీయ మగు తోటలో నిర్మింపబడిన తిన్నెయంచుననేయున్న చలువరాతిపై ఆసీనులగుదురు. అచటికివచ్చిన ఆధికారిక పురుషులలో నున్నతాధికారులు ఆయనకు దగ్గరగా కూర్చుందురు. మిగతా సోదరబృంద సభ్యులందరు కొంచెము క్రిందుగా తోటలో నేలమీదనే కూర్చుందురు. వైశాఖోత్సవసందర్భములో వలెనే యీసందర్భములో గూడ అందరును సంతోషముగా సంభాషణలు చేసికొనుచుందురు. పరమగురువులు తమ శిష్యులను, తమ శిష్యులుకావలెనని ఆకాంక్షించు ముముక్షువులను కుశలమడిగి వారికి తమ ఆశీర్వాదములను ప్రసాదింతురు.

ఈసంస్కారమెట్లుజరుగునో, ఈయుత్సవసందర్భములలో సామాన్యముగా నేమిచెప్పబడునో, కొంతవరకు వర్ణించుట ప్రయోజనకరముగా నుండవచ్చును. కాని, మైత్రేయప్రభువు అట్టిసమయములయందు పలికెడుమాటల అద్భుతమును గాని, సొగసునుగాని, పటుత్వమునుగాని తెలియజేయుట కేవలమసాధ్యము. నేని ప్పుడు చెప్పబోవునది యొకప్రత్యేకయుపన్యాసముకాదు. అసంపూర్ణముగా జ్ఞాపక మున్న తునకలనన్నిటిని కలిపివానికొక రూపమునిచ్చుచున్నాను. కొందరు వాని నితరగ్రంథములలో జదివియుండవచ్చును. వాని నిదివరలో వినియుండనివారికి వాని స్వభావము కొంతవరకు తెలియగలదు.

ఆమహోపన్యాసము అతిసరళమై బహుసుబోధకముగా నుండుట విచిత్రము. కాని, దానిలోని యంశములు తిరిగితిరిగి నొక్కిచెప్పబడును. ఆకాలములో సంక్షిప్త లిపిలేదు; అందుచేత అందరు తరువాత చదువుకొనుటకొరకై ఆమాటలనప్పుడువ్రాసి కొనుటకు అవకాశములేదు. అప్పుడువిన్నటువంటి శిష్యులు అప్పటియనుభవమును బట్టి జ్ఞాపకముంచుకొనవలసి యుండును. అందుచే విషయమును ఆయన అతిసులభ ముగా బోధపడునట్లుచెప్పి, విన్నవారికి బోధపడినట్లు నిశ్చయమగుటకు పల్లవిని పాడినట్లుగా తిరిగితిరిగి చెప్పినదానినే చెప్పుచుందురు. దానిని చదివినవారందరు సౌలభ్యముతో బాగుగా జ్ఞాపకముంచుకొనునట్లు చేయుటయే మైత్రేయప్రభువు యొక్క ముఖ్యోద్దేశమని స్పష్టపడగలదు. అంశములన్నియు సూత్రప్రాయముగా, వరుసగా, ఎంతచక్కగా సమకూర్చబడినవనిన, ఒకసారి వినినవారికి ప్రతియంశము దాని తరువాత దానిని స్ఫురింపజేసి జ్ఞాపకముచేయుచుండును. మరియును, బౌద్ధులకు

సులభముగా జ్ఞాపకముండు యీవిడివిడి మాటలలో ప్రతిమాటయు దానికి సంబంధించిన ఒకగొప్పభావసంపుటినంతను స్ఫురింపజేయును. ఆప్రకారము, ఈయుపన్యాసము చిన్నది సులభమైనది అయినను, దానిలో నొక వ్యాఖ్యానము, ఒకజీవిత సూత్రముగూడ ఇమిడియున్నవి.

ఈయుపన్యాసముగురించి చెప్పదగినదంతయు ఇదివరలో అనేకసార్లు చెప్పబడియుండవలెనని యూహింపవచ్చును. కాని, ఆప్రభువునోటనుండి వెడలెడు అద్భుత వాగ్ధరియు, ఆయన దానికిచ్చెడు దివ్యరూపమును శ్రావకులకు ప్రతిసంవత్సరము నూతనసత్యమును గనబరుచుచు క్రొత్తదైనట్లు తోచుచుండును. ప్రతివారును ప్రత్యేకముగా తనకొరకే ఆసందేశ మియ్యబడినదని ఊహించును. మొట్టమొదటిసారి సంభవించినట్లుగానే ప్రతివార్షికోత్సవసందర్భములోగూడ నొక అద్భుత చిత్రము సంభవించుచుండును. ఆప్రభువు మధురమగు పాలీభాషలో మాట్లాడినను, అక్కడ సమావేశమైన ప్రతియొకరును "అపోస్తలుల శాసనముల"లో చెప్పిబడినట్లు వారి మాతృభాషలోనే వినును. దీనినే 'పెంటికోస్టల్' విచిత్రమందురు.

## చ తు రా ర్య స త్య ము లు

ఆయుపన్యాసముయొక్క సారమునిచట సంక్షేపముగా చెప్పెదను. మధ్యమ మార్గమే క్షేమతమమైనది. వాస్తవముగా అదియే సత్యమార్గము, అని ప్రకటించుటతో ఆయుపన్యాసమారంభమగును. ఇంద్రియ లోలత్వము, ఐహికసౌఖ్య పరాయణత, నీచము భ్రష్టకరములై, మానవుని యెన్నడును ముందుకు తీసికొనిపోనేరవు. మితిమీఱిన వైరాగ్యముకూడ దుష్టము, నిష్ప్రయోజనము అని గ్రహించవలెను. ఉత్కృష్టమగు వైరాగ్యముతో ఒంటిరిగా జీవించుట కొద్దిమందికిష్టము కావచ్చును. వారట్టి వైరాగ్యజీవనమును సరియైనమార్గముననే గడుపుచుండవచ్చును. అయినను, మితిమీఱుట యుచితముకాదు. కాని, సామాన్యమానవులందరకు ప్రపంచములో సుగుణసంపత్తుగలిగి సజ్జనునివలె జీవించెడు మధ్యమమార్గమే అన్నివిధముల శ్రేష్ఠతమము, క్షేమతమమునై యుండును. అట్టిజీవితమును జీవింపగల్గుటకు ముందు దాని నియమములను గ్రహింపవలెను. ఆనియమములను బుద్ధభగవానుడు 'చతురార్యసత్యములు' అని చెప్పెను. అవి యేమనగా,

1. దుఃఖము లేక, బాధ.
2. దుఃఖమునకు కారణము.

3. దుఃఖమునంత మొనరించుట, లేక, దుఃఖమునుండి విముక్తి.

4. దుఃఖ విముక్తిని గలుగజేయుమార్గము.

1. యుక్తముగా జీవించుట తెలియని మానవునకు సృష్టిఅంతయు దుఃఖమే, ఇది మొదటిసత్యము. ఈవాక్యమును వ్యాఖ్యానించుచు బోధిసత్త్వుడిట్లు చెప్పెను. ఈసృష్టి రెండువిధములుగా దుఃఖకరమని గ్రహించవలసియున్నది. ఒకవిధమున, అది కొంతవరకు తప్పనిది, అనుభవించి తీరవలసినదియై యున్నది; రెండవవిధమున అది కేవలము అజ్ఞానము, సులభముగా తప్పించుకొనదగినదైయున్నది. మానవుని నిజమగు ఆత్మయైన తురీయాత్మకు సృష్టి అంతయు పరిచ్ఛిన్నతయే గనుక అదియొక విధముగా దుఃఖమే. ఉన్నతలోకములోని జీవనముయొక్క దివ్యమగుస్వేచ్ఛను మన మూహింపలేముగనుక, ఆపరిచ్ఛిన్నత స్థూలమెదడుకు గ్రాహ్యముకాదు. అదేభావములో క్రీస్తు దివ్యములోని కవతరించుటలో మహాత్యాగమును జేసెనని చెప్పుదురు. అది నిస్సంశయముగ త్యాగమే, అనిర్వచనీయమగు గొప్పపరిచ్ఛిన్నతయే. ఏలయన, వాని స్వలోకములో వానికైయుండు దివ్యశక్తులన్నియు ఆయవతరణము వలన మూసికొని పోవును. ఆసంగతి మానవుని తురీయాత్మ విషయములోగూడ సత్యమే. తురీయుడు క్రిందిలోకముల స్థూలతరద్రవ్యముతో సంబంధము పొందుటలోను, ఆదద్రవ్యము మానవస్థితికివచ్చునరకు యుగములపాటు జరిగినపరిణామకాలములో దానిపైన ఎగిరియాడుచుండుటలోను, తనలో నొక అల్పాంశమును ఒక వ్రేలికొనవంటిదానిని క్రిందకుదింపి ప్రత్యేకజీవాత్మను నిర్మించుటలోను నిస్సంశయముగా గొప్పత్యాగముచేసెను.

మనమొక చిన్న అంశము—వాస్తవముగా అంశములోని అంశము—మాత్రమే అయియున్నను, దేదీప్యమానమగు నొక మహాసత్త్వములో భాగమైయున్నాము. కేవలమంశమైయుండుటలో గర్వింపదగినదేమియు లేదుగాని, యొకపరమసత్త్వములో భాగమైయుండుటచే ఒకప్పుడు దానంతవారమై దానితో నేకముకాగల మనేదు నిశ్చయముగలదు. మనపరిణామముయొక్క యుద్దేశము, పరమావధియు నదియే. మన మాగమ్యస్థానమునుచేరుట మన పురోవృద్ధినిజూచి మనమానందించుటకుగాక ఈశ్వర సంకల్పనిర్వాహణమునందు తోడ్పడగలుగుటకని జ్ఞాపకముంచుకొనవలసి యున్నది. ఈత్యాగములలోను, పరిచ్ఛిన్నతలలోను విశేషముగా బాధకలదని చెప్పుటలో సత్యముకలదు. కాని, జీవాత్మ సంపూర్ణముగా గ్రహించినంతనే ఆబాధలనన్నిటిని భరిం

చుటకు సంతోషముగా బూనుకొనును. తురీయాత్మకుగల పరిపాకము జీవాత్మకు లేదుగనుక ప్రథమములో జీవాత్మ దానిని పూర్తిగా గ్రహింపలేదు. అందరివలెనే అదికూడ నేర్చుకొనవలసియున్నది. ద్రవ్యములోనికి చేసెడు ప్రతియవతరణము లోను దారుణమగు పరిచ్ఛిన్నత గలుగుట తప్పనిసరియైనందున, ఆవిష్కరణమునకును బాధకును అవినాభావముగలదు. ఈశ్వర విధానములో పరిచ్ఛిన్నతను ఒకభాగము గాను, కార్యసాధనముగాను మనము అంగీకరింపవలసియున్నది.

మరియొకభావములోగూడ జీవితము తరుచు దుఃఖమైయున్నది. కాని దుఃఖ మును పూర్తిగా తప్పించుకొనవచ్చును. ప్రపంచములో సామాన్యముగా జీవించు మానవుడు అనేకవిధములగు బాధలననుభవించును. ఎల్లప్పుడు దుఃఖములో నున్నా డనుట నిజముగాదు, గాని తరుచు వ్యాకులపాటుకు లోనగుచుండును; కనుక ఏక్షణ మందైనను గొప్ప దుఃఖములోగాని, వ్యాకులములోగాని పడిపోవుట కవకాశము గలదు. దీనికికారణమేమన, అతడెల్లప్పుడును వివిధములగు నీచకోరికలతో, క్రూర ములుగాకపోయినను నీచములగు ఇంద్రియార్థములకై కోరికలతో నిండియుండును. ఈకోరికలుండుటచేత అతడు బంధితుడై పడియుండును. తనకు లేనిదానికొరకై నిరంతరము కృషిచేయుచుండును, అదిలభించునాలేదాయని నిత్యము వ్యాకులపడు చుండును. అదిలభించినతరువాత అది నష్టమగునేమోయని భయపడుచు దానిని నిలబెట్టుకొనుటకై చింతించుచుండును. ఇది ధనమువిషయమై మాత్రమేగాక, అధికా రము, స్థానము, ప్రతిష్ఠ, సంఘములో పరపతి, అన్నిటకి సమానముగా వర్తించును. ఈకోరికలన్నియు నిరంతరము అనేకవిధములుగా శ్రమగలిగించుచుండును. కలిగిన వాడు నిలబెట్టుకొనుటకును, లేనివాడు సంపాదించుటకును పడెడు వ్యాకులమునే గాక, ఆవస్తువులనే, ఆయర్థములనే గోరి, ప్రయత్నము సలుపుచుండెడు పరులహృద యములలో గలిగెడు అసహనము, అసూయ, ద్వేషము, వీనినన్నిటినిగూడ మనము గమనించి యోచింపవలసియుండును.

వీనికంటె శ్రేష్ఠతరమగు కోరికలుగలవు. కాని, అవి శ్రేష్ఠతమములు మాత్ర ముగావు. ఉదాహరణమునకు, ఇంకొకరు తనకియ్యలేనట్టియు, ఇచ్చుట కతనివద్ద నేనట్టియు ప్రేమకొరకై ఆశించెడు యువకులనెంతమందినిజూచుటలేదు! అట్టికోరిక వలన తరుచుగా విశేషమగు విచారము, అసూయ, ప్రబలమగు ద్వేషము పెరుగును. అట్టికోరిక సహజమని యనవచ్చును. అది నిజమే. సందేహములేదు, ప్రేమకు తిరిగి

ప్రేమ లభించినచో గొప్ప ఆనందకారణమే యగును. కాని, ఆప్రేమ లభించుట అసాధ్యమైనయెడల, తీరనికోరికవలన దుఃఖించుటకు బదులు ఆయవస్థకు తలయొగ్గి యుండగల మనోబలమును సంపాదించవలెను. ఒకవిషయము సహజమని మనము చెప్పునప్పుడు, అది సామాన్యమానవుని స్వభావమని మన అభిప్రాయము: కాని యోగశాస్త్రము నభ్యసించు ముముక్షువు సామాన్యమానవుని స్థితి నతిక్రమించి కొంచెము పైగానుండుటకు ప్రయత్నించవలెను. లేనియెడల అతడు సామాన్య మానవుని కెటులసహాయపడగలడు? క్రిందనున్నవారికి కరముజాచి సాయపడ వలెననిన, అంతకంటె మన మొకింత పైస్థానమున నుండవలెను. మనము సహజమగు సామాన్యమానవత్వముతో తృప్తిబొందక అద్భుతమగు అతిమానవత్వము నాశింప వలెను.

జీవితము మొత్తముమీద దుఃఖమయమైయున్నదని బుద్ధుడుచేసిన మహా ప్రబోధము సత్యమని దివ్యదృష్టిగలవాడు వెంటనే అంగీకరించును. ఏలయన, అతడు కలిసికొను మానవుల కామశరీరములను మానసిక శరీరములను పరిశీలనజేసిచూచిన యెడల, అవి అన్నిరకములగు చిన్న చిల్లర తలంపులను, ఆందోళనలను, బాధలను తెలియజేయు లెక్కలేని చిన్న సుళ్ళతోనిండియుండుటయు, ఆసుళ్ళు తీవ్రముగా తిరుగుచుండుటయు కనిపెట్టగలడు. ఇవన్నియు బాధను, కలవరమును గలిగించును. అన్నిటికంటె పురోవృద్ధికి యెక్కువగా కావలసినది మనశ్శాంతి. వాని నన్నిటిని పూర్తిగా బోగొట్టుకొనుటయే శాంతి బడయగల మార్గము. ఇప్పుడు దుఃఖమునకు కారణమను రెండవ ఆర్య సత్యమును విచారింపలసియుండును.

2. దుఃఖమునకు కారణము కోరికయని యింతవరకు చెప్పినదానిని బట్టి తెలిసికొంటిమి. మానవునకు కోరికలు లేనియెడల, వాడు ఉద్యోగమునకుగాని, అధికారమునకుగాని, ధనమునకుగాని ఆశింపనియెడల, అతడేదివచ్చినను ఏదిపోయి నను చలింపడు, సమత్వముగలిగి ప్రశాంతముగానుండును. అతడు దేనిని లక్ష్యము చేయడుగనుక నిశ్చలుడై శాంతమూర్తియైయుండును. మానవుడగుటచే, దీనికొరకు దానికొరకు ఆశింపవచ్చును. కాని యెల్లప్పుడును మృదువుగా నెమ్మదిగా కోరును. కనుక, ఎన్నడును ఆరాటము చెందడు, కలవరపడడు. ప్రేమించిన ఆప్తులు మృతి నొందినపుడు తరుచుగా మానవులు దుఃఖముతో ఎట్లు కృంగిపోవుదురో మనము నిత్యము చూచుచుందుము. కాని, వారి ప్రేమ ఉన్నతశ్రేణికి చెందినదైనయెడల,

మృతినొందినవారి శరీరమునుగాక, ఆశరీరములోని ఆత్మస్వరూపుడగు తమ మిత్రుని ప్రేమించియున్న యెడల, వారికెడబాటు కనిపించదు, కనుక దుఃఖము వారినంటదు. భూలోకములో ఆతనిలో శరీరసంపర్కముగలిగి యుండవలెనన్న కోరిక వారికి యున్న యెడల, వెంటనే ఆకోరిక దుఃఖకారణమగును. ఆకోరిక నావలనుంచి, ఉన్నత లోకములలో అన్యోన్యత్వము గలిగియున్న యెడల, దుఃఖము తొలగిపోవును.

కొందరు జనులు వృద్ధాప్యమువచ్చుచున్నదని విచారింతురు. వెనుకటిశక్తులను, బలమును వారు గోరుదురు. అట్టికోరిక నణచివైచి తమశరీరములు మంచి కర్మ చేసెననియు, ముందుకూడ వెనుకచేసినంత పనిని చేయలేనియెడల విచారింపక అవి చేయగలిగినంత పనిని నెమ్మదిగా ప్రశాంతముగా వానిచే చేయించుటయుచిత మనియు గ్రహించుట వివేకమైయుండును. వచ్చిన మార్పుగురించి దిగులుపడుట అవివేకము. త్వరలోనే నూతనశరీరములు రానైయున్నవిగదా; చక్కని నూతనశరీరము కావలెనన్న, ప్రాతదానిని జాగ్రతగా నుపయోగించి ప్రశాంతముగను నెమ్మదిగను నుండి, సమత్వముగలిగియుండుటయే మార్గము. తనను తాను మరచి, స్వార్థపరమగు కోరికలనన్నిటిని హరింపజేసికొని, తన శక్తుల ననుసరించి తనకు సాధ్యమైనంతవరకు పరుల సహాయార్థమై నిత్యము సంకల్పించుచుండుటయే దానికి యేకైక సాధనము.

3. దుఃఖమునుండి విముక్తి:— దుఃఖమెట్లు అంతమొందునో, ఎట్లు ప్రశాంతతను బొందనగునో మనకిప్పుడు తెలిసినది. ఎల్లప్పుడును మనస్సు ఉత్తమ విషయములపై లగ్నముచేసియుండుటయే దానికి మార్గము. మనమింకను కొంతకాలమీ ప్రపంచములో జీవించవలసియున్న సంగతి వాస్తవమే. కవితాధోరణిలో ఈప్రపంచమును విషాదతారయని వర్ణించిరి. పెక్కుమంది మనుష్యులకు నిజముగా అది విషాదతారయే అగుచున్నది. అట్లు కానక్కరలేకుండ, కోరికలచే లోకమునకు బద్ధులమై యుండనియెడల, ఇచట బహుసుఖముగా జీవింప నవకాశముగలదు. మనము సంసారములో నున్నను దానిలో నిమగ్నులముకాకూడదు; అధమము మనస్తాపము, శ్రమ, చీకాకు కలుగకుండానైనను శ్రద్ధవహించవలెను. నిస్సంశయముగా, పరుల దుఃఖములను, బాధలను, చీకాకులను దొలగింపసహాయపడుటయే మనకర్తవ్యము. మనమాసహాయమును సార్థకముగా చేయవలెనన్న, మనకట్టి లోపములేవియు నుండకూడదు. ఆసంక్షోభములను మనలను తాకనీయరాదు, మన ప్రశాంతము

నకు, సంతుష్టికి భంగముకలుగచేయనీయరాదు; అవి మనలనంటకుండ నెమ్మదిగా జారిపోవునట్లు చేయవలెను. ఈనీచలౌకిక జీవితమును సరియగు ఆధ్యాత్మికజ్ఞానముతో గడపినయెడల దుఃఖమనునది పూర్తిగా నశించిపోవును.

అట్టి మనోవృత్తి అలవడుట అసాధ్యమని కొందరు తలచెదరు. అది సత్యము కాదు. అది నిజమయినచో బుద్ధభగవానుడు దానిని మనకెన్నడును ఉపదేశించియుండడు. మనమందరము దానిని బొందగలము, పొందితీరవలెను. ఏలయన, అట్టి మానసికప్రవృత్తి అలవడిననాడే తోటిమానవులకు నిజముగను, సార్థకముగను సహాయపడ గలుగుదుము.

## ఆర్యాష్టాంగమార్గము

4. దుఃఖవిముక్తికలుగచేయుమార్గము:— ఇది బుద్ధభగవానుని అద్భుత వర్గీకరణములలో నొకటియైన ఆర్యాష్టాంగమార్గములో చెప్పబడినది. దీని నన్ని యవస్థలకు వర్తింపజేయవచ్చును, గనుక ఇది బహు రమణీయమగు వివరణము. సామాన్య సంసారిగాని, విద్యావిహీనుడైననుగాని దానిని బహుస్థూలదృష్టితోజూచి అభ్యసించినను దానిద్వారా శాంతిని సుఖమును బొందును; మహాజ్ఞానియు,తత్త్వశాస్త్రవేత్తయు గూడ తమయంతసవునందు దాని నర్థముజేసికొని విశేషజ్ఞానమును బొందవచ్చును.

ఈమార్గమందు ప్రథమ సోపానము సమ్యగ్విశ్వాసము. దీనివలన గుడ్డి నమ్మకముకావలసియుండునని కొందరాక్షేపింతురు. అట్టి గ్రుడ్డి నమ్మకమెన్నడును అవసరములేదు. ప్రపంచములో జీవితమునకు సంబంధించిన ప్రధాన విషయములగురించి నిశ్చయమగు జ్ఞానము కొంత అవసరమని దాని అభిప్రాయము. మనకు సంబంధించినంతవరకు ఈశ్వరసంకల్ప విధానమును కొంతవరకు తెలిసికొనుట ఆవశ్యకమైయున్నదనియు, మనంతట మనము తెలిసికొనలేనియెడల తెలిసినపెద్దలు చెప్పినదానినంగీకరింపవలయుననియు చెప్పును. కొన్నిప్రధాన విషయములెల్లప్పుడును ఏదోయొక విధముగా మానవులకు బోధింపబడుచున్నవి. అడవిజాతుల మనుష్యులకు సహితము వారిమంత్రగాండ్రు కొన్నివిషయములను బోధించెదరు. మిగిలిన మానవజాతికి మతగురువులు, పవిత్రగ్రంథములు కావలసినవిషయములను దెలుపుచుండును. మతములు, మతగ్రంథములు వేర్వేరుగానుండుట సత్యమే. కాని మానవుడు జీవితమును సుఖముగా జీవింపగలుగుటకు తగినంతగా జీవితము నర్థముచేసికొనవలెననిన,

అన్నిమతములకు మతగ్రంధములకు సామాన్యములగు ప్రధానవిషయముల నంగీకరింప వలసియుండును.

ఈవిషయములో కార్యకారణన్యాయము, లేక, కర్మనియతి యొకటి. మానవుడు తనస్వేచ్ఛానుసారముగా దేనినైన, జేయనచ్చుననియు, తను జేయుకార్యముల ఫలితము తనపై బడదనియు భ్రమపడినయెడల, తుదకొకప్పుడతని కర్మఫలితములు దుఃఖమును బాధను గలిగింపకమానవు. మఱియు, పురోవృద్ధిని బొందుటయే జీవితోద్దేశమనియు, ప్రస్తుతమున్న స్థితికంటె శ్రేష్ఠతరముగను ఘనతరముగను మానవుడు పెరుగుటయే యీశ్వరేచ్ఛయనియు అతడు గ్రహింపవలసియున్నది. అట్లు గ్రహించనియెడల మానవుడు నీచప్రకృతికొరకే జీవించుట సంభవించును. అట్లు జీవించుటవలన అంతరంగిక పురుషునకు సంతుష్టియెన్నడును కలుగనేరదు. కనుక, అతనికి దుఃఖము, బాధకలుగకతప్పదు. కాబట్టి కొంతవరకీ మహాప్రకృతిధర్మముల నైనను ప్రతిమానవుడు తెలిసికొని తీరవలెను. లేక, తనకుతాను తెలిసికొనలేని యెడల, ఇతరులు వానిగురించి చెప్పినసంగతులను విశ్వసింపవలెను. తరువాత నొకపై అవస్థయందు రెండవయోగ దీక్షనుబొందుటకుముందు, ముముక్షువు సంశయమను బంధమును బూర్తిగానాశము చేసికొనవలసియుండునని మన మిదివరలో దెలిసికొని యుంటిమి.

దీనినిబట్టి, ఏదోయొక సిద్ధాంతమును గుడ్డిగానమ్మి తీరవలెనాయని బుద్ధుని అడుగగా, "కాదు, అటుల గ్రుడ్డిగా నమ్మనక్కరలేదు; కాని, (1) పవిత్రమార్గము ననుసరించి సత్ప్రవర్తకుడై జీవించుటవల్లనే మానవుడు తుదకు పరిపాకము నొందగలడనియు (2) దానిని బొందుటకై మానవుడనేకజన్మలద్వారా క్రమక్రమముగా పురోవృద్ధినిబొందుననియు, (3) ప్రపంచములో సర్వమును ఒక సనాతనన్యాయ ధర్మము (కార్యకారణన్యాయము) నకు లోబడి పనిచేయుచుండుననియు, ఈమూడు గొప్పవిషయములు సత్యములని నీయంతట నీవు తెలిసికొనవలయును," అని ఆయన జవాబు చెప్పెను. ఆదశయందు మానవుడు సంశయమును పూర్తిగా విసర్జించి,యీ విషయములు సత్యములని సంపూర్ణముగా, త్రికరణశుద్ధిగా నమ్మి, నిశ్చయబుద్ధిగలిగి యుండవలెను. సామాన్యలౌకికుడు ఆమాత్రమునమ్ముటయైన మంచిది; ఏలయన, జీవితములో అట్టినమ్మకము మార్గదర్శిగా లేకపోయినయెడల అతడు ముందుకు బోనేరడు.

ఈ ఆర్యాష్టాంగమార్గములో రెండవసోపానము సమ్యాగాలోచనము: ఈ మాటవలన రెండుభిన్నార్థములు స్ఫురించును. మొదట, మనము మంచి విషయముల గురించి యోచన చేయవలెనుగాని చెడ్డవిషయములగురించి యోచనచేయకూడదని శాసించుచున్నది. ఎల్లప్పుడును మన మనస్సుల నిండా చక్కని గొప్పసంకల్పములుండ వచ్చును, లేక, సామాన్య ప్రాపంచక విషయములతో నిండియుండవచ్చును. ఈ విషయములో పొరపాటులేకుండ సరిగా గ్రహింపవలసియున్నది. మనమే పనిచేసినను దానిని పరిపూర్ణముగను, త్రికరణశుద్ధిగను, పరిపూర్ణతబొందుటకు కావలసినంత యేకాగ్రతతోను చేయవలెను. కాని పెక్కుమంది మనుష్యులు వారొకపనిని చేయు చున్నప్పుడును, దానిలో కొంచెముసేపు విరామము గలిగినప్పుడునుగూడ వారి మన స్సులను అముఖ్యములు, నీచములునగు విషయములుపైకి పోనిచ్చుచుందురు. పరమ గురువున కాత్మసమర్పణము చేసికొన్న వారు ఆయననుగూర్చిన యోచనను సర్వదా మదిలో నిలుపుకొనియుందురు, గనుకలౌకికకార్యములనుండి యొకక్షణమైన విశ్రాంతి గలిగినయెడల, వెంటనే పరమగురువునుగూర్చిన తలంపుముందుకు దుమికి మనస్సం తను ఆక్రమించును. ఆక్షణమందే శిష్యుడు "పరమగురువువలె జీవించుటకై నేనేమి చేయగలను? నాచుట్టునున్నవారికి నాప్రభువు సౌందర్యమును జూపింపగలుగుటకు నేనెట్లు అభివృద్ధికావలెను? పరులకు సహాయముచేయుటయే వారికార్యముగనుక వారికార్యమును కొనసాగించుటకై నేనేమిచేయగలను?" అనియోచనచేయ ప్రారం భించును. సర్వదా సహాయకరములు, కరుణాపూరితములునగు భావములను ప్రసరిం పజేయుచుండుట మనమందరము చేయగలపనులలో నొకటి.

సమ్యాగాలోచనము నిర్దిష్టముగానుండవలెనుగాని, చెదరిపోగూడదని జ్ఞాపక ముంచుకొనవలెను. ఒకక్షణ మొకవిషయముపైనుండి, వెంటనే మరియొకదానిపైకి సీతాకోకచిలుకవలె మనస్సుపరుగెత్తుచున్నయెడల, అది కేవలము వ్యర్థమైయుండును, మనస్సును నిగ్రహించుకొనుట కెంతమాత్రము సహాకరించదు. సమ్యాగాలోచనములో లేశమాత్రమైన దుర్మార్గత ఉండరాదు; అందులో సందేహాస్పదమైనదేదియు నుండ రాదు. బుద్ధిపూర్వకముగా అపరిశుద్ధమైన విషయములుగూర్చిగాని, దారుణమగు వానిగూర్చిగాని యేమియు యోచనచేయని వారనేకులుందురు. కాని, వానిసరి హద్దుననుండెడు తలంపులను, అనగా నిర్దిష్టముగా దుష్టతలంపులు కాకపోయినను

కొంచెము సంశయాస్పదమైన తలంపులకు తావిచ్చుచుందురు. సరియైన ఆలోచనలో అటువంటిదేమియు పనికిరాదు; లేశమాత్రమైన అనుమానముగాని క్రూరతగాని కనిపించినయెడల, ఆతలంపును త్రోసివేయవలెను. మనయోచనలన్నియు పూర్తిగా దయగలిగి శుభప్రదములై యున్నవని దృఢపరచుకొనవలెను.

సరియైన ఆలోచన యనగా, యథార్థమగు ఆలోచనయని మరియొక అర్థము కలదు. మనము సత్యమునే యోచనచేయవలెను. మనము తరుచుగా నిర్హేతుకమగు దురభిప్రాయముచేగాని, అజ్ఞానముచేగాని మనుష్యులగూర్చి తప్పుగాయోచనచేయుచుందుము. ఒకడు చెడ్డవాడను అభిప్రాయము ఎట్లోగలుగుటచేత, అతడేమిచేసినను అదిచెడ్డదియైయుండవలెనని తీర్మానింతుము. కేవలము, నిరాధారముగా వానికిదురుద్దేశముల నారోపింతుము. అట్లుచేయుటలో మనమతనినిగూర్చి అసత్యముగా తలంచుదుము, కనుక మనదిసరియైన ఆలోచనకాదు. జీవన్ముక్తిబొందని మానవులందరిలోను కొంతమంచియు, కొంతచెడ్డయుగూడ నుండును. కాని దురదృష్టవశమున, మంచినిగూర్చి యిసుమంతైన తలపెట్టక, దానిని పూర్తిగా విడిచిపెట్టి, కేవలము చెడ్డమీదనే దృష్టినినిలుపుట మనలో ఆచారమై పోయినది. కనుక, వారిని గురించి మనము చేయు ఆలోచన నిర్దయతో గూడినదగుటయేగాక, అసత్యమైయుండుటచే అదిసరియైన ఆలోచనకాదు. మనమాపురుషుని యందొక భాగముమాత్రమేచూచి రెండవభాగమును విడిచిపెట్టుదుము. మరియు, ఆమానవునిలోని మంచినివిడిచి చెడ్డమీదనే మనదృష్టిని నిలుపుటచే మనమా చెడ్డను ప్రోత్సహించి బలపరచుదుము. కాని, సమ్యగాలోచననుచేసినయెడల, ఆమానవుని స్వభావములోని మంచినిప్రోత్సహించి బలపరచవచ్చును.

తరువాత సోపానము, సమ్యగ్భాషణము:- ఇందులోగూడ రెండుభాగములు గలవు. మొదట మనమెల్లప్పుడును మంచిసంగతులను మాట్లాడవలెను. ఇతరుల దుష్టకార్యములగూర్చి మాట్లాడుట మనపనికాదు. సామాన్యముగా ఇతరులగూర్చి మనచెవులలోబడెడు కథలన్నియు సత్యములైయుండవు. కనుక మనము వానిని తిరిగి పలికినయెడల మనమాటలుకూడ అసత్యములగును. అందువలన వారికిని మనకునుగూడ హానినిగలుగజేయుచున్నాము. మనము విన్నకథ నిజమైనను, దానిని తిరిగి చెప్పుటతప్పే. తప్పుచేసినమానవునిగూర్చి తిరిగితిరిగి అతడు తప్పుచేసెనని చెప్పుట వలన అతనికిమనము మేలేమియు చేయుటలేదు. దానినిగూర్చి యేమియు చెప్పకుండు

టయే మిక్కిలి దయగలకార్యమగును. భర్తగాని, భార్యగాని, పుత్రుడుగాని, సోద రుడుగాని యొకతప్పును జేసినచో సహజముగా దానిని గప్పిపుచ్చుదుము; మనము గాఢముగా ప్రేమించినవారు చేసినతప్పును పరులకు తెలియునట్లు వెల్లడిచేయుట మిక్కిలి అనుచితమని నిశ్చయముగా అంగీకరింతుము. మనము ప్రకటించెడు విశ్వ మానవ సోదరత్వములో మనకు నిజముగా విశ్వాసమున్న యెడల ఏమానవునిగూర్చి యైనను చెడ్డవిషయమును ప్రచారము చేయకూడదనియు, ఇతరులు మనలనుగూర్చి యెట్లు మాట్లాడుచుండవలెనని మనము కోరుదుమో,అట్లే యితరులగూర్చి మనము గూడా మాట్లాడు చుండవలెననియు, మనము గ్రహింపవలసియున్నది. మరియు చాలమంది మాట్లాడుటలో అతిశయోక్తిగాను, అయదార్థముగాను మాట్లాడుచుం డుటచే అసత్యముగా మాట్లాడిన వారగుచున్నారన్న సంగతి జ్ఞాపకముంచుకొనవలెను. వారు స్వల్పవిషయములను పదింతలుగా పెంచి గొప్పకథలుగా చెప్పుదురు. అది సత్యాగ్రహణము గాకపోవుట నిశ్చయము.

మరియు, మాటలు దయాపూర్వకముగా నుండవలెను. అవి సూటిగానుండి పటుత్వము గలిగియుండవలెనుగాని, అవివేకముగా నుండరాదు. లోకములో చాలా భాగము జనులెల్లప్పుడును మాట్లాడుచుండవలెనను భ్రమలోనుందురు. అంతేగాక, ఎల్లప్పుడు ఏదోయొకటి వాగుచుండక ఊరకకూర్చుండుట విరుద్ధము, అమర్యాద యని వారుతలచెదరు. ఎవరైన ఒకస్నేహితుని కలిసికొన్న యెడల, యావత్కాలము ఏదోయొకటి మాట్లాడుచుండవలెననియు, లేనియెడల స్నేహితుడు నొచ్చుకొను ననియు వారి యభిప్రాయమైనట్లు కనిపించును. మానవుడాడెడు ప్రతివ్యర్థమగు మాటకు తరువాత సమాధానము చెప్పవలసియుండునని క్రీస్తు భూలోకములోనున్న ప్పుడు బహుకఠినముగా శాసించెనని జ్ఞాపకముంచుకొనవలెను. వ్యర్థమగుమాట సాధారణముగా కొంటెమాటయై యుండును. అదిగాక, అనాలోచితముగా నాడెడు వ్యర్థప్రలాపములు సహితము కాలహరణమునకు కారణమగును. మనముమాట్లాడ వలసియున్న యెడల, కొంచెము ప్రయోజనకరమైనది, సహాయకరమైనది చెప్పుట యుచితముగానుండును. కొందరుమనుష్యులు మంచిచమత్కారముగా గనబడవలెనని వేళాకోళముగను, ఎగతాళిగను, విడువకుండ ప్రవాహమువలె మాట్లాడుచుందురు. ఎవరో యెప్పుడో చెప్పినదానిని వారందుకొని గేలిచేయుచుందురు. ఎల్లప్పుడును ప్రతివిషయమును అపహాస్యముగను, వినోదకరముగను గనబడునట్లు చేయుచుం

దురు. అదంతయు నిశ్చయముగా వ్యర్థప్రలాపము క్రిందనేవచ్చును. సరియగు భాష ణమను విషయములో అప్రమత్తులై విశేషమగు జాగ్రతతీసికొనుట అత్యావశ్యక మనుటకు సందేహమేమియు లేదు.

తరువాత సోపానము సమ్యగాచరణము:- ఈమూడు మెట్లున్ను తప్పనిసరిగ నొకటితరువాత నొకటి రావలెనని మనకు స్పష్టముగా తెలియుచున్నది. మనమెల్లప్పుడు మంచివిషయములగూర్చి యోచనచేయునెడల చెడ్డవిషయములగూర్చి యెన్నటికి మాట్లాడము. ఏలయన, మన మనస్సులలోనున్నదానినే మాట్లాడెదమన్నసంగతి స్పష్టము. మనయోచన, మనమాటలు, బాగుగానున్నయెడల వాని ననుసరించు కార్యముకూడ బాగుగ నుండును. ఎప్పుడు చేయవలసినపనినప్పుడు జాలముచేయ కుండ చేయవలెను, కాని బాగుగ యోచించి చేయవలెను. కొందరు మనుష్యులు అత్యావసరపరిస్థితులలో నిరాధారముగా దిక్కులేనివారివలెనుండి, యేమి చేయ వలెనో తెలియక తబ్బిబ్బు పడుటయేగాక, కొంచెము మనస్థైర్యముగలిగి పనిచేయు వారల కాటంకముగూడ గలుగచేయుట మనమందరము ఎఱుగుదుము. మరికొందరు ముందువెనుకలేమియు యోచింపక దురుసుగా దుమికి పనిజేయుదురు. త్వరితముగా యోచనచేయుటయు, అనాలస్యముగా మంచి విచక్షణగలిగి పనిచేయుటయు నేర్చు కొనవలెను, అన్నిటికంటె ముఖ్యముగా పని స్వార్థరహితమై యుండవలెను. స్వప్ర యోజనము కొఱకెన్నడును ఏపనిని చేయరాదు. చాలమంది కది బహుకష్టము కావచ్చును, అయినను అది అందరును అలవర్చుకొనవలసినశక్తి. పరమగురువునకై జీవించుచున్న మనమా యాదర్శము నాచరణయందు బెట్టుటకు పెక్కు అవకాశము లుండును. స్వప్రయోజనమును గూర్చిన యోచనలన్నిటిని పూర్తిగా త్రోసివేసి, కార్యనిర్వహణమునకేది యుత్తమమో, పరులసహాయార్థమై యేమిచేయగలమో వానినిగూర్చి యెల్లప్పుడును యోచనచేయుచుండవలెను. పనిలో మనమేభాగమును జేసిన బాగుండునా యని తలంచక, మనకేభాగము ప్రాప్తించినను దానిని మనము చేయగలిగినంత చక్కగా చేయ ప్రయత్నించవలెను.

పూర్వము, మునులు, సన్యాసులు జీవించిన విధముగా ఈరోజులలో ఒంట రిగా జీవించెడు మనుష్యులు బహుతక్కువ. మనము సంఘములో అందరితోను కలిసి జీవించుచుండుటచే మనమేమియోచించినను, ఏమిపలికినను, ఏమిచేసినను అది తప్పనిసరిగ అనేకమందికి సంబంధించియుండును. మనయోచనలు, పలుకులు, కార్య

ములు, కేవలము గుణములు కావనియు, అవి గొప్ప శక్తులనియు, మనముపయోగించుటకై మనకియ్యబడినవనియు, వాని నుపయోగించెడు విధమునకు మనము బాధ్యులమనియు మనమెప్పుడును జ్ఞాపకముంచుకొనవలెను. అవన్నియును మానవ సేవకై యుద్దేశింపబడినవి; వానినందుకు విరుద్ధముగా వినియోగించినయెడల మన విధిని నిర్వహించుటలో తప్పిపోయిన వారమగుదుము.

అయిదవ సోపానము :_ సమ్యగ్జీవనోపాయము. ఇది మనలో చాలమందికి సంబంధించియున్నది. మరియేయితరజీవమునకు, ఏవిధముగాను హానికలుగకుండ జీవింపగల యుపాయమే సరియగు జీవనోపాయము. ఇది కసాయివృత్తిని, చేపలుబట్టుట మొదలగు వృత్తులను నిషేధించునని వెంటనే తెలియుచున్నది. కాని, యీశాసనము దానిని మించి చాలదూరముపోవును. మనమే ప్రాణికికూడ హానికలుగజేసి జీవింపరాదు. కనుక సారాయీలనమ్మి జీవించుట సరియైనమార్గము కాదని వెంటనే తెలియగలదు. సారాయీలనమ్మువాడు మనుష్యులను తప్పక చంపకపోవచ్చును, గాని అనేకమందికి నిస్సందేహముగా హానికలుగచేయుచున్నాడని, అట్లు మానవులకు హానికలుగచేయుచుండుటవలననే వాడు జీవించుచున్నాడని చెప్పవలసియున్నది.

సరియైనజీవనోపాయమనుటలో ఇంకను విశేషభావము కలదు. వర్తకవ్యాపారములో దగాచేయువర్తకుని దీసికొనుము. అక్రమముగా వ్యాపారముచేయుచు, జనులను మోసముచేయుచున్నాడుగనుక అతని జీవనోపాయము సరియైనదికాదు. వర్తకుడు న్యాయముగా వ్యవహరించుచు, సరుకులను భారీగా ఖరీదుచేసి చిల్లరగా న్యాయమయిన లాభమునకమ్మినచో సరియైన జీవనమగును. కాని యెప్పుడైతే దగాచేసి చెడ్డసరుకును మంచిదని విక్రయించునో, అప్పుడే తప్పుమార్గమునుబట్టినవాడగును. మంచి వృత్తికూడ తప్పుపద్ధతుల నవలంబించినప్పుడు చెడ్డవృత్తియగును. ఇతరులు మనయెడల నేవిధముగా సంచరింపవలెనని మనము కోరుదుమో, మనమితరులయెడలగూడ అట్లే సంచరింపవలెను. ప్రత్యేకముగా కొన్ని సరుకులలో నొకడు వ్యాపారముచేయుచున్నయెడల, ఆసరుకుల మంచిచెడ్డలు ఆవర్తకునికి తెలియును. సరుకునుకొనువానికి ఆమంచిచెడ్డలు తెలియకపోవుటచే వర్తకుని నమ్మును. డాక్టరును, లాయరును, ఏవిధముగా నమ్ముదుమో ఆవర్తకునికూడ అట్లే నమ్ముదుము. కనుక, డాక్టరు, లాయరువలెనే వర్తకుడుకూడ తనవద్దకు వచ్చువారిని న్యాయబుద్ధితో జూడవలెను. ఎవడైన నిన్ను ఆప్రకారము నమ్మినప్పుడు నీనీతికి, న్యాయబుద్ధికి విడిచి నీశక్తికొలది న్యాయముగా ప్రవర్తించెదవని ఆశించును.

నీబేరములో న్యాయమయిన లాభమును పుచ్చుకొనుటకు నీకు హక్కు కలదు, కాని నీబాధ్యతనుగూడ నీవు గుర్తించవలెను.

ఆరవ మెట్టు:- సమ్యక్ ప్రయత్నము, లేక, సమ్యగ్వ్యవసాయము. ఇది చాల ముఖ్యమైనది. మనమంచి అభావాత్మకముగానున్నంతమాత్రమున, అనగా, చెడుగు చేయుట లేదన్నంతమాత్రమున సంతుష్టిపడరాదు. మనము కొంతమంచి పనిని చేయవలెను గాని, చెడ్డపనిని చేయకపోవుట చాలదు. గౌతమబుద్ధుడు తన సిద్ధాంతము నద్భుతమగు ఒకచిన్న పద్యము రూపమున చెప్పినప్పుడు "చెడుగు చేయరాదు" అని ప్రారంభించి, వెంటనే "మేలుచేయవలయు" అని చెప్పెను. సమర్థత లేకపోవుటచే మంచిగానుండుటవలన లాభములేదు; సద్భావము, సదుద్దేశముగలిగియు, ఏమియు సాధింపలేని వారనేకులు గలరు.

ప్రతిమానవునకు శరీరబలమేగాక, కొంత మానసికబలముకూడ గలదు. మనమొకరోజంతయు నొక కార్యమును చేయవలసియున్నయెడల, దానికొరకై వలయు శక్తిని నిలవచేసికొని యుండవలెననియు, ఆకార్యమును చేయకపూర్వమే యితర కార్యములనుచేసి అలసిపోగూడదనియు మనకందరకు బాగుగా తెలియును. అదే ప్రకారము మనకుగల మానసికశక్తియు, యిచ్ఛాశక్తియు, మితమైయున్నవి; ఆశక్తులతో ఆయంతరువున మనము కొంతపనిమాత్రమే చేయగలము, కనుక ఆశక్తులను వినియోగపరుచుటలో బహుజాగ్రతగా నుండవలెను. ఇతరశక్తులుకూడగలవు. ప్రతిమనిషికి స్నేహితులలోను బంధువులలోను కొంత పలుకుబడికలదు. ఆపలుకుబడి కూడ నొకవిధమగు శక్తియే. ఆశక్తిని యుచితముగా నుపయోగింపవలసిన బాధ్యత మనపైనున్నది. మనచుట్టుప్రక్కల బిడ్డలు, బంధువులు, గుమాస్తాలు, పనివాండ్రు, నౌఖర్లు ఉందురు. వారందరిపై మనకు కొంత ప్రభావము కలదు. మనము పలికెడు మాటలను, చేసెడు చేష్టలను వారనుకరింతురు, గనుక మనము బహు జాగ్రతగా నుండవలెను.

సరియగుకృషియనగా వ్యర్థమగు కార్యములను జేయక ప్రయోజనకరములగు మార్గములలో పనిజరుపుటయని భావము. చేయగల పనులనేకములుండవచ్చును. అందులో కొన్ని తత్క్షణమే తక్కినవానికంటె ముందుగా చేయవలసి యుండును. మన యత్నము ఎక్కడ అత్యంతోపయుక్తముగానుండునో కనిపెట్టుటకు జాగ్రతతో నుండవలెను. అందరును ఒకేపనిని చేయుటమంచిదికాదు; ఆపనినంతను పంచుకొని

యొవరిభాగమునువారు శక్తికొలది చేసినయెడల, మొత్తము కార్యము అసంపూర్తిగా నుండక చక్కగా పూర్తియగును, అప్పుడే వివేకముతో చేసినట్లగును. ఈవిషయములన్నిటిలోను మనము కొంత విచక్షణమును, లోకజ్ఞానమును ఉపయోగింపవలయును.

ఏడవ సోపానము:— సమ్యక్ స్మృతి. దీనికి చాలా అర్థములు కలవు. బుద్ధుడు సరియగు స్మృతియని చెప్పినప్పుడు ఆయనకు పూర్తిగానుండిన పూర్వజన్మ స్మృతియని ఆయన అనుచరులు తరుచుగా అర్థము చెప్పుచుండిరి. బుద్ధుడుచెప్పిన జాతకకథలలో నొకదానిలో ఆయన నొకడు దూషించెను. ఆయన తనశిష్యులవైపు తిరిగి "నేనొకజన్మలో అతని నవమానపరచితినిగనుకనే, ఇతడిప్పుడు నన్ను నిందించు చున్నాడు; నేనతనియందెందుకు కినుకవహించవలెను ?" అని చెప్పెను. మన పూర్వజన్మలలో సంభవించినదంతయు మనకు జ్ఞాపకమున్నయెడల మన ప్రస్తుత జీవితమును శ్రేష్ఠతరముగా నేర్పాటుచేసికొనవచ్చుననుటకు సందేహములేదు, కాని మనకట్టి స్మృతియుండుట శక్యముకాదు. కాని, అందుచేత సమ్యక్ స్మృతి విషయమై ఆయనచెప్పినది మనకువర్తించదని తలచకూడదు.

మొట్టమొదటి ఆత్మ-స్మృతియనిదాని యర్థము; అనగా, ఎల్లప్పుడును మన మెవరమో, మనకార్యమేమో, మనధర్మమేమో, మనపరమగురువు కొరకేమిచేయ వలయునో, జ్ఞప్తిగలిగి యుండవలెనని భావము. మరియు, సరియగు స్మృతియనగా, ఏ విషయములను జ్ఞాపకముంచుకొనవలెనో సరిగా నెంచుకొనుటయని అర్థము. మనకందరకు జీవితములలో సుఖకరమయినవి, విచారకరమైనవి, అనేకసంగతులు సంభవించుచుండును. బుద్ధిమంతుడు చెడ్డవానిని మరచిపోయి, మంచివానినే జ్ఞాపక ముంచుకొనుటకు ప్రయత్నించును. ఎవరైన మనతో నవమానకరముగా మాట్లాడె ననుకొనుము. వివేకములేనివాడు ఆవిషయమును వారములు, నెలలు,సంవత్సరములు జ్ఞాపకముంచుకొని దానివలన బాధపడుచు అందరితోను చెప్పుకొనుచుండును, అది వాని మనస్సులో మెలగుచుండుటయేగాని, దానివలన లాభమేమిగలదు ? అతనికి వ్యాకులము గలిగించుటయు, దుష్టభావ మొకటి మనస్సులో సజీవముగా నిలిచి యుండుటయుతప్ప వేరు లాభమేమియు లేదని స్పష్టముగా తెలియగలదు. అది సమ్యక్ స్మృతి కాకపోవుట నిస్సంశయము. మనకు కలిగిన అవమానమును, కీడును, వెంటనే మరచిపోయి, అపచారముచేసినవానిని మానసికముగా క్షమించి, ఇతరులు

మనకుచేసిన హితమును దలచుకొని ప్రేమతోను కృతజ్ఞతతోను మనహృదయమును నింపుకొనవలెను. మరియు, మనమందరము అనేకతప్పులను జేసియున్నాము. అట్టి తప్పులను తిరిగిచేయకుండ వానిని కొంతవరకు జ్ఞాపకముంచుకొనుటమంచిదే, కాని వానినిగురించి నిత్యము తలపోయుచు మనస్సును విచారముతోను దుఃఖముతోను నింపుకొని బాధపడుట సమ్యక్ స్మృతికాదు. సరియగు స్మృతియను బోధను యస్. యి. జీ. గారు కొన్ని పద్యములలో బహు రమ్యముగా వర్ణించిరి:

1. మఱచెదముగాక మనలను మఱుగజేసి
మనసు విసిగించి, వేధించి మలపువాని
చిరముగానుండి కోరికలురవడించి
వాని సఫలత గాంచని వనటతోడ.

2. మఱచెదముగాక యల్పపు పరిభవాళి
బాధగొల్పెడు గాఢాపరాధములను
నిర్దయాత్ములు గర్వము నిండిచేయు
నిరసనములను మనసుల మఱతుమిపుడె.

3. మఱచెదముగాక సోదరు మఱపులఱలు
వ్యసనశృంఖల దగులుచు మసలుచుంట
చింతవలనను లాభ మొకింత యేని
పరపులేకున్న నతడదిమఱువకున్న.

4. మఱువకుందుము చిరకాల మనన మొప్ప
అందజాలని శుభముల పొందియుంట
లెక్కమీఱిన యుపకృతులక్కజంపు
మధురవాక్కులు నిగ్రహావిధులఋతము.

5. మఱువకుందుము చిరకాలమనన మొప్ప
ప్రేమనొప్పెడు త్యాగము లేమిసీవి
సానుభూతి నొసంగిన సాహచర్య
పరమ పూతజీవితముల పరిమళంబు.

6. మఱువకుందుము చిరకాలమనన జేసి
సౌమ్య, సత్య, ప్రసాదన, సద్గుణములు
ధర్మమొందిన విజయ మధర్మనిహతి
దైవభక్తియు మానవసేవలోన
మనకుపాదేయముగ నుండి మనుచువాని.

కడపటి సోపానము:- సమ్యక్ ధ్యానము, లేక, సరియగు నేకాగ్రత అని చెప్పబడినది. ప్రతిదినము మనశిక్షణలో భాగముగాజేసెడు ధ్యానమును సూచించుటయేగాక, మనము జీవించియున్నంతకాలము పరహితత్వమును, పరోపకార పరాయణతను మదియందుంచుకొని యేకాగ్రతగలిగియుండవలెనని కూడ దీని అభిప్రాయము. నిత్యజీవితములో మనము దినదినముచేయుచుండవలసిన వివిధములగు కార్యములుండుటచేత మనమెల్లప్పుడును ధ్యానముచేయుచు కూర్చుండలేము. చాల వరకాసంగతి సత్యమే. కాని మరియొకవిధముగా జూచినయెడల అది కేవలము సత్యముకాదని తోచును. ఎల్లప్పుడును మనచైత్యమును భూలోకమునుండి తప్పించి ఊర్ధ్వలోకములలో నేకాగ్రతతో నిలుపుకొనుటకు సాధ్యముకాదు. కాని యొకవిధమగు నేకాగ్రజీవితమును గడుపుటసాధ్యము కావచ్చును. సమ్యాగాలోచనమును గురించి చెప్పినప్పుడు విశదపరచిన విధముగా పారమార్థిక విషయవాసనలను దృఢముగా నెల్లప్పుడును మనస్సులలోనుంచుకొన్న యెడల, ఇతరవిషయముల గురించి ఆలోచన చేయనప్పుడు వెంటనే ఆపారమార్థిక విషయములు మనస్సులోముందుకు బహిర్గతమగును. అప్పుడు మనజీవితము మిక్కిలి ఉన్నతములు, ఉదారములునగు పారమార్థిక విషయములపై నిరంతరము ఏకాగ్రతగలిగి నిత్యధ్యానజీవితముకాగలదు. కాని, దైనందిన జీవితములో మనయాలోచనలను ఆచరణలోనుంచవలసిన అగత్యము గలిగినప్పుడు ఆ యేకాగ్రతకు అప్పుడప్పుడు భంగము కలుగుచుండును.

మనస్సు నావిధముగా అలవాటు చేసినయెడల మొదట మనకు కనబడుదానికంటె ఎక్కువగా మనకు లాభముకనిపించును. ఏకజాతివస్తువు లొకదాని నొకటి ఆకర్షించును. ఇరువురు మనుష్యులొకేవిధముగా యోచనచేయుట కలవాటుపడిన యెడల, త్వరలోనే వారొకరి నొకరు ఆకర్షించి సన్నిహితులగుదురు. కనుక ఎల్లప్పుడును ఆధ్యాత్మిక విషయములగూర్చి తలపోయువారందరు అనతికాలములో కలిసికొని యొకసంఘముగాచేరి క్రమముగా ఒక దివ్యజ్ఞానసమాజశాఖగా వృద్ధిబొంద

వచ్చును. అది యెట్లున్నను, వారందరును కలియుదురు, ఒకరిభావము లొకరిపై పనిచేయుచుండును. ఆవిధముగా ప్రతియొకరును తక్కినవారి పురోవృద్ధికి చాల సహాయపడుదురు. మరియు, మనమెచటకుపోయినను అదృశ్యులైన దేవతలచేతను ప్రకృతిభూతములచేతను, స్థూలశరీరములను విసర్జించిన మానవులచేతను ఆవరింపబడియుందుము. సరియగు ఏకాగ్రత గలిగినస్థితి మనకలవడినయెడల ఆయదృశ్యగణములలో నుత్తములనందరను మనమాకర్షింతుము. కనుక, మనమెచటకుపోయినను శుభకరములు, పవిత్రములునగు ప్రభావములు మనల నావరించియుండును.

ఇది యాప్రథమ ఉపన్యాసములో బుద్ధభగవానుడు చేసినప్రబోధము. ఈ బోధపైననే ప్రపంచవ్యాప్తిగల ధర్మరాజ్యమును స్థాపించిరి; ఆధర్మరాజ్యరథచక్రమును అనేక శతాబ్దములక్రిందట ఆషాఢ శుద్ధపౌర్ణమి దినమున ప్రథమసారిగా ఆయన చలనములో బెట్టిరి.

భవిష్యత్తున మరియొకబుద్ధుడు రావలసియున్నప్పుడు, ప్రస్తుతము బోధిసత్త్వులగు మైత్రేయప్రభువు బుద్ధపదవి నొందుటకై కడపటిజన్మనెత్తునప్పుడు, ఆకాలము యొక్క అవసరములనుబట్టి యేరూపము ఆయనదృష్టిలో మిక్కిలి అనుకూలముగా నుండునో ఆరూపమున ఆయనతిరిగి దివ్యధర్మమును ప్రపంచమునకు బోధింతురు. అప్పుడు ఆరవమూలజాతికి బోధిసత్త్వుడగు భారమును వహించుటకై రెండవరేఖలోనికి మారివచ్చిన కూట్‌హూమి మహర్షి ఆయనస్థానమున ఆయున్నత పదవిని అలంకరింతురు.

## పదునైదవ అధ్యాయము

# మూర్తిత్రయముల శక్తి

### లోకప్రభువు

చిరకాలముక్రిందట శుక్రమండలమునుండి వేంచేసిన తేజోమూర్తులలోనొకరగు ఆధ్యాత్మిక ప్రభువు మన ప్రపంచమును పరిపాలనచేయుచున్నారు. భారతీయులు వారిని సనత్కుమారుడందురు. కుమారుడనగా, రాజకుమారుడు, యువరాజు, లేక, పరిపాలకుడు, అని యర్థము. ఆయనకు 'ఏకోపదేష్ట', 'అద్వితీయుడు', 'షోడశవర్షప్రాయముగల నిత్యయౌవనుడు,' అను నామములుగూడ గలవు. ఆయనను లోకప్రభువని మనము చెప్పుదుము. ఆయన పరమేశుడు. వారిహస్తమందు, వారి తేజోమండలములోపలనే వారు పాలించు గోళమంతయు నునికి గలిగియున్నది. ఈప్రపంచముతో సంబంధించినంతవరకు ఆయన ఈశ్వరుని ప్రతినిధియైయుండి, అందలి మానవ పరిణామమునేగాక, దేవతాగణములయొక్కయు, ప్రకృతి భూతములు (Nature Spirits) యొక్కయు, భూమికి సంబంధించిన సమస్తజీవులయొక్కయు పరిణామము నంతనుగూడ నడిపించుచున్నారు. అయితే, ఆయన వేరు, మన భూమండలమును స్థూలశరీరముగా నుపయోగించుకొను భూదేవి వేరు, అని గుర్తించవలెను.

పరిణామ సంకల్పము యావత్తు ఆయన మనస్సులో నున్నది. కాని అది యున్న అంతరువునుగూర్చి మనకేమియు తెలియదు. యావత్ప్రపంచయంత్రమును నడిపించెడు శక్తి ఆయనయే. భూమిమీద మానవజీవితములలో బలము, ధైర్యము, నిశ్చయము, పట్టుదల మొదలగు లక్షణములు ప్రదర్శితమైనప్పుడు, అవన్నియు ఆయన ప్రతిబింబములే. ఆయన చైతన్యము మనగోళముపైనుండెడు యావజ్జీవమును ఒక్కసారిగా గ్రహింపగలంత విస్తారముగ వ్యాపించియున్నది. కల్పాంతములందు లయముజేయగల శక్తులన్నియు ఆయన హస్తముల నున్నవి; ఏలయన, ఉన్నతమగు ఫోహాట్ (Fohat) అను శక్తి (దైవీశక్తి — విష్ణుశక్తి) ఆయనవశమందున్నది. మన భూచక్రమున కావలనున్న విశ్వశక్తులను ప్రత్యక్షముగా ఆయన వినియోగించగలరు. బహుశః వారి కార్యము సాధారణముగ వ్యక్తులతో గాక యావన్మానవజాతితో సంబంధించియుండును. కాని, వారెన్నడైన నొక వ్యక్తిపై తమ ప్రభావమును బరప

దలచినయెడల, జీవాత్మద్వారా గాక తురీయాత్మద్వారా బరపుదురని మాకు తెలిసినది.

పుణ్యమార్గము ననుసరించెడు ప్రతిముముక్షువును వానిజీవితములో నొక సమయమందు లోకప్రభువు దర్శనమునకు గొనిపోవుదురు. ఆసందర్భములో లోక ప్రభువును ప్రత్యక్షముగ సందర్శించినవారు ఆయనను జగన్మోహనాకారముగల యౌవనుడనియు, గొప్ప ఠీవిగలవాడనియు, చెప్పనలవిగాని దయారసమును వెదజల్లు చుండియు సార్వజ్ఞమును, అగ్రాహ్యమగు తేజస్సును, అనివార్యమగు శక్తినిగలిగి ప్రకాశించుచుండుటచే, ఆయన వీక్షణాలను కొందరు సహింపలేక భయముచే తమ ముఖములను కప్పుకొనిరనియు చెప్పుదురు. మన సమాజసంస్థాపకురాలగు మేడమ్బ్లవట్స్కీగారు అట్లు కండ్లుమూసికొనెనని వింటిమి. వారి సందర్శనానుభవము నొకసారిబొందిన మానవుడు దాని నికనెన్నటికి మరువజాలడు. మరియు భూమిమీద పాపము, బాధ ఎంతదారుణముగనున్నను సమస్తవిషయములును ఏదో విధముగ సర్వలోకకళ్యాణార్థమై కలిసి పనిచేయుచున్నవనియు, మానవజాతి దాని పరమావధి వైపునకు నిలుకడగా నడపబడుచున్నదనియు, అత డెన్నటికి సంశయింపడు.

ప్రతిప్రపంచకాలములోను (అనగా, ఒక్కొక్క గ్రహమండలములో ఒకసారి జీవపరిణామము పూర్తియగు కాలములో) ముగ్గురు లోకప్రభువు లొకరివెనుక నొకరు పాలింపవత్తురనియు, ప్రస్తుతలోకప్రభువు మూడవ వారనియు వింటిమి. ఆయన తమ శిష్యులు ముగ్గురుతోను గోబీయెడారిలోని శంబళమను శాద్వల సుక్షేత్రములో నివసించుచున్నారు. మధ్య ఆసియాలోని సముద్రములో అదియొక చిన్న ద్వీపముగానుండిన కాలముయొక్క జ్ఞాపకార్థము దానిని పవిత్ర ద్వీపమనికూడ అనెదరు. మన పరిణామమునకుగాక మరియొక పరిణామమునకు చెందినవారగుటచేత, పరమగురువులలో నుత్తములగు నీ నలుగురును అగ్నివర్ష సంభవులు — (Children of the Fire-Mist) అని పిలుతురు. వారల శరీరములు రూపునకు మానవశరీరముల వలెనే యుండును, గాని, నిర్మాణములో చాలభేదముగా నుండును. అవి సౌకర్యము నిమిత్తమై వారు ధరించిన వసనములుగాని, సామాన్యముగ మన మనుకొను శరీరములుకావు. అవి కృత్రిమశరీరములు గనుక మానవశరీరములోని యణువులవలె వానిలోని యణువులు నిత్యము మార్పుచెందుచుండవు, వాని కాహారమవసరము

లేదు, కనుక, వేలకొలది సంవత్సరములు గడచినను అవి మార్పేమియు లేక ఒకే రీతిగ నుండును.

బుద్ధునియంతరువుతో సమానమగు నంతరువునందుండు ముగ్గురు శిష్యులను ప్రత్యేక (లేక, 'పచ్చేక') బుద్ధులని పిలుతురు - వారు లోకప్రభువునకు ఆయన కార్యములో సహాయపడుచుందురు. మానవజాతి బుధగ్రహగోళములో పరిణామము నొందునప్పుడు వారు ముగ్గురును మనకు లోకప్రభువులు కాబోయెదరు.

ఏడుసంవత్సరముల కొకసారి లోకప్రభువు శంబళద్వీపములో నొక గొప్ప యుత్సవమును జరుపుదురు. అది కొంతవరకు వైశాఖోత్సవమువలె నుండును, గాని అంతకంటె నెక్కువ వైభవముగనుండి మరియొక రకమునకు చెందియుండును. ఆయుత్సవమునకు సిద్ధపురుషులందరును, అంతకంటె తక్కువతరగతులలోని కొందరు దీక్షితులును ఆహ్వానింపబడుదురు. అందుచే ఆసమయమందు వారి మహానాయకుడగు లోకప్రభువును కలిసికొనుట కందరకు అవకాశము కలుగును. ఇతరసమయములయందు ఆయన మహీపీఠముయొక్క అధికారులతో మాత్రమే వ్యవహరించుచుందురు, గాని, ఎప్పుడైన ప్రత్యేకకారణములున్నయెడల నితరులను ఆయన సముఖమునకు రప్పింతురు.

మన ఆధ్యాత్మికప్రభువుయొక్క మహోన్నతపదవి "గుప్తవిద్య" (Socret Doctrine) అను గ్రంథములో వర్ణింపబడినది. ఇకముందు, యుగములు గడచినకొలది యావద్విధానము ఊర్ధ్వముఖముగ పురోవృద్ధిబొందుచున్నను, ఎన్నడో రాబోవుకాలములో ఏ మెట్టునైన చేరుసరికి వాస్తవముగ ప్రాప్తించెడు యోగ్యతలు ప్రస్తుత మున్నదానికంటె నెక్కువ సంపూర్ణముగానున్నను, పరిపాకమునకు తీసికొనిపోవునని మనమిప్పుడు చెప్పుచున్న మహాసోపానములలో పరస్పరస్థానములు సంబంధించినంతవరకు మార్పేమియు నుండదని ఆగ్రంథములో వ్రాయబడినది. మన భూచక్రముయొక్క యేడవ పరివర్తనములోనుండు పరిపూర్ణమానవులు "మన భూచక్రములోను, మన భూమిపైనను అత్యున్నతస్థానమందున్న మహీపీఠముయొక్క మూలాధారమునకు (Root Base of the Hierarchy) కొంచెము క్రిందుగా" నుందురని చెప్పబడినది. కనుక, అనేకయుగముల పరిణామము తరువాత, అనగా, కోట్లాది సంవత్సరములలో, రెండున్నర పరివర్తములలో గలిగెడు వివిధములగు అనుభూతులనొందువారి [illegible]వులు చేరగల స్థానమునకుగూడ కొంతదూర మావలనే

ఇప్పుడు సహితము లోకప్రభువున్నాడని తెలియగలదు. ఈ అద్భుతపురుషుడు మూడవ మూలజాతికాలములో భూమియొక్క పరిణామమును నడిపించుటకై దయ చేసెను. "మానవుడు, ఎచటనుండి, యెట్లు, ఎచటికి" అను గ్రంథములో ప్రపంచ ముయొక్క అభివిమ్యర్త్ప్రభువు రాక యీక్రింది విధముగ వర్ణింపబడినది.

"ఆగొప్ప లేమూరియను పోలార్ నక్షత్రము (ధృవనక్షత్రము) ఇంకను పరి పూర్ణముగనుండెను. ఆబ్రహ్మాండమగు బాలచంద్రాకృతి భూమధ్యరేఖగుండా మడగాస్కరు ద్వీపముపైనగూడ వ్యాపించి యుండెను. ప్రస్తుతము గోబీయెడారిగ నున్న సముద్రముయొక్క తరంగములు ఉత్తర హిమాలయ చరియలయందలి శైల ప్రాకారములపైబడి భగ్నమగుచుండెను. ప్రపంచచరిత్రలో మిక్కిలి విచిత్రమగు ఆ తేజస్పతుల ఆగమనసమయమునకు సర్వము సిద్ధముగనుండెను.

"చంద్రమండలాధిపతులును మూడవజాతి మనువును మానవులలోని మనో బీజమును పురికొల్పుటకును, జీవాత్మ అవరోహణము చేయుటకును దగిన స్థితికి మాన వులను సిద్ధపరచుటకును సాధ్యమయినదంతయు జేసిరి. వెనుకబడియున్న సోమపుల నందరను ముందుకు త్రోసిరి. జంతువర్గమునుండి మానవవర్గములోనికి రాదగినవా రెవ్వరునులేరు. అట్టివారెవ్వరును కానరానప్పుడును, ఒక వ్యూహముయొక్క పరి ణామములో మధ్యను ఒక్కసారి మాత్రమే ప్రసరింపజేయబడెడు అపారమగు చైతన్యప్రబోధనము తిరిగిరానిదే జంతువులు మానవమార్గములోనికి రాజాలనందు నను, జంతువులు మానవవర్గములో బ్రవేశించు ద్వారము మూసివేయబడెను.

ఒక గొప్పజ్యోతిషసంఘటనము సంభవించెను. గ్రహములు అపూర్వమగు కూటముగా చేరెను. భూమియొక్క ఆకర్షణస్థితి ఉండవలసినంత యనుకూలముగ నుండెను. అట్టిసమయమెంచబడెను. అదిజరిగి యిప్పటికి అరువదియైదు లక్షల సంవత్సరములాయెను. వారువచ్చి చేయగలిగినదితప్ప ఇక చేయగలిగినదేమియును లేదు. "అప్పుడు ఊహించుటకయిన శక్యముగాని ఎత్తునుండి, మహారయమున దిగు టలో గలిగెడు ప్రబల గర్జనముతో, శరములవలె చొచ్చుకొని పాఱుచున్న జ్వాలలతో ఖగోళమును నింపుచున్న అగ్నిపుంజములచే నావృతమైన యొకరథము ఆకాశవీధులనుండి అగ్నిపుత్రులగు శుక్రమండల తేజస్పతులతో మెరయుచు నగ పడెను. ఆరథము గోబీసముద్రగర్భమున కలకలలాడుచుండిన శ్వేతద్వీపముపై నెగు రుచు ఆగిపోయె ... ... అనేక రంగులుగల

లెక్కలేని పరిమళపుష్పరాసులతోను శోభిల్లుచుండెను. భూదేవి తనకుగల యుత్తమములు రమ్యతమములునగు వానిని సమర్పించి తన ప్రభువునకు స్వాగతమిచ్చెను. ఆ ప్రభువు షోడశవర్షప్రాయముగల యువకుడు, సనత్కుమారుడు, చెక్కుచెదరని శాశ్వతయౌవనుడు, నూతనధరణీనాధుడు తనరాజ్యమునకువిచ్చేసెను. అధికారక్రమము ననుసరించియున్నను, భూలోకపుగణనకతీతులై క్రియాశక్తిచే నిర్మించుకొన్న దివ్య శరీరములలో వెలుగుచు ముప్పదిమంది దివ్యపురుషులచటనుండిరి. వారే ప్రథమ మహీపీఠము, ఘనమగు నేకైక వటవృక్షశాఖలు, భావిసిద్ధపురుషులు పెరిగెడు ఆశ్రయము, ఆధ్యాత్మిక జీవమునకు కేంద్రము. దేనిచుట్టును మనభూమిపై జీవమెల్లప్పుడును పరిభ్రమించుచుండునో అట్టి అచంచల ధృవతార, భూలోకప్రభువునకు చిహ్నమగు నుజ్జ్వలతార, ఎచట నిరంతరము ప్రకాశించుచుండునో అట్టి అక్షరపుణ్యక్షేత్రమే అప్పుడును ఇప్పుడునుగూడ వారి నివాసము.

'గుప్తవిద్య' అను గ్రంథములో మేడమ్ బ్లవట్స్కీగారిట్లు వర్ణించిరి :

"ఇప్పుడు చెప్పినట్టియు, నామరహితుడై యుండవలసినట్టియు, మహావృక్షమనదగు ఆమహానుభావుని నుండియే ఈ తరువాత యుగములలో చరిత్రకు సుపరిచితులగు కపిలమహర్షి, హెర్మిస్, ఎనాక్, ఆర్ఫియస్, మొదలగు ఋషులు ఆచార్యులు శాఖలువలె ప్రభవించెను. స్థూలమానవునిగా నెంచినయెడల ఆయన నిగూఢమగు పురుషుడు, (ఉపశ్రుతులకెప్పుడు నదృశ్యుడే, కాని యెల్లప్పుడు నుండువాడే). ఆయననుగూర్చి ప్రాచ్యదేశములలో, ముఖ్యముగా పవిత్రయోగ శాస్త్రాభ్యాసకులకును, గుప్తశాస్త్రకోవిదులకును తెలిసినగాధ లనేకములు గలవు. ఆయన ఇతరరూపములను మార్చుచుండియు తనలో మార్పేమియు లేకుండ నెల్లప్పుడొకేరీతిగ నుండువాడు. మరియును, ఆయనయే యీ యావత్ప్రపంచములో దీక్షితులయిన సిద్ధపురుషులందరిపైన ఆధ్యాత్మిక ఆధిపత్యముగలవాడు. అయన అసంఖ్యాకములగు నామములను గలిగియుండియు నామరహితుడు; కాని, ఆయన నామములుగాని, ఆయన స్వభావమైననుగాని యెవ్వరికి తెలియవు. "మహాత్యాగి" యనబడు "ఉపదేష్ట" ఆయనయే. ఏలయన, తమోమండలమును దాటక దానిలోనేయుండి, తేజోమండల ద్వారమువద్ద కూర్చుండి ఆయన తేజోమండలములోనికి చూచుచుండును. మరియును ఆయన ఈజీవ వృత్తము (Life Cycle) యొక్క తుదిదినమువరకు తన స్థానమును విడడు. "ఏకాకియైన ఆ [illegible]వులు చేరగల స్థానమునకుగూడ [illegible]జితపదవియం

దిక్లెందుకుండవలెను ? భూమిమీదగాని, స్వర్గమందుగాని ఆయనయెరుగనిది, నేర్చుకొనవలసినది యేమియు లేకపోయినప్పుడు సనాతనజ్ఞానబుగ్గవద్ద ఆయన, ఏమియు త్యాగికపోయినను, ఏల కూర్చునియుండవలెను ? కారణములేమై యుండగలవు ? స్వగృహమునకు మరలిపోవుచు దిక్కులేక పాదములు పుండ్లుపడి బాధపడుచున్న యాత్రికులు ఐహికజీవిత మనబడెడు మాయా ప్రకృతులతోగూడిన అనంతమగు నెడారిలో తుదిక్షణమువరకు దారి తప్పిపోరను నిశ్చయము లేదుగనుకనే. మరియు, ఆయన యేదేశమునుండి స్వచ్ఛందప్రవాసియై వచ్చెనో, పరిపూర్ణమగు స్వేచ్ఛ, వెలుగు యెచటగలవో ఆదేశమునకు శరీరబంధములనుండియు మాయాబంధముల నుండియు విముక్తుడై విజయుడైన ప్రకృతిబంధితునకు మార్గమును జూపించుటలో వారానందము బొందెదరుగనుకనే. సంగ్రహముగ చెప్పిన, ఆయనచేసిన మహాత్యాగమువలన లబ్ధిబొందువారు బహుకొద్దిమంది శిష్యులు మాత్రమే యైనను, యావన్మానవజాతికొరకు ఆయన సంపూర్ణముగ ఆత్మత్యాగము జేసికొనిరిగనుకనే.

"మానవచైతన్యము మేల్కొన్న దాదిగా ఆచార్యులు, ప్రవక్తలు, బోధకులు నైన తక్కువతరగతి దివ్యపురుషులందరును ఈ మహాగురువుయొక్క పై కగపడని ప్రత్యక్ష దర్శకత్వముక్రిందనే ఆరంభములో మానవజాతికి మార్గదర్శకులయిరి. ఈ యీశ్వర పుత్రులవద్దనే మానవజాతి శైశవములో సమస్త కళలలోను, శాస్త్రముల లోను, ఆధ్యాత్మిక విద్యలోను మొదటిపాఠములు నేర్చుకొనెను. ఇప్పటితరమునకు చెందిన పరిశోధకులను పండితులను కలవరపెట్టుచున్న పురాతన నాగరికతలకు శంకుస్థాపనచేసి మొదటిపునాదిరాతిని వేసినది వీరే.

## ఉత్తమ దీక్షలు

మన గోళమునందలి మహీపీఠములో ప్రథమరేఖమీదనుమాత్రమే మానవుని కత్యున్నతమగు పురోవృద్ధి సాధ్యమగును. ఆరేఖయందు 'మనువుదీక్ష' తరువాత మరిరెండు దీక్షలు గలవు. మనువుపైనున్న "పచ్చేక" లేక ప్రత్యేకబుద్ధులను సరిగా తెలిసికొనలేక, కొందరు గ్రంథకర్తలు వి-ని తన్నగు దురభి[illegible]

వారికి తెలిసిన జ్ఞానమౌనితరులకు బో[illegible]

వానినివర్ణించిరి.

రేఖకు సంబ

పోవుకాలము వచ్చుననుటకూడ సత్యమే. కాని, యితరస్థలములయందు వారి మహాత్కార్యమును కొనసాగించుటకే యీ ప్రపంచమును వీడెదరు.

దానిపై దీక్ష ఎవరికివారే తీసికొనవలసినదిగాని, ఒకరిచ్చునది కాదు. ఈ సోపానము సిద్ధపురుషుని లోకప్రభుత్వపదవికి తీసికొనిపోవును. ఈపదవియందు మొదట కొద్దికాలము ఒక ప్రపంచమునకు మొదటిప్రభువుగనో, రెండవప్రభువుగనో యుండి, తరువాత మరియొక ప్రపంచమునకు దీర్ఘకాలము మూడవప్రభువుగానుండు బాధ్యతను వహింతురు.

మూడవప్రభువుయొక్క కార్యము ప్రథమ, ద్వితీయ ప్రభువుల పనికంటె చాలా గొప్పది. మూడవప్రభువు తనకాలములో జరుగవలసిన పరిణామములను తృప్తికరముగ సమాప్తిజేసి, ఆపరిణామమునొందుచున్న లెక్కలేని కోట్లాదిజీవులను బీజ-మనువున కొప్పగించవలసియుండును. గ్రహాంతర నిర్మాణకాలమందు బీజమనువు ఆజీవులన్నిటికి బాధ్యులైయుండి, తరువాతవచ్చెడు గోళముయొక్క మూలమనువునకు తిరిగి ఆజీవులన్నిటిని యొప్పగించవలసి యుండును. మూడవలోకప్రభువు తనకార్యమును నిర్వహించినవాడై మన ప్రపంచమునకు, మహీపీఠమునకు కేవల మావలనున్న మరియొకదీక్షను దీసికొని "మౌనియగుసాక్షి" (Silent Watcher) * పదవిని బొందెదరు. ఆ పదవియందుండి పూర్తిగ నొకపరివర్తమునకు పట్టెడు కాలమంతయు కావలియుండి కనిపెట్టి చూచుచుండును. జీవతరంగము మరియొకసారి మన గోళమున ప్రవేశించి దానిని తిరిగి విడుచుటకు సిద్ధముగనున్నప్పుడు ఆయన తన విచిత్రమగు స్వచ్ఛందసేవను చాలించి ఆపనిని తనతరువాతవచ్చెడు అధికారి కొప్పగించును.

## సర్వులకు పరమావధి

ఈ మహోన్నత పదముల యద్భుతవైభవము మనకతీతమై యున్నను, వాని వైపు మనమనస్సులను త్రిప్పి వానిని కొంతవరకు గ్రహించుటకు ప్రయత్నించుట యుక్తము. అట్లుచేసినచో, మనలో ప్రతివారును ఎదుటనున్న పరమావధిని చూడ [illegible]లో మ[illegible]ందరము [illegible] ఆదర్శమును నెరవేర్చి, శరమువలె [illegible]రమావధి[illegible] ఎంత స్పష్టముగా జూడ [illegible]దుదుము.

ఈ మహాయాత్రలో ప్రతిమానవుడు ఎప్పుడో ఒకరోజున మనలోకముల లోని అత్యున్నత లోకములో సంపూర్ణ చైతన్యమును బొందుటయేగాక ఈప్రాకృత విశ్వలోకముయొక్క అన్ని అంతరములయందు ఏకకాలమున ప్రజ్ఞను గలిగియుండును. అందువలన, తనలో నుత్తమలోకముయొక్క శక్తినిగలిగియుండియు, అతి స్థూలమగు లోకములోగూడ సార్థకముగ పనిచేయగలుగుటకును, అవసరముగల వారికి సహాయముచేయుటకును సమర్థుడగును. మనలో ప్రతివానికి ఆసర్వశక్తిత్వము సర్వవ్యాపకత్వము, నిశ్చయముగ ప్రాప్తించును. ఈ యైహిక నీచజీవనమువలన మనకై సంపాదింపదగిన నెట్టిదానికొరకైనను ఆజీవనము జీవించుటవ్యర్థమేయైనను,అది మనముందున్న వాస్తవజీవితమున కవసరమగు నొక సోపానమై యుండుటచే నిస్సంశయముగ సంతోషముతో గహింపదగినదై యున్నది. "కన్ను చూచి యుండలేదు, చెవి వినియుండలేదు; తననుప్రేమించిన మానవులకొరకై ఈశ్వరుడు సృష్టించిన వస్తువుల నూహించుటకైనను మానవహృదయము తలపెట్టియుండలేదు;" ఏలయన ఈశ్వరునిప్రేమ, ఈశ్వరునిజ్ఞానము, ఈశ్వరునిశక్తి, ఈశ్వరుని దివ్యవైభవము ఆయన శాంతివలెనే అవాఙ్మనసగోచరములు.

శాంతిః శాంతిః శాంతిః

— • -

# తప్పొప్పుల పట్టీ

| పేజీ | | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 23 | — | 26 | గృ్మహాముల | గృహాముల |
| 41 | — | 21 | అను | అనను |
| 44 | — | 17 | నవలం | అవలం |
| 45 | — | 16 | చేరగా | చేర |
| 51 | — | 6 | Thoms | Thomas |
| 98 | — | 13 | మకుటమువకు | మకుటమునకు |
| 124 | = | 28 | శ — | శక్తి |
| 126 | — | 1 | శ — | శక్తి |
| 155 | — | 20 | సుపకారము | నుపకారము |
| 168 | — | 2 | బ్దముల | శబ్దముల |
| 177 | — | 26 | లోన | లోనే |
| 197 | — | 9 | జరిగింత | జరిగినంత |
| 210 | — | 8 | . | , |
| 220 | — | 20 | రెండన | రెండవ |
| 221 | — | 17 | మానవుడే | మానవుడీ |
| 222 | — | 2 | జీవము శక్తి | జీవము, శక్తి |
| 224 | — | 20 | చున్న ట్టి యు; | చున్నట్టియు, |
| 231 | — | 8 | యధ | యంధ |
| 236 | — | 17 | కృషిలో | కృషితో |
| 245 | — | 27 | ననుస... | ననుసరింపుము. |
| 245 | — | 27 | ఈశ — | ఈశక్తి |
| 263 | — | 25 | 'నేను' కు ముందున్న " తీసివేసి 'నీవు' కు ముందుగా పెట్టుకొనవలెను. | |
| 20 | | 16 | . | వధియున్నై |
| | | | | ...స్కరించినందున |